# మంచికథ

సంకలనకర్త

చీకోలు సుందరయ్య



రంజని

తెలుగు సాహితీ సమితి

ఏ.జి. ఆఫీసు

హైదరాబాదు - 500 004

MANCHI KATHA
A collection of 41 Short Stories

(Best stories of 34 writers & 7 Ranjani-Nandivada Bhima Rao Award Winning Stories from 1989 to 1993)

First Edition : November '94

Editor
CHEEKOLU SUNDARAIAH

Cover Design
SIVA PRASAD

Publication
RANJANI,
Telugu Sahithi Samithi
O/o the Accountants General
Hyderabad - 500 004

Price : **Rs. 50**
Library Edition : **Rs. 75/-**

For copies :
Visalandhra Book House
4-435, Vigyan Bhavan, Bank Street,
Hyderabad & All Branches

Navodaya Book House,
Opp. Aryasamaj, Kachiguda,
Hyderabad - 27

---

Printed at Planographers, Abids, Hyderabad - 1 Ph : 203390

చుట్టూరా ఆవరించిన చీకటిని నిందించటం కంటే,

దీపం చిన్నదైనా సరే వెలిగించాలన్న తపనే

ఈ సంస్థ....

ఈ కథలు....

# కథాక్రమం

## రంజని – నందివాడ భీమారావు అవార్డు పొందిన కథలు

# రంజని గురించి.....

ప్లవ (1961) ఉగాది శుభ సందర్భంలో 'చుట్టూరా ఆవరించిన చీకటిని నిందించటం కంటే దీపం చిన్నదైనా సరే – వెలిగించమనే' ఆర్యోక్తి ప్రధానాశయంగా ఒక సాహితీ సమితిని ఏర్పాటు చేయాలని ఏ.జి. ఆఫీసు ఉద్యోగులైన కొందరికి కలగడం, అయిదు మాసాలకి అంటే 22.9.1961వ తేదీన రచయితల సభ ఏర్పాటు కావడం "రంజని" ఆవిర్భావానికి బీజాలు నాటినట్లయింది. ఇసుకపల్లి దక్షిణామూర్తి సమావేశకర్తగా పదకొండుమంది సభ్యుల సంఘం ఏర్పడింది. రంజని పత్రికా ప్రచురణ, సాహితీ కార్యక్రమాల నిర్వహణ అమలుపరిచే యోచన కార్యరూపం దాల్చింది.

1962 సంక్రాంతితో ప్రారంభమైన పత్రికా ప్రచురణ ముప్పై రెండు సంవత్సరాలుగా కొనసాగుతూ వస్తోంది. రంజని మొదటి అధ్యక్షులు ఇసుకపల్లి దక్షిణామూర్తి, కార్యదర్శి చాడ గోపాలకృష్ణ నుంచి ముప్పయ్ మూడో సంవత్సరపు అధ్యక్షుడు చీకోలు సుందరయ్య, కార్యదర్శి భమిడి వెంకటేశ్వర్లు వరకు ఇరవై రెండు కార్యవర్గాలు రంజని నిర్వహణా బాధ్యతను చేపట్టాయి.

22.5.1969 నుంచీ రంజని గ్రంథాలయం ప్రారంభమైంది. ఇప్పుడు సూచీ విభాగంలో వెయ్యికి పైగా అరుదైన గ్రంథాలు, మిగిలిన విభాగాలలో ఆరువేలకు పైగా పుస్తకాలున్నాయి.

ప్లవ నుంచి భావనామ సంవత్సరం వరకు ముప్పయిమూడు సంవత్సరాల రంజని చరిత్రలో సాహితీవేత్తలు, కవులు, విమర్శకులు, కథా రచయితలు, ఉపన్యాసకులు, కులపతులు, నాటక ప్రయోక్తలు, సంగీత విశారదులు, కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీ బహుమతి, జ్ఞానపీఠ అవార్డు గ్రహీతలు, సినిమా రచయితలు, కళాకారులు, కార్టూనిస్టులు, నవలా రచయితలు, రచయిత్రులు, దర్శకులు, నాట్యకళాద్రష్టలు, ఆంధ్రేతర భాషా పండితులు ఎందరో రంజని వేదిక నలంకరించి సాహితీ భారతి సమగ్ర స్వరూపాన్ని సాక్షాత్కరింపజేశారు. సాహితీసభలు, చర్చలు, గోష్ఠులు, కావ్యగానాలు, ఉపన్యాసాలు వివిధ సాహితీ ప్రక్రియల్లో పోటీలు, క్విజ్‌లు, సాహితీ శిబిరాలు.... ఇలా రంజని అన్ని ప్రక్రియల్లోను కార్యాలయ స్థాయి, జంటనగరాల స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి వరకు వీటిని నిర్వహించింది.

**రంజని – కుందుర్తి అవార్డులు (కవితలకు)**

1984 నుంచీ ప్రతిఏటా అక్టోబర్‌లో రంజని-కుందుర్తి అవార్డుల ప్రదానం జరుగుతోంది. జాతీయస్థాయిలో నిర్వహిస్తోన్న ఈ పోటీలకు 1994 సంవత్సరానికి అత్యుత్తమ కవితకు 516 రూ॥లు, ఉత్తమ కవితకు 375 రూ॥లు పది మంచి కవితలకు యోగ్యతా పత్రాలు ప్రకటించడం జరిగింది.

1984లో గుంటూరు శేషేంద్రశర్మ, 85లో గజ్జెల మల్లారెడ్డి, 86లో కె. శివారెడ్డి, 87లో సి. నారాయణరెడ్డి, 88లో ఆరుద్ర, 89లో చేకూరి రామారావు, 90లో నగ్నముని,

91లో నాయని కృష్ణకుమారి, 92లో చేకూరి రామారావు, 93లో కాళోజీ నారాయణరావు ఈ అవార్డుల్ని అందజేశారు. ఇంతవరకూ కల్లూరి భాస్కర్, గుంటూరు ఏసుపాదం, నాళేశ్వరం శంకరం, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, ఆశారాజు, జి.వి.ఆర్. చంద్రమౌళి, సిద్ధార్థ, పి. విద్యాసాగర్, మద్దూరి నగేష్‌బాబు, అడిగోపుల వెంకటరత్నమ్ అత్యుత్తమ అవార్డులు పొందారు.

## రంజని – నందివాడ భీమారావు అవార్డులు (కథలకు)

రంజని – కుందుర్తి అవార్డులు బాగా పాపులర్ అయిన తర్వాత కథలకు కూడా ఒక పోటీ నిర్వహించాలని 1989లో అప్పటి రంజని అధ్యక్షుడు చీకోలు సుందరయ్య సంకల్పించడం, ఆ ఆలోచన అజంతా కుమారుడి పెళ్ళిలో నందివాడ భీమారావుతో ప్రస్తావించడంతో అవార్డులకు ఒక రూపం వచ్చింది.

1989లో నందివాడ భీమారావు పదవీ విరమణ చేయడంతో ఆ సందర్భంగా మొదటిసారిగా కథల పోటీలు జరిగాయి. శీలా వీర్రాజు, కె.కె. మీనన్, డి. వెంకట్రామయ్య న్యాయనిర్ణేతలు. ఎ.ఎన్. జగన్నాథశర్మ కథ 'పేగుకాలిన వాసన' బహుమతి పొందింది. మధురాంతకం రాజారాం అవార్డు ప్రదానం చేశారు. ద్వితీయస్థానం పొందిన 'ఎండుచేపలు' కథా రచయిత కాట్రగడ్డ దయానంద్‌ని సత్కరించారు. 1990లో గిడుగు రాజేశ్వరరావు, కె.కె. మీనన్, వారాల కృష్ణమూర్తి న్యాయనిర్ణేతలు. బండి నారాయణస్వామి కథ 'అవశేషం', పి. చంద్రశేఖర్ అజాద్ కథ 'ఎన్నిక' అవార్డు సొమ్మును పంచుకొన్నాయి. 1991లో శీలా వీర్రాజు ఒక్కరే న్యాయనిర్ణేత. కె. వరలక్ష్మి కథ 'గాజుపళ్ళెం' అవార్డుకి ఎంపికైంది. 1992లోనూ 1993లోనూ శీలా వీర్రాజు, డి. వెంకట్రామయ్య, కేతు విశ్వనాథరెడ్డి న్యాయనిర్ణేతలు. 92లో కాట్రగడ్డ దయానంద్ కథ 'గూడు' అవార్డుకి ఎంపికైంది. '93లో కె. వరలక్ష్మి కథ 'పిండిబొమ్మలు', ఎ.ఎన్. జగన్నాథశర్మ కథ 'వాన వెలిసింది' అవార్డు సొమ్ము పంచుకున్నాయి.

రంజని ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఉదయం వంటి పత్రికలతో కలిసి సంయుక్తంగా అనేక పోటీలను నిర్వహించింది.

## రంజని ప్రచురణలు :

రంజని ఆంధ్రభారతికి సమర్పించిన అక్షర కుసుమాలు ఎప్పటికీ పరిమళాల్ని వెదజల్లుతూనే ఉంటాయి. వాటిలో మేలైనవిగా అందరి ప్రశంసలూ పొందినవి :

1) పానుగంటి లక్ష్మీ నరసింహారావుపై ప్రత్యేక సంచిక
2) చలం, కొడవటిగంటి కుటుంబరావులపై ప్రత్యేక సంచిక
3) కథారంజని (ప్రముఖుల కథల సంపుటి)
4) కథాయజ్ఞం (కాళీపట్నం రామారావుగారి 'యజ్ఞం' కథపై హెచ్.బి.టి.వారి సహాయంతో ప్రచురించిన వ్యాసాల సంపుటి)
5) రంజని – శ్రీశ్రీ ప్రత్యేక సంచిక (శ్రీశ్రీపై సమగ్ర సంకలనం)
6) గొంతులు చిగిర్చాయి (1984 నుంచీ 1988 వరకు రంజని–కుందుర్తి అవార్డులు పొందిన కవితా సంకలనం–రజతోత్సవ కానుక)

7) రజత రంజని (గత పందేళ్ళ తెలుగు సాహిత్యాన్ని సమగ్రంగా సమీక్షిస్తూ నలభై మంది రచయితలు రాసిన విశిష్ట వ్యాస సంకలనం - రజతోత్సవ కానుక)
8) తోరణం (నందివాడ భీమారావు రచనలు)

త్రి దశాబ్ది వేడుకల సందర్భంగా :

1) విశ్వకవిత (తెలుగు, 19 భారతీయ భాషలు, 40 ప్రపంచ భాషలలోనూ ప్రముఖ కవుల కవితా సంకలనం)
2) ముప్పయ్ కవితలు (1989, 90లలో రంజని-కుందుర్తి అవార్డులు పొందినవీ, ప్రశంసలందుకున్నవీ ముప్పయ్ కవితలతో కవితా సంపుటి)
3) రంజనీ స్వరాలు (ఆధునిక తెలుగు యువకవుల్లో ప్రస్ఫుటంగా వినిపిస్తున్న తొమ్మిది మంది యువకవుల స్వర కవితా ధ్వని సంకలనం (ఆడియో కేసెట్)

33 సంవత్సరాల వేడుకల సందర్భంగా :

1) మంచికథ : 41 కథల విశిష్ట సంపుటి
2) గమనం: 1991, 92, 93 సంవత్సరాలలో రంజని-కుందుర్తి అవార్డులు పొందిన కవితా సంపుటి.

రంజని కుటుంబీకులు :

తెలుగు కథా వైభవానికీ, నవలా వికాసానికీ, కవితాభ్యుదయానికీ, పత్రికా రచనకీ, సాంస్కృతిక కళారంగాలకూ తమ రచనలతో, సేవలతో తోడ్పడుతున్న అనేకమంది రంజని కుటుంబీకులే. ఇసుకపల్లి దక్షిణామూర్తి, మల్లాది వెంకట కృష్ణమూర్తి, పరుచూరి వెంకటేశ్వరరావు, డి. ప్రభాకర్, పాలకోడేటి సత్యనారాయణరావు, బి. ఉమామహేశ్వరరావు (సహవాసి), కె.కె. మీనన్, వారాల కృష్ణమూర్తి, ఎమ్మెస్సార్ మూర్తి, సువర్చలా దేవి, పమ్మి వీరభద్రరావు, శంకరమంచి పార్థసారధి, మహంకాళి వెంకటరావు, టి.కె.ఎల్.ఎన్. ఆచార్య, కాళహస్తి రామకృష్ణ, చిలమకూరి రామబ్రహ్మం, గిడుగు రాజేశ్వరరావు, ఆశారాజు, పి. నాగభూషణం, జి.వి. సుబ్బారావు, ఎ. శ్రీదేవి, భమిడి వెంకటేశ్వర్లు, చీకోలు సుందరయ్య, వి. సుమతి, జాస్తి రమాదేవి, రమణముని శ్రీనివాస్, మునిపల్లె లక్ష్మిరమణ కుమారి.... వీరంతా రంజని కుటుంబీకులే. రంజని వికాసానికి తోడ్పడిన ప్రముఖులు శ్రీయుతులు యు.ఎన్. అనంతన్, ఎ. సత్యవర్ధన, ఎ. రఘునాథరావు, సి.హెచ్. భాస్కరరావు, నందివాడ భీమారావు, డి. వేదకుమారి, సుంకర బలరామకృష్ణ, ఎల్.వి. సుధీర్‌కుమార్, గరిమెళ్ళ రామమూర్తి, చెరుకూరి విఠల్‌కుమార్, జె.పి. అప్పారావు, జి. శ్రీకృష్ణ ఇంకా అనేకమంది రంజని కుటుంబీకులే.

రంజని ఆవిర్భావం నుంచి నేటివరకు సాంస్కృతిక వ్యవహారాల శాఖ, ఆంధ్రదేశంలోని పలు సాహితీ సాంస్కృతిక సంస్థలు, తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థలతో సత్సంబంధాలు కలిగి వుంది.

# సంపద్వంతమైన తెలుగు కథ

కథలకు మంచికాలమిది. ఇప్పుడు కథ ఈ మట్టిలోనే పుట్టి బలంగా వేళ్ళూను కుంటోంది. ఇక్కడి వాతావరణంతో కలిసి పరిమళిస్తోంది. ఆవేదనల్నీ, సంక్షుభిత జీవన సమస్యల్నీ, విచ్ఛిన్నమవుతోన్న విలువల్నీ ఆవిష్కరిస్తోంది. మాండలికంతో కలిసి మట్టివాసన, మనిషివాసన వేస్తూ మరీ సన్నిహితమవుతోంది. సంపద్వంతమవుతోంది. కథ నేటి జీవితానికి దర్పణంగా నిలుస్తోంది. ఇది అభిలషణీయ పరిణామం కాదని ఎవరనగలరు?

'విశ్వకవిత' వంటి అరవై భాషల ప్రపంచ కవుల అంతర్మథనని తెలుగు అనువాదంలో అందించిన 'రంజని' తనదైన రీతిలో చేపట్టిన మరో ప్రణాళిక 'మంచికథ.'

విశాలాంధ్ర ప్రచురించిన 'నూటపదహార్లు' కథా సంకలనం తెలుగు కథకు ఎత్తిన మణిహారం. ఆ తర్వాత ఎన్నెన్నో కథా సంకలనాలు తెలుగు సృజనాత్మక సాహిత్యంలో నిలిచిపోయాయి. 'శ్వేతరాత్రుల్లో' చంద్రికలు కురిపిస్తున్నాయి. 'కథాసాహితి', 'కథావేదిక', 'కథా స్రవంతి' వంటి సంస్థలు మంచికథలను అందిస్తూ తెలుగుకథకు ప్రాచుర్యం కలిగిస్తున్నాయి.

కథాసాహిత్యానికి 'రంజని' తన వంతు కృషి చేస్తూనే ఉంది. రంజని ప్రచురించిన ఇరవై వార్షిక సంచికల్లో, ఎనిమిది మాసపత్రికల్లో కథలకే అగ్రస్థానం. కాళీపట్నం రామారావు మేష్టారు 'యజ్ఞం' కథపై నభూతో నభవిష్యతిలా చర్చావ్యాసాలను ఆహ్వానించి హైదరాబాదు బుక్‌ట్రస్టు ఆధ్వర్యంలో ప్రచురించిన సంగతి విజ్ఞులైన పాఠకులకు తెలిసిందే. 'కథా రంజని' పేరుతో కథల సంకలనాన్ని ప్రచురించింది. పత్రికలతో సంయుక్తంగా కథల పోటీలు నిర్వహించింది. ఇక గోష్ఠులు, చర్చలు, సభలు సరేసరి. రంజని-నందివాడ భీమారావు అవార్డును స్థాపించి 1989 నుంచీ ఏటా 1,116 రూ॥ల బహుమతి ప్రకటిస్తూ కథా వ్యాప్తికి దోహదపడుతూనే ఉంది.

కథలు రాస్తున్నవారు వందల్లో ఉన్నారు. అవార్డులు, రివార్డులు పొందినవారు పదుల్లో ఉన్నారు. అయితే బయటి రచయితలు 22 మంది రచనలూ, రంజని కుటుంబీకులు పన్నెండుమంది రచనలూ, రంజని-నందివాడ భీమారావు అవార్డు పొందిన ఏడుకథలూ కలిపి మొత్తం 41 కథలతో 'మంచికథ'ను ప్రచురించింది. ఇవే మంచికథలనీ మిగిలినవి కావనీ రంజని ఉద్దేశం కాదు. మంచికథల్లో నిస్సందేహంగా ఇవి కొన్ని అని మాత్రమే నమ్ముతున్నాం. సీనియర్ల సలహాలను గౌరవిస్తూ, వివిధ ధోరణులకు ప్రాతినిధ్యం కల్పిస్తూ ప్రచురించిన ఈ కథల సంపుటిని వినమ్రంగా మీ చేతుల్లో ఉంచుతున్నాం. డెబ్భయిలు మొదలుకొని తొంభైల వరకు దాదాపు పాతికేళ్ళలో వచ్చిన కథలు ఇందులో చోటు చేసుకొన్నాయి. ఒక్కొక్క కథ ఒక్కొక్క జీవిత పార్శ్వాన్ని తెలుపుతోంది.

'చిలుకా ఎటు వెళ్ళావు?' భూస్వామ్యవ్యవస్థ తీరునూ, పెళ్ళికాని పెద్దింటి స్త్రీ మనోవేదనను తెలుపుతుంది. 'చీమలు' ఒకరిని మరొకరు ఎలా దోచుకుంటారో వివరిస్తుంది. 'అంతర్వాహిని' మానవసంబంధాలపట్ల అంతర్మథనం. పల్లెటూళ్ళల్లో ఉన్న భూ సంబంధాలకు, పేదరికానికి నిదర్శనం 'మంచివాడు,' 'కుక్క' కథలు. న్యాయవాదుల

మనస్తత్వ విశ్లేషణ 'సాక్షి', 'ఆలాపన' తల్లి ప్రేమాలాపన. మరో తల్లి పాలు తాగిన మమకారం 'జీవధాతువు'. చెడపకురా చెడేవు 'అవతలి ఒడ్డు'. స్త్రీవాద స్పృహతో సాగేది 'యాష్‌ట్రే.' నాలుగు పడగల హైందవ నాగరాజు నీటిని మిగిల్చని వైనం 'కన్నీళ్ళు'. జీవితానుభవాలతో లోకం తీరును గుర్తెరిగిన మిత్రుడికి దూరమైన 'నా పాత స్నేహితుడు.' మత ఘర్షణలకు బలైనది 'మసీదు పావురం'. బతుకు చౌరస్తాలో నిలిచి అంగలారుస్తోన్న జీవితాలు 'నాలుగుకాళ్ళ మండపం'. రైతుకూలీల సమగ్రజీవిత చిత్రణ 'పాలపాదుగు'. పసిపిల్లల మనస్తత్వం 'అమ్మా బళ్ళోకి వెళ్ళనే', పాట ద్వారా వర్గస్పృహ 'చూపున్నపాట'. జీవితాన్ని నిస్సారం చేసే సారా వ్యామోహం 'మృత్యుమైదానం', అమ్మాయి పెళ్ళా, అమ్మాయి మనస్తత్వమా! ఏది భారమో 'గుండెల మీద కుంపటి', అత్యాచారాలకు గురైన వారిపట్ల సమాజవైఖరి ఎలా ఉండాలో తెలిపే 'సుశీల', రెండు జీవితాల మధ్య వైరుధ్యం 'జీవన వైరుధ్యాలు', తోటి మనిషి ఆధారం ఎంత అవసరమో తెలిపే 'అస్మదీయుడు', విశ్వ విద్యాలయాల్లో రిసెర్చి స్కాలర్ల తంటాలు 'శంకరం అనే ఆర్.ఎస్. కథ', పల్లెల్లో మధ్య తరగతి రైతుల జీవితాలు భగ్నమై 'బేసిన్ బ్రిడ్జి' దగ్గర మురికి కూపాల్లో ఒదిగిపోవడం. ఒకరు మరణిస్తే వేలాదిమంది వారి వెంట వుంటారని తెలిపే 'మౌనరాగం', సొంత ఇల్లయినా దక్కని 'స్వగృహమే కదా', సమాజంలో విలువలు హరించుకుపోయిన వైనం తెలిపే 'కిష్కింధనీతి', వ్యాధికి గురైన కళాకారుడి దుర్భర జీవితం 'నీటిలో నాన్ననీడ', తెలిసీ తెలీని వయసులో రేగే ప్రేమ ఎంత మధురమో 'ఎంతెంత దూరం', ఆత్మహత్య చేసుకొనేలా తండ్రిని ప్రేరేపించిన కొడుకు నిరుద్యోగ సమస్యగా కనిపించినా భార్యాభర్తల అనురాగానికి నిదర్శనం 'అనంతం', వృద్ధ తల్లిదండ్రుల వ్యధ 'గుండె తడిసిపోయింది', ఒకచోట ఉన్నా నలుగురి మనస్తత్వాలు నాలుగు విధాలుగా సాగుతూ 'చినుకుల్లో చిరుమంటలు' వెలిగించడం. ఆర్టీసీ నిర్వాకం 'సర్కారోళ్ల బండి', పోలీసు ఠాణాల స్థితి 'చికిత్స', అమ్మ నాన్న అనుభూతులతో తడిపే 'పేగుకాలిన వాసన', మారుతోన్న కులవ్యవస్థ స్వరూపం 'అవశేషం', రచయితల కుండాల్సిన దృక్పథం 'ఎన్నిక', వ్యామోహానికి గురైన మహిళ బలైపోయిన వైనం 'గాజుపళ్ళెం', ఉమ్మడి కుటుంబాలెలా విచ్ఛిన్నమవుతాయో, నేటి వ్యవస్థలో వాటి స్థానం వివరించే 'గూడు', భోగం మహిళల జీవితాల గురించి 'పెండిబొమ్మలు', లొంగిపోయే కార్యకర్త విద్యుక్త ధర్మాన్ని గుర్తుచేసే 'వాన వెలిసింది'. ఈ కథలన్నీ జీవితంలోని వివిధ పార్శ్వాలను స్పృశించాయని స్పష్టంగా చెప్పగలుగుతున్నాం.

జీవితంపట్ల, సమాజంపట్ల ప్రేమ కలిగించడంలో, సమస్యలను ఆవిష్కరించడంలో ఈ కథకులు కృతకృత్యులైనారని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. అనుభవాల వివరణ, సామాజికాభ్యుదయం గురించి తపన, సైద్ధాంతిక నిబద్ధత, కళాసూత్ర విధేయత, విచ్ఛిన్నమవుతోన్న సమాజం పట్ల ఆర్తి, ఆదర్శ సమాజం కోసం ఆరాటం వంటి ఎన్నో అంశాలు ఈ కథల్లో కనిపిస్తున్నాయి. దాదాపు పాతికేళ్ళలో వచ్చిన ఈ కథలు తెలుగు కథకి ఉజ్వల భవిష్యత్తుందనే కాదు అంతర్జాతీయ స్థాయిని తెలుగుకథ అందుకుంటుందనే నమ్మకాన్ని కలిగిస్తున్నాయి.

చీకోలు సుందరయ్య

# చిలుకా నువ్వేటు వెళ్లావు?

## అల్లం రాజయ్య

సమయం సాయంత్రం . . . . సూర్యుడు పడమట తాటిచెట్ల కొనల్లో మండు --తూ ఆకాశం మీది మబ్బు తునకల్ని ఎర్రగా మెరిపిస్తున్నాడు . . . ఆ మబ్బు తునకలు బ్లూ--నైలాక్సు చీరమీది బిహిష్టు మరకల్లా ఉన్నాయనుకొంది ఆమె. . . . (ఛీ అనుకొంది . . . ఛీ. . . . . ఛీ. . . అనుకొంది ... అలాగే ముఖం పెట్టింది కూడా) అలాంటి సమయంలో పల్లెటూరు ఎలాఉంటుంది? ఎలా ఉందయా అంటే ....... గందరగోళంగా ఉంది..... గడబిడగా ఉంది... కేకలతో, కేరింతలతో, భూతుపాటలతో, వింతగా సంతలాగుంది... గుంపులు గుంపులుగా స్త్రీ--పురుషులు వరి గడ్డి మోపులెత్తుకొని కొడవళ్ళు భుజాలమీదేసుకొని ఎగగట్టిన చీరలు--ధోవతులతో వీధుల వెంట నడుస్తున్నారు... ఏ వేవో ముచ్చట్లు చెప్పుకుంటూ.... అందరికంటె వెనుకొస్తున్న ఇంక సమర్తకాని పిల్లొకతి ఏదో పాట పాడుతోంది గొంతెత్తి... వాళ్ళ వెనుక పశువులు మెడల్లోని గంటలనూపుతూ, దుమ్ము రేపుతూ --చిటపట--పటచిట కాలి గిట్టలు శబ్దంచేస్తుండగా, హడావిడిగా, ఊళ్లోకి చేరుతున్నాయి. వాటి వెనుక నార పేళ్ళలాంటి పోరగాళ్లు వాటిని అనంగరంగ భాషలో తిడుతూ...బరిమొలలతో కొందరు, గోచిగుడ్డలతో కొందరు పరుగెత్తుతున్నారు...వాళ్ళని ఆసక్తిగా కాసేపు చూసింది ఆమె (ఛ.....ఛ... అనుకొంది తలవిదిలించుకొంది....)గడ్డాలు పెరిగి, తొడల మాంసం చర్మము ముడతలు పడిపోయి ఎగ గట్టిన గుడ్డముక్కలుగల ముసలి పశువుల కాపర్లు చుట్టలు తాగుతూ కొంచెం వెనక తట్టుగా నడుస్తున్నారు. (సరీగా బట్టలైనా కట్టుకోరు ముండాకొడుకులు ...... ఇంక బతికెందుకు .... అనుకొంది ఆమె మనసులో)

అలా అనుకొంటున్న ఆమె ఎవరు? ఆవిడ వృత్తాంతమేమి? ఆమె పేరేమి? చదువరులు ముందు ముందు గ్రహింతురు గాక....ఆమె ఇప్పుడు చుట్టూ ఎత్తైన ప్రహరీగోడగల మూడంతస్థుల మేడమీద పై--భాగంలో నిలబడి చుట్టూచూస్తోంది.... ఆమె అందరిని, అన్నిటిని చూస్తున్నదేకాని ఆమెనెవరు చూడడంలేదు. ఒకవేళ అలా చూసిన ఆమె సగభాగం మాత్రమే కనిపిస్తుంది--

సగం కనిపించినా? పూర్తి కన్పించినా? ఆమెను చూడగల ధీశాలురు, తీరికగలవారు

ఆ సమయంలో పల్లెటూర్లో ఉండడం జరుగదు. అలా జరిగినా వాళ్ల నాన్నగారు అందుకు ఒప్పుకోరు .... ఆమె ఇప్పుడు చెట్ల మీద అరుస్తూ చేరుతున్న కాకులను ముఖం చిట్లించి చూస్తోంది గోరువంకలను పెదిమలు వంకరగా పెట్టి చూస్తోంది... ఆమె మనసులో ఏవేవో ఆలోచనలు కాకుల్లాగా, అరుస్తూ ఎగురుతున్నాయి... గోరువంకల్లాగా గుస గుసలాడ్తున్నాయి... అల్లరిచేస్తున్నాయి... మాంచి ఈదురు గాలికి చెరువు లోని నీళ్ళు ఉవ్వెత్తునలేసి కట్టకేసి ముఖం కొట్టుకొని పగిలి నలిగి జారి వెనక్కి దీనంగా వెళ్ళిపోతున్నట్లుగా ఆమె ఆలోచనలు... వెరీ వెరీ క్రిటికల్ స్ట్రగుల్ ఆమె మనసులో జరుగుతోంది... అది ఇదేనని ఆమెకు తెలియదు. ఏదో తపన-- ఏదో ఆరాటం.. బాధ, రోదన, రోత, అందరిమీద కసి... పగ.. సెక్సు... ఇంకా ఎన్నో? ఎన్నెన్నో? భావాలు కలివిడిగా, అర్థం కాకుండా పరమ చెత్తగా, శ్వాసకూడ ఆడనంత దౌర్భాగ్యంగా తను ఉన్నాననుకొంది-- ఛ....ఛ వీటన్నిటికి దూరంగా పరుగెత్తాలి... బంధాలు త్రెంచుకోవాలి...కోవాలి.. ఓయస్సుగా వెళ్ళిపోవాలి... అమ్మో..." అనుకొంది ఆమె... అలాఅనుకొని భయంతో గుండెల మీద చేతులేసుకొంది.

ఆమె నాన్నగారు సదరు ఊరికి దొరగారు...కావున వాళ్ళమ్మ ఆ ఊరికి దొరసాని (కాని వాళ్ళ నాన్నగారికున్న అధికారం అమ్మకులేదు.)... బట్టతల, గద్దకండ్లు, దొడ్డుముక్కు, ముక్కుమీద నిక్కపొడిసిన మీసాలు, వాటి కింద భూతులతో తప్ప మాటాడని నోరు-, మోటుగా ఎప్పుడు కొట్టాలని చూసే చేతులు, రోమాలు పెరిగిన ఛాతీ--మల్లెపువ్వులాంటి తెల్లని ధోవతి, లాల్చి గలవాడే సదరుదొర లేక ఆమె ఫాదరు. అలాంటివారు ఎప్పుడోచచ్చిన దుప్పికొమ్ముల క్రింద ఆరాముకుర్చీలో కూర్చుండి ఎవన్నో తిడుతున్నాడు పచ్చిగా... ఇల్లు ఇల్లంతా తిట్లతో అదిరిపోతోంది... అమ్మను అక్కను...చెల్లెను, పెళ్ళాన్ని.. ... అందరిని కలిపి తిడుతున్నాడు... తిట్ల దుర్గంధము ఇంటినిండా వ్యాపించి-- పరమచండాలంగా తయారయ్యింది.. అందుకే అటు వేపు ఎవరుకూడ రావడానికి సాహసించడం లేదు.

దొరకెదురుగా చేతులుకట్టుకొని నిలబడి భయం భయంగా దొర ప్రతితిట్టూ నాభిలో గడ్డ పారదిగుతున్నంత బాధగా, రోత కలిగినా కూడా అసహ్య పడకుండా, భయం ముఖం పెట్టి... చర్మమంతా ముడతలు పడి, దవడలు పీక్కపోయి మాసిన గడ్డం గల మనిషి చూస్తున్నాడు దొరనుకాదు నేలను ... అతని లోపల తెగింపు బయట దొర తిట్ల వర్షం... అవ్వను, అక్కను, ఆలిని, బిడ్డను తన సమస్త స్త్రీజాతితో మాటల్లో సంభోగం జరుపుతున్నాడు... ఆమాటలు పరదాలు ఛేధించుకొని మేడ లోపలికిపోతూనే ఉన్నాయి. ఇంట్లో గిరగిర తిరుగుతున్నాయి...దొర్సాని ముఖం అసహ్యంగా, అసహనంగా మాడిపోతోంది. మేడమీద ఆమె నాన్నగారి మాటలు వింటోంది.. ( ఛ...ఛ..వినకూడదు..వినకూడదు...చెవులు మూసుకున్నా... వినపడుతూనే ఉన్నాయి.. వినకూడదు..వినవద్దు..ఇరువయేండ్ల నుండి అలాగే అనుకొంటూ, అలాగే చెవులు మూసుకుంటూ--ఆమె వింటోంది....)

"వాడిపెళ్ళాన్ని--అక్కను... ఏమి చేస్తాడు....? (నీ చెవులు పడిపోను.. చెముడురాను.. ముండావినకు...రండా వినకు...అనుకుంటోంది.) బాపుకు బుద్ధుందా? (తనకుందా?) ఏమిటి చేస్తాడు? (ఛీ సిగ్గుకూడాలేదు).... నాకెందుకు ముదినష్టపుమాటలు... పనిమనుషులు తిట్టుకుంటారు..ఛీ పాడుగా.."

దొర ఇంకా అరుస్తున్నాడు.. అరుపుల్లో తిట్లుకాక ఇంకా కొన్ని విషయాలున్నాయి వాడు బాకున్నడట... ఆబాకీ వాడు చేసింది కాదట--వాడి తండ్రి ముండాకొడుకు చేసిందట--వాడి తండ్రయిన చేయకపోవునట--ఎవడో వానికి చేతబడి చేసిండట--మంత్రగాడు గొర్రెకల్లు కావాలన్నడట— అయితెచ్చియిచ్చిండట-- అంతుజరం తగిలిందల్లా కాళ్ళుచేతులు పడిపోయినాయట-- వాడు మంచంలో పడిపోయిండట-- గోడు గోడున ఏడ్చిండట-- కాళ్ళు రెక్కలుంటే చర్మముతీసి చెప్పులు కుట్టిచ్చేరకముటవాడు. ఇది ఏభయేండ్ల కిందటి మాటలు--అప్పుడే వీడు కొలువులకచ్చిండంట-- అయినా యాభయి రుపాలప్పు తీర్చలేదట-- వాడి కొడుకు అప్పు తీరుస్తనని ప్రతిజ్ఞపట్టి ఆ దొరకే పాలేరున్నడట-- అయినా అప్పుతీరలేదట-- వాడేదో చేసిండట--దొంగని దొర చితగ్గొట్టిండట... వాడు కొడుకును అలా స్పృహలేకుండ కొట్టినందుకు ఏదో అన్నడట--అలా అనకూడదట అన్నందుకు వాడు తన్నులు తిన్నడట-- అయినకొడుకును పాలేరుంచనని వెళ్ళిపోయిండట-- కొడుకు అయ్యమాటమీద పని బందుచేసిండట--అలా చేయకూడదట చేసినవాడు ఇంకెవరికో పాలేరున్నడట-- అలా ఉంచుకున్నవాడు దొరకు అగేనిస్టట-- అగేనిష్టయినా కూడా కింది వాడట--కిందివాడేకాక వాడెప్పుడో కమ్యూనిస్టట-- కమ్యూనిస్టుకు దొరకు అసలే పడదట--పైగా కమ్యూనిస్టోనికి భూములు కూడా ఉన్నయట--అవివాడు సంపాయించలేదట--దొరకభూములన్ని కష్టార్జితమట అలా ఎట్లా వానికి పాలేరుంచిండో చూసిండట-- తోలొలిచి చెప్పులు కుట్టిత్తనన్నడట--పర్వాలేదని వాడు ఇంకా కమ్యూనిస్టోని పనిలకే పోతున్నడట-- తోలు ఒలిపించిండట.

"బాగ్గట్టకుంటసాపుసీద ఉచర్ లేకుంబెల్లి పోయినవ్--బంచత్ నీ అవ్వ మిండడు భాగ్గడ్డడనుకున్నవా? లంజకొడుకా? నువ్వెందుకురా-- నీ తల్లి! కాళ్ళు సేతులు ఊగులాడ్త న్నయ్-- నాగలిపొంట నరుసొక్కల సాలుగుడు సొలుగుతున్నవ్-- పోరొన్ని ఆ కమినిట్టో నింటికి దోలినవ్-- ఆడు మంచిగ పెడ్తడనుకున్నవేమో.... నువ్వు నాకద్దు.. అద్దంటే అద్దు-- ఇన్నావురా? ఆ లంజెకొడుకును నాదగ్గెరుంచు... ఇన్నావురా? నువ్వు పెండ్లాన్ని పెద్ద మాదిగోనితోనిదెం.. తిరుగు...లేపొతే కమునిట్టోనికో--డెక్కలోనికో-- పాయఖానా లెత్తిపోయి--నీ అవ్వ మిండెకాని కాన్నె పాలెరుండు? ఇన్నావురా? అది సాత కాకపోతే ఉరిపెట్టుకసావు-- అట్లా కాదంటివా? ఓరి లంజ కొడుక ఇంటున్నావురా నీపోరిని తోలియ్యి...సమ్ంఝ్ కాలేదుర..నీ బిడ్డను.." దొర..

"సిగ్గన్నలేదు.. వానిబిడ్డ నాకంటె చిన్నదికాబోలు, అదికావాలట ఎంత పచ్చిగ మాట్లాడ్తుండు...ఛీ....ఛీ వినేవాడు మనిషి కాదు-- వాడు బ్రతికున్నాడా? చెవులు వినపడాయా?" ఆమె ముఖం అష్టవంకరలు తిరిగిపోతోంది. రెండు చంకల్లో అరచేతులుంచు కొని నొక్కుకొన్నది. తరువాత కత్తెరగా మెడమీద చేతులేసుకొని మెడమీది నుంచి ముఖాన్ని రుద్దుకొంది. జడను పీక్కొంది తర్వాత "పిచ్చి...పిచ్చిలాగే ఉంది..." అనుకొని మేడమీద అటుయిటూ తిరిగింది.

దొరోరి తిట్లు సాగుతూనే ఉన్నాయి. అవి ఎల్లప్పుడూ గాలిలో మ్రోగుతు ఉండాలె ఆభూతులకు, ఆ అనాగరికపు మాటలకు జనం భయపడాలికదా! (అలా కొంతమంది దొరలు అనుకుంటారు. కొంతమంది భయపడతారుకూడా. కొంతమంది భయపడరు

తిట్లకేకాదు. దొరలకుకూడా. దొరతనానికి కూడా...)

ఆమె మొండిగోడమీది నుండి క్రిందికి చూస్తోంది... వాళ్ళ నాన్నగారి ముఖం చూడాలని ఉంది. కాని అతను బంకుల్లో కూర్చున్నాడు.

వాడు.. దవడలు చప్పబడిపోయినవాడు... మాసినగుడ్డలోడు.. పాలేరోడు. అందునా మాదిగోడు.. నేల చూపులు చూస్తున్నవాడు మెడ ఎత్తిండు.. బాప్‌రే వాని కళ్ళల్లో అగ్నిగోళాలు.. దక్షిణపు దిక్కు తాళ్ళతోపుమీది దళారి సూర్యుని లాంటి మంట.. కాని వాడు ఏడుస్తున్నాడు.... ఎందుకేడుస్తున్నాడు.. ఏడుపుతో పూడుకపోయిన గొంతులో ఏవేవో మెలికలు తిరుగుతున్న మాటలు - ఏమంటున్నాడు....?

"గొప్పోల్లుదొర--తెలిసినోల్లుదొర--గట్లనకుర్రిదొర-- గులాపోల్లందొర-- మీ బాంచెగాల్లం దొర-- మా నాయిన్న కాన్నుంచి నా కొడుకు దనుక మీ కొలువే గొలువడ్తిమిద్దొర-- మా అయ్యకాడ చూసింద్రు--నాకాడ చూసింద్రు-- ఏన్జేసి తమరిచ్చినకాడ్కి తీస్కపోయి బతికినమ్--కలికాలం మొండికాలం మచ్చిందొర-- దురుజెట్టకాల మచ్చిందొర--పేరుమునిగి పోయే కాలమొచ్చిందొర-- ఏలుపోల్ల సంపతంటె ఏలెత్తి సూపె మానవుడు లేకుండే దొర-- పిలిసి పిడికెడన్నం బెట్టింద్రుగని ధుత్తెరని ధూరంగొట్టలే గింతవరకై తే-- సిన్నబుద్ది పోరడు. ఏదో సేసిండాలె.. గొడాగోదా? చెట్టామాకా? గొడ్డసొంటిది కానకుంటె బుక్కందుకుంటది. మనిషి జల్మ--...సరే నీ బాంచెన్‌దొర ఏదో అయిపోయిందయి పోయింది... కాన్దొర అంక సంధాలం అన్వనక్కను తిట్టి పోత్తంద్రు-- నీ బాంచెన్ గపాంటి కాల మచ్చింది... యా అయ్య సావంగ సెప్పిండు "వారి కొడుకా! దొరోరి బాకి యాభయున్నయి. అరి రుడంలబడి పోతున్న"నని మా అయ్య బతుకంతా గయాభయి తీర్సకుంటనే తీరిపోయింది.. అనగూడదు బాంచెన్ ధరమదొరలు బాంచెన్-- తాలు తపుకు గొలిసింద్రు బాంచెన్-- ఇదని అదని పెట్టుబడి పటకేటా అల్లికల్లి సున్నకుసున్న జేసింద్రు-- ఆ బాకి తీరలే-- పెరిగింది. పెరిగియాట గుడ్లుపెట్టింది. గుడ్లు పిల్లలై పోయినమ్-- నన్ను బాక్కిందికి పాలేరుంచుకున్నరు. మెడకు బట్టేసి ఇండ్లకే ఇగ్గింద్రు-- చేసి చేసి నా నరాలు, నెత్తురు నల్లబడిపోయినయ్-- అయినా బాకి పెరిగింది నీబాంచెన్‌దొర-- ఇంకా చాలా పెరిగినయ్-- నా కొడుకు మీ కొలువులకే అచ్చిండు. ఇద్దరు చేసిన ఇత్తు ముట్టింది లేదు. వడ్డికట్టింది లేదు.. ఏటా మేంకడుతూనే ఉంటం.. నీ బాంచెన్ మీరే ఇంత ముట్టిందంటరు. సదువ సాత్త రమా? మల్లసూత్తే అమాస పున్నాల మజ్జెబాకి పెరిగిపోతునే ఉంటది. అయిదేండ్లకింద అయిదునూర్లన్నరు నీ బాంచెన్ పెవినేడు ఏందో అన్నరు..ఎయ్యి.. ఎయ్యి బాంచెన్ ఎయ్యన్నరు... ఎయ్యి అంటెంత బాంచెన్?...అయిదునూర్లకంటె తక్కువా? ఎక్కువా?.. ఇగ గదంత నాకుదెల్వది.. ఏన్జేసుక బతికెటోల్లం.. ఊకె కొల్వకుమ్మరియ్య.. ఇగ నేను బాకి గట్టనయ్య... శెషాముగట్ట-- శెషామంటె శెషాముగట్ట-- నీ బాంచెన్ ఇక నా తరంగాదు.. ఎన్నేండ్ల వట్టిగట్టినో్న? కట్టినో్న లేదో తమరి కెరికే? ... గింత బొండిగలకు తాడేసి గీ సెర్మము అక్కెర కత్తదేం అమ్ముకోర్రి... పిల్ల పిల్ల తరాలు తిడుతంద్రు.. నోటికచ్చినట్టు కడిగి పోత్తంద్రు-- ఇగ.. ఇగ.. ఇంకొకమాటంటే.. గిట్లనే దిడ్తే..." వాడి ఎముకలగూడు ఛాతీ ఎగిరెగిరి పడుతోంది.. (క్రోధంలో వాడి పెదిమలు బిర్ర బిగుసుకపోయినయ్..) అతనేమొ అన్నాడు గట్టిగా.

ఆమె అదిరిపోయింది...

"ఏమన్నడాడు? దొరతనం గోదాల్లె కలుత్తదనా? దుట్టుతనం భూవిలకలుత్తదనా? మంచిమాట దక్కదనా! దొర్సానో? మీ బిడ్డనో తిడ్తే మీరు ఊరుకుంటరా? అనా? ఏమన్నాడో? అయ్యో ఏమన్నాడో? అబ్బ ఎంతటి మాటన్నాడో కదా? పిట్టల అల్లరిలో వినబడి చావలేదు! పిట్టలన్నిటిని మంటలో ఏకంగా కాల్చాలే--లొల్లి ఒకటేలొల్లి.. అదిగో వాడి దవడ పేలిపోయింది... నాన్న చెప్పు క్రింద పడిపోయింది... ఆని కెందుకంత పొగరు.. పాలేరు లంజకొడుక్కు అంతపొగరా? అంత తెగింపా? తన్ను నాన్న...తన్ను.. వాడు గిలగిల తన్నుకునేటట్టు తన్ను-- అయ్యో--కొట్టునాన్న కొట్టు--వాడు నెత్తురుకక్కి మళ్ళా మాట్లాడకుండ చచ్చేటట్టు కొట్టు... కొట్టు, తన్ను... తన్నుతూ కొట్టు... వాడు బయట పడ్డడంటె విషం... వాడు విషం కక్కుతడు... మన పాలేరోల్లందరికాడ--నాట్లకాడ--కోతలకాడ వాడు అలాగే తిడుతడు. పాడుచేయ్..బొందబెట్టు.. (ఆమెలోని దొర రక్తం బుసలు కొడుతోంది... నిజానికి ఆమె కెందుకో ఏడుపు వస్తోంది..) నాన్నకు బుద్దిలేదు.. వాడికి భయం పోయింది... అయ్యయ్యో నాన్న వాడింక భయపడడు. నాన్నకు మతిపోయింది... అరుస్తున్నాడు ... లంజ... దెం..నోట్లో ఏంమాటలు.. ఛ...ఛ..నాన్న ఎందుకు తిడుతున్నాడు?...వాన్నెందుకు తిట్టాలి? వాడు బాకెందుకున్నడు? బాకుంటె తిట్టాలా? కొట్టాలా.. కొట్టాలి? ఎందుకు కొట్టాలి? ఎందుకో కొట్టాలి? నాన్నను కొట్టాలి... తన్నాలి?

ఎందుకు కొట్టాలి? వాన్నితిడుతున్నాడు .... (ఆమెకు ఎవరినైనా కొట్టాలని ఉంది... నాన్నకు -- పాలేరోనికి భేదం పోతోంది...)

పిట్టగోడను తన్నింది... కాలు నొచ్చింది...

"వాడు వెలిపోతున్నాడు. కనీసం వెనక్కు తిరిగి చూడకుండా వెలిపోతున్నాడు. ఎంతకావరం... ఒరేయ్....లం..(ఆడది ఇలాగేనా తిట్టేది అనుకుంది) వాని పుల్లల్లాంటి కాళ్ళు చిరిగిన గుడ్డముక్క నుండి కనిపిస్తున్న కాళ్లు-- పౌరుషంగా నింబొడుస్తూవాడు వెళిపోతున్నాడు....వాని ఎముకలు కదిలిపోతున్నాయి. పైగా చేతులు కూడా ఊపుతున్నాడు. దుమ్ములో గిలగిల చావాల్సినవాడు ధీమాగా వెళిపోతున్నాడు.. అగో వానికెదురుగా సుంకరోడు వస్తున్నాడు. అమ్మయ్య వాడు వాని ఎముకలిరుస్తడు.. అరెరె..వాడన్నా వాన్ని తన్ని గుద్ది చంపకుండ విడిచి పెట్టిండు. అయ్యో నేను వాన్ని చూల్లేను.. వారీ సుంకరోడా! నీ వంగిన మీసాలెత్తి మూత్రంపోస్తా నోట్లె- ఛ ఛ ఛ ఛీ ఛా ఛీ...ఛీఛా...

ఆవుల్లో బర్లల్లోవాడు కలిసిపోతున్నాడు. అవ్వన్న వాన్ని తొక్కిచంపడం లేదు... అయ్యన్ని మా బలిసిన ఆవులు బర్లేకదా, వాటిని మాదుగుల్ దిన -- అన్నిటినికోసేసి.. సీ..ఛీ...వాడు వెళిపోతున్నాడు..'

ఆమె ఆందోళనగా పిడికిల్లు బిగించి పిట్టగోడమీద గుద్దింది. నీర్సంగా అటు యిటూ తిరిగింది. తాళ్ళతోపులో సూర్యుడు సైనికుల గుంపులోని నక్సలేటులా దిలా మెరుస్తూ దిగిపోతున్నాడు. తూరుపున చీకటి తెరలు తెరలుగా క్రమ్ముకువస్తోంది.. పంట పొలాలమీద గడ్డిమోపులెత్తుకొని చీమల్లాగా మనుష్యులు. ఆమె బజారునుంచి మొఖం త్రిప్పుకొని దూరంగా పొలాలవేపు చూస్తుండి పోయింది.

దూరంగా ఎవడో వీణ మీటుతూ వరి కుప్పకాడ బుర్రకథ చెప్పుతున్నాడు. వాడి పెళ్ళాం బుర్రకొడుతూ వాడితో పాటు ఎగురుతోంది, ఇంకొకవేపు ఎవతో పసుపుపచ్చచీరది పరుగెత్తుతోంది...

"పడిపోదా? పరుగెత్తు.. దాని వెనుక ఎవడాడు దానిమొగుడా? నవ్వుతున్నడు.. తూ...అరెరె.. అబ్బబ్బ అరెరే.. వాటేసుకున్నడు. నలిపేస్తున్నడు.. చంపేస్తున్నడు.. ఛ....ఛ..."

ఆమె తన స్థనాల్ని తనే గట్టిగా పిసుక్కున్నది. కసిగా .... వాళ్ళవేపు చూస్తోంది ఆసక్తిగా... వాళ్ళిద్దరు ఒకరి మీద ఒకరు పడిపోయిండ్రు. "అదిగో వాడి దుంపతెగ... ఇంక ప్రొద్దన్నా క్రుంక లేదు.. అది.... దానికన్నా సిగ్గులేదు.... అమ్మయ్య.... అది వాన్ని నెట్టేసింది..... వాడు పడిపోయిండు. అది పరుగెత్తుతోంది .... అలిసిపోయింది.... దాని నెత్తిమీద కొంగలబారు...."' పిట్టగోడమీద మోచేయి ఆనించి అరచేతితో గదుమపెట్టి ఆసక్తిగా చూస్తోంది. "తను అందరిని చూడగలుగుతున్నది. దూరం నుంచి తననెవరు చూడరే? తనగుండె చప్పుళ్ళు ఎవ్వరూ వినరు... ఎవడు వినడు...' అనుకొంది.

వాడు గడ్డిమోపుదాని నెత్తిమీది కెత్తిండు... వాడు కూడ గడ్డిమోపుక్రిందికి చేరిండు. వాళ్ళిద్దరిముఖాలు గడ్డిమోపు క్రింద - "ముద్దు పెట్టుకుంటున్నాడా? ఛీ...ఛీ... వాడు దాన్నేంజేస్తే తనకెందుకు? ముద్దెలా ఉంటుంది? ఉంటుంది ... పిట్టగోడను ముద్దు పెట్టుకొంది. సున్నం పెదిమలకంటింది... కారం కారం.. ఇలాగె ఉంటుందా? తనెవరిని ముద్దు పెట్టుకోవాలి? అమ్మనా? ఛీపాడు.. నాన్ననా? కంపు చుట్టకంపు. బ్రాందీ కంపు... కంపుకంపు... (బ్రాంది త్రాగుతే. ..ఛీ....ఛీ) తమ్ముని ముద్దు పెట్టుకోనా? మరదలు ముండో.. దానికెంత వయసు నాకెంత వయసు నాకంటే పదేండ్లు చిన్నేమొ? దాని సోకుగాలా? అది హాయిగా మొగున్ని వెంటేసుకొని జీపులో పట్నమంతా తిరుగుతోంది. తిరుగు...తిరుగు. తనకు మొగుడు లేడుగదా! తను పట్నం లుంటే చెడిపోద్ది ఆడ ఉండకూడదు--సినీమాలు చూడకూడదు. చీకటింట్లో ఉండిపోవాలి." సుతారంగా మూతి సున్నలాచుట్టి ఆకాశంవేపు ఉమ్మింది. ఉమ్మి ముఖంమీద చినుకుల్లా పడ్డది. కొంగుతో తుడుచుకొంది.

ఆమె మనసులో ఏదో మంట-- ఏదో అవ్యక్తమైన నరాలపొంగు పచారుచేస్తోంది ... చేస్తూ చేస్తూ ఆగింది. ఆగి చీర చూసుకొంది... కడుపును పిసుక్కొంది.. చీరను ఎత్తి చంపలకు రాసుకొంది మెత్తగా .... లోపలి లంగాను చూసి నవ్వుకొంది... లంగాలేపింది.... "ఛీ.....ఛీ... పాడు... పాడు పాడు... పిచ్చిదానిలా అసహ్యంగా ముఖం పెట్టి చీరకుచ్చెల్లు సరిచేసుకొని అటూ యిటూ పచారుచేయసాగింది... ఆమెను ఆక్షణంలో చూస్తే తప్పకుండా పిచ్చిపట్టిందనుకుంటారు.... ఆమెకు పిచ్చి అవునో కాదో కాని... రోజల్లా గదిలో రేడియో ముందు కూర్చుండి విసిగిపోయి సాయంత్రం పూట బంగళా ఎక్కి ఇలాగే రోజు పచార్లు చేస్తుంటుంది... ప్రతిరోజు ఇలాగే కాదన్నా ఆలోచిస్తు ఉంటుంది... ఇవాలా మరీ ఇదిగా పచారు చేసోంది...

ఆలోచనలు ఆగిపోవు... నిరంతరం సాగుతుంటాయి.. అన్నీ ఉండి స్వేచ్ఛ లేక పోవడం భయంకరమైనది. స్వేచ్ఛ ఏ చిన్న రంధ్రంకోసమైనా-- ఏ చిన్న ఆసరాకోసమైనా

వెతుకుతూ ఉంటుంది... ఆ వెతుకులాట క్రమబద్ధమైనది కాదు... అలాంటి స్థితిలో ఎవరి మనసైనా ఎలా ఉంటుందో? అలాగే ఆమెమనసు నానా విధాలుగా ఆలోచిస్తూన్నది.

కాకులు కలివిడిగా అలజడిగా అరుస్తున్నాయి. పిట్టలు కోరస్‌గా అల్లరి చేస్తున్నాయి.

ఆమెకు ఎన్నెన్నో కన్పడుతున్నాయి, ఏవేవో విన్పడుతున్నాయి.

చితికిన చెంపల మాసినగడ్డపు ముసలోడు తలవంచడం తప్ప ఎత్తడం తెలియని ముసలోడు తలెత్తి...తండ్రిని నిలదీసి అడుగుతే ... ఆ కోలకళ్ళల్లో తెగింపు (ఎట్లా వచ్చిందబ్బా!) ఇదివరకు ఎవని కండ్లల్లో కనపడని ధీమా? (పాలేరోడెవడు కూడా తనవేపు చూడడానికే భయపడ్తరే.. వాడు నాన్నకుకూడా...?) ఎప్పుడో పండుక్కు గోదారికి స్నానాకికెళితె... (ఎంత బాగుంది గోదారి....) ఇసుకమీద దొర్లి... ఇసుక తెల్లగా గరుకుగా, సల్లగా.. తెల్లగా సల్లగా.. లంగానిండా...జాకెట్టు నిండా ఇసుకే.. ఇసుకే ఇసుక.. తన కప్పుడెన్నేండ్లబ్బా! చేను కోతల కాడికి తమ్ముని జీపులో వెళితే చేనెంత నల్లగా... పెళ్ళలు కరుకుగా... జొన్న కంకులు ఒంటికి తాకితే.... చెప్పుతెగిజొన్న క్రరల కుప్పమీద (కుప్పేనా?) కూలబడితే.. జొన్న ఆకులు గీరుకుపోతే ఎంతబాధ? దండలకు తాయెత్తులు కట్టుకున్న కత్తిలాంటి మీసాల పాలేరోడు దోసకాయలు తెచ్చిండు... ఔను తెచ్చిచ్చిండు... అటుకులు కూడా తెచ్చిండు. ఔను వాడే తెచ్చిండు... ఔను తను దోసకాయ కసిపిస నమిలి తంటే తమ్ముడు ఉరిమిచూసిండు.. దొర్సానోలే తినాలెగాని.. కూలిదానోలె తినొద్దన్నడు... "నేను కూలిదాన్నా?" ఏడిచింది కదూ! ఫిబ్రవరి రాత్రుల్లో గాలి రివ్వున వీస్తూంటే ఒంటరిగా కుర్చీలో ముడుచుకొని పడుకొని, ఎన్నెన్ని విన్నది? చింతచెట్టు ఆకుల శబ్దం ఎంత బాగుంటుంది ఆ గాలికి? తెల్లారు సమయంలో నల్లపిట్ట కూత ఎంత బావుంటుంది.... జనవరిలో సూర్యోదయం ఎంతబాగుంటుంది... పచ్చగడ్డిమీది మంచులో పరుగెత్తితే బావుంటుందికదూ! బలే బావుంటుంది.

పిట్ట గోడకానుకొని బజార్లోకి చూసింది. ..... అలాగే ఆలోచిస్తూ....

ఎవతో నడ్డిముక్కు అమ్మాయి పాతగుడ్డ చుట్టుకొని -- ఎర్రటి తొడలు కన్పిస్తూండగా వెలుతున్నది... దాని స్తనాలను దాచుకోవడంలేదు చీపాడు ఓనైనాలేదు... అయ్యో! జాకెట్టన్నా సరిగాలేదు... దానికి సిగ్గెట్లాలేదు పుష్పవతేంది. కాబోలు... అంటే ఏమిటి? లంగామీద ఎర్రటి మరక -- తడి తడి కోరికలు అది అవేవి పట్టించుకోకండా వెళ్ళిపోతోంది. తలసమురు లేక ఎండిపోయిన రాగి వెంట్రుకల చుట్టలో చుట్ట (మొక్కి) పీక...దాని కనుల్లో ఏముందో చూడాలే... 'కన్నుల్లోకై పుంది నీమీద మనసైంది రారా...' చెత్త ముండ పాట..... దాని ముఖంమీద దుమ్ము తప్ప ఏముంటుంది? ఏమి ఉండదు.... దాని చేతిలో కర్ర ఉన్నది-- దాని ముందు ముసలోడి పెదిమల్లాగా ఊగుతున్న గొడ్ల మర్మావయాలు రొచ్చుతోకలు... ఆ పోరినెవడు చూస్తలేడు, ఎవడైనా చూసినా అది పట్టించుకోదు. కనీసం సరిగ గుడ్డ దానికెందుకె లేదు? లేకపోవడం దయనీయమే. అయ్యో పాపం దానికడుపు చూడు ఎట్లా ఈడ్చుకపోతున్నదో? దానికి ఆకలి...చ్చొ...చ్చొ... అన్నం గావాలేమొ? ఎంచక్కా హాయిగా చెట్లు, పుట్టలు, తాళ్ళతోపు చేలు, పొలాలు హాయిగా తిరుగుతుంది.... ఆకలైతోంది? ఆకలి చంపుకుతింటుందా? నాకు ఆకలైనా

పర్వాలేదు అలా తిరిగే వీలుంటే .... ఆకలేస్తే ఏదో సకాయో నమిలి నీళ్ళు త్రాగుతుంది. ఇదిగా ఉంటే ఎవన్నో కావలించుకుంటుంది. కావలించుకొని ఆ మురికి గుడ్డ తొలిగిస్తుంది... ఛ....ఛ... కాని ఏం చేస్తుంది? (ముండవు, రండవు, దొర్సానివి కావు.. ఈ ఆలోచనలు పాడు పాడు....)

మరి నేనో జారిపోయే గుడ్డలో, ఈ పాడు చీరల్లో, బిగుతుజాకెట్లు, వాటికింద చెమట బాడీలేసుకొని లోపల లంగా తొడుక్కుని గాలికూడా ఒంటినితాకకుండా సూర్యుడన్నా ఒల్లు తడమకుండా కోరికలతో కాలిపోయి విసిగిపోయి, అరిగిపోయి రాత్రి క్రూరంగా దగా పడి లంగాతడెక్కి కలలు నీరసపడి నిలువుటద్దంలో బొటిమల ముఖం కరుకుగా, ఎవడూ ముద్దాడని ముఖం పాడు ముఖం .... ఆ మొఖం ప్రక్కనే చిన్నప్పుడు బడిలో ఎవడో బీద పోరగాడు దొర్సానని భయపడకుండా జామిచెట్టు కిందికి ఒంటేలుకు వెలితే... ఇంకా... ఛీ... స్తనాలు నొక్కి, కావలించుకొని పరికిని ఎత్తిన రంగుపోరగాడు... అస్పష్టంగా మసక మసకగా కన్పించినట్టే కన్పించి మాయమైతడు.

అప్పుడు తనెందుకు పంతులుకు చెప్పలేదో ఇప్పటికీ అర్థంకాదు... అలా చెప్పితే చచ్చేవాడే-- కాని వాడూ మరలా కనిపిస్తే బావుండు ఎవలకొడుకో? ఏడబోయిండో? వానికెందుకంత ఇదో? వాడు పాపం మళ్ళా భయంకొద్ది బడిముఖం చూల్లే... ఈ పాటికి వాడు వయసోడై పోవచ్చు... వయిసోడేం ఖర్మ... ఎంతమందిని పుట్టించిండో?....

తను జీవించడం మెందుకు? ఈ పిట్టగోడ దూకుతే ఢాం...ఢాం...ఢాం.. తలబద్దలై పోతుంది.... నేనెందుకు చావాలి? ఏం తప్పు చేశాను చావడానికి? తప్పంటేఏమిటి? ఎందుకు బ్రతకాలి? చావాలి... బ్రతకాలి.. బలే విషమపరిస్థితి వరన్నము (సాంభరేను) గడ్డ పెరుగు, కోడికూర, మెత్తటి పరుపు తలదిండ్లుకి... నన్ను నిలువునా నరుకుతూ మళ్ళీ అతికించే ఒంటరితనం... తనొంటరిది కాకపోతే? తనకెవరున్నారు నిజానికి? తల్లి ఉన్నది...కాని లేనట్టే, తండ్రి ఉన్నాడు-- అసలేలేనట్టు... వాడే వాడే ద్రోహి... తమ్ముడున్నాడు... వాడికి పెళ్ళాం ఉన్నది. నౌకర్లున్నారు... నాకేమొద్దు... ఎవరు కావాలి? మొగుడు...మొగుడు ముండా కొడుకుంటే ఈల్లంతా నాకేమొద్దు... వీల్లందిరితో తనెందుకు కలివిడిగా కలిసి తిరుగుతుంది? అందరూ ద్రోహులు, మోసగాళ్ళు-- నన్ను మోసంచేసి నాకాళ్ళకు, కళ్ళకు కనపడని బంధాలేసి వాళ్ళుమాత్రం హాయిగా కులుకుతున్నారు. అంతా దగా మోసం..... మోసం దగా (రెండూఒకటే...) చీరెంమీద డిజైను కుట్టి కుట్టి విసుగొచ్చి సూది విరిచేసి ఒళ్లిరుసుకుంటే--ఎప్పటిదో దృశ్యం... ఛీ పాడు..పనిమనిషిని మొగుడు సామాన్ల అర్రలో--సిగ్గులేకుండా.. ఎంత భయపడ్డరు.. గజగజ వనికిపోయింది లంజ... (వెధవాలోచనలు, వెధవన్నర ఆలోచనలు...) డొక్కు రేడియోలో ముసలి ముండలు గుడ్డలిప్పేసుకొని తయారున్నంకాసుకో మన్నట్టు పాడుతుంటారు. అవి పరమరోతగా పచ్చిగా ఉన్నా వినాలి కాని నాన్న గుడ్లు మిటకరించి హుంకరించి ఆ తరువాత మొరుగుతడు. అమ్మకు నిజంగా బుద్ధిలేదు. ఎల్లా నాన్నను పెళ్ళిచేసుకొందో పాపం చ్చొచ్చొ...? నాన్నే అమ్మను చేసుకున్నడు. అమ్మనెవడడిగిండు? అమ్మ... అమ్మ ఏమనదు... జాలిగా చూస్తుంది. అట్ల చూస్తేనే నాకు ఒళ్లు మండిపోద్ది... అలా చూస్తుంటే ఉరేసుకు

చావాలన్పిస్తుంది.... అమ్మ రేడియో కట్టేస్తుంది... రాజీ బేరం ... రేడియోనెప్పుడో పగిలేసి--ముక్కలు ముక్కలు చేస్తా... కాని అది లేకుంటే నాగుండె కొట్టుకోవడం నేనే వినాలి... రైల్లు పరుగెత్తుతుంటాయి. ధన్ ధన్ దనాదన్... చెక్‌పక్..చెక్‌పక్..పక్ పకాపక్.. చెక్‌పక్.. నేనెప్పుడో పరదాలన్నిటికి నిప్పంటించి బయట కురుకుతూ... ఫలాని దేశముక్ దొరవారి కూతురు లేచిపోయిందో హా.....' రండి చూడిండి... రెక్కలు వస్తే బావుండు... లేచిపోవడమంటేమిటి? నాబొంద... బొందగాదురా బొనగిరిగట్టు-- గట్టుకాదురా చీపురుకట్ట... నాన్న విషం దాగి "ధాం"మ్మని చస్తడు చావనీయ్... (పీడాపోతుంది...) తమ్ముడు తాగుడెక్కువ చేస్తడు... చేయనీయ్.. అమ్మేం చేస్తుందో? ఏడుస్తుంది... ఏడ్వనియ్.. వీళ్ళంతా ఎవరికోసం బ్రతుకుతున్నారు.... నాన్న డబ్బుకోసం...దొరతనంకోసం... అమ్మనాన్న కోసం... ఛ....ఛ ఎవరికోసం కాదు. తమ్ముడు తాగుడుకోసం -- వాని పెళ్ళాం...చీరెలకోసం....షికార్లకోసం...మరినేనో? నేనెవరికోసం బ్రతుకుతున్నానోంటా? ఒరేయ్-- నాన్న--ఒసేయ్ అమ్మా--ఓరీ? తమ్ముడా! నేనెవరికోసమ్రా బ్రతికేది?... ఎవరికోసమో నేనెందుకు బ్రతుకుతా? నాకోసం నేనే.. అమ్మ రోజు మల్లెపూలు సిగలో పెట్టుకొని సాయంత్రం తయారై బుద్దిలేకుండా కూర్చుంటుంది వక్కలు నములుతూ.. ఎంత రాత్రి వరకు మేల్కొని ఎదురుచూస్తుందో? నాన్న రాత్రి ఇంగ్లీషు మాట్లాడతడు. అమ్మను పచ్చిగా తిడతడు గ్లాసులు, సీసాలిసిరేస్తడు. ఎవతినో తీస్కచ్చి చీరెలు రయికెలు చింపేసి నానా హంగామా చేస్తడ(ట) అదో అల్లర(ట) నాన్నకు బుద్దిలేదు. అమ్మకు ధైర్యం లేదు. ఊళ్లోని లంజెలకు తెగువలేదు. నాకు ఇంకా సిగ్గులేదు. తమ్మునికి శరంలేదు. ముప్పయేండ్ల అక్క ఇంట్లో మురిగిపోయి వాసన కొడుతున్నదన్న జ్ఞానమున్నాలేదు. ఎందుకుంటుంది? వాడు లక్షల కట్నం తీస్కోని పట్నంలో ఏదో బిజినెస్సు పెట్టుకున్నాడు. జీపు కొనుక్కొని పట్నంలో కుషీ చేస్తున్నడు... ఎవనికెవడు? ఎవని సుఖం వాడిది? ఎవరికెవరు ఈలోకంలో...ఎవరిని అడగక.. మా నహీ...బాప్ నహీ--కోఈ నహీ...నహీ నహీ మై నహీ దేక్‌సక్తతురేఖురోతేహుయే... జాడించి దవడ మీది నుంచి గుద్దుతే తెలుస్తుంది... తమ్మునికేంతక్కువ పట్టుపరుపు లాంటి పెళ్ళాం... నేను.. అక్కలంజను...' ఆమెకు ఉవ్వెత్తున దుఃఖం ముంచుకువస్తోంది.

'లంజ....లంజ ఆలోచనలు చేస్తూ... లంజ... ఎంత గమ్మతైన పదం లంజ... లంజ...' ఏడ్పును ధిక్కరించాలనే ఉద్దేశంతో పెద్దగా నవ్వింది.

ముప్పయ్యేల్లు లంజను కాలేను.. మొగుడు లంజకొడుకును కొనాలంటే లక్షన్నర కట్నం కావాలి. వాడు ముప్పయేండ్లుండి పెళ్ళికానివాడై ఉండాలి. ఎవడుంటడు? ముప్పయేండ్లు? నాకోసం కాసుక కూర్చున్నవాడెవడు? అలా ఉన్నవానికి ఏటికెడ్లు పాటిక బర్లు లంజలు -- దొరతనం -- బంగళ -- పొలాలుండాలె -- ఆడు దేశముక్కు ఖాందాని వాడై ఉండాలె -- అంతటివాడు దొరకాలంటే... అంటే.. నేను పుష్పవతినైన కాన్నుంచి నాన్న లంజకొడుకు అలాంటివాడి కోసం వెతుకుతూనే ఉన్నాడు. అంత కట్నం నాన్న యియ్యడు. తక్కువ ఆ లంజకొడుకులు తీసుకోరు.. ఈ లంజను చేసుకోరు. అంతకంటే తక్కువరకం వానికిచ్చి పెళ్లిచేయరు ముసలి ఖాందాని.. తోలు ముడుతలు పడిపోతోంది.. ముసలిదాన్నయి ఈ గడీలల్లోనే క్రుంగి కృశించిపోతాను. చావ నివ్వరు...

బ్రతకలేను. మొగున్ని చేయరు, నేను లేచిపోను..

గట్టిగాగడి దద్దరిల్లేంత గట్టిగా ఏడవాలనుకుంది ఆమె కాని ఎందుచేతో ఏడవలేకపోయింది. ఆమె హఠాత్తుగా చుట్టూచూసింది. ఆమె చుట్టంతా చీకటి

"దొర్సాని.. గీడున్నరా బాంచెన్? నేను మీకోసం పరెషానయి తిర్గుతున్న" పనిమనిషి ఆమెను చీకట్లో చూసి ఆమె దగ్గరకొచ్చింది.

'లంజెపో..నన్నేడవనియ్యి... ఇక్కడి కూ్కాడ నా కడ్డమొస్తరా?" ఆమె అరిచింది...

"ఏంది దొర్సాని గట్లంటరు?" ఆశ్చర్యంగా పనిమనిషి.

ఆమె పనిమనిషి దవడ అదిరిపోయేలాగా కొట్టింది.... పనిమనిషి ఏడ్వాలా! తనే ఏడ్చింది.. అర్థంగాని పనిమనిషి అలా చూస్తోంది ఆమెను. ఆమె ఏడుస్తూ గొణుగుతోంది పచ్చిగా...

"నీబాంచెన్ భారతవ్వ దొర్సాని ఎందు కేడుత్తంద్రు ఊకొంద్రి." పనిమనిషి భయం భయంగా అంది..

ఆమె పేరు భారతి... ఏభారతి? "పొగడరా నీ తల్లి భూమి భారతిని" అన్న కవిగారి ' భారతి' కాదు.. మరెవరి భారతండీ.. దొరబిడ్డ భారతి.

అలాంటి భారతి కొంగు నోటికడ్డం పెట్టుకొని కళ్ళనీళ్లు ధారాపాతంగా కారుచుండగా- - మేడమీదినుండి ఇంట్లోకి పరుగెత్తింది.. ఎదురొచ్చిన అమ్మను కౌగలించుకొని ఏడ్చింది. బిడ్డకేమయ్యిందో తెలియక తల్లి తల్లడిల్లిపోయింది. ఆ రాత్రంతా భారతి ఏడుస్తూనే ఉంది. పట్టు దిండ్ల మధ్య తలపెట్టుకొని వెక్కి వెక్కి కుమిలి కుమిలి ఏడ్చింది భారతి..

తల్లి గదిలో తల్లి -- తండ్రి గదిలో దౌర్భాగ్యురాలైన ఓ పల్లె స్త్రీ తండ్రి నిద్రించారు.

తెల్లవారింది...

భారతి గదిలో భారతి లేదు...

అన్ని తలుపులు, ఎత్తైన గోడలు, పరదాలుండగా భారతి ఏలా వెళ్లిపోయింది..? తండ్రికి సమఝ్ కాలేదు. తల్లికి అర్థమై కానట్టే ఉన్నది. పట్నంలోని తమ్ముడు పెండ్లాం ముందు కారాలు మిరియాలు నూరిండు.. దొరలిద్దరు భారతి కోసం వెతక సాగింద్రు..

ఇంతకూ భారతి ఎటుపోయింది? పంజరం నుండి తుర్రుమన్న చిలుకా ఎటువెళుతుంది? చిలకా... చిలకా నువ్వెటు వెళ్ళావు? ... 'భారతీ' తల్లి నువ్వెటు పోయావు! భారతీ... ఏడచచ్చావే? మాట మాత్రమైన నాతో చెప్పొద్దా తల్లీ! భారతీ.. భారతీ ... అనుకున్నారు తల్లీతండ్రి, తమ్ముడు, మరదలు ఏమనుకున్నదో?

ఆ శాశ్వత బందిఖానా నుండి బయటపడ్డ తర్వాత భారతి ఎక్కడైనా స్వేచ్ఛగా బ్రతుకుతుంది. బ్రతకనేర్చుకుంది.. ఆ కథంతా మనకనవసరం కూడా.

**– ప్రజాతంత్ర, 29 జనవరి, 1978**

# చీమలు

## ఎ.ఎం.అయోధ్యా రెడ్డి

భూమికి ఆకాశానికి మధ్య చినుకుల సంబంధం తెగిపోయిన రెండో రోజది – వారంరోజులుగా గైరాజరైన సూర్యుడావేళ మబ్బుల్లోంచి బయట పడేందుకు తెగ గింజుకుంటున్నాడు.

పరిసరాలింకా తడితడిగానే వున్నాయి. రోడ్డుమీదా, రోడ్డు పక్కనా బురద గుంటలు ఎంతకీ మానిపోని పుండ్లలా వున్నాయి.

ఉడిపి హోటల్ ఎంట్రెన్స్ చివరి మెట్టుకి ఎడంవైపు మూల చిన్న కన్నంలోంచి చటుక్కున బయట పడిందో చీమ. రెండు క్షణాలు జాగ్రత్తగా పరిసరాలు పరికించి మెల్లగా ముందుక్కదిలింది. అదట్లా నాలుగంగుళాలు వెళ్ళిందో లేదో.. కన్నం లోంచి బయటకొచ్చిన చీమ దూకుడుగా వొచ్చి మొదటి చీమను కల్సుకుంది.

ప్రశాంతంగా వున్న ఆ వాతావరణంలో చీమలు రెండూ గోడ పక్కగా చిక్కుముళ్ళు పడ్డ దారాల్లా కదుల్తున్నాయి. కింద నేలంతా వర్షాలకి తడిసి రొచ్చురొచ్చుగా వుంది. ఎత్తుపల్లాల్ని... చిన్న చిన్న నీటి మడుగుల్ని జాగ్రత్తగా గమనిస్తూ కాటుక గీతల్లాంటి కాళ్ళతో ఒక్కో అంగుళమే దాటేసి ముందుకు పోతున్నాయి.

వాటిల్లో మరీ చిన్నగా వున్న చీమ మాటిమాటికి వేగంగా కదుల్తూ ముందుకెళ్ళి పోతోంది. అలా నడుస్తుంటే దానికెంతో ఉత్సాహంగా వుంది.

వెనకాలే అతి జాగ్రత్తగా పరిసరాలు గమనిస్తూ వొస్తున్న మొదటి చీమ నీలి, దాని దూకుడు నడక్కి కంగారు పడుతోంది.

"ఒసేవ్ చిట్టీ...! కొంచెం నెమ్మదిగా... చుట్టూ చూసుకుంటూ నడువ్. నీ దూకుడుకు దేనికిందనో పడి చస్తావ్" అంటూ హెచ్చరిస్తోంది.

అక్క పిలుపుల్నెంత మాత్రం ఖాతరు చేయట్లేదు చిట్టి చీమ. గంతులేసినట్టు నడుస్తూ ముందుకెళ్తోంది. మధ్య మధ్య అదే వేగంతో వెనక్కి పరిగెత్తుకొచ్చి అక్క చుట్టూ ఓ రౌండ్ కొట్టేసి, మళ్లా రయ్యిన ముందుకు దూసుకుపోతోంది.

"చెప్తుంటే విన్పించుకోవేమిటే ముండా...! అలా పరిగెత్తి నడమంత్రపు చావు తెచ్చుకుంటావేందే...?"

అరిచి అరిచి నీలి చీమకి నోరు పోతోంది. కానీ చిట్టి ఉరుకులు మాత్రం మానలేదు.

చిట్టి చీమను వెంటబెట్టుకొని బయటకు రావటం నీలి కెంత మాత్రం ఇష్టం లేదు. ఇంటి దగ్గర తల్లి కూడా వొద్దంది. కానీ చిట్టి విన్పించుకోలేదు.

వారం రోజులుగా కురిసిన వర్షాలకు చీమల నివాసం యావత్తూ వరద మయమై పోయింది. తను కొంపల్నీ.. కొంపల్లో సమకూర్చుకున్న కొద్దీ గొప్పా ఆహారాన్నీ వొదిలేసి చీమలన్నీ తలోదిక్కుగా చెల్లాచెదురయ్యాయ్.

ఆ గందరగోళంలో విడిపోయిన నీలిచీమ తండ్రి మళ్ళా కన్పించలేదు. నీళ్ళింకినాక కొంపకు చేరుకుంటే పోగుజేసుకున్నదేమీ మిగల్లేదు.

తల్లీ కూతుళ్ళూ తండ్రి చీమ కోసం ఎంతగానో ఎదురు్చూశారు. కానీ అది తిరిగి రాలేదు. తండ్రి చీమ వరదలో కొట్టుకుపోయిందని కొందరంటే, ఏదో ప్రమాదంలో నలిగి చచ్చిపోయిందని మరి కొందరన్నారు. రాణి చీమ స్థావరంలోకి ఆహారం చేరేస్తుంటే ఏదో గొడవొచ్చి సైనిక చీమలు దాన్ని చంపేశాయనే పుకారు కూడా విన్పించింది.

ఈ ఊహాగానాల మాటెలా వున్నా నీలి చీమకి మాత్రం తండ్రి ఇక తిరిగి రాదని అర్థమైంది.

అలా నాలుగు రోజులు గడిచాయి--

అయిదో రోజు మరి తట్టుకోలేక తినడానికేమైనా తెస్తానని బయటపడింది నీలిచీమ. తండ్రి జ్ఞాపకాలు మనసును కలచివేస్తుంటే పరధ్యానంగా నడుస్తోంది. కళ్ళలోంచి ఉరుకుతున్న అశ్రువుల్ని వొత్తుకోవాలన్న ధ్యాస కూడా లేదు.

"ఎందుకక్కా ఏడుస్తున్నావ్...? నాన్న గుర్తొచ్చాడా?" అన్న చిట్టి పలకరింపుతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి కొచ్చింది. నీలిచీమ. తన కన్నీళ్లు తుడుస్తున్న చెల్లెలి లేత చేతుల్ని ప్రేమగా ముద్దు పెట్టుకుంది.

"నాన్న ఎక్కడి కెళ్ళాడక్కా.....?" అడిగింది చిట్టి అక్క పక్కనే నడుస్తూ.

"తెలియదమ్మా! వరదొచ్చి మన కొంపలు కొట్టుకు పోయిన్నాడు పోయాడు. ఇంతవరకూ రాలేదు. ఎక్కడున్నాడో... ఏమిటో"

"నాన్న నెవరో చంపేసారట కదా??.! నిజంగానే నాన్న చచ్చిపోయాడా అక్కా.....?"

ఈ ప్రశ్నకు నీలిచీమ వెంటనే జవాబు చెప్పలేకపోయింది. - "నాన్న చచ్చి పోలేదమ్మా... త్వరలోనే తిరిగొస్తాడు -" అంది.

"సైనిక చీమలంటే ఎవరక్కా?" మళ్ళీ అడిగింది చిట్టి.

"వాటిని రక్షక భటులంటారమ్మా. ఇంకా సిపాయి చీమలని కూడా అంటారు. అవి రాణివాసంలో వుంటాయి -"

"రాణివాసమంటే...?"

"రాణి చీమ స్థావరం"

"అదెక్కడుంది...! మనం ఒకసారి వెళదాం అక్కా" కుతూహలంగా అంది చిట్టిచీమ.

"మనల్నక్కడికి రానివ్వరమ్మా. పనిచేసే పెద్ద చీమలకి మాత్రమే అందులో ప్రవేశం-"

"ఏం పని చెయ్యాలక్కడ...?"

"ఒక్కటేమిటి...? ఇళ్ళు తుడవటం, రొడ్డూడవటం దగ్గర్నుంచి రాణివాసంలో ప్రతిపనీ చెయ్యాలి. అన్నిటికన్నా ముఖ్యం సాయంత్రానికల్లా ఎంతో ఒకంత ఆహారాన్ని సంపాదించి అక్కడ అందజెయ్యాలి-"

"మరి వాళ్ళందరి కేం మాయరోగమొచ్చిందక్కా...? వాళ్ళ కూడు వాళ్ళు సంపాదించుకోలేరా...? వాళ్ళకు మనమెందుకు తెచ్చిపెట్టాలి...?"

"ఉష్... గయ్యాళిముండా...! కాస్త మెల్లిగా మాట్లాడు. సిపాయి చీమేదైనా విన్నదంటే మనల్ని బతకనివ్వదు. రాణివాసమంటే ఏమిటనుకున్నావ్..? అది సర్కారు. అక్కడుండే వాళ్ళంతా సర్కారోళ్ళన్నమాట. వాళ్ళు పన్చెయ్యరు. చెయ్యకూడదు. మన నివాసంలో వుండేవన్నీ బానిస చీమలన్నమాట. శ్రామిక చీమలని మనక్కొంచెం పరువుగల పేరు కూడా వున్నదనుకో. ఈ శ్రామిక చీమలన్నీ రాణివాసంలో వుండే సర్కారు చీమలకి ఆహారం తెచ్చిపెట్టాలి. వాళ్ళు దయదల్చి ఏదన్నా ఇస్తే అది మనం తినాలి-"

"ఏమిటీ...! కాలే కడుపులతో మనం చెట్టూ పుట్టా తిరుగుతూ ఆహారాన్ని సంపాదించి వాళ్ళకివ్వాలా...? వాళ్ళు దయదల్చి మిగిల్చిన ఎంగిలికూడు మనం తినాలా...? థూ...! మనయేం బతుకులక్కా...?" చీదరించుకుంది చిట్టిచీమ. అక్కను మరింకేం ప్రశ్నించకుండా విసురుగా ముందుకు నడిచింది.

నీలిచీమ చూపులు హఠాత్తుగా రెండడుగుల దూరంలో వున్న తెల్లటి ఆకారం మీద పడ్డాయి. చిట్టిని హెచ్చరిస్తూ నడకలో వేగాన్ని తగ్గించింది.

చాలా పెద్ద ఆకారమది. నీలిచీమ కళ్ళు పైకెత్తి చూస్తే తప్ప ఆసాంతం కనపడలేదు. చిట్టి కూడా దాన్ని గమనించి భయంతో అక్క వెనకాల నక్కింది.

నడక పూర్తిగా ఆపి చుట్టూ పరిశీలనగా చూసింది నీలి. కనుచూపు మేరలో ఏ ప్రమాదమూ లేదు.

ఉన్నట్టుండి ఓ గాలి తెర పెద్దగా వీచింది. పైన గోడమీద కిటికీలోంచి ఎవరో చెత్త బయటకు విసిరేశారు. ఊపిరి బిగపట్టి ఉన్నచోటునే కరుచుకొని వుండిపోయింది నీలిచీమ.

నిముషం తర్వాత కళ్ళు విప్పేసరికి ఇందాక కన్పించిన తెల్లటి ఆకారం నీలికి పూర్తి దగ్గరకొచ్చేసింది. దాన్ని చూసి చిట్టిచీమ భయంతో అరిచి అక్కణ్నుంచి వేగంగా పారిపోయింది.

నీలి గుండెలు ఝల్లుమన్నాయి. ఎదురుగా కొండలాంటి ఆకారమేమిటో అర్థం కాలేదు. రెండు నిముషాలు గడిచినా అది కదలకుండా వున్న చోటునే వుండటంతో ధైర్యాన్ని కూడగట్టుకొని ఆ ఆకారానికి మరింత దగ్గరగా నడిచింది.

దానిచుట్టూ రెండు రౌండ్లు తిరిగింది. ఏదో పరిచయమైన వాసన దాని నాసికాపుటాలకి సోకింది. ఊపిరిగట్టిగా పీల్చి ఆ వాసనేమిటో పసికట్టిన నీలి ఆనందంతో ఎగిరి గంతేసింది.

అదో రొట్టెముక్క...! 'కొండంత' ఆహారం...!

నీలిచీమ ఇంకా దగ్గరగా వెళ్ళి చేతుల్తో తడిమి చూసింది. అవునది రొట్టెనే. మెత్తగా కూడా వుంది.

నీలికి పట్టరాని సంతోషం కల్గింది. వాళ్ళ స్థావరంలోని శ్రామిక చీమలన్నింటికీ కనీసం రెండు రోజులకు సరిపోయే ఆహారమది. అంత ఆహారాన్ని ఒకేచోట కనుగొన్నందుకు ఎంతో గర్వపడింది నీలిచీమ.

ఆ సంతోషంలో చెల్లెలు గుర్తొచ్చి చుట్టూ చూసింది. చిట్టి కన్పించలేదు.

ఆ ప్రాంతమంతా కలియదిరిగింది. చెల్లెలు జాడ లేదెక్కడా. నీలిచీమకి కంగారు పుట్టింది. ఓ పక్క పెద్ద యెత్తున ఆహారం దొరికినందుకు సంతోషపడాలో, చెల్లెలు గురించి ఆందోళనపడాలో చప్పున తెలియలేదు.

ఆ ప్రదేశంలో ఇక ఒంటరిగా వుండటానికి భయమేసి తమ స్థావరం కేసి పరుగందుకుంది.

☆ ☆ ☆

ఆ స్థావరంలో నివాసముండేవన్నీ శ్రామిక చీమలే. అందరి సమస్యలూ దాదాపు ఒక్కటే కావటం, పొద్దు గూకులూ ఒకే అధికారం కింద చాకిరీ చెయ్యటం, ఆకలి జబ్బు అక్కడ అందరికీ సర్వ సాధారణం కావటం - ఇవన్నీ ఆ చీమల్ని కల్సికట్టుగా వుండేలా చేశాయి.

నీలిచీమ ఉరుకులు పరుగులతో స్థావరాన్ని చేరుకునేసరికి తమ ఇంటిముందు పెద్ద గుంపు పోగై వుండటం కన్పించింది.

అన్ని చీమలు తమ ఇంటి ముందు ఎందుకున్నాయో అర్థంగాక ఆశ్చర్యంతో పాటు భయం కూడా కలిగింది. 'కొంపదీసి... చిట్టికేదైనా జరిగిందా...?' ఈ యోచన రాగానే కంగారుగా ముందుకొచ్చింది నీలి.

అల్లంత దూరాన్నే నీలిని పోల్చుకున్నాయి చీమలన్నీ. ఎదురొచ్చి ఆమెను చుట్టుకున్నాయి. -"నీ కడుపు చల్లగుండ...! నీలీ... నీకేం కాలేదుగద బిడ్డా...! అందరం ఎంత కంగారుపడ్డామో" నీలిచీమను కావలించుకుంటూ అంది తల్లి చీమ.

"కంగారెందుకే అమ్మా...?"

'అదేమిటమ్మాయ్... అలా అడుగుతావ్...? ఏదో భూతం నీమీద దాడి చేసిందని చెప్పింది చిట్టి. ఆ భూతాన్ని చూసి భయపడి నీ చెల్లెలు ఇంటికి పరిగెత్తుకొచ్చింది. దాని మాటలు విన్నాక మాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఇక మీ అమ్మకైతే ఒకటే ఏడుపు - గుంపులో వయసుడిగిన ఓ చీమ అంది.

అంతా విని బిగ్గరగా నవ్వింది నీలి. చీమలన్నీ తనవంక విచిత్రంగా చూడటంతో

నవ్వునాపి అక్కడ జరిగింది వివరించింది.

"నువ్వు చెప్పున్నది నిజమేనటే నీలీ...? నువు చూసింది నిజంగా రొట్టేనా...?" అనుమానంగా చూస్తూ అడిగిందో ముసలిచీమ.

"అమ్మతోడు తాతా...! నిజంగానే అది కొండంత రొట్టె. మన గూడెమంతటికీ రెండురోజుల దాకా తిండి దిగులక్కర్లేదు. నా మాట విని అంతా అక్కడికి పదండి త్వరగా. పెద్దజాతి చీమలో... సిపాయి చీమలో చూశాయంటే మన నోట్లో దుమ్ము పడ్తుంది-" నీలిచీమ అందర్నీ తొందరపెట్టింది.

చీమలన్నీ హర్షధ్వానాలు చేశాయి. కొన్నిచీమలైతే నీలిని ప్రేమతో ముద్దు పెట్టుకున్నాయి.

క్షణాల మీద ఈ వార్త స్థావరమంతా పాకిపోయింది. చిన్నా పెద్దా చీమలన్నీ కట్టగట్టుకొని ముందుక్కదిలాయి. నీలి ముందు దారి చూపిస్తుంటే చీమలు చాలా వేగంగా నడిచి ఉడిపి హోటల్ వెనుక చెత్తకుప్ప దగ్గరకు చేరుకున్నాయి.

నీలిచీమ చూసిన ఆహారం ఇంకా అక్కడే వుంది. శ్రామిక చీమలన్నీ అభినందిస్తు న్నట్టుగా చూశాయి నీలివంక.

ఆ ఆహారపు కొండను తరలించడానికి క్షణాల మీద వ్యూహం తయారైంది. రొట్టెముక్క చుట్టూ చేరి చీమలన్నీ దాన్ని కరిచి పట్టుకున్నాయి. మరోక్షణంలో వాటి మహాప్రస్థానం మొదలయ్యేదే.

ఇంతలో

"ఆగండి...! ఎవ్వరూ కదలడానికి వీల్లేదు. ఆ ఆహారం మాది" అనే పిడుగులాంటి స్వరం విన్పించింది.

శ్రామిక చీమలు ఉలిక్కిపడుతూ అటు చూశాయి. దాదాపు వందకు పైగా వున్న గండు చీమల దండు దూకుడుగా ముందుకొచ్చి చూస్తుండగానే రొట్టె చుట్టూ వలయాకారంగా నిలబడ్డాయి. వాటి వాలకం చూస్తుంటే యుద్ధానికి సిద్ధపడే వొచ్చినట్టున్నాయి.

"ఈ ఆహారం మాది. అడ్డు తొలగండి-" అన్నాడు గండుచీమల నాయకుడు బిగ్గరగా.

ఆ గద్దింపుకు రొట్టెను కరిచి పట్టుకున్న చీమలన్నీ దాన్నొదిలేసి నోట మాట రానట్టుండిపోయాయి. అందరికన్నా ముందుగా నీలిచీమ తేరుకుంది. రెండడుగులు ముందుకేసి "ఈ రొట్టెను ముందుగా కనుగొన్నది నేను. ఇది చూడగానే మా స్థావరానికెళ్ళి మావాళ్ళను పిల్చుకొచ్చాను. ఈ ఆహారం మాదే" అంది.

"ఏంటిదే పోరీ...! ఏమో బాగా మాట్లాడుతున్నవ్...? నువ్వు చెప్పే కట్టుకథలు ఇక్కడెవరూ నమ్మరు. నీకన్నా కొద్ది నిముషాలు ముందే ఈ రొట్టెను మేము చూశాం. మర్యాదగా పక్కకి తొలగుతారా... లేదా...?" అందా గండుచీమ మళ్లీ గుడ్లురుముతూ.

"కాదు - ముందు నేనే చూశాను. దీన్ని నేను చూసినప్పుడీ ప్రదేశంలో ఎవ్వరూ లేరు. ఇది మాదే. మా తిండి లాక్కోవడం అన్యాయం-"

"అవును అన్యాయం...!" అన్నాయి మిగతా చీమలు నీలికి జతగా.

"నోరుముయ్యండి...! మీరా నాకు న్యాయం చెప్పేది...? గట్టిగా అరిచింది గండుచీమ. "ఈ ఆహారం మాది. మేం ఏది చెప్పితే అదే న్యాయం. బలమున్నోడు ఎక్కడుంటే అక్కడే వుంటుంది న్యాయం. ఈ ఆహారాన్ని ఎవరు ముందు చూశారనేది నాకు అనవసరం. ఇదిప్పుడు మేం తీసుకుపోతాం. అదే న్యాయం. దీనికి మీ దిక్కున్నచోట చెప్పుకోండి. నడవండిక్కణ్నుంచి-"

ఈనలిచీమకేం చెయ్యాలో తోచలేదు. తనవాళ్ళకేసి తల తిప్పింది. అంతా దీనంగా చూస్తున్నారు. చివరి ప్రయత్నంగా మరో రెండడుగులు ముందుకేసి గండుచీమల నాయకుణ్ని ప్రాథేయపడింది.

"బాబుగారూ...! ఈ రొట్టె నిజంగా మాదే. మేమే ముందు చూశాం. దయచేసి ఒక్కసారి మావాళ్ళ కడుపులు చూడండి ఎట్లా లోతుకుపోయాయో. ఆ మొహాలు చూడండి ఎంతలా వాడిపోయాయో. వరదొచ్చి మా గూడెమంతా కొట్టుకుపోయింది అయిదు రోజుల్నించి అందరికీ పస్తులే. మామీద కనికరించండి...! ఇప్పుడీ రొట్టె మీరు లాక్కుపోతే మేమంతా ఆకలికి మాడి చచ్చిపోతాం-"

"ఏమిటీ.. చచ్చిపోతారా...? భేషుగ్గా చావండి!" వికటంగా నవ్వింది గండుచీమ. "ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఊ... చూస్తారేమిటి.. లాక్కుపదండి ఆహారాన్ని" అంటూ తన వాళ్ళకి ఆదేశాలిచ్చింది.

నిస్సహాయంగా తల పంకించింది నీలిచీమ. నోటి ముందు కొచ్చిన కూడు చిటికెలో తన్నుకుపోతున్న గండుచీమల్ని చూసి కడుపు దహించుకుపోయింది శ్రామిక చీమలకి.

అవి తమకన్నా బలవంతులైతే కావొచ్చు...! పెద్ద జాతివైతే కావొచ్చు...! కానీ ఆకలికి జాతుల తేడా లేదు. ఆకలితో అలమటించే తమ కడుపుల మీద కొడుతుంటే చూస్తూ ఊరుకోవాల్సిందేనా...?

ఈ అన్యాయం ఎందుకు జరగనివ్వాలి...?

ఆకలికి ఆగ్రహం తోడై శ్రామిక చీమల చూపులు ఎర్రబడ్డాయి. ఏదో నిశ్చయంతో వాటి చేతులు బిగుసుకున్నాయి.

నీలిచీమ ఇది గ్రహించింది. గండు చీమలవైపు చూస్తూ తెగింపుగా, "ఆగండి...! మీరు పెద్దోళ్ళయితే కావచ్చు. కానీ అన్యాయంగా మా కూడు లాక్కుపోతుంటే మేం చూస్తూ ఊరుకోం. మీ కండల్లో బలముంటే మా కడుపుల్లో ఆకలుంది. మా ఆకలి మంట నిప్పులు చిమ్ముతుంది. ఆ వేడికి మీరంతా కాలి మసై పోతారు. మర్యాదగా ఇక్కణ్నుంచి వెళ్లండి-" అంది.

నీలిచీమ హెచ్చరిక గండుచీమల ఆగ్రహాన్ని విపరీతంగా పెంచేసింది. మరో యోచన లేకుండా అవి శ్రామిక చీమల మీద విరుచుకుపడ్డాయి.

మరోక్షణంలో అదో యుద్ధరంగమైంది. కండబలం పుష్కలంగా వున్న గండు చీమలకూ, తెగింపుతో ముందుకురికిన శ్రామిక చీమలకూ మధ్య భీకర పోరాటం జరిగింది.

కాస్సేపట్లో అక్కడ శవాల గుట్టలు పోగులు పడ్డాయి. పోరాటంలో వందలకొద్దీ శ్రామిక చీమలు చచ్చిపోయాయి. మిగతావి పారిపోయాయి.

గండు చీమలన్నీ విజయగర్వంతో గంతులేసాయి.- "యుద్ధంలో మనమే గెల్చాం. ఈ ఆహారం ఇక మనదే. పదండి లాక్కెళదాం" అన్నాడు నాయకుడు బిగ్గరగా.

☆ ☆ ☆

నాయకుని ఆదేశంతో రొట్టె చుట్టూ వున్న శ్రామిక చీమల మృతదేహాలను తొలగించేశాయి గండుచీమలు.

ఆహారాన్ని తరలించడానికి వ్యూహం తయారైంది. కార్యాచరణకు పూనుకున్నాయన్నీ. గండుచీమల పట్టుకి రొట్టె చిన్నగా కదిలింది.

ఇంతలో -

ఉన్నట్టుండి గాల్లోకి లేచింది రొట్టె. భయంతో కెవ్వున అరిచి చిందరవందరయ్యాయి చీమలన్నీ.

రొట్టెను పాములా చుట్టుకున్న అయిదు వేళ్ళు. ఆ వేళ్ళ తాలూకు చెయ్యి మరింత పైకి లేచి చూస్తుండగానే కన్పించకుండా పోయింది.

కదిలిపోతున్న ఆ మానవ భూతాన్ని కళ్ళనీళ్ళతో నిస్సహాయంగా చూస్తుండిపోయాయి గండుచీమలు.

– ఆంధ్రజ్యోతి 1990 ప్రమోద దీపావళి ప్రత్యేక సంచిక

# అంతర్వాహిని

## పి. అజయ్‌కుమార్

రైలు కొవ్వూరు స్టేషన్ దాటింది.

నా హృదయ స్పందన పెరిగింది. రాత్రంతా మెలకువగా ఉండి నేను ఎదురుచూస్తున్న క్షణాలు వచ్చేస్తున్నాయి. ఊపిరి బిగపట్టి కిటికీలోంచి బయటికి చూస్తున్నాను.

పల్చగా పరుచుకున్న చీకటి.

చెరకుతోటలూ, కొబ్బరిచెట్లూ వేగంగా వెనక్కి వెళ్లిపోతున్నాయ్. వెన్నెల్లో స్నానం చేస్తున్న మహావృక్షాలు.

రెండు నిమిషాలు గడిచేలోపే కనిపించింది.

ముందు దూరంగా, తర్వాత విస్తృతంగా, రైలు బ్రిడ్జిమీదికి వచ్చేసరికి అనంతంగా...

"గోదావరి"

అలల చేతులు చాచి అమ్మలా ఆహ్వానిస్తోంది. గుండెపటం మీద అవ్యక్త అనుభూతులు రెక్కలు తొడుక్కుంటున్నాయి. ఎటు చూసినా గలగల ధ్వనిస్తూ కాలంలా కదిలిపోతున్న నీటి ప్రవాహం. వెలుతురులాంటి చీకటిలో ఆర్పేసిన లాంతరులా నది ఒడి చేరిన చందమామ... నీటి ఒంపులో తడిసిపోయిన నక్షత్రాల మసక వెలుగు...

కనురెప్ప వేసే సమయాన్నీ వృధా చేయకూడదని అత్యాశ పడుతోంది నా మనసు.

గోదావరి – ఎందరు మహారాజుల వైభవాల్ని తనలో నిక్షిప్తం చేసుకుందో, ఎందరు అంతఃపురకాంతల సౌందర్యాల్ని స్పర్శించి తరింపచేసిందో, ఎందరు కవుల ఊహలకు ప్రాణంపోసి అజరామరమైన సాహిత్యాన్ని సృజించిందో... తెల్లవారే సంధ్యావాకిట అలసిన శృంగార దేవతలా, సూర్య ప్రతాపం చెలరేగే వేళ జీవితతత్వాన్ని శోధించిన సహోదరిలా, సాయం సమయంలో గుండెలకి పొదవుకుని సేదదీర్చే తల్లిలా, మునిమాపువేళ అలకచెందిన విరహిణిలా, వెన్నెల కౌగిట్లో పరవశించే సమయాన ఫక్కున నవ్విన ప్రేయసిలా... ఎన్ని రూపాల్లో, ఎంత వైవిధ్యాన్ని చూపిస్తుంది గోదావరి.

"ఠంగ్"

పక్కనే ఏదో శబ్దమయ్యేసరికి ఉలిక్కిపడి తలతిప్పి చూసాను. ఎవరో పండు ముసలావిడ. డెబ్బై ఏళ్లుంటాయేమో... నుదుట విభూది రేఖలు... గోదాట్లో నాణెంవేసి భక్తితో నమస్కారం చేస్తోంది. జీవనవృక్షాన్ని తాకిన ఆ చేతులు చలికి వణుకుతున్నాయి.

ఎందుకో తెలియని ఆనందం కలిగింది నాకు. పెట్టెలో జనం గురకపెట్టి నిద్ర పోతూనే ఉన్నారు. 'అమృతం కురిసిన రాత్రి అలవాటునీ, అస్వతంత్రతనీ కావలించుకుని అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేని' మనుషులు తామే అనిపించేలా! నేనూ, ఆ ముసలావిడా మాత్రమే మెలకువగా ఉన్నాం.

మళ్లీ చూపు మళ్లింది -

ఈసారి గోదారి మధ్య లంకలు కనిపిస్తున్నాయి. వాటిమీద రెల్లుపూల ఆనందనృత్యం. మంచులా కరిగిపోతున్న దృశ్యాల్ని తనివితీరా పట్టుకుని, ఎవ్వరూ - ఎప్పటికీ తాకలేనంత భద్రంగా దాచుకోవాలన్న కోర్కె - మత్తుగాలిలా!

ఆ కోర్కె ఆసాంతం తీరకముందే తీరం వచ్చేసింది. అదిగో... ఒడ్డునే బ్రహ్మాండమైన రావిచెట్టు.... చెట్టునీడనే ధ్యానంలో మునిగిన దేవాలయం... బహుశా ఆ గుడి గోపురాల మధ్య తెల్లటి పావురాలు ఆదమరచి నిద్రలో మునిగి ఉంటాయి. అబ్బ - ఎన్నేళ్ల తర్వాత మళ్లీ రాజమండ్రిని చూస్తున్నాను.

గుండెల్నిండా గాలి పీల్చుకుని వదిలాను. ఆ గాలితోపాటు ఏదో పవిత్రశక్తి నా నరనరాల్లో ప్రవేశించిన ఫీలింగ్.

రైలు వేగం తగ్గిపోయింది. స్టేషన్ దగ్గర పడినట్లుంది. దూరంగా సినిమా థియేటర్లు, చీకట్లో మునగదీసుకొని పడుకుని ఉన్న పెంకుటిళ్లు.

ప్లాట్‌ఫాం వచ్చేసింది. ఇంకా రైలు ఆగకముందే నలుగురైదుగురు పోర్టర్లు లోపలికి ఎక్కేశారు.

"కూలీ.... కూలీ..."

ఎవరి లగేజీనో మోసేందుకు ఎవరికి వాళ్లే తొందరపడుతున్నారు. కంపార్ట్‌మెంటులో చాలామంది హడావుడిగా నిద్రలేచిపోయారు. నాకు భలే చిత్రం అనిపించింది. గోదావరి ఘోష విని పక్కకి కూడా కదలని మనుషులేనా పోర్టర్ల అరుపులు విని ఆదరాబాదరా నిద్రలేస్తోంది?

"మీరు కాస్త తప్పుకుంటారా.. మేం దిగాలి"

ఇరవై ఏళ్లదానిలా అలంకరించుకున్న ముప్పై ఏళ్లావిడ విసుక్కుంది నా మీద. ఆవిణ్ణి చూసి ఆశ్చర్యపోయాను. రాత్రంతా నిద్రపోయి లేచినా ఇప్పుడే ఫ్రెష్‌గా తయారైనదానిలా కళకళలాడుతోంది. మేకప్పు వేసుకోవడంలో ఆవిడకున్న ప్రావీణ్యాన్ని మెచ్చుకోలేకుండా ఉండలేకపోయాను.

"మాష్టారూ... మిమ్మల్నే"

మరోసారి హెచ్చరించిందావిడ. ఈసారి ఆశ్చర్యంతోపాటు ఉలికిపాటు తప్పింది కాదు నాకు. మాష్టారూ అంటోంది. ఆవిడకన్నా హీనపక్షం మూడునాలుగేళ్లు చిన్నవాణ్ణయి ఉంటాను. అయినా అలా సంబోధిస్తోందంటే, ఆవిడలో తాను చాలా చిన్నపిల్లనన్న కాంప్లెక్స్ పెరిగి పెద్దదై ఉండాలి... లేదా వయసుకు మించిన ఆలోచనలు నన్నలా ఎక్స్‌పోజ్ చేసి ఉండాలి. రెంటిలో ఏది కరెక్టో తేలకముందే ఆవిడ నన్ను తోసుకుంటూ దూసుకుపోవడం, పోర్టరు నావైపు చూసి 'ఏమదృష్టం' అన్నట్లు నవ్వడం రెండూ జరిగి పోయాయి.

ఎందుకో ఉక్రోషం పొంగుకొచ్చింది నాలో. గబగబా వెనకే వెళ్లాను. అప్పటికే పెట్టె దిగిపోయిందామె. గుమ్మం దగ్గిర నుంచుని పోర్టర్‌తో పాటు అందరికీ వినిపించేలా గట్టిగా చెప్పాను.

"క్షమించండి పిన్నిగారూ... పరధ్యానంలో ఉండి మీకు దారి ఇవ్వలేదు"

ఆవిడ ముఖంలో ఎన్ని రంగులు మారాయో చూసేందుకు ఆగలేదు నేను. వేగంగా బర్త్‌వైపు నడిచాను సూట్‌కేస్ కోసం. వెనకనుంచి ఎవరో పగలబడి నవ్విన శబ్దం మాత్రం వినిపించింది.... బహుశా పోర్టర్‌ది కావచ్చు.

ఐదు నిమిషాల తర్వాత నల్లకోటు తొడుక్కున్న పెద్దమనిషి చేతిలో తెల్లటికెట్టు పెట్టి బయటకొచ్చాను. అప్పటికే తూరుపుదిక్కు ఎర్రబడింది. సన్నటి వెలుతురు మంద్రంగా వ్యాపిస్తోంది. చల్లటిగాలి ఒంటికి తగిలి ఝల్లుమనిపించింది. అనుమానం వచ్చి తల పైకెత్తి చూద్దునుకదా... ఆకాశం నిండా నల్లటి మేఘాలు దట్టంగా అలుముకుంటున్నాయి.

"అసలీ రాజమండ్రిలో వింతేమిటో కానీ అప్పటివరకూ వెన్నెల మైదానంలా ఉండే ఆకాశం అంతలోనే మేఘాల పుష్పాలు తురుముకుని వర్షకుంతలాలు విదిలిస్తుంది" మనసులోనే అనుకుంటుంటే పిల్చారెవరో...

"బాబూ... రిక్షా కట్టమంటారా?"

"ఆహా.... నిక్షేపంలా ఆ చెట్టుకి కట్టేయ్. నాకేం అభ్యంతరం లేదు" స్కూలు రోజుల్నాటి జోక్ చెప్పబోయి ఇప్పుడలా అంటే బాఫుండదని సంభాళించుకుంటూ అడిగాను -

"దానవాయిపేట వెళ్లాలి. ఎంతివ్వమంటావ్?"

"ఎనిమిది రూపాయలిప్పించండయ్యా"

"పదివ్వండి సార్. రెండు నిమిషాల్లో దింపేస్తాను"

ఈ కొత్త గొంతెవరిదాని చూద్దునుకదా - ఆటోవాడు. ఒళ్లుమండింది నాకు. ఇంతదూరం వచ్చినా ఈ ఆటోల బెడద తప్పేలాలేదు.

"నీకే పదిస్తాను కానీ... కాస్త నిదానంగా పోనీ" చటుక్కున రిక్షా ఎక్కి చెప్పాను.

రిక్షా అతని ముఖం ఆనందంతో విప్పారింది. ఆటోవాలా మాత్రం గొణుక్కుంటున్నాడు.

"ఎవడి వెర్రి వాడికానందం..."

వాడి మాటలకి నవ్వుకున్నాను. వాడికేం తెలుసు. టాపు తీసిన రిక్షాలో రాజమండ్రి అందాల్ని కొద్దికొద్దిగా ఆస్వాదిస్తూ వెళ్లడంలో ఎంత ఆనందం ఉందో?

దబ్బున రిక్షా గోతిలో పడేసరికి ఈ లోకంలోకి వచ్చాను

"ఈ రోడ్డింతేబాబూ" దిగి పైకి లాగుతూ అన్నాడు రిక్షా అబ్బి. ఎందుకోగానీ తిలక్ గుర్తొచ్చాడు. మళ్లీ ప్రయాణం.... మాతోబాటే ఆకాశంలో మేఘాల పాయలు.

జూనియర్ కాలేజీ ముందు నుంచి వెళ్తోంది మా రిక్షా.

"జయలక్ష్మిగారెలా ఉన్నారో" కాలేజీని చూడగానే అనుకున్నాను. 'తెలుగు టీచర్‌జీ' పదాన్ని షార్ట్‌కట్ చేసి 'టీజీ' అని పిలిచేవాళ్లం అప్పట్లో మేమంతా. ఆవిడకి తెలుగు చాదస్తం పాలుకాస్త ఎక్కువ. ధర్మామీటర్ని కూడా 'జ్వరమానిని' అంటుంటే తెగ నవ్వేవాళ్లం.

రిక్షా టర్న్ తీసుకుని ఇన్నీసుపేట వైపు తిరిగింది. ఆ ఇళ్లూ, ఆ దేవాలయాలు చూస్తుంటే తప్పిపోయిన పిల్లవాడు ఇంటికి చేరినంత సంబరం కలుగుతోంది. ఔన్నిజమే... ఇది మాత్రం తప్పిపోవడం కాదూ?.... ఇంటినుంచే కాదు. ఏకంగా జీవితాన్నుంచే తప్పిపోవడం. నగరాల్లో ఏముంటుందనీ - సొమ్మూ, సిమ్మెంటూ తప్ప! అక్కడ మనుషులకి ముఖాలు మాత్రమే ఉంటాయి. మనసుండాల్సిన స్థానంలో శూన్య ప్రదేశం వెక్కిరిస్తుంటుంది. సూర్యోదయాలూ, సూర్యాస్తమయాలూ అన్నీ పెట్రోలు పొగచాటున కప్పబడిపోతాయి. పొద్దున్నే లేవడం, కడుపు అర తలుపు తీసి గుప్పెడు మెతుకులు లోపల పెట్టి తాళం వేయడం, కొక్కేనికి తగిలించిన చిర్నవ్వు తీసి ముఖానికి అతికించుకుని వీధిలో పడడం... ఆప్యాయతలకీ, అనుబంధాలకీ కూడా టైమ్ టేబుల్ వేసుకుని కాలంతో కొలవడం అక్కడే సాధ్యం.

"ఎటు వెళ్లాలి బాబూ"

రిక్షా అతను ప్రశ్నిస్తున్నాడు. పరధ్యానంలోంచి బయటపడి చూద్దును కదా అప్పుడే పాండురంగడి గుడివరకూ వచ్చేశాం.

"అదిగో ఆ వీధే" ఉత్సాహంగా అరుస్తూ చేత్తో చూపించాను. అప్పటికే నా ధోరణి అలవాటైనట్లుంది. నవ్వుతూ సందులోకి తిప్పాడు.

రోడ్డుకి రెండు పక్కలా కొమ్మల తలలూపుతూ సంతోషం వీస్తున్న పొగడపూల చెట్లు. వాటికింద నుంచి వెళ్తుంటే నా బాల్యం రేకులు రేకులుగా స్మృతులు విచ్చుకుంటోంది.

"ఆ మూడో ఇల్లు... ఆఁ ఆ పెంకుటిల్లే" హుషారుగా అన్నాను. పక్కకి తీసుకుని ఆపాడు. డబ్బులిచ్చి కిందికి దిగి చూశాను.

ఇంటి ముందంతా చక్కగా కళ్లాపిజల్లి, అప్పుడే కోసి తెచ్చిన తెల్లకలువల్లాంటి ముగ్గులతో ఆర్ద్రంగా కనిపిస్తోంది.

టైమ్ చూసుకున్నాను. ఆరు కావస్తోంది.

ముగ్గులు తొక్కకుండా జాగ్రత్తగా వాకిట్లోకి వెళ్లి పిలిచాను.

"అత్తయ్యా.."

రెండు క్షణాల తర్వాత ఎవరో వస్తున్న శబ్దం వినిపించింది. ఇంకెవరు? అత్తయ్యే.. నన్ను చూస్తూనే ఆనందంగా పిలిచింది.

"ఒరేయ్... క్రిష్ణుడూ..."

"బావున్నావా అత్తయ్యా"

నామాట వినిపించుకోకుండానే లోపలికి పరుగెత్తింది.

"ఏమండీ.. కృష్ణుడొచ్చాడండీ"

అత్తయ్య హడావుడికి నవ్వొచ్చింది. ఇంతలోనే మావయ్య వచ్చేశాడు.

"ఏరా.. ఇంతకాలానికి గుర్తొచ్చిందా ఈ ఊరు"

మావయ్యవంక తేరిపార చూశాను. అప్పటికీ ఇప్పటికీ పెద్ద తేడా లేదు. తల మాత్రం బాగా పండిపోయింది. ఆయన కూడా నావైపు ప్రేమగా చూసి గబుక్కున అక్కున చేర్చుకున్నాడు. పెట్టె కింద పడేసి ఆయన్ని పట్టుకున్నాను. ఆ చేతులు.. చిన్నప్పటినుంచీ నా చిలిపి చేష్టల్ని భరించి, నన్ను తీర్చిదిద్దిన ఆ చేతులు ఆప్యాయంగా నా ఆత్మని తడుముతుంటే కదిలిపోకుండా ఎలా ఉండగల్ను?

"అమ్మెలా ఉందిరా"

"బావుంది మావయ్యా.. తనూ రావాలనుకుంది. కానీ ఈ వయసులో ప్రయాణం చేయలేక..."

నా మాట పూర్తికాకముందే అత్తయ్య వచ్చేసింది.

"అయ్యయ్యో... వాణ్ణి కాస్త ఇంట్లోకి రానిస్తారా? అలా వీధిలోనే కబుర్లలో పడిపోతారా" సన్నగా మందలిస్తూ చెంబుతో నీళ్లందించింది. కాళ్లు కడుక్కుని మావయ్య సూట్‌కేస్ తీసుకోబోతుంటే వారించి ముందు గదిలోకి నడిచాను.

గదిలో ఎదురుగా కనిపిస్తోంది నాన్నగారి ఫోటో. పక్కనే మేమందరం కలిసి దిగిన గ్రూపు ఫోటో. నా కళ్లు గదినంతా పరికించి చూశాయి... మనసులో ఏదో సంతృప్తి. ఇల్లేమీ మారలేదు. అమ్మ ఇంటిని ఎలా పెట్టుకునేదో అలాగే ఉంచింది అత్తయ్య. దేవుడి విగ్రహాలు, గోడల మీద రాసిన శ్లోకాలు...!

పూజగదిలోంచి కర్పూరం, అగరొత్తులు కలిసిన వాసన వింతగా వస్తోంది. మధ్య గదిలోంచి కావచ్చు ఎమ్మెస్ సుబ్బలక్ష్మి గొంతు మధురంగా వినిపిస్తోంది.

"కూర్చోరా క్రిష్ణుడూ" మావయ్య హెచ్చరించాడు.

"వైదేహి లేదా మావయ్యా"

నవ్వాడు... ఆ నవ్వుతోపాటే మధ్యగదిలోంచి వినిపించింది మువ్వల సవ్వడి.

"అదిగో వస్తున్నట్లుంది"

చేతిలో కాఫీ గ్లాసుతో వచ్చింది వైదేహి. అదే చిర్నవ్వు. బిగించిన వీణియ తీగెని వేలికొసలతో మీటినట్లు చిర్నవ్వు.

"ఎలా వున్నావు బావా"

అప్పుడే తలంటి స్నానం చేసినట్లుంది. నల్లటి వెంట్రుకల మధ్య నుంచి నీటి బిందువులు నేల మీదకి జారుతున్నాయి. ముక్కుపుడక మీద విశ్లేషిస్తున్న ఉదయకాంతి. జాజిపూలు పేర్చినట్లు పలువరస...

"ఏమిటి బావా చూస్తున్నావు"

ఏదో చెప్పబోయాను.

"మీరు మాట్లాడుతుంగండిరా... నేను పేపరు తీసుకుని వస్తాను"

మావయ్య అక్కడి నుంచి ఎందుకు వెళ్ళిపోయాడో తేలిగ్గానే ఊహించుకోగలను.

"ఏమిటి కొత్త మర్యాద? స్నానం, పూజ కానివ్వకుండా కాఫీ తాగానా ఎప్పుడైనా" ఆరేళ్ల తర్వాత చూస్తున్న వైదేహితో మాటలు కలిపేందుకు నా మొదటి ప్రయత్నం అది.

"ఏమో... కొత్త ఊరు కదా... కొత్త స్నేహాలు, కొత్త అలవాట్లు అబ్బి ఉంటాయనుకున్నాను" చిన్నగా నవ్వింది. అప్పుడు పదిహేనేళ్లుంటాయేమో... రెండు జడలు వేసుకుని, పట్టుపరికిణీ కట్టుకొని, లేడిపిల్లలా చెంగుచెంగున గెంతుతుండేది. ఢీ అంటే ఢీ అంటూ అన్నింటికీ పోట్లాటకొచ్చేది.

"ఏమిటి బావా ఆలోచిస్తున్నావు"

"చాలా మారిపోయావు వైదేహి"

"కొంపదీసి లావయ్యానంటావా?" మూతి బిగించింది.

"ఊహూఁ... వరద గోదారిలా ఉండేదానివి. పాపికొండల మధ్య గోదావరిలా ఒద్దికగా, గంభీరంగా మారిపోయావు"

"ఊఁ నీకి కవిత్వం పిచ్చి పోలేదా బావా? చెప్పింది చాలుకానీ వేణ్నీళ్ళు పెడతాను. స్నానానికి లే" వెళ్ళబోయింది. గబుక్కున చెయ్యి పుచ్చుకుని ఆపేశాను.

కలవరపడిపోయింది.

నా చేతిలో... గోరింట వేసిన లేత అరచెయ్యి... వేణ్నీళ్ళు దేనికి? చక్కగా బావి దగ్గర చేస్తాను. ఆఁ మరో విషయం. నేను కానీ, నా స్నేహితులు కానీ, నా అలవాట్లు కానీ ఏవీ మారలేదు. కొత్తకొత్త పనులు చేసి నన్ను అవమానించకు"

ఆ క్షణం....

కలువ పువ్వుల్లాంటి వైదేహి కళ్ళల్లో మెదిలిన ఆనందం... ఎంత అద్భుతంగా అనిపించిందో ఎలా చెప్పను?

ఆ కనురెప్పలు టపటపా కొట్టుకుంటుంటే....

పలికించకు ప్రాణప్రియా మది తీగలను.

కదిలించకు ప్రాణసఖా ఎదవాకిళ్ళను.

ఒక్క కాంక్ష కనకాంబరమైనా, ఒక్క ఊహ ఉత్పల పత్రమైనా, ఒక్క వెదురుపాట పల్లవైనా, ఒక్క నిదురపొద్దు ధ్యానమైనా, తలుపుతట్టి కలలు పట్టి, అధరమే ద్రాక్ష... మధురమీ ఉత్ప్రేక్ష....!

★ ★ ★

టిఫిన్ చేసిన తర్వాత అలా వెళ్ళొస్తానని చెప్పి బైటపడ్డాను. ఇన్నేళ్ళ తర్వాత రాజమండ్రి వచ్చింది నా ఆత్మీయుల్ని చూడాలన్న తహతహతోనే. గోదావరిని చూశాను. వైదేహిని చూశాను. ఇక కలవాల్సింది పరమేశ్వరాన్ని, నారాయణశాస్త్రిగారినీ. పరమేశ్వరం నా ప్రాణస్నేహితుడు. నిక్కర్లు వేసుకునే నాటి నుంచీ ఒకళ్ళని విడిచి ఒకళ్ళు ఉండేవాళ్ళం కాదు. ఆ రోజుల్ని తలుచుకుంటే ఇప్పుడెంత ఆశ్చర్యం వేస్తుందో. రావిచెట్టు పై నుంచి గోదాట్లో ఉరికి ఈతకొట్టడం, దేవీచౌక్ దగ్గర గుళ్ళో కొబ్బరి ముక్కల ప్రసాదం కోసం లైను కట్టడం... తల్చుకుంటే నవ్వొస్తోంది. కాలేజీ రోజుల్లోనూ మా స్నేహం యథాప్రకారం సాగింది. అంతేకాదు నారాయణశాస్త్రిగారితో మా సాన్నిహిత్యానికి అప్పుడే బీజం పడింది.

పరమేశ్వరం నాన్నగారే నారాయణశాస్త్రిగారు. ఆయన వేదం చదువుతుంటే మనుషులే కాదు, చెట్లూ చేమలూ సైతం మంత్రముగ్ధమై పోయేవి. తర్కంలో ఆయన్ని మించిన దిట్ట కోస్తాలో మరెవ్వరూ లేరని చెప్పుకునేవారు. చాలామంది పండితులకి ఆయనంటే భక్తితో పాటు భయం కూడా ఉండేది. మేం మాత్రం భయం-గియం లేకుండా పరమేశ్వరం కోసం వెళ్ళినప్పుడల్లా ఆయన్తో ఇష్టం వచ్చినట్లు వాదించేవాళ్ళం. అన్నీ విని నవ్వుకునేవారాయన.

అప్పట్లో దాదాపు ఎనిమిదిమంది స్నేహితులం ఉండేవాళ్లం. నేనూ, పరమేశ్వరం, రమణ, బుచ్చి, ప్రసాదు, శ్రీనివాసులు... ఇలా! హిందూ సమాజంలో, ఆనం కళాకేంద్రంలో, దేవీ నవరాత్రుల్లో, శ్రీరామనవమి పందిళ్ళలో... ఎక్కడ ఏ సభ జరిగినా, సమావేశం జరిగినా, కచేరీ జరిగినా, కవి సమ్మేళనం జరిగినా మా బృందమంతా హాజరు. మాకా కార్యక్రమం నచ్చిందా సరే. కొంపదీసి నచ్చకపోతే మాత్రం నిర్వాహకుల పని అయిపోయినట్లే. కాకిగోల చేసే వాళ్లం. ఈలలు వేస్తూ, చప్పట్లు చరుస్తూ సదరు వక్తగారినో, కళాకారుడుగారినో కిందికి దింపేదాకా వదిలేవాళ్ళం కాదు. ఆ వయసే అలాంటిదేమో? ప్రతి చిన్న విషయానికీ తీవ్రంగా స్పందించేవాళ్ళం. ప్రతి అనుభూతికీ బదులు పలికేవాళ్ళం. ఏ ధ్యాసపడితే అదే! గౌతమీ గ్రంథాలయంలో చేరి వెర్రిగా పుస్తకాలు చదవడం, సాయంకాలానికల్లా గోదారి ఒడ్డున చేరి వాదులాడుకోవడం...! విచిత్రమేమంటే మాకు శాస్త్రాలు, సిద్ధాంతాలు, ఉద్యమాలు లాంటివేమీ అడ్డం అనిపించేవి కావు. విశ్వేశ్వరుడి గుడికి వెళ్ళి దేవుడికి ఎంత భక్తిగా నమస్కారం చేసుకునేవాళ్లమో విప్లవ రచయితల సభలో కూడా అంతే శ్రద్ధగా వినేవాళ్ళం. శ్రీశ్రీ పాటల్ని బాలమురళిగారు పాడితే వినాలన్న కోర్కె చాలారోజులు మమ్మల్ని వెంటాడుతుండేది. వైరుధ్యాల మధ్య ఉండే సన్నటి గీతలు మా ఉత్సాహంలో కనిపించేవి కావు. ఒకవేళ కనిపించినా మేమే చెరిపేసేవాళ్ళమేమో....

సంగీతం, సాహిత్యం, సంఘ సంస్కరణ... ఏదీ వదిలేవాళ్ళం కాదు. సంఘ సంస్కరణంటే ఓ విషయం గుర్తుకు వస్తుంది. అది తల్చుకుంటే ఇప్పటికీ పొట్ట చెక్కలై పోతుంది. అప్పట్లో "మేం పుట్టిన ఊళ్ళోనే ఒకప్పుడు వీరేశలింగంగారు పుట్టారు తెల్సా" అని చుట్టుపక్కల ఊళ్ళ నుంచి కాలేజీకి వచ్చిన విద్యార్థులతో మహా గర్వంగా చెప్పుకునేవాళ్లం. వీరేశలింగంగారి భావాలు మమ్మల్ని తీవ్రంగా కదిపివేస్తున్న రోజులవి. 'ఆ

మహానుభావుడు కాలుమోపిన చోటు ఇదే, ఇక్కడి నుంచే ఆయన ఉపన్యాసం ఇచ్చేవార్ట" అని చెప్పుకుంటూ పొంగిపోయేవాళ్లం. ఆ ఉధృతిలోనే మాలో ఒకడికి ఓ ఆలోచన వచ్చింది.

"ఆయన ఆదర్శాల్ని వల్లెవేయడం కాదు. మనమూ చేతల్లో చేసి చూపించాలి" అని. అనుకోవడమే తడవు గోదావరి ఒడ్డున చేరి ఓ నిర్ణయం తీసేసుకున్నాం.

"ఎలాగైనా కనీసం ఒక్క వితంతు వివాహమైనా జరిపించి తీరాలి" స్థిరంగా అన్నాడు బుచ్చిగాడు.

మరి వివాహమంటే మాటలా?

"పెళ్ళికొడుకు కావాలి... పెళ్ళికూతురు కావాలి.. అందులోనూ మొగుడు చచ్చిపోయిన పెళ్ళికూతురు" సాలోచనగా అన్నాడు పరమేశ్వరం.

అందరి ముఖాలూ బిక్కచిక్కపోయాయి.

హఠాత్తుగా అన్నాడు రమణ.

"నేను పెళ్ళికొడుకునవుతాను. ఎవరైనా వితంతువుని చూడండి"

అందరిలోనూ మళ్ళీ ఉత్సాహం వచ్చేసింది. ఆ క్షణం నుంచీ ప్రారంభమైంది మా వేట. భర్త కాలం చేసి పుట్టింటికి చేరిన ఆడపిల్ల ఎవరైనా ఉందాని మొత్తం వీధులన్నీ గాలించి పారేశాం. చిట్టచివరికి తెలిసింది. ఇన్నీసుపేటలో జగన్నాధంగారని రిటైర్డ్ స్కూలు హెడ్మాస్టారుండేవారు. ఆయన పెద్దల్లుడు ఇటీవలే గతించాడనీ, కూతురు సుగుణ ప్రస్తుతం ఆయన పంచనే ఉంటోందనీ! అంతే ఓ సాయంత్రం వేళ ఒక్కుమ్మడిగా ఆయనింటి మీద పడ్డాం.

"ఏం కావాలి బాబూ" అన్నారాయన మమ్మల్నందర్నీ చూసి కంగారుగా.

పరమేశ్వరం కల్పించుకున్నాడు.

"మేమొక ముఖ్యమైన పనిమీద వచ్చామండీ. కందుకూరి వారి కలల్ని నిజం చేయడానికి కంకణం కట్టుకున్న కుర్రాళ్ళం మేం. మావాడు... అంటే ఈ కాశీనాథ వెంకట రమణమూర్తికి ఇచ్చి మీ పెద్దమ్మాయి సుగుణ వివాహం జరిపించాలనుకుంటున్నాం."

వాడి మాటలు పూర్తి చేశాడో లేదోగానీ లోపల్నుంచి వాళ్ళావిడతోపాటు వాళ్ళమ్మాయి, మనవలూ అందరూ కలిసి ఒక్కసారిగా మామీద దాడిచేసి చీపుళ్ళతో మా వీపులు వాయగొట్టడం మాత్రం మాబాగా గుర్తుంది. అయినా మాకేం తెలుసు... వాళ్ళమ్మాయి సుగుణకి నలభై మూడు సంవత్సరాలనీ, మాకన్నా పెద్దవాళ్ళైన పిల్లలున్నారనీ!

అలా సాగిపోయేవి ఆ రోజులు. గోదావరికైనా గట్టుండాలంటారు. దారీ తెన్నూ లేకుండా కొట్టుకుపోతున్న మాకు ఓ ఆనకట్ట వేసి దారి చూపించినవారు పరమేశ్వరం నాన్నగారు నారాయణశాస్త్రిగారే. ఏ జన్మలో అనుబంధం ఆయనకి మా పట్ల అనురాగం కలిగించిందోగానీ మాతోపాటే పిల్లవాడిలా కల్సిపోయి గోదావరి ఒడ్డుకు వచ్చేవారు. మాకు తెలియనివీ, తెలుసునని అనుకునేవీ ఎన్నో చెప్పేవారు. మామూలుగా కాదు.... జీవితాంతం గుర్తుండేలా.

"ఓరేయ్.... శాస్త్రం మనిషి ఇలా నడుచుకోవాలని నిర్దేశిస్తుంది తప్ప నిర్బంధించదు. ఎలా నడుచుకోవాలో, ఎలా నడుచుకుంటే నలుగురికీ మంచి చేయగలుగుతామో నిర్ణయించుకోవలసింది మనిషే. నీతికి కట్టుబడితే చాలురా... సారంగధరుడిలా మారితే మాత్రమేం' అనేవారాయన.

ఓసారి కోటిపల్లి బస్టాండు దగ్గర చెప్పులు కుట్టుకునే మనిషిని తనతోపాటు ఇంటికి తీసుకు వచ్చి సహపంక్తిన భోజనానికి కూర్చోబెట్టారు. 'ఇదేం ఘోరం' అంటూ పరమేశ్వరం తల్లిగారితో సహా అందరూ గుండెలు బాదుకున్నారు.

"ఏం లేదర్రా, నా చెప్పు తెగిపోయింది. నేనే బాగు చేసుకుందామని నానా తంటాలూ పడ్డానా. అది కుదర్లేదు సరికదా రెండోవైపు కూడా తెగికూర్చుంది. ఇలా కాదని, ఈ కుర్రాడి దగ్గరికి తీసుకెళ్ళాను. ఎంతాశ్చర్యమో... రెండు క్షణాల్లో రెండు చెప్పులూ బాగుచేసి ఇచ్చేశాడు. ఎంత గొప్ప చాకచక్యం చూపించాడనుకున్నారు? నేను శాస్త్రంలో చేసిన కృషి ఇతగాడు చెప్పులు బాగు చేయడంలో చేశాడు. ఇంత గొప్ప కళాకారుడిని గౌరవించకుండా ఎలా ఉండను చెప్పండి? ఎంతైనా తర్కం కన్నా ధర్మం గొప్పది కదర్రా" అంటూ నవ్వారాయన. ఆ నవ్వు గోదావరిలా మా గుండెల్లోకి నిండుగా ప్రవహించింది. గొప్ప జీవితతత్వాన్ని ఎంత తేలిగ్గా, ఎంత చిన్న మాటల్లో చెప్పారాయన. ఆయనే పూనుకోకపోతే మేమంతా ఎలా ఉండేవాళ్ళమో.

ఆలోచనల్లో పడి చాలా దూరం వచ్చేశాను. పరమేశ్వరం ఇల్లు దగ్గరపడింది. నాలో ఉత్సాహం మళ్ళీ పురులు విప్పుకుంది. ఇన్నాళ్ళ తర్వాత హఠాత్తుగా నన్ను చూసి వాడెలా ఫీలవుతాడో? శాస్త్రిగారు ఏమంటారో?

"ఎవరు కావాలండీ"

"నారాయణశాస్త్రిగారు.." ఆర్థోక్తిగా ఆగాను.

"ఎవరూ విష్ణుభట్లవారా? ఆయన గతించి నాలుగేళ్ళు దాటింది కదండీ..."

నీటిలో మునిగిపోయి ఊపిరాడక గిలగిలలాడినట్లైంది నాకు. నేను వింటున్నది నిజమేనా? శాస్త్రిగారు ఇక లేరన్న భయంకర సత్యాన్ని ఇముడ్చుకోలేకపోతోంది నా మనసు. కళ్ళలో ఊరిన నీటి చెలమలు.

"మరి పరమేశ్వరం..." నా గొంతు పూడుకుపోవడం నాకే తెలుస్తోంది.

"తెలీదు బాబూ... వాళ్ళ కుటుంబం ఇల్లు అమ్మేసి వెళ్ళిపోయిందట. మేం ఈమధ్యనే అద్దెకి వచ్చాం ఇక్కడికి"

మాట్లాడకుండా వెనుదిరిగాను. సన్నగా చినుకులు పడుతున్నాయి. ఆకాశం శోకంతో కన్నీళ్ళు పెట్టుకుంటున్నట్లు! మరణం జీవధర్మమే అయినా ఆత్మీయుల మరణం మనిషిని ఎంత కుంగదీస్తుంది? అందులోనూ నన్ను గోదావరిలా దగ్గరికి తీసుకొని, నా జీవితానికి సరైన సమయంలో, సరైన మార్గాన్ని చూపించిన నారాయణశాస్త్రిగారు కాలం చేశారన్న సంగతి నా మనసుని బాధతో సుడులు తిప్పుతోంది. ఆయన ఇక భౌతికంగా కనిపించరు. ఏం చెయ్యగలం? ఈ లోకపు నియమాలే అంత.

అంతటి ఆవేదనలోనూ ఓ ప్రశ్న మెదులుతూనే ఉంది నాలో.

"పరమేశ్వరం ఎక్కడ ఉన్నాడు?"

☆ ☆ ☆

బదులు చెప్పలేదు వైదేహి.

"చెప్పు వైదేహి.... పరమేశ్వరం ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు?"

"తర్వాత చెబుతాలే బావా, అయినా గోదావరి ఒడ్డుకు వెళ్దాం రమ్మని నన్ను తీసుకు వచ్చింది ఈ ప్రశ్న అడగడానికేనా?" నిష్టూరంగా అంది.

"అది కాదు వైదేహి...." ఏదో చెప్పబోయాను.

"ఆరేళ్ళ తర్వాత వచ్చావు. నాతో మాట్లాడేందుకు విషయాలే లేవా నీ దగ్గర" మునుపటి వైదేహిలా మూతి బిగించి అడిగింది. ఇక ప్రసక్తి మార్చక తప్పలేదు.

"ఊఁ సరే, చెప్పు.... అయ్యగారి వారి దగ్గరికి సంగీతం నేర్చుకునేందుకు వెళ్తున్నావా?" నవ్వుతూ ప్రశ్నించాను.

"ఆఁ వెళ్తున్నాను..." గడగడా చెప్పేస్తోంది వైదేహి. గట్టు వెంబడే నడుస్తున్నాం మేం. ఓ పక్క గోదావరి, మరోపక్క రాజమహేంద్రి.... మధ్యాహ్నం బాగా వర్షం కురిసిం దేమో... రోడ్లూ, ఇళ్లూ, చెట్లూ అన్నీ స్నానం చేసినట్లు పవిత్రంగా కనిపిస్తున్నాయి. వర్షం పడితే రాజమండ్రి అందం రెట్టింపవుతుంది. అనంత ప్రాచీనత అవ్యాజంగా గోచరిస్తుంది.

నెమ్మదిగా నడుచుకుంటూ రాఘవేంద్రస్వామి కోవెలకి వెళ్లాం.

"పూజ్యాయ రాఘవేంద్రాయ..." ఎన్నేళ్ళ తర్వాతనో అలా చదువుతుంటే మనసు ప్రశాంతంగా మారిపోయింది. గుళ్లోకి వెళ్లి దర్శనం చేసుకున్నాం. పూజారి తాతయ్యగారు ముందు గుర్తు పట్టలేదు. తర్వాత జ్ఞప్తికి తెచ్చుకుని పాదాలకు నమస్కరిస్తున్న మమ్మల్ని త్వరలోనే దంపతులు కమ్మని దీవించారు.

తాతయ్యగారి దీవెన వినగానే వైదేహి నావైపు చురుగ్గా చూసింది. ఆ చూపులో సిగ్గు, కవ్వింపు, కొంటెతనం... అన్నీ కలగలిసి ఉన్నాయి.

ఇద్దరం బైటికి వచ్చాం.

"ఇన్నేళ్లలో నేను నీకెప్పుడైనా గుర్తుకు వచ్చానా." రేవులో మెట్ల మీద కూర్చుంటూ అడిగింది వైదేహి. గోదావరి అలల అంచున సంజె వెలుగు విరుగుతోంది. ఒడ్డున ఉన్న నిద్ర గన్నేరు తపస్సులో మునిగిన మహా రుషిలా ఉంది. ఇక్కణ్ణించి చూస్తే గోదావరి బ్రిడ్జి నది జడలో తీసిన పాపిటలా కనిపిస్తోంది.

"అలా అడుగుతావేం వైదేహి... అసలు నిన్ను మరిచిపోతే కదా"

"నిజమా..."

"నిజం"

ఠంగున మోగింది కోవెల గంట.... ఇక్కడే ఇదివరకు దేవుణ్ణి దర్శించుకోవాలని గోదావరి ఆశపడితే వరద వచ్చిందని జనం గగ్గోలు పెట్టారు.

"బావా" వైదేహి కంఠం ఒణికింది. తనే నా చెయ్యి పట్టుకుంది. లేత చిగురుటాకుల్లాంటి ఆ వేళ్ళు సన్నగా కంపిస్తున్నాయి. కళ్ళ నుంచి మాత్రం వెన్నెల వర్షిస్తోంది.

"బావా.... ఇన్నాళ్ళూ నీకోసం ఎలా నిరీక్షించానో తెలుసా? ఇంక నాకేం భయంలేదు. నువ్వు వచ్చేశావు. నా జీవితంలోకి గోదావరిలా వచ్చేశావు" ఆమె కంఠం రుద్ధమై పోయింది.

నా చేతిలో ఉన్న వైదేహి చేతిని గట్టిగా నొక్కాను. ఆడపిల్ల తాను మనసిచ్చిన మనిషి పట్ల ఎంత గాఢమైన అనురాగాన్ని అల్లుకుంటుంది - ప్రాణహిత గోదావరితో పెనవేసుకున్నట్లా?

రాత్రి ఏడున్నరకి ఇంటికి తిరిగొచ్చాం. తొమ్మిదో తొమ్మిదిన్నరో అయ్యాక నేనూ, మావయ్య పెరట్లో బాదంచెట్టు కింద మంచాలు వేసుకుని కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. పడుకోబోయే ముందు మావయ్యని అడిగానా ప్రశ్న.

"మావయ్య.... పరమేశ్వరం ఇప్పుడెక్కడ ఉన్నాడు"

మావయ్య వెంటనే సమాధానం చెప్పలేదు. ఆకుల సందుల్లోంచి కనిపిస్తున్న చందమామ వైపు చూస్తుండిపోయాడు.

"అసలెవ్వరూ పరమేశ్వరం గురించి నాకు చెప్పరేం" అరిచాను.

నిట్టూర్చాడు మావయ్య.

"ఎవ్వరు చెప్పనక్కర్లేదురా కృష్ణుడూ... రేపు పొద్దున్నే కోటిలింగాల రేవు దగ్గరికి వెళ్ళు... నువ్వే చూడొచ్చు"

"ఏం చూడొచ్చు" అన్న ప్రశ్న వరదలా గొంతు వరకు వచ్చాక అణిచేసుకున్నాను. గుండెల్నిండా తెలియని గుబులు. ఎప్పుడు నిద్రపట్టిందో....

☆ ☆ ☆

కోటి ఈశ్వరుల మధ్య నా పరమేశ్వరుణ్ణి వెదికి పట్టుకోవాలని వెళ్ళేసరికి తొమ్మిదింపావైంది. ఎంతో సందడిగా ఉంది. ఎన్ని తరాలు ధరిత్రిమీదికి తరలి వచ్చాయో, తిరిగి వెళ్ళాయో ప్రత్యక్షంగా సందర్శించిన పవిత్ర స్థలం ఇది. ఓ పక్క ఉన్న కొట్లవాళ్ళు తమ దగ్గిర ఉన్న వస్తువుల జాబితాలు వల్లె వేస్తున్నారు. కొద్దిగా ముందుకు వెళ్తే ఆలయం...

గట్టు మీద నుంచుని అన్నివైపులా కలియజూసాను. పరమేశ్వరం ఎక్కడా కనిపించలేదు. లేకపోతే ఈ జనప్రవాహంలో నేనే వెతికి పట్టుకోలేకపోతున్నానేమో తెలియదు. దాదాపు పావుగంట చెట్టుకిందే నుంచుని అటూ ఇటూ చూస్తూ గడిపేశాను. అయినా వాడి జాడ కనిపించకపోయేసరికి నాలో పట్టుదల పెరిగింది. నీరసం కూడా! ఎందుకైనా మంచిది అటు కూడా చూద్దామని నదివైపు మెట్ల వెంబడి దిగడం ప్రారంభించాను.

పది పన్నెండు మెట్లు దిగిన తర్వాత కనిపించాడు నాకు పరమేశ్వరం. అతన్నలా చూసి నిశ్చేష్టుడినై పోయాను.

అక్కడ....

పంచెకట్టుకు కూర్చుని ఏవో మంత్రాలు చదువుతున్నాడు పరమేశ్వరం... ఎదురుగా

శిరోముండనం చేయించుకుని కూర్చున్న నడి వయసు వ్యక్తి.

"అయ్యా... మీరు లేచి నదికి వీపు చూపిస్తూ నుంచుని మీ తండ్రిగారిని తలుచుకుని వెనక్కి తిరిగి చూడకుండా అస్థికలు గోదావరికి అర్పితం చెయ్యండి..." చెబుతున్నాడు పరమేశ్వరం.

చూస్తున్న నాకు కళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. గోదావరి ఉరకలు వేస్తూ నన్ను ముంచేస్తున్న భావన.

ఆ వ్యక్తి కార్యక్రమం ముగించి నదిలో దిగాడు. పరమేశ్వరం కూడా స్నానం చేసి బైటికి వచ్చాడు. వాడిలో మునుపటి కళ లేదు. మనిషి చిక్కిపోయాడు. కళ్ళు లోతుకి పోయినాయి. గెడ్డం గుబురుగా పెరిగింది. వీడు.... వీడు నా పరమేశ్వరమేనా?

అతనితో ఏదో చెబుతున్నాడు పరమేశ్వరం. అతను డబ్బులు తీసి వాడికిచ్చి కాళ్ళకి నమస్కారం చేసి కదిలిపోయాడు. సొమ్ము బొడ్లో దోపుకుని ఇటు తిరిగాడు. అప్పుడు చూశాడు వాడు నన్ను....

"ఒరేయ్.... క్రిష్టా" అరిచినంత పనిచేసి సుడిగాలిలా వచ్చి నన్ను చుట్టేశాడు.

"క్రిష్టా ఎన్నాళ్ళకిరా నిన్ను చూస్తున్నాను...." వాడి ఆనందానికి పట్టపగ్గాలు లేవు. నాకు మాత్రం గుండెల్లో సన్నటి సూదులు దిగుతున్నట్లుంది.

"మాట్లాడవేంరా కిట్టిగా" వాడికి ప్రేమ మరీ ఎక్కువైనప్పుడు నన్నలాగే పిలిచేవాడు.

ఇక నిభాయించుకోలేకపోయాను.

"ఒరే పరమేశం.... ఏమిట్రా ఈ ఘోరం..." వాణ్ణి వాటేసుకుని బావురుమన్నాను.

"క్రిష్టా ఏమిట్రా ఇది చిన్నపిల్లాడిలా" ఆప్యాయంగా అడుగుతోంది వాడి గొంతు.

"నేను భరించలేన్రా పరమేశ్వరం" నా కళ్ళ నుంచి ఉరుకుతోంది గోదావరి.

"ఛ.... ఊర్కోరా..." పక్కకి లాక్కు వస్తూ అనునయంగా అన్నాడు. అయినా ఆగలేకపోతున్నాను నేను. నా పరమేశ్వరాన్ని, మహా పండితుడు, తర్కశాస్త్రంలో మహామహోపాధ్యాయుడు అయినా విష్ణుభట్ల నారాయణశాస్త్రిగారి అబ్బాయిని ఇలా చూస్తానని ఎలా ఊహించగల్ను? విద్యలోనూ, శాస్త్రంలోనూ, అన్నిటిలోనూ మా అందరికంటే ఎంతో.... ఎంతో అధికుడైన నా పరమేశ్వరం... ఎందుకిలా?

"ఏమిట్రా ఇది" ప్రశ్నతోపాటే నా గుండెలూ బద్దలవుతాయనిపిస్తోంది.

జవాబు చెప్పలేదు వాడు.

"చెప్పరా" వాణ్ణి పట్టుకుని కుదిపేశాను.

బదులుగా తన తడి కండువా తీసి నా ముఖం తుడిచాడు వాడు.

"చెబుతాగానీ, నువ్వు కొద్దిగా మనిషివి కారా" అందరూ మావైపు వింతగా చూస్తుంటే అక్కడే ఉంటే లాభం లేదనుకున్నాడేమో ఇవతలకి లాక్కొచ్చి నడిపించాడు.

"నా ప్రశ్నకి జవాబు చెప్పావు కావు"

నా ముఖంలో కోపాన్ని గమనించినట్లున్నాడు. నవ్వాడు. అది విరక్తిలోంచి వచ్చిందో, వేదాంతంలోంచి వచ్చిందో నాకు తెలియలేదు.

"చెబుతాలేరా, నీ కోపం కాస్త తగ్గనీ..." వాడు నన్ను ఆ సంభాషణ నుంచి, ఆ వాతావరణం నుంచీ దూరం చెయ్యాలనుకుంటున్నాడని అర్థమైంది. రెట్టించకుండా అడుగులు వేశాను. ఇద్దరం మాట్లాడుకోవట్లేదు. అలా నడుస్తూనే వున్నాం. ఎంతదూరం నడిచామో తలెత్తి చూసేసరికి...

"ఇక్కడికి..." ఆగాను.

"అప్పుడే మర్చిపోయావట్రా... రోజూ సాయంకాలాలు మనం ఇక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకునేవాళ్ళం."

"మర్చిపోలేదురా... అందుకే ఈ బాధ" గుండె బరువుగా మూలిగింది.

ఇద్దరం ఇసుకలో కూలబడ్డాం. బ్రిడ్జిపైన ఏదో రైలు వెళ్తోంది.

"ఇప్పుడు చెప్పురా. నాకు జవాబు కావాలి"

"వదలవుట్రా.....? సరేకానీ అటు చూడు" చేత్తో చూపించాడు.

తలతిప్పి చూశాను. ఐదారేళ్ళ పిల్లలు ముగ్గురు గోదాట్లో దూకి ఈతలు కొడుతున్నారు.

"అందులో వింతేముంది. ఈత కొడుతున్నారు" కోపంగా అన్నాను.

"ఊహుఁ అలాగే చూడు. అది మామూలు ఈతకాదు"

విచిత్రంగా చూశాను వాడివైపు - పిల్లలవైపు. చూస్తుండగానే హఠాత్తుగా వాళ్ళు నీళ్ళలో మునిగిపోయారు. ఒకటి... రెండు నిమిషాలు గడిచినా వాళ్ళు పైకి తేలలేదు.

"ఒరేయ్ వాళ్ళు.... వాళ్ళు... మునిగిపోయినట్లున్నార్రా" కంగారుగా అరిచాను.

తాపీగా నవ్వాడు వాడు. ఒళ్ళు మండిపోయింది నాకు. మునుగుతారని ముందే తెలిసినవాడిలా ఏమిటా నవ్వు? పైకే అనేసానా మాట.

"ఏం లేదురా కిట్టీ.... కంగారు పడకుండా అలాగే చూడు"

నదివైపే ఆత్రుతగా చూస్తూ కూర్చున్నాను. క్షణక్షణానికీ నాలో ఆత్రం పెరిగిపోతోంది.

సరిగ్గా నాలుగు నిమిషాల తర్వాత ఒక పిల్లవాడు పైకి తేలాడు. చూస్తుండగానే మిగిలిన ఇద్దరూ కూడా పైకి తేలారు. ముగ్గురూ ఈదుకుంటూ ఒడ్డుకి వచ్చారు.

"అరే" ఏదో చెప్పబోయాను.

నన్ను వారించి, చూడమని సంజ్ఞ చేశాడు.

ముగ్గురు పిల్లలూ తడిసిన ఒంటితోనే వచ్చి ఒడ్డున కూర్చున్న మరో పిల్లవాడి చేతికి ఏవో ఇచ్చి మళ్ళీ పరుగెత్తుకుంటూ వెళ్ళి నదిలో దూకేశారు.

"ఏమిటో తెలుసునట్రా అవి" నన్ను ప్రశ్నించాడు.

తెలియదన్నట్లు తలూపాను.

"డబ్బులురా... డబ్బులు...రైల్లో వెళ్ళిపోతూ గోదావరి మీద భక్తితో జనం విసిరే పదీ, పావలా కాసులకోసం అమ్మ ఒళ్ళో ఆడుకోవాల్సిన వయసులో, ప్రాణాలకు తెగించి మహా ప్రవాహంలో ఈదుకుంటూ, లోతుల్ని శోధించి వాటిని ఏరుకుని వస్తున్నార్రా ఈ పిల్లలు"

కళ్ళ ముందు చీకటి మబ్బుల తెర కమ్మినట్టైంది నాకు. చేదు నిజం ఒకటి గొంతు జారుతోంది.

"నాన్న పోయారు. ఉన్న ఇల్లు పోయింది. మిగిలింది నేనూ, అమ్మ, నన్ను నమ్మి బతుకు పంచుకున్న నా భార్య, ఇద్దరు పిల్లలూ... అంతేరా! రోజూ... ప్రతిరోజూ నాన్న మరణంలా వెంటాడే ఆకలి. చదివిన చదువు ఆ ఆకలి తీర్చలేక నన్ను నిస్సహాయుడిగా మార్చి వెక్కిరిస్తుంటే, అనుభూతుల కల చెదిరిపోతుంటే, మారిపోయ్యానా... నేను మారిపోయాను. రేపు నా పిల్లలకి ఊహ తెలిసి "నాన్నా తొందరపడ్డావు నాన్నా" అని నావైపు చూడకముందే నేనే తొందరపడ్డానురా. ఇప్పుడు చూశావే ఆ పిల్లల్ని... వాళ్ళకి నాకూ ఒకటే తేడారా! వాళ్ళు ఈదుతున్నది నదిలో, నేను ఈదుతున్నది ఒడ్డుమీద. కానీ ఇద్దరం ఈదుతున్నది జీవితాన్నేరా... ఎందుకో తెల్సునురా కిట్టీ... గోదావరంటే జీవితంరా... జీవితం!

నిశ్చేష్టుడిలా వింటున్నాను. మళ్ళీ వాడే అన్నాడు.

"అయినా నేనేం తప్పు చేశాన్రా? నాన్నగారు చెప్పినట్లే నీతి తప్పకుండా బతకుతున్నాన్రా పైగా ఇదెంత పుణ్యకార్యమో తెల్సా.... తర్కం ప్రకారం చూసినా, ధర్మం ప్రకారం చూసినా నేను ఎంచుకున్న మార్గం పవిత్రమైందేరా కిట్టీ..." అప్రయత్నంగానే వాడి కళ్ళలో నీళ్ళు ఉబికి వచ్చేశాయి.

స్తబ్దుగా అయిపోయాను నేను.

ఏవో ఊహలు... గుండెల్ని తొలిచే ఆలోచనలు.

నేను నారాయణశాస్త్రిగారిలో గోదావరిని చూసుకున్నాను. వైదేహి నాలో గోదావరిని చూసుకుంది. పరమేశ్వరం తన జీవితంలో గోదావరిని చూసుకుంటున్నాడు.

నా కళ్ళముందిప్పుడు మూడు పాయలుగా కనిపిస్తోంది గోదావరి... అంతలోనే మళ్ళీ అఖండంగా మారి ప్రవహిస్తోంది... అనంతంగా!

– ఈనాడు, ఆదివారం 4 ఆగస్టు, 1991

# సాక్షి

## ఇనుకపల్లి దక్షిణామూర్తి

సినిమా మొదలుకాగానే ఎ.సి. ఆగిపోయింది. చూస్తుండగానే వళ్లంతా చెమట పట్టింది. ముఖం మీద చిరుచెమటలు. రుమాలు తోటి అద్దుకుంటూ పార్వతి చిర్రుబుర్రులాడ సాగింది. 'అందరికీ ఇదే రోగం...'' అంది. గోపాలం ముఖంమీద చెమట తుడుచుకుని చొక్కా కాస్త గాలివచ్చేట్టుగా సడలించాడు. నోటితోటి బనీనులోకి గాలి ఊదుకుని 'అమ్మ... ప్రాణం లేచివచ్చింది'' అన్నాడు.

'కరెంటు ఖర్చులు తగ్గిద్దామని... వాడు ఎ.సి. పీకేశాడు... హాల్లోవాళ్లు ఉడికి చస్తేమటుకు హాలువాడికి పోయిందేముంది... వాడి డబ్బులు వాడికొస్తాయి... బయట ఎండలు మండిపోతున్నాయి. ఎ.సి.లో చల్లగా కాసేపు కూర్చుందామని వస్తే ఇక్కడ ఈ గోల... సినిమా హాలువాడిని గట్టిగా దులిపేసి రావచ్చుగదా!'' పార్వతి గుక్క తిప్పుకోకుండా మాట్లాడేస్తోంది. గోపాలానికి మళ్లీ చెమట పట్టింది. సినిమా ప్రభావం, ఎ.సి. లేకపోవటం, భార్య తనకి పని పురమాయించడం... ఇంకేం కావాలి?

"హాలువాడేం నా మొగుడనుకున్నావా... దులిపేస్తే పడి ఉండటానికి...'' గోపాలం ముఖం తుడుచుకుని, అరి చేతులు కూడా చెమటపడితే రుమాలుతో అద్దుకుంటున్నాడు. 'పోనీలేవే... వాడి పాపాన వాడేపోతాడు... పైగా సినిమా కథ మొదలయింది... బయటకు పోయి రాద్ధాంతం పెట్టుకుంటూ కూర్చుంటే ఇక్కడి కథ అయిపోతుంది.''

"ఎందుకండీ... అంత పిరికితనం... పోనీ ఆ గేటువాడితో చెప్పిరండి...' గోపాలం లేచేదాకా పార్వతి ఊరుకోలేదు. గోపాలం గేటువాడి దగ్గరకుపోయి ఏదో మాట్లాడి వచ్చాడు. దారిలో వకళ్లిద్దరి కాళ్లు తొక్కి అక్షింతలు వేయించుకున్నాడు. చేత్తో దారి చూసుకుంటూ కుర్చీల మీద చేతులు వేసుకుంటూ పోతుంటే చేతికేమిటో మెత్తగా తగిలింది. ఆడో, మగో ఎవరో ఆవిడ నవ్వినట్లు వినిపించింది. మొగుడనుకున్నదో ఏం గోలో! గోపాలం మెల్లిగా వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమంటాడువాడు...' పార్వతి నిలదీసింది.

'మా మేనేజరుతో చెప్పి... ఎ.సి. వేయిస్తానన్నాడు...'

"మరి అక్కడే నిలబడి చచ్చాడే?!'

'సినిమా చూస్తున్నట్టున్నాడే పాపం...'

'రోజూ చూసే సినిమానేగా? ముదనష్టపు సినిమా!! అయితే సినిమా అయింతర్వాత వెళ్లి మేనేజరుతో మాట్లాడుతాడా...?!'

మాటల్లో గేటు దగ్గరవాడు బయటకు వెళ్లిపోయాడు. పార్వతి గేటువంకనే చూస్తున్నది. ఎ.సి. రాలేదు. గేటువాడు తిరిగి రాలేదు. సినిమా చూసేవాళ్లకుగానీ, సినిమాలో హీరో, హీరోయిన్లకు ఎ.సి. అవసరం లేదు. వాళ్ల డాన్సులు, పాటలు నిరాఘాటంగా సాగిపోతున్నాయి. కథేమవుతున్నదో పార్వతికి అంతు చిక్కటం లేదు. గేటువాడు కనిపిస్తే గొంతు పిసికి చంపేద్దామన్నంత కోపంలో ఉంది. అసలే చెమట... అందుకు ఆపైన ఆగ్రహం, కంపరం ఎక్కువయింది.

'సినిమా పోతేపోయింది... ఒక్కసారన్నా హాలువాడికి బుద్ధి చెప్పాలి... బయటకుపోయి... మేనేజరుతో మాట్లాడిరండి...' పార్వతి గోపాలాన్ని ఉసికొల్పింది. గోపాలానికి లేచి నుంచుని గట్టిగా 'భౌ.. భౌ ..' అంటూ మొరుగుదామనిపించింది.

'నువ్వు కూడా... మీ మహిళా మండలి మెంబరువు గదా.... నువ్వే వెళ్లి కనుక్కోరాదు...' గోపాలం మెల్లిగా భయపడుతూ అన్నాడు. 'లేచింది... మహిళాలోకం... పాట గుర్తున్నదా...'

పార్వతి మహిళా సంఘ సమావేశాలకు తరచు వెళుతున్నమాట నిజమే! అక్కడ దేశ సమస్యలను పరిష్కరించినదేమీ లేదు. వరకట్న నిషేధం, అత్తగార్ల ఆరడి, ఆవకాయల్లో ఎన్నిరకాలు... సంఘాన్ని సంస్కరించటం ఎలా అన్న విషయాల్లో అందరికీ ఏకాభిప్రాయం ఉండేది. అక్కడ సాధారణ విషయాలే గాని, వ్యక్తిగత సమస్యలు తీసుకొని రాగూడదన్న అంతర్జాతీయ సూత్రానికి కట్టుబడి ఉండటం వలన, సభ్యులు తీసుకొన్న కట్నాల జాబితాలు అక్కడకు వచ్చేవికావు. కోడలు - కాబోయే అత్త అన్న సూక్తిననుసరించి సమావేశాలు జరిగేవి. కాని ఈరోజు తనకు ఈ ఎ.సి. పీకెయ్యటమనేది ఒక ఛాలెంజ్‌లాగా కనిపించింది. మళ్లీ ఎ సి. వేయించి, హాలులో చల్లటిగాలి వేయించాలి అన్న తపన బయలుదేరింది. అక్కడే పార్వతి దెబ్బతింది. 'కుక్క చెయ్యాల్సినపని గాడిదచేసి చాకలివాడిచేత చావుదెబ్బలు తిన్న కథ గుర్తుందా...' అన్నాడు గోపాలం పార్వతి సంకల్పం విన్న తర్వాత. ఇహ తప్పదు అన్న పరిస్థితి రాగానే గోపాలం లేచి బయలుదేరాడు. వాళ్లు బయలుదేరగానే 'వాళ్లు తెగ వాగుతున్నారు... అమ్మయ్య ప్రశాతంగా సినిమా చూసుకోవచ్చు' అని కొందరు నిట్టూర్చారు.

'సినిమా బాగానే ఉందిగదా... అప్పుడే వెళ్లిపోతున్నారేం.... అని అడిగింది పక్కనే కూర్చున్నావిడ. 'మళ్లీ వస్తారా?' వాళ్లు తిరిగి రాకపోతే, టిక్కెట్టు కొనకుండా చంకన వేసుకొనివచ్చి ఇందాకటి నుంచి వళ్లో కూర్చోబెట్టుకున్న మనవణ్ణి ఆ సీటులో కూర్చోపెట్టుకోవచ్చు అని ఆవిడ కోరిక. మనవడు అని పేరుకేగాని అల్లుడంత బరువున్నాడు వాడు.

'ఎయిర్‌కండిషను ఆపేసినందుకు అడిగి వద్దామని పోతున్నామండీ...' అన్నాడు గోపాలం. యుద్ధానికి పోతున్న ఝాన్సీలక్ష్మిని గుర్తు తెచ్చుకుంది పార్వతి. ఝాన్సీ కూడా మగవేషం వేసుకొని యుద్ధం చేసిందట.

'నీ కడుపు చల్లగా ఎ.సి. వేయించండి బాబు... పుణ్యం ఉంటుంది. అంతా ఉడికిపోతున్నాం' ఆవిడ ప్రోత్సహించింది. పార్వతికి 'సినిమా అయిపోతున్నదే...' అన్న బాధ ఒకప్రక్కన, గోపాలం ఒక్కడిని పోయిరమ్మని చెప్పటానికి ప్రెస్టేజీ ఘర్షణ పడ్డాయి.

"ఏమిటయ్యా అడ్డం.. పోతేపోండి, కూర్చుంటే కూర్చోండి" అంటూ సినిమా కథలో నిమగ్నం అయిన కొందరు 'కయ్'మన్నారు. గోపాలం హాలు బయటకు రాగానే ఇందాకటి గేటువాడు కనిపించాడు. సిగరెట్టు ముట్టించి ఒక మెట్టు మీద కూర్చుని పొగవదలుతూ ఉంగరాలు లెక్కెట్టుకుంటున్నాడు.

'ఇటురా...' అంటూ గోపాలం కేకవేశాడు. అతను గోపాలం వంక చూసి సిగరెట్టు నేలమీద రాసేసి గబ్బుకున జేబులో వేసుకొని ముందుకు వచ్చాడు.

'ఇందాక ఎ.సి. వేయమని చెప్పాను... నీకే కదా...' గోపాలం ప్రశ్నించాడు.

'ఇంకా వెయ్యలేదా..... సార్!'

'నువ్వు ఎవరితో చెప్పావు?'

'ఎలక్ట్రీషియన్‌తో సార్'

'ఏడీ... వాడిని చూపించు...'

పార్వతి గోపాలం అడుగుజాడల్లో నడుస్తూ ముందుకు వెనక్కూ సాగుతోంది హాలులో హీరో, హీరోయిన్లు పాట పాడడం వినిపిస్తోంది. పార్వతికి ఒక్కక్షణం గోపాలం చెయ్యి పట్టుకుని పాటపాడుతూ వరండా స్తంభాల చుట్టూ పరుగెత్తాలనిపించింది. సినిమా పాట ఎట్లానూ వినిపిస్తోంది. తాము మళ్లీ పాడుకోనక్కర్లేదు. సినిమా హీరో, హీరోయిన్లు అంతేగదా! నేపథ్యగానం ఉంటే, మనం ఎగరవచ్చు... పాట అయిపోయినట్లుంది. విలన్ వచ్చాడేమో... డిషూం... డిషూం వినిపిస్తోంది. పార్వతి గోపాలం కలిసి ఎయిర్‌కండీషను ఆపేసినవాడిని పట్టుకొని బాదేస్తున్నంత ఫీలింగొచ్చేసింది. గేటువాడు ఎ.సి. ప్లాంటున్న గది దగ్గరకు తీసుకు వెళ్లాడు. తలుపు దగ్గరగా లాగి గడియవేసి ఉంది.

'ఇక్కడే ఉండాలండీ!! టీ తాగడానికి వెళ్లాడేమో సార్... కూర్చోండి సార్!' బయట చిన్నబెంచీ ఉంటే ముందుకు లాగాడు. హాలులో సినిమా అయిపోతోంది. అయిదు రూపాయల కాగితం ఒకపక్క నుంచి తగలబడిపోతున్నంత బాధ కలుగుతోంది.

'మీ మేనేజరు... ఎక్కడ ఉంటాడు.... చూపించు...' గోపాలం త్వరగా ఆ గోల ముగించుకొని హాలులోకి పోదామన్న తొందరలో ఉన్నాడు.

'పెద్దసార్... బుకింగ్ పక్కగదిలోనే ఉన్నారు సార్!'

'పద చూపించు...'

పార్వతి దారిలో గోపాలానికి ధైర్యాన్నిచ్చింది. హుషారు చేసింది.

'మీరు కోర్టులో బల్లగుద్ది వాదించామనీ... ధర్మంకోసం పోరాడామనీ, గొంతు చించుకుని ఎదుటివాడిని చిత్తు చేశామని చెబుతుంటారు గదా! ఈ చిన్న విషయంలో తటపటాయిస్తారెందుకు... ధైర్యంగా నడవండి' గోపాలం అర్జునుడైతే పార్వతి శ్రీకృష్ణుడు. గీతాబోధ విని నిటారుగా నిలిచి పెద్ద పెద్ద అడుగులు వేయటం మొదలుపెట్టాడు. గదిలోపుల ముగ్గురు, నలుగురు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

'మేనేజరు ఎవరండి?' గోపాలం మర్యాదగానే అడిగాడు. అక్కడవాళ్లలో ఒకడు లేచి

'రండి సార్ నేనే... ఏం కావాలి' అని అడిగాడు. రెండో ఆటకి టిక్కెట్లకోసం వచ్చాడేమో నుకున్నట్లు 'తమరు ఎవరు సార్... ఏం కావాలి?'

'ఎ.సి. ఆపేశారెందుకని?!' పార్వతి ముందుకు వచ్చి బల్లకానుకుని నిలబడింది.

'ఎవరు... ఆపేశారు సార్?!'

'నేను... నిన్ను అడుగుతుంటే... ఎదురు ప్రశ్న వేస్తావేమిటి...' పార్వతి ముఖాన చెమట తుడుచుకుంటోంది. నిజానికి బయట చల్లటిగాలి వీస్తోంది. 'హాల్లో ఉక్కపోసి చస్తుంటే కూర్చోలేక బయటకు వచ్చాం...' పార్వతి గోపాలాన్ని చెప్పమని తరిమింది.

'మేనేజరుగారికి రిపోర్టివ్వండి సార్' అన్నాడతను.

'నువ్వే మేనేజరునని చెప్పావు?' గుద్దులరిమింది పార్వతి.

'మీకింకా సెకండు షోకి టిక్కెట్లు కావాలేమో అనుకుని అట్లా అన్నా సార్'

'ఏదో చెప్పావు.. మీ మేనేజరు లేరా?!' గోపాలం ఎంక్వయిరీ చేశాడు.

'ఇంటికి వెళ్ళాడు సార్.... సెకండు షో టైముకి వస్తారు'

అక్కడ కూర్చున్న ముగ్గురు, నలుగురిలో ఒకడు మేనేజరు అయి ఉంటారని... తమను బుకాయిస్తున్నారని పార్వతికి గట్టిగా అనుమానం కలిగింది. అయినా తాను ఎవరిని అడిగేది? 'నేనెరుగ... నేనెరుగ.... మీ బావనడుగు...' అన్నట్లు అక్కడ ఉన్న వాళ్లంతా తప్పించుకుంటున్నారు.

'కంప్లయింటు పుస్తకం ఇవ్వండి... మేము రిపోర్టిస్తాం...' అంది పార్వతి.

'సార్... ఆ పుస్తకం ఏదో మేనేజరుగారి డ్రాయర్లో ఉన్నదండి...'

'మరి తీసి ఇవ్వు...'

'తాళం చెవి మేనేజరుగారి దగ్గరే ఉంది... సార్!' గోపాలం, పార్వతి అజాత శత్రువలయిపోయారు. ఎవరితో పోట్లాడాలో ఆ అదృశ్యవ్యక్తికి గోచరం కావటం లేదు.

'పోనీ సినిమా చూసివచ్చి... రిపోర్టిద్దాం...' అన్నాడు గోపాలం. పార్వతి రుసరుసలాడుతూ హాలులోకి వచ్చింది. సీటు వెతుక్కుని కూర్చునేటప్పటికి కరెంటు పోయింది. ఆట ఆగిపోయి హాలు తలుపులన్నీ తెరిచారు. వరండాలో పోలీసు అధికారి కనిపించాడు. ఎందుకోసం వచ్చాడో మరి?

'ఈ విషయాన్ని మనం ఇంతటితో వదిలి పెట్టకూడదు.... ఆ పోలీసుకు రిపోర్టిద్దాం రండి' గోపాలం, పార్వతి వరండాలోకి వచ్చి పోలీసును పట్టుకున్నారు.

'ఎ.సి. తీసేశారండి... రిపోర్టిస్తాం' అన్నాడు గోపాలం పోలీసుతో -

'అట్లాగే ఇవ్వండి...' పోలీసు తనకేమీ పట్టనట్లు నడిచిపోతున్నాడు కర్ర ఊపుకుంటూ.

'మీకే ఇద్దామని'

'అబ్బే నాకా? నా డ్యూటీ ఇక్కడ కాదండి...'

'జేబుదొంగ ఒకడు ఇటు పారిపోయి వస్తేనూ...'

గోపాలం ఒకసారి జేబులు తడుముకున్నాడు. పార్వతి మెడలోని గొలుసులు, చేతికి గాజులు లెక్కపెట్టుకుంది. వీళ్లింకా పోలీసు వెంటనే నడుస్తుంటే, 'కరెంటు లేక పోతే.. ఎ.సి. ఎట్లా పని చేస్తుందండీ?!' పోలీసు వెటకారంగా మాట్లాడుతున్నట్టు తోచింది.

'ఇక్కడ రిపోర్టు ఎవరికివ్వాలి......' పార్వతి చనువు చేసుకుంది.

మేనేజరుగారికివ్వండి'

'ఆయన లేరట......'

'నన్నేం చెయ్యమంటారు సార్. ఆ దొంగ దొరక్క నేను కంగారు పడుతుంటే మీరు..... ఊరికే సతాయిస్తున్నారు' పోలీసు జేబుదొంగను పట్టుకోవాలన్న దృఢ నిశ్చయంతో ఉన్నట్లు తోచింది. ఆ ఘోర ఏకాగ్ర తపస్సు నుంచి తమవైపు తిప్పుకోవాలంటే తమరిద్దరూ శివపార్వతులై తాండవం చేస్తూ ప్రత్యక్షం అయితే గాని వీలుకాదు. మళ్లీ కరెంటు వచ్చినట్లుంది. జనం అంతా లోపలకు తోసుకుంటూ పోతున్నారు. వీళ్లిద్దరూ హాలులోకి చొరబడ్డారు. లోపల చల్లగా ఉంది. ఎ.సి వేసినట్లున్నారు. సీటులో కూర్చోగానే మళ్లీ ఎ.సి పోయింది. ఎవరో టై కట్టుకున్న వ్యక్తి 'టై' తీసేసి పామును పట్టుకున్నట్లు పట్టుకుని ధుమధుమలాడుతూ బయటకు బయలు దేరాడు. 'మళ్లీ ఎ.సి. ఆపేశాడు వాడు... ఆ హాలువాడిని వదిలి పెట్టగూడదు... నేను హాల్లో కూర్చున్నానని తెలిసి గూడా ఇట్లా చేస్తాడా.... వాడి పని పడతానుండు! నాటకంలో ఏకపాత్రాభినయంలాగా అన్నట్టుగా గొణుక్కుంటూ బయటకు బయలు దేరాడు. 'మళ్లీ ఎ.సి ఆపేశాడు వాడు... ఆ హాలువాడిని వదిలి పెట్టగూడదు...నేను హాల్లో కూర్చున్నానని తెలిసి గూడా ఇట్లా చేస్తాడా.... వాడి పని పడతానుండు! నాటకంలో ఏకపాత్రాభినయంలాగా అన్నట్టుగా గొణుక్కుంటూ బయటకు వచ్చాడు. వాడి వెనకాలే పార్వతి బయలు దేరింది. ఆ తర్వాత గోపాలం, శంఖుచక్రగదాదులు....సిరికిం చెప్పకుండా శ్రీ మహావిష్ణువు బయలుదేరినట్లుంది.

సూటిగా మేనేజరు గదిలోకి వెళ్లాడు.

'నేను ఫామిలితో హాలులో కూర్చున్నట్లు తెలిసి గూడా.... ఎసి ఆపిస్తారా.... మీ మేనేజరు ఏడి....' గదమాయిస్తున్నాడు 'టై'వాడు.

'తమరు ఎవరు సార్......!' గదిలో కూర్చున్నవాడు మెల్లిగా అడిగాడు.

'వళ్లు ఎట్లా ఉంది....నేనెవరో....నేను చెప్పాలా...రేపు మీ ప్రొప్రైటరును నన్ను వచ్చి కలవమని చెప్పు....' అతను ఒక చండప్రచండుడిలా ఉన్నాడు. మేనేజరు గదిలో వాళ్లంతా గుసగుస.

'సార్....తమరెవరో తెలియక....వాడు అట్లా మాట్లాడాడు సార్....ఎ.సి. ఈ క్షణం వేయిస్తాను. వరేయి...వెంటనే ఎ.సి.వెయ్యి' అతను గట్టిగా అరిచాడు. 'అయ్యగారికి కూల్ డ్రింక్స్ తెప్పించు.. ఒకటి వారికిచ్చి.... నాలుగు లోపలకు పంపించు.....

'ఈ సారికి మిమ్మల్ని ఊరుకునేది లేదు.

మీమీద తప్పక కేసు పెట్టేస్తాను....' అతను టైని మడిచి జేబులో పెట్టుకుని ఎగిరెగిరి పడుతున్నాడు. 'నన్నెవరు అని అడుగుతాడా.....వాడు?!' మండిపడ్డాడు.

'వాడికి తెలియదు...వాడొట్టి బుకింగ్ క్లర్కు సార్...తవర్ని నేనెరక్క పోవటమేమిటి ....నేనే కాదు సారు....తవర్ని తమ ఫామిలీని తీసుకెళ్లి హాలులో కూర్చోపెట్టింది.... నేను బయటకు వెళ్లాను సార్... అందుకు ఈ పొరపాటు జరిగింది. ఈ సారికి మన్నించాలి'

అతను ప్రాధేయపడుతున్నాడు. అధికారి చిందులు తొక్కుతున్నాడు. మొగుడంటే అట్లా ఉండాలి అనుకున్నది పార్వతి. గోపాలం కోర్టులో ఈ కేసు గెలిచాను, ఆ కేసు గెలిచాను అని ఇంటికి వచ్చి కోతలు కోస్తుంటాడు. అసలు కోర్టులో ఏం జరుగుతోందో ప్రత్యక్షంగా చూడాలి అన్న తొందరపాటు కలిగింది పార్వతికి.

'కంప్లయింటు పుస్తకం తియ్....'

గోపాలం, పార్వతి గబగబా హాలులోకి వచ్చారు. కాగల కార్యం గంధర్వులు తీర్చడం అంటే ఇదే! ఎ.సి. అద్భుతంగా పని చేస్తోంది. జేబురుమాలుని జేబులో పెట్టుకున్నాడు గోపాలం, మళ్లీ ఎ.సి. ఆగలేదు.

రాత్రి నిద్రపోయేముందు గోపాలం పార్వతిని పలుకరిస్తూ 'ఎయిర్‌కండిషన్‌కంటే చల్లగా ఉండే వస్తువుని చూపిస్తాను... కావాలా....' అని అడిగాడు. పార్వతి సిగ్గుపడుతూ మీరేం అంటున్నారో నాకు అర్థం కాలేదు' అంది. గోపాలం జేబులోంచి వంద రూపాయల కాగితం ఒకటి తీసిచ్చాడు. 'దీనితో విసురుకో....' అన్నాడు గోపాలం. 'చల్లగా ఎ.సిలాగా ఉందా?' ఈ నోటు విశేషం ఏమిటో నాకు తెలియటం లేదు' అంది పార్వతి.

'పొద్దున కోర్టులో కేసు గెలిచానని చెప్పానే...దాని తాలూకు ఫీజులో ఒక కాగితం ఇది....'

ఇంతకీ.....ఏం కేసు అది....'

'సినిమా హాలు కేసే....ఎ.సి లేదని ప్రభుత్వం వాళ్లు జరిమానా వేశారు. హాలు వాళ్ల తరుపున నేను వాదించాను. నేనే గెలిచాను. అదీ సంగతి....' గోపాలం మరో నోటు తీసుకుని తను గూడా విసురుకోవటం మొదలెట్టాడు.

'చాలా అన్యాయం....ఇది....' పార్వతి మాటలు మింగుతూ గొణిగింది. మరుక్షణం ఆ రోజు వచ్చిన ఫీజుతో తనకు పట్టుచీర కొనిస్తానన్న వాగ్దానం జ్ఞాపకం వచ్చింది.

'ఎ.సి లేకపోయినా పట్టుచీర కట్టుకుంటే చల్లగానే ఉంటుంది....' అనుకుంది పార్వతి. 'ఇంతకీ ఆ కేసు ఎట్లా గెలిచారు? పార్వతి సందేహంగా అడిగింది.

'ఎ.సి పనిచేస్తూ ఉందని....ఎసి లేదని చెప్పినవాళ్లు అబద్ధం చెప్పారని రుజావు చేశాను...

గోపాలం వందరూపాయల నోటుతో విసురుకుంటూ భుజాలెగరేశాడు.

'ఏమండీ....ఏమండీ.... ఇందాక మనం వెళ్లిన సినిమాహాలు వాడిమీద కేసు పెడతానని ఆయనెవరో అధికారి బెదిరించాడు గదా... ఆ కేసు పెడితే.... ఆ సినిమా వాళ్లని కలుసుకుని...... ఆకేసు కూడా మీరే తీసుకుని గెలవండి!' పార్వతి కళ్లలో మెరుపు ఒకేసారి రెండు పట్టుచీరెలు కట్టుకున్నట్లుగా ఉంది. అయితేనేం ముఖాన చిరుచెమట మాత్రం అట్లానే ఉంది పైగా చల్లగా హాయిగా ఉంది.

– ఉదయం వారపత్రిక, 18–1–1991

# కుక్క

## పుప్పాల నరసింహం

ఇంకా తెల్లగా తెలవారలేదు. గోరు కొయ్యల కదలికలను చూసి కాలమానాన్ని కొలిచే కొమురయ్య అప్పుడే నిద్రలేచి, దగ్గుతూనే చుట్టముట్టించి, చెంబు చేత పట్టుకుని అలవాటైన దారి వెంట తన స్వగ్రామం జిన్నారంలో నడుస్తూ ఉన్నాడు.

తాను నడిచే దారి ఇరుకైనప్పటికీ ఇప్పుడు విశాలంగా కనిపిస్తోంది. నిజానికి ఎద్దుల బండి వెళ్లేంతటి దారి అది. అదేమిటో గాని ఉదయం పూట నీళ్ల కుండతో కోడలు ఎదురొస్తే ఎదురు నడవడానికి వీలు కాదు – పిల్ల బాటలా మారిన ఆ దారి రెండు పక్కల ముళ్ల చెట్లు, రాళ్ల రప్పలు పడి ఉన్నాయి – అదే దారి ఇప్పుడు విశాలంగా కనిపిస్తోంది.

కొమురయ్య తెల్ల వారాక చేయవలసిన కార్యక్రమం గురించి ఆలోచిస్తూ నడుస్తూన్నాడు.

కొమురయ్య, వయసు యాభై సంవత్సరాలకు పైనే ఉంటుంది. ఆయన ధరించిన సైన్ బట్ట బనియన్, ఎర్రంచు తూఫ్రాన్ ధోవతి కావి బోయినప్పటికీ చీకటిలో తెల్లగా కనిపిస్తున్నాయి. ఆయన కుడి చేతి 'రెట్ట'కు వెండి కడెం వెలుగుతూ ఉంది. చేతి వేళ్లకున్న రాగి ఉంగరాల మాట ఏమో గాని వెండి ఉంగరాలు తెల్లగా తమ ఉనికిని తెలుపుతున్నాయి. నిలువెత్తు మనిషిలా కనిపించే కొమురయ్య, కాళ్లకు లావుపాటి చెప్పులతో అడుగులేస్తూ ఉన్నాడు.

అలా అడుగు లేస్తూనే కొమురయ్య ఆలోచిస్తూ ఉన్నాడు. తెల్లవారి సర్పంచ్ మాధవరెడ్డితో 'పుల్లెర' విషయం ఏ విధంగా కదపాలి? అని... ఎట్లా ఆలోచించినా ప్రారంభం కుదరడం లేదు. ఫలానా తీరుగా ప్రారంభిస్తే ఫలాన తీరుగా అంటాడేమో, ఈ విధంగా అడిగితే, ఆ విధంగా అంటాడేమో, ఈ విధంగా అడిగితే, ఆ విధంగా అంటాడేమో.... ఇట్లా తనలో తానే ప్రశ్నలు వేసుకుని, సమాధానాలు చెప్పుకుంటూ అడుగు లేస్తూ ఉన్నాడు. కాని ఏ ప్రారంభం కుదరలేదు.....

ఇంతలో సందులోంచి ఓ కుక్క 'భౌ' మని మీద కొచ్చింది. కొమురయ్య ఆలోచనలు చెల్లా చెదురయ్యాయి. దాంతో కుక్క మీదకు చెంబుతో పాటే చెయ్యెత్తి

"కొత్త లేదు -- పాత లేదు- భౌమని ఎగురడేనానే?..... నీ యవ్వ" అన్నాడు.

కుక్క ఆ గొంతు ధ్వని గుర్తు పట్టి తోక టపటప ఆడిస్తూ కుయ్ కుయ్ మని కూనిరాగం తీయసాగింది. కొమురయ్య వెంట నడవసాగింది. నాలు గడుగులు అతనితో పాటే వేసి తప్పు తెలుసు కున్న దానిలా వెనక్కు వెళ్లి పోయింది.

కొమురయ్య వీధి దాటి ఊరావలకు నడిచాడు. చిమ్మెట్లు ఎడ తెరిపి లేకుండా అరుస్తూ ఉన్నాయి. చెట్ల కొమ్మల పై నుంచి పక్షుల చప్పుడు వినిపిస్తూ ఉంది. కాని కొమురయ్య మనసుకు అవేమీ పట్టినట్టు లేదు - ఆ ధ్యాసే లేదు.

ఊర్లో ఆ మూల ఈ మూల ఏవేవో చప్పుళ్లు వినిపిస్తూ ఉన్నాయి. కొమురయ్య నడిచిన దారిలో మాల వాడ దగ్గర దశరథరామిరెడ్డి పటేల్ సైకిల్‌పై నుంచి దిగకుండానే ఓ గుడిశె కేసి చూస్తూ.

" చంద్రిగా....ఒరేయ్ చంద్రిగా.... ఇంకా తెల్లార లేదురా?....నీ యమ్మ ఏం పుట్టుక పుట్టినవ్‌రా? ఇంకా పంటావు రా?...నడువ్ గోదల నిడవాలె నడూ.... " అని పిలుస్తూ ఉన్నాడు.

కొన్ని క్షణాల తరువాత ఓ పాత తలుపు తెరుచుకున్న చప్పుడయింది. ఆ తరువాత ఓ ముసలి స్త్రీ "ఇంతకు ముందే పోయిండు పటేలా - ఇప్పుడు బాయి కాడికి పోయిండొచ్చు" అంది.

"నేన్ ఆడికెల్లే వస్తున్న కనిపియ్యక పాయెనూ...?" నిందమోపుతున్నట్టు ఎదురు ప్రశ్న వేశాడు దశరథరామిరెడ్డి.

"ఇట్ల పెద్ద బాయి మీది కెల్లిపోయింటడు పటేలా" అంది ఆమె.

"తత్ నీయమ్మ...' అంటూ దశరథరామిరెడ్డి సైకిల్ మలుపుకుని వెనక్కి తిరిగాడు. ఆయన గొణగడంలో నిరాశ, అసహనం ధ్వనించాయి.

కోళ్లు కూస్తున్నాయి - తలుపులు తెరుచుకుంటున్నాయి. ముసలి వాళ్ల దగ్గు వినిపిస్తూ ఉంది. చంటి పిల్ల ఏడ్పు వినిపిస్తూ ఉంది. తల్లుల సముదాయింపు చెవిన పడుతూ ఉంది. కాకులు అదే పనిగా అరుస్తూ ఉన్నాయి. లేగ దూడలు ఆకలితో కట్లు తెంచుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. అప్పుడే పందులు ఊర్లోని మోరీల్లోకి ఆహారం కోసం వచ్చేశాయి. గాడిదలు మాత్రం పాత గోడల్లా చలనం లేకుండా నిలబడి కునుకు తున్నాయి. చేద బావి గిలకల చప్పుడు వినిపిస్తూ ఉంది. వాకిళ్లు ఊడుస్తున్న చీపిరి చప్పుడు వినిపిస్తూ ఉంది... ఈ లోపుగా కొమురయ్య కాలకృత్యాలు ముగించుకున్నాడు.

సర్పంచ్ మాధవరెడ్డి ఇంటి ముందర గాయిది మల్లమ్మ వాకిలి ఊడుస్తూ ఉంది. బాగా పొట్టిదై పోయిన చీపిరితో మల్లమ్మ పూర్తిగా వంగి వాకిలి ఊడుస్తూ ఉంది. ఎన్నో రోజుల నుంచి ఆ పాత చీపిరి పారేసి కొత్తది అడుగుదా మంటే పటేలమ్మ అడగడానికి అవకాశమే ఇవ్వలేదు. మొన్న ఎప్పుడో అడిగినప్పుడు చీపిరి పుల్లలను కోసుక రమ్మని మల్లమ్మకే పని చెప్పింది పటేలమ్మ. ఇక చేసేది ఏమీ లేక ఆ మొండి చీపిరితోనే వంగి వంగి ఊడుస్తూ ఉంది. " నడుములు పోతున్నయ్" అని తనలో తాను గొణుక్కోవడమే గాని పైకి అనలేక పోతుంది మల్లమ్మ - పైకి అంటే ఎవరు విని ఎన్ని తిట్లు తిడతారో అని అట్లాగే

ఊడ్వసాగింది.

ఎదురింటి తలుపు తెరుచుకుంది. ఆ చప్పుడుకు మల్లమ్మ తలపై కొంగు మరింత నిండుగా వేసుకుని ఊడ్వ సాగింది. అంతే కాని తల ఎత్తి తలుపు వైపు చూడలేదు.

కొన్ని క్షణాల తరువాత మాత్రం "ఏమే గాయిద్దానా, నిన్న నీ కొడుకు టమాట చెట్లకు నీళ్లు పార పెట్టేది ఇడిసి పెట్టి సినిమాకు పోతాడు?..... గిదేనా లెక్క? గిదేనా తర్వాయి? ఆ .....' ఉరిమి నట్టు అన్న ఆ మాటలకు తల తిప్పక తప్పలేదు – కాని నేరుగా చూడలేక పోయింది.

అదేమిటో గాని గొంతు ఏదో లోహపు చప్పుడులా ధ్వనించింది. ఆ ధ్వనికి, ఆ దబాయింపునకు ఎదర ఉన్న ఆ ఆకారం వైపు చూసి సమాధానం ఇవ్వడం మల్లమ్మ తరం కాలేదు. జవాబు ఇవ్వకుండా అలా నిల్చోడం నచ్చని మాధవరెడ్డి మరింత దబాయింపుగా "సప్పుడు జెయ్యి వేమే?... జీతం ఉండేటప్పుడేమో నంగి నంగి మాట్లాడ్తరు, అప్పు తీరేదాక ఎక్కడికి పోను పటేలా అని ధర్మాలు, ఖర్మాలు తింటరు. జీతం చేరినంక వారానికి రెండు దినాలు 'నాగ' లయితయి – ఏ మన్న అంటెనేమో కడుపు నొప్పి లేసింది పటేలా, కాళ్ల నొప్పి లేసింది పటేలా అని బొంకుతురు..." వ్యంగ్యంగా ఆ మాటను సాగదీశాడు. అదే ధోరణిని కొనసాగిస్తూ –

"ఈ బొంకుడు, గింకుడు నా దగ్గర పనికి రాదు – ఇయ్యాల వాడు పనికి రాకపోతే వారం రోజుల జీతం పట్టుకుంట – ఇగ నీ ఇష్టం – వానిష్టం. అటెన్క లబ లబ మొత్తుకుంటె నాతోనిగాదు – ఏమంటున్న?" అని రెట్టించాడు.

మామూలుగా అడిగితే గొంతు పెగలని మల్లమ్మ, రెట్టించి అడిగే సరికి తనలోకి తాను ముడుచుకుపోయి లో గొంతులో "పోరనికి చెప్త పెటేలా" అంది.

"చెప్పుడు కాదు – ఇయ్యాల వాడు బాయికాడ కనిపియ్యకపోతే వాణ్ణి ఏం చేస్తనో సూడు...." అని కోపంగా అన్నాడు.

మల్లమ్మ మౌనంగా ఉండి పోయింది.

మాధవరెడ్డి చేతిలోని గొలుసును కుక్క లాగుతూ ఉంది. దాంతో ఆయన ముందుకు అడుగేయక తప్పలేదు.

మల్లమ్మకు సర్పంచ్ మాధవరెడ్డి కన్నా ఆ కుక్క అంటేనే ఎక్కువ భయం. మొదట్లో అది కుక్క కాదు ఇంకేదో జంతువు అనుకుంది మల్లమ్మ. కాని క్రమంగా నమ్మక తప్పలేదు. నమ్మాక ఆ కుక్కను మాత్రం నమ్మడానికి వీలు కావడంలేదు. అందుకనే అది ఎక్కడున్నా దూరం దూరం నుంచే మసులు కోవడం అలవాటైంది. మల్లమ్మే కాదు – ఆ ఇంటికి ఎవరొచ్చినా ఆ కుక్కను చూసి దూర దూరంగానే ఉంటారు.

మాధవరెడ్డికి కావలసింది కూడా అదే. అందు కోసమే పట్నంలోని తన చుట్టాల దగ్గర నుంచి ఆ కుక్కను తీసుకొచ్చాడు. ఇప్పుడది తొమ్మిది నెలల కుక్క అంటే ఎవరికి నమ్మ బుద్ధి కాదు – తొమ్మి దేళ్ళు పైబడిన కుక్కలా లావుగా, ఎత్తుగా ఎదిగి, ఎద్దులా ఉంది. మల్లమ్మ అప్పుడప్పుడు ఆ కుక్క గురించి ఇతరులకు చెప్పేటప్పుడు "ఎద్దు లెక్క ఉన్నది ఆ కుక్క" అని అంటూ ఉంటుంది.

విశాలమైన వాకిట్లోకి మాధవరెడ్డి హవాయి చెప్పులతో అడుగు పెట్టాడు. ఇతరులు ఎవరు ఏమి చెప్పినా వినడం అతనికి అలవాటు లేదు - తన మాట ప్రకారమే ప్రతీదీ జరగాలన్నది ఆయన అభిమతం - ఒక వేళ ఇతరుల మాట విన్నా ఆ మాట - ఆలోచన సమంజస మనిపించదు - కాని తన కుక్క గొలుసుతో ఎటు లాక్కెళ్లినా అనునయిస్తూ బుజ్జగింపు మాటలు మాట్లాడుతూ అటు వెళుతూ ఉంటాడు. అది మూత్రం పోయడానికి, మలవిసర్జన చేయడానికి అనువైన చోటు కోసం ఎన్నో స్థలాలను వెతుక్కుంటూ ఉన్నా విసుక్కోక దాని వెంట వెళ్లడం అలవాటు.

అలాంటి మాధవరెడ్డికి దాదాపు యాభై సంవత్సరాలుంటాయి. అయితే ఆయన ముప్పైఐదు సంవత్సరాల వాడిలా కనిపిస్తాడు. ఖద్దరు అంగీ తొడిగి, చేనేత లుంగీ కట్టి చేతికి బంగారు బటువులతో, బంగారం రంగు గడియారంతో అలా ఉదయం పూట కుక్కతో పాటు తిరగడం ఆయన అలవాటు - దారిన వెళ్లే వాళ్లు భయంతో, భక్తితో మొహమాటంతో దండలు పెడుతూ ఉంటారు. దర్జాగా తల ఆడించి ఊరు కోవడం ఆయనకున్న మరో అలవాటు.

కొమురయ్య తలనిండా రుమాలు చుట్టుకొని, భుజాలపై గొంగడేసుకుని, నోట్లోకి వస్తున్న మీసాలను సరిచేసుకుని, "మంద" కాడికి వెళ్లేప్పుడు తీసుకెళ్లే కర్రను తీసుకుని, లావుపాటి చెప్పులు వేసుకుని బయలు దేరాడు.

ఊరంతా సందడిగా ఉంది. ఎవరి పనులపై వారు తిరుగుతూ ఉన్నారు. అల్లం మొరబ్బ అమ్మే దస్తగిరి బుట్టి పట్టుకుని తనదైన ప్రత్యేక పద్ధతిలో 'అల్లం మొరబ్బల్లం మొరబ్బా' అంటూ వేగంగా అడుగు లేస్తూ ఉన్నాడు. 'చేనే పుటానే....' అంటూ సైకిల్‌పై మరో వ్యాపారస్తుడు తిరుగుతున్నాడు. అతని సైకిల్ వెనకాల పాత ఇనుప సామాగ్రి కనిపిస్తోంది. ఎవరో ముసలామె గొణుగుతూ, ఎవరినో శపిస్తూ బజారు వైపు పోతూ ఉన్నది. వీధిలో నిలబడి ఓ తల్లి, ఆడుతున్న తన కూతురిని కూక లేసి పిలుస్తోంది. కట్టెల మోపుతో అడివి నుంచి ఊర్లోకి వచ్చిన లంబాడి యువతి వీధుల్లో తిరుగుతోంది. బావిలో చేతాడు తెగి పడిందని ఎవరో 'పాతాళ గరిగె' తీసుకెళుతూ ఉన్నారు. పదేళ్ల పిల్ల తలపై పిండి బగోనితో నడుస్తూ ఉంది.

కొమురయ్య నడుస్తూ ఉన్నాడు. నోట్లోని చుట్ట కాలుతూ ఉంది. అతని ఆలోచనలు ఇప్పుడు ఉదయంలా గజిబిజిగా లేవు. 'పుల్లెర విషయం అడుగుదాం' అని నిశ్చయించుకుని బైలు దేరాడు. ఎదరకు పోక ముందే అన్ని సంగతులు తనే అనుకోవడం బాగుండదని అడుగు లేస్తూ ఉన్నాడు.

దారిలో కావలి ముత్యాలు ఎదురై "దండం బావ" అన్నాడు.

కొమురయ్య క్షణ మాగి "దండమోయి ముత్యాలు - మంచి గున్నావా?" అని అడిగాడు.

"ఉన్నం గిట్ల మీ దయల మాగంజి తాగుకుంట."

"ఏమో అట్ల వడితివేమోయ్ పిలగా"

"అంతే కద బావ- సర్కారు నౌఖరి అన్నట్టే గాని సర్రాసుగ ఎప్పుడూ జీతం

వొచ్చింది లేదు. వొచ్చినా కడుపు నిండది - కాలు నిండది"......' అన్నాడు యాభై ఏళ్లు దాటిన కావలి ముత్యాలు.

"కూసున్న కాడికి జీతం వొచ్చే నువ్వే అట్ల అంటే, ఇత్తుకు ఇతు మారు లేకుంటే కష్టపడేటోడు ఎట్లనాలే? గుట్ట గుట్టకు, చెట్టు చెట్టుకు తిరిగే నాయనుంటోడు ఏమనాలే?" అనడిగాడు.

"ఏమంటడు, ఎల్లకుంటె అప్పుసప్పుజేస్తడు కడుపు నిండ తింటడు...." అని మాట పూర్తి చేయకముందే కొమురయ్య అందుకొని "ఊరంతా నీ చేతుల ఉంది ఊరికి కావలి కాని వయిలివి. మరి అప్పుసప్పు నీకు దొరుకదా నోయ్?" అనడిగాడు.

"అప్పు మాట అంటే అవత లుండుమంటరు...."

"అందరి సంగతి గంతే!"

"నా కెరక లేదానే బావ! ఎవని సంగతి జూసినా గిట్లనే ఉన్నదని.... అవ్ గాని ఏడికో పోతున్నవూ?" అనడిగాడు ముత్యాలు.

"సర్పంచ్ దగ్గర్కి పోతున్న - ఉన్నడా?"

"ఏమో బావ! నేను అటు పోలేదు - ఇప్పుడు పోతినాంటే అంబటేళ్ల దాక ఆడనే ఉండుడయితది. అందుకనే జెర కోమటి ఈశ్వరయ్య దుకాణం దాక పోయొస్తనని పోతున్న...."

"సరే పో. సర్పంచ్ ఏడికన్న పోకముందే కలువాలే...."

"పాయిరా" అంటూ ముత్యాలు ముందుకు కదిలాడు.

కొమురయ్య సుట్ట ఆర్పి కమీజు జేబులో వేసుకొని అడుగు ముందుకేశాడు.

సర్పంచ్ మాధవరెడ్డి ఇంటి వసారాలో కుర్చీలో కూర్చున్నాడు. అతని పక్కనే (జాతి) కుక్క నాలిక చాచి, చూస్తూ కూర్చున్నది. దాని కళ్లు పళ్లు భయంకరంగా కనిపిస్తున్నాయి. సైగ చేస్తే ఎప్పుడు, ఎదుటి వారిపై పడి రక్కేద్దామా అన్నట్టుగా ఉంది.

కొద్ది దూరంలో కాముని భూతం, కర్రె కాకి, కుంటెను గాడు లాంటి కాశయ్య నిల్చున్నాడు. ఊరి సమాచార మంతా సేకరించి సర్పంచ్‌కు అందజేసే కాశయ్యకు గ్రామస్తులు పై మారుపేర్లు పెట్టారు.

కాశయ్య ఏదో చెబుతుండగానే అక్కడికి కొమురయ్య వచ్చాడు.

రాగానే "దండం పటేలా" అని వినయంగా నమస్కరించాడు.

కాశయ్య చెప్పే మాటలను ఆపేశాడు. మాధవరెడ్డి తలుపు వద్ద ఉన్న కొమురయ్యను చూసి "దండం - ఏం బిడ్డా కొమురయ్య బాగున్నవా?" అని కుశల మడిగాడు.

మాధవరెడ్డి కన్నా వయసులో పెద్దయిన కొమురయ్య వినయంతో "ఏదో మీదయ గిట్లన్ను పటేలా" అన్నాడు.

"అరె, కాశయ్య నివ్ పో! నీ పని నువ్ జూసుకో పో...."

మాధవరెడ్డి అనగానే కాశయ్య అక్కడి నుంచి కదిలాడు. తలుపు దగ్గర ఒదిగొదిగి నిల్చున కొమురయ్య నుద్దేశించి "ఏమో పొద్దుగాల పొద్దుగాల వొచ్చినవేంరా?" అనడిగాడు మాధవరెడ్డి.

"నీ దగ్గరికే వొచ్చిన పటేలా" అని చేతిలోని కర్రను పక్కకు పెట్టాడు.

"నా దగ్గరికా?!" కావాలనే కొంత ఆశ్చర్యంగా అడిగాడు మాధవరెడ్డి.

తిరిగి తనే "నాతోని ఏం పనిరో?" అనడిగాడు.

"ఊరి పటేల్‌తో పని పడదా?" చిరునవ్వు, వినయం కలెగలిపి అన్నాడు కొమురయ్య.

"నా తోని ఏం పని పడ్తదిరో? నే నే మన్న సావుకారి నా? పోలీసు పటేల్నా? మాలీ పటేల్నా? నాతోని ఏం పని పడ్తదిరా? నా దగ్గరే ముందిరా? అవునబ్బ నూర్లకు నూర్ల ఎకరాల భూమి ఉన్న భూ సామినా? నా దగ్గరే ముందిరా బురకలడ్డు!....." తనను తాను కించపరచు కున్నట్టు పైకి అనిపించినా అందులోనే అందరి కన్నా తానే గొప్పవాడి ననే భావం తొంగి చూస్తూనే ఉన్నది.

కొమురయ్య ఆ విషయాన్ని గమనించకపోయినా "అవన్నీ ఉంటేనే రావాల్నా, లేకుంటే లేదా పటేలా?" అని అడిగాడు.

"అగో, ఇయ్యాల రేపు 'దునియ' ఎట్లున్నదిరా?"

"దునియ కేం పటేలా తీరుతీరున మార్తది"

"తీరు తీరున మాట ఇడిశిపెట్టు. ఇప్పుడు ఎవడన్న చెప్పిన మాట ఇంటున్నాడు ఊర్లె... ఎవన్నీ 'అరేయ్' అనొచ్చేటట్టు లేదు. 'తురేయ్' అనొచ్చేటట్టు లేదు - ఒక్కొక్కడు మా అంత మొగోళ్లే లేరని తిరుగుతున్నరు. మూతి మీద మీసం రానోడు గూడా నేనే మొగోణ్ణి అంటున్నడు - ఏడ 'ఖదర్' ఉందిరా? ఊరు ఖదరే పోయింది. ఊర్లె ఉన్న పెద్ద మనుషుల ఖదర్ ఏమన్న ఉన్నది? ఏం లేదు - పిర్రలకు తుడుసుకపోతున్నరు...." మనసులోని మాటని వెళ్లగక్కి నాటకీయంగా ఆశ్చర్యంతో నోరు తెరిచి చూస్తూ ఉండగా "జమాన అట్లొచ్చింది..." అన్నాడు కొమురయ్య.

మాధవరెడ్డి తేరుకుని "ఏం జమాన రా? ఏర్లె జమాన! చిన్న, పెద్ద, మర్యాద, గిర్యాద ఏం లేని జమాన ఎందుకురా? గింత గింత పోరలు - నా కండ్ల ముంగట పుట్టిన పోరలు నువ్వెంత - నీ పోకడెంత అన్నట్టుగ తిరుగుతున్నరు. ఇగ వాళ్లకు ఏం జెప్తవో చెప్పు?"

"ఇగ అసుంటోళ్లకు ఏం చెప్తం?"

"ఏం చెప్తం? మూసుకోని కూసోవాలె. అంతే? అంతకు మిక్కిలి ఏం లేదు - జీతగాడు నాగలి ఇడిసి సిన్మకు బోయినా ఏం అనొచ్చేటట్టు లేదు - కలుపు కూలోళ్లు అంబటేళ్లకు పన్నెండు గంటలప్పుడు వొచ్చినా ఏ మనొచ్చేటట్టు లేదు. బర్లకాడి పోరడు ఎంత పోరడు అగో వాణ్ణి కూడ పలక రిచ్చేటట్టు లేదు. నాలుగు గట్టిగ అంటే తెల్లారి పనికి 'బంద్'. ఆడు పనికి బందయితే ఆ నోరు లేని జీవాల గోస పోసుకున్నట్టు అయితది. వాడు గాకుంటే ఇంకోడు అనెటట్టుందా? రెండువేల రూపా(య)లు అడ్వాన్సు ఇస్తామన్నా ఏ పోరడు ఉండెటట్టు లేదు. రెండు వేల రూపా(య)లు అంటే వానికి రెండు రూపా(య)లతో సమానమయింది. అగో గట్ల నడుస్తున్నది ప్రపంచం. ఇగ ఏం చెప్పుతవో చెప్పు?..."

"అందరు ఒకే తీరు ఉంటారు పటేలా?" అన్నాడు కొమురయ్య కొంత అసహనంగా కదులుతూ –

"నువ్వొక్కనివి అట్ల ఉండకపోతే, అందరు నీ లెక్కనే ఉంటరనుకుంటున్నావురా? మొన్న పెద్ద బాయికాడ మల్లిగాడు దుక్కి దున్నుడు ఇడిసిపెట్టి ఏదో ఊరికి బోవాలంట అని పోయిండు – వారం దినాలయితుంది ఇంత వరకు పత్తాలేడు. మిర్ర పొలంకు నీళ్లు లేక వరి ఎండిపోతున్నది. ఎవడన్న జీతగాడు నీళ్లు పెట్టినాడు? – చెప్పుతే చేస్తం! చెప్పకుంటే ఎందుకు చేస్తం? అని ఇరిగేసుకొని కూసుంటరు. థుత్! నీ తల్లి! ఈ యవసం చేసుడు కన్నా ఎటన్న దెంక పోవుడు మంచిగుందోస...." తన నిశ్చితాభిప్రాయం ఇదే అన్నట్టుగా అన్నాడు.

"............"

కొమురయ్య చూపులు మాధవరెడ్డి పక్కన కూర్చున్న కుక్కపై ఉన్నాయి. ఆ కుక్క కూడా కొమురయ్యనే రెప్ప వాల్చకుండా, తీక్షణంగా చూస్తూ ఉంది. ఆ చూపుల్లో ఏముందోగాని కొమురయ్య నోట మాట రాలేదు.

మాధవరెడ్డి మాత్రం కొమురయ్యనుద్దేశించి "అన్నిటికన్నా నీ పనే మంచిగున్నదిరా, భుజం మీద గొంగడేసుకొని, సుట్ట ముట్టిచ్చుకొని, గొర్లను, మేకలను ఎంటేసుకొని గుట్టలు, చెల్కలు తిరిగొస్తె కాల మెల్లిపోతది. రంగ రంగాను కుంట తిని పంటవు..."

"బైటకు సూస్తె అట్లనే అనిపిస్తది పటేలా – గొల్లోనికి గోశి నిండా బాధలే...." అన్నాడు కొమురయ్య.

"బాధలు ఎవనికి లేవుగానీ, నీ పనేందో చెప్పు?" అని మాధవరెడ్డి కుర్చీలో సర్దుకుని కూర్చొని అసలు విషయానికొచ్చాడు.

కుక్క సైతం కొంచెం ముందుకు జరిగి అప్రమత్తంగా కూర్చున్నది.

కొమురయ్య మాత్రం కొంత ఎడం జరిగి వినయంగా, నమ్రతతో "పుల్లెర సంగతి మాట్లాడ్దామని వొచ్చిన పటేలా!" అన్నాడు.

"సల్ల కొచ్చి ముంత దాసుడు ఎందుకు? అప్పుడే అడగొచ్చు కదరా ఈ మాట?"

"............"

"పుల్లెర సంగతి నెలకిందనే చెప్తి కదరా?"

"చెప్పినవ్. కాదంటలేను, పటేలా! కానీ..."

"ఇంకేందిరా?"

"గంత ఎక్కువంటే ఎల్లది, పటేలా!"

"ఎల్లకుంటే ఊకోరా! బలవంత మేముంది? నీకు ఎల్ల దనుకుంటె నీ జాగల నువ్వుంటివి, నా జాగల నేనుంటి. అయిపాయె! నాకు ఎక్కువ పుల్లెర ఇచ్చి నువ్వెందుకు నష్టపోవాలె?"

"బైట ఇంకెక్కడ మేత దొరుకుతలేదు, పటేలా!"

"దానికి నన్నేం చేయమంటవ్ చెప్పు! పటేలా! ఇంటికి సుట్టమొచ్చిండు – ఇన్ని పాలు పొయ్యమంటె పోస్త! ఆకలయితుంది, బుక్కెడు బువ్వ పెట్టమంటే పెడ్త, అంతేగాని

పుల్లెర తక్కువ జేయమంటే మాత్రం నాతోని గాదు. ఇంకెవరి దగ్గరనన్న సూసుకో!"

కట్టె విరగకుండా, పాము చావకుండా మాధవరెడ్డి పుల్లెర సంగతి చెప్పేసరికి కొమురయ్యకు వచ్చిన పని కుప్పకూలిపోయినట్లనిపించింది. ఉదయం నుంచి మనసులో ఏదో మూల కలుగుతున్న భయం కాస్త వాస్తవమైంది. సూటిగా పుల్లెర విషయం అలా చెప్పేసరికి మరే విధంగా వేడుకోవాలో తోచడం లేదు. మాధవరెడ్డి దగ్గర కెళ్లి కాళ్లావేళ్లా బతిమాలుకుందామన్నా పక్కన ఉన్న కుక్క రక్కేస్తుందేమో నన్న అనుమానం, భయం కలుగుతున్నాయి. పుల్లెర సంగతి తేలకపోతే తన గొర్లు, మేకల మేతకు కష్టమయ్యేటట్టుంది. కొమురయ్య మనసులోనే తర్జనభర్జన పడుతూ, దీనంగా మాధవరెడ్డి వంక చూశాడు.

ముందుగా అతని చూపులకు కుక్కనే కనిపించింది. అప్పుడది కుక్కలా లేదు. తోడేలులా ఉంది. అదను చూసి మందపై పడటానికి సిద్ధంగా ఉన్నట్టు తదేకంగా చూస్తోంది. బలవంతంగా కొమురయ్య మాధవరెడ్డి వంక చూశాడు. అతని చూపులు కూడా ఆ కుక్క చూపుల్లా మింగేసేటట్టు తీక్షణంగా ఉన్నాయి. ఎత్తుకు పై ఎత్తు వేసే నక్క చూపుల్లా ఉన్నాయి. ఆ కళ్లలో ఏ మాత్రం కరుణ, జాలి, దయ కనిపించడంలేదు. మోసగించడంలో, నమ్మించి గొంతు కోయడంలో ఆరితేరిన చూపుల్లా చురకత్తుల్లా ఉన్నాయి.

అయినప్పటికీ అవసరం తనది కాబట్టి మరోసారి అడుగుదామని, "వచ్చే ఏడు పెంచుదురుగాని, ఈ ఏడుకు ఇట్లనే..." నేలను చూస్తూ అన్నాడు కొమురయ్య.

"వచ్చే ఏడు రాముడెవడో, రాకాసి ఎవడో! అప్పటి మాట ఇప్పుడెందు కనుకోవటం కొమ్మిగా!" అంటూ కుక్క తలపై చెయ్యేశాడు.

"భౌ! భౌ! భౌ!" అని కుక్క నాలుగు కాళ్లపై నిలబడి ఉరుము ఉరిమినట్లు కొమురయ్య పైకి మొరిగింది.

అకస్మాత్తుగా ఆ శబ్దం వినేసరికి కొమురయ్య ఉలిక్కిపడ్డాడు. చెవులు దిబ్బడేసి నట్టయ్యాయి.

ఇక లాభం లేదనుకుని, కొమురయ్య చేతులు జోడించి మాధవరెడ్డి వంక చూశాడు. ఉరిమురిమి చూస్తున్న ఆ కుక్కకు, మాధవరెడ్డి పటేలుకు ఏ మాత్రం తేడా కనిపించడం లేదు. రెండు జాతి కుక్కలను చూస్తున్నట్టుగానే ఉంది. మనసు బరువెక్కి కళ్లు మూసుకున్నాడు కొమురయ్య. అయినా రెండు జాతి కుక్కల ఆకారం మనసులో మెదులుతూనే ఉంది. అవి మీద పడుతున్నట్టుగా ఉంది.

— ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, జనవరి 19–25, 1994

# మంచివాడు

ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు

ఇంకా పొద్దుగూకలేదు. పెదరెడ్డి కల్లాంకాడకి బయలుదేరాడు. చేతికి పొన్నుకర్ర. భుజం మీద ఎర్రరంగు పైగుడ్డ. నల్లటి ఒళ్ళు. ఇంతెత్తు మనిషి, వయసు మీదబడి కొంచెం నడుం వంచినా, పొన్నుకర్ర సాయంతో నిటారుగానే నడుస్తాడు.

పెదరెడ్డి ఒంట్లో నిస్సత్తువగా ఉంది. నిదానంగా, నీరసంగా నడుస్తున్నాడు. కపిలబావి దగ్గర కాటయ్య ఎదురుపడ్డాడు. పెదరెడ్డి అడుగుల్లో వడి పెరిగింది. వాడిన ముఖంలోకి దర్పం వచ్చింది. కాటయ్య పలకరించాడు.

"ఏం పెదరెడ్డీ, ఇంత పెందలకాడే బయల్దేరినావు? నీకు ఏ కయ్యాలబడ్డే అదే లోకం గదా. మాపిటికింత కూడు దినేసి ఒకేతూరి బయల్దేరుండగూడదా. ముద్దురెడ్డి కల్లాం మీద ఏ దొంగలు, తోడుబోతులు పడ్డారని ఇంత పొద్దుకాడే బయల్దేరినావు? నీ బోటోడుండబట్టే గదా ముద్దురెడ్డి ఈ దినానికి ఇంతటోడు అయింది. సరేగానీ మనిషేందట్టుండావు. జెరం తగిలోన్నిడిమాదిరి. సందెకాడ అంత ముద్ద తినేసి గుట్టుగా నడుం వాల్చే రాత లేదుగదా నీకు."

కాటయ్య మాటలు పట్టించుకోనట్టుగానే పెదరెడ్డి ముందుకు నడిచాడు. ఒంట్లోని నీరసాన్ని, ముఖంలోని దిగులును దాచడానికి పొన్నుకర్ర టకటకలాడించుకుంటూ గబగబా నడిచాడు.

కల్లాంకాడ జీలగ చెట్టు నీడలో కూర్చుని నాగయ్య బీడీ తాగుతున్నాడు. అల్లంత దూరాన పెదరెడ్డి కనబడగానే బీడీ ఆర్పేసి మిగిలిన ముక్క చెవి వెనుక దోపుకున్నాడు. లేచి వడ్లు కుప్పదోయడం మొదలుపెట్టాడు.

రోజూ కల్లాం మొత్తం కలదిరిగి గానీ నీడకు చేరని పెదరెడ్డి, ఈరోజు నేరుగా జీలగచెట్టు కిందకి నడిచాడు. నులక మంచం మీద గోతాంపట్ట విదిలించి వేసి కూర్చున్నాడు. పొన్నుకర్రను భద్రంగా తన పక్కనే పెట్టుకున్నాడు.

"నాగా! ఆ పిచికల్ని అట్టగొట్టు. యామారినామంటే వడ్లరాసంతా ముక్కున

కరుసుకుబోతాయి" అని పని పురమాయించాడు.

నాగయ్య పిచికల్ని అదిలించి వచ్చి రెడ్డి ముందు నిలబడ్డాడు.

"బాయికాడికి బొయ్యి దబర నిండా నీళ్ళు ముంచకరా బో" అని చెప్పి, పై గుడ్డ చుట్ట చుట్టి మంచం కోడు మీద దిండులాగా పెట్టుకుని పడుకున్నాడు. కళ్ళు మూతలు పడుతున్నాయి. కడుపులో దేవినట్టుగా ఉంది. తల వెనుక చేతులు పెట్టుకుని వెల్లకిలా పడుకుని పైకి చూశాడు. జీలగ చెట్టు కొమ్మల్లో పసిరిక పాము కనిపించింది. వడ్ల రాసిమీద పొల్లాడి పొల్లాడి అలసి వచ్చి వాలి సేద దీరుతున్న పిచ్చుక కోసం అది కాపేసుకుని ఉంది.

పెదరెడ్డి చిపుక్కున పాన్నుకర్ర అందుకున్నాడు. ష్..ష్ అని అరుస్తూ కర్రతో కొమ్మలు అదిలించాడు. పిచ్చుక తుర్రున ఎగిరిపోయింది. పసిరిక పాము భయంతో ఇంకో కొమ్మచాటుకి జారుకునింది. పెదరెడ్డి నిశ్చింతగా నులకమంచం మీదకూర్చున్నాడు.

నాగయ్య నీళ్ళ దబర తెచ్చి మంచం కింద పెట్టాడు. ఇత్తడి చెంబుతో నీళ్ళు ముంచుకుని పెదరెడ్డి నోట్లో పోసుకున్నాడు. తొలిగుక్క గొంతులోకి దిగేటప్పటికి గుండె పట్టినట్టుగా అనిపించింది. నోటికాడి నుంచి చెంబు పక్కకి తీసేశాడు. గొంతులోని నీళ్ళు కడుపులోకి జారాక నిదానంగా గుక్క గుక్కగా తాగాడు.

నాగయ్య విచిత్రపోయి చూస్తున్నాడు.

సేరు పాల చెంబు నోటికాడ పైకెత్తినాడంటే రెడ్డి ఖాళీ అయ్యేదాకా దించడు. అటువంటోడు ఈరోజు తులసి తీర్థం తాగినట్టుగా నిలిచి నిలిచి నీళ్ళు తాగుతుండాడేందబ్బా అనుకుంటూ చూశాడు.

"నాగా, ఈ రెండు కువ్వలమీద గూడా గెడ్డి కప్పేసి నువ్వింక గుడిసికి పో" అని పెదరెడ్డి చెప్పాడు.

"నీకు మాపిటికి కూడెట్ట? తెచ్చిపెట్టేసి పోతాన్లే సామీ" అన్నాడు నాగయ్య.

"చెప్పింది చెవినేస్కో. కల్లాంకాడ నేనుంటానుగానీ, నువు పో. ముద్దురెడ్డి పెళ్ళాంకాడికి బొయ్యి కూలి డబ్బులు తీసుకొని పో. పోతాపోతా ఒక పాట్లాం పోసుకొని పొయ్యేవు. మక్కిలిరగతాయి. రూకలు పెళ్ళాం చేతికిచ్చి అరువుగా ఇంత కాసుకుని తాగి గుట్టుగా పడుకో" అన్నాడు.

అయినా, నాగయ్య నసుగుతూనే నిలబడ్డాడు.

"నీకు మాపిటికి కూడు దెచ్చిపెట్టేసి పోతాన్లే సామీ" అన్నాడు.

"మళ్ళీ అట్నే అంటావు. ఒక తూరి చెప్తే ఎక్కదేంది నీకు. కూటికేం కొళ్ళబోలేదుగానీ నువు పో. చినరెడ్డి తెస్తానన్నాడ్లే" అని విసుక్కుని నాగయ్యను పంపేశాడు.

పెదరెడ్డి మాటల్లో తొలి అబద్ధపు తడబాటు కనిపించింది.

నాగయ్య కదలకపోతే పెదరెడ్డి పెద్ద చిక్కులోనే పడేవాడు. కూటేళకి పనోడు గడపకాడికి వస్తే కడుపునిండా పెట్టకుండా పంపే పద్ధతి పెదరెడ్డి ఇంటావంటా లేదు. పెదరెడ్డి చిన్నతనంలో అయితే పొయ్యి మీద ఎప్పుడూ పనోళ్ళ కోసమని పెద్ద దబర ఉడకతా ఉండేది. యాళకి వచ్చిన వాళ్ళకంతా వండి వార్చి వడ్డిస్తా ఉండేవాళ్ళు. పెదరెడ్డి

పెత్తనం వచ్చేప్పటికి అంత లేదుగానీ, పనోళ్ళ కడుపుకింత పెట్టే ఆచారం మాత్రం మారలేదు. అందుకే పెదరెడ్డికి కూడు తేవడమంటే నాగయ్యకు అంత కుశాల

కానీ, ఈరోజు పరిస్థితి వేరు. పొయ్యిలో నిప్పుకల్లు లేదు. తెల్లారి నుంచి ఇంట్లో ఎవ్వరూ ఇన్ని సద్దినీళ్ళు కూడా గొంతులో పోసుకోలేదు. కూటేళకి యానాది నాగయ్య గడపకాడికి వస్తే ఏం పెట్టి పంపుతారు? ఇంట్లో పస్తుంటే వీధిలో తెలీదుగానీ, పనోడికి పెట్టకపోతే వీధంతా రచ్చేగదా!

పెదరెడ్డికి పేగుల్లో జ్వరం కాస్తున్నట్టుగా ఉంది. వడ్ల బొట్ట ఖాళీ అయి నెల రోజులయింది. ఆ ఇంట్లో, ఈ ఇంట్లో అరువు తెచ్చుకుని కడుపు నింపుకుంటున్నారు. ఇదంతా కోడలి సమర్థత. ఈరోజుటికి ఇంక అప్పు అడగడానికి ఇల్లే లేకపోయింది. ఒకతూరి అడిగినవాళ్ళనే అడగడానికి మనసు రావడం లేదు. కోడలు తన వల్ల కాదని తెగేసి చెప్పేసింది. పెదరెడ్డి పెట్టేవాడేగానీ, అడిగేవాడు కాదు. కొడుకు ఆ తండ్రి బిడ్డే. ఇద్దరు పసిబిడ్డల్ని చూస్తే మాత్రం కడుపు తరుక్కుపోతుంది.

ఈ నాలుగు నాళ్ళు గడిస్తే చాలు. పంట ముద్దురెడ్డి ఇంటికి చేరుతుంది. పెదరెడ్డి ఇంటికి తిండి గింజలు వస్తాయి. కానీ, ఈ నాలుగు నాళ్ళయినా గడిచేదెట్లా? ముద్దురెడ్డి ఊళ్ళో లేడు. ముద్దురెడ్డి పెళ్ళాం నోటి మనిషి. మంచీ మర్యాదా లేదు. తిండి గింజలకోసం ఆయమ్మ దగ్గర మాటెవరు పడతారు!

నులక మంచంమీద పెదరెడ్డి అశాంతిగా కదిలాడు. కళ్ళు మూతలు పడవు. బాధ కడుపులో సుళ్ళు తిరుగుతూ ఉంది. తెల్లారి నిద్ర మంచంమీద ఉండగానే కొడుకు, కోడలి కొట్లాట చెవినబడింది.

"నువ్వూ మీ నాయినా ఏ ఏట్లోనన్నా బడి సావండి. నేను మాత్రం ఈ దినం ఒకరి గడప తొక్కేదిలా, ఒకర్ని దేబిరించేదిలా. చింతమాకులు మాదిరిగా ఇద్దురు మొగోళ్ళు ఇంట్లో ఉండేమిటికి సుకం? పరువుకనీ పెతిష్టకనీ బొయి ఆడదాన్ని ఊదిలోకి పంపిస్తుండారే, ఎవరైనా ఇంటే మీ మొహాన కేకరించి ఊస్తారు."

"మే, ఆడమేక మాదిరిగా గొంతు చించుకోబాక. నా మాటిను. ఈ నాలుగు నాళ్ళూ అట్ల గడవనీ. రామయ్యశెట్టి దెగ్గిరికి బొయ్యి బతిమాలో బంగపడో నాలుగుసేర్లు అప్పు దీసకరా బో" అని కొడుకు అడుగుతున్నాడు.

"నా పాణం బొయినా సరే. ఈ దినం ఒకర్ని అడిగేదిలా. పూటపూటా చేబెత్తుకొని గడప గడపా తిరిగే పని నాకేంటికి బట్టింది? మీ అబ్బా కొడకలే ఊదిలోకి బొయ్యి ఇన్ని గింజలు తెచ్చి పొయ్యండి."

"మే! ఇన్ని దినాలు ఒకరి ముందు చేతులు సాచినోళ్ళం గాదు. ఈ ఒక్క దినం బిడ్డల మొహం జూసైనా ఇన్ని గింజలు దెచ్చి ఉడకేసిబెట్టు" అని కొడుకు బతిమాలు కుంటున్నాడు.

ఈ మాటతో కోడలు ఒంటికాలి మీద లేసింది.

"ముయ్యెట్ట నోరు. ఏం, బిడ్డల మొహం జూసేది నేనేనా, మీ అబ్బాకొడకలకి కళ్ళు

లేవా? బిడ్డల బాధ బట్టింది నాకేనా, మీ అబ్బా కొడకలకి బట్టదా? ఏ లగ్గాన మావాళ్ళు నన్నీ కొంపలో ఇచ్చినారోగానీ, ఏనాడైనా ఒక సుకమనేది ఎరుగుదునా? ఒక మిఠాయనీ, ఒక పండనీ, ఫలమనీ తిన్నానా? నా బిడ్డల కింత బెట్టానా? కడంతకాలం గొడ్డు మాదిరిగా చాకిరి చెయ్యమని గదా ఆ పాపిష్టి దేముడు నా నెత్తిన రాసినాడు." ఆమె ఆగ్రహం దుఃఖంగా మారింది. ఆమెను సముదాయించే మాటలేవీ అతని దగ్గర లేవు. కొంత మౌనం తరువాత తిరిగి ఆమే నోరు విప్పింది.

"పెగ్గిలికి బొయ్యి ఇంట్లోదంతా ఈదిలో బెట్టి పెళ్ళాం బిడ్డల్ని పస్తులు బెడ్తుండారే మీ అబ్బా కొడకలు. బూమీ బుట్రా ఆ ముద్దురెడ్డి ఎదాన బెడ్తిరే. గుడికనీ, బడికనీ, రాయికనీ రప్పకనీ నగానట్రా గూడా ఊడ్చి బెడ్తిరే. పెదరెడ్డి మంచోడనీ, చినరెడ్డి మంచోడనీ ఊళ్ళో వాళ్ళంతా నెత్తిన బెట్టుకుంటారని గదా మీరింతకాడికి జేసినారు! అక్కడికి పెదరెడ్డి కోడలే ఈ ఊళ్ళోళ్ళకి నోటిగల్ల మనిషి. పాపిష్టి ముండ అయింది. ఇద్దో... నేను గూడా పంటరెడ్డికి బుట్టిందానే. నాగ్గూడా పరువుండాది. పెళ్ళాం బిడ్డల్ని సాక్కుంటారో నంపుకుంటారో నాకు తెలవదు. నందేళకంతా ఇన్ని గింజలు దెచ్చి ఇంట్లో బొయికపోయినారో నేనూ నా బిడ్డలూ ఏ బాయిలోనన్నా దూకి నస్తాం. అప్పుడు గూడా మీ అబ్బాకొడకలు మానం, మర్రేదా వడ్ల బొట్టలో బద్రంగా దాపెట్టుకోండి."

కోడలి హెచ్చరిక మాటకి పెదరెడ్డి కలవరపడ్డాడు. భయమేసింది. గొంతు సవరించుకుని దగ్గాడు.

కోడలు పెళ్ళోకి జారుకునింది. కొడుకు వీధిలోకి నడిచాడు.

పెదరెడ్డి పై టాలదాకా కల్లాంకాడ గడిపాడు. పొద్దు పడమటికి మళ్ళాక ఇంటికి నడిచాడు. కోపంలో నాలుగు మాటలన్నా కోడలు మంచిది. బిడ్డల కోసమన్నా ఏ ఇంట్లోనో ఒకింట్లో నాలుగ్గింజలు తెచ్చి ఉడకేసి ఉండకపోతుందా అనుకున్నాడు. పెళ్ళో బావి దగ్గరకు కాళ్ళూ చేతులూ కడుక్కోవడానికి పోతూ వసారాలోని పొయ్యి కేసి ఓరగా చూశాడు. బోర్లించిన కుండా చట్టీ బోర్లించినట్టే ఉన్నాయి. దిగులుతో, నిరాశతో కానుగుచెట్టు కింద నులక మంచం వాల్చుకుని పడుకున్నాడు. వసారాలో కోడలు, బిడ్డలు పడుకుని ఉన్నారు. కొడుకు ఇంట్లో లేడు. సందేళ దాకా చూసి పొద్దుండగానే పెదరెడ్డి కల్లాంకాడకి బయల్దేరాడు.

పెదరెడ్డికి ఈరోజు కూటికి తక్కువైనా మానానికి, మర్యాదకి తక్కువ లేదు. పేదవాడైనా పేరుకి, ప్రతిష్ఠకి తక్కువ లేదు. ఈరోజుటికీ పోలూరుకి 'పెదరెడ్డి' పెదరెడ్డే. తాతముత్తాతల నుంచి వారసత్వంగా లభించిన పరువు ప్రతిష్ఠలను పెదరెడ్డి కాపాడుకుంటూనే ఉన్నాడు. ఈ దినానికీ చెంగాళమ్మ జాతరకి తొలి పొటేలు పెదరెడ్డి ఇంటిముందు తెగాల్సిందే. మన్నారుస్వామి గుడిలో ముక్కోటి ఉత్సవానికి తొలి చందా పెదరెడ్డిదే. ఊళ్ళో ఒక తగుపు వచ్చినా, ఒక తంటా వచ్చినా పెదరెడ్డి మద్దిస్తం చెయ్యాల్సిందే. పెదరెడ్డి మాటకు తిరుగులేదు.

దానధర్మాలకు పెదరెడ్డి కుటుంబం పెట్టింది పేరు. 'పోలూరు పెదరెడ్డి అరిచెంద్రుడు

గదా' అని ఈ చుట్టుపక్కల అంటారు. పెదరెడ్డి మంచితనాన్ని కీర్తించనివాళ్ళు లేరు. పెదరెడ్డి తాతకి రెండొందల ఎకరాల భూమి ఉండేదంటారు. ఆయన్ని కూడా పెదరెడ్డి అనే అనేవాళ్ళు. తాత పేరు మనుమడికి పెట్టడం వాళ్ళ వంశాచారం. పెదరెడ్డి నాయన పేరు చినరెడ్డి. అదే పేరు కొడుక్కి పెట్టుకున్నాడు. పెదరెడ్డి తాతను గురించి ఇప్పటికీ ఊళ్ళో చెప్పుకుంటారు. ఆయన తవ్వించిన చెరువే ఊరికి ప్రాణం పోసిందంటారు. పెదరెడ్డి చెరువనే ఇప్పటికీ దాన్ని పిలుస్తారు. పెదరెడ్డి చిన్నతనంలో ఒకసారి ఊళ్ళో నీళ్ళ కరవు వచ్చింది. ఊరమ్మిడి బీళ్ళన్నీ సాగులోకి రావడంతో పెదరెడ్డి చెరువు నీళ్ళు సరిపోవడం లేదు. రైతులంతా చినరెడ్డే ఏదో ఒక ఆలోచన చెయ్యాలన్నారు.

చినరెడ్డి రెండో చెరువు తవ్వించే పని పెట్టుకున్నాడు. మంచి ఎండల కాలంలో పని. నాలుగడుగులు తవ్వేటప్పటికి బండ పడిపోయింది. చినరెడ్డి పని సగంలో ఆగేదానికి లేదు. కడప నుంచి వడ్డోళ్ళు వచ్చారు. ఒకరా, ఇద్దరా? నూరు నూటయాభై మంది. పిల్లాజెల్లా, ముసలీ ముతకా వచ్చి దిగారు. మూడు నెలలు ఊళ్ళో తిరణాల మాదరిగా ఉండేది. వడ్డోళ్ళకి కూడూ గుడ్డా, నీళ్ళూ నిప్పు అంతా చినరెడ్డి చూసుకోవలసిందే. ఎర్రటెండలో వడ్డోళ్ళు బండలు కొడుతూ ఉంటే వాళ్ళ వంట్లో నుంచి చెమట కాలవలు కట్టి పారేది. పొద్దు పడమటకి మళ్ళగానే పని ఆపేసేవాళ్ళు. టెంకాయకల్లు బానలు వచ్చి దిగేవి. తాగినంత కల్లు. నాలుగురోజులకు ఒకసారి అయిదో ఆరో పొటేళ్ళు తెగేవి. చెరువు పని పూర్తయ్యేటప్పటికి చినరెడ్డి మందలో కాలుభాగం జీవాలు కూడా మిగల్లేదు. కూలి డబ్బుల మాట కాదుగానీ, చినరెడ్డి పెట్టిన తిండి గురించి, పోసిన కల్లు గురించి కడప పక్క వడ్డోళ్ళు ఈరోజుటికీ చెప్పుకుంటారు. చినరెడ్డికి అదే సంతోషం. చినరెడ్డి చెరువు పూర్తయి పెదరెడ్డి చేతికి పెత్తనం వచ్చేటప్పటికి మిగిలింది పాతిక ఎకరాల నేల మాత్రమే. పెదరెడ్డి అందుకు చింతించలేదు. వంశపారంపర్యంగా వచ్చిన పేరు ప్రతిష్టలను కాపాడుకోవడానికి ఆయన చేయగలిగిందంతా చేస్తూనే ఉన్నాడు.

ఒకసారి కచ్చేరి స్కూలు వార్షికోత్సవం జరిగింది. డి.ఇ.ఒ. వచ్చాడు. వేదిక మీద పెదరెడ్డి కూడా కూర్చున్నాడు. పెదరెడ్డి లాంటి మంచి మనుషులున్న ఊళ్ళో స్కూలుకు సొంత బిల్డింగు లేకపోవడం అవమానమని, యాభై వేలు ఊళ్ళో వాళ్ళు పెట్టుకుంటే మిగతా మొత్తం గవర్నమెంటు ఇస్తుందని, బిల్డింగ్ కట్టుకోవచ్చని డి.ఇ.ఒ. చెప్పాడు. ఆ పనికి పెదరెడ్డి పూనుకుని యాభై వేలు వసూలు చేయాలని కోరాడు. ఒక మంచిపనికి పెదరెడ్డి ఇంకొకరి ముందు చేతులు చాస్తాడా! యాభై వేలు తనే కడ్తానన్నాడు. భవన నిర్మాణ బాధ్యత కూడా పెదరెడ్డి మీదే పెట్టారు. కాంట్రాక్టర్లయితే కట్టుబడి గట్టిగా ఉండదని. పెదరెడ్డి పనంటే మాటలు కాదుగదా! భవనం పూర్తయ్యేటప్పటికి ఖర్చు రెండింతలైంది. చెరువు కింద నేల ఏడెకరాలు ముద్దురెడ్డికి అమ్మాల్సి వచ్చింది. ఇంకొకసారి మన్నారుస్వామి గుడి గోపురం బాగా దెబ్బతినింది. గుడి కమిటీకి పెదరెడ్డి ఛైర్మన్. మాట పడకూడదు గదా! రిపేర్లు పెట్టుకున్నాడు. అయిదెకరాలు ఖాళీ. పెదరెడ్డి పనులకు చినరెడ్డి కూడా ఎప్పుడూ అడ్డు చెప్పి ఎరుగడు కానీ, కన్నతల్లి, తోడబుట్టిన తమ్ముడు చచ్చిపోయినప్పుడు మాత్రం

గుండె కలుక్కుమనింది.

పెదరెడ్డికి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. కూతుర్ని నెల్లూర్లో ఉద్యోగస్థుడికి ఇచ్చాడు. మాన మర్యాదల మీద బతికే మనిషి కట్నకానుకలకు తక్కువ చేస్తాడా! పెళ్ళి వైభవంగా జరిపించాడు. నిన్న మొన్నటిదాకా కూతురూ, అల్లుడు, వాళ్ళ బిడ్డలు పోలూర్లో నెలకు వారంరోజులైనా గడిపేవాళ్ళు. ఆఖరి అయిదెకరాల నేలా నాయుడుపేట బ్యాంకోళ్ళు జప్తు చేసినప్పటి నుంచి రాకపోకల్లేవు.

పెదరెడ్డి పెళ్ళాం మొగుడు మాట మీరిన మనిషి కాదు. ఇంటెడు చాకిరి నెత్తినేసుకుని పనోళ్ళని, పరాయోళ్ళని లేకుండా వండి వార్చి వడ్డించేది. సంసారమన్నాక సవాలక్ష సమస్యలుంటాయి. బతుకన్నాక బాధలు తప్పవు. ఇంటి కష్టాలు వీధిలో పెట్టేది కాదు. చినరెడ్డి పెళ్ళాంలాగా భర్తని నసపెట్టి ఎరుగదు. ఒంటిమీద నగానట్రా మొత్తం దానధర్మాల కింద పోయినా, మొగుడ్ని నిందీసిన మనిషికాదు. చిన్నకొడుకు చచ్చిపోయిన నాడు కూడా మొగుడ్ని ఒక్కమాట అనలేదు. తన కర్మనే నిందించుకునింది. పెద్దకొడుకు సేద్యంలోకి దిగినా, చిన్న కొడుకు చదువు మానలేదు. ఇంటర్ పాసై బెంగుళూరులో ఇంజీరింగ్ చదవాలన్నాడు. కొడుకు ఇంజనీరు అయితే పెదరెడ్డికి గొప్పే కదా! అయిదెకరాల నేల అమ్మి లక్ష రూపాయలు డొనేషన్ కట్టి కాలేజీలో చేర్పించాడు. కాలేజీలో చేర్పించాడు గానీ కూటికీ, గుడ్డకీ అంత ఖర్చవుతుందని అనుకోలేదు. నెలకు ఆరేడొందలు పంపాల్సి వచ్చేది. రైతు నెల జీతగాడు కాదుగదా? పలితం చేతికొచ్చిన రోజుల్లో తప్ప డబ్బెక్కడ ఉంటుంది? ముద్దురెడ్డిని అడిగినపుడంతా కాదనకుండా అడిగినంత ఇచ్చేవాడు. మూడేళ్ళు గడిచాయి. అప్పు కొండంత అయింది. ఎన్ని పుట్లు వడ్లు పండితే ముద్దురెడ్డి బాకీ తీరేది? మానం కాపాడుకోవాలంటే భూమి అమ్మక తప్పదు. ముద్దురెడ్డే అయిదెకరాలు కొన్నాడు.

నాలుగో ఏడు చిన్న కొడుక్కి డబ్బు పంపడం కష్టమైంది. వానల్లేక సగం పంట కూడా చేతికి రాలేదు. బాకీలకే అది చాల్లేదు. మిగిలిన మూడెకరాలు అడుమానంలో ఉంది. కొత్తగా అప్పు ఎవర్నని అడుగుతాడు? కొడుక్కి డబ్బు పంపి మూడు నెలలయింది. జాబుల మీద జాబులు వస్తున్నాయి.

ఫీజు కట్టలేదని హాస్టల్లో పేరు తీసేయడంతో పెదరెడ్డి కొడుక్కి అవమానం అయిపోయింది. హాస్టల్ రూంలో ఫ్యానుకి ఉరేసుకుని చచ్చిపోయాడు.

బెంగుళూరు నుంచి ఇంజనీరై వస్తాడనుకున్న కొడుకు పీనిగై ఇల్లు చేరడంతో తల్లి తట్టుకోలేకపోయింది. ఆ దిగులు దిగులు ఆమెను వెంటబెట్టుకునే పోయింది.

పెళ్ళాం శవం నడింట్లో ఉన్న రోజున పెదరెడ్డి చేతిలో చిల్లిగవ్వ లేదు. ముద్దురెడ్డి ముందుకు వచ్చి ఆదుకున్నాడు. కర్మ ఘనంగా జరిగింది. తల గొడుగులకి రెండు పాటేళ్ళు తెగాయి. పెదరెడ్డి ఇంట్లో కార్యమంటే మాటలు కాదుగదా!

ఇంక మిగిలిన మూడెకరాల నేలమీది ఫలితమే పెదరెడ్డి కుటుంబానికి ఆధారం అయింది. అయినా ఊళ్ళో మంచిచెడ్డలకి పెదరెడ్డి ముందుంటూనే ఉన్నాడు.

ఇంటి బాధ్యత కోడలి మీద పడింది. పెళ్ళాం పెదవి దాటేది కాదుగానీ, కోడలిది

ఒకటే నస. బాకీ కట్టి కక్కాలంటూ నాయుడుపేట బ్యాంకోళ్ళు వచ్చి నెత్తిన కూర్చున్నారు. మిగిలిన నేల కూడా పోయింది.

పెదరెడ్డి కిపుడు భూములు లేవు, బావుల్లేవు.

ముద్దురెడ్డి సలహా ఇచ్చాడు. "పెదన్నా, నువ్వు మా నాయినలాంటోడివి. నీది పెద్ద చెయ్యి. నా సేద్యమంతా నీ చేతిమీదే జరగనీ. పంట చేతికందినాక తిండి గింజలకి లోటు లేకుండా ఇంటికి చేరస్తా. నీ కొడుకుని య్యాడైనా రెండెకరాలు కోరిక్కి జేసుకోమను దిగులుండదు"

ఎదురు చెప్పడానికేముంది? సమితి రాజకీయాల్లో తీరిక లేని ముద్దురెడ్డికి భూములు, బావులు చూచుకోవడానికి పెదరెడ్డి కన్నా మంచిమనిషి ఎక్కడ దొరుకుతాడు? పెదరెడ్డి చేతి కింద సేద్యం అంటే పనుల కాలంలో మనుషులకి కొదవ ఉండదు. పంటల కాలంలో కల్లాం మీద ఈగయినా వాలదు. ఎన్ని వేలు పోస్తే మటుకు ఇంత మంచి సేద్యగాడు ముద్దురెడ్డికి దొరుకుతాడు?

అయినా, పెదరెడ్డిని సేద్యగాడుగా ముద్దురెడ్డిగానీ, ఊళ్ళోవాళ్ళుగానీ ఏనాడూ చూడరు. ఆయన మంచితనాన్ని మన్నించేవాళ్ళే కానీ, తాత తండ్రుల మాదిరిగా తన పేరు నిలిచిపోయే పనేదీ చెయ్యలేకపోయానే అనేది పెదరెడ్డి దిగులంతా.

గత కాలపు ఆలోచలనతో మాగన్నుగా ఉన్న పెదరెడ్డి ఏదో అలికిడికి కళ్ళు తెరిచాడు. వడ్లు కలబెడుతున్నట్లు కస కస శబ్దం వినబడింది. పొన్నుకర్ర అందుకుని లేచి కూర్చున్నాడు. వడ్లకుప్ప వెనుక కదలిక తెలుస్తోంది. చెప్పులు వేసుకోకుండా నెమ్మదిగా నడిచాడు.

గోతాం సంచిలోకి ఎవరో వడ్లు తోసుకుంటున్నారు. పెదరెడ్డి ఒంట్లో నెత్తురు వేడెక్కింది. కోపంతో ఒళ్ళు బిగుసుకునింది. కొత్త శక్తి ఏదో శరీరంలోకి ప్రవేశించినట్లయింది. పొన్నుకర్రను చేతివేళ్ళు ఒడిసి పట్టుకున్నాయి. అమాంతం దొంగ మీద పడి పట్టుకున్నాడు.

పెనుగులాటలో దొంగ వెనుతిరిగి చూశాడు.

పెదరెడ్డి నివ్వెరపోయాడు. ఒంట్లోని నెత్తురంతా హఠాత్తుగా హరించుకుపోయినట్ల యింది. ఒళ్ళు చల్లబడిపోయింది. పొన్నుకర్ర జారి నేలమీద పడింది. ముడతలు పడ్డ ముఖం చిగురుటాకులా వణకడం మసక వెన్నెలలోనూ స్పష్టంగా కనిపించింది.

అతి కష్టం మీద పెదరెడ్డి పెదాలు కదిపాడు.

"చిన్నోడా" అన్నాడు. అంతకు మించి ఇంకొక్క మాట కూడా మాట్లాడే శక్తి లేనట్టు, ఆ ఒక్క మాటలోనే నమ్మలేనితనము, అవమానము ధ్వనించాయి.

"రాజమ్మ చెప్పింది. బిడ్డలు – ఆకిలి–" అని చినరెడ్డి అన్నాడు. తప్పు చేసినతనం, భయం చినరెడ్డి మాటల్ని మింగేశాయి. అయినా, పెదరెడ్డికి అంతా అర్థమయింది. రోషం, కోపం తన్నుకు వచ్చాయి. చివుక్కున లేచి చినరెడ్డిని ఒక్క తోపు తోశాడు.

"ఆడదాని మాటిని ఈ పాపిష్టి పనికొచ్చావా? ఎంత అప్రెదిష్ట? పెదరెడ్డి ఇంట బుట్టి మానం చెడ్డపని చేస్తావా? మీ తాత ముత్తాతల కాలం నుంచీ ఒక మచ్చ ఎరుగుదుమా,

ఒక మాట పడుదుమా? నిప్పంటి వంశంలో పుట్టి నీతిమాలిన పని జేస్తావా? ఒక్క పూట పస్తుండ లేకపోయినా వంటరా యెదవా! వందల ఎకరాలు పోయినా, నీ తాత ముత్తాతలు ఎంటికితో సమానం అనుకున్నారే. నీ మాదిరి మానం తప్పినారంట్రా" అన్నాడు పెదరెడ్డి.

"నాయినా, నేను జెప్పేదిను. పెదమ్మి శోషొచ్చి పడిపోయింది. చినమ్మి సందేళ నుంచి ఒకటే ఏడుపు. బిడ్డల బాధ కళ్ళజూళ్ళేక వొచ్చినా, నాలుగ్గింజలు తీసకబోతా. రాజమ్మ దంచి ఉడకేసి బిడ్లకన్నా బెడ్తాది"

చినరెడ్డి మాటలకు పెదరెడ్డి కొంత కరిగాడు.

"రే చినోడా, ఏమన్నా మానంగా మాట్లాడుతండావా నువ్వు! ఎవ్వరైనా జూస్తే ఇంకేమన్నా ఉండాదా! పరువూ మర్రేదా ఈ ఒక్క దినంతో చెరువులో కలవదా! మనిషన్నోడికి కడుపే కైలాసం గాదు. మాట, మంచి మర్రేద ఉండాలి. నా మాటిని ఇంటికి బో. తెల్లారి యాడన్నా ఒక దెగ్గిర నేనే నాలుగ్గింజలు తెస్తా" అని అనునయంగా చెప్పాడు.

చినరెడ్డి వినలేదు.

"నాయినా, నా మాటిను. జరుగు. బిడ్డలు ఆకిలితో అల్లాడతా ఉండారు. నాలుగ్గింజలేగదా! పెదరెడ్డి కూట్నోళ్ళకు కొట్టేసిన మన భూమి పలితమే గదా ఇది" అని గోతాం నెత్తికెత్తుకున్నాడు.

పెదరెడ్డి ఆగ్రహంతో చినరెడ్డి నెత్తిమీది మూటని ఒడిసి పట్టుకుని అరిచాడు.

"రే చినోడా! నీకి పూట దెయ్యం బట్టింది. నీతో మాట గాదు. మర్రేదగా మూట కింద పారేసి పో" అని మూట లాక్కునే ప్రయత్నం చేశాడు.

పెదరెడ్డికి, చినరెడ్డికి మధ్య పెనుగులాట జరిగింది. పెదరెడ్డి ఆగ్రహంతో రొప్పుతున్నాడు. ఆవేశంతో ఆయన శరీరం వణికిపోతూ ఉంది. పిల్లల్ని కాపాడుకోవడానికి గద్దతో పోట్లాటకి సిద్ధమైన తల్లికోడిలా ఉన్నాడు.

ఎర్రబారిన పెద్దరెడ్డి కళ్ళలోని పట్టుదలను చూశాడు చినరెడ్డి. నెత్తిమీది మూటను విసిరి నేలకేసి కొట్టాడు.

తండ్రివైపు తిరిగి 'థుపూ'మని ముఖాన కేకరించి ఉమ్మేసి ఊరివైపు పరుగెత్తాడు.

మసక వెన్నెలలో కోతలు పూర్తయిన వరిపొలాల మీద పడి పరుగెత్తుతున్న చినరెడ్డికి, "ఒరే కొడకల్లారా... నేను మంచోణ్ణి గాదురా. నాకు మానం, మర్రేదా వొద్దురా" అని గొంతు పగిలేలా అరవాలనిపించింది. కానీ మాట పెగిలి పెదవి దాటి రాలేదు.

**– ఇండియా టుడే, సెప్టెంబర్ 21–5 అక్టోబర్ 1993**

# ఆలాపన

## ఎమ్మెస్సార్ మూర్తి

వేగంగా వెళ్తోంది బస్. నా ముందు సీట్లోని ఆ పిల్లవాడు కేరింతలతో ఆకాశంలోకి చూస్తున్నాడు. గుండెలు బరువెక్కుతున్నాయి. ఆ లేత చూపులు అలా చూస్తూ కేకలు వేసేది ఏమిటై ఉంటుందా అని నేనూ అటువేపు చూశాను.

"అశోకా" అంటూ ఇంత పెద్ద అక్షరాలతో ఎగురుతున్న అంత పెద్ద బెలూన్. బహుశా 'హొటల్ అశోకా' మీద నుండే అది ఆకాశంలోకి వెళ్లి హాయిగా ఉండలేకపోతోంది. అందరూ తననే చూస్తున్నట్టు పసికట్టి పదే పదే ముఖం తిప్పుకుంటోంది. అయినా అందరూ దాన్నే చూస్తున్నారు. చిన్నప్పుడు నన్ను చూసినట్టే...!

☆ ☆ ☆

పైట తెరగనప్పట్నుంచీ...

స్కూల్లో, కాలేజీలో, కచేరీలలో, కళ్యాణ మండపాలలో, ఫుట్‌పాత్ మీదా... ముందూ... వెనకా... ఎదురుగా.... వాలుగా... చివరగా కనపడుతున్న నా జడనైనా చూస్తూ....

నేను మాత్రం నిర్లిప్తంగా.... కాస్తంత వగరుగా.... పొగరుగా..

నన్ను చూసే ఆ బెరుకు బెరుకు కళ్లని నా కరకు కాటుక చూపులతో మూసేస్తూ.... పక్కకు నెట్టేస్తే... చురుగ్గా ఇంటికొచ్చి గర్వంగా అద్దంలో చూసుకుంటూ....'ఔరా!' అనుకుంటూనవ్వుకునేదాన్ని!

ఆరోజు ఎవరెవరి మనోదర్పణాల వెనక మెరుస్తున్న వెండి చేర్పులను - నా అందాల సిందూరాల్లో ఎలా కరగించి పోశానా అని - అలా వలకపోసిన నా 'ఔరా'ను చూసుకుని చిలిపిగా నన్ను నేనే వెక్కిరించుకునేదాన్ని! మళ్లీ తెల్లవారితే - పల్లవీ, అనుపల్లవీ అల్లివ్వే, కాకపోతే - నాకు తెలీకుండానే ఓసారి కవ్వించేదాన్నేమో!

అయినా - నన్ను పలకరించే ధైర్యం ఎవరికి? ఉన్నా ఈ బ్యూటీ ఎదుట మాటే రాదని నాకు తెలుసు.

అలా నేను నా 'అందం'.. . నా 'ఇమేజ్ ఇగో'లో పడిపోతుండగా – 'ఇదుగో నేను' అంటూ అతను! అపుడోసారి – విజయవాడ స్టూడియోలో – నాకు పెళ్లయి ఇంకా ఇక్కడికి రాకముందు – ఏకతాళంలాగా ఇప్పటికీ ఎంత గుర్తో!

"నమస్కారం" అన్నాడు.

ఇక అలాంటి అందమైన అబ్బాయిలందరికీ అలా అలా వల్లమాలిన చిన్నదాన్నేనని నాకు ఎప్పట్నుంచో ఎలాగూ తెలుస్తూనే ఉంది. అతన్నిదివరకు నేనెప్పుడూ చూళ్లేదు.

ఎలాగూ 'నమస్కారం' అన్నాడు గదా అనుకుని నేనూ "నమస్కారం" అని –

"సారీ, మిమ్మల్ని గుర్తుపట్టలేక పోతున్నాను" అన్నాను ఇబ్బందిగా.

"ఫరవాలేదు" అన్నాడు నవ్వుతూ. పైగా "నేను గుర్తుపట్టాను గదా!" అన్నాడు.

"ఎలా?" అనడిగాను.

"ఏవుందీ... మీ అందమే!" అన్నాడు.

అరి పిడుగా! ఇంత నిక్కచ్చిగా వొప్పేసుకుని చెప్పేసుకుంటున్నాడేవిటనీ అని నేననుకుంటుండగానే....

"మీకు అభినందనలు. మీ అమ్మా నాన్నలకు కృతజ్ఞతలు. నా పేరు అంబాదాస్" అంటూ తిరగలేక తిరగలేక తిరిగి, ఎదురుగా ఉన్న బోర్డు వేపు చూసి నవ్వుకున్నాడు పెద్దగా.

'ఇచట ఫోటోలు తీయరాదు'

తనేదో పెద్ద తీసుకున్నట్టు నవ్వుకున్నాడేవిఁటి అనుకుని.... పేరు కూడా వెంటనే అప్పచెప్పుకున్న అతనిలో చెడవలసిన శీలమేదీ నాకు కనపడక అతన్నీ –

అంతకు ముందు చెట్టు కింద కూర్చున్నపుడు పైట కొంగుకి పట్టి ఇంకా జాకెట్‌ను అంటి పెట్టుకుని ఉన్న సన్నాటి నూనూగు అక్షతలనీ.... మార్చి మార్చి చూసుకున్నాను.

అలా ఎవరు ఆనందగా నవ్వగలరు? అడ్రసు తీసుకున్నా బావుండేది! అతనలా వెళ్లి మళ్లీ కనపళ్లేదు.

★ ★ ★

సిటీ బస్ ఆగింది. "అసెంబ్లీ – ఆకాశవాణి" అంటూ కండక్టరు అనడంతో నేను లేచి, బరువెక్కినట్టున్న గుండెల్ని పైటతో భుజాల మీదుగా భద్రంగా కప్పుకుంటూ, వయొలిన్ పెట్టెకు దెబ్బ తగలకుండా జాగ్రత్తగా పట్టుకుంటూ బస్ దిగాను.

ఇలా స్టూడియోలో అడుగు పెడుతూనే... ఇదివరకు ఎన్నడూ లేనిది... ఎందుకో ఆ ఆకాశవాణి గోడల్ని – భక్తితో తాకి కళ్ల కద్దుకున్నాను.

ఏమిటో... మళ్లీ అతనే గుర్తొచ్చాడు.

ఆ వెంటనే అమ్మా నాన్నా గుర్తొచ్చారు. నన్నెపుడూ.... అలా ఎత్తుకుంటుంటే... ఎంతో బావుంటుందనే మావారు ఆ తర్వాత గుర్తుకొచ్చి ఫక్కున పల్లిగ్గా నవ్వుకున్నాను.

నాలిక్కరుచుకుంటూ 'ఎవరేనా చూశారేమో–' అని అటూ ఇటూ చూశాను.

మ్యూజిక్ ప్రొడ్యూసర్‌గారి వద్దకు వెళ్లాను. ఆనాడు మేం రిహార్సలు చేయవలసినది "మనోధర్మ సంగీతము – నాడు నేడు" అనే జాతీయ సంగీత కార్యక్రమం.

"ఆర్టిస్టులందరూ ఇంకా వచ్చినట్టులేదు - ఓ అరగంట కూర్చోమ్మా" అన్నారు ప్రొడ్యూసరుగారు.

నెలనించీ ఒకటే ఒంటరిగా గడపాలనిపిస్తోంది. కాంటీన్ వేపు వెళ్లి, ఎదురవుతున్న పలకరింపు నవ్వుల్నీ,, నమస్సులంటున్న పలకరింపులను వాళ్లకే మౌనంగా ఇచ్చేస్తూ.. ఆ పక్కగా దూరంగా ఉన్న ఓ చెట్టు కింద పైట ఒత్తిగిలించి కూర్చున్నాను.

ఎదురుగా వయోలిన్ పెట్టె కింద పెట్టుకునేప్పుడు పెట్టకు కాలు తగిలింది. అలవాటుగా కళ్లకద్దుకున్నాను.

చెప్పులు కాస్తంత దూరంగా పెట్టాను.

నా పక్కనే మళ్లీ అక్షింతలు చెట్టు! పట్టుకుంటే అవి తమాషాగా అంటుకుంటాయి. నవ్వుకున్నాను. కొనసాగుతున్నట్లు ఇందాక ఆగిన ఆలోచనలే, మళ్లీ -

☆ ☆ ☆

అలా మగపిల్లల చూపుల్లో, ఆ చూపుల్లోని సెగలతో నా సిగ్గు నిగ్గులు తీరిందో, మగ్గిపోయిందో - మొదటి పెళ్లి చూపులకే సరేనంటూ ఒగ్గేసింది.

వారు ఎంత మంచివారంటే.... పాపం... పెళ్లి చూపుల్లోనే ఓ ప్రాణం ఇచ్చేసినట్టున్నారు. మిగతావి ఎపుడెపుడిచ్చారో గుర్తులేదు గానీ, ఆ పంచప్రాణాలనూ అస్తమానం నా దగ్గరే వెతుక్కుంటుంటారు.

"నీకెవరూ ఎపుడూ ప్రేమలేఖలు గట్రా వ్రాయలేదా?" అని ఎపుడో ఓసారి చిటీగా అడిగేరు.

"అలా వ్రాసి ఉంటే బావుంటుందా - వ్రాయకపోతే బావుంటుందా....?" అని చిలిపిగా నేనడిగితే పాపం నిర్జీవంగా చూశారు!

ఆ ప్రాణం ఎలా పోసుకోవాలో అందరికీ తెలిసినట్టే నాకూ తెలుసుగాబట్టి సరిపోయింది. అప్పటి వారి నాందీ ప్రస్తావనల్లో గుచ్చుకుంటున్న నా బంగారం గొలుసును "అబ్బా..." అని సుతారంగా నేనడంతో కాసేపు గతాన్నీ, భవితాన్నీ... తన్మయత్వంలో కరిగించుకోవాల్సొచ్చింది.

అలా ఓ ఏడాది వారి పక్కన హుందాగా నడిచాను. మరో అందంతో నవ్వాను. దాంపత్య మాధుర్యంలో మునిగి తేలాల్నో - తేలి మునగాలో తెలుసుకునే ఓపిక లేక సొక్కి సొలిపోయాను.

ఓరోజు నీళ్లు పోసుకున్నాను. ఇదివరకటిలా కుచ్చిళ్లు పోసుకోలేను. సరికదా - ఎక్కడపడితే అక్కడ కూర్చుంటున్నాను.

అలా తల్లిననిపించుకున్నాక - ఒకప్పటి నా పిల్ల చేష్టలు తలుచుకుని తల్లడిల్లిపోయాను. అవి ఆడపిల్ల చేష్టలు!

అది నా తప్పా! చనువిస్తే ఎలా టీజ్ చేసి చంపుకుతింటారో నని భయం పుట్టించేట్టు ప్రవర్తించే మగజాతి తప్పా?

ఏది ఏమైనా అప్పట్లో మగపిల్లలు అంత ఇదిగా చూడ్డం - పరమ వెటకారంగా ప్రవర్తిస్తూ నేను నా ఇగోతో వాళ్లను నిరసించడం... ఎలా ఉండేదంటే ఎప్పుడూ హాయిగా

ఆడుకోవడానికి అవకాశం లేని ఓ చిన్న పిల్ల 'మెంటల్లీ హాండీకాప్డ్' అయినట్టుండేది.

ఏది ఏమైనా ఆ నా వయసులో ఏదో తెలియని అనుభూతిని పోగొట్టుకున్నానేమో ననిపిస్తుంటుంది. నన్ను నేను శపించుకున్నానేమో ననిపిస్తుంటుంది.

ఆ మగపిల్లల అభినందనలను మనసులోనైనా అసలెలా చంపగలిగానా అనిపిస్తుంటుంది. ప్చ్ ఇంకా నయం! ఇంతకు ముందొచ్చిన అతని జ్ఞాపకాలతో ఏదో ఊరట కలుగుతున్నట్టుంది. ఓపిక వస్తున్నట్టుంది.

☆ ☆ ☆

పైన చెట్ల మీద వాళ్లమ్మలు లంచ్ తినిపిస్తున్నట్టు పక్షుల కిచకిచలు. నెర్వస్‌గా చేతులు వయొలిన్ తీశాయి శ్రుతి చేశాయి. తాళబద్ధంగా ఏదో అలికిడయితే తలెత్తాను.

అతను.... అ ..త..నే!

నన్ను నేను నమ్మలేకపోయాను. అలా అతను కనపడగానే.... ఆశగా... "నేనే" అంటూ ముందుగా పలకరించాను. అదే నవ్వు నవ్వుతూ... అప్పటి... అతని... ఆ ఒక్క నవ్వునే నేనెరుగుదును. అలా ఆ నవ్వును నవ్వుకోవాలని మూడేళ్ల నుంచీ ఎన్నిసార్లు ప్రయత్నించి అది కుదరక వెర్రిగా ఎలా నవ్వుకున్నానో!

ఇంకా నయం! అపుడతని చూపుల్ని నా చూపులు ఎందుకో చంపలేదుగదా! అందుకే నేనిపుడు నాలోకి చూసుకుంటుంటే ఆ లోతుల్లో... అతని అప్పటి ఆ కళ ఉట్టిపడే చూపులే కాళ్లకు తగులుతున్నాయి.

"మీరే కదా....! నేనిక్కడ మనోధర్మ సంగీతమనీ...."

"నేనూ దానికే..." అరిచినట్టు చెప్పాను ఆనందంతో!

"ఎంత అదృష్టం!" అన్నాడు, నిండుగా చూస్తూ, ఆ అదృష్టాన్నేదో అపుడే అనుభవిస్తున్నట్టు.

"బాగున్నారా." అనడిగాను ఎంతో లాలనగా, బాధగా... అడగలేదుగానీ... మీరేం చేస్తుంటారూ? పెళ్లయిందా, పిల్లలెంతమందీ... ఇలా - ఎందుకో... ప్రశ్నల్లాగా నా కళ్లల్లో ఆర్ద్రతతో పలకరింపులు! ఎన్నాళ్లకో కలుసుకున్న తనవాళ్లు కళ్లకిచ్చిన నీళ్లలా - కనుపాపలు కడుగుతున్న.... అన్ని కన్నీళ్లు!

అన్ని మేళకర్తల జన్యరాగాల కొమ్మల్లోంచి.... సప్తతాళాల్ని తప్పించుకుని విడివిడిగా వేలాడుతూ పండి రాలుతానంటున్న నా మనసాక మానవతా గమకం!

"ఇంత వేగంగా గుర్తుపట్టారంటే నన్ను మరిచిపోలేదన్నమాట!" అన్నాడు.

"నేను మీకో.. ?" గుర్తున్నానా అన్నట్టు కనుబొమలెగరేశాను.

కళ్లు మూసుకున్నాడు!

అంతే! ఆపాటి తాదాత్మ్యం - ఆ తిల్లానా నాకు తెలీకపోతె - ఇక నా కుడిమడిమ మీద ఫిడేలును ఎడం పక్క హృదయానికి గడ్డంతో నొక్కిపట్టి ముద్దెట్టుకుంటూ ఎలా పలికించగలను?

వయొలిన్ జాగ్రత్తగా పెట్టెలో పెట్టాను. నా ఉద్వేగం తీగలు విచ్చుకుని మరీ తెగబోతున్న ఓ తారస్థాయి

వెంటనే మంద్రంలోకి దిగి అంత సిల్లీగా ఎలా అడిగానో - "నిజం చెప్పండి. అప్పుడు.... మీరు... నేను ఒంటరిగా ఉన్నట్టయితే... ముద్దెట్టుకునే వాడివి కదూ?" చివర్లో ఏకవచనం వచ్చేసింది - ఎలా?

"ఇపుడు కూడా..." అన్నాడు వెంటనే.

అటూ ఇటూ చూసి - ఎటో చూస్తూ - కాళ్లమీది పట్టుచీర అంచుని కాస్తంత వొత్తిగిలించి పట్టాలు సర్దుక్కూర్చున్నాను. ఏమనాల్నో తోచక.

చటుక్కున నా ముందు కూర్చున్నాడు. నా పాదాల మీద చేతులు వేసి భక్తితో కళ్లకద్దుకుని ఆ వెంటనే వాటిని ముద్దెట్టుకున్నాడు.

నా గుండెలు బరువెక్కాయి. నేనేం చేస్తున్నానో నాకు తెలీడం లేదు. అనాలోచితంగా అతని రెండు చేతులూ పట్టుకున్నాను - 'ఇదేమిటీ' అన్నట్టు - అయినా తప్పులేదులే... అంటున్నట్టుగా అతని కళ్లల్లోకి చూస్తున్నాను.

అతని కళ్లల్లో నీరు చెంపల మీద జారుతున్నాయి.

నా స్వరపేటిక తడబడింది. "ఎందుకే?" అన్నాను లాలనగా.

"మీరు.... మీరు కనిపించాక ఇక మీలాగే ఉంటుందిలే అని నమ్ముకుంటూ...."

"ఎవరూ?" ముద్దుగానే అడిగాను.

"మా అమ్మ" అంటూ కళ్లు మూసుకున్నాడు.

అతని ఎన్నో జన్మల అమ్మలు నన్నావేశించి "ఎవరేం... మీ అమ్మ?" అంటూ అడిగించాయి.

"నేనెప్పుడూ చూడనోచుకోలేదు. కానీ.... మీకు మీ కొక్కరికే చెప్పగలుగుతున్నాను. మీలాగే... అప్సరసలా ఉంటుందట! అప్సరసలను ఎవరైనా... వేశ్యలంటారాండీ... మీరే చెప్పండి?" అతని స్వరం గద్గదమయింది.

వెక్కిళ్లను వినిపించడానికన్నట్లు అతని ముఖం స్వంత దోసిలిలో దాక్కుంది.

ఆ కన్నీళ్లు వెచ్చగా నా కాళ్ల మీద పడ్డాయి. నా బరువెక్కిన గుండెలు ఒక్కుమ్మడిగా జల్లుమన్నాయి. నరాలు నిలువునా జివ్వున లాగాయి.

రవిక బిగుతై పోతోంది. నా వొడి ఇక తడిసిపోతోందేమోనన్న హడావిడి!

ఆ తలను లాగి....

అక్కున జేర్చుకుంటూ....

ఓ కాకలి నిషాదానికి మునివేళ్లతో అతని జుత్తులో గమకాల్ని వెతుక్కుంటూ... ఎలాగో చెప్పుకోగలిగాను -

"మా చంటాడు పోయి మూడ్నెల్లు కూడా కాలేదు నా...న్నా...!"

– ఆంధ్రప్రభ వారపత్రిక, ఏప్రిల్ 1–7, 1992

# అవతలి ఒడ్డు

## జి. గౌరునాయుడు

ఆకాశం నిండా మేఘాలు. సన్నగా తుంపరలు. చల్లనిగాలి రివ్వున వీస్తూ.... ఎముకలు కొరికేస్తోంది. ఒడ్డుల్ని ఒరుసుకుంటూ ప్రవహిస్తోంది నాగావళి. ఏటి అలలు తీరాన్ని తాకి శబ్దం చేస్తున్నాయి. ఒడ్డున పాతిన బలమైన కొయ్యకు ఇనుపతీగెతో కట్టబడిన ఓడ అలలతో పాటు ఒడ్డుకు కొట్టుకుంటోంది.

తల మీద బద్దలగిడుగు ఒకసారి తీసి తలెత్తి చూసేడు సోములు. కానీ వేళ తెలీలేదు.

"పొద్దుగుంకి పోయుంటాది. నీలాటి రేవు పలసబడిపోయింది" అనుకుంటూ చిరుగుల దట్టీ తీసి భుజాల మీదుగా బిగతీసుకున్నాడు. ఆ చిన్న దట్టీ చలిని దూరం చేయలేకపోయింది. తుప్పచాటున వుంచిన అగ్గిబెంటుతో బదల్లిగిడుక్కి దోపిన పొగాకు చుట్టను ముట్టించి గట్టిగా దమ్ము లాగాడు. తృప్తి తీరక అడ్డ పొగ వేసేడు.

"ఆ బావు ఎప్పుడొత్తాడో ఏటో..." అనుకుంటూ మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించి కూర్చున్నాడు.

ఇసుక పర్రల్ని ఆక్రమించుకునే కొత్త నీటిలా చీకటి లోకాన్ని క్రమంగా కమ్ముకుంటోంది. మబ్బుల నీడలు పడి ఆ మసక చీకట్లో ఎర్రని బురదతో ప్రవహిస్తున్న ఏటినీరు నల్లగా కన్పిస్తోంది. ఏటి అలల చప్పుడు... ఎక్కడో వూళ్ళో మోగుతున్న తుడుం, డప్పు వాయిద్యాల చప్పుడుతో కలిసి వింతగా వినిపిస్తోంది. తుప్పల్లో అరుస్తున్న చింత గీరు అరుపు సన్నాయి రాగంలా వినవస్తోంది. ఒక్కో చినుకూ సోములు వేసుకున్న బద్దల గిడుగు మీద పడి టప్.... టప్... మంటూ శబ్దం చేస్తున్నాయి.

"ఇదేం వానో యేటో... తగ్గదూ పడదూ.... నిన్నట్నుంచి నంపెత్తంది..." అనుకున్నాడు విసుగ్గా సోములు.

అవతలి ఒడ్డు వేపు చూసేడు. ఎవరూ వచ్చిన జాడలేదు.

"ఈ నీటి మీద ఓడెయ్యడమే కష్టం. అందలోన సీకటి. సావుకారి బావుయిప్పుడుకి

రాపోతే ఎలాగ? నా పీక మీదకి బాగ దాపరించినాడు దారవాత. డబ్బులిత్తానని ఆశపెట్టినాడని సూద్దం. డబ్బులిత్తే మొన్న అరువు తీసుకున్న ఎదురుకర్రల అప్పు తీరిసేడిమై పోద్ది గదా. మరింక వత్తాడా...? ఊహు... రాడు" అనుకున్నాడు విసుగ్గా.

యింతలో బురదలో ఎవరో జారి దబ్బున పడ్డ శబ్దం విని అటువేపు చూసేడు.

"వూ.... వూ..." అంటూ ఏడుస్తూ కనిపించేడు సోములు చిన్న కొడుకు ఏడేళ్ళ 'తాత'.

"ఒరే నువ్వెందుకురా ఎలిసొచ్చినావీ సీకట్లబడి" అని వాణ్ణి దగ్గరకు తీసుకుని రేవులో వాడి ఒళ్ళంతా కడిగి దట్టీతో తుడిచేడు.

"ఒరయ్యా... అమ్మ రమ్మంతంది. వంట సెయ్యడానికి బియ్యం లేవట. బేగిరారా.." అంటూ చెయ్యి పట్టుకు లాగేడు తాత.

"ఒరే, సావుకారి బావు యింకా రానేదు. వచ్చి వరకీ వుండాల. నువ్వెల్లి ఆ సావుకారి కొట్టుదగ్గిర నానిమ్మన్నానని సెప్పి అడ్డడు బియ్యం, బుడ్డీడు కిరసనూనీ తచ్చి దీపం పెట్టు" అన్నాడు బుజ్జగింపుగా.

"ఆ సావుకారి అరువివ్వడు.." తాత బుంగమూతి అందం చూస్తుంటె ఎవరో అవతలి ఒడ్డు నుంచి కేకవేసేరు "సోములో" అని.

అటువేపు పరకాయించి చూసి "ఆ సావుకారి బావే అయ్యుంతాడు" అనుకున్నాడు. వెంటనే... "ఒరే తాతా, యిద యీ తేగ దుంప తీసుకోని యిక్కడే కూకో. నాను గదీని ఓడేసుకొని యెల్లి ఆ మనిషిని తీసికొత్తాను" అని ఒక కర్ర పెండలం దుంప తాత చేతిలో పెట్టి ఓడలో దిగేడు.

ఒకసారి ఓడంతా కలయచూసి వెదురుబొద్దులు సరిచేసి ఓడలో చేరిన కొద్దిపాటి నీటిని కుండపెంకులో బయటకు తోడి కట్టువిప్పి పడవను నీటిమీదికి పోనిచ్చేడు.

గడేస్తూ అవతలి ఒడ్డుకు చేరుకుని చూస్తే ఆ వచ్చిన వ్యక్తి సావుకారి బావు కాదు. నాయుడు బావమరిది.

నాయుడి బావమరిది ఓడలో కూర్చున్నాడు.

"బావూ... సావుకారి బావు అవుపడ్డాడా...? ఎలిసొత్తాను వుండమన్నాడు. యింకా రానేదేటి?" అనడిగేడు సోములు.

"ఆ... సావుకారా...? ఆ ఆ కనబడ్డాడు గానీ వస్తానన్లేదు. యింకేటొస్తాడు.... యింతేలయ్యింది. వస్తే నేనొచ్చిన బస్సుకే రావాల. యీ బస్సుకి రాలేదంటే మరి రానట్టే... పద" అన్నాడు నాయుడి బావమరిది.

"నిజమే...." అనుకుంటూ గడ చేతిలోకి తీసుకున్నాడు సోములు.

చీకటి బాగా ముదిరింది. ఏమీ కనిపించడం లేదు. జాగ్రత్తగా గడ వేస్తున్నాడు. ఏటిలో అలల చప్పుడు, గడ నీటిలో పడుతున్న చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది.

ఓడ ఒడ్డుకు చేరుకుంది. యినుప తీగెతో ఓడను కట్టి

"బాప్పూ..." అని తల గోక్కుంటూ నాయుడి బావమరిది వేపు చూసేడు యేమైనా పైసలు యిస్తాడేమోనని.

"సోములో.... డబ్బులు మిగల్లేదురా. తరవాతిస్తాన్లే..." అని ముందుకు కదిలిపోయాడు నాయుడి బావమరిది.

సోములుకి కోపం వచ్చింది. కోపంతో పాటు దుఃఖమూ ముంచుకొచ్చింది.

పొద్దు తూరినప్పుండి... పొద్దు గుంకిందాకా పేగులు తెగిపోయినట్టగ ఓడేత్తే ఎవడూ పైసా యివ్వడు. ఎప్పుడో పయ్యూరోడొత్తే తప్ప'గడియ తీరదు, గవ్వరాదు..." ఆ కల్లికోట కూరాకలోలే నయిం ఓడెక్కితే పొత్తుదుంపలో, జొన్నపొట్టలో, తోటకూరో, జనపకూరో.... ఏదో ఒకటిత్తారు. పరకో పావలో సేతల బెడతారు..." అని గొణుక్కుని అంతవరకూ తేగ దుంప నములూ్తా కూర్చున్న కొడుకును వెంటబెట్టుకుని సాయంత్రం దొరికిన కర్ర పెండలం దుంపలు పట్టుకుని వూరివేపు కదిలేడు.

యింటికి చేరుకునేసరికి యిల్లంతా చీకటిగా వుంది.

"యిప్పుడు దాకా రావొద్దా...? నాకా కల్లు కనబడవు. ఏటీ సేసుకోనేను. దీపం ముట్టించడానికి ఎవులూ నేరు. కోడల్దాయి వత్తాది, ఏదో సేత్తాదని అనుకుంతే పెద్దోడు అత్తోరింట్లోన యిల్లరికముండిపోనాడు" సోములు భార్య గొణుక్కుంటూంది. కళ్ళు కనిపించక ఏ పనీ చేసుకోలేదు ఆమె.

"సర్నే. యిద యీ తేగ దుంపలు యిక్కడ పెడతన్నాను. నాను దుకానం కెల్లి బియ్యం తెత్తాను. ఒరే తాతా కిరసనాలు బుడ్డీ అందుకోమీ..." అని కొడుకుతో పాటు షావుకారి దుకాణానికి వెళ్ళాడు.

దుకాణం మీద షావుకారి పెదకొడుకున్నాడు.

సోములు బియ్యం యిమ్మని బ్రతిమాలేడు. కనీసం 'బుడ్డీడు కిరసనూని' యిమ్మని ప్రాధేయపడ్డాడు. ససేమీరా అరువ్వివన్నాడు షావుకారి బిడ్డ.

"రొండు పూటలు ఓడేసి నీ అప్పు తీర్సేనా" అని కూడా అన్నాడు. ఎన్నన్నా ఫలితం లేకపోయింది.

కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చాడు సోములు. వస్తూంటే దార్లో అన్నాడు తాత...

"ఒరయ్యా... ఆ సావుకారమ్మ పెందిల నాకూ ఆ బడ్డావోడి కొడుకు సీనుగాడికీ పిలిసి నర్ర బూర్లు యిత్తానని యీదిలోన యిటికిబెడ్డలు గడపల పడిమన్నాది. బెడ్డలన్ని పెరిగిం తరవాత మండకి కసింత బెల్లం రాసి తగిలిసిందిరా. నాకు కోపమొచ్చింది. పెద్ద రాయి తీసి యిసిరీసి పారొచ్చినాను" వాడి ధోరణిలో వాడు చెప్పుకుపోతున్నాడు.

"నువ్వే నయింరా నాకంట..." అనుకున్నాడు సోములు.

ఇంటికి వచ్చి పొయ్యి రాజేసి దాకలో నీరు పోసి అందులో కర్ర పెండలం దుంపలేసి పొయ్యిమీద పెట్టి "ఒరే తాతా... అగ్గె గేనుకోని కూకోమీ. నానలాగ ఎల్లొత్తాను" అని చెప్పి

కల్లు పాకవేపు దారితీసేడు.

నాటుసారా అమ్మే 'అప్పడు' మాత్రం డబ్బులు అడక్కుండానే ఒక గళాసు యిచ్చాడు. ఆయన ఎప్పుడు ఓడెక్కినా సోములు డబ్బులడగడు అదీ మొగమాటం.

కల్లు పాక నుండి బయటపడ్డ సోములు మైకం తలకెక్కేకొద్దీ కేకలు పెంచేడు. ఆరోజు డబ్బులివ్వకుండా ఓడెక్కిన అందర్నీ తిట్టేడు. అరువివ్వని షావుకారి కొడుకునీ తిట్టేడు.

ఇంటికి వచ్చేసరికి తేగ దుంపలు వుడికి వున్నాయి. ముగ్గురూ ఆ పొయ్యి మంట వెలుతురులోనే తేగలు తిన్నారు. అదే రాత్రి భోజనంగా భావించి కుక్కి మంచంలో నడుము వాలుస్తూ అనుకున్నాడు సోములు.

"రేపట్నుంచి ఎవులొచ్చినా సరే పైసలివ్వకుంట ఓడల కాలుపెట్టనిత్తానా... ఎవుడైనా ఎక్కువ నేదు"

ఇలా అనుకోపడం ఏ వందోసారో అయినా అప్పుడే ఆ నిర్ణయం తీసుకున్నట్లు తృప్తిగా నిద్రలోకి జారిపోయాడు.

పక్కింటి బద్దావోడి కోడి కూతకు మెలకువ వచ్చి కళ్ళు తెరిచి చూసేడు సోములు. వెలుగింకా కమ్ముకోలేదు. చిరుచీకట్లు యింకా తొలగిపోలేదు. కుక్కి మంచంలో కూర్చునే కొంచెం సేపు కునికి రెండోసారి కూసిన కోడి కూతకు వులిక్కిపడి చూసేడు.

తెలతెలవారుతోంది. సాకలరాముడు ఆవు పాలు తీస్తుంటే 'సుయ్... సూయ్' మంటూ వస్తున్న ఆ శబ్దాన్ని అనుకరిస్తూ ఆడుతున్నాడు. వాడి కొడుకు దినమొంతో. బద్దావోడు భుజాన కావిడేసుకుని గొడ్డలి ఒకవేపు. గంజి తపేలా మరోవేపు పెట్టుకుని కర్రం కోసం కొండకు బయల్దేరిపోతున్నాడు.

"ఓర్నాయిన. బద్దావోడు అప్పిడే బైలెల్లిపోనాడు. కూరాకలోలు ఏటత్తల నూల్తారు గావాల" అనుకుని మంచం దిగి భార్యతో చెప్పి ఏటివేపు కదిలిపోయేడు వేగంగా.

ఓడ రేవుకు చేరుకున్న సోములు ఒడ్డున రక్కున ఆగిపోయాడు. బొమ్మలా నిలబడిపోయేడు. తీగకు కట్టిన ఓడ వెదురుబొద్దులు లేకుండా బోసిగా వందులకు కుడితిపెట్టే దోనెలా వుంది. వెదురు బొద్దులు చిందరవందరగా ముక్కలుగా పడి వున్నాయి. అది చూసిన సోములు హృదయం వరద వచ్చిపడ్డ నాగావళి లాగా అయ్యింది. కోపం కెరటాలేసింది. ఉదయ కిరణాలు పడి మరింత ఎర్రగా మారిన నాగావళి బురద నీరు లాగా ఎరుపెక్కాయి సోములు కళ్ళు.

అవతలి ఒడ్డున కళ్ళికోట కూరాకలోళ్ళు కూరల గంపల్తో, కావుళ్ళతో నిలబడి "సోములో...." అని పిలుస్తున్నారు. కొందరు తెప్పల మీద యీదుతూ వస్తున్నారు. సోములు వారి కేకలు వినే స్థితిలో లేడు.

"ఏ నంజికొడుకు సేసినాడీ పని. నిన్నగాక మొన్న యాభై రూపాయలకి అరువు తెచ్చినానీ బొద్దులు. ఒక్క కర్ర మిగలకుంట ఏనా కొడుకింగ నరికీసినాడు. నాక్క నబద్దాడు

గాదు ముక్కలు ముక్కలు సేసి నరికిద్దును. యీ యేటొడ్డునే ఆడి కాష్టం పేర్సిద్దును. దొంగ నంజికొడుకు. నా కడుపు కొట్టినోడి కడుపు మసై పోదా, నా ఓడ పాడుసేసినోడి సేతులిరిగిపోవా, ఆడి బతుకు బుగ్గై పోదా..." అంటూ బండబూతులు తిడుతున్నాడు. తిడుతూనే ముక్కలై పడివున్న వెదురు కర్రల్ని ఒక దగ్గిరికి చేరుస్తున్నాడు.

సోములు వేస్తున్న కేకలకూ, తిడుతున్న తిట్లకూ పక్కనే నీలాటి రేవులో ఆడోళ్ళంతా వింతగా చూస్తున్నారు. కొందరైతే అక్కడికే వచ్చేరు. వచ్చిన వాళ్లంతా మనిషికో మాట అన్నారు.

"ఏ గండడు యిలగ సేసినాడు ఆడి బతుకు బండలై పోను...' అంటూ శాపనార్థాలు పెట్టిందో ముసల్ది. వచ్చిన వాళ్ళంతా సోములుకి సానుభూతి చూపించేరు.

అప్పుడొచ్చేడు షావుకారి. ఏటి ఒడ్డునే వున్న తన పొలం చూడ్డానికి పెద్ద కస్తవా బొరిగి భుజాన వేసుకుని.

ఆ వూరి ప్రెసిడెంటుకి కుడి భుజం షావుకారి. షావుకారి ఆ వూరు వచ్చిన మొదట్లో పిండొడేలూ, చిట్టి గారెలూ అమ్ముకునేవాడట. యిప్పుడు ఆ వూరినే కొనగల భాగ్యవంతుడయ్యాడు. ఏటిపక్క పొలంలో కొంత వల్లకాట్లోంచి, ఏటి బాడవలోంచీ కలుపుకున్నదే అంటారు ఆ వూరి ప్రజలు. అలాంటి షావుకారి వస్తూనే

"ఒరె.... ఒరె... ఆపురా నీ తిట్లు. ఎందుకలగ పేల్తున్నావురా..." అన్నాడు.

సోములు షావుకార్ని ఆశ్చర్యంగా చూసి అన్నాడు వినయంగా.... "అదేటి బావూ... తవరెప్పుడెలిపొచ్చినారు? మరి మీరు రారని ఆ నాయుడుబావు బామ్మర్దిగారు సెప్పినారు"

అది వింటూనే షావుకారి రంయ్ మంటూ లేచిపోయేడు....

"ఆ కల్లికోటోలు తెప్పం మీద తీసికిరాపోతే రాత్రికాడ నానేటై పోవాల్రా.... ఎవుడో సెప్తే నువ్వేలిపోనావు అవున్రా. నేను రాననే సెప్తాడాడు. ఆడు సెప్తే నువ్వేలి పోడమేనేటి! ముసిలోడా ఎందుకురా వణికిపోతన్నావంతే... ఆకుదీతకి ఎగమొడ్డిడానికి అన్నాడట అలగుందిరా..."

"అదేటి బావూ... అలగంతవేటి..."

"మరెలగనమంతావురా. అయినా నువ్వలగెందుకు సేసినావో నాకు తెలుసున్రా.. అలకి, మాకు పార్టీ అయితే మామూ తేల్చుకుంటాం. మద్దిని నీయిదేట్రా...."

"బావూ... నాకదేటి తెలీదు. తవరు రారనుకున్నాను అంతేగానీ ఆ సంగతులన్నీ నానెరగను"

"ఒరె నువ్వెరగవురా... 'ఏమెరగని ఏపగింజవి-పుత్తమైన పత్తిగింజవి'. నీకు కళ్ళు నెత్తిమీదికొచ్చినాయిరా. యీ వూర్లో ఎవులైనా నా ఓడే ఎక్కాల నేకపోతే గతి లేదని నీకు దీమా. అందుకే నువ్వలగ నీలుగుతున్నావు. నీ నీలుగుడంతా దేన్నిసూసి ఆ ఓడని సూసి. అంతేగదరా. అందుకేన్రా నీ ఓడ అలగయ్యింది. సంతోషించురొరే...ఓడంతా పాడై పోనేదు.

జాగర్త. మరెప్పుడలగ నిలక్కు..."

సోములుకి అర్థమైంది. అది షావుకారిపనే అని. సోములుకి ఒళ్ళు మండింది.

"ఏటిసేత్తావు బావూ. బొద్దులు నరికించీసినావు. రేపు ఓడ ముక్కల్సే యింటెత్త నంతావు. అంతేనా. సేసీ బావూ....

"పొద్దు తూరిన్నుండి యీ ఏట్లబడి గింజుకుంతే మీలాంటోలిచ్చిన పైసలు నా సుట్టముక్కలకే సాలవు. పెద్దోడువు. పెద్దరికం నిలబెట్టుకో. పెద్ద పెద్ద మాట్లాడకు."

"ఒరే ఏటి పేల్తన్నావురా... దొంగలం. ." బూతులు తిడుతూ మీదకొచ్చేడు షావుకారి. సోములు నిగ్రహించుకోలేకపోయాడు. తానూ ఒకడుగు ముందుకేసేడు.

"ఎవులు దొంగనంజికొడుకులో యీవూరోలందరికీ తెలుసును. వడ్డీలకి అప్పులిచ్చి యిదిగీ బూవులు నాక్కుని ఆ రైతుల్ని బికారోల్ని సేస్సినావుగావా! పరక సరుకు పావలాకి. పావలా వస్తవ రూపాయికి అమ్మి పిండోడేల బంగిడీ తోటి యీ వూరొచ్చినోడివి పెసిరెంటు బావులోటి సమానమైపోనావుగావా! మరి నువ్వు దొంగనంజికొడుకువా. నానా...?"

పెద్దేరు వచ్చినపుడల్లా నన్ను ఓడెయ్యకుంట సేస్సి వుప్పుకి. కిరసమానికి రేటు పెంచీసి లాబాల మీద లాబాలు లాగీసి పెద్దోడువైపోనావుగావా! ఎవులు బావూ దొంగనంజికొడుకులు"

ఏమీ తగ్గకుండా మాటకు మాట సమాధానమిచ్చేడు సోములు. సోములలా మాట్లాడ్డం భరించలేకపోయాడు షావుకారి. "ఒరే నీ...యి..." అంటూ మహా కోపంతో కస్తవా బొరిగి ఎత్తేడు. అంతే కోపంతో షావుకారి ఎత్తిన బొరిగిని మధ్యలోనే లాక్కుని విసిరి పారేశాడు సోములు.

అప్పటికే నీలాటి రేవుకు వచ్చిన ఆడా, మగా, అంతా చేరుకున్నారక్కడికి.

ప్రక్క పొలంలోకి వచ్చిన ప్రెసిడెంటూ వచ్చేడు. పొలాల్లో పనులు చేసుకుంటున్న వారు పనులాపి చూడసాగేరు.

"ఒరే సోంగే.... నీకు కళ్ళు నెత్తిమీదకొచ్చాయేట్రా. పెద్దా సిన్నా సూడకుంట సెయ్యేత్తీడిమేనేటి ఎల్లు.." సోముల్ని ప్రక్కకు నెట్టేడు ప్రెసిడెంటు.

"ఏటి బావూ నాన్సేసిన నేరము. యీ సావుకారి నా ఓడ తాన్తీను సేస్సి తిరిగి నా మీదే బిగురుతాడా"

"ఒరే... నువ్వెవల్దన్ను సూసుకోని ఎగురుతన్నావో తెలుసుట్రా.... సూస్తాను సూస్తాను" పంజా విసరడానికి ఒడుపు కుదరని పులిలా గుర్రుపెట్టేడు షావుకారి.

'నువ్వేటి సూత్తావు నా సంగతి, గోసికింక దిగవేటి? నా బూవులు నాక్కుంతావా. పుట్టల్నాక్కుంతావా. యిదిగిదిగో సావుకారీ యిక్కడందరూ సూసినారు. పెసిరెంటు బావూ తమరూ యిన్నారు. నా ఓడకి ఎదురు బొద్దులివ్వకపోతే... అప్పుడు నాను సూత్తాను" సోములు తెగించి మాట్లాడేడు యేమైతే అదయ్యిందని.

"ఒరే నువ్వేట్రా... తగువెందుకు. సెప్తుంతె యినబడదురా...? షావుకారిగారూ మీరు పదండి" యిద్దర్నీ విడదీసి సర్ది చెప్పబోయేడు ప్రెసిడెంటు.

"మీరుండండి ప్రెసిడెంటుగారూ. ఆడి బలుపేటో అదీ సూత్తాను... మహ బిగురుతన్నాడు .." ఆవేశంతో వూగిపోతున్నాడు షావుకారి.

సరిగ్గా అప్పుడొచ్చేడు షావుకారి పెద్ద కొడుకు నీలాటి రేవు నుంచి. పొలం గట్ల మీదుగా పరుగులు తీస్తూ.... ఆయాసపడుతూ... వస్తూనే అన్నాడు.

"నాన్నా... నాన్నా... మానిక్యంకి నొప్పులొచ్చాయి. చాలా బాదపడిపోతంది. కడుపుల బిడ్డ అడ్డం తిరిగి పోయిందట. గుంపదేవు బాపు పట్నం తీసికెల్లకపోతే ప్రమాదముంటన్నాడు."

"ఆ...." ఆశ్చర్యంగానూ... రవంత భయంగానూ చూసేడు ప్రెసిడెంటు వేపు 'యిప్పుడెలాగా' అన్నట్టు.

"పదండి ముందు. ఏం చెయ్యాలో అక్కడాలోచిద్దాం"

అందరూ కదిలిపోయేరు సోములు తప్ప.

☆ ☆ ☆

రామ్మందిరం స్తంభానానుకుని ప్రెసిడెంటూ, పెద్దలూ కూర్చున్నారు. రామ్మందిరం ఎదురుగా షావుకారిల్లు. ఎత్తరుగు మీద షావుకారి తలపట్టుకుని కూర్చున్నాడు. ఓడ సోములు చేతులు కట్టుకుని కాలి బొటనవేలితో నేలరాస్తూ మౌనంగా నిలుచున్నాడు.

"ఒరే సోములూ నువ్వలగ మంకు పట్టు పట్టీకు. బతిమాల్తుంతే మరీ బిరుసెక్కి పోతన్నావేట్రా" అన్నాడు ప్రెసిడెంటు.

"సోముల్బిద్దా సావుకారి ఏదో అనీసినా ఆ బాపుతోటి నీకేం. పాపం ఆడకూతురు ఆ మానిక్కెమమ్మ గండం గట్టెక్కించెత్తు.... ఎల్తు" అన్నాడొకడు చుట్ట వెలిగించుకుంటూ జనంలోంచి.

"సోములో.... నువ్వు ఓడెయ్యక తప్పదురా" అన్నాడు ప్రెసిడెంటు.

సోములు ప్రెసిడుంటుని చూసేడు. షావుకార్ని చూసేడు. చూసి "బాపూ.... ఏ మొకం పెట్టుకుని యీ మాటంతన్నారు. యీ సావుకారీ..."

"ఒరే... యిప్పుడు నువ్వలగంతే ఎలాగరా... కోపంలోన ఏదో అనుంతే... దానికింతిదై పోతావేటి..." అనునయించసాగేడు ప్రెసిడెంటు.

"కాదూ్నడు బాపూ సావుకారి సేసినపని కోప్మొత్తే ఎవులిమీద పడిపోతే ఎవులు వల్లకుంతారు....?"

"నిజమేట్రా.... ఐతిప్పుడేటి? అదేదో సామిజ్జెప్పినట్టు ఆ పిల్లని సంపెత్తామేట్రా..." అన్నాడో ముసలాడు.

ఆ మాటతో సోములు కొంచెం మెత్తబడ్డాడు. యిదంతా చూసిన షావుకారి పెద్ద కొడుకు దగ్గరగా వచ్చి అన్నాడు....

"సోములో... మా నాన్నవల్ల జరిగింది తప్పే ..కాదన్ను ఆ తప్పుకి మా మానిక్యంని బలిసేసీవొద్దు... నీకు దండమెడతాను. నాయిన్నాయిన నీకు దరమ్ముంతాది ఓడెయ్యిమీ. నీకు అరువివ్వలేదని మనసుల పెట్టుకోకు"

రెండు చేతులు పట్టుకుని బ్రతిమాలేడు. అతనివేపు జాలిగా చూసి అనుకుందో ముసల్ది "పెల్లై ఏడాదే అయ్యింది పాపం. మానెక్కెం ఏటౌతాదో"

అంతవరకూ బింకంగా సోములు ముందుకు రావడానికి యిష్టపడని షావుకారి ఏమనుకున్నాడో యేమోగాని అరుగు దిగి ముందుకు వచ్చి "సోములో.... ఏదో అయ్యింది మరిసిపో.... యిద యీ వంద తీసుకోని ఓడ బాగుసెయ్యి" అని వంద కాగితం జేబులోంచి తీసేడు.

"ఒద్దు బావ్వా. డబ్బులొద్దుగానీ... ఎరకల సత్తిం దగ్గిర ఎదురు బొద్దులుంతాయి. రెండు బొద్దులు పంపించండి. డబ్బులు మీ దగ్గరే వుంచండి..." అని చెప్పి అప్పుడనుకున్నాడు మనసులో.

"సర్నే ఆ సావుకారి సేసిన ఎదవ పనికి కడుపులోన పిల్లని సంపేడం దరమ్ముకాదు. సావుకారికీ నాకూ మద్దిని యేదైనా వుంతే అది మాం తేల్సుకోవాల... మానిక్కెమమ్మకి అన్నాయం సెయ్‌గూడదు..."

యిలా అనుకుని "బొద్దులు బేగి పంపించండి" అని అక్కడ నుండి కదిలిపోయేడు సోములు.

☆ ☆ ☆

రేవులో దిగిన సోములు ఓడలోని నీటిని కుండ పెంకుతో తోడుతూ అనుకున్నాడు బాధగా.

"యీ వూరికి బాధలు తప్పవుగావాల. పెద్ద బావులున్నారంతే ఆల తంటాలు. తగువులు ఆలవేగాని వూరు మంచిసెడ్డలు అసలు పట్టించుకోరు. ఎలచ్చన్లొత్తే పార్టీల్లోటి. వంతాల్లోటి పీకలు తెగ్గోసుకోడానికి తయారైపోతారుగాని వూరికి రోడ్డుండాల. కరంటుండాల,ఏటి మీద బిర్జీ వుండాల అని ఆలోసించరు."

'ఓ గుంప సోమన్న తండ్రీ యీ వూరిని రచ్చించు. యీ వూరి పెద్ద మనుషులకి బుద్దొచ్చినట్టగ సేసి వూరు బాగుపడే నట్టగ సెయ్యి తండ్రీ" అని రేవు కెదురుగా వున్న గుంప సోమేశ్వరుడి గుడివేపు తిరిగి రెండు చేతులెత్తి దండం పెట్టేడు. దండం పెట్టి "యింకా ఎదురు బొద్దులు రానేదేటి" అని ఒడ్డెక్కేడు.

షావుకారి రైతు అప్పలసామి పరుగులాంటి నడకతో వచ్చేడు. వచ్చి అన్నాడు.

"దద్దా ఎరకల సత్తిగాడి దగ్గిర ఎదురు బొద్దులు నేవట. ఏటి సేత్తాం... అవతల మానిక్కెమమ్మని సవ్వార్ల తీసికొత్తన్నారు."

"యిప్పుడెలాగైతే బొద్దుల్నేకపోతే.... సూసినావా అందుకే అంతారు ఎవులు తీసిన గుమ్మిల ఆలే పడతారని" మరేటి సేత్తాం. యీ ఎదురు ముక్కల్నే బొద్దులు

కడుదుంగాని.... రా...” అంటూ వెదురు ముక్కల్ని ఓడకు బొద్దులుగా కట్టే ప్రయత్నంలో పడిపోయేడు సోములు.

మాణిక్యంను సవ్వారిలో తీసుకచ్చి ఒడ్డున దించారు. షావుకారీ... షావుకారి పెద్దకొడుకూ చిన్నపిల్లల్లా ఏడుస్తున్నారు. ఆడాళ్ళ విషయం చెప్పనక్కర్లేదు. ప్రెసిడెంటు అందర్నీ సముదాయిస్తున్నాడు. అలా సముదాయిస్తూనే రేవులోకి చూస్తూ

“సోములో అయ్యిందా” అంటూ తొందర చేస్తున్నాడు.

“ఆ. ఆ.... అయిపోయింది బావూ” అని ఓడలో దిగి “పూటాం సరిపోయింది” అని తృప్తిగా నిట్టూర్చి “ఆ. తీసికిరండి బావు” అంటూ కేకవేసేడు.

వున్నట్టుండి టపటప చినుకులతో వాన మొదలైంది.

“యిదొకటి పాడు వాన. యిప్పుడే పడాలా” అంటూ గడ చేతిలోకి తీసుకున్నాడు.

“అందుకే అన్నారు మేగమూ - రోగమూ అని” ఓ ముసలాడు గొణుక్కున్నాడు వర్షంలో తడుస్తూ.... పైకి చూసి.

ఆ కురుస్తున్న వర్షంలో ఏడ్పుల రొద మరింత ఎక్కువయింది.

“ఏటలగ ఏడుత్తారు. తీసికిరాకుంట” అనుకుంటూ సోములు ఓడెక్కేడు.

ఏడ్పుల ఘోష వుధృతమైంది.

వర్షం - బురద - జనాల తొక్కిడి.

“మాణిక్యం చచ్చిపోయింది” అన్నారు.

వరదలా జనం, జనంలా వరద.

సోములు యిసుకమేట తగిలి నిలిచిపోయిన ఓడలా నిశ్చలంగా నిలిచిపోయేడు.

సోములు కొడుకు తాత వచ్చి తండ్రి చేయి పట్టుకుని లాగుతూ అడిగేడు.

“ఓరయ్యా! సచ్చిపోడమంతే ఏట్రా....”

అది వినబడని సోములు అనుకున్నాడు.

“అమ్మా మానిక్కెమమ్మా! ఓడ నేకుంటే అవతలొడ్డుకి ఎలిపోనావా తల్లీ” అతని కళ్ళ నుండి రెండు కన్నీటి బొట్లు జారి బురదలో పడి ఇంకిపోయాయి.

– ఆంధ్రజ్యోతి వారపత్రిక, 13–7–90

# జీవధాతువు

## గిడుగు రాజేశ్వరరావు

సౌదామిని ఆ బ్రాంచికి కొత్తగా బదిలీ అయి వచ్చింది. పేరుకు తగ్గట్టే ఒక మెరుపులా మెరిసిపడింది. అంతటి అందకత్తె ఉద్యోగం చేసుకుంటూ ఇంకా ఒంటరిగా హాస్టల్‌లో ఉంటున్నదని తెలుసుకున్న బ్రహ్మచారులు ఆసక్తిగా కనుబొమలెగరేశారు. పెళ్ళి అయిపోయిన ఉద్యోగినులు కాసింత ఈర్ష్యగా క్రీగంట చూశారు.

"ఇంతికో అభిరుచి మరి. ఈవిడ ఏ రాజకుమారుడి కోసం నిరీక్షిస్తున్నదో? ఏ డాక్టరో, ఏ ఇంజనీరో..." అని కళ్ళు తిప్పుకుంటూ నవ్వింది, విరామ సమయంలో కాఫీ సేవిస్తున్న కాత్యాయని.

"ఎప్పుడూ తెగ పుస్తకాలు కొని డబ్బు తగలేస్తూ ఉంటుందే. ఆవిడ కోసం ఎవడో రచయితే దిగిరావాలి కాబోలు" అని ఊహాగానం చేసింది ఉషారాణి.

కాసింత తీరిక దొరుకుతే ఏదైనా పుస్తకం పట్టుకుని కూర్చునేది సౌదామిని. చేతినిండా పని ఉంటే చదువుతున్న పుస్తకాన్ని బోర్లించి, తన పనిలో మునిగిపోయేది. ఒక ఉదయం ఏదో పుస్తకం తెరవబోతున్న సౌదామిని కౌంటర్‌లోకి తొంగిచూస్తున్న మునివ్రేళ్ళూ, వాటి మధ్య రెపరెపలాడుతున్న చెక్కునూ చూసింది. ఖాతాలో జత కావాల్సిన ఆ చెక్కును పరిశీలనగా చూసి, దాన్ని అందించిన యువకుణ్ణి ఉత్కంఠతతో చూసి, లేగదూడలా చౌకళించింది. కౌంటర్‌ఫాయిల్ మీద స్టాంపు కొట్టి అందిస్తూ "మీరు రచయిత వినయ్‌కుమార్ గారు కదండీ?" అని కాటుక కళ్ళు పెద్దవిగా చేసి ప్రశంసాపూర్వకంగా అడిగింది. అలా అడుగుతూ ఇంకో చిన్న పుస్తకాన్ని కూడా అందించింది. ఆ పుస్తకాన్ని అందుకుని అర్థంకానట్టు నిలిచిపోయిన యువకుణ్ణి చిత్రంగా చూస్తూ "మీకభ్యంతరం లేకుంటే ఆటోగ్రాఫ్" అని మృదువుగా కోరింది.

"సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ" అని రాసి సంతకం చేసి చిరునవ్వుతో ఆ చిన్న పుస్తకాన్ని అందించాడు వినయ్. అలా పరిచయం స్నేహంగా చిక్కబడిన కొద్దిరోజులలోనే ఒక సాయంత్రం టాంక్‌బండ్ మీద కలిసినప్పుడు "మీ కథల్లో ఒలకబోసే ఆర్ద్రత అంతా ఎక్కడ నుంచి వచ్చింది?" అని నిలదీసింది.

"ఆర్ద్రత జీవధాతువు. అది ప్రతీ జీవికీ తల్లి అందిస్తుంది" అన్నాడు ప్రశాంతంగా.

"ఓహో గడుసువారే. పాపం తల్లి మీద ఎంత బాధ్యత వేసేశారు. తల్లి పిల్లలికి ఆర్ద్రత నందించాలేం? తండ్రి పిల్లలకందివ్వనవసరం లేదు కదూ. తల్లి పట్ల తండ్రి ఆర్ద్రత చూపించనక్కరలేదు. భలే వుంది మీ తర్కం" అని కవ్వించింది.

"జీవితం నాణెమైతే స్త్రీ పురుషులిద్దరూ రెండు పార్శ్వాలు. వాళ్ళ సమన్వయం లేందే జీవితానికి అర్థమే లేదు. ఇందులో వాదం దేనికి?" అన్నాడు చిన్నగా నవ్వుతూ. తన భావాన్ని ఇంకా సరిగ్గా చెప్పాలన్న ప్రయత్నంలో "తల్లి దగ్గర పుష్కలంగా ఆర్ద్రత నందుకున్నవాడు తన భాగస్వామికి పిల్లలకూ పంచలేకపోడు" అని, సౌదామిని ప్రతిస్పందన కోసం ఆమె కళ్ళలోకి చూశాడు. ఇంకోమారు పబ్లిక్ గార్డెన్‌లో యాదృచ్ఛికంగా కలిసినప్పుడు "మీకు కథావస్తువు ఎలా దొరుకుతుంది" అని చిన్నపిల్లలా అడిగింది.

"మన చుట్టూ ఉన్న జీవితంలోంచే కథావస్తువు దొరుకుతుంది. నేలలోంచి అంకురం తల ఎత్తినంత సహజంగా...." ఇదీ వినయ్ వివరణ.

ఇలా అవకాశం ఉన్నప్పుడు ప్రశ్నలవర్షం కురిపించే సౌదామిని శాంతమ్మ కోడలుగా, వినయ్‌కుమార్ జీవితభాగస్వామినిగా గృహప్రవేశం చేసి ఉద్యోగినుల హాస్టల్‌కి టాటా చెప్పేసింది. ఆ బ్రాంచిలో పనిచేసే తోటి ఉద్యోగులు కూడా ఊహాగానాలకు స్వస్తి చెప్పారు.

తన కోరిక తీరి, తనకు నచ్చిన రచయితతో దాంపత్యం నెరపుతున్న సౌదామిని జీవితం హాయిగానే సాగుతోంది. వినయ్‌కు తన తల్లీ, దూరదేశంలో ఉద్యోగం చేసుకుంటున్న తమ్ముడూ తప్ప చెప్పుకోదగ్గ బంధువర్గం వేరే లేదు. ముత్యాలకోవలాంటి తన దస్తూరీతో ఎప్పుడైనా తీరిక దొరికితే వినయ్ రాసిన కథలకు మేలుప్రతిరాసి పెడుతుంది. వినయ్ సృష్టించిన పాత్రలనీ వాటి ప్రవర్తననీ నిర్మొహమాటంగా విమర్శిస్తుంది. అతను కూడా ఏ రచన సాగించినా సౌదామినికి వినిపించకుండా ఏ పత్రికకూ పంపడు. ఎప్పుడైనా ఎవరైనా ప్రముఖ రచయిత రాసిన కథ చదివి ఆమెకు తృప్తిగా లేకుండా "ఈ కథలో ఉన్న ప్రత్యేకత ఏమిటి? రచయిత ప్రసిద్ధుడైనాక ఏది రాసినా చదువుతారనుకుంటాడో ఏమో" అని తర్కిస్తుంది.

"అంత సులభంగా తీసి పడేయకు. ఒక్కొక్కప్పుడు మనం రచయిత స్థాయికి ఎదగకపోవచ్చు. మరి కొన్ని ఏళ్ళ అనుభవంలో ఆ తర్వాత ఆ కథే చదువుతే అపూర్వ కళాఖండంగా తోచవచ్చు" అని స్థిమిత పరుస్తూ ఉంటాడు వినయ్.

ఒక ప్రముఖ పత్రికలో ఉద్యోగం చేస్తున్న వినయ్ కార్యాలయం వేళలు వేరు. సౌదామిని పనిచేసే బ్యాంక్ వేళలు వేరు. సౌదామిని ఉదయం హడావిడి పడుతూ పరుగు తీయక తప్పదు. ఈ కారణంగా ఉదయం పూట భోజనాలు ఎవరెలా చేసినా రాత్రిపూట భోజనం తల్లీ, కొడుకూ, కోడలూ కలిసి విధిగా చేస్తారు. నవ్వులతో, విమర్శలతో, వినోదాలతో చర్చా వేదికగా సాగుతుంది ఆ తతంగం అంతా.

వినీలాకాశంలో చిన్న మబ్బుతునక ఇంతింతై ఆకాశాన్ని ఆవరించినట్టు ఒక మధ్యాహ్న వేళ జరిగిన చిన్న సంఘటన ఆ ఇంట్లో సహజ వాతావరణాన్ని అనూహ్యంగా మార్చింది. రెండు మూడు రోజులపాటు రాత్రి భోజనాలు ముభావంగా కళతప్పి

సాగుతున్నాయి. ఈ మార్పుకి కారణమేమై నదీ శాంతమ్మకు అర్థం కాలేదు. ఏం జరిగిందీ ఆమెకేం తెలుసు. అసలు వినయ్‌కే తెలియలేదు.

ఆరోజు బ్యాంక్‌కి శలవు. సౌదామిని ఇంట్లోనే ఉంది. వినయ్ ఉదయాన్నే ఏదో పత్రిక కార్యాలయానికి వెళ్ళి మధ్యాహ్నానికల్లా ఇంటికొచ్చేశాడు. సుమారుగా ఒంటిగంట కావస్తున్న వేళ తన గది ముందు వీధి వేపున్న బాల్కనీలోకి వచ్చి ఏమీ తోచక నిలబడ్డాడు. పాతిక అడుగుల వెడల్పయినా లేని ఆ వీధి రోడ్డుకి అవతల ఎదురుగా ఉన్న డాబా ఇంటికి పైన ఇంకో అంతస్తు లేపుతున్నారు. ఎక్కడ చూసినా ఇటుకలు, రాళ్ళు, కంకర, సిమ్మెంటు బస్తాలు, సీకులు కనిపిస్తున్నాయి. హడావిడిగా పని సాగుతోంది. కాసింత దూరాన ఉన్న వేపచెట్టు కింద చిన్న పాక ఒకటి కొత్తగా లేచింది. మేస్త్రీలు ఇటుక మీద ఇటుక పేర్చి గోడ లేపుతున్నారు. రోజు కూలికి పనిచేసే ఆడా మగా ఇటుకలందిస్తూ, సిమ్మెంటు కలుపుతూ తీరిక లేకుండా ఉన్నారు. దారినిపోయే పెద్దమనిషిని చూసి "దొరా! ఎన్నికొట్టిన్రు" అని ఎంతో ఆరాటంతో ఇటుకల గంప నెత్తిమీద పెట్టుకున్న ఎల్లమ్మ టైమ్ అడుగుతోంది.

ఇంతలో ఎక్కడపని అక్కడ ఆపి, శ్రమపడ్డవాళ్లంతా కాళ్ళూ చేతులూ కడుక్కున్నారు. కాస్సేపటికి వాళ్ళు తెచ్చుకున్న టిఫిన్ డబ్బాలతో, జొన్నరొట్టె మూటలతో ఏ చెట్ల నీడకో, ఏ చాయ్ దుకాణాల దగ్గరకో అంతా కాకుల్లా ఎగిరి చెల్లాచెదరై పోయారు. ఎంతో సందడిగా ఉన్న ఆ ప్రాంతం ప్రశాంతంగా నిర్జనంగా మారిపోయింది. ఎల్లమ్మ చెట్టుకింద పాకలోకి పోయి ఇంత తిని నీళ్ళుతాగి వేపకొమ్మకు కట్టిన గుడ్డ ఉయ్యాలలోనికి తొంగి చూసి పలకరించింది. ఒక నల్లనివాణ్ణి పద్మ నయనాల వాణ్ణి ఆప్యాయంగా అందుకుని ఆ చెట్టునీడనే ఇసుకమేట మీద పడి పాలు కుడుపుతోంది. ఆత్రంగా తల్లి పాలు తాగుతూ, మధ్య మధ్య విరామంలో తల్లి మొహంలోకి చూస్తూ, మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినట్టు పాలు కుడుస్తూ ఆయాసపడిపోతున్నాడా పసి వెధవ. ఉండి ఉండి తన చిన్న పెదవులు తడిపి ఉంగా, ఉంగా అని ఊసులాడుతూ ఉంటే ఎల్లమ్మ వాడి ముంగురుల్ని తన మునివేళ్ళతో సవరించి, ఆ వింత శబ్దాలకెన్నో అర్థాలూ భాష్యాలూ చెప్పుకొంటోంది. ఆ మాటలకి తగిన సంజాయిషీలు కూడా చెప్పుకొంటోంది. అలా పొట్ట నిండా పాలు తాగడమే పసివాడు తనకు చెయ్యగల మహోపకారం అన్నట్లు ఒళ్ళంతా నిమురుతూ మగత నిద్రలోకి జోగుతోంది. అలా పాలిస్తున్న సమయంలో ఆ పడుచు కళ్ళలో నిండి ఉన్న ప్రశాంతతకీ పది నిముషాల క్రిందట పనిచేస్తూ దారినిపోయే మనిషిని ఎన్ని కొట్టిన్రు దొరా! అని అడిగినప్పుడు కనుపించిన ఆత్రానికీ ఉన్న తేడాని తలచుకుని బాల్కనీలో నిలుచున్న వినయ్ విస్తుపోతూ ఆలోచిస్తున్నాడు. ఆ చిన్న సంఘటన అతన్ని సుదీర్ఘతీరాలకి, చిరంతన దృశ్యాల్లోకి లాక్కుపోయింది.

పసివాడు తాగినంత పాలు తాగి, ఆకలి తీరాక ఆటల్లోపడి తల్లి గుండెల మీద ఉన్న ఆచ్ఛాదన చిందరవందర చేసి పాకుకుంటూ పోయి కాసింత దూరాన బీడీ కాల్చుకుంటున్న తన తండ్రి యాదయ్య దగ్గరగా పోయి ఎత్తుకోమని చేతులందించాడు. యాదయ్య ఆ పసివాణ్ణి ఎత్తుకుని ఎక్కడికో తీసుకుపోయాడు. మధ్యాహ్నం వరకూ పడ్డ శ్రమతో ఎల్లమ్మ నిద్రలోకి జారుకుంది.

అటుగా బాల్కనీలోకి అప్పుడే వచ్చి వినయ్ వెనుక నిల్చున్న సౌదామిని ఒక్కక్షణం అసహనంగా, ఏమీ అర్థంకానట్టు అవాక్కయి ఉండిపోయింది. అటు ఇసుకమేటు మీద నిర్లజ్జగా పడుకున్న స్త్రీ, ఇటు తదేక దృష్టితో చూస్తున్న వినయ్‌కుమార్. "ఇంత ఎండవేళ ఈ బాల్కనీలో ఎందుకూ? పదండి లోనికి" అని చెప్పాలనుకుంది. ఆవేశపు ఒత్తిడి వల్ల మాట రాలేదు. అక్కడ నిలవకుండా, ఏ సవ్వడీ చెయ్యకుండా ఏవగింపుతో వచ్చింది వచ్చినట్లే గదిలోకి వెళ్ళిపోయింది.

తన ఆలోచనల్లోంచి తేరుకున్న వినయ్ తన గదిలోకి వెళ్ళి కొన్ని కాగితాలు టాగ్ చేసి కొంతసేపు ఏదో రాసుకున్నాడు. కాస్త టీ, వేడిగా తాగాలనిపించి వంట గదిలోకి వెళ్ళి స్టౌ అంటించి నీళ్ళు పెట్టాడు. అలాటి సమయంలో సౌదామిని ఆఫీసుకి వెళ్ళకుండా ఇంట్లో ఉంటే స్టౌ వెలిగించిన చప్పుడు విని, కలగజేసుకుని వేడిగా టీ చేసి ఒక కప్పు తను త్రాగి వినయ్‌కు ఇంకో కప్పు అందించడం పరిపాటి. వినయ్ టీని రెండు కప్పుల్లో పోసి సౌదామిని కోసం వెతుక్కున్నాడు. ఆమె కళ్ళు మూసుకుని పడుకుంటే అలసిందేమో అని లేపకుండా టీ ఫ్లాస్కులో పోసి మళ్ళా సాయంత్రం దాకా రాతలో నిమగ్నమై పోయాడు. రాస్తున్న కాగితాలు ఫైల్లో పెట్టి టేబుల్ మీద ఉంచి, ఏదో పత్రిక కార్యాలయంలో పని వుంటే టుగా వెళ్తూ సౌదామిని నిర్లిప్తంగా ఉంటే "ఏం అలా వున్నావు. ఒంట్లో బాగులేదా?" అన్నాడు.

"నాకేం; బాగానే ఉన్నా"నంటూ ముక్తసరిగా ముభావంగా సంభాషణ పొడిగించకుండా ఊరుకుంది. ఆమె హుషారుగా లేకపోవడంతో రాస్తున్న కథను వినిపించాలన్న ప్రయత్నం వాయిదా వేసి బయటకు వెళ్ళిపోయాడు వినయ్.

"ఏం తల్లీ! ఒంట్లో నలతగా ఉందా? అదోలా ఉన్నా"వని అత్తగారు అడిగితే "ఏం లేదత్తయ్యా!" అని ఊరుకుంది.

రెండురోజులపాటు కొడుకూ కోడలు మధ్య ఏదో సన్నటి మంచు తెర ఆవరించినట్లు శాంతమ్మకు తోచింది. సాయంత్రం భోజనాల వేళ చతురోక్తులూ, ఛలోక్తులూ ఆమెకు వినపడలేదు.

మరునాడు ఎప్పటిలాగానే బ్యాంక్‌కి తెమిలి వెళ్ళబోయిన సౌదామిని మనసులో పేరుకుపోయిన విసుగుదలతో సెలవు చీటీ పంపి ఇంట్లోనే ఉండిపోయింది. వినయ్ ఏదో పని మీద ఉదయాన్నే వెళ్ళిపోయాడు. అత్తగారి భోజనం పూర్తిచేసి, మాత్రలు వేసుకుని విశ్రమించే మధ్యాహ్నపు వేళ సౌదామినికి ఏమీ తోచక బాల్కనీలోకి వెళ్ళింది. అప్పుడే పని ముగించి కాళ్ళూ చేతులూ కడుక్కుంటున్న ఎల్లమ్మ ఎదురుపడగానే విసుగ్గా గదిలోకి వచ్చేసింది. "బ్యాంక్‌కి వెళ్ళి ఉంటేనే బాగుండేది" అని నొచ్చుకుంటూ టేబుల్ మీద ఉన్న ఫైలు తీసి అందులోని కాగితాలు తిరగేసి చూసింది.

ఉత్తమ పురుషలో ఒక కథ రూపు దిద్దుకొంటోంది. కాలక్షేపానికి ఆ కథని చదవసాగింది.

"చిన్నతనంలో తరుచూ కళ్ళపడే దృశ్యం ఒకటి నాకు వింతగా తోచేది. అర్థమయ్యేది కాదు. వీధి చివర ఉన్న రత్తమ్మ గురించి బామ్మ అమ్మతో ఎప్పుడూ ఘర్షణ

పడేది. అలా దాన్ని చేరదీసి అందలం ఎక్కిస్తే రేపు కొంపలు కూలుస్తుంది జాగ్రత్త అని హెచ్చరించేది. బామ్మకి ఎందుకో రత్తమ్మ అంటేనే మంట. రత్తమ్మ పొడుగరి. దృఢమైన శరీరం. నల్లని ఛాయ. ఆ కళ్ళలో వింత వెలుగు. పాతికేళ్ళు దాటని వయసు. పొలాల్లో ఉడుపులు, కోతలు, కలుపుతీతలు చేసుకుని బ్రతికేది. అమ్మ కబురుపెట్టిందే తడవుగా వచ్చి ఏ సాయం కావాలన్నా కాదనకుండా చేసేది. బామ్మ ఊరు వచ్చాక ఈ చనువును మెచ్చేది కాదు. మరి అమ్మలో బలహీనత ఏమోకానీ రత్తమ్మని చేరదీసి, చిరుగుపట్టని చీర కానీ దుప్పటికానీ ఉంటే దాచి, ఆమెకు ఇచ్చేసేది. పెరట్లో గడప మీద విస్తరు వేసి ఊరగాయా, పులుసూ వేసి అన్నం పెట్టేది. మా ఊరగాయ రుచంటే పడి చచ్చేది రత్తమ్మ.

అప్పటికి నాకు నాలుగు నిండి ఐదు నడుస్తోంది. అంత చిన్న ప్రాయంలో అందలం ఎక్కించడమంటే ఏంటో, కొంపలు కూల్చడంటే ఏంటో అర్థం కాకపోయినా, రత్తమ్మంటే బామ్మకి ఇష్టంలేదనీ, అమ్మకి రత్తమ్మ అంటే ప్రాణం అనీ అర్థమైపోయింది. బామ్మ కోపగించుకున్నప్పుడు అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నాకూ ఏడుపొచ్చేది. అమ్మంటే జాలివేసేది. నాక్కూడా రత్తమ్మ అంటే ఎంతో ఇష్టం. పొలంలో ఉడుపులూ, కోతల సమయంలో పాడుకునే పాటలు అప్పుడప్పుడు పెరట్లో పాడి వినిపించేది.

తమ్ముడు అప్పటికి బాగా చిన్నవాడు. నీరసంగా కీచుగొంతుకతో శక్తిలేనట్టు ఏడిచేవాడు. ఏదో కారణంగా అలా ఏడుస్తూనే ఉండేవాడు. ఒకచేత్తో మొలత్రాడు పట్టుకుని ఎంతో కష్టం మీద లేచి నిలబడే ప్రయత్నం చేసేవాడు. నిలబడలేక చతికిలబడిపోయేవాడు. వాడి మొహంలో ఏదో దైన్యం. అమ్మ వాణ్ణి చూస్తూ దిగాలుగా ఉండేది. నాన్నా అమ్మా వాడి ఆరోగ్యం గురించే ఎప్పుడూ మాట్లాడుకునేవారు.

అడ్డమైనవాళ్ళూ ఇంట్లో తిరుగుతే దిష్టి తగుల్తుంది అనేది బామ్మ. అలా అంటూ తమ్ముడి అనారోగ్యం చూపి తన వాదాన్ని సమర్థించుకోబోయేది. ఏదో మంత్రించిన తాయెత్తు మొలకి కట్టేది. గుడిలో కొబ్బరికాయలు కొట్టేది. బామ్మ అలా కోవెలవేపు వెళ్ళినట్లు ఎలా తెలిసేదో ఏమో రత్తమ్మ వచ్చేది. అమ్మ రత్తమ్మకి అన్నం పెట్టేది. ఊరగాయ తన కిష్టమని వేసేది. రత్తమ్మ తమ్ముణ్ణి ఎత్తుకుని పెరట్లో చెట్టూ పిట్టా అని చూపించి ఆడించేది. ఏడుస్తున్నవాడు మంత్రించినట్టు ఏడుపు మానేసేవాడు.

మరుసటి ఏడాది ఇంటివాళ్ళు ఖాళీ చెయ్యమని ఒత్తిడి చేస్తే ఇంకో వీధిలోకి మారిపోయాం. రత్తమ్మ రాకపోకలు తగ్గిపోయాయి. ఆమె మొగుడుకి పట్నంలో ఏదో ఆఫీసులో ఉద్యోగం చిన్నది దొరికితే రత్తమ్మని తీసుకు వెళ్ళిపోయాడని అమ్మ నాన్నతో చెప్తూ ఉంటే విన్నాను. బామ్మకి అనుకోకుండా పక్షవాతం వచ్చింది. మంచాన పడి తీసుకోకుండా పదిహేనురోజుల్లో పోయింది.

నాకు పదేళ్ళు నిండి పదకొండు వచ్చింది. చిన్న బజారు వెనకాల మైదానంలో సర్కస్ డేరా వేశారు. బయట చెట్లకు కట్టిన ఏనుగుల్నీ, గుర్రాల్నీ చూడాలని నేను తమ్ముడి చెయ్యి పట్టుకుని తీసుకుని వెళ్ళాను. తిరిగి మేం వస్తూ వుంటే అమాంతం గద్ద తన్నుకుపోయినట్టు రెండు చేతుల్తోనూ తమ్ముణ్ణి ఎవరో లేపుతూ వుంటే ఆశ్చర్యంగా పైకి చూశాను. రత్తమ్మ నవ్వుతూ నిలబడింది. ఎంతో ఆరోగ్యంగా కనబడింది. మొగుడికి

ఉద్యోగం వచ్చాక కాయకష్టం చెయ్యడం తగ్గినట్టుంది. మొహం ఎంతో తేటగా ఉంది. తమ్ముణ్ణి ముద్దులతో ముంచేసింది. కొంతసేపు ఏడ్చింది. కాస్త ఆవేశం తగ్గి స్థిమితపడ్డాక నవ్వింది. ఎదురుగా ఉన్న పళ్ళ దుకాణంలోంచి నాలుగు అరటిపళ్ళు తెచ్చి రెండు నా చేతిలోనూ రెండు తమ్ముడి చేతిలోనూ పెట్టింది. నన్ను కూడా దగ్గరగా తీసుకుని అమ్మ బాగుందా అని అడిగింది. మళ్ళీ అమ్మని కలుస్తానని చెప్పి ఎక్కడికో వెళ్ళిపోయింది.

వారం రోజుల తర్వాత వీధి గుమ్మంలో అమ్మతో రత్తమ్మ మాట్లాడుతోంది. 'మా చిన్నాయనకి శానా సుస్తీ చేసింది. మా చిన్నమ్మ చిన్నబజారు దగ్గర పళ్ళ దుకాణం పెట్టుకు బతుకుతోంది. సూసి పోదామని వచ్చాను. రేపు ఎల్లిపోతాను" అని చెప్పి తనతో తీసుకుని వచ్చిన కొడుకుని చూపిస్తోంది. 'అమ్మగారికి దండమెట్టు' అంటూ ఉంటే వాడు సిగ్గు పడుతున్నాడు. సరిగ్గా తమ్ముడి ఎత్తు ఉన్నాడు. అలా ఆరోజు వెళ్ళిన తర్వాత రత్తమ్మ ప్రసక్తి మా ఇంట్లో రాలేదు. నేను కాలేజీ చదువుకి పట్నం వెళ్ళి హాస్టల్‌లో ఉండి ఎప్పుడైనా శెలవులు ఇస్తే మా ఊరు వచ్చేవాణ్ణి. తమ్ముడు అమ్మా నాన్న దగ్గరే వుండి చదువుతున్నాడు. నేను గ్రాడ్యుయేషన్ చేస్తూ ఉండగా వారం రోజులు శెలవు దొరుకుతే మా ఊరు వచ్చాను.

ఇంట్లో కాలు పెట్టేసరికి ఎప్పుడూ సంతోషంగా ఎదురయ్యే అమ్మ చీరకొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ కనుపించింది. తమ్ముడు వరండాలో ఏదో చదువుకుంటున్నాడు. అమ్మ ఏడుస్తోందా, కంట్లో ఏదైనా నలుసు పడిందా అని సందేహిస్తూ ఆందోళనతో ఇంట్లోకి వెళ్ళాను. నాన్నగారు పడక కుర్చీలో పడుకుని వార్తాపత్రిక చదువుతున్నారు.

నేను స్నానం చేసి వచ్చాక కంచంలో అన్నం వడ్డిస్తూ "నీకు రత్తమ్మ జ్ఞాపకం ఉందిరా' అని అమ్మ అడిగింది. 'ఎందుకు జ్ఞాపకం లేదూ' అని ఉత్కంఠతో చూశాను అమ్మవేపు.

"పాపం! కుక్క కరిచి చనిపోయిందట. దాని పిన్నమ్మ పొద్దున్నే కనపడి చెప్పింది" అని నిట్టూర్చింది. నా చిన్నతనంలోని దృశ్యాలెన్నో జ్ఞాపకం తెచ్చుకుంటూ చాలాకాలంగా నా మనసులో ఉన్న ఒక సందేహాన్ని ప్రశ్నగా సంధించాను. అమ్మా! రత్తమ్మ అంటే నీకెందుకంత అభిమానం? అన్నాను.

అమ్మ కంచంలో కూర వడ్డిస్తూ నావేపు చూసింది. నాకు ఎలా చెప్తే అర్థమౌతుందా అని ప్రయత్నిస్తున్నట్టు ఒక్కక్షణం నిశ్శబ్దం. ఆ తరువాత "వినయ్! నిజంగా నువ్వెంత అదృష్టవంతుడివిరా!" అంటూ గతాన్ని తవ్వింది.

"నువ్వు పుట్టినప్పుడు నేను ఎంతో ఆరోగ్యంగా ఉండేదాన్ని. నీకు పాలు పుష్కలంగా సరిపోయేవి. నీకు ఏ లోటూ లేకుండా బొద్దుగా పెరిగావు. రెండేళ్ళు నిండుతున్నా నా దగ్గిర పాలు మానకుండా మారాం చేస్తూ ఉంటే నీచేత పాలు మానిపించడానికి ఎంతో కష్టపడవలసి వచ్చింది. మరి తమ్ముడు పుట్టినప్పుడు నాకు పెద్ద జబ్బు చేసింది. పాలు వాడి ఆకలి తీర్చే అంతగా ఉండేవి కాదు. నా తెలివితక్కువతనంతో ఆ సంగతి నేను తెలుసుకోలేకపోయాను. నాల్గైదు నెలలు అలా చాలీచాలని ఆహారంతో నీరసించిపోయాడు. వాడి కాళ్ళ మీద నిలబడలేకపోయేవాడు. ఇక నడిచేశక్తి ఎక్కడ? మన ఊళ్ళో ఉన్న ఇంగ్లీషు డాక్టరమ్మకు చూపించాను. 'పాలు చాలక బాగా నీరసించిపోయాడు.

డబ్బాపాలూ, పోతపాలూ జీర్ణం చేసుకోలేనంత నీరసంగా ఉన్నాడు. పిల్లలకి చనుపాలు మించిన ఆహారం లేదు. ఎంత ఖరీదైన డబ్బా పాలు కూడా దానికి దగ్గరగా వెళ్ళే ప్రయత్నం చేస్తాయి కానీ దానితో సరిగ్గా పోటీ పడలేవు' అని నిట్టూర్చింది. యారోరూట్ పొడిని నీళ్ళలో కలిపి తరుచూ పట్టమని చెప్పింది. తమ్ముడు బతుకుతాడా లేదా అని భయపడిపోయి దిగాలుగా ఉన్న సమయంలో దేవతలా నా మనసులో మెదిలింది రత్తమ్మ.

ఆమె కూడా నాలాగే బాలింత. ఎప్పుడైనా కాస్త ఊరగాయ పెట్టమని వచ్చేది. నాకు పనుల్లో సహాయం చేసి పెట్టేది. "రత్తమ్మా! నీకు పుణ్యం ఉంటుం ది. నా కొడుక్కి కాస్త పాలు ఉంటే పట్టి బ్రతికించు" అన్నాను. "నా పిల్లడు తాగినాక, శానా పాలు మిగిలిపోతాయి. నేనేం చేసుకుంటానమ్మా" అని వచ్చి తమ్ముడికి రోజూ కాసిన్ని పాలిచ్చి కొత్తగా జీవం పోసింది. మీ బామ్మకు చాదస్తం. నా బాధ అర్థం చేసుకోలేకపోయేది రత్తమ్మకి చనువిస్తున్నావని కోపగించుకునేది" అని అమ్మ గతాన్ని తలుచుకుంటూ చెప్పింది.

రత్తమ్మ ఇంట్లోకి వచ్చాక తమ్ముడు ఏడుపు ఆపడం నాకు లీలగా గుర్తొచ్చింది. రత్తమ్మ తమ్ముణ్ణి పెరట్లో మొక్కల్లో కూరోబెట్టుకోడం కళ్ళకు కట్టినట్లు కనిపించింది....."

కథ అలా అర్థాంతరంగా ఆగిపోయింది. పూర్తి చెయ్యవలసిన ఆ కథని చదివి టేబుల్ మీద పెట్టింది సౌదామిని. అత్తగారు గదిలోకి రావడం చూసి "భోజనం చేశాక మాత్రలు వేసుకున్నారా?" అని జ్ఞాపకం చేసింది. వేసుకున్నానని చెప్పి బాల్కనీలోకి పోయి నిల్చున్న శాంతమ్మకు వేపచెట్టు కింద పసివాణ్ణి చేత్తో పట్టుకున్న ఎల్లమ్మ కనిపించింది. ఎల్లమ్మని చూస్తూ బొమ్మలా కాస్తసేపు అచేతనంగా నిలుచుండిపోయింది. బుక్‌షెల్ఫ్‌లోంచి ఏదో పాత కథల పుస్తకం తీస్తున్న సౌదామిని అలా బాల్కనీలో నిల్చున్న అత్తగారిని చూస్తూ "తల్లీ కొడుకులిద్దరూ ఆ బాల్కనీకి అలా వింతగా అతుక్కుపోతా"రని మనసులో అనుకుంది.

రెండురోజుల తర్వాత ఒక ఆదివారం ఉదయం తొమ్మిది గంటల వేళ వినయ్ తన పనిమీద ఎక్కడికో బయటకు వెళ్ళాడు. సౌదామిని రోజూలాగ ఉరుకుతూ బ్యాంక్‌కి వెళ్ళనక్కరలేదు. కాస్త ఆలశ్యంగా నిద్ర లేచి కాఫీ తాగి పాత కథల పుస్తకం చదువుతూ గదిలో కూర్చుంది. చిన్నతనంలో ఎప్పుడో చదివిన కాబూలీవాలా కథ అందులో కనిపించింది. సుప్రసిద్ధ రచయిత ఏం రాసినా దానిచుట్టూ కాస్త గ్లామర్ పేరుకుంటుంది కాబోలు ఈ కథలో ఉన్న ప్రత్యేకత ఏమిటి? అని తనలో అనుకుంటూ ఉంటే క్రిందను అత్తగారి మాటలు వినిపిస్తున్నాయి. ఏదో కొత్త గొంతు బదులు పలుకుతోంది.

గదిలోంచి బాల్కనీలోకి వెళ్ళి కిందకు తొంగి చూసింది. చేతిలో ఒక పంగపండు రంగు చీర పట్టుకుని అత్తగారు నిలబడింది. ఇటుకమేటు మీద నిద్రపోతూ మొన్న తనకు కనుపించిన నల్లని పడుచు అత్తగారికి ఎదురుగా చంకలో పిల్లాడితో నిలబడింది.

"నన్ను పిల్చినవులే దొరసానీ!'

"అవును - నీ పేరు?'

'ఎల్లమ్మ...'

'ఖానాపురం'

'నాకేం పనిలేదు నీతోటి. మధ్యాహ్నం పూట ఎండలో అటు చంటిపిల్లణ్ణి

సాకుతూ ఇటు ఇటుకలు మోస్తూ తిరుగుతూ ఉంటే చూస్తూ ఉంటాను. నువ్వూ నీ మొగుడూ ఆ వేపచెట్టు కింద పాకలో ఉంటారు కదూ!'

'అవు.... దొరసాని.... ఆ గుడిసెల ఉంటాం. కష్టం చేసుకు బతికేటోళ్ళం. మా బస్తీ గుత్తదారు పని సూపిస్తే ఈడకొచ్చినం. ఈ బంగలా కట్టుడు అయిన్దాక ఈడనే పండుంటాం. రేతిరి సీకులూ, సిమ్మెంటు ఎవలు గుంజుకోకుంట కాసుకుని, పొద్దుగాల గుత్తదారు చెప్పిన పని జేసుకుంటాం'

"నీ కొడుక్కేం పేరు పెట్టావ్"

'బాలరాజు- ఆడితో ముచ్చటలాడమంటడు. పన్జేయనీయడు...'

"పేరుకు తగ్గట్టే రాజులా ఉన్నాడు. నీకు చీర ఇవ్వాలనిపించింది. పిలిచాను. కట్టుకుంటావా?'

'ఎందుకు కట్టుకోను దొరసాని. నీ పేరు చెప్పుకుంటా'

ఆ చీరను చూసుకుని మురిసిపోతూ తన చంకలో ఉన్న పసివాణ్ణి ముద్దు పెట్టుకుంటూ రోడ్డు దాటి ఎదురుగా ఉన్న వేపచెట్టు దిశగా వెళ్ళిపోయింది ఎల్లమ్మ. ఈ దృశ్యాన్ని చూస్తూ తల్లీ కొడుకుల్ని ఆ నల్లనామెవరో బాగానే ఆకట్టుకుంది మనసులో అనుకుంది సౌదామిని.

ఆ సాయంత్రం అంతా కలిసి భోజనాలకు కూర్చున్నవేళ అన్నం వడ్డిస్తున్న శాంతమ్మ "నీ చిన్నతనంలో మన ఇంటికి వస్తూ వుండేది రత్తమ్మ, నీకు జ్ఞాపకం ఉందిరా వినయ్...." అని అడిగింది.

"తమ్ముణ్ణి ఎత్తుకుని ఆడించి పాలిచ్చేది. ఆ రత్తమ్మేగా? అన్నట్లు చెప్పడం మరిచాను. మన ఇంటికెదురుగా మేడింటి పని జరుగుతోంది చూశావా? అక్కడ పని చేసేవాళ్ళలో ఒక మనిషి అచ్చం రత్తమ్మలాగే ఉంటుంది. ఈమధ్య ఒక మధ్యాహ్నం నేను చూసి ఆశ్చర్యపోయాను. మన ఊరు రత్తమ్మ మళ్ళీ బ్రతికి, చిన్నదై పోయి ఇక్కడకు రాలేదు కదా అనిపించింది. నీకు చూపించాలనుకున్నాను కానీ నువ్వు భోజనం చేసి నిద్రపోతున్నావ్" అన్నాడు వినయ్.

"మీరేం బాధపడనక్కర్లేదు. అత్తయ్య ఇవాళ ఉదయమే ఆ మనిషిని కనిపెట్టేశారులా ఉంది. ఇంటికి పిలిచి, ఇంటర్వ్యూ చేసి ఒక చీర కూడా ఇచ్చారు" అని గలగల నవ్వుతూ వాళ్ళ మాటల్లో మాట కలిపింది సౌదామిని. నిరామయంగా సాగిన ఆ నవ్వులో వినయ్‌కు కోటివీణలు వినిపించాయి. నాలుగు రోజులుగా ఆమె కళ్ళలో తను వెతుక్కుంటున్న వెలుగు మళ్ళీ చూసిన సంతోషంతో "ఇవాళ మనం ఎంత రాత్రయినా సరే ఒక కథ పూర్తి చెయ్యాలి... పద" అని తన గదివేపుగా తీసుకుపోయాడు.

"మీ పెద్దబ్బాయిని బాగా ముద్దు చేసి పెంచినట్టున్నారత్తయ్యా! అనుకున్నదేదైనా ఆ క్షణంలో అయిపోవాలి. మీరు మందూ, మాత్రలూ వేసుకోవడం మరచిపోకం!" అని గుర్తు చేస్తూ వినయ్‌ని అనుసరించింది సౌదామిని.

వాళ్ళ ఇద్దరి మధ్యా చోటు చేసుకున్న అన్యోన్యతను చూసి తృప్తిగా తన గదిలోకి వెళ్ళిపోయింది శాంతమ్మ.

– జాగృతి, డిసెంబరు 13–19, 1993

# యాష్ - ట్రే

చాగంటి తులసి

"అమ్మా! మీకోసం ఎవరో వచ్చారు!" కమల గది గుమ్మంలో నిల్చుంది. చికాకు వేసింది. ఆదివారం నాడూ హాయిగా రిలాక్స్ అయ్యి గడపడానికి వీల్లేకుండా ఎవరా వచ్చింది. ఈ మనుష్యులు ప్రాణాలు తోడేస్తున్నారు.

"ఎవరూ! వచ్చినవాళ్ళు ఆడవాళ్లా? మగవాళ్లా"

"మగే!"

"ఒకరేనా? ఇద్దరు ముగ్గురా? పేరూ గట్రా కనుక్కోలేకపోయావా? ఎలా ఉన్నారూ?" తన మొహం మీద చికాకుని విసుగునీ కమల చూసింది. దానికి తెలుసు తన మూడ్ పాడై పోతూందని.

"ఒకాయనేనండీ! ఒడ్డూ పొడుగూ దొరబాబులా ఉన్నాడు" వచ్చినాయన గురించి చెప్పి పేరు కనుక్కోడానికి వెళ్లబోయింది.

ఏముందీ! ఏ స్టూడెంటు తండ్రో, అన్నో అయి ఉంటాడు. ఏ సీటుకోసమో, హాస్టలు గురించో అడగడానికి పొద్దున్నే వచ్చి ఉంటాడు. ఆదివారం ఉదయమే తలారా స్నానం చేసి మొదటి కప్పు కాఫీతాగి పడకకుర్చీలో పడుకుని ఇష్టమైన కావ్యపఠనం చేస్తూ ఉంటే పానకంలో పుడకలా ఎవడో ఈ మహానుభావుడు దొరబాబు వచ్చిపడ్డాడు. ప్రిన్స్‌పాల్ అయి కుర్చీలో కూర్చున్నప్పటి నుంచి పొయిట్రీ లేదూ, పాడూ లేదు. బ్రతుకులో పొయిట్రీ జావకారిపోయినా తట్టుకుంది కాని, బాధ్యతల మధ్య కనీసం ఆదివారం పూటైనా గొంతెత్తి కవిత్వం చదువుకోడానికి వీల్లేకపోతూ ఉంటే ఎలా చావడం?

"పేరూ అదీ కనుక్కోనక్కర్లేదులే. నేనే వస్తున్నా" అంటూ లేచింది.

పడకగదిలోంచి డ్రాయింగు రూములోకి వెళుతూ వెళుతూ డైనింగు టేబులు మీద ఫ్లవరవేస్‌లో పువ్వులు సరిగ్గా లేనట్లు చూసి ఆగిపోయింది. లేస్తూనే తనే ఆ నలుచదరపు వేసుని సర్దింది. కిందికి పెట్టిన పువ్వు కొమ్మలూ మరీ పొడుగై పోయి అందం పోయింది. ఆ పువ్వునీ కొమ్మల్నీ స్టెమ్ హోల్డరు నుంచి తీసి అడుగు భాగాలు తెంచి మళ్లీ పెట్టింది.

చిన్న తేడాతో ఎంత అందం వచ్చింది. నవ్వుకుంది. బ్రతుకూ అంతే. చిన్న చిన్న తేడాలతో చక్కదనాల సొగసుతో నిండనూవచ్చు. ఆ కొద్ది తేడాలు లేకపోతే బోసిపోయి వెలవెలలాడిపోనూ వచ్చు. కొందరి చేతులు సొగసు పెంచితే, కొందరి చేతులు మసి చేస్తాయి.

డ్రాయింగ్ రూమ్ కర్టెను ఎత్తి లోపలికి అడుగుపెట్టి బొమ్మలా నిలుచుండిపోయింది. వచ్చిన పెద్దమనిషి నిల్చునే ఉన్నాడు. లిప్తపాటు తత్తరపాటుతో చూసి "మీరా?" అన్నది. శేఖర్! పదిహేనేళ్లు! ఒకటా రెండా? పూర్తిగా పదిహేను సంవత్సరాల తరవాత చూడ్డం.

"పోల్చుకున్నారే!" అన్నాడు.

ఎందుకు పోల్చుకోలేదూ! నిజమే! పదిహేనేళ్లలో మనిషిలో మార్పు బాగానే వచ్చింది. ఒత్తుగా ఉంగరాల జుత్తుతో క్రాపు ఉండేది. ఇప్పుడు ముందు భాగం అంతా బట్టతలే. మిసమిసలాడే తెలుపు. విదేశంలో ఉండడం నుంచి ఇప్పుడా తెలుపులో మరో వన్నె ఎక్కువగా కనబడుతూంది. అందుకే లిప్తపాటు తత్తరపాటు కాని ఆ కళ్లు, తీక్షణమైన కళ్లు, అందమైన కళ్లు, చురుకైన కళ్లు - వాటిని పోల్చుకోలేదూ? ఆ కళ్లని తను ఎప్పుడూ మరిచిపోలేదు.

"కూర్చోండి. నిల్చున్నారేం!" అన్నది.

తనవేపు రెప్ప వేయకుండా చూస్తున్న ఆ చూపుల్ని తను తట్టుకోలేకపోతూంది. ఆదివారం తల రుద్దుకుని, జుట్టు ఆరుతుందని జడవేసుకోలేదు. తడిగా ఉన్న జుత్తుని అలాగే వదిలిపెట్టింది. ముడికూడా పెట్టుకోలేదు. మోకాళ్లవరకూ పడుతున్న తన జుట్టునీ, తనని మార్చి మార్చి చూస్తున్నాడు. అనుకోకుండా పమిటని నిండుగా జుట్టు మీద నుంచి కప్పుకుంది.

"మీరు అలాగే ఉన్నారు. ఏం మారలేదు" అన్నాడు సోఫాలో కూర్చుంటూ. నిజమే. తను ఏమీ మారలేదు. అందరూ అదే అంటారు. నలభయ్యో పడి వచ్చినా జుట్టు ఊడనూ లేదు - నెరవనూ లేదు. ఒళ్ళు వచ్చి వికృతంగా బస్తాలా అవనూ లేదు. తన పొడుగాటి నల్లని జుట్టుని చూసి అందరూ అడుగుతారు. "ఒక్క వెంట్రుకన్నా నెరవలేదు. ఏం నూనె రాసుకుంటారూ?" అంటారు. సన్నగా సలాగ్గా ఆవిడ అప్పటికీ ఇప్పటికీ ఒక్కలా ఉన్నారు. ఎంత చకచకా పనిచేస్తారు? మనం ఆవిడతో పనిచెయ్యలేం" అని తన ముందర తనని పొగుడుతారు. నలభై ఏళ్ళొచ్చినా, తెలియనివాళ్లు తనకి ముప్పై ఏళ్లనే అనుకుంటారు.

చిన్నగా నవ్వి ఊరుకుంది. ఈ పెద్దమనిషి దేశానికి ఎప్పుడు తిరిగి వచ్చాడో! దేశం వచ్చినవాడు ఈ ఊరు ఎందుకు వచ్చాడో? ఈ ఊరు వచ్చి తన గురించి భోగట్టా చేసి ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడా? తనని గుర్తుంచుకున్నాడా? మరిచిపోవడం కష్టమైన సంగతే! అయితే తన ఇంటికి రావడం ఆశ్చర్యమైన విషయమే!

"ముందు ఉత్తరం రాసి వద్దామనుకున్నాను. కాని రాయకుండా వెంటనే బయల్దేరి వచ్చేశాను. బాబులు మీరు ఇక్కడ వుమెన్స్ కాలేజీలో ప్రిన్స్‌పాల్‌గా ఉన్నారని, ఇల్లూ అదీ కట్టుకుని ఈ ఊళ్లో సెటిల్ అయ్యారనీ చెప్పాడు. నిన్న రాత్రి ట్రెయిన్‌లో వచ్చాను.

"బాబులు?"

"అదే మన రామశాస్త్రి"

బాబులు అంటే ముందు ఎవరో అనుకుంది. రామశాస్త్రి! అవును ఆయన్ని బాబులు అని పిలిచేవారు.

"రామశాస్త్రిగారా? ఆయన ఇప్పుడు ఎక్కడుంటున్నారు?"

"బొంబాయిలో ఉన్నాడు. వాడు కూడా నాతోపాటు వస్తాడనుకున్నాను. కాని వాడికి వీలు పడలేదు"

రామశాస్త్రే! శేఖర్‌ని తీసుకువచ్చి ఇంట్రడ్యూస్ చేశాడు. హాండ్‌సమ్ ఇంజనీర్ అంటూ! అమ్మా నాన్నా అన్నయ్య - అంతా శేఖర్ని చూసి మురిసిపోయారు. వాళ్లేనా మురిసిపోయింది? తనో? తనని తానే మరిచిపోయింది.

తరువాత ఆ రామశాస్త్రి ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తను పట్టించుకోలేదు. అవసరం ఏముంది? శేఖర్‌తోపాటు రామశాస్త్రి బ్రతుకులో నుంచి పక్కకి తప్పుకున్నాడు. తను ఎక్కడుందో, ఏం చేస్తోందో, ఆఖరికి ఇల్లుకట్టుకున్న సంగతివరకూ అన్ని భోగట్టాలూ బొంబాయిలో ఉన్న రామశాస్త్రి తెలుసుకున్నాడా! శేఖర్ రామశాస్త్రి దగ్గర భోగట్టా చేసి ఇక్కడికి వచ్చేడా? పదిహేనేళ్ల క్రితం సంగతులు నిన్న మొన్న జరిగిన సంగతుల్లా కళ్లముందు కదులుతూ కనిపిస్తున్నాయి.

"కమలా! ఓ కమలా!" కేకేసింది.

శేఖర్ నవ్వాడు. "మీరు ఏమీ మారలేదు. కమలా! ఓ కమలా! 'ఓ' లేకుండా పిలవడం మీకు రాదుగా"

శేఖర్‌కి అన్ని జ్ఞాపకం ఉన్నాయి. అన్నయ్య తనని వెక్కిరించేవాడు. "అన్నయ్యా ఓ అన్నయ్యా!" అంటుందనీ, రేపు పొద్దున్న మిమ్మల్ని "శేఖర్! ఓ శేఖర్!" అని పిలుస్తుంది సుమండీ" అని వెక్కిరిస్తూ చెప్పేడు. శేఖర్ నవ్వేడు కాని తనకి నవ్వు రాలేదు. ఆ విషయం జ్ఞాపకం వచ్చి బాధ అనిపించింది. "శేఖర్! ఓ శేఖర్!" అని పిలిచే క్షణం రాలేదు. పెద్దవాళ్ళ భాషలో యోగం లేదు. పదిహేనేళ్లు గడిచిపోయేక, నడివయస్సు పైబడ్డాక శేఖర్ కేవలం పరిచయస్తుడు తప్ప ఏం కాడని ఎరిగాక ఇప్పుడు ఈ బాధ ఏమిటి? గుండెల్లో ఈ బాధ గిలిగింతతో "అమ్మో" అని కొట్టుకుంటూంది.

కమల వచ్చింది.

"రెండు కప్పులు కాఫీ తీసుకురా" అని కమలకి చెప్పింది.

"ఎన్నేళ్ళయిందో మీరు పెట్టిన కాఫీ తాగి! కమల చేతి కాఫీనా నాకిప్పిస్తారు?" అన్నాడు శేఖర్.

తను పెట్టిన కాఫీ బ్రహ్మాండమని శేఖర్ తెగమెచ్చుకునేవాడు. అన్నయ్య స్నేహితులూ తన కాఫీకోసం అలాగే వచ్చేవారు. ఇప్పటికీ తన స్నేహితులు అందరూ "కమల కాఫీకాదు నీ కాఫీ కావాలి" అంటూ వంటింట్లో నిలబడి మరీ చేయించుకుంటారు. మీ చేతికాఫీ తాగుతాను అంటున్న శేఖర్‌లో పదిహేనేళ్ళ క్రితపు శేఖర్ కనిపించేడు. కాలం ఎంత మార్పు

తెస్తుంది? ఆఖరిసారి శేఖర్‌గాని కనిపించి ఉంటే తను కాఫీ ఇచ్చేదా? అప్పుడు ఆ క్షణాన్ని శేఖర్ అంటే ఎంత కోపం! అసహ్యం! ఒళ్ళుమంట! ఎంత స్వార్థపరుడు! మాటమీద నిలబడలేని అప్రాచ్యుడు! ఎన్ని రకాలుగా అందరూ తిట్టేరు!

ఇప్పుడు పదిహేనేళ్ళ తర్వాత, నలభయ్యోపడిలో, ప్రిన్సిపాల్ హోదాలో, సోషల్ స్టేటస్‌తో ఉన్న తన ఇంటికి వచ్చిన అతిథిని గౌరవించి పంపాలి. ఇన్నేళ్ళ తేడాయే లేకపోతే నిలువునా నిలబెట్టి తిట్టి దులపవలసినదంతా దులిపి పంపించి ఉండేది. ఇప్పుడు ఆ కోపం లేదు. తిట్టడం దుయ్యబట్టడం మర్యాదకాదు. అవసరమూ లేదు.

తను లేచి లోపలికి వెళ్ళబోతూ ఉంటే – "మీ ఇల్లు నేను చూడొచ్చా? డ్రాయింగు రూములోనే కూర్చోవాలా" అంటూ శేఖర్ లేచి నిల్చున్నాడు.

'అమ్మగారింటికి ఎవరూ రారు. ఆవిడా, ఆవిడ పుస్తకాలూ, ఆవిడ కాలేజీ, ఆవిడ తోటా మొక్కలూ తప్ప ఆవిడకి మరో ప్రపంచం లేదు. అడపాతడపా ఆవిడ అన్నయ్య వస్తాడు. అలాంటిది ఈ పెద్దమనిషి ఎవడో ఇలా మాట్లాడుతున్నాడు!' కమల అనుకుని ఉంటుంది. దానికేం తెలుసు? ఈ పెద్దమనిషి అమ్మగారి బ్రతుకులో చిన్న చిచ్చుపెట్టి వెళ్ళిపోయేడని, నేడు ప్రత్యక్షమయ్యేడని దానికేం ఎరుక!

"రండి లోపలికి, ఇల్లు చూడనా అని అడుగుతున్నారా! భలేవారే!" అంటూ శేఖర్‌ని తీసుకుని లోపలికి వెళ్ళింది. మంచీ మర్యాదా మొహాన్ని పూత పూసుకుని ఎప్పుడూ అంటి పెట్టుకుని ఉంటాయి. మనస్సులోపల జరిగే మధనకీ, మొహంమీద రంగుకీ ఏం సంబంధంలేదు!.

తన ఇంటినీ తననీ శేఖర్ చూడవలసిందే. ఒకప్పుడు తనని కాదని తోసిపుచ్చి వెళ్లిపోయినవాడు, చూడనీ, తన కాళ్లమీద తాను నిల్చుని ఏ స్టేటస్‌కి రైజ్ అయిందో ఎంత గొప్పగా బతుకుతుందో చూడనీ! తన వాళ్లకి డబ్బులేక, డబ్బు ఇవ్వలేకపోవడం వల్ల తనని కాదని శేఖర్ చదువుకోని అనాకారిని పట్టుకున్నాడు. చదువుకోని అనాకారి కొంగుని బంగారం ఉంది. దాన్ని పుచ్చుకొని ఇంగ్లండు వెళ్ళేడు. పెద్ద ఇంజనీరై అక్కడే సెటిలయ్యేడని విన్నాది. పెళ్లాంతో దేశంవచ్చి ఉంటాడు. దేశం తిరుగుతూ తిరుగుతూ తన ఇంటికీ వేంచేశాడు.

శేఖర్ ఇంగ్లండు వెళ్ళిపోయేక, సంగతి తెలిసేక ఇంట్లో అందరూ శేఖర్ని తిట్టారు. "ఆ మాత్రం మాట నిలకడ లేనివాడు మనమ్మాయిని చేసుకుంటానని మాటెందుకిచ్చాడూ" అన్నారు. 'మనమ్మాయి దగ్గరికి రోజూ సాయంత్రంపూట ఎందుకు హాజరయ్యేవాడూ? అన్నారు. "అంతాడబ్బు. డబ్బులో ఉంది మహాత్మ్యం" అన్నారు. డబ్బే కావాలని సరిగ్గా ఏడిస్తే ఇల్లు అమ్మి అయినా ఇచ్చేవాణ్ణి. పిల్లదాని సుఖం కోసం ఏమన్నా చేసి ఉండేవాణ్ణి! అని నాన్న బుర్ర మొత్తుకున్నారు. కట్నం గట్రాలతో పనిలేదని శేఖర్ని పరిచయం చేసేరు. శేఖరు రంగు ఇలా తేలేసరికి "కాలికి బలపం కట్టుకునీ తిరిగి వాడి తాతలాంటి సంబంధం తేకపోతే చూడు" అని ప్రతిజ్ఞ పట్టేరు. కాని తన మొండితనం దగ్గర ఎవరిమాటా చెల్లలేదు. ససేమిరా తను పెళ్లి చేసుకోను కాక చేసుకోనూ అంది. "వాడంటే అలాంటి అప్రాచ్యుడు. అందరూ అలాంటివాళ్లేటి!" అని తెగనచ్చచెప్పబోయేరు. "అదో శిఖండి! ఇక వదిలెయ్యండి

దాని ఖర్మ ఎలా వుంటే అలా ఏడుస్తుంది" అని ఓ కోత పెట్టేసేరు. ఇదిగో దాని ఫలితం – తను సంఘంలో తనకి తానుగా, ఓ కళాశాల ప్రిన్స్‌పాలుగా, మంచి వ్యక్తిత్వం ఉన్న చక్కని ఎడ్మినిస్ట్రేటర్‌గా, మంచి మేడమ్‌గా, చుట్టూ ఉన్నవాళ్లకి దయగల తల్లిగా పేరూ ప్రతిష్ఠ తెచ్చుకుంది? ఇప్పుడు ఇల్లు కూడా కట్టుకుంది? ముందుకు చక్కనితోట? మంచి లైబ్రరీ? చేతినిండా కాలవసినంత పని. తన హితాభిలాషులందరికీ ఆశ్చర్యమే! ఇంత చక్కటి ఆవిడ, ఇంత మంచి మనస్సు కలావిడ, అంత నేర్పుతో ఇంట్లోబైటా పనిచెయ్యగలిగే ఆవిడ పెళ్లి చేసుకోలేదేమీ? అని! "ఆవిడ ఎంచక్కటి గృహిణి అయి ఉండేది. మగవాళ్లు దౌర్భాగ్యులు?" అని వాళ్లలో వాళ్లు తనకి వినిపించేటట్టుగా కూడా వాపోతూ ఉంటారు. చూడనీ శేఖర్ని – తనని, తన ఇంటిని, తన స్టేటస్‌ని, తన వ్యక్తిత్వాన్ని! పెళ్లి ఒక్కటే ఆడదాని జీవితంలో మహత్తరమైన విషయం కాదనీ, బ్రతుక్కి కావలసినవి అందం, సొగసూ అనీ తెలుసుకోనీ! డబ్బే ప్రధానం కాదనీ తెలుసుకోనీ.

డైనింగు రూములో టేబులు మీదున్న పువ్వుల్ని చూస్తూ శేఖర్ చాలాసేపు నిలుచుండిపోయేడు 'పువ్వుల అమరిక బావుంది. ఎంతో బాగుంది" అని మెచ్చుకున్నాడు. "ఇకోబినా నేర్చుకున్నారా?" అన్నాడు. పువ్వుల్ని ఎలా అమర్చాలో చెబుతూ చిన్న తేడాలతో ఎంత అందం వస్తుందో తను బోధపరిచింది. పొడుగ్గా పొట్టిగా కాడల్ని ఎలా కత్తిరించాలో తెలుసుకోవాలని చెప్పింది.

"నిజమే! మీరు చెప్పింది. అప్పుడప్పుడు బతుకుల్ని కూడా కత్తిరించి మళ్లీ అమర్చుకోవలసి వస్తుంది. వికారంగా ఉన్న బతుకుని కత్తిరించి అందంగా చేసుకోవాలి అన్నాడు శేఖర్.

ఎందుకలా అన్నాడో!

"ఇది బెడ్‌రూమ్. ఆ పక్కది గెస్ట్ రూమ్"

"ఇది బెడ్‌రూమా! రీడింగ్‌రూమో, లైబ్రరీనో అనండి. చాలా పుస్తకాలు కలెక్టు చేశారే" అంటూ శేఖర్ పుస్తకాల రాక్ చూడ్డం మొదలు పెట్టేడు. నిజమే తన బెడ్‌రూమ్ నిండా పుస్తకాలే. తను చదువుతూ వదిలిపెట్టిన మోడరన్ పోయిట్రీ ఏంథాలజీని తీసుకుని శేఖరు వడక కుర్చీలో కూర్చున్నాడు.

"మీ ఇల్లు చాలా బాగుంది. మరి కాఫీ ఇస్తారా?" అన్నాడు.

ఎంత మామూలుగా ఎప్పుడూ వస్తూ పోతూ ఉండే స్నేహితుడిలా చనువుగా అడుగుతున్నాడు. జరిగిపోయినదానికీ, తాను ప్రవర్తించిన దానికీ ఎక్కడా సిగ్గుపడుతున్నట్టు లేదు. అయినా ఇన్నేళ్ల తరువాత అప్పటి తన ప్రవర్తనకి క్షమాపణ చెప్పుకుంటాడా?

"ఓ ష్యూర్!" అంటూ తను వంటింట్లోంకి వెళ్లిపోయింది.

కాఫీ పెడుతున్నంతసేపూ పాతరోజులే కళ్ళముందు తిరిగాయి. శేఖరుకి బట్టతలైనా అందంగానే ఉన్నాడు. శేఖరంటే తన మనస్సులో ఇంకా బలహీనత ఉందా? అందుకే బట్టతలా అందంగా కనిపిస్తూందేమో? ఛత్! తనకేం బలహీనత! బలహీనతంటూ ఉంటే ఎవణ్ణో ఒకణ్ణి కట్టుకుని పిల్లా పాపా కనుక్కుని సంసారాన్ని ఈడ్చేది. శేఖర్ ఎవడో ఒహడు

ఎలా అవుతాడు? శేఖర్ కాబట్టే బలహీనత! మనస్సు ఎదురు సమాధానం చెబుతుంది.

శేఖర్ పెళ్ళాం ఎలా ఉందో? పెళ్లాన్ని కూడా తీసుకువస్తే తను చూసి ఉండేది. పిల్లాపాపా ఉండి ఉంటారు. దేశం ఎప్పుడు వచ్చాడో? ఎన్నాళ్లు ఉంటాడో? శేఖర్ని తను ఏమీ అడగలేదు.

కాఫీ తీసుకుని తను వెళ్లేసరికి కళ్ళు మూసుకుని పడుకుని ఉన్నాడు. పుస్తకం గుండెల మీద ఉంది. తను వచ్చిన చడి విని కళ్లు విప్పేడు. కళ్లు చెమర్చి ఉన్నాయి. శేఖర్ బాధపడుతున్నాడన్నమాట! "నో గ్రీవెన్సెస్ ఫర్ ది పాస్ట్!" అని చెప్పాలనిపించింది. మాట్లాడకుండానే కాఫీ తాగాడు. తనూ మాట్లాడకుండా నిశ్శబ్దంగా మధ్య మధ్య శేఖర్వేపు చూస్తూ కాఫీ తాగింది. తను చేసిన కాఫీని ఎంజాయ్ చెయ్యవలసినంతా ఎంజాయ్ చేసేడా? జేబులోంచి సిగరెట్టు తీసి "విత్ యువర్ పెర్మిషన్" అన్నాడు. చిన్నగా బుర్ర ఊపింది. పదిహేనేళ్ళ క్రితపు సంభాషణే!

"యాష్-ట్రే లేదూ?" అటూ ఇటూ చూసి అడిగేడు.

"యాష్-ట్రే కొనవలసిన అవసరం రాలేదు!" అన్నది.

"సిగరెట్లు తెగకాలుస్తూ ఉంటే - ఇహ తప్పేటట్లు లేదు. ఓ యాస్ ట్రే కొనాలి" అన్నది. ఇంట్లో అన్నయ్యా కాల్చడు. నాన్నా కాల్చరు.

"మరి తొందరగా కొనేసేయండి!" అన్నాడు. పదిహేనేళ్ల క్రితపు సంభాషణ!

శేఖర్ తనవేపు చూసేడు. ఏమనుకున్నాడో ఏమో ముట్టించిన సిగరెట్టుని నలిపి ఆర్పేశాడు.

"మీరు నాతో పాటు ఓసారి గెస్ట్ హౌస్కి రావాలి. వస్తారా?" అన్నాడు.

"గెస్ట్ హౌసా?"

"గెస్ట్ హౌస్లో దిగేం. మీరు నాతో రావాలి"

"ఫామిలీతో వచ్చారా? అయితే అందర్నీ తీసుకు రాలేదేం!" అడిగింది.

"ముందు తీసుకువద్దామనే అనుకున్నాను. కాని ఇన్నేళ్ల తరవాత కలుస్తున్నాం కదా అని తటపటాయించాను, మిమ్మల్ని తీసుకు వెళ్దామని అనిపించింది".

తను వెళ్లాలా? అక్కర్లేదా? రాను అని బ్లంట్గా ఎలా చెబుతుంది? ఏం చెప్పి ఎలా తప్పించుకుంటుంది? తీరావెళ్తే ఆ భార్య ఎలా బిహేవ్ చేస్తుందో? భార్యతో ఏమని చెప్పేడో? తిన్నగా ఇక్కడికి తీసుకువచ్చి పరిచయం చేస్తే బాగుండేది కదా! తప్పదు వెళ్లాలి! వెళ్లి చూడాలి! చూడాలన్న కోరికా మనస్సుకి గట్టిగానే ఉంది గెస్ట్హౌస్కి వెళ్లింది.

"రండి. ఈ రూములో దిగేం" అంటూ లోపలికి తీసుకువెళ్లాడు. గదిలో ఎవరూ లేరు. మంచం మీద రెండేళ్ల పిల్లవాడు నిద్రపోతున్నాడు. మంచం దగ్గరికి వెళ్లి పిల్లవాణ్ణి చూస్తూ నిల్చుంది. పిల్లవాడు బొద్దుగా అందంగా ఉన్నాడు. ఉంగరాల జుత్తు. తండ్రి పోలికే. నిద్దట్లో నవ్వుతున్నాడు. శేఖర్ వేపు తిరిగింది. శేఖర్ తనవేపే చూస్తున్నాడు.

"కూర్చోండి"

మంచం పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుని అటూఇటూ చూసింది. ఇంకెవరూ ఎక్కడా ఉన్న సడిలేదు.

"బాబు మదరేరీ?"

"బాబుకి ఫాదరూ, మదరూ నేనే!"

"వ్వాట్?" అని శేఖర్‌వేపు చూస్తూ ఉండిపోయింది.

"తల్లిని చంపి వాడు పుట్టేడు"

ఆ పసివాడు హాయిగా, నిశ్చింతగా నిద్రపోతున్నాడు. తాను పూర్తిగా దేశం వచ్చేసినట్టూ జాబ్‌లో ప్రవేశించినట్టూ, పిల్లవాణ్ణి పెంచడానికి ఎవరికీ ఇవ్వడం తనకిష్టం లేనట్టూ, మనస్సులో కొట్టుమిట్టులాడి కొట్టుమిట్టులాడి రామశాస్త్రి దగ్గరికి వెళ్లినట్టూ, రామశాస్త్రి ద్వారా తన ఎడ్రసు కనుక్కువచ్చినట్టూ చెప్పేడు.

అంతా చెప్పి ఆఖరికి - "యాష్-ట్రే తొందరలో కొంటారా?" అన్నాడు.

తను శేఖరువేపూ మంచం మీద పడుకుని నిశ్చింతగా నిద్రపోతున్న పిల్లవాడివేపూ మార్చి మార్చి చూస్తూ ఉండిపోయింది.

శేఖరు శేఖరే! ఎన్ని సంవత్సరాలైనా శేఖరు శేఖరే! తను నిర్ణయం - చెయ్యవలసిన క్షణం మరోసారి బ్రతుకులో వచ్చింది. ఈ నిర్ణయంతో బ్రతుకు మళ్లీ మరో మలుపు తిరుగుతుంది. ఈ తిరిగే మలుపు నడికాలంలో అందమైన మలుపే అవుతుందా? శేఖరు శేఖరే! ఎన్నాళ్లయినా శేఖరు శేఖరే!

ఓ నిమిషం, రెండు నిమిషాలు, మూడు నిమిషాలు, ఐదు నిముషాలు..... శేఖరు తనవేపే చూస్తున్నాడు.

"ఐయామ్ సారీ శేఖర్! నా ఇల్లు చాలా చిన్నది. యాష్-ట్రే పెట్టడానికి జాగాలేదు!" అన్నది.

# కన్నీళ్ళు

## ఎస్. జయ

"ఒరే పెద్దోడా! బారెడు పొద్దెక్కినా నిద్దురేనా, లెయ్యి. పన్లోకి ఎండబడిపోతే పెద్దరెడ్డి వరుసబెట్టి అటు మూడు తరాలను, ఇటు మూడు తరాలను తిట్టిపోస్తాడు. లేరా" కొడుకును బతిమాలుకుంటూ లేపుతోంది బుచ్చమ్మ.

"ఒళ్ళంతా నొప్పులే. లేవబుద్ధిగాకున్నాది. రవ్వంతసేపు పడుకుంటానే" మారాం చేశాడు సుంకన్న.

"ఆ మాటనొద్దు. వగిసోనివి. ముసలోళ్ళు అనాల్సిన మాట అననీకి సిగ్గులేదూ!?"

"నాకు నీతో కుశాలేమి? వీపు, నడుం పట్టేసినట్టు నొప్పిన్నాది. నేను జీతం కొట్టను, పో. ఇయ్యాలసంది పన్లోకి పోను" అన్నాడు మొండిగా సుంకన్న.

బుచ్చమ్మకున్న నలుగురు సంతానంలో పెద్దకొడుకు సుంకన్న, ఇరవై ఏళ్ళవాడు. కూలినాలి చేసుకొని బతికే తల్లిదండ్రులకు ఏపుగా ఎదిగొచ్చిన కొడుకు ఎంతో ఆసరా. సుంకన్నది తండ్రిలా బలిష్టమైన శరీరం కాదని బాధపడేది బుచ్చమ్మ. సుంకన్న తండ్రి ఎత్తు పొడుగైతే పెరిగాడు కాని, తల్లిలా బక్కపల్చటి మనిషి. చామనఛాయ రంగులో నిగనిగలాడుతూ ఉన్నాడు. నూనూగు మీసకట్టు వల్ల సుంకన్నలో పెద్దరికం తొంగి చూస్తున్నది. పైగా ఇప్పుడు పెద్దరెడ్డి పొలం దున్నే జీతగాడు.

సుంకన్న పదో ఏటనే పెద్దరెడ్డి ఇంట్లో పసులగాచే జీతగాడుగా పనికి కుదిరాడు. రెండేళ్ళ నుంచి పొలం పని చేస్తున్న జీతగాడు. గొర్రు తోలడం, విత్తనాలు వేయడం వంటి పనులు రాకపోయినా, మిగతా పొలం పనులన్నీ చేయగలడు. గొర్రు తోలడం లాంటి పనులున్నప్పుడు సుంకన్న తండ్రి సుబ్బన్న వచ్చి పక్కన కొడుకుకు చెబుతూ ఆ పనులు చేసేవాడు. పలక మీద గీత గీసినంత సక్కగా ఒక్క వంకర పోనీకుండా సుబ్బన్న గొర్రు తోలుతాడని ఊర్లో అందరూ చెప్పుకోవడం చిన్నప్పట్నుంచి సుంకన్న వింటూనే ఉన్నాడు. విత్తనం గొర్రు తోలడంలో తండ్రి అంతటివాడిని కావాలని సుంకన్న కలలు కనేవాడు. కొడుకుకు మేడిపట్టే వయసు వచ్చింది. ఓ ఇంటివాణ్ణి చేయాలని బుచ్చమ్మ

సుబ్బన్న ఉబలాటపడుతున్నారు.

సుంకన్న పన్లోకి వెళ్ళనని చెప్పేసరికి, బుచ్చమ్మకు గుండెల్లో గుబులు, కాళ్ళలో వణకు ఒక్కసారిగా పుట్టాయి.

"ఈ ఏడు నీ పెళ్ళి చేయాలని మేము తొందరపడుతుంటే, జీతం కొట్టనని మంకుపట్టు పడుతున్నావు. నీ పెళ్ళికి డబ్బేడకెళ్ళి వస్తాది. పన్లోకి పోవాల్సిందే పెద్దోడా!" ఖరాఖండిగా చెప్పింది బుచ్చమ్మ. సుంకన్న కప్పుకున్న దుప్పటి లాగేసింది.

ఓటమి అంగీకరించిన అసహనంతో ఏడుపు ముంచుకురాగా సణుక్కుంటూ పన్లోకి వెళ్ళాడు.

సుంకన్నను లేపుతుండగా, సుంకన్న తరువాతి వాడు పన్నెండేళ్ళ మల్లన్న సత్తు చెంబుతో నీళ్ళు తెచ్చుకొని ఇంటి ముందు పరిచిన అరగజం వెడల్పున్న బండ మీద నిలబడి ముఖం కడుక్కున్నాడు. రెండుమూడుసార్లు నోటినిండా నీళ్ళు పోసుకొని పుక్కిలించి, నీళ్ళతో ముఖం తుడుచుకున్నాడు. మిగిలిన సగం చెంబు నీళ్ళు కాళ్ళమీద చల్లుకొని ఇంట్లోకి వెళ్ళబోయాడు.

"ఒరే చిన్నోడా! నా కన్నుగప్పి నోట్లో నీళ్ళు పోసుకొని ఊసి మొగం కడిగినావు కదరా! పండ్లు తోమినానంటావు. నీ యవ్వారమంతా జూస్తనే ఉన్నా. దినాం ఇట్లా చేయబట్టే పండ్ల మీగ బెత్తెడెత్తున పాచి పేరింది. బొగ్గు, ఉప్పు నమిలి బాగా పండ్లు దోమరా" అని చిన్నకొడుకును కోప్పడింది బుచ్చమ్మ.

తల్లి అరుపులకు భయపడి గూట్లోని బొగ్గు ముక్క నోట్లో వేసుకొని కసకస నమిలాడు మల్లన్న.

"ఇంట్లోకి బోయి ఉప్పుగల్లు నోట్లో ఏస్కొనీక పయి బరువు.... ఇగో ఉప్పు.... బొగ్గు, ఉప్పు నమిలి.... బాగా పండ్లు దోము" అంటూ చేతిలో ఉప్పు పోసింది.

'కోడి కూసినప్పుడు లేసినాను. పనులు తీరలేదు. అందర్నీ లేపి ఎవరి పన్లోకి వాళ్ళను సాగనంపి, కూడు వండేయాలకు బారెడు పొద్దెక్కినాది. నోట్లో నీళ్ళు పోసుకోడానికి కూడా తీరకుండా ఒకటే పని. కడుపులో భగభగ మండుతున్నాది. మాయదారి మంట. తిన్నా తినకపోయినా ఈ ఆకలి పొద్దస్తమానం ఉంటున్నాది' తనలో తనే గొణుక్కుంటూ ఇల్లు ఊడ్చింది. చెంబులు, గిన్నెలు తోమింది. బొగ్గుముక్క నోట్లో వేసుకొని పండ్లు తోముకుంటుండగా, రెడ్డి ఇంట్లో పనులు చేయడానికి ఉదయాన్నే వెళ్ళినవాళ్ళు అన్నాలు తినడానికి ఇంటికి వచ్చారు. అందరికీ అన్నాలు కంచాల్లో పెట్టింది. పొలం పనికి వెళ్ళాల్సిన భర్తకు, జీతానికి వెళ్ళే సుంకన్నకు, పసువుల గాయ వెళ్ళే మల్లన్నకు సద్దులు కట్టి ఇచ్చింది. తనూ నాలుగు ముద్దలు గబగబా నోట్లో కుక్కుకుని సద్దిమూట కట్టుకొంది. ఇద్దరు చిన్నపిల్లలకు ఇంటిని కనిపెట్టుకొని ఉండమని, తగవులాడుకోవద్దని సుద్దులు చెప్పి రెడ్డి సెనగచేనులో కలుపు తీయడానికి వెళ్ళింది.

తోటి ఆడకూలీలు ఆ మాట, ఈ మాట చెప్పుకుంటూ, పరాచకాలాడుకుంటూ కలుపు తీస్తున్నారు. బుచ్చమ్మ మనసులో పెద్దకొడుకు సుంకన్న మెదిలాడు. 'పెద్దోడిది

అంతా వాడి అబ్బ పోలిక. రెక్కలు దాచుకోకుండా పనిచేసే రకం. పరాచకానికైనా అబద్ధాలాడడు. అట్టాంటోడు..... ఈమధ్యన ఒళ్ళు నొప్పులని పొద్దు పొడిచినా లేవడం లేదు. ఏమైందో పెద్దోడికి. ఏం గాలి సోకెనో' అనుకుంది. ఆ ఆలోచనకు బుచ్చమ్మ మనసులో కలకలం రేగింది.

ఆమె చేతులు కలుపు మొక్కలు ఏరేస్తున్నా, మనసు పరిపరి విధాల ఆలోచనలు చేసింది. 'కాలం ఎంత మారిపోవట్టే! కాపురానికొచ్చిన కొత్తలో పెద్దరెడ్డి ఇంట్లోనే సుంకన్న నాయన జీతముండె. తొలికోడి కూయగానే పన్లోకి బోతే, రాత్రి రెండు జాములప్పుడు ఇంటికొచ్చేవోడు. ఊరు నిద్రపోయేది. కీచురాళ్ళు అరుస్తుంటే, పట్టుడుకర్ర పట్టుకొని ఇంటికొచ్చేవోడు. అంత దూరాన్నుంచే కిర్రుచెప్పుల చప్పుడుకు మేలుకొని తలుపు తీసేదాన్ని, ఇప్పుడు పనులు బాగానే తగ్గినాయి. బువ్వలు తినేయాలకు ఇంటికొచ్చి తిని ఇంటికాడ్నే పడుకొని తెల్లారిపోతున్నారు. దుడ్లు చేతిలో పడితే చాలు పెద్దల మాట ఇనకుండా వగిసి పిల్లగాండ్లంతా కలిసి సినిమాలకు పోతున్నారు. కాని, సుంకన్న బుద్ధిమంతుడు. సినిమాకు వెళ్ళమాకురా అంటే చెప్పిన మాట వింటాడు. అంత మంచోనికి ఏ మాయదారి రోగమొచ్చెనో అనుకుంది.

వేరుసెనగ చేనుల్లో వంచిన తల ఎత్తకుండా కలుపు తీసింది బుచ్చమ్మ. పొద్దు గుంకేవేళకు తలెత్తబోయిన బుచ్చమ్మకు మెడ పట్టేసినట్టయింది. 'ఇదేంది ఇట్లా అయింది నాకు. ఏం గాలి సోకెనో!?' అనుకుంది. ఎల్లమ్మ దేవతకు మొక్కుకుంది. 'కాపురానికొచ్చినసంది ఈ రెడ్డోళ్ళకే పనికొచ్చినాను ఎప్పుడూ ఇట్లా కాలే. ఏమైందో ఏమో. ఇంటికెళ్ళినాక కిరసనాయిలు, ఎల్లిపాయ పెట్టి రుద్దాల, పెద్దోనికి కూడా చేయాల' అనుకుంది మనసులో.

బుచ్చమ్మ చిట్కా వైద్యం రెండు మూడు రోజులు చేసుకున్నా మెడ నొప్పి తగ్గలేదు. ఐదారు రోజులకు పాత నొప్పి కింద పడిపోయి, బుచ్చమ్మకు అలవాటయిపోయింది. ఆమె తనకు తగ్గకపోయినా, సుంకన్నకు తగ్గిపోయి ఉంటుందనుకుంది.

"ఒరే పెద్దోడా! రెండు మూడు రోజుల సంది వళ్ళు నొప్పులు అనలా, తగ్గిపోయి నాదిరా" నొప్పులు తగ్గిపోయాయని కొడుకు చెప్పాలని ఆశగా అడిగింది బుచ్చమ్మ.

"ల్యావే. ఎంత నొప్పులున్నా పనికి బోక తప్పదని పొద్దున్నే నీ సాధింపులు పడలేక అనలేదు. అట్లానే ఎల్తున్నాను పన్లోకి" సుంకన్న అన్నం తిని చేతులు కడుక్కుంటూ అన్నాడు.

నీళ్ళచెంబు నోటికి ఎత్తి తాగబోతూ, పెదవులకు ఆనించుకున్న చెంబు కింద పెట్టాడు. "అమ్మా ఏందే. చెంబులు సరిగా కడగలేదు. లోపల తెల్లగా సుద్ద అంటుకున్నాది" అన్నాడు.

"బాగానే తోమినానే" అన్నదే కాని, పని తొందర్లో సరిగా కడగలేదేమోనని అనుమానం కలిగింది బుచ్చమ్మకు.

మరో చెంబుతో నీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఆ చెంబు లోపల కూడా సుద్ద అంటు

కున్నట్టు కనిపించింది. వేలితో గోకి చూస్తే చెంబుకు గట్టిగా అతుక్కొని ఉంది. తరువాత చిన్నరాయి తీసుకొని గీరి చూసింది. చిన్న చిన్న పెచ్చులుగా తెల్లగా సున్నం పలుకుల్లాంటివి ఊడిపడ్డాయి.

బుచ్చమ్మ చెంబు లోపల రాయితో గీకి చూస్తుంటే, సుంకన్న పక్కనే చూస్తూ నిలబడ్డాడు. "పెద్దోడా! వళ్ళు నొప్పులు అట్లానే ఉండాయంటున్నావు. ధర్మాసుపత్రికి పోయి డాక్టరుకు చూపించుకోరా. నీ బదులు మీ నాయన్ను పన్లోకి పొమ్మని చెబుతాను"

"ఏందే!? పొద్దున్నే అమ్మా కొడుకు తీరుబాటుగా పెత్తనాలు జేస్తున్నారు. పనిలోకి పోల్యా?" సుంకన్న వైపు చూసి అడిగాడు సుబ్బన్న. "ల్యా, ధర్మాసుపత్రికి బోయి చూపించుకోమంటున్నది అమ్మ. ఇయ్యాల నా బదులు నీవు పనిలోకెల్లో"

"తల్లీ, కొడుకు కూడబల్కొని నన్నియాం జీతానికి ఎల్లమంటున్నారు. తప్పుతాదా! పోతాలేరా పెద్దోడా. కూడు పెట్టే, తిని పోతా" అంటూ పీట మీద కూర్చున్నాడు సుబ్బన్న.

★ ★ ★

సుంకన్న డాక్టర్ల చుట్టూ తిరుగుతూ వాళ్ళు రాసిచ్చిన మందులు, టానిక్కులు మింగుతున్నాడు. ఒళ్ళు నొప్పులు తగ్గకపోగా చేతులు, కాళ్ళు వంకర్లు పోయాయి. అడుగు ముందుకేసినప్పుడంతా ఆ పక్కకు, ఈ పక్కకు వొంగిపోతూ దారంతా తానై నడుస్తున్నాడు సుంకన్న. పేటలోని మరో ముగ్గురు పిల్లలకు ఈ జబ్బే సోకింది. . ᐟమ్మ: ᐝ మెడ పట్టేసింది. ఎవరైనా పిలిస్తే మెడ తిప్పి చూడలేదు. మనిషంతా అట్టాప్రు తిరగాల్సిందే. ఈ మాయదారి రోగాలు తమ పేటలోని వాళ్ళకే ఎందుకొచ్చాయో, ఏ దేవతకు తక్కువ చేశామో అనుకున్నారు. సుంకన్న జబ్బు నయం కావాలనే పట్టు దలతో సుబ్బన్న వారం వారం కొడుకును ఆస్పత్రికి పంపుతున్నాడు. డాక్టర్లు రాసిచ్చిన మందులు తినమంటున్నాడు.

ధర్మాసుపత్రికి బదిలీపై కొత్తగా వచ్చిన డాక్టరు సుంకన్న జబ్బు వెంటనే గుర్తించాడు. పత్రికలవాళ్ళను వెంటబెట్టుకొని సుంకన్న వాళ్ళ ఊరు రంగాపురం వెళ్ళాడు. బావిలో నీళ్ళు పరిశీలించాడు. పూరిపాకల్లోకి వెళ్ళి చెంబులు, గిన్నెలు, నీళ్ళు నిలువ ఉంచుకునే కాగులు, బానలు పరీక్షించాడు. వాటి లోపల సున్నంలా అతుక్కొని ఉంది. కడిగితే పోదని అన్నారు. ఆ ఊరి బావుల్లోని నీళ్ళలో ఫ్లోరైడ్ ఎక్కువగా ఉందని, అందుకే ఈ జబ్బులు వస్తున్నాయని చెప్పారు. నీళ్ళు కాచి, వడగట్టి తాగమని సలహా ఇచ్చారు. విలేఖరులు సుంకన్నతోపాటు మరో నలుగురి పిల్లల ఫోటోలు తీసుకున్నారు.

డాక్టరు వచ్చి వెళ్ళిన మూడో రోజు ఊరి సర్పంచ్ వీరారెడ్డి సుబ్బన్నను పిలిపించి చెప్పాడు : "పేపర్లో మనూరి నీళ్ళ గురించి రాసినారురా. మీ పిల్లల ఫోటోలు కూడా వేసినారు"

"పేపరోల్లు మా పిల్లగాండ్ల ఫోటోలు వేసి, మా కష్టాల గురించి రాసినారా రెడ్డీ.

గవర్నమెంటోరు మనూరికి మంచి వైద్యుగుడ్ని పంపి మా పిల్లల జబ్బు నయం జేపిస్తారా?"

"ఏమి చేస్తారో చూడాల. పుట్టలో పాముంటదనే గదా నాగులచవితి నాడు పుట్టలో పాలు పోసి భక్తిగా పూజ చేస్తాము. గవర్నమెంటు పైన ఉన్నాది. మనూరికి ఏమి మేలు చేస్తాదో చూడాల. అర్జి రాసి ఆఫీసర్లకు పంపినాను"

"పైనున్న దేవున్ని ఎంతమందిమి చూసినాము పూజారి చెప్పినట్లే అన్ని పూజలు చేస్తాము. మా కష్టాల గురించి ఆలోచన చేసే సర్పంచు మాకుండగా మాకేం కొరత రాదు. నిన్ను దేవుడు చల్లగా చూడాల"

"మాటలకేం లేరా సుబ్బిగా! ఇదిగోరా పేపరు మీ పెద్దోడు, నీ తమ్ముని కొడుకు, పేటలోని మరి ముగ్గురు పిల్లల్ని మీ ఇంటికాడ సర్కారు తుమ్మచెట్టు పక్కన నిలబెట్టి ఫోటో దించలా అదేసినారు పేపర్లో" అంటూ పేపరు సుబ్బన్న చేతిలో పెట్టాడు సర్పంచ్ వీరారెడ్డి.

మరో వారానికి రంగాపురం సర్పంచ్ ఇంటికి రెండు జీపులు, తెల్లని అంబాసిడర్ కారు వచ్చాయి. అంతా హడావిడి. పిల్లలు జీపుల చుట్టూ చేరి కేరింతలు కొడుతున్నారు.

అంతమంది ఆఫీసర్లు ఎందుకొచ్చినారో అని ఊరి జనం ఎక్కడి పనులు అక్కడే వదిలేసి, జీపుల వైపు చోద్యం చూస్తూ నిలబడ్డారు. కొందరు ఇళ్ళముందు గుంపులు గుంపులుగా చేరి ఎవరి ఊహకు తోచిన విషయాలు వాళ్ళు చెప్పుకున్నారు. మొన్న పేపర్లో ఫోటోలు వేసి రాసినారు. వాళ్ళను చూడ్డానికి ఆఫీసర్లు వచ్చారని క్షణాల్లో వార్త గుప్పుమని, హరిజనవాడకు పాకింది. పేటలోని పెద్దమనుషులు ముగ్గురు నలుగురు ఆఫీసర్లను కలవడానికి ఊళ్ళోకి వెళదామని మాట్లాడుకున్నారు. పిల్లల్ని కూడా వెంటబెట్టుకొని వెళ్దామనుకుంటుండగానే, దూరంగా ఊరివైపు ఎర్రగా దుమ్ము రేగింది. అనుమానంగా పేటను, ఊరిని కలిపే రోడ్డు మీదకు వచ్చి చూసినవారికి ముందు తెల్లకారు, వెనుక జీపులు, ఆ వెనుక పెద్ద గుంపుగా మనుషులు వాడ వైపు రావడం కనిపించింది.

"దొరలు వాడ వైపు వస్తున్నారు. అంతా రావాల. ఇండ్లలో ఎవరూ ఉండొద్దు. అందరు పెద్దరుగు దగ్గరికి రావాల" అని సుబ్బన్న కేక వేశాడు. అంతే. క్షణాల్లో పిల్లలు పెద్దలు, ఆడమగ అంతా అరుగు దగ్గరికి చేరారు. ఆ పక్కనే పదిరోజుల క్రితం విలేఖర్లకు ఫోటోల కోసం పోజిచ్చిన పిల్లలు అదే వరుసలో సర్కారు తుమ్మచెట్టు పక్కన నిల్చున్నారు.

జీపుల్లోంచి దిగిన ఆఫీసర్లు హరిజనవాడ పిల్లల్ని పట్టిపట్టి చూశారు. నోరు తెరవమన్నారు. దంతాలు చూపించమన్నారు. నడవమన్నారు. వాళ్ళు పిల్లలతో మాట్లాడుతున్నంతసేపు కెమెరా క్లిక్‌మంటూనే ఉంది.

రంగాపురం బావుల నీళ్ళలో ఫ్లోరైడ్ ఎక్కువగా ఉందని, ఎప్పుడూ ఆకలిగా, కడుపులో మంటగా ఉంటుందని, ఒళ్ళు నొప్పులుంటాయని, రానురాను ఎముకలు పెళుసుబారి వంకర్లు పోతాయని, పళ్ళు గారపట్టి ఎగుడు దిగుడుగా అవుతాయని, కొందరికి గూని వస్తుందని, కొందరికి కాళ్ళు, చేతులు వంకర్లు తిరిగి భూమి మీద పాకుతూ నడుస్తారని

చెప్పుకున్నారు. వాళ్ళ మాటలు వింటుంటే అంతలేసి పెద్ద జబ్బులు తమకే ఎందుకు వచ్చాయో తెలియక బాధపడ్డారు పిల్లలు. అంతమందిలో అందరి చూపులు తమ మీదనే ఉండి, అందరూ తమ గురించే మాట్లాడుతుంటే భయం భయంగా చూశారు. భయం, దుఃఖం, సిగ్గు, బిడియం - ఎన్నెన్నో భావాలు ఆ అమాయక పసి హృదయాల్లో చెలరేగుతుంటే, అందరూ అడిగే ప్రశ్నలకు తడబడుతూ జవాబులిచ్చారు.

☆ ☆ ☆

"కర్నూలుకు పోయి కలకటేరును కలిసొచ్చినావని ఆ నోట ఈ నోట ఇని వచ్చినాను" సుబ్బన్న పెద్దరెడ్డి ఇంటి ముందు చేతులు కట్టుకొని నిలబడ్డాడు. తమ పిల్లలకు మేలు జరగబోతున్నదన్న కొండంత ఆశ ఆ కళ్ళలో. "అవున్రా, సువ్వినన్నది నిజమే" అన్నాడు చదువుతున్న దినపత్రిక మడిచి పక్కన పెడుతూ.

విశేషాలు చాలానే తెలుసుకోవాలని, సావకాశంగా వినాలని తలకు చుట్టుకున్న తువాలు తీసి కింద వేసుకొని కూర్చున్నాడు. "అవున్రా, కలెక్టరును కలిశాను. మనూరికి రక్షిత మంచినీటి పథకం మంజూరు చేశారు. కొళాయిల్లో మంచినీళ్ళు వస్తాయి ఆఫీసర్లు వచ్చినప్పుడు చాలా ఫోటోలు తీసినారు. అవన్నీ మన గ్రామ పంచాయతీ ఆఫీసులో పెట్టమని చెప్పారు. జిల్లా ఆర్ అండ్ బి ఆఫీసులో కూడా ఉంచారు. చూసి వచ్చినాను. నిజంగా మీదేరా అదృష్టం అంటే. గాంధీతాత, ఇందిరమ్మల ఫోటోలు గవర్నమెంటోరి ఆఫీసుల్లో ఉంటాయి. దేనికైనా పెట్టి పుట్టాలిరా!" నీళ్ళు తాగినందుకు జబ్బులొచ్చాయని ఫోటోలు పెట్టినందుకు లోలోపల ఏడ్చుకుంటూ తన అసూయను బయట పెట్టుకున్నాడు సర్పంచ్. "అంతా మీ దయ రెడ్డీ" అని మరింత అణకువ ప్రదర్శించాడు సుబ్బన్న. తమ ఫోటోలు ఆఫీసర్లు పెట్టినా.... అది తమ తప్పే అయినట్టు ఒకింత నొచ్చుకున్నా.. .. అందులో తమ ఘనకార్యం ఏమిటో బోధపడక ఆశ్చర్యపోయాడు. లోలోపల సంతోషపడిన మాట నిజం. అది మానవ నైజం.

"నాదేముందిరా..... మనూరి నీళ్ళు అట్టాంటివి. మీ ఫోటోలు పేపర్లో వచ్చినాయి. అందుకు కారణం మనూరి నీళ్ళు. గవర్నమెంటుకు మనూరు యాడున్నాదో తెలియజేసినాయి మనూరి నీళ్ళేకదరా!"

"ఏమేమో రాసినారు. ఫోటోలు వేసినారు. పెద్ద దొరలంతా హరిజనవాడకొచ్చి చూసి వెళ్ళినారు. అంతా బాగానే ఉంది. మా పిల్లగాండ్లను పెద్ద డాక్టర్లకు చూపించాల. ఎట్టనన్నా జేసి మా పెద్దోడి జబ్బు నయం జేపియ్యాల రెడ్డీ నా బామ్మర్ది బిడ్డ ఎదిగొచ్చింది. మా పెద్దోనికి చేసుకోవాలనుకుంటున్నాం రెడ్డీ" గవర్నమెంటుకు తెలిస్తే చిటికెలో తమ కష్టాలన్నీ గట్టెక్కుతాయని వాళ్ళ నమ్మకం. ఎన్నేళ్ళయినా మొగ్గలు తొడుగుతూనే ఉంటుంది. ఆశలు పుష్పించి ఫలించకముందే నమ్మకాలు కసిమొగ్గలు గానే రాలిపోతున్నా, అది తమ కర్మ అనుకొని వెంటనే మరిచిపోతుంటారు.

"ఇవి డాక్టర్లు నయం చేసే జబ్బులు కావురా. మనూరి నీళ్ళ సంగతి తెలిస్తే మనూరి

పిల్లలకు సంబంధాలు కూడా రావని. మేమంతా భయపడి ఛస్తున్నాంరా. ఇట్లాంటి జబ్బులు మరెవరికీ రాకుండా గవర్నమెంటు మనూరికి మంచినీళ్ళు ఇస్తానంటోంది"

"మరి మా పిల్లగాండ్లు అవిటోల్లయిపోయినారు. గవర్నమెంటు ఏమైనా సహాయం చేస్తాదా?"

"ఏం సహాయం చేసినా మీకేం ఒరుగుతుందిరా? ఓ పూట పూటుగా సారాయి తాగడానికే అంతా ఖర్చు చేస్తారు. మీకు సహాయం చేయడం దండుగ. బూడిదలో పన్నీరు పోసినట్టే. గాంధీ తాత మళ్ళీ పుట్టి వచ్చినా మీరు బాగుపడరు."

సర్పంచ్ మాటలకు తల కొట్టేసినట్టయింది. తల వంచుకొని మెల్లిగా లేచి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు సుబ్బన్న.

☆ ☆ ☆

రంగాపురంలో రక్షిత మంచినీటి పథకం కోసం నాలుగు లక్షలు ఖర్చు పెట్టి ట్యాంకు కట్టి, నల్లాలు వేయించింది ప్రభుత్వం. ఓ మంచిరోజున ఆ నియోజకవర్గం ఎం.పిగారు వచ్చి కుళాయిలకు మంచినీళ్ళు వదిలారు. ఉత్సవం బ్రహ్మాండంగా జరిగింది. "అవిటి వాళ్ళయిపోయిన మా పిల్లల బతుకులు ఎట్లాగోలా తెల్లారకపోవు. బాగున్న పిల్లలు, పుట్టబోయే పిల్లలన్నా బాగుంటారు. కడుపు నిండా తిండి లేకపోయినా, మంచినీళ్ళన్నా తాగితే మా పిల్లలకు జబ్బులు రావు. హరిజనవాడ పిల్లలకే ఈ జబ్బులు ఎందుకొచ్చాయంటే, బలమైన తిండి లేక అని డాక్టరు చెప్పిపాయె. బలమైన తిండి యాడకెళ్ళి వస్తాది? గవర్నమెంటోరు మంచినీళ్ళన్నా ఇస్తా ఉన్నారు" అనుకున్నాడు సుబ్బన్న. 'మా పిల్లల వల్లనే ఊరికి మంచినీళ్ళొచ్చె' అని సంతోషపడ్డాడు.

మర్నాడు తెలవారుతుండగా, హరిజనవాడలో కుళాయి దగ్గర కడవలు, ప్లాస్టిక్ బిందెలు పట్టుకొని పిల్లలు, ఆడవాళ్ళు బారులు తీరి నిలబడ్డారు. ఎంతకూ చుక్క నీరు రాలేదు. పొద్దు బారెడెక్కిపాయె - అనుకుంటూ పిల్లల్ని కుళాయి దగ్గరే ఉంచి ఆడవాళ్ళు బావుల నీళ్ళతోనే వంట చేశారు. ఆ నీళ్ళే తాగారు. పన్లోకి వెళ్ళారు. మర్నాడు అదే తంతు. మూడోనాడు సుబ్బన్న వాచ్‌మన్ దగ్గరకు వెళ్ళి హరిజనవాడకు చుక్క నీరు రాలేదని చెప్పాడు. "కుళాయిలకు నీళ్ళు వదలడం కొత్త కదా! కొన్నాళ్ళాగితే అవే వస్తాయి" అని భరోసా ఇచ్చాడు. ఈ రోజన్నా కుళాయిలో నీళ్ళు రాకపోతాయా - అనుకుంటూ ప్రతిరోజూ ఉదయాన్నే ప్లాస్టిక్ బిందెలు, మట్టి కడవలు కుళాయి ముందు పెడుతూనే ఉన్నారు. పదిరోజులు గడిచినా, మంచినీటి చుక్క కుళాయిలోంచి రాలి పడలేదు.

సుబ్బన్న సర్పంచ్ ఇంటికి వెళ్ళి "మాకింతవరకు కుళాయి నీళ్ళు రావడం లేదు రెడ్డీ" అని తల గోక్కుంటూ నేలచూపులు చూస్తూ బెరుకు బెరుకుగా విషయాన్ని విన్నవించుకున్నాడు. తమ వల్లనే అన్ని లక్షలు ఖర్చు పెట్టి సర్కారు నీళ్ళు ఇచ్చిందని లోలోపల గర్వపడ్డా, పెద్దోలతో పాటు మంచినీళ్ళు అడగడం తప్పేమోనని భయంగా ఉంది. విందు భోజనంలో పెద్దోల సరసన కూర్చోవడానికి భయపడుతున్నట్టు ఉన్నాడు

సుబ్బన్న. "ఏమిట్రా మీకింతవరకు నీళ్ళు రాలేదా? మాకు రోజు వస్తున్నాయే. నీళ్ళు వదిలే వాచ్‌మన్‌ను అడుగుతా నుండు" అన్నాడు గంభీరంగా.

అంతలోనే వాచ్‌మన్ అక్కడికి వచ్చాడు.

"ఏమిట్రా శంకర్. హరిజనవాడ కొళాయిలో నీళ్ళు రాలేదని సుబ్బన్న చెబుతున్నాడు. ఆ సంగతి చూసుకుంటున్నావా?" "నీళ్ళ ట్యాంకు హరిజనవాడకు దూరముండిపాయె. నీళ్ళొదిలేసరికి ఊళ్ళో అందరూ కుళాయిలు తిప్పుతారు. హరిజనవాడ దాకా నీళ్ళు వెళ్ళేసరికి ట్యాంకులో నీళ్ళు అయిపోతాయి అదీగాక ట్యాంకుకన్నా హరిజనవాడ కుళాయి ఎగువనుంది. పైపుల్లోంచి నీళ్ళు హరిజనవాడకు చేరకముందే, ఇక్కడ ట్యాంకులో నీళ్ళు అయిపోతున్నాయి. అంత దూరం వెళ్ళిన నీళ్ళు వెనక్కు వచ్చేస్తున్నాయి" సంజాయిషీ ఇచ్చుకున్నాడు వాచ్‌మన్.

"ఏం చేద్దాంరా సుబ్బిగా.... గంగమ్మ తల్లి మీ హరిజనవాడకురానంటున్నది" అన్నాడు సర్పంచ్ కనుబొమలు ఎగరేస్తూ.

ఊళ్ళోకి నీళ్ళు ఎక్కువ వచ్చేలా దగ్గరుండి ప్లాన్ వేయించింది సర్పంచ్. దేవుడు వరమిచ్చినా పూజారి అడ్డుపడ్డాడు. కంటితుడుపు కోసం హరిజనవాడకు పైపులు వేయించాడు. కుళాయి పెట్టించాడు.

సుబ్బన్నను చూసి ఇంట్లోంచి సర్పంచ్ భార్య పెద్ద రెడ్డెమ్మ బయటికి వచ్చింది. "ఒరే సుబ్బిగా! పేపరోల్లు మీ ఫోటోలు ఏయబట్టి మనూరికి మంచినీళ్ళు బాగా పడకట్టి, అదేదో చేసి ఇస్తున్నా(రా. నీళ్ళు ఎంత బాగా తియ్యగా ఉన్నాయిరా. బట్టల మురికి కూడా బాగా వదులుతున్నాదిరా. దొడ్లోకి వచ్చి చూడు, ఎనుములు నిగనిగలాడుతున్నాయి. సర్కారు నీళ్ళు వచ్చినకాడ్నుంచి ఆ నీళ్ళే తాగుతున్నాయి. ఆ నీళ్ళతోనే ఎనుములను కడుగుతున్నాం" అంది సంబరంగా.

సుబ్బన్న కంట్లో నీరు ఉబికింది. కనిపించనీయకుండా తలొంచుకున్నాడు. వాచ్‌మన్ సర్పంచ్‌వైపు భయం భయంగా చూశాడు. సర్పంచ్ భార్యవైపు గుడ్లురిమి చూశాడు.

– ఇండియా టుడే, డిసెంబర్ 6–20, 1993

# నా పాత స్నేహితుడు

## తుమ్మేటి రఘోత్తమరెడ్డి

నేను మా ఊరికి వెళదామని స్టేషన్లోకి వచ్చేసరికి రైలువచ్చి సిద్ధంగానే వుంది. గబగబ టికెట్ తీసుకుని వచ్చి రైల్లో కూర్చున్నాను. సాధారణంగా ఎంతో ఆలస్యంగా వచ్చే రైలు సరైన సమయానికే రావటం వల్లనో ఏమోగాని పెద్దగా ప్రయాణీకులు లేరు. అంతకు ముందు రైల్లో ఉన్న ప్రయాణీకుల్లో కూడా గోదావరి ఆవలివైపు బొగ్గుగని కార్మికులే ఎక్కువ.

ప్లాట్ఫారం మీద ఆ కాస్తా సందడి కూడా తగ్గలేదు. ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. దిగేవాళ్లు దిగుతున్నారు. ఎవరో పల్లెటూరి స్త్రీ – మధ్య వయసు దాటింది. రాతెండి టిఫిన్ డబ్బాలో నీళ్లు పట్టుకుని వస్తూ నా కిటికీ ప్రక్కన ఆగింది. పాలిస్టర్ అంగీ వేసుకుని, తెల్లగ పాలిపోయి నా ఎదురుగా కూర్చున్నతని దిక్కు చూసింది. ఒక్కక్షణం చూసి, 'అయ్యో కొడుకా నువ్వేనా? నేనెవరో అనుకుంటాన – పురాగ ఎట్లనో అయినవ్ కొడుకా?'' చెవుల గెంటీలు అటూ ఇటూ ఊగులాడంగ అన్నదామె. నోట్లో కాలుతున్న బర్కిలీ సిగరెట్టును తీసి చేత్తో పట్టుకుని,

"నేనేనే పెద్దవ్వా!" అన్నాడతను.

"నా కోడలూ, మనుమలు, మనుమరాండ్లు అంత బాగున్నారా బిడ్డా?" అన్నది.

"హాఁ ఇప్పటికైతె అంత బాగానే వున్నం" అన్నడు ఆయన. ఆ ముసలామె మరింత దగ్గరకు వచ్చి "పురాగ జిగి వచ్చిన మనిషి తీరుగ అయినవ్ కొడుకా! ఏదన్నా అలుకటి పని చూసుకోక పెయినవ్? బాయి పనింట్ల (గని పని) పీనుగెల్ల! నా మనుమడు కూడ గిట్లనే అయిండు" అన్నది. అతను నిరాశాపూరితంగ నవ్వాడు. అంతలోనే ప్రక్క డబ్బాలోంచి "ఓ అవ్వా!" అని కేకవేశారెవరో! "పిల్ల పిలుస్తాంది వత్త బిడ్డా" అనుకుంట ముసలమ్మ వెళ్లిపోయింది.

గార్డు విజిల్ ఊదిండు. రైలు మెల్లగా కదిలింది. నా మనసులో మా అమ్మ మెదిలింది. పోగానే నన్ను పులుకు పులుకున చూస్తూ అడిగే మొట్టమొదటి ప్రశ్న "అంత

ఎట్లనో అయినవ్ బిడ్డా" అని. నా ఆరోగ్యం గురించి ఎంత ఆందోళన చెందుతూ అడుగుతుందో కదా అని ఆలోచించే కొద్దీ నా మనసు వికలమైంది. కాని నేనేం చేయను? చేతులపై పీచు తీరుగ ఉబ్బి పైకి తేలుతూ కనిపిస్తున్న నరాలు, చేతివేలి కొసలు చిట్లి, బొగ్గు చూర, కూరుకుపోయిన పగుళ్లు, కుడిచేతి మణి[illegible]పై బొగ్గు పెళ్లపడి అయిన గాయపు మచ్చ! రోజుకు కొన్ని గంటలు - భూమి లోపలి బొగ్గు పొరల్లో - విపరీతమైన గర్మిలో ఉడికీ ఉడికీ చేవ చస్తున్న నా శరీరం వంక ఒకసారి చూసుకున్నాను. బొగ్గుగనిలో బొగ్గును పేల్చి వడగొట్టిన ప్రేలుడు మందుపొగ, బొగ్గు దుమ్ము పీల్చి పీల్చి కడుపులో పేగులు తెగిపోయేలా దగ్గుతూ సంవత్సరాల తరబడి పని చేయాల్సి రావడం - మంచి గాలి లేక పీల్చిన గ్యాసులవల్ల తిన్న తిండి అరగక పోవడం - దాని మూలంగా కడుపునొప్పి - నరాల బలహీనత - ఆఖరికి శరీరం నొప్పుల కుప్పగా మారడం- ఆస్పత్రులూ మందులూ అదాక కంటి తుడుపు వ్యవహారం!

గనిలో పనిలో చేరిన కొన్నాళ్ళకు నన్ను చూసిపోవడం కోసం వచ్చిన మా అమ్మ "ఏదన్న అలుకటి పని చూసుకోరాదు బిడ్డా!" అంది కాని అమ్మకు ఇక్కడి సంగతులు ఏం తెలుసు?

పనిలో చేరిన మొదట్లో తానూ ఓవర్‌మ్యాన్ చుట్టూ, అండర్ మేనేజరు చుట్టూ చాలా తిరిగాడు. బొగ్గు తట్ట మోయడం తనవల్ల కావడంలేదని చెప్పుకున్నాడు. ఒక అధికారి ఇంటికి పిలుచుకుని తోటపనంతా చేయించుకుని "మజ్దూర్ పని రాయించుత గని రోజు ఒక గంట ఇంటిదాక రావల్సి వుంటదిర పిలగా!" అన్నడు. అప్పటికే తనకు ఎట్లాగో అన్పించింది. ఇంటికి ఎందుకు రమ్మంటున్నారో తనకు తెల్సు. ఆ అధికారికి నాలుగు 'బర్లు' ఉన్నయి. అంటే తాను వాటిపని చూడాలన్నమాట! చూస్తేనే మజ్దూర్ పని ఇప్పిస్తాడన్నమాట. ఆ పని లేకపోయినా ఫరవాలేదు. కాని తనిలాంటి నంగి నంగి పనులు చేయటానికి రాలేదు. కష్టపడి బతకడానికి వచ్చిండు. వేలాదిమంది గనుల్లో బొగ్గు తట్ట ఎట్లా యాతనలు పడి మోస్తున్నారో తానూ అలాగే మోస్తాడు! అంతే ఇక ఎవరికీ ఏనాడూ సలాం కొట్టాల్సిన అవరం పడలేదు. మొదట్లో బొగ్గు తట్ట నెత్తినెత్తుకోగానే మెడనరాలు జువజువ లాడినాయి, కాళ్ళూ చేతులూ గజగజ వణికినయి. కొన్నాళ్ళకు, అలవాటు పడిపోయాక గనిలో అన్ని సౌకర్యాలుంటె తట్ట మోయడం పెద్ద ఇబ్బంది ఏం కాదనుకున్నడు. కాని కాలం గడిచిన కొద్ది గనులు లోతుకు వెళ్ళడం - పీల్చడానికి సరిపడా గాలి లభించక ఇబ్బందుల పాలవడం, కాలి బూట్ల దగ్గర్నుంచి మోసే తట్టలదాకా ప్రతిదీ గొడవలతో తప్ప మేనేజిమెంటు ఇవ్వని పరిస్థితులు. అటువంటి పరిస్థితుల మెరుగుకోసం యజమాన్యాన్ని నిలదీయడం!

వరుసగా చేదు అనుభవాలు జ్ఞాపకానికి వస్తుంటే నాకెందుకో చిన్నగా నవ్వు వచ్చింది. అలుకటి పని సంపాయించుకోవడం గాని, ఆరోగ్యం చెడకుండా ఉంచుకోవడంగాని తన ఒక్కడి వల్ల ఏమవుతుంది?

పొద్దు పడమటి కొండల్లోకి జారుతోంది చుట్టూ చిన్న చిన్న గుట్టబోర్లు -

తుప్పలు - వాగులు - రైలు నిమ్మళంగా సాగుతోంది. ఏదో స్టేషన్ వస్తున్నట్టుంది. చిన్న స్టేషన్! ఆ పక్క ఈ పక్క చిట్టడవి - స్టేషన్లో పెద్దగా ప్రయాణీకులు ఎక్కిందీ లేదూ, దిగిందీ లేదు రైలు ఎంతకూ కదలడం లేదు. ఎర్రజెండా పచ్చజెండా పుచ్చుకున్న స్టేషన్ మాస్టరు అటూ ఇటూ తిరుగుతున్నాడు. బఠానీల వాళ్ళు, పండ్ల వాళ్లు ఈ డబ్బాలోంచి ఆ డబ్బాలోకి, ఆ డబ్బాలోంచి ఈ డబ్బాలోకి ఎక్కి దిగుతున్నారు. ఎత్తైన ప్లాట్‌ఫారం లేకపోవడం వల్ల చాలామంది ప్రాయణీకులు క్రిందికి దిగలేక డబ్బాల్లోనే కూర్చున్నారు. చాతనైన వాళ్లు కొందరు ప్లాట్‌ఫారం మీదికి దుముకుతున్నారు. ప్లాట్‌ఫారం మధ్యలో 'నెమలినార' చెట్ల నీడ. క్రింద పచ్చని గరిక. దిగుదామా వద్దా అని ఆలోచిస్తూ ఉండిపోయేంతలోనే రావాల్సిన ఎక్స్‌ప్రెస్ రైలు వచ్చి దణదణలాడుతూ పోనేపోయింది. అయినా మా రైలు కదలకపోయేసరికి విసుగనిపించి కిందకు దిగాను. పాదాలకు మెత్తగా చల్లగా గరిక తగిలింది. చేతులు జేబుల్లో దోపుకుని నిలబడి రైలు కొసా మొదలు చూస్తూ నిలబడి వున్నాను. చేతులు నడుంపై ఆనించుకున్న ఒకాయన ఎవరో నన్నే చూస్తున్నట్టుగ అనిపించింది. ఎవరబ్బా అతను? కండపట్టిన చెంపలు, పెరిగిన క్రాపు, కళ్ళకు వల్ల కళ్ళద్దాలు ఎవరతనూ?

అంతలోనే గార్డు విజిల్ ఊదిండు. ఒకర్నొకరు తోసుకుంటూ ఎవరి పెట్టెల్లోకి వారెక్కారు. రైలు మెల్లగా కదిలింది. నేను మళ్ళీ ముందుకు చూస్తే అపుడు తట్టింది. అతను నిరంజన్! అవును నిరంజనే!! కొంచెం లావు అయ్యాడు. అతను నన్నే చూస్తున్నాడు. నేను ఆనందం పట్టలేకపోయాను. "నిరంజన్" అని గట్టిగా పిలిచాను. ఒక్కసారిగా పిలవడంతో నాప్రక్క నిలబడ్డవారు ఆశ్చర్యంగా చూశారు. నిరంజన్ చెయ్యెత్తి ఊపిండు. ఏదో అంటున్నాడు. టపటప రైలు క్రాసింగులు దాటుతున్న చప్పుడు. నాకేదీ విన్పించలేదు. స్టేషన్లో దిగినాక కలుసుకుందామన్నట్టుగ చేతి సైగల్ని బట్టి అర్థం చేసుకున్నాను.

నా మిత్రుడు - బాల్యం నుంచీ నా మిత్రుడైన నిరంజన్ దారిలోనే కలిసినందుకు నాకు ఆనందమైంది. డబ్బా లోపలికి వచ్చి కిటికీ ప్రక్క నా సీట్లో కూర్చున్నాను. రైలు చక్‌ఫక్‌మని సాగిపోతోంది. చెట్లని గుట్టల్ని కాలువల్ని బర్రెల్ని అన్నింటిని వెనక్కి తోసేస్తూ రైలు గర్వంగా ఠీవిగా వెళ్తోంది. పైన ఆకాశంలో పక్షులు అలవోకగా పశ్చిమానికి వెళుతున్నాయి. నా మనసు ఉద్వేగభరితమైంది. రెండు సంవత్సరాలు అయింది నేను ఊరును విడిచి, నా స్నేహితున్ని విడిచి. తిరిగి వెళుతున్న రోజే దారిలోనే నిరంజన్ను కలుసుకోగలిగినందుకు హఠాత్తుగా నా కళ్ళలోకి దుఃఖం పొంగుకు వచ్చింది. తెంపి వేయబడ్డ సంబంధాల తాలూకు విషాదం.

చిన్నతనాన అతనూ నేనూ కలిసి ఆడాం. పాడాం. దినమెలల్లోనే పడిపోతున్న మొండిగోడల మధ్య - వాననీటికి అడ్డుకట్టలు కట్టేవాళ్ళం - కాలువలు తీసేవాళ్ళం - చిన్నచిన్న మళ్లు చేసేవాళ్ళం - వరినారు బండ్లలోంచి జారిపోయిన నారు పిడచల్ని తెచ్చి నాటు పెట్టేవాళ్ళం - ముక్కపెరళ్ళ పిట్టల కావలి - ఎండుపుల్లలు ఏరడం - కంకులు కాల్చడం - ఒక చేత్లో కంకి మరో చేత్లో ఒడిశెల - అద్దాలు పరిచినట్టున్న వాననీరు నిండిన

ఈటు పొలాల్లోని నీటిని చెక్‌పెక్‌మని తన్నుకుంటూ పరుగెత్తడం - ఎంౖడకాయల్ని దారాలకు కట్టి ఆడించటం - గాలపుచేపలు పట్టడం - చెరువుల్లో దొరువుల్లో తపతప కాళ్ళు చేతులూ కొడుతూ ఈదులాడటం - మెత్తని దుక్కుల్లో సుతిమెత్తగా నడవటం - మొక్కలు మొలిచినవో లేదో రోజూ చూడటం - ప్రేమగా వాటి మొదళ్ళకు మట్టిని తోయడం - పైరుల్ని కౌగలించుకోవడం వాటి లేత ముఖాలను పదిలంగా ముద్దాడటం - "హొ! సెట్టులెక్కగలనే సెంచిత గుట్టలెక్కగలనే సెంచిత' అరెరె.... కుక్కలు దునికిన చోటరా భళ్ గుర్రాలు దునుకూచుండెరా!" గంటె భాగోతుల నాటకాలు - వెంకట్రాజం ఆరెమరాఠీల బుర్రకథా - అనేక రాత్రులు పొరుగూళ్ళకు కూడాపోయి చూసేవాళ్ళం - వినేవాళ్ళం.

అట్లా మా బాల్యం పచ్చపచ్చని మొక్కల లేలేత మొఖాల వంటి మా బాల్యం పెనవేసుకుని సాగింది అటువంటిది అతనూ నేనూ కలుసుకుని ఎంతకాలమైంది?! రెండేళ్ళ కిందిదాక అతడు నా ఏకైక మిత్రుడు - రహస్యాలంటూ మా ఇద్దరి మధ్యా ఏమీ ఉండేవి కావు ఒకేవాడ - ఎదురెదురిళ్ళు. వాడెక్కడుంటె నేనక్కడ. నేనెక్కడుంటె వాడక్కడ.

మా ఊళ్ళో చదువు అయిపోగానే మేం పొరుగూర్లో చదువుకోవడానికి పోయాం. అక్కడా కలిసే! వస్తే ఊళ్లో కలిసే! చెట్టాపట్టా లేసుకుని చేన్లూ చెలకలు తిరిగేది చదువుకంటె మాకు పొలాలమీదనే ధ్యాస ఎక్కువగా ఉండేది. ఆ చదువేమిటో అంతు చిక్కకపోయేది. తెలంగాణా ఎజిటేషన్ అన్నారు - గొడవలు - హర్తాళ్లు - క్రమంగా మా చదువుకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది. ఎలాగూ వ్యవసాయం ఉందికదానే దిలాసా కూడా వుండేది. అలా మేం వ్యవసాయంలో దిగబడ్డాం. దిగబడ్డామని ఎందుకనడం అంటె అప్పటిదాక చుట్టం చూపుగా మాత్రమే మాకు వ్యవసాయం గూర్చి తెలుసు. చదువు గురించి మా తల్లిదండ్రులకు పడే వేదనకు మేం విసుక్కునేవాళ్ళం. కాని వారి వారి అభీష్టాలకు వ్యతిరేకంగా వారిలాగే మేం "ఎద్దు ముడ్డి పొడవడానికి" పనికి వచ్చాం.

అప్పటికే కాలం మునుపటి తీరుగా లేదని మా పెద్దలు వాపోతుండటం నాకు స్పష్టంగా జ్ఞాపకం. ముఖ్యంగా పనిపాటల వాళ్ళ విషయంలో 'మందలియ్యవశంగా కుంట ఉన్నదనే' అభిప్రాయం వ్యక్తపరిచేవారు

నిరంజన్ వాళ్ళ తాతగారి హయాంలోనైతె వ్యవసాయం చేయించడానికి కూడా ఒక షెగేదారు ఉండేవాడట. నిరంజన్ తండ్రి కాలం వచ్చేసరికి అతను కూడా స్వయంగా వ్యవసాయం చేసుకుంటే గాని గడవని స్థితి వచ్చింది. ఇక మా కుటుంబం విషయానికి వస్తే మొదట్నుంచీ మాది కష్టపడి పని చేసుకు బతికే చిన్న రైతు కుటుంబం మాత్రమే. ఒక నాగలికి సరిపడా భూమి మాత్రం ఉండేది. నేనూ నిరంజన్ వ్యవసాయంలోకి వచ్చేసరికి ఖచ్చితంగా నడుం వంచి పనిచేస్తేనేగాని గడువని స్థితి వచ్చింది. కనీసం వ్యవసాయంలోనైనా సమర్థులం అనిపించుకోవాలని పట్టుదల. మాకో చిన్న పాలేరు ఉండేవాడు. అతనూ నేనూ మా నాయనా కలిసి చేసుకునేవాళ్ళం. నిరంజన్ వాళ్ళకు నలుగురు పెద్దపాలేర్లు - గొర్లకు

ఒకరు, గొడ్లకు ఒకరూ - నిరంజన్ పై పనులకోసం తిరిగేవాడు.

రోజంతా పనిపాటలు ముగించుకుని రాత్రి కాగానే మూడు బజార్ల దగ్గర కుప్పకూడేవాళ్ళం. అప్పుడు మామధ్య చర్చకురాని విషయం ఉండేది కాదు. అమెరికా శత్రు దేశమని, రష్యా మిత్రదేశమని తలా తోకాలేని తీర్మానాలు చేసేవాళ్ళం.

అంతకు ముందే వ్యవసాయం 'ఆరుకోసి మూడు అతుకుడు'గా ఉన్నది. తిండి కోసంగా వున్న వ్యయసాయం మార్కెట్టు కోసంగా మారింది. అంతకు ముందున్న జొన్న, మొక్కజొన్న, పెసర పంటలస్థానే మిర్చి వచ్చింది. అసలే వర్షాలు తక్కువ. మిర్చికోసం కొత్తగా బావులు తోడటం, మోటలతో నీళ్ల సరిపడక ఆయిల్ ఇంజన్లు - ఆ తరువాత కరెంటు మోటర్లు - వాటికోసం లంచాలు - పై రవీలు - మిర్చి పంటకు కావాల్సిన ఎరువులు కొనడానికి తగిన పెట్టుబడి కావాల్సి రావడం బ్యాంకుల చుట్టు తిరగడం - లంచాలు పోను వచ్చిన కాడికి మిర్చిపై పెట్టడం - బ్యాంకుల చుట్టు తిరుగలేక బయట అప్పులు చేయడంవల్ల పడ్డీలు అసలు కలిపి తడిసి మోపెడు అప్పుల్లో మునుగడం -

విత్తనాల్ని సకాలంలో విత్తి - తగిన పెట్టుబడి పెట్టగలిగిన ఒకరిద్దరు రైతులకు పంట అందరికంటె ముందుగా చేతికి వచ్చేది. అదే సమయంలో వారా పంటను మార్కెట్టుకు తోలి లాభపడేవారు. పంటల సీజన్ జోరు కాగానే మొదట్లో ఉన్న ధరలు టప్పున పడిపోయేవి. రైతులు గందరగోళంలో పడిపోయేవారు. ఎవరో ఉన్న ఆసాములు ఒకరిద్దరు పంటను తగిన ధర వచ్చేదాక ఆపగలిగేవారు. సాధారణంగా చాలామంది రైతుల పరిస్థితి 'కర్రమీది గింజ వస్తేనే కంచం లేచేది' అన్నట్టుగా ఉండేవారు. అటువంటి రైతుల పరిస్థితి చెప్పనలవి కాదు. అడ్డగోలు ధరలకు పంటల్ని అమ్ముకోవాల్సి వచ్చేది. అట్లా ధరలున్నప్పుడు పంటలు లేవు పంటలున్నపుడు ధరలుండవు. వీటికి తోడు వర్షాలు అధికంగా కురిసినేడు ఒక బాధ! కురవనేడు ఒక బాధ. నేను వ్యవసాయం చేసినంతకాలం పట్టుమని నాలుగు పందల రూపాయల్ని కళ్ళ కూడా చూడలేదు. రైతులంత మిర్చి పంటవేసి నష్టపోతుంటె ఒకరిద్దరు ముందు చూపు కలిగిన ఆసాములు పొగాకు వేసి లాభపడేవారు. మరుసటేడు రైతులంతా పొగాకు పంట వేసేవారు. నాకింకా జ్ఞాపకం వుంది. మేం మార్కెట్టుకు తీసుకుపోయిన పొగాకు మీద పేడనీళ్లు చల్లి 'ఇది పనికిరాదు' అని నిర్దాక్షిణ్యంగా చెప్పేశారు పొగాకు వ్యాపారులు. అట్లా ఆ సంవత్సరం రైతులంతా గొడగొడ ఏడుస్తూ అమ్మకం కాని పొగాకును పొలాల అడుక్కు ఎరువుగా తొక్కుకోవాల్సి వచ్చింది. దున్నిన బురదపొలంలో పొగాకును పరిచి తొక్కాలంటె నాకు కాళ్ళురాలేదు. ఆ పొగాకు పెంచడం కోసం మేం పడ్డ యాతన జ్ఞాపకానికొచ్చింది.

వీటికి తోడు ఆడపిల్లల పెండ్లిళ్ళు పెద్ద సమస్య. వ్యవసాయదార్ల కిచ్చి పెళ్ళిళ్ళు చెయ్యకూడదనే మా తల్లిదండ్రుల పట్టుదలతో ఏదో ఒక చిన్న ఉద్యోగమైనా సరే! అటువంటి వారికిచ్చే పెళ్ళిల్లు చేయవలసి రావడంతో అప్పులు చేయాల్సి వచ్చేది. అట్టు వారు కట్నకానుకలు భారీగా అడిగేవారు. నిరంజన్ వాళ్ళ కుటుంబం చాలా భూమిని ఆడపిల్లల పెండ్లిళ్ళకోసం అమ్ముకోవాల్సి వచ్చింది. మేం మా ఒక్కగానొక్క చెల్లెలి పెళ్లికోసం

ఇల్లంతా ఊడ్చి ఊడ్చి పోయాల్సి వచ్చింది. అందుకుతోడు నోములు – కొలుపులు – చావులు – పుటుకలూ – ఇలా ఊపిరి సలుపలేనన్ని అప్పులు. చివరి సంవత్సరం కాబోలు! పొగాక్కు ధర కాస్తా పలికింది. అయితే ఏమైంది? క్రితం ముందటేడు అయిన అప్పులకు వడ్డీ కూడ రాలేదు.

ఈ గందరగోళాలన్నింటిని ఎండాకాలపు వెన్నెలరాత్రులూ చలికాలపు దీర్ఘరాత్రులూ – చేన్ల దగ్గరో – కొడార్ల దగ్గరో పండుకుని చెప్పుకునేవాళ్ళం. ఈ కష్టాల్లోంచి వ్యవసాయాన్ని గట్టెక్కించడం ఎలాగా అని మేం ఆలోచించేవాళ్ళం.

గతాన్ని చెదరగొడుతూ పెద్ద కుదుపుతో రైలు ఆగింది. అప్రయత్నంగా తల బయటకు పెట్టి ఏమిటా అని చూశాను. స్టేషను బయటే సిగ్నల్ కోసం ఆగింది. కొంతమంది ప్రయాణీకులు అక్కడికక్కడే దిగి తమతమ గ్రామాలవైపు పోతున్నారు. అలలతో పడిలేస్తున్న పచ్చ సముద్రంలాగ వరిపొలాలు బీళ్లలో మేస్తున్న గొడ్డూగోదా, గొర్రె మేకా, చేలల్లో పనిపాటలు చేసుకుంటున్న వాళ్లు రైలును ఆసక్తిగా చూస్తున్నారు. పెట్టెలోపల ఇద్దరు దేశ రాజకీయాల గురించి పెద్దగా చర్చించుకుంటున్నారు. ఒకామె చిన్నబోయిన ముఖంతో కొడుక్కు అరటిపళ్ళు కొనివ్వలేక సముదాయించ చూస్తోంది. కొద్దిసేపటికి రైలు కదిలింది. తలయూపుతూ పోయి రమ్మంటున్న పైర్లు – చేతులూపుతున్న పల్లెజనం –

అట్లా మా కుటుంబాలు అప్పులమధ్య కూరుకుపోతున్న ఆకాలంలోనే మా ఊర్లో పరిస్థితులు చాలా మారినయి. పాలేర్ల జీతాలదగ్గర మొదలైన వ్యవహారం కూలిరేట్లు పెరగాలని, వెట్టి పనులు బందని, ఆఖరుకు బంజరు భూముల్ని దున్నుకోవడం దాకా వచ్చింది. ఈమధ్య నిరంజన్ దొరింటికి నడవటం – దొర తాలూకాకు నడవటం ఎక్కువైనాయి. పోలీసులు అప్పుడప్పుడు రావడం. 'యిందాక ఊళ్లెకు పోలీసోడు రాకుంట గడిచింది' అని కొందరు నిట్టూర్చేవారు. 'ఇవాళ బంజరుభూములు అన్నోళ్లు రేపు పట్టాభూములు అనరన్న గ్యారంటీ ఏముంది?' అని కొందరు అనేవారు.

మొత్తం మీద గ్రామం గ్రామం తీరుగ కాకుండా ఒక కొత్త వాతావరణం నెలకొన్నది.

వ్యవసాయంలో మిర్చి రోగాలకు తట్టుకోని పండటం తగ్గింది. ఏ పంటవేస్తే పండుతుందో తెలియని అయోమయం రైతుల్లో కలిగింది. మా అమ్మ ఎప్పుడూ విచారిస్తుండేది. ముఖ్యంగా నా గురించి. "మేమంటే ఎట్లనో నెగ్గుకచ్చినం బిడ్డ! నువ్వీ రొంపిల పడద్దూ అంటె పడితివి – ఏ చిన్న నౌఖరి దొరికినా బాగుండిపోవు' అంటుండేది.

కాని నేను చదివిన చదువుకు ఏ నౌఖరి దొరుకుతుంది? ఎప్పటిమాటో! కాలేరు (కాలరీ) మీదున్న మా చిన్నాయనింటికిపోతే ఆయన బలవంతం మీద ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసులో పేరు నమోదు చేయించుకుని వచ్చిన. నా మటుకు నాకు ఏ నౌఖరీ దొరుకుతుందన్న నమ్మకం లేకుండేది.

సరిగ్గా ఆ సమయంలోనే కాలేరుమీది మా చిన్నమ్మా, చిన్నాయనా మా ఇంటికి వచ్చారు. ఆరోజు ఇంకా ఇప్పుడిప్పుడు గడిచి పోయినట్టుగా నాకు జ్ఞాపకం వుండిపోయింది.

ఆరోజు – ఎండాకాలపు పిండివెన్నెల రాత్రి – ఇంటిముందు ఎండబోసిన మొక్కజొన్న కంకులపై మంచం వేసుకుని బోర్లా పడుకున్నాను. వెన్నెల కంకులపై బడి ఎర్రగా మెరుస్తోంది. పొడవు పొడవు కంకులతో – జారిపోతున్నా అడ్డం పొడుగూ పందిరి వేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను. ఇంట్లోకి ఓ చెవి కూడా వేశాను. మా నాయనకూ – మిగతా ముగ్గురికి వాదోపవాదాలు జరుగుతున్నట్టుగ అర్థమైంది. చర్చనీయాంశం నా భవిష్యత్తేనన్నది స్పష్టం.

నేను చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయాను. ఆ తరువాత మరికొంతసేపటికి మా చిన్నాయన నా దగ్గరికి వస్తూ 'పన్నవా బిడ్డా!' అంటూ మంచంలో కూర్చున్నాడు. దాదాపు నేను ఆసరికే సిద్ధపడ్డాను. చిన్నాయన కాసేపు మాటలకోసం వెతుక్కుంటున్నట్టుగ ఉండిపోయిండు. ఆ తరువాత తన చేయి నా వీపు మీద వేస్తూ "బిడ్డా! ఈపాటికి నీకు ఎగుసం చేసుడంటె ఏందో తెలిసి వుండాలె! యిన్నేండ్లు మీ నాయన ఎట్లనో చేసు కచ్చిండు, రైతుకు కాని కాలం దాపురమైంది" అని కొద్దిసేపు చెప్పి నా మొఖంలకు చూస్తూ "బాయిపనికి (బొగ్గుగని) నీకు కాల్ అచ్చింది! ఇక్కడుంటె బతుకలేవు" అన్నాడు. బాయిపనంటె బొగ్గుతట్ట మోయడం, వెనుకటికి నైజాం కాలంలో కూలినాలి చేసుకు బ్రతికేవారు మాత్రమే బాయిపనికి పోయేవారు. యిప్పుడో!

"ఏదో నాల్రోజులు తిప్పలు పడాలె! తరువాత ఏదన్న అలుకటిపని చూసుకోవచ్చు" చిన్నాయన మాటలు. నేను అన్నింటికి సిద్ధపడే ఉన్నానన్న విషయం ఆయనకు తెలియదు. ఆయనింకా అంటూనే ఉన్నాడు. "ఎవరో ఏదో అంటరని చూడకు. ఖదరూ – ఖాందాన్ మనకు కూడు పెట్టయి. యిన్నవా బిడ్డా రేప్పొద్దున్నే లేసిపోదాం" అని చెప్పి ఇంట్లోకి పోయిండు.

నాకా రాత్రి ఇక నిద్రరాలేదు. గతానికి సంబంధించిన అనేక విషయాలు కందిరీగల తుట్టెలాగ నా మనసులో తిరుగనారంభించినయి. అప్పటికే మా చిన్నాయన మాకు ఎంతో డబ్బు సాయం చేశాడు. చిన్నాయనకు తెలియకుండా చిన్నమ్మా ఇచ్చింది. వారు ఇవ్వడమే కాని మేం తిరిగి తీర్చలేకపోయాం. బాయిపని చెయ్యడమంటె మాటలుకాదు. పోనీ ఇక్కడే వుంటే బ్రతికే వీలులేదు. అట్లా ఎన్నడో నమోదు చేయించుకున్న పేరు మీద ఇట్లా 'కాల్' వస్తుందని నేను అనుకోలేదు.

తల్లిని, తండ్రిని, పుట్టి పెరిగిన ప్రియాతిప్రియమైన ఊరుని విడిచి ఎక్కడికో దూరంగా దుర్భరమైన బొగ్గుగనుల్లోకి పోవాల్సి వస్తున్నందుకు నా మనసులోంచి దుఃఖం ఎగిసి ఎగిసి వచ్చింది. మట్టిని తలక్రిందులు చేస్తూ పచ్చని పొలాల మధ్య స్వేచ్ఛగా జీవించాలనుకున్న కలల్ని – మొక్కల లేలేత చివుళ్ళవంటి నా కలల్ని ఎవరో నిర్దాక్షిణ్యంగా నరికి వేసినట్టు వెక్కి వెక్కి ఏడ్చాను. ఏడ్చి ఏడ్చి చివరకు నన్ను నేనే సముదాయించుకున్నాను. అప్పులు తీర్చుకోవచ్చు. వ్యవసాయం సజావుగా చేసుకోవడం కోసం నాలుగు డబ్బులు సంపాదించుకోవచ్చు అని నిర్ణయించుకున్నాను.

ఆ విధంగా తెల్లవారకముందే లేచి సిద్ధమై - కన్న తల్లితండ్రుల్ని ఉన్న ఊరునూ - నా జీవన సమస్తాన్ని విడిచి మా చిన్నమ్మా, చిన్నాయనల వెంట బొగ్గుగనుల్లో పనిచేయడం కోసం బయలుదేరాను. ఆ తెల్లారుతున్న వెలుగులో మా ఊరును మిర్రి మిర్రి చూస్తూ నేను వెళ్లిపోయాను. ఆఖరుకు నిరంజన్‌కు కూడా చెప్పలేదు. 'గాబాయిపనికి మనం వెళ్ళడమేంది' అని నా నిర్ణయాన్ని ఎక్కడ సడలింపచేస్తాడో అన్న భయం వల్ల.

ఇక ఆ పోవడం - మా ఊరికి ఇదే తిరిగి రావడం మధ్యలో రెండుసార్లు మా అమ్మానాయనలు వచ్చిపోయారు. అంతకు మినహా ఊరు గురించిన ఏ విషయమూ తెలియకుండా పోయింది ముఖ్యంగా నిరంజన్ గురించి

బొగ్గుగనుల ప్రాంతం పోయాకా తిరిగి మా ఊరికి రాకపోవడానికి మొదట్లోనైతే నేను చేసే తట్ట మోతపని నామోషిగా భావించే! తరువాత తరువాత కొత్త జీవితపు ఉరవడిలో నేను కొట్టుకుపోవడం చీటికి మాటికి సమ్మెలు చేస్తారని, తాగి కాయిదపునోట్లను గాడిదలకు తినిపిస్తారని బొగ్గుగని కార్మికుల గురించి సాధారణంగా పల్లెల్లో అనుకుంటూ వుంటారు. నేను కూడా పై రెండు అభిప్రాయలు నిజమనే అనుకునేవాన్ని నిజం కూడా! కాని ఆ కఠోర వాస్తవాల వెనుక ఎన్నో కారణాలున్నాయని నాకు తరువాత్తరువాత తెలిసింది.

బొగ్గుగని లోపల చూస్తే ఏముంది? భూగర్భంలోకి రోజూ మైళ్ళకొద్ది నడవటం - పుట్టెడు బండకింద - కడుపుల పేగులు తెగి నోట్లకి వచ్చేటట్లుగా బ్లాస్టింగ్ పొగవల్ల దగ్గుతూ - ముక్కుల్లో మూతుల్లో కడుపులోని పేగులవెంట పేరుకుపోయిన బొగ్గు దుమ్ముతో - కుమ్మరివాములో కుండలు కాలినట్టుగ వర్కింగు ప్లేసుల్లోని వేడికి, శరీరాలు సలసల వేడెక్కిపోతుండగా - మెడనరాలు జువజువ గుంజంగా - గంటల తరబడి బొగ్గుతట్ట మోస్తూ టబ్బులు నింపడం - కళ్ళు బైర్లు కమ్ముతోంటె నాలుక పిడుచగడుతోంటె ఎక్కడో వున్న మంచినీటి పంపుకోసం పరుగులు పెట్టడం - పంపు కింద వెల్లకిలా పండుకుని 'తేలగిల' పడిపోవడం - తిరిగిలేచి కడుపుల పేగులు తెగేలా టబ్బుల్ని దొబ్బి దొబ్బి హాలర్ తాడుకు అందించడం - దిమ్మెక్కిన తలలతో - నిస్సత్తువ శరీరాలతో - గంటలకు గంటలు నడుస్తూ పైకి ఎక్కి వచ్చేసరికి తలప్రాణం తోకకు వచ్చేది.

గని లోపల పని పరిస్థితులు బాగు చెయ్యాలని, వర్కింగు ప్లేసులో గాలి సప్లయి సరఫరా చెయ్యాలని, బొగ్గు మోసే తట్టలు, బూట్లు ఇవ్వాల్సిన పద్దతిలో ఇవ్వాలనీ, ఇలా ఎన్నో విషయాలకు మేం అధికార్లతో గొడవపడాల్సి వచ్చేది. పనిముట్లు కిందవేయందే మాకు ఏ సమస్యా తీరేది కాదు.

మా గని ఉపరితలంపై తిరుగుతున్నంతసేపు నేనెప్పుడూ దక్షిణం వైపుగా ఎత్తయిన రామగిరి పర్వతం వైపు చూస్తుండేవాడిని. ఆ పర్వతం కావలిగా వున్న నా ఊరు నాకెప్పుడూ జ్ఞాపకం వచ్చేది. వెంటనే నా కండ్లల్లో గుబగుబాని నీళ్లు ఊరేవి. పొలాల్లోంచి గనుల్లోకి బలవంతంగా తరమబడ్డానని భావించుకునేవాన్ని. అందుకు నాకు దేనిమీదో కోపం, ద్వేషం, దేన్నో సాధించాలనే కసి.

సహజంగానే అనివార్యంగానే నేనూ అందరితోపాటు సమ్మెల్లో పాల్గొనేవాన్ని. ఆక్రమంలో నాకు అనేకమంది పరిచయమయ్యారు. అద్భుతమైన కార్మిక మిత్రులు. అట్లా కొత్త పరిచయాలు - కొత్త అనుభవాలు - కొంగ్రొత్త అధ్యయనాలు, ఈ సమస్త భూగోళాన్ని చిన్న గోళీకాయగా చేసుకుని నా అరచేతిలో పెట్టుకుని దాని బహిరంగాన్ని దాని అంతరంగాన్ని, దాని గతాన్ని, గమనాన్ని ఆగమనంతో సహా అన్నింటిని అణువణువునూ శోధించడం నేను ఇక్కడే నేర్చుకున్నాను. నా పాత జీవితాన్ని జ్ఞాపకం తెచ్చుకుని కుమిలిపోవడం తగ్గింది. నాగేటి చాళ్ళలోంచి బొగ్గు పొరల్లోకి ఈడ్వబడటం నా జీవితంలో పెద్ద మార్పు ఎల్లాగైతే అయిందో అదే విధంగా బొగ్గు గనుల్లోకి వచ్చిన తదుపరి క్రమ క్రమంగా నా మనస్తత్వం పూర్తిగా మారింది. హఠాత్తుగా జరుగకపోయినా ఇది నా జీవితంలో రెండో మార్పు. స్వయంగా వ్యవసాయం చేసుకుంటూ, పనివాళ్ళతో చేయించుకునే రైతు దశ నుంచి కేవలం రెక్కల కష్టాన్ని అయినకాడికి తెగనమ్ముకునే కార్మికుడి స్థితిలోకి నేను మారడం అన్నింటికి మూలమని నేను తరువాత తరువాత తెలుసుకున్నాను.

అట్లా పచ్చపచ్చని పైరుల్లోంచి నల్లని బొగ్గు పెళ్ళల మధ్యకుపోయిన చాలాకాలానికి మా ఊరు వస్తోంటే రైల్లోనే నేను నా చిన్ననాటి స్నేహితున్ని నా పాత స్నేహితున్ని కలుసుకోగలగడం జరిగింది.

నిరంజన్ నా కిటికీ దగ్గరకు వచ్చి పిలిచేదాకా నాకు స్టేషన్ వచ్చిందని కాని, రైలు ఆగిందని కాని తెలియనే తెలియలేదు. రైలు దిగి ప్లాట్‌ఫారం దాటుతూ నేనతన్ని "ఎక్కడికి పోయి వస్తున్నవు?" అని అడిగాను. "పాలేరు పైసలు ఎగబెట్టి సింగరేణిలకు పోయిండు. పైసలు వసూల్‌కు బెల్లంపల్లిదాక పోయి వస్తున్న" అని అతనన్నాడు. ఏవో ప్రశ్నలు, జవాబులు. ప్లాట్‌ఫాం దాటాం. ఎదురుగా చౌరస్తాలో నల్లబడ్డ గాంధీబొమ్మ! కుడిపక్క సందులో తడికలు తీసి రేకులు మార్చిన సినిమా టాకీసు - నూనె, బియ్యం మిల్లుల ఎత్తైన పొగగొట్టాలు, తళతళలాడే షావుకార్ల ఎత్తయిన మేడలు - బీట్లో ధాన్యాలు అమ్ముకుని అవసరమైన సామాన్లకోసం దుకాణాల ముందు తిరుగుతున్న రైతులు - ఎడ్లబండ్లు.

ఒకప్పుడు యిదే రోడ్లమీద నేనూ, నిరంజను ఆ రైతుల మాదిరే బండ్లలో నిలబడి వాహనాల వంక ఎత్తైన షావుకార్ల మేడలవంకా చూసేవాళ్ళం. మా ధాన్యరాసులకు అడ్డగోలు ధరలు నిర్ణయిస్తుంటే గుడ్ల నీరు కుక్కుకుంటూ నిస్సహాయంగా నిలబడి చూసింది ఇక్కడి బీటు గద్దెంపైన్నే! అట్లా ఎన్నెన్నో చేదు జ్ఞాపకాలు చుట్టు ముడుతుంటె నేనూ నిరంజన్ బస్టాండు వైపు నడిచాం. అప్పటికి చీకటి కానే అయింది.

ఆంజనేయుని ఆలయ నిర్మాణం కోసం చందాలు - బ్యాంకు ఎన్నికలూ - సబ్సిడీలు - పోయిన అసెంబ్లీ ఎన్నికలు -ఎమ్మెల్యేతో తనకున్న దగ్గరితనమూ - అట్లా నిరంజన్ నాతో మాట్లాడుతుండగానే బస్సు రావడం అందరం దానిపై ఎగబడటం ఎలాగో ఎక్కి బస్సులో ఆ చివర ఒకరం ఈ చివర ఒకరం నిలబడ్డాం. గడబిడ గంద్రగోళం - ఉక్కపోత - దిగకారే చెమటలు. బస్సులో మా ఊరివాళ్లు కూడా చాలామందే అగుపించారు.

బస్సు మెల్లగా కదిలింది. రైలుగేటు - రైసుమిల్లు - ఆయిల్ మిల్లు -కళావిహీనమై

ఉన్న ఆయిల్ ఇంజన్ వర్క్‌షాపు - ప్రక్కనే వెలిగిపోతున్న కరెంటు మోటార్ల వర్క్‌షాపు - కట్టెకోత మిషన్లు - సున్నపు బట్టీలు రోడ్డుకు రెండువైపులా మునలి తుమ్మలు - గుట్టపై పచ్చగా వెలిగే మైక్రోవేవ్ స్టేషన్ లైట్లు - పల్లెలు - పంటపొలాలు - మెల్లమెల్లగా నా జన్మస్థలానికి చేరుకుంటున్నాననే భావన !

బస్సు దిగేసరికి చీకటి బాగానే అయింది నిరంజన్‌కోసం నేనాగితే నిరంజన్ పాన్‌షాపులో సిగరెట్లు కొంటూ ఆలస్యం చేస్తున్నట్టు అన్పించింది నాకు నాకోసం ఆగిన మా ఊరివాళ్లు కొందరు పోదాం రమ్మని పిలుస్తున్నరు నన్ను. "ఆయినేకేంది ఆయినే వత్తడు" "మీరు రాండ్రి" అని అంటున్నారు. చివరికి మందితో నేను నడుస్తుంటే మా వెనువెంటే నిరంజన్ వస్తున్నడు.

చీకటి పూట గతుకుల బాట - పడుతూ లేస్తూ నడక పైగా వీళ్లు నా గురించీ, అక్కడి పనీపాటల గురించి అక్కడి మనుషుల గురినించి ఆసక్తిగ అడుగుతున్నరు. వారు చాలా ఆదరంగా మాట్లాడుతున్నట్టు తోచింది. అంతసేపూ నిరంజన్ నడకలో ఎవరితోనూ మాట్లాడలేదు - ఎవరూ ఆయనతో కూడా మాట్లాడలేదు - నాకేమిటో అసహజంగా తోచింది.

ముదుసుకుంట కట్ట - తాడిచెట్లు - మామిడితోటా - కల్లుముండువ కల్లువాసన మండువకాడ యింకా సందడి తగ్గలేదు. చెట్లమీద పక్షుల చప్పుడు - తాటి కొమ్మల గలగల శబ్దాలు - బోయ్‌మని వీచే చల్లనిగాలి - అంతా గమ్మత్తుగా - చిరపరిచితమైన ఊపిరిని మళ్ళీ పిలుస్తున్నట్టు -

చేను చెల్కల మీది నుంచి రైతులూ రైతు స్త్రీలూ ముల్లెలతో, గడ్డి మోపులతో, ఎడ్ల ముందేసుకుని వస్తున్నరు కొందరు ఆ చీకట్లో సైతం నన్ను గుర్తుపట్టి పలకరించారు. మా కుంటెంకయ్యగారి అచ్చమ్మ పదినైతే తన సహజ పద్ధతిలో "నీ తలపండు పలుగ, పోయిన కాన్నుంచి ఊర్నే మరిసిపోయినవు" అని స్వాగతం చెప్పింది.

"పొద్దున కలుద్దాం" అంటూ నిరంజన్ వాళ్ళింటికి వెళ్లిపోయాడు. నేను మా ఇంటికిపోయాను.

మరునాటి రాత్రి - పిండి కురిసినట్టు వెన్నెల - మిలమిల మెరిసే చుక్కలతో, దూదిపింజల తీరుగ కదిలిపోతున్న మేఘాలతో ఆకాశం ఎంతో మనోహరంగా వున్నది. సన్నగా తోలుతున్న పైరగాలి శరీరానికి ఆహ్లాదం కలిగిస్తున్నది.

ఎక్కడో దూరంగా ఎవరి కొట్టంలోంచో మేస్తున్న పశువు మెడలోంచి లయబద్ధంగా బొనుగ చప్పుడు వినిపిస్తోంది. మూడు బజార్ల దగ్గర ఎవరో ఒకరు కూర్చున్నారు. బజారునిండా కావళ్లు భుజాల కేసుకుని గౌండ్లవాళ్లు - తాగబోయినవాళ్ళు వెళ్తున్నరు. ఎవరి ధోరణిలో వాళ్ళు ఎడతెగకుండా మాట్లాడుకుంటూ పోతున్నరు.

ఎవరో ఆడగొంతుతో "పోదమా వనసీమల-చెలి చూదమా వనసీమలా" అని మైనావతి నాటకంలో వనవిహార సందర్భంలోని మైనావతిలాగ పాడుతున్నడు.

నిత్యం దిబదిబ చప్పుళ్ళమధ్య - ఉక్కిరిబిక్కిరిచేసే బొగ్గుపొగల మధ్య - కండ్లు కప్పుకుపోయే బొగ్గు దుమ్ముధూళిల మధ్య - మురుగు కాల్వల వాసనల మధ్య గడిపి రావడం వల్లనో ఏమో నాకు ఎంతో ప్రశాంతంగా తోచింది.

రాత్రి భోజనాలు కాగానే బయట మంచాలు వాల్చాను. అమ్మ వంటిల్లు సర్దుకోవడంలో మునిగిపోయింది. నాయన బర్రెపాలు పిండుతున్నడు. పాయ తీసి కట్టేసిన దుడ్డె తల్లి దిక్కు గుంజుతోంది.

నిన్న రాత్రి మా అమ్మ అనేక సంగతులు చెప్పింది. మధ్యలో నిరంజన్ గురించి కూడా చెప్పింది. కాలం మునుపటి తీరుగా లేదని, మారకపోతే బతుకలేమని ఆపాటి జ్ఞానం నిరంజన్‌కు ఎందుకు లేదోననీ మా అమ్మ విచారపడ్డది.

నేనట్లా విచారిస్తూ కూర్చుండగానే "ఎప్పుడచ్చిండ్రు" అని ఎవరో అంటే నేను చూసిన. ఒకప్పుడు మా చిన్నపాలేరు సాయిలు. చిన్నప్పుడు! యిప్పుడు బాగా ఎదిగిండు. "బాగేనా" ని నేనంటే 'బాగే' అన్నడు. నెత్తిమీద తువ్వాల తీసుకుని కిందేసుకుని కూర్చుంటూ నా పని గురించిన వివరాలు అడిగిండు. మొదట్లోనైతే నేను చేస్తున్న పని చెప్పడానికి సంకోచించేవాన్ని. కాని యిప్పుడు? వివరాలు చెప్పిన మీదట "మీరు చేసే బాయికే (గనిలోనే) మా బావ పనిచేస్తడని" చెప్పిండు. 'ఏం పేరని' నేనంటె, మిట్టపల్లి మల్లేశమని చెప్పిండు. నేను నవ్వుతూ మేం ఇద్దరం కలిసే పని చేస్తమని చెప్పినప్పుడు చూడాలి సాయిలు సంతోషం! మరింత దగ్గరికి జరిగి వాళ్ళ బావ గురించి, అక్క గురించి క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకున్నడు.

మా సంభాషణ గ్రామం వైపు మళ్ళింది. అతను చెప్తున్నాడు. నేను అడుగుతున్నాను. నిరంజన్ గురించి మాట్లాడుతూ "ఆయన గట్లనే చేస్తుంటె ఎవరో దౌడబొక్కలిరుస్తరని" లేచిండు. "పొద్దుపోయింది ఉంటరుకద రేపు కలుత్త" అంటూ సాయిలు లేచి వెళ్ళిపోయాడు. సాయిలు కోపంతో అన్న మాట ఒక్క సాయిలు కోపంగానే తోచలేదు నాకు. అది వారందరి సామూహిక కోపంగా తోచింది.

నిరంజన్ పట్ల నా మనసు ఆందోళన చెందింది.

నేనతని కోసం ఎదురుచూస్తూ చాలాసేపు కూర్చున్నాను. అప్పటికే మా అమ్మ నాలుగుసార్లు పిలిచింది. "ఆయనేడ వస్తడు బిడ్డా నువ్వచ్చి పండుకో" అని. అన్యమనస్కంగానే నేవెళ్ళి బయట మంచంలో పడుకున్నాను. నిద్ర రావటంలేదు. నిర్మలమైన వెన్నెలరాత్రిలో పైకి ఆకాశంలోకి చూస్తుంటే నాకేదో అంతులేని అగాధాల్లోకి చూస్తున్నట్టు తోచింది. అప్పటికే ఊరుడుకు మగ్గింది. కుక్క ఒకటి దూరంగా ఎక్కడో విషాదంగా ఏడుస్తోంది. ఆ ఏడ్పు ఎంతో దూరం విన్పిస్తోంది.

క్రమక్రమంగా నాకెప్పుడు నిద్రపట్టిందో తెలియదు. మా అమ్మ ఆదరా బాదరగా నను తట్టి లేపుతూ "నిరంజన్ను మాదిగిండ్లళ్ళ కొడుతున్నరట" అని చెప్పింది. నేను మంచందిగి అట్లాగే లుంగీ బనీను మీద మాదిగిండ్ల వైపు ఉరికాను. అప్పటికే భళభళ

తెల్లారింది. పనిపాటలకు బయలుదేరే పాలేర్లు అందరు క్వార్టర్ల మధ్య (హరిజనులకు కట్టించిన క్వార్టర్సు) గుమిగూడింద్రు. అరుపులు, తిట్లు, కేకలు తోసుకోవడాలు అంతా కలిసి నానా గంద్రగళంగా వుంది. మధ్యలో నిరంజన్ తలమీద కొన్ని చేతులు బలంగానే పడ్డాయి. మరికొందరు అందర్నీ విడదీస్తున్నరు. నాకు ఎవర్ని వద్దనాలో - ఎందుకు జరుగుతోందో తోచలేదు. అంతలోనే గ్రామంలోంచి ఇద్దరు ముగ్గురు రైతులు కూడా వచ్చారు. "ఏదన్నుంటె పరిష్కరించుకోవాలెగాని ఇదేం లొల్లి" అని అందర్నీ సముదా యిస్తున్నరు. ఆ గుంపులోంచి నిరంజన్ను బయటకు లాక్కువచ్చారెవరో. ఆయన నోట్లోంచి నెత్తురు కారుతోంది. నా మనసు వికలమైంది.

ఊళ్ళోంచి వచ్చినవారు నిరంజన్ను మెల్లమెల్లగా నడిపించుకుంటూ గ్రామంలోకి పోయారు. నేనక్కడే నిలబడిపోయాను. ఎదురుగా క్వార్టరు ముందు చింత కింద ఒక పదేండ్ల పిల్లవాడు జ్వరం వచ్చిన వాని తీరుగ నేలపై కూర్చున్నాడు. అతని ఒంటిపై పాతచీర నిండుగా కప్పింది తల్లి. శోకాలు తీస్తుంది. మధ్యమధ్యలో నిరంజన్ను శాపనార్థాలు పెడుతోంది. సంగతి బోధపడి బోధపడనట్టుగా వుంది. నిరంజన్ను తిడుతూ అంత తొందరగా వదిలి పెట్టినందుకు తమలో తామే ధుమధుమలాడుతూ ఎటువాళ్ళు అటు వెళ్ళిపోయారు. అందాక నిలబడి చూస్తున్న సాయిలు కూడా నా దగ్గరికి వస్తూ "నాలుగు రోజుల్నుంచి అగో - ఆడకూసున్న పోరడు - జరంతోని గజగజ వణుకుతాండు. ముసల్దాని చేతుల దమ్మిడిలేక పోరనికి మందులేదు. మాకు లేదు. పొద్దున పొద్దునే ఎగోళం తీరుగ అచ్చి ఇంట్లసొచ్చి పోరన్ని రెక్కబట్టి ఇవతలికి గుంజుకచ్చిండు. వాంది వగల జరమట! పనికి రాకుంట తప్పిచ్చుకునే ఏషమట! వాన్ని అట్ల గొరగొర ఇగ్గుకత్తాంటె ముసల్ది వద్దు వద్దని అడ్డం తిరుగుతె ముసల్దాన్ని ఇయ్యెర మయ్యెర గుద్దుతాంటె అచ్చెటోళ్ళు పోయెటోళ్ళు ఆయినె పని చూసింద్రు" అని చెప్పిండు.

'ఏందీ ఈ మనిషి పూర్తిగ ఇట్లా అవుతున్నడు' అనుకుంటు నేను ఇంటికి వచ్చిన. వెంటనే నిరంజన్ దగ్గరికి పోవాలనిపించలేదు. వికలమైన మనసుతో ఆరోజు చేన్లు చెల్కలు కలె తిరిగి వచ్చాను. సాయంత్రమైంది. భోజనం పూర్తి చేసుకుని నిరంజన్ ఇంటికి బయలుదేరాను. నిరంజన్ వాళ్ళమ్మ సబ్బండ వర్ణాలవారిని మూడు బజార్లకాడి దుబ్బతో సత్కరిస్తోంది. తండ్రి ఉండి ఉండి తిట్లతో దీవిస్తున్నడు.

అప్పటికే ఆరెంపి డాక్టరొచ్చి తలకు కట్టుకట్టి ఇంజక్షను గోలీలిచ్చి పోయిండట. నిరంజన్ ఇంటివెనుక మల్లెపందిరి కింద ఒంటరిగ పండుకున్నడు. నేను వెళ్ళి మంచం ప్రక్క నిలబడ్డాను. నిరంజన్పై నీడ పడేసరికి కళ్ళు తెరిచి నావైపు చూసిండు. తరువాత ముభావంగా చీకట్లోకి చూస్తుండిపోయిండు. అట్లా కొద్దిసేపు ఇద్దరం మౌనంగానే గడిపాం. ఆ కాసేపు నాకు దుర్భరంగా తోచింది. సంభాషణ ఎట్లా ప్రారంభించడమా అని నేను ఆలోచిస్తూ చివరికి -

"ఏమిటిది? పూర్తిగ మంచీ చెడు తెలియనివాని తీరుగ అయిపోయినవు? ఏమిటి

నిరంజన్?" అన్నాను. ఆ ఒక్క మాటతోనే అతనికి ఎంతో బోధపడినట్టు చివ్వున తల నావైపు తిప్పి చీత్కార భావంతో "నీది నీకే మంచి – నాది నాకే మంచి" అన్నాడు.

ఆ మాటలతో నేను స్థాణువునై పోయాను. నా మనసంతా ఎట్లాగో అయిపోయింది. చేదు మాత్ర మింగినట్టు అన్పించింది. ఆ రెండు మాటలతో మా ఇద్దరి మధ్య ఏర్పడ్డ అఘాతం పైని ముసుగు ఒక్కసారిగ గుంజి చూపించినట్టు అయింది.

కలిసి పుట్టకపోయినా, కలిసి పెరిగాం, కలిసి ఆడాం. కలిసి పాడాం.

ఏమీ తెలియని అమాయక కాలంలో ఇద్దరం ఒకటే అనుకున్నాం. కాని నిజానికి బతుకులోకి వచ్చేసరికి ఆలోచన వచ్చేసరికి ఇద్దరి మధ్యా ఎంత అఖాతం? ఇంతకాలానికి గాని ఒకరి మంచి మరొకరికి మంచి కాకుండా పోయింది.

మంచంలో పండుకుని నిరంజన్ – ప్రక్కన నిల్చుని నేను. ఇక ఏం మాట్లాడాలో నాకు తోచలేదు. నిజానికి ఇంక ఏం మాట్లాడగలను. ఆ గోడల మధ్య గాలి ఆడటమే కష్టమైంది. పైన వెన్నెల పందిరి కింద వికృతంగా నీడలు పాములతీరుగ అటూ ఇటూ కదులుతున్నాయి.

మరీ దుర్భరంగా తోచగానే ఏవో రెండు మూడు పొడి పొడి ప్రశ్నలు – జవాబులు పరస్పరం విదల్చుకోగానే నేను లేచి నిలబడ్డాను.

"నిరంజన్ ఇక నేను వెళ్ళివస్తాను" అన్నాను.

"మంచిది కలుద్దాం" అతనన్నాడు.

నిజానికి ఆ మాటలు అసాధ్యం అనిపించాయి.

ఈ చోటుకు నేను మళ్ళీ రాకపోవచ్చు.

నిరంజనూ నేనూ కలుసుకోకపోవచ్చు. ఆ భావన రాగానే నా శరీరంలోంచి ఏదో భాగం తెగిపోయినటువంటి బాధతో వడివడిగా ఆ ఇంట్లోంచి బయటపడ్డాను. మా ఇంటి వైపు.

**– సృజన, జనవరి 1990**

# మసీదుపావురం

## దాదాహయత్

అది కళ్ళు విప్పి చూసేసరికి దాని చిన్ని గుండెలో కలిగిన మొట్టమొదటి భావం భయం.

రోజూ తెల్లారుజామున మైకులో వినిపించే ప్రార్థనాహ్వానం దాని మటుకు దానికి అలారం టైంపీసు మోత లాంటిది. అదారోజు దాన్ని మేలుకొలపలేదు. అది లేచేవేళకే దాని ఫ్రెండ్సన్నీ లేచి కోలాహలం చేస్తున్నాయ్. చివరికి రోజూ బద్ధకంగా నిద్రలేచే దాని జతపావురం కూడా దానికంటే ముందే లేచి తాపీగా గట్కుం గట్కుం అనే శబ్దాలు చేస్తోంది.

సరిగ్గా వారం రోజుల క్రితం ఆ మగపావురంతో దానికి జతకలిసింది. అంతకు ముందు మరో మగపావురం దానికి జోడీగా వుండేది. అయితే ఆర్నెల్లపాటు తనతో జల్సాగా కాపురం చేశాక ఆ మగపావురం మరో ఆడపావురంతో చక్కాలేచిపోయింది.

ఆ మగపావురం లేచిపోయిన్రోజున దీనికి జీవితం మీదే విరక్తి పుట్టింది. మసీదు కొలనులో దూకుదామా లేక ఆత్మహత్య చేసుకోవడానికి వేటగాడి వలలో చిక్కిపోదామా అని ఆలోచించింది. తను చిక్కితే చాలు, యెంచక్కా నిప్పులమీద కాల్చుకు తింటానికో కుర్రకుంక సిద్ధంగా వున్నాడు. రెండుమూడుసార్లు వాడు దొంగచాటుగా మసీదులో కొచ్చి తనని పట్టుకుపోవడానికి ప్లానేశాడుగానీ తనే వాడికి టస్సాయిచ్చేసి అందకుండా యెగిరిపోయింది.

అయితే బాగా ఆలోచించిన మీదట ఆత్మహత్య చేసుకోవడం శుద్ధదండగనిపించింది. ఛీ, అది మగబుద్ధి చూపించి మరో పావురంతో యెగిరిపోయినంత మాత్రాన తనెందుకు బేలగా ఆత్మహత్య చేసుకోవాలి? తనూ మరో జోడీ వెతుక్కుంటుంది.

ఆ ఆలోచన పుడుతూనే అంతవరకూ ఆ లేచిపోయిన మగపావురం కోసం అంగలారుస్తూ చెట్టూ పుట్టా పట్టుకు తిరిగిందల్లా ఆ వెతుకులాట మానేసి తిన్నగా మసీదు గోపురం మీదికి యెగిరి పోయింది. ఆ మసీదు గోపురం మీద దానికి ఒకటి కాదు, రెండు మగపావురాలు కనిపించాయి. తన మచ్చలేని తెల్లరంగు చూసి అవి రెండూ కళ్ళు తిరిగి బోల్తాపడబోయి నిలదొక్కుకున్నాయి. తనేమో ఆరెండింట్లో దేంతోనైనాసరే జతకట్టడానికి

సంసిద్ధత వ్యక్తం చేస్తూ నునులేత సిగ్గుతో ఓసారి అందమైన నల్లని కళ్ళు రెపరెపలాడించి వాటితోపాటు రెక్కలు కూడా నైస్‌గా టపటప లాడించింది.

ఒక్క ఒరలో రెండు కత్తులు యిమడవు కదా! ఆ రెండు మగపావురాలూ తనకోసం మసీదుగోపురం మీదే బరిలోకి దూకాయి. పావుగంటసేపు ఆ రెంటిమధ్యా హోరాహోరీ పోరాటం జరిగింది. చివరికి యీకలన్నీ వూడగొట్టుకుని భంగపాటుతో మగపావురం పలాయనం చిత్తగించింది. గెలిచిన మగపావురం విజయగర్వంతో తోక నిక్కబెట్టుకుంటూ రెక్కలాడించి తనని దగ్గరికి రమ్మన్నట్టుగా చూసింది. తనేమో బోలెడు సిగ్గుపడిపోతూ నెమ్మది నెమ్మదిగా పక్కకు జరిగి దాని సరసన వెళ్ళి కూచుంది. అది సగర్వంగా ఓసారి తల పైకెగరేసి ముక్కుతో తన మెడరాస్తూ ప్రేమ ప్రకటించింది.

అది మొదలు తను దాంతో కలిసి మసీదు ఆవరణంతో ఆనందవిహారాలు సాగించింది. మసీదు కొలనుపక్కన కాసేపూ, అదే ఆవరణలోవున్న మగ్బిరాల మీద కాసేపూ, అక్కడికి చేరువలోనే వున్న చార్మినార్ మీద కాసేపూ, ప్రేమతో గడిపేసింది.

అయితే రెండుమూడు రోజులు గడిచాక తనకి ఆ మగ పావురంలో వున్న లోపాలన్నీ బాగా తెలిసిపోయాయి. దాన్లో అన్నింటికన్నా పెద్దలోపం యేవిటంటే అన్ని విషయాలకీ బద్దకం. పొద్దున్నే నిద్రలేవడం దగ్గర్నుంచీ తిండిగింజలు సంపాయించుకోవడం వరకూ దానికి అంతా బద్దకమే. అయితే తనతో శృంగారం చేయడానికి మాత్రం యెక్కడలేని హుషారు పుట్టుకొచ్చేస్తుంది. వారంరోజులకే దాని బద్దకంతో తనకు మొహం మొత్తింది. సమయం చూసుకుని ముక్కుతో దాని నెత్తినోటి గట్టిగా యిచ్చుకుందామనని ఆలోచిస్తుండగానే అనుకోకుండా యీ వుపద్రవం జరిగిపోయింది. రోజూ మోగే లౌడ్‌స్పీకర్లు ఆరోజు మోగలేదు!

అది నెమ్మదిగా తన గూట్లోంచి బయటికొచ్చి భయంభయంగా ఓసారి అటూ యిటూ చూసింది. తన జతపావురం యెదురుగానే కనిపించేసరికి దాని దగ్గరికి యెగురుకుంటూ వెళ్ళి లౌడ్‌స్పీకర్లు మోగకపోవడానికి కారణం యేవిటన్నట్టు ప్రశ్నార్థకంగా మొహం పెట్టింది. అయితే దాని జతపావురం, 'ఈరోజు నీకంటే నేనేముందు లేచాను చూశావా?' అన్నట్టు గీరగా మొహం పెట్టింది తప్ప తన కళ్ళలోని భయాన్ని మాత్రం పట్టించుకోలేదు.

ఇలా లాభంలేదనుకొని అది లిన్నగా లౌడ్‌స్పీకర్లకు యెగురుకుంటూ వెళ్ళింది. అమ్మయ్య! లైడ్‌స్పీకర్లకేం కాలేదు. అవి వుండాల్సిన చోటే వున్నాయ్. అయితే పొద్దునే అవి మామూలుగా యెందుకు మోగలేదో దానికర్థం కాలేదు. అది ఓ లౌడ్‌స్పీకర్ దగ్గర్నుంచి మరో లౌడ్‌స్పీకర్ దగ్గరికి యెగుర్తూ ముక్కుతో ఒకటి రెండు సార్లు వాటిని తట్టి చూసింది. అప్పటికీ యేమీ అర్థం కాలేదు రోజూ జరగాల్సినవి టైం ప్రకారం జరక్కపోతే దానికి చాలా భయం వేస్తుంది. ఇప్పుడు కూడా అలాగే దాని మనసేదో కీడు శంకించడంతో ఓ లౌడ్‌స్పీకర్ పక్కన దిగులుగా కూర్చుండిపోయింది.

తరతరాలనుంచీ దాని వంశానికి మక్కామసీదులోని పావురాయిగూళ్ళలోనే నివాసం. తన వయసెంతో దానికి తెలీదుగానీ, గుడ్డుపగలగొట్టుకుని బైటికొచ్చింది మొదలు అదెన్నడూ ఆ లౌడ్‌స్పీకర్లు మూగపోవడం చూడలేదు. యేదో వుపద్రవమే ముంచుకొచ్చింది.

లేకపోతే ఈ లౌడ్‌స్పీకర్లు వున్నట్టుండి దేనికి మూగవోతాయి?

అది యెండ బాగా నెత్తిమీది కొచ్చేంతవరకూ అలాగే దిగులుగా కూచుండి పోయింది. నెమ్మదిగా దానికి ఆకలి దప్పులు రెండూ ప్రారంభమైపోయాయి. ఇక లౌడ్‌స్పీకర్ల గురించిన ఆలోచన మానేసి కడుపాత్రంతో రెక్కలాడించుకుంటూ మసీదు కొలను దగ్గర దిగింది.

అక్కడికి దిగివెళ్ళేసరికి దానికి మరో విడ్డూరం యెదురైంది. దాని తోటి పావురాలన్నీ అప్పటికే ఆందోళనగా కొలను మీద యెగురుతున్నాయి. ఆ ఆందోళనకు కారణం తెలుసుకోవడానికి దానికి క్షణం పట్టలేదు.

మసీదు ఆవరణలో మానవమాత్రుడన్నవాడు లేడు!

చాలా విశాలమైన ఆవరణ అది. ఆ ఆవరణలో వుండే పావురాల వైభవమే వైభవం. హాయిగా యెగరడానికి కావల్సినంత స్థలం. ఆకలిదప్పులకు కటకటలాడాల్సిన అవసరం యెప్పుడూ లేదు. ఆ మసీదు చూడ్డానికొచ్చే జనం తమకు మేత వేస్తూనే వుంటారు. ఇక దప్పిక తీర్చుకోవడానికి కొలనులో కావాల్సినంత నీరు.

ఈ రోజెందుచేతనో ఒక్క మానవమాత్రుడు లోనికిరాలేదు! అంటే యీరోజు తమకింక తిండిగింజలు దొరకవన్నమాటే!

తిండిగింజల గురించి ఆలోచించడానికి ముందు దప్పిక తీర్చుకోవాలి. అది నేరుగా కొలనుదగ్గరికెళ్ళి కడుపు నిండా నీళ్ళుతాగింది. నీళ్ళతో తాత్కాలికంగా కడుపు నిండేసరికి కొలనిగట్టున కూచుని ఆరోజున జనమెందుకు రాలేదో ఆలోచనలో పడింది.

యేమిటో యీరోజంతా విపరీతంగానే వుంది!

మొదట లౌడ్‌స్పీకర్లు మోగలేదు. యిప్పుడు జనం తమకు తిండిగింజలేయడానికి రాలేదు.

యేం జరుగుతోంది?

ఆ ప్రశ్నకు సమాధానం తెలీక చివరికి బద్ధకస్వామి అయిన తన జతపావురం కూడా కంగారు పడిపోతోంది.

యెందుకిలా జరుగుతోందో తెలుసుకోవడానికి మసీదు ప్రహరీగోడ మీదికి యెగురుకుంటూ వెళ్ళింది తను.

ఈ సారి అది పూర్తిగా తికమక పడిపోయింది. మసీదువెలుపల రోడ్డుమీద కూడా ఒక్క మానవ మాత్రుడు కనిపించలేదు. అది చూస్తూనే దానికి కడుపులో యేదో ఖాళీ యేర్పడినట్టై యింక కుదురుగా కూచోలేక ఒకేసారి ఆకాశంలో కెగిరింది

యెదురుగా చార్మినార్ నాలుగుకొమ్ముల భూతంలా కనిపించింది. అది ఆ నాలుగు కొమ్ముల్లో కొమ్ముమీది కెగిరి కూచుంది. అంతెత్తునుంచి ఆ చుట్టుపక్కల ప్రాంతాలన్నీ దానికి స్పష్టంగా కనిపిస్తున్నాయ్.

రోజూ జనసముద్రంలో మునకలు వేసే చార్మినార్‌ప్రాంతం నలువైపులా పూర్తిగా బోసిపోయింది. అంగళ్ళన్నీ మూసేసివున్నాయ్ వీధుల్లో జనం తిరగడంలేదు. చేతుల్లో తుపాకులు పట్టుకుని అక్కడ గస్తీ కాస్తున్న పోలీసుదళాలు మాత్రం దానికి కనిపించాయి

వాళ్ళంతా యెవరో తెలుసుకోగల జ్ఞానమైతే దానికి లేదుగానీ, వాళ్ళు రోజూ తనకు కనిపించే సామాన్యజనం మాత్రం కాదని అది అర్థం చేసుకోగలిగింది.

దాని మనసులో రకరకాల భయాందోళనలు మెదిలాయి

ఇక్కడి జనమంతా ఒకేసారి యెలా మాయమైపోయారు యెక్కడికి మాయమైపోయారు?

అక్కడి భయంకరమైన నిశ్శబ్దం చూసి దానికి అంతులేని బెదురుపుట్టుకొచ్చింది. జనమంతా మాయమై గప్‌చిప్‌గా వున్న కూడలిలో ఒంటిగా ఆకాశాన్నంటుతూ నిలబడ్డ చార్మినార్ నిజంగా నాలుగుకొమ్ముల భూతంలా వుంది. అదింక చార్మినార్ మీదెక్కువసేపు కూచోలేక మళ్ళీ యెగురుకుంటూ వెళ్ళి తన తోటి పావురాల మధ్య వాలిపోయింది.

అప్పటికే అక్కడి పావురాల పరిస్థితి చాలా దయనీయంగా తయారైంది. యెప్పుడూ తిండిగింజలకోసం కష్టపడాల్సిన అవసరం రాకపోవడం వల్ల ప్రస్తుతం అది సామాన్యుల తిరుగుబాటుకు గురైన భూస్వాముల్లా వున్నాయ్. యేం చెయ్యాలో తోచక చకచకా మెడతిప్పుతూ ప్రతిపావురం ఆందోళన కనబరుస్తోంది.

అది తన జతపావురం దగ్గరికి వెళ్ళి దిక్కులేనట్టు నలువైపులా దీనంగా చూస్తూ నిలబడింది. దాని జతపావురం ఆకలికి తట్టుకోలేక తింటానికేవైనా దొరుకుతుందేమోనని నేలమీద అటూయిటూ చూస్తోంది. నేలంతా శుభ్రంగా తుడిచేసినట్టుంది.

కాసేపటి తర్వాత వాటిలో ఒక్కోటి ఒక్కోటి ఆకాశంలో కెగరనారభించాయ్. తను చూస్తుండగానే తన జత పావురం కూడా వాటితో పాటు ఆకాశంలోకెగిరి పోయింది.

యెగిరేముందు తన జతపావురం కనీసం మొహమాటానికైనా ఓసారి తనకేసి చూడకపోవడంతో తనకు ఆత్మాభిమానం దెబ్బతినేసింది. ఛ, యీ మగజాతంతా యింతే! తమస్వార్థం తాము చూసుకుంటారు తప్ప పెళ్ళామనేది వుందన్న ఆలోచన కూడా వాళ్ళకు రాదు. తనే పిచ్చిది. తన మొగుడు తిండిగింజలేరుకోవడానికి బద్ధకించినప్పుడు తను యెన్నిసార్లు దాని చుట్టూ యెగిరి తనతో పాటు దిగిరమ్మని రెక్కలాడించి హెచ్చరించలేదు! ఇప్పుడేమో అది తనని పట్టించుకోకుండా దాని మానాన అది యెగిరిపోయింది. ఇంకెప్పుడూ దాన్తో జతకట్టగూడదు.

మొగుడి మీద కోపంతో అది చాలా సేపటివరకూ కొలనిగట్టున ముభావంగా కూచుండిపోయింది. మళ్ళీ తలతిప్పి చూసేసరికి చుట్టపక్కల ఒక్క పావురం కూడా దానికి కనిపించలేదు.

అది విరక్తిగా తలపంకించింది. ఈ లోకంలో యెవరికి యెవరుతోడు? యెవరికడు పాత్రం గురించి వాళ్ళాలోచించాల్సిందే. కష్టాల్లో మరొకరెవరూ జతకు రారు. మొగుడి మీద మంటతో భోజనం మానుకుంటే కాలేది తన కడుపేగానీ వాడి కడుపుకాదు. వాడికేం, తనగురించి ఆలోచన లేకుండా జల్సాగా తిని తిరుగుతాడు.

అది నెమ్మదిగా యెగురుకుంటూ వెళ్ళి మసీదు ప్రహరీ గోడమీద వాలింది. గేటుదగ్గర కొందరు పోలీసులు తుపాకుల్తో కాపలా కాస్తున్నారు. గేటు మూసివుంది. వాళ్ళలో యెవరైనా తనకు తిండిగింజలు విసరకపోతారా అనే ఆశతో అది కొద్దిసేపు

అక్కడే కూచుండి పోయింది. అయితే వాళ్ళలో ఆ లక్షణాలు యేకోశానా కనబడకపోవడంతో మరోసారి తలపంకించి యిక లాభం లేదనుకుంటూ హుప్‌మంటూ ఆకాశంలో కెగిరిపోయింది.

దానికా అనుభవం కొత్త. యెప్పుడైనా సరదాగా షికారుకెళ్ళడమే తప్ప యిలా తిండిగింజలకోసం పొట్టచేతబట్టుకుని ఆకాశవీధిలో పడాల్సిన ఖర్మ తనకెప్పుడూ కలగలేదు.

చూపులన్నీ నేలమీదే పరిచి తిండిగింజల కోసం చూస్తూ అది చాలాదూరం యెగిరింది. ఒక యింటి కప్పుమీదనుంచి మరో యింటికప్పుమీద వాలుతూ బిచ్చగత్తెలా తిరిగింది. అదేం ఖర్మో, దానికి తిండిగింజలు దొరక్కపోగా వీధుల్లో ఒక్క నరమానవుడు కూడా దర్శనమివ్వలేదు. అయితే చాలా చోట్ల పోలీసులు మాత్రం తుపాకులు పట్టుకునుండడం మాత్రం కనిపించింది. వాళ్ళలో యెవరూ తనకు తిండిగింజలు వేయరని ముందే నిర్ణయించేసుకోవడంతో అది వాళ్ళున్న చోట యెక్కడా ఆగలేదు.

అలా యెగరగా యెగరగా చివరికో చోట దానికి బోలెడుమంది జనం కనిపించడంతో ప్రాణాలు లేచి వచ్చాయ్. అమ్మయ్య! ఇంక తనకు తిండిగింజలు దొరికినట్టే!

అయితే త్వరలోనే దాని ఆశ నిరాశగా మారిపోయింది. ఆ జనంలో యెవ్వరూ తనకు తిండిపెట్టే మూడ్‌లో లేరు. రెండుగుంపులుగా విడిపోయి ఒకళ్ళతో ఒకళ్ళు యుద్ధం చేస్తున్నారు. కొందరు రాళ్ళు విసురుతుంటే కొందరు పెట్రోలు సీసాలు అవతలి వాళ్ళమీదికి విసురుతున్నారు. పెట్రోలు సీసాలు పగుల్తానే కొందరు అగ్గిపుల్లలు గీసి ఆవైపు మునివేళ్ళతో సంధించి కొడుతున్నారు. ఆ అగ్గిపుల్లలు వెళ్ళిపడుతూనే భగ్గున నలువైపులా మంటలు కమ్ముకుంటున్నాయి. పసిపిల్లలు ఆడవాళ్ళూ ముసలివాళ్ళూ హాహాకారాలు చేసుకుంటూ దిక్కుతోచనట్టు నలువైపులా పరిగెడుతున్నారు.

కేకలు!

పెడబొబ్బలు!

ఏడుపులు!

గందరగోళం!

భయంకరమైన గందరగోళం!

ఆ అలజడి అంతా చూస్తూనే దానికి గుండె కంపించి పోయింది. ఒక్కక్షణం కూడా అక్కడ నిలవకుండా మళ్ళీ యెగిరిపోయింది.

ఆ రోజంతా అది పస్తులుండిపోవలసి వచ్చింది.

చీకటి పడబోతోంది.

ఆ మసక చీకట్లో యెక్కడికి వెళ్ళాలో తోచక ఓ చిన్న గుడిగోపురానికున్న గూట్లో ఆ రాత్రికి తలదాచుకుంది.

మసీదు పావురం గుడికొచ్చిందేమని దాన్నెవరూ ఆక్షేపించలేదు. దేవుడికి సకలప్రాణాలు సమానమో కాదో ఆ దేవుడికే తెలుసుగానీ దానికి మాత్రం గుడిగోపురం, మసీదు మినారూ, చర్చిశిఖరం అన్నీ ఒక్కటే. వాటికోసం కొట్టుకు చచ్చేన్ని తెలివితేటలు మనుషులకు మల్లే దానికి లేవు.

ఆ రాత్రంతా దానికి కాళరాత్రిగానే గడిచింది. కన్నుమూతబడుతున్న క్షణంలో

దూరంనుంచి యెక్కడో భయంకరమైన కేకలూ, ఆర్తనాదాలూ వినిపించాయి. అంతలోనే మరో వైపున మంటలు భగ్గున లేచాయి. అవన్నీ చూసి అది గజగజా వణికిపోతూ గూట్లో మరింత లోపలికి ముడుచుకు పోవడానికి ప్రయత్నించింది.

యెలాగో తెల్లవారింది. తూర్పుకిరణాలు సోకుతూనే అది మెల్లిగా గూట్లోంచి బయటికొచ్చింది. ఓసారి బిక్కుబిక్కుమంటూ చుట్టూ చూసింది. యెక్కడయెలాంటి కేకలూ వినిపించడం లేదు. ఆ ప్రదేశమంతా పూర్తిగా నిర్మానుష్యమై పోయింది.

తోటిపావురాలకోసం మనసు అప్పటికే అంగలార్చనారంభించింది. తన జతపావురం చేసిన తప్పిదాన్ని యెప్పుడో క్షమించేసింది. వాటికోసం వెతుక్కుంటూ అక్కడ్నించి బయల్దేరింది.

అయితే దానికి తోటిపావురాలు యెక్కడా కనిపించలేదు. వెతికినంతసేపు వాటికోసం వెతికి చివరికి ఓ చెట్టుమీద వాలింది. అకస్మాత్తుగా దానికి బోలెడు దిగులు ముంచుకొచ్చేసింది. దిగుల్తో పాటు ఆశ్చర్యం కూడా వేసింది.

యేమైంది యీ పాడుమనుషులకి?

హఠాత్తుగా యేం మాయరోగం ముంచుకొచ్చింది?

ఇంతకీ తన తోటిపావురాలన్నీ యేమై పోయాయి?

అదలా దిగులుగా కూచుని ఆలోచిస్తుండగానే వున్నట్టుండి పెద్దపెట్టున యెవరిదో వెర్రికేక వినిపించింది. దాంతో అది వులిక్కిపడి తల అటువైపు తిప్పిచూసింది.

యెవరో ఆడపిల్ల. నిండా పన్నెండేళ్ళు కూడా వుండవు. భుజం మీదనుంచి వేలాడుతున్న తుండుగుడ్డలో యేదో మూటగట్టుకుని వెర్రికేకలు పెట్టుకుంటూ తన కూచున్న చెట్టువైపు పరిగెత్తుకుంటూ వస్తోంది. ఆమె పెడుతున్న కేకలకు తన వంట్లోని రక్తమంతా గడ్డకట్టుకపోతున్నట్టనిపించింది దానికి.

ఆ పిల్లవెనకే నలుగురు దున్నపోతుల్లాంటి మగాళ్ళు పెడబొబ్బలు పెట్టుకుంటూ వస్తున్నారు. ఆ నలుగురి చేతుల్లోనూ బారాటి కత్తులున్నాయ్.

"కొట్టండి....నరకండి....చంపండి.....' ఇవీ ఆ నలుగురూ పెడుతున్న పెడబొబ్బలు.

ఆ పిల్ల వాళ్ళకందకుండా పరిగెడుతోంది.

అయితే ఆమె ఆ చెట్టుకిందికొచ్చేసరికే వాళ్ళ చేతుల్లో చిక్కిపోయింది. వెంటనే వాళ్ళ కరవాలాలు పైకి లేచాయి.

చివరిసారిగా ఆ పిల్ల ఒక్క వెర్రికేక పెట్టింది.

హృదయవిదారకంగా వినిపించిన ఆ కేక మధ్యలోనే ఆగిపోయింది.

ఆ పిల్ల తలా, మొండెం వేరు వేరుగా నేలమీద పడ్డాయ్.

వెంటనే ఆ నలుగురూ పిశాచాల్లా నవ్వుతూ ఆ శవం చుట్టూ కరవాలాలు తిప్పుకుంటూ కాసేపు రాక్షసతాండవం చేశారు. ఆ తర్వాత అదృశ్యమై పోయారు.

అంతవరకూ ఆ చెట్టుమీద మంచుముద్దలో గడ్డకట్టుకుపోయిందల్లా కాసేపటికి దాని వంటిమీద తెలివొచ్చినట్టైంది. తక్షణం అక్కడ్నించి పారిపోవాలన్న ధ్యాసలో గబుక్కున రెక్కలు విప్పింది.

అయితే అంతలోకే దాని చూపులు నేలమీద ఓ చోట అట్టే నిలిచిపోయాయి.

ఆ పిల్ల శవం పక్కనే నూకలు చెల్లా చెదురై పడున్నాయి.

ఆ నూకలకోసమే ఆ పిల్ల ప్రాణాలకు తెగించి తన యింట్లోంచి బయటికొచ్చింది. యెలాగో అవి సంపాయించగలిగిందిగానీ వాటిని తుండుగుడ్డలో మూటకట్టుకుని యింటికి తెస్తుండగానే ఆ నలుగురు రాక్షసులు చేతుల్లో చిక్కిపోయింది. చివరిక్షణం వరకూ ఆమో ఆ నూకల్ని మాత్రం వదల్లేదు. ఆమె ప్రాణాలు పోతూనే ఆ నూకలన్నీ చెల్లా చెదురై కిందపడిపోయాయి.

చనిపోయిన ఆ పిల్ల మతం యేదైనా కావచ్చు ఆమెను చంపిన నలుగురి మతం యేదైనా కావచ్చు. కానీ, మృత్యువుకు మాత్రం మతం లేదు ఆమెపక్కనే నేలమీద పడున్న ఆ నూకలక్కూడా మతం లేదు.

ఆ నూకల్ని చూస్తూనే అది చెట్టుమీదనుంచి రివ్వున దిగొచ్చి ఆవురావురమంటూ వాటిని యేరుకొని తినెయ్యడం మొదలెట్టింది. ఆ పక్కనే రెండుముక్కలై పడున్న ఆ పిల్ల శవం దాన్నింక యెంతమాత్రం భయపెట్టలేదు.

ఆకలిమీదుండడంతో ఆ నూకల్నేరుకు తింటంలో యెంతగా అది మునిగిపోయిందంటే వెనకనుంచి తన్నవై పే చప్పుడు చేయకుండా వస్తున్న గండుపిల్లిని యెంతమాత్రం గమనించలేక పోయింది. ఆ గండుపిల్లి కూడా బహుశా దాన్లాగే ఆకలిమీదుందేమో ఒక్కసారిగా వచ్చి ప్రళయంలా దానిమీద పడిపోయింది. యేంజరుగుతుందో అర్థం చేసుకునే లోపలే దాని మెడ గండుపిల్లికోరలకు చిక్కిపోయింది.

తప్పించుకోవడానికి అది గిజగిజలాడింది.

అయినా లాభం లేకపోయింది.

రెక్కలు టపటపా కొట్టుకుంది.

అయినా లాభం లేకపోయింది.

కాళ్ళు రెండూ తన్నుకుంది.

అయినా లాభం లేకపోయింది.

ఆ పిల్ల శవంపక్కనే దాని యీకలు కుప్పలుగా పడ్డాయి.

తెల్లని దాని రంగు యెర్రగా మారిపోయింది.

యెవరి నోటికీ అందని ఆ నూకలు మట్టిలో కలిసిపోయాయి.

# నాలుగుకాళ్ళ మండపం

## మధురాంతకం నరేంద్ర

నగరం నుంచి ఇంగ్లీషు దినపత్రికల్ని మోసుకొచ్చిన పేపర్ వాన్ నాలుగు కాళ్ళ మండపం దగ్గరికి రాగానే హారన్ మోగించడం మొదలెట్టింది. అక్కడి నుంచి ఆ పేపరు ఏజంటు కార్యాలయం అరఫర్లాంగు దూరంలో ఉంది. ఆ అరఫర్లాంగు దూరం పొడవునా హారన్ మోగిస్తూ వెళ్ళడం ఆ వాన్ డ్రైవరు కలవాటు. నిద్రపోతున్న పేపర్ కుర్రాళ్ళకు అదే మేలుకొలుపు

నాలుగుకాళ్ళ మండపం దగ్గర, పాత చావడి మొండిగోడల పక్కన పడుకున్న రంగమ్మ పేపరువాన్ హారను వినిపించగానే విసుగ్గా ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుంది. కనురెప్పల్ని విడివడనివ్వకుండా అడ్డం పడుతున్న కంటిపుసుల్ని రెండు చేతుల్లోనూ తుడుచుకుంటూ, సగం కనురెప్పల్ని బలవంతంగా పైకి కదల్చి రోడ్డుకేసి చూపులు సారించింది.

ఆకాశం నుంచి నేలకు దిగిన నునులేత మంచుతెరలకవతల, నాలుగు రోడ్ల కూడలిలో తీగలకు వేలాడుతున్న సోడియం వేపర్ లైటు చుట్టూ నాలుగైదు రెక్కల పురుగులు గిరికీలు కొడుతున్నాయి. షట్టర్లు దించిన అంగళ్ళ పక్కన మూరెడు పొడవున్న సిమెంటు చప్టాలపైన కొన్ని మానవ శరీరాలు ముడుక్కుని పడుకుని గురకలు తీస్తున్నాయి. వాళ్ళ మధ్య అక్కడొకటి అక్కడొకటిగా ఆవులు, దూడలు కొన్ని పడుకుని, మోరలు పైకెత్తుకుని, నెమరేసుకుంటూనే జోగుతున్నాయి. ఎడమ వైపున్న మురికి కాలవ పక్కన పందిపిల్లలు రెండు బురదమట్టిని కెలుకుతున్నాయి. పాత చావడి గోడ చివర్లో నిలబెట్టిన రిక్షాలో రిక్షావాలా తూగుతున్నాడు.

రంగమ్మ తానంతవరకూ కప్పుకున్న బొంతలోంచి తన శరీరాన్ని ఈవలికి లాగి, తన పక్కన పడుకున్న శాస్త్రినోసారి కుదిపి చూసింది. చీకటి రంగు దుప్పటిలో దూరి నిద్రపోతున్న ఆ శరీరం అటూ ఇటూ పొర్లింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో ఉవ్వెత్తుగా ఎగిసిపడుతున్న ఆ శరీరానికి పక్కన పొత్తిళ్ళలో పడుకున్న పసికందు రొమ్ము కరుచుకుని చీకుతూ నిద్రపోతోంది.

తన కడుపులో పేపులు అరుస్తున్న శబ్దం రంగమ్మకు స్పష్టంగా వినిపిస్తోంది. అరిచేతితో కడుపుపైన రుద్దుకుంటూ "టీ డేగ్సా దయాళింకా రాలేదు టీ కడుపులో పడితేగానీ ఒంట్లోకి ప్రాణరాదు" అంటూ గొణుక్కొంది ఆమె.

గంట గణగణలాడించుకుంటూ రిక్షా ఒకటి రైల్వేస్టేషను వైపు పరుగులు తీస్తోంది. కిరోసిన్ వాసనల్ని విరజిమ్ముతూ ఆటో ఒకటి బస్టాండువైపు ఉరకలు పెడుతోంది.

చుట్టూ నిద్రపోతున్న వ్యక్తులందరినీ పరకాయించి చూసింది రంగమ్మ. మందులషాపు షట్టరు పక్కన ముక్కుముసలాయన నిద్రపోతున్నాడు. అతడెప్పుడొచ్చి పడుకున్నాడో గుర్తుకు రావడం లేదామెకు. అంటే రాత్రి మలిజాము గడచిన తర్వాత కాస్సేపు తాను ఆదమరచి నిద్రపోయి ఉండొచ్చునన్న విషయం మాత్రం ఆమెకప్పుడు స్ఫురించింది.

మందులషాపు పక్కన నూనెబంకు ముంగిటిలో, రోడ్డు పైన, దుమ్ములోనే పడుకుని ఉన్నాడు నామాలాయన. ముక్కుముసలాయన లాగే నామాలాయన కూడా దాదాపు నెలదినాల నుంచి అక్కడికే చేరుకుంటున్నాడని రంగమ్మకు తెలుసు.

నూనెబంకు పక్కనున్న ఫోటో స్టూడియో గ్రిల్స్‌నానుకుని అయిదారు మంది మగవాళ్ళు వరుసగా పడుకుని నిద్రపోతున్నారు. రోడ్డు కటువైపున టీ అంగడి తలుపుల పక్కన మరో అయిదారు శరీరాలు గురకపెడుతున్నాయి. కూడలికిటువైపున, చావడి, పక్కనున్న అద్దాలబండి మెట్లపైన బేల్‌దారీ బక్కాయన కుటుంబం నిద్రపోతోంది. రోడ్డు కటువైపున వరుసగా ఉన్న అంగళ్ళ షట్టర్ల పక్కన ఒకరి వెంట మరొకరుగా వరుసగా కొంతమంది వ్యక్తులు పడుకుని ఉన్నారు. కూడలి నుంచి తూర్పువైపుకెళ్ళే బండ్ల వీధిలో రెండువైపులా గుంపులు గుంపులుగా కొందరు ముసుగులు కప్పుకుని నిద్రపోతున్నారు. ఉత్తరపు దిశకెళ్ళే మునిసిపల్ ఆఫీసు రోడ్డుకొకవైపున మురికికాలువ పొంగి ప్రవహిస్తోంది. ఇంకోవైపున రోడ్డులోకే చొచ్చుకొని వచ్చినట్టున్న హనుమంతుడి గుడి పక్కన ఎవరూ పడుకునే సాహసం చేయలేదు.

రంగమ్మ పడుకున్న చోటునుంచి బండ్ల వీధిని తప్పించి మిగిలిన మూడు వీధులూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. దాదాపు నిర్మానుష్యంగా ఉన్న వీధుల్లో చీకటిని లోనికి రానివ్వకుండా కాపలా కాస్తున్న సైనికుల్లా ట్యూబ్‌లైట్లు వెలుగుతున్నాయి.

నిద్రపోతున్న మనుషుల్ని చూస్తే రంగమ్మకు చాలా కోపంగా ఉంది. నిన్నటి రాత్రి రెండు పాలిథిన్ కవర్లు ఖాళీచేసి ఉంటే, తాను కూడా మిగిలిన వాళ్ళలాగే ఒళ్ళుమరచి నిద్రపోగలిగి ఉండేదన్న విషయం గుర్తుకురాగానే పైసా అయినా తన దగ్గర లేదన్న సంగతి జ్ఞాపకం రావడంతో ఆమెకు ఒళ్ళు మండిపోయింది. తన పక్కన పడుకున్న వ్యక్తిని మరో సారి విసవిసా కుదుపుతూ "ఏయ్ రాజీ! తెల్లారిపోయింది. లే పైకి" అంటూ విసుక్కొంది.

ఇంతలో పెద్ద బాడీ ఉన్న లారీ ఒకటి కారుబారు చేసుకుంటూ కూడలి మధ్యలోకి వచ్చి నిల్చింది. లారీలోంచి నిక్కరు తొడుక్కున్న క్లీనరు కుర్రాడు రోడ్డుపైకి దూకేశాడు. ఫోటో స్టూడియో దగ్గర పడుకున్న గుంపు దగ్గరికెళ్ళి అందరినీ లేపి కూచోబెట్టాడు. వాళ్ళ మధ్య సంప్రతింపులు జరిగాయి. తరువాత వాళ్ళందరూ లారీపై కెక్కారు. లారీ పెద్దగా శబ్దం చేస్తూ వెళ్ళిపోయింది.

పాత చావడి గోడ పక్కన రిక్షాలోనే పడుకుని తూగుతున్న రిక్షావాలా ఉలిక్కిపడి నిద్రలేచి, తలకు పాత టవలు చుట్టుకుని రిక్షాను రైల్వే స్టేషను వైపు కదిలించాడు.

"ఒసే నిద్రమొగమ్మా, లెయ్యేపైకి.... నాలుగుకాళ్ళ మండపం కాడ తెల్లారి జాము బేరాలు మొదలైపోయినాయి....' అంటూ రంగమ్మ రాజీకి సుప్రభాతం పాడింది. రాజీ బలవంతంగా కళ్ళు విప్పి, పాపాయి నోట్లోంచి రొమ్మును వేరు చేసింది. తరువాత దాని బుగ్గమీద పెద్దగా శబ్దం చేస్తూ ముద్దు పెట్టుకొంది.

రంగమ్మ రొంటిలోంచి చిన్న గుడ్డసంచిని ఈవలికి లాగి చేతినందులోకి జొనిపి, పొగాకుకాడ నొకదాన్ని పైకి తీసింది. పడకపక్కన పెట్టుకున్న చెంబులోని నీళ్ళతో నోరు పుక్కిలించి ఊసి, పొగాకు కాడను పళ్ళ మధ్య ఇరికించింది.

దూరంగా రోడ్డుపైన వీధి దీపాల వెలుతుర్లో నీడని జాలువార్చుతూ ఓ ఆకారం నాలుగుకాళ్ళ మండపంకేసి రావడం కనిపించింది. తదేకంగా అటే చూడసాగింది ఆమె. చావడి దగ్గరికొచ్చాక నాలుగురోడ్ల కూడలిలో నిల్చొని చుట్టూ కలయజూశాడతను.

అతడు ముఖం చుట్టూ చుట్టుకున్న నల్లరంగు మఫ్లరు శరీరపు రంగుతో కలిసిపోయింది. దుబ్బు మీసాలకు అగ్గి తగులుతుందేమోననిపించేలా బీడీ పెదవుల మధ్య రగులుతోంది.

"నువ్వా మునిరాంరెడ్డీ! ఈ పొద్దు ఎందరు గావాల్లి?" అంటూ రంగమ్మ పలకరించింది.

మునిరాంరెడ్డి చావడికేసి నాలుగడుగులు వేసి, "నీ కంటబడిపోయినానా రంగమ్మత్తా! జుట్టంతా ముగ్గుబుట్టమాదిరిగా తెల్లబడిపోయినా, నీకంటి చూపు మాత్రం తగ్గలేదు" అంటూ బిగ్గరగా నవ్వేసి, "ఈ పొద్దు చానామంది వన్లేదులే! నలుగురు చాలు. అట్లాంటిట్లాంటోళ్ళు లాభం లేదు. సరైన మనుషులు గావాల్లి. నువ్వే చెప్పు ఎవర్ని లేపమంటావు?" అని ప్రశ్నించాడు.

రంగమ్మ వెనక్కు తిరిగి పొగాకు రసాన్ని చావడి గోడపైన ఉమ్మేసి, గొంతు సవరించుకుని "దిట్టమైన మనుషులు గావలిసినోడివి బాగా తెల్లారినాంక రాగూడదా అల్లుడూ! నాకవుతే ఈ డుండేవాళ్ళల్లో తెలిసింది ఇద్దరు ముగ్గురే! ఆ ముక్కుమొసలాయినా, నామాలాయినా, బేల్దారీ బక్కాయిన కుటుంబరమూ తప్పితే ఈడుండే మిగిలోళ్ళందరూ కొత్తోళ్ళే గదా! ఈ సీకట్లో ఎవుడు బలంగా ఉండాడో, ఎవుడా ఊనాసోడో ఎవుడికి తెలిస్తుంది?" అంది.

"ఆ సంగతి చెప్పేదానికేనా వక్కాకు బెట్టి పలకరించినావు?" మునిరాంరెడ్డి విసుగ్గా వెనుదిరగబోయాడు.

"ఉండుండు రెడ్డీ! ఒక మాట!.....' రంగమ్మ పైకి లేచి, కూడలిలోకెళ్ళి మునిరాంరెడ్డికి దగ్గరగా నిల్చుంది.

బీడి పీకను దూరంగా విసిరేసి, ఏమిటని ప్రశ్నిస్తున్నట్టుగా కళ్ళెగరేశాడతను.

"జయలక్ష్మి ఎట్లుండాది?" అని అడిగింది ఆమె.

"నువ్వు సరైన పెద్దమనిషేలే రంగమ్మా! భలే గిరాకీని తగిలించినావు. పొమ్మంటే

పోకుండా బంకమాదిరి తగులుకొనింది. నూటిర్వై ఇచ్చేదాంకా నా ప్రాణం తీసేసింది..." చెబుతున్న ధోరణిని బట్టి అతడు కోపగించుకుంటున్నాడో లేక ఆనందిస్తున్నాడో తేల్చి చెప్పడం కష్టంగా కనిపిస్తోంది.

"అయితే, అదిప్పుడు నీతో లేదా? ఆ మాట చెప్పు ముందు. అది సరేగానీ, పన్లోకి ఆడకూలోళ్ళువద్దా నీకు? అదో, నా కాడనే ఉందొక పిల్ల... "

"చాలు చాల్లే రంగమ్మా! నీతో లావాదేవీలు పెట్టుకునే ఓపరికం లేదు నాకు. " విసుగ్గా ఆమె మాటలకు అడ్డు తగిలాడు మునిరాంరెడ్డి. "ఒకసారి రుచి జూసినాంక గూడా నాకు బుద్ధి రాలేదనుకుంటూ ఉండావా నువ్వు! వస్తా తల్లీ! రంగంపేట కాన్నించి కడగాలరాళ్ళు తోలుకోనిరమ్మని పెద్ద రెడ్డి చెప్పినాడు. పదికంతా రాళ్ళతో ఇంటి ముందు కనబడకపోతే అగ్గయి పోతాడు. నా సంగతి నేను చూసుకుంటానుగానీ, నా ఎనక బడద్దు. ఆ జయలక్ష్మి ఉన్నన్నాళ్ళూ నా పెండ్లాం నన్ను ఆ పొయిలో పెట్టి, ఈ పొయిలో తీసి చంపేసింది. నీ గిరాకీలు నాకొద్దు. ..'

"ఒట్టి బెదురుగొడ్డు మాదిరి మాట్లాడద్దు రెడ్డీ! ఒకసారి మనిషెట్లుండాదో సరిగా జూసిపో. మల్లంక నన్ను నిష్టూరం చేస్తే లాభం లేదు?" అంటూ రంగమ్మ అతడిని ఊరించడానికి ప్రయత్నించింది.

అతను గిరుక్కున వెనుదిరిగి, బండ్లవీధి వైపుకెళ్ళిపోయాడు

ఒకటి రెండు నిమిషాలసేపు ముందుకెళ్ళిపోతున్న అతడివైపే తదేకంగా చూసి, ఆ తరువాత బిగ్గరగా నిట్టూర్చి వెనుదిరిగింది రంగమ్మ దుప్పటి కప్పుకుని తనకేమి పట్టనట్టుగా నిద్రపోతున్న రాజీని చూడగానే ఆమెకు ఒళ్ళు మండిపోయింది. కోపంతో పళ్ళు పటపటలాడించి, "దొంగలంజ.... బసివిముండ....' అని రెండు మూడు తిట్లు ప్రసారం చేసి, విసుగ్గా రాజీకేసి కాలు జాడించింది.

రాజీ ఉలిక్కిపడి నిద్ర మేలుకొంది. ముఖంపైనుంచి దుప్పటి తప్పించి, బిత్తర చూపులు సారించింది.

"ఇంత తూగుమూలితో ఎట్ల బతికి బట్టగడతావే పెద్దమ్మా! చాలనిదానికి దగుపుగా ఒక బిడ్డను గూడా కనుక్కొని కూచోనుండావే! ఆ బయమైనా లేదు గదా నీకు!" అంటూ రంగమ్మ తన యథాస్థానంలో గొంతుక్కూచుంది.

తానేదో పెద్ద పొరబాటే చేసి ఉంటానన్న నమ్మకం కలగడంతో రాజీ బిక్కమొహం పెట్టుకుని లేచి కూర్చుంది. పొత్తిళ్ళలోని బిడ్డపైన గుడ్డను సవరించుతున్నట్టుగా నటిస్తూ రంగమ్మ కేసి కొనచూపుల్ని సారించింది.

పొగాకు నవతలికి ఉమ్మేసి, రంగమ్మ గొంతు సవరించుకుంది. "నాలుగు దినాలుగా ఈడ మనం అగోరిస్తా ఉండామని తెలుసు. చేతిలో ఉన్న దుడ్డు నిన్న మాపిటేలతో అయిపాయిందని తెలుసు. ఈ పొద్దు పని దొరక్కపోతే మద్దానం ఏం తిందామనుకోనుండావు నువ్వు అని అడగతాఉండాను. ఆ దిగులుంటే నీకు నిద్రెట్లా పడతాది? నీకోసరమని నేను వచ్చేపొయ్యే వాళ్ళనంతా కాపెట్టుకోనుంటే, నువ్వు బెల్లం కొట్టిన రాయి మాదిరిగా నిగడదీసుకొని పండుకుంటే జరిగేదెట్లా? మూతీ గీతి కడుక్కోని

కూచుంటే గదా, ఈడొకనప్పుడుండాదని అందరికీ తెలిసేదీ? నేను చెప్పి నప్పుడే లేచి రెడీగా ఉండుంటే మునిరాంరెడ్డి చూసుండును గదా! మునిరాంరెడ్డంటే ఎట్లాంటోడో తెలుసునా నీకు? తెలియదు. తెల్లారితే నూటాపదకొండు పనులు జరగతాయి వాని చేతులమీదుగా. ఏదో ఒకదాన్లో నిన్నిరికించేసుండును. అట్లాంటోన్ని నమ్ముకోనుంటే నీ బతుకు పచ్చగా జరిగిపొయ్యుండును గదా! మొన్నటకి మొన్న...." మునిరాంరెడ్డి, జయలక్ష్మిల ఉదంతం జ్ఞాపకం రావడంతో రంగమ్మ తన ఉపన్యాసాన్ని ఆపేసింది.

బండ్ల వీధిలోంచి నలుగురైదుగురు వ్యక్తుల్ని వెంటబెట్టుకుని, వాళ్ళ ముందే నడుస్తూ రైల్వేస్టేషను వైపుకెళ్ళిపోయాడు మునిరాంరెడ్డి.

మెడికల్ షాపు ముందు పడుకున్న వాళ్ళల్లోంచి ఇద్దరు నిద్రలేచి బీడీలు వెలిగించుకుంటున్నారు. వాళ్ళు మాట్లాడుకోవడం వినిపించి నిద్ర మేలుకున్న మరో ఇద్దరు పాత టైరుకు నిప్పంటించి చలికాచుకుంటూ కూర్చున్నారు. గాంధీ రోడ్డులోని మార్కెట్టు దగ్గర మెల్లిమెల్లిగా సవ్వడి మొదలయింది.

ఇనుప తీగల చట్రంలో బిగించిన టీ డేగిశాను రగులుతున్న కుంపటితో బాటు ఒకచేత పట్టుకుని, మరో చేత్తో నీళ్ళబకెట్టు నెత్తుకుని ఒక వ్యక్తి నాలుగుకాళ్ళ మండపం దగ్గరికొచ్చేశాడు.

"దయాళన్నా! నీ కోసరమే చూస్తా ఉండాను. నా ముఖానో టీ కొట్టు....' అంటూ ఆహ్వానించింది రంగమ్మ.

దయాళ్ టీ సరంజామాను నేలపైన పెట్టి, బకెట్‌లోని నీళ్ళతో గాజుగ్లాసును కడుగుతూ, "ఈ పొద్దు జనమెందుకో తక్కువగా కనబడతా ఉండారు" అంటూ గొణిగాడు.

"ఇంకా మొబ్బుగానే ఉండాది. తెల్లారీ తెల్లారక ముందే నీ కోసరమని జనాన్నెడనుంచి తెచ్చిపెట్టేది? ఎంతసేపులే! చూస్తా ఉండంగానే తెల్లారిపోతాది. ఇసికేస్తే రాలనట్టుగా మనుసులు కూడా వచ్చేస్తారు. చిటికేసేంత సేపులో టీ అంతా ఖర్చయిపోతాది." టీ గ్లాసు చేతికొచ్చాక మాట్లాడడం ఆపేసి, టీనీళ్ళు చప్పరించసాగింది రంగమ్మ.

దయాళ్ మరోటీ గ్లాసును రాజీ వైపు చాపాడు.

రంగమ్మకు తన దగ్గర ఒకే ఒక రూపాయి మిగిలి ఉందన్న సంగతీ, రెండు టీగ్లాసులకూ తానే డబ్బుల్ని చెల్లించాలన్న సమాచారమూ స్ఫురించాయి. అడగకుండానే రాజీకి కూడా టీ ఇచ్చిన దయాళ్‌పైన ఆమెకు చెప్పలేనంత కోపం వచ్చింది. కానీ, తన కోపాన్ని వెలిబుచ్చడానికది అదును కాదని మౌనంగా ఉండిపోయింది.

ఎప్పుడు నిద్రలేచాడో ఏమో, నామాలాయన టీ కుంపటి దగ్గరికొచ్చి నేలపైనే గొంతుక్కూచుని, "నా క్కూడా టీ" అంటూ అర్డరిచ్చాడు. గువ్వ తొక్కిన కొబ్బరికాయలా పొట్టిగా, పీలగా, వక్రంగా, వింతగా ఉన్నాడతను. "ఏం రంగమ్మా! రెండు మూడు దినాలుగా చూస్తా ఉండాను. ఎవరీ కొత్త పిల్లి? చుట్టమా?" అని వాకబు చేశాడు.

"చుట్టమూగాదు, సొంతమూగాదు, ఈ బాసోలి సంగతేమని చెప్పేదునులేన్నా! నాలుగు దినాల ముందు తెలిసినోళ్ళ పిల్ల ఒకతి తీర్థమాడితే గవర్మెంటాసుపత్రికి పొయినాన్లే! ఆడ తగులుకున్న గచ్చారం ఇది. అయినా, ఒకర్నని లాబం లేదన్నా! నన్ను

నేను చదావుల్తో గొట్టుకోవాల్ల...." ఖాళీగ్లాసును నేలపైన పెట్టి, చివరి రూపాయిని దయాళ్ చేతిలోకి గిరవాటేసినట్టుగా విసిరికొట్టి మరోసారి నిట్టూర్చింది రంగమ్మ. "ఆ పిల్లకు కడుపులో బిడ్డ తిరక్కపోయిందని ఆపరేషను చేసినార్లే! చూసుకునేదానికి మనిషి లేదని వాళ్ళు అంగలారిస్తే, పోతే పోనీ అని రెండు రాత్రుళ్ళు అడనే అగోరించినా, ఊరికే కాదనుకో. అన్నం బెట్టి దినానికి పదిచ్చినారు. పోయిన బేస్తవారం, సరింగా రెండో ఆట ఇడిసిపెట్టే టయిం, గేటుకాడ కాలాంబులాం అని గలాటా! ఏందబ్బా అని పొయి చూసినా, చేతుల్లో పసికందునెత్తుకొని ఈ పిల్ల ఒక మొగమనిషితో పోరకలాడతా ఉంది. ఉన్నమాట ఉన్నట్టుగా చెప్పాలగదన్నా! వాడసలు మొగుడు గాదేమోనని నాకు అనుమానం. లేకపోతే అదంత గట్టిగా పట్టక మల్లాడ్సిన పనేముండాది? మొగుడయినోడు యాడికి పోతాడు? గుటానికి కట్టేసిన గొడ్డుమాదిరి తిరిగి తిరిగీ మళ్ళా తావు చేరకపోతాడా? వాడసలు మొగుడేనా అని అడిగితే, ఈ పిల్ల జబాబు చెప్పనంటిందే?"

నామాలాయన రాజీకేసి చూశాడు. రంగమ్మ చెబుతున్న సంగతితో తనకేమీ సంబంధం లేదన్నట్టుగా ఆమె ఎటో చూస్తోంది.

" ఆ అర్ధరాత్రిపూట వాచ్‌మేన్‌కు ఒకటో రెండో చదివించి, దొంగతనంగా వార్డులోకొచ్చినాడంట వాడు. ఎందుకొచ్చినాడో ఏమో నాకు తెలవదు వాడు పోతానంటే ఇది వదిలిపెడితేగదా! బిన్నాగా బయటికి పొమ్మని వాచ్‌మేనూ, తెల్లారితో మళ్ళా వస్తానని ప్రమాణాలు చేస్తావాడూ, చచ్చి గీపెట్టినా వదలనని, కావాలంటే అప్పటికప్పుడే వానితో వచ్చేస్తానని ఇదీ.... ఎప్పుడు బడితే అప్పుడు బాలింతరాల్ని పంపించేస్తే డాక్టర్లు తంతారని వాచ్‌మేన్లూ.... అదీ జగడం వాచ్‌మేన్ ఇట్ల కాదురా అని వాని చేయి పట్టుకోని బరబరా లాక్కుంటూ పోయి గేటుకాపక్కతోసేసినాడు. అదే పోవాటం. ఆ మొగుడయినోడు మళ్ళా ముఖం జూపించలేదు. ఈ బాసోలి కండ్లల్లో నీళ్ళు పెట్టుకుని ప్రాణాచారం చేస్తా కూచునింది. పోతేపోనీ మనమే ఒక దోవ చూపిద్దామని ఇట్ల తోడుక్కొచ్చినాను. మూడు దినాలుగా ఈడ్నే అంగలారస్త ఉండాము. వృథాగా తిని తిరగలాడతా ఉండాం. మన దగ్గిరుం డేది దాంచిపెట్టుకుంటే చూసేవాళ్ళకెట్ల తెలుస్తాది? ఒళ్ళు మినమినా మెరస్తా ఉండేటప్పుడు కొంచెం తెలివిగా బతికితే మళ్ళ బయపడాల్సిన పని ఉండదు. జోరీగ మాదిరి దీని చెవుల్లో గీ పెడతా ఉండాను. దీని చెవికెక్కాటం లేదు...."

నామాలాయన ఖాళీ చేసిన గ్లాసును చేతికి తీసుకుని, అతడందించిన చిల్లర డబ్బుల్ని భుజానికి వేలాడుతున్న పొడుగుదారాల నీలిరంగు సంచిలో వేసుకుని, టైరు కాలుతున్న వైపు కదులుతూ ఓసారి బిగ్గరగా "టీయ్" అంటూ కేకేశాడు దయాళ్.

"ఆమాట నాకు ప్రత్యేకంగా చెప్పాల్నా రంగమ్మా! పుట్టి భూమ్మీద పడినప్పటినుంచీ ఈ ఊర్లోనే పడి దొర్లాడినోడిని. నువ్విప్పుడు చూస్తా వుండే సిన్మాకొటాయిల కాన్నించీ రైలుటేషనూ, బస్టాండులూ అన్నీ నా కండ్లముందర్నే కట్టినారు. అయినా, దినబత్తెం కోసమని ఇప్పటి మాదిరిగా అంగలార్చిందెప్పుడూ లేదనుకో. ఈడేమో తిరణాల జరగతా ఉన్నట్టు చుట్టుపక్కల పల్లెల నుంచీ గుంపులు గుంపులుగా జనం ఒకటే రావటం. ఎంత వానలు పడకపోతే మాత్రం భూమి బుట్టా పరిగిలదోలేసి, ఇట్లా మన మీద పడితే

న్యాయమేనా? ఇక్కడ మాత్రం నీళ్ళెక్కడుండాయి? ఆ గాంధీనగరమోళ్ళు రైల్వే కాలనీ నుంచి నీళ్ళు మోస్తా ఉండారు. ఈడేమైనా కూలీపన్లు కుప్పబోసుకోనుండారా? ఆ మేస్త్రీలకూ, గుమాస్తాలకూ ఎప్పుడు ఈ ఊరోడో, ఎప్పుడు పరాయోడో ఇరతం పరతం తెలస్తా ఉండాదా? వచ్చినోడంతా రాతికూసాల మాదిరి బలంగా ఉన్నవాళ్ళనే తొడుక్కోని పోతా ఉంటే మిగిలినోళ్ళేమై పొయ్యేదని? అట్లా చూడు. పెద్ద మిత్తవ మందిరిగా గోయింద రాజుల గాలిగోపురం ఎగజూసుకోనే ఉండాది.. ఈడేమో ధర్మగోవు ఒంటికాలిమీదే నడస్తా వుండాది ..'' తన గోడు వెళ్ళబోసుకున్న తర్వాత నామాలాయన అక్కడినుంచి పైకి లేచి తన స్థానం వైపు వెళ్ళిపోయాడు.

కూడలి దగ్గర చీకటి మెల్లమెల్లగా పలచబారుతోంది. ఎర్రని సోడియం వేపర్ దీపం క్షయరోగిలా పాలిపోయి కనిపిస్తోంది. దొంగల్లా అడుగు పెట్టిన ప్రభాత వాయువులు అప్పుడప్పుడూ మెల్లగా కదులుతున్నాయి. గాలి వీచినప్పుడల్లా దీపం కింద రాలిన పురుగుల రెక్కలు పైకెగురుతున్నాయి. దూరంగా మార్కెట్టు ముందు ఆగిన లారీలోంచి కూలీలు బుట్టల్ని దింపుతున్నారు. నాలుగుకాళ్ళ మండపం దగ్గరికి మెల్లమెల్లగా జనం చేరుకుంటున్నారు.

జానెడు పొడవున్న వేపపుల్లల కట్టలు రెండింటిని చేతబట్టుకుని అద్దాలాయన రంగమ్మ దగ్గరికొచ్చాడు. పాత కాషాయరంగు లుంగీ కట్టుకున్నాడతను. బట్టతల పుల్లలా ముఖానికంటుకున్న వెంట్రుకలు. ఫ్రేము విరిగిన కళ్ళజోడును దారంతో చెవులకు కట్టుకొని ఉన్నాడు. నరాలన్నీ పైకుబికిన కట్టె చేతులతో రెండు వేపపుల్లల్ని రంగమ్మవైపు చాపాడతను. ఒక పుల్లని రాజీకిస్తూ "చిల్లర లేదు పెద్దాయనా! రేపిస్తాన్లే" అంది రంగమ్మ. ఆమె సమాధానంతో సంబంధమేమీ లేనట్టుగా ముందుకు కదిలిపోయాడు అద్దాలాయన.

వేపపుల్లని కచకచా రెండుసార్లు నమిలి, పైకి లేచి కచేరీ గోడల పక్కన ఉమ్మేసి "మనిషంటే అద్దాలాయన మాదిరుండాల" అంది రంగమ్మ. "ఇంత ముసిలోడయినా ఇంకో మనిషి రుణంలో పొయ్యేదానికి ఆ ప్రాణం ఒప్పుకోదే! ఏడేడ తిరగతాడో, ఏడ పెరుక్కొస్తాడో ఏమో! తెల్లారేకాడికి ఇన్ని పళ్ళుదోము పుల్లలు తెస్తాడు. దుడ్డిస్తే తీసుకుంటాడు. ఈయకపోయినా ఏమనడు. రెండు మూడు రూపాయలుంటే దినం గడిపేస్తాడు. ఏ పొద్దయినా ఎవుడి ముందరైనా చెయ్యి చాపున్నా?.......'''' రెండు దినాలుగా ఈ రాజీ తన మీదే ఆధారపడి ఉంది కాబట్టి ఎంతగానో రుణపడిపోయింది. ఆ విషయం ఆమెకింతకన్నా స్పష్టంగా ఎలా చెప్పాలో తోచక రంగమ్మ మౌనంగా ఉండిపోయింది.

కూడలిలోని నియాన్‌లైట్ వెలగడం మానేసింది. వీధి దీపాలు కూడా ఆపయిపోయాయి. చీకటి పూర్తిగా నిష్క్రమించడంతో భళ్ళున తెల్లవారి పోయింది. తెరిచిన టీకొట్టులో బైలరు ముందు ఎర్రటి బనీను తొడుక్కున్న పయిల్వానులాంటి వ్యక్తి గ్లాసులు కడుగుతున్నాడు. గుంపులు గుంపులుగా వస్తున్న జనానికి స్థలమివ్వడం కోసమన్నట్టుగా పశువులు పైకి లేచి ఎటో వెళ్తున్నాయి. మురికి కాలవ దగ్గరి పందిపిల్లలెప్పుడు మాయమయ్యాయో తెలియడం లేదు. బొత్తాలూడిన చొక్కాలు, చినిగిన పంచలు, నలిగిన జుబ్బాలు, మాసిన గడ్డాలు, చెదిరిన జుట్లు వెలిసి పోయిన చీరలు, జిడ్డోడుతున్న

ముఖాలు, బీడీల పొగ, చుట్టల కంపు - నాలుగుకాళ్ళ మండపం దగ్గర సంరంభం ప్రారంభమై పోయింది.

బాగా పొట్టిదైన పై జామాపైన తనదిగాని చొక్కాని తొడుక్కున్న లావుపాటి వ్యక్తి ఒకడు రోడ్డుపైన తచ్చాడుతూ రంగమ్మకు కనిపించాడు.

"మస్తానూ......ఇక్కడ.... రా రా!" అంటూ అతడిని ఆహ్వానించింది ఆమె.

"ఈ పొద్దు నన్ను పిలిచినా గుణం లేదు రంగమ్మో చిన్నా చితకా పని గాదు. రోడ్డుపని. ముసిలీ ముతకా లాభం లేదు .. ....." మాట్లాడుకుంటూ ముందుకొచ్చిన మస్తాను సాహెబు రంగమ్మ పక్కన మరో వ్యక్తి కనిపించడంతో ఆగిపోయి, ఆ వ్యక్తిని పరకాయించి చూడసాగాడు.

రంగమ్మ వంకర నవ్వుని వెదజల్లుతూ "చూస్తే ఏమొస్తింది సాయిబన్నా! పని ఉంటే చెప్పు. ఎన్ని దినాలయినా వొక్రం లేకుండా పనిచేసే పిల్ల" అంది.

మస్తాను సాహెబు రాజీ కేసి కళ్ళార్పకుండా చూస్తూ "రోడ్డుపని ..... కావల్సింది ఆడకూలోళ్ళే! ఒకరు గాదు ఇద్దరు గాదు. ఆరు మంది. గుల్లకొట్టే పని మా సుబ్బరామ చౌదరికి కాంట్రాక్టొచ్చింది. ఊర్లో నాలుగు రోడ్లు మనవే! లారీల్లో గుల్ల తెచ్చి తోలేసినాం.... పదిరవై దినాల పని ...." అంటూ ఓ నిమిషం సేపు ఆగిపోయి, "ఆ పక్కనుండే పసిబిడ్డెవురు?"" అని ప్రశ్నించాడు.

అతడి ప్రశ్న వినగానే ఉలిక్కిపడి రాజీ బిడ్డపైన గుడ్డ కప్పింది.

"బిడ్డతల్లిని చూడద్దన్నా! ముక్కుమని మూలగనైనా మూలక్కుండా చీమిడి చీదినంత సుళువుగా బిడ్డను కని పక్కన పెట్టిన పిల్ల ......"

"బాలింతరాల్ని నా ఎదాన తోలితే ఎట్ల రంగమ్మో! ఎండలో చేయాల్సిన పని. కండ్లు తిరిగి పడిపొయ్యిందంటే ఆస్పత్రి చుట్టూ తిరిగేదానికి నా వల్ల కాదు. ఇంకో ఆరు నెలలు పోయినాకయితే చెప్పు. బిడ్డ కొంచెం పెద్ద దయుంటుంది. తల్లి పనీ పాటా చూసుకోవచ్చు. అప్పుడు పిలువు నన్ను. ఏదయినా ఒక పనిలో దూర్చేస్తాను. నీకు పని కావాలని అడిగితే అది మాత్రం నా వల్ల గాదు. చిటికేసినంత సేపు పని చేస్తే గంటసేపు రెస్టు కావాలంటావు. పోయిన తడవ మోల్డింగు పని పెట్టుకున్నప్పుడు పోరంబోకు పనోళ్ళని పిలచకపొయినానని మా పెద్దాయన కాసరబీసరమున్నాడు."

రంగమ్మ పిలుస్తున్నా వినిపించకోకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు మస్తాను సాహెబు.

రాజీని మరోసారి శల్యపరీక్ష చేసి చూసింది రంగమ్మ. నేరేడుపండులా నిగనిగలాడుతున్న శరీరం, సన్నగా ఉన్నా దృఢంగా కనిపిస్తున్న ఆకారం, తీరైన నిమ్నోన్నతాలు - పుట్టినప్పటి నుంచీ కాయకష్టాలకూ, పస్తులు రగడలకూ లోనైన శరీరమే అయినా, వయసు రావడం చేత వక్కానికొచ్చిన పండులా పెత్రేగిపోతున్న పిల్ల. ఇప్పుడే గిరాకీ లేకపోతే ఇంకెప్పుడుంటుంది? రంగమ్మ కొక్కసారిగా కొండంత ధైర్యం కలిగింది. మూడు రోజుల తన పెట్టుబడి వృథాగా పోదన్న నమ్మకం కలిగింది. "ఏయ్ రాజీ! ఎంతసేపని ఆ పుల్లను నములతావు. ఆ పక్క బోరింగుకాడికి పోయి మూతి గడుక్కోని రా పో! నీ అనుంటిదానికి

పనిచూపించలేకపోతానా నేను? ఇన్ని సమత్సరాలుగా ఎందురెందురికి దోవ చూపించలేదు. నీకేమీ బయిమొద్దులే తల్లా! కొంచెం ఆ తల్లో దూబానే పెట్టు. కంటికి నాణ్ణెంగా కూర్చో. మిగిలిందంతా నేను చూసుకుంటాను" అంటూ రాజీకి భరోసా ఇచ్చింది.

కూడలి దగ్గర జనసమ్మర్దం పెరిగిపోయింది. పదహైదిర్వై ఏళ్ళ నుంచీ యాభై అర్వై ఏళ్ళ వరకూ రకరకాల వయసున్న రకరకాల వ్యక్తులక్కడ గుమికూడిపోయారు. అక్కడక్కడా కొందరు ఆడవాళ్ళు కూడా ఉన్నారు. నలగ్గొట్టిన తాటిపట్ట నొకదాన్ని పాత డబ్బాలో వేసుకుని, గోడలకు వెల్లవేసే వాళ్ళు ఎక్కడపడితే అక్కడ కనిపిస్తున్నారు. కూలీలు కావలసినవాళ్ళు వచ్చి చూసి నచ్చిన కార్మికులను ఎన్నిక చేసుకుని, బేరాలు కుదిరితే వెంటబెట్టుకుని వెళ్తున్నారు.

ముఖం కడుక్కున్నాక రాజీ తల దువ్వుకుంటూ కూర్చుంది.

మాసిన నాలీసు పంచలు కట్టుకున్న ఇద్దరు వ్యక్తులు అద్దాల అంగడి దగ్గరకొచ్చి నిల్చున్నారు. వాళ్ళ ఒంటిపైన చొక్కాలు లేవు. భుజాలపైన తుండుగుడ్డలు మాత్రం ఉన్నాయి. మాసిపోయిన గడ్డాలు. జందెంపోగులు వేలాడుతోన్న బక్కచిక్కిన శరీరాలు.

"ఏం సామీ! ఈ పొద్దు మంచిదినమేనా?" అని అడిగింది రంగమ్మ.

ఆ ఇద్దరిలోనూ బాగా ముసలివాడుగా కనిపిస్తున్న వ్యక్తి చివాలున ఆమె వైపు తిరిగి, నీకిదే తగిన శాస్తి అన్నట్టుగా "అష్టమి-వేలు పెడితే కష్టాలే" అన్నాడు.

రంగమ్మ ముఖం ముడుచుకిని ఇవతలికి తిరిగి కూచుంది. బ్రాహ్మణులిద్దరూ మళ్ళీ తమ లోకంలోకి వెళ్ళిపోయారు.

"నిన్నెక్కడికెళ్ళావు? కనిపించనేలేదు." అడుగుతున్నాడు ముసలాయన.

"భవానీ నగర్లో తద్దినం. ఇంటికాడికే మనుషులొచ్చినారు" అన్నాడు పడుచువాడు.

"పోనీలే! నీ కోసం చాలాసేపు చూశాన్నిన్న....బైరాగి పట్టెడలో తద్దినం .... వస్తానన్న బ్రాహ్మణుడు ఎగ్గొడితే వెతుక్కుంటూ వచ్చినారు. గ్రాండ్‌గా జరిగిందిలే! యాభై దాకా గిట్టింది" అన్నాడు ముసలాయన.

"నిన్నటి సంగతి సరేలే! ఈ పొద్దు సంగతి చూడండి. ఇంత పెద్ద ఊర్లో ఒకరిద్దరైనా గుంతకల్లుకు టికెట్లు కొన్లేదా? వ్రతాలూ, ముహూర్తాలూ లేకపోతే పోనీ, తద్దినాలైనా దొరకవా అని ఆశ...." అంటున్నాడు పడుచువాడు.

విన్నంతసేపూ విని రాజీకి చేరువగా వచ్చి రహస్యం చెబుతున్నట్టుగా స్వరాన్ని తగ్గించి, "ఉపాతకం సాములు....శాస్త్రం సరిగ్గా చూసే విద్దే ఉంటే ఈడికెందుకొస్తారు? పార్టీలు ఇంటికాడికే వచ్చి ఉండవా? కంత్రీలు....చూసే వాళ్ళు ఏమారితే, మూటలు మోసేదానికి గూడా రెడీ అయిపోతారు....నాల్గైదేండ్లుగా చూస్తా ఉండాన్లే వీళ్ళని...." అంటూ సాగదీసింది.

రోడ్డుపైన రాకపోకల సంరంభం బాగా ఎక్కువైపోయింది. సైకిళ్ళూ రిక్షాలూ, వాన్లూ టౌను బస్సులూ రకరకాల శబ్దాలతో అక్కడ చేరిన జన ఘోషకు వాద్య సహకారాల్ని అందించసాగాయి. కూలీలందరూ పార్టీల కోసం ఎదురు చూస్తున్నారు. అయిదుమంది ఆడవాళ్ళను సమీకరించుకొని మస్తాను సాహేబు సున్నపు వీధి వైపు నడుస్తున్నాడు.

"ఆ పస్తాను సాయిబుకెంత గిమాకో చూసినావా రాజీ మనమిద్దరమూ పనికిరామింక. ఆ కొత్త నష్టన్న బాగుండాయంట. చేతిలో రెండు రూకలు గలగలమంటూ ఉంటే మాత్రం మనుషులకింత పెగ్గి పెరిగిపోవాల్నా? వీని బతుకెంతో నాకు తెలవదా? మొన్నటికి మొన్న ఆ పడిపోయిన మేలకళ చెరువుకాడినుంచి గుడ్డ భుజానేసుకోని, పెళ్ళాం బిడ్డలను తోలుకోని ఈ నాలుక్కాళ్ళ మండపం కాడికొచ్చినోడేగదా వీడు కూడా! వచ్చినప్పుడు కువారంగుండే తాపులోనే కూర్చోని గుక్కిళ్ళు మింగతా ఉంటే ధయిర్నం చెప్పింది నేనే గదా! ఆ మునిరాంరెడ్డిగాడికి కూడా మనం చెల్లని కాసులై పోయినామూ? ఆ జమ్మలమడుగు పక్క కొత్తూరు నుంచి వచ్చి రెడ్డో తొక్కుకుంటూ బతికిన దినాలిప్పుడు గవనముండాయా వానికి? లోకమెట్లుండాదో బాగా కండ్లు తెరిసి చూసుకోవే రాజీ! వాయసులో ఉండేటప్పుడు పీకిలినావంటే నీ బొంగుకు గూడా నా మాదిరే తెల్లవారిపోతది....." చెప్పడం ఆపి కాసేపు దాని ముఖంలోనే దృష్టిని కేంద్రీకరించింది రంగమ్మ. కనురెప్పలు ఆడడం తప్పితే ఆమె ముఖంలో మరే రకమైన చలనమేదీ కనిపించడం లేదు. రంగమ్మ బతుకెలా తెల్లారిందో తెలుసుకోవాలన్న ఉత్సుకత సైతం ఆమెలో కనిపించకపోయేసరికి రంగమ్మకు ఉక్రోషం ముంచుకొచ్చింది. ఇక నీ ముఖం చూడనన్నట్లుగా పక్కకు తిరిగి కూచుంది.

ఎప్పుడొచ్చి కూర్చున్నాడో తెలియదుగాని, ముక్కు మూసలాయన ఎదురుగా కనిపించాడామెకు. అతడు తింటున్న ఆహారాన్నంతా తానొక్కడే దోచుకుంటున్నట్లుగా అతడి ముక్కు వికృతంగా పెరిగి ఉంది. ముఖంలోని మిగిలిన అవయవాలన్నీ ముక్కును చూడలేక భయంతో ముడుచుకుపోయినట్లు కనిపిస్తున్నాయి. రంగమ్మ తనవైపు తిరగగానే అతడు "ఇహిహి" అంటూ పళ్ళికిలించి, "కొంచెం పొగాక్కట్టె ఉంటే ఇస్తావా తల్లీ?" అంటూ చేయి చాచాడు

రంగమ్మ తన గుడ్డ సంచిలోంచి చిన్న పొగాకు కట్టె తీసి అతనికిచ్చింది. పొగాకు రసం గొంతు దిగిన తరువాత ముసలాయన అర్ధనిమీలిత నేత్రుడై "పొద్దింత పైకొచ్చింది. ఎండింకా రాలేదే! చూసేదానికి మొబ్బు పట్టినట్లుగా ఉండాది ఈ పొద్దేమైనా వాన కురుసునా?" అంటూ ప్రశ్నించాడు.

రంగమ్మ తూర్పువైపు తిరిగి ఆకాశం కేసి చూసింది. నల్లటి మేఘాల గుంపు ఆకాశమంతా కనిపిస్తోంది.

"ఈ పాపం చేసుకున్న కొంపలో పనుల్చి పోగొట్టే వానలు మాత్రం పడతానే ఉండాయి. ఏందో పెద్ద మేలు చేసే మాదిర పొద్దున్నే రొండుచినుకుల్ని టపాటపా రాల్చి, అందర్నీబెదరగొట్టేసి, పనులాపేయించినాక చూస్తా. ఎండ దిగొస్తుంది" అంటూ గొణుక్కున్న తర్వాత, అంతపనీ జరిగి వర్షం పడితే ఈరోజు గడవడమెలాగన్న ప్రశ్న స్ఫురించిందామెకు. ఇలాంటి సందేహాన్ని రేకెత్తించిన ముక్కు ముసలాయనకు పొగాకు కట్టనిచ్చినందుకు తనను తానే తిట్టుకోసాగింది రంగమ్మ.

"ఏం రంగమ్మా! ఎవురీ కొత్తపిల్ల?"

గళ్ళగళ్ళ డ్రాయరు కనిపించేలా పంచ పైకెత్తి కట్టుకుంటూ కనిపించాడు మేస్త్రీ

కుప్పుస్వామి, జెండాకొయ్యిలా సన్నగా ఉన్న అతని శరీరానికీ, లావుగా పొట్టిగా ఉన్న అతడి చేతివేళ్ళకూ, కాలివేళ్ళకూ సామ్యం కుదరడం లేదు.

రంగమ్మ దుమికినట్టుగా లేచి నిల్చుని "రా కుప్పుసామీ! పొద్దున్నుంచి నీకోసమే కాసుకోని కుచ్చోనుండాను. రాత్రి రెండో ఆట ఇడిసి పెట్టేదాంకా రైలుస్టేషన్లో పండుకోనుంటిమి. నువ్వేడ చెయ్యిదొరక్కపోతావో అని, గుర్కా కర్ర కొట్టుకుంటూ పోయినాక ఈ వావిడి దగ్గిరకొచ్చి పండుకొంటిమి...." అంది రంగమ్మ.

"నాకోసరమే చూస్తా ఉండేదానివా! బంగా మెరమెచ్చుల మాటలు చెప్పొద్దు. నీకు ఎవ్వరైనా కొత్తోళ్ళు తగిలినప్పుడు ముందుగా కనబడే మనుషుల పేరు ఉండాలని నాకు తెలుసు. అందరూ వద్దనుకున్న కడుబుడసోళ్ళుంటే అప్పుడు కదా నేను నీకు కనబడేది" అన్నాడు కుప్పుస్వామి.

"నువ్వెందుకట్ల మాట్లాడతా ఉండావో నాకు తెలుసులేవె కుప్పుసామి! ఆ పర్మిట్ తీసి తొలిగా మాపించలేదనే నీకు కోపం. ఆనాటికి నీకోసరమని మనేగాడినుంచి మూడు దినాలు తప్పించుకోసి తిరిగినాను. నువ్వెప్పుడైనా ఒంటరిగా కనపడితే గదా! అయినా, జరిగిపోయిన కతంతా ఇప్పుడెందుకు? ఇప్పుడు పనేదేమైనా ఉంటే చెప్పు .."

"చెప్పేదానికేముందాది? ఊళ్ళో దియేటరుకాడ ప్లాట్లు కడతా ఉండారు. ఆరేడు నెలల పని. వానా మంది కూలోళ్ళుగా వాళ్ళు. నువ్వేమో భారీ పనులకు పనికిరావు. ఇదేమో పసిబిడ్డ తల్లి ...." అంటూ ముందుకడుగేసి "ఈ పిల్లకేమైనా మూగా? మాటలు రావా? ఏం పిల్లా, నీ పేరేంది?" అని అడిగాడు అతను.

రంగమ్మ అతడికీ, రాజికీ మధ్యలోకొచ్చి నిల్చుంటూ "బంగారంగా మాటలొచ్చు. ముందు పనిస్తావో లేదో అది తేల్చు" అంది.

కుప్పుస్వామి కళ్ళెగరేసి అదోలా నవ్వుతూ "ఆత్రం వద్దు, ముందు కొంచెం నదురుగా ఉండేటోళ్ళని పనిలోకి చేర్చుకోని, సందు జూసి మిమ్మల్ని గూడ దూర్చేస్తాను. మళ్ళా వస్తాలే!" అంటూ వెళ్ళి జనంలో కలిసిపోయాడు.

మేఘాన్ని చీల్చుకుని బయటపడ్డ మొదటి సూర్య కిరణం నాలుగు కాళ్ళ మండపం దగ్గర తెరపలు తెరపలుగా ఎండని పరచేసింది. రోడ్డు పక్కనున్న అంగళ్ళన్నీ తెరిచేశారు. సాంబ్రాణి పళ్ళెాన్ని చేతబట్టుకున్న ఫకీరు అంగళ్ళన్నీ పరామర్శిస్తూ వస్తున్నాడు. ఇంకా డ్యూటీ ఎక్కని ట్రాఫిక్ పోలీసు టీ కొట్టు ముందు నిలబడి సిగరెట్టు కాలుస్తున్నాడు.

నీలి రంగు స్కూటరొకటి ముక్కుముసలాయన ముందుకొచ్చి ఆగింది. స్కూటర్ ఆఫ్ చేసి, అలాగే సీటుపైన కూర్చుని ఓ కాలు నేలపైన ఆనించి. తామ్రముద్రలాంటి ఆకారమున్న వ్యక్తి చుట్టూ నిల్చున్న మనుషుల్ని పరిశీలించి చూశాడు.

"ఏం పని సార్?" అని అడిగాడు ముక్కుముసలాయన.

ఆగంతుకుడు అతని వైపుకైనా చూడకుండా "నువ్వు పనికిరావులే" అని అద్దాలంగడి ముందున్న బేల్దారి బక్కాయనను ఇలా రమ్మంటూ కేకేశాడు.

"సున్నం గొట్టే పని. ఈ అద్దాలంగడి అంత ఇల్లు రెండు అంతస్తులు. రెండు దినాల్లో పని ముగించెయ్యాలి. ఇంకో మనిషిని కావాలంటే పిలుచుకో

"ఇతరా మనుషులొద్దు సార్. నేనూ, నాకొడుకూ, మా ఆడోళ్ళూ వస్తాం. రెండు దినాల్లో ముగించేస్తాం...." అన్నాడు బక్కాయన.

"మీ సంసారాన్నంతా తోలుకొస్తే నేనొప్పుకోను. వాడేనా నీ కొడుకు? ఆ చేతులు జూడు పుల్లల మాదిరుండాయి. కాళ్ళుజూడు గొల్లభామ పురుగు మాదిరుండాడు. వాడేం పనిచేస్తాడు. వేరే ఇంకెవ్వరైనా బలంగా ఉండే మనిషిని తోడుక్కోని వచ్చేటట్టయితే రా! లేకపోతే వద్దు. అన్నం పెట్టి దినానికి ముప్పయ్యి ఇస్తాను. రాంనగర్ పోస్టాఫీసు పక్కనే ఇల్లు....."

"నలభై అయినా ఇయ్యండి సార్. సున్నంలో పని. ఒళ్ళు తినేస్తాది...."

"అదే వద్దనింది. బేరం గీరం ఒప్పుకోను కడా మాట. ముప్పయ్యి అయిదు. ఇష్టమూ? కష్టమూ?...."

బేల్దారీ బక్కాయన పాత డబ్బానూ, తాటిపట్టనూ చేతికెత్తుకుని "పద సార్. వస్తా ఉండాం" అన్నాడు.

స్కూటర్ ముందుకు దౌడు తీసింది.

"ఈడనే కుర్చొనుండే రాజీ! ఆ కుప్పసామెట్ల పోయినాడో చూసుకోనొస్తాను" అంటూ రంగమ్మ అక్కడి నుంచి బయల్దేరింది.

నాలుగు రోడ్ల కూడలిలో ఎర్ర రంగు బోర్డు చేతబట్టుకుని ట్రాఫిక్ పోలీసు విన్యాసాలు ప్రారంభించేశాడు. బైరాగిపట్టెడలో ఇల్లు మోల్డింగ్ పనికోసం మేస్త్రీ ఒకతను కూలీలతో బేరం సాగిస్తున్నాడు. చూడగానే ఆఫీసరు కొడుకులా కనిపిస్తున్న యువకుడొకడు వాళ్ళింటి చుట్టూ అడవిలా పెరిగిన పిచ్చి మొక్కల్ని నరికి చదరం చేయగల భుజబలశాలి కోసం వెతుకుతున్నాడు. డబ్బాలను తాటిపట్టలను నేలపైన పెట్టి చుట్టూ కూర్చున్న అయిదారు మంది నడివయసు మగవాళ్ళు బీడి పొగలతో పార్టీల ఆగమనం కోసం ఆవాహన చేస్తున్నట్టు కనిపిస్తున్నారు. బాగా గడ్డం పెరిగిన బక్కపలచని వ్యక్తి శ్మశానంలో గొయ్యి తవ్వే మనుషులెవరైనా దొరుకుతారా అని విచారిస్తున్నాడు. నోళ్ళనిండా వక్కాకు దట్టించిన ఆడవాళ్ళ గుంపు వెదురుబట్టలనీ, పాత తలగుడ్డలనీ సర్దుకుంటున్నారు. హనుమంతుడి గుడికి ఉత్తరప్పవైపున వరుసగా నిల్చున్న మగవాళ్ళు దారినపోయే వ్యక్తినల్లా పార్టీ ఏమోనని తరచి చూస్తున్నారు. బోరింగు పంపు దగ్గర ఖాళీ అయిపోయిన టీ గుండా కడుగుతున్నాడు దయాళ్

బోరింగు పంపు కట్టువైపున కూలీలతో మంతనాలాడుతూ కనిపించాడు కుప్పుస్వామి. వాళ్ళ దగ్గరినుంచి వైదొలగి రంగమ్మతో మాట్లాడడానికి అరగంట పట్టింది అతడికి. అనవసరపు విషయాలు మాట్లాడడానికి తీరిక లేదన్నట్టుగా "ఇప్పుడు చెప్పు. ఎవురా పిల్ల?" అని ప్రశ్నించాడు కుప్పుస్వామి.

"చూసినావుగదా? మంచి వయసులో ఉండే పిల్ల. ఏడేడ కండ పట్టి ఉంటే బాగుంటాదో దాన్ని చూసే తెలుసుకోవాల. వారందినాలు కొంచెం చూసీ చూడనట్టుగా ఉన్నావనుకో, మల్లంక దాని కష్టంపైన్నే బతికిపోతింది. ఇంకొకరి కష్టంపైన బతికే జన్మం గాదు...."

"అసంగతులు కాదు ఏ ఊరినుంచి వచ్చింది? ఎందుకొచ్చింది? మొగుడుంటాడా? ఎల్లాంటి కేసు? పోలీసోళ్ళు ఎతుక్కుంటా వస్తే నాగతేమయ్యేట్టు?....."

"అయ్యయ్యో! అట్లాంటి పిల్లను నీ దగ్గరికి తొడుక్కొస్తానా నేను? ఈ రాజీ ఉండాదే అది లోమనిషి ఇట్లా అని నోరు విప్పి చెప్పలేదనుకో కానీ, నేను వొదిలిపెట్టకుండా కాళ్ళావేళ్ళాబడి కొన్ని సంగతులు తెలుసుకుంటిని. వచ్చిందేమో పడమటి పక్కనుంచి.... బురకాయలకోట పక్కనేదో ఊరు...వాళ్ళ కుటుంబరమంతా అందురిమాదిరే వానల్లేకుండా పైర్లెండబెట్టుకునే తావునించే ఈ ఊరికొచ్చినారు. ఆడా ఈడా పనిచేసుకుంటూ ఉండంగానే ఆడెవుడో దీనికి తగిలినాడు. నమ్మింది. వానికంతకు ముందే పెండ్లి పెటాకులు జరిగినాయని తెలిసింది. తల్లీదండ్రి తన్ని తరిమేశారు. ఇంకో దోవ లేక ఆ మొగోడినే నమ్ముకొనింది. తీరా తీర్థమాడినాక ఆస్పత్రిలో దొంగల్దోలేసి వాడు ఈ ఊరినుంచే మకామెత్తేసినాడు. ఏదయినా ఒక దోవ చూపిస్తే పుణ్యమైనా వస్తాదని నేను పాకులాడతా ఉండాను."

కుప్పుస్వామి ముందుకు నడుస్తూ "ఏమే రంగమ్మా! నీ మాటలు వింటా ఉంటే అయ్యోపాపమనే ఉండాది. కానీ, నెలల తరబడీ బాలింతరాల్ని కుచ్చోబెట్టి పోషణ జేసే శక్తి నాకు లేదు" అన్నాడు.

కుప్పుస్వామి రాజీవైపుకైనా చూడకుండా బేల్‌దారీ బక్కాయన పెళ్ళాన్ని కేకేసి "ఇల్లు కట్టే పని. ఒళ్ళు దగ్గిర పెట్టుకోని బయింగా పని చేస్తే నాలుగు నెలలు ఆడ్నే ఉండచ్చు...." అని ముక్తసరిగా తన కొటేషను వివరించాడు.

నాసిరకం రబ్బరు బొమ్మలా కనిపిస్తున్న బక్కాయన పెళ్ళాం తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో "మా ఇంటాయన బేల్‌దారీ పనిలో పడి లేచినోడు. కొంచెం ముందూ రాకపోతివిగదన్నా! ఎవ్వరో సున్నం కొట్టేదానికి మనిషి కావాలని తొడుక్కోనిపోయినారు. ఇంటి పనంటే మాకొకరు చెప్పాల్సిన పనేలేదు. నాకూ, నా కొడుక్కూ ఆ పనంటేనే ప్రాణం లేచొస్తుంది..." అంది.

"సరే పద. అందరూ రైల్వేస్టేషను గేటు ముందుకు చేరండి. చానా దినాల పని. కూలీ అటో ఇటో చూసుకోని ఇస్తాను..."

కుప్పుస్వామి ముందుకు పరిగెత్తుకొచ్చి "మా సంగతి అయిసా పయిసా తేల్చనేలేదు" అంది రంగమ్మ.

"ఉండు రంగమ్మా! లేడికి లేచిందే పరుగంటే ఎట్ల? నన్ను కొంచెం గుక్క తిప్పుకోనీ...." అంటూ వెళ్ళిపోయాడు కుప్పుస్వామి.

ఎండ బాగా ఎక్కువవడంతో కచేరి ముందు మూరెడు పొడవు నీడ మాత్రమే మిగిలి ఉంది. ఆ నీడలోనే ముడుక్కుని కూర్చుంది రాజీ. ఆమె ఒడిలోని బిడ్డ పాలు తాగుతూనే ఉంది. ముఖంపైన పడుతున్న ఎండకడ్డంగా అరిచేయి అడ్డుపెట్టుకుని ముక్కుముసలాయన కూర్చుని ఉన్నాడు. పార్టీలతో బేరాలు కుదిరించుకున్న కూలీలు తమ తమ గమ్యాలకేసి సాగిపోతున్నారు. టౌనుబస్సుల కోసం ఎదురుచూసే మధ్యతరగతి మనుషులు సంరంభం పెరగసాగింది. అంగళ్ళలో బేరసారాలు ఊపందుకున్నాయి. ఇస్త్రీ

మడతలు నలగని బట్టలతో తిరిగే మనుషుల శాతం పెరగసాగింది. మధ్య మధ్య అక్కడక్కడా ఇంకా పనులకోసం ఎదురుచూస్తున్న కూలీలు ఎరువు అందని ప్రదేశాల్లోసక్రమంగా పెరగని పైరు మల్లే వెలవెలబోతూ కనిపిస్తున్నారు.

తానూ వెళ్ళి అద్దాల అంగడి పక్కన మిగిలిన జానెడు నీడలో కుదించుకుని కూర్చున్న తర్వాత "ఉపకారం మొగోడు .... గుక్క తిప్పుకోవాలంట. ఏంది వీడు ఆలోచన చేసేది? ముండమోపి ముండాకొడుకు మొగాన మీసాలుంటే సరా?" అని నోటికొచ్చిన తిట్లు తిట్టసాగింది రంగమ్మ.

రాజీ ముఖమైనా ఆవిడకేసి తిప్పలేదు. ముక్కుముసలాయన కచేరీ పక్కన గోడకుర్చీ వేస్తున్నాడు.

ఎవరు వినకపోయినా పర్వాలేదన్నట్టుగా స్వగతంలో గొణుక్కోసాగింది రంగమ్మ "ఇవరాలనేవి ఈ ముచ్చుమొగానికి పక్కాకు పెట్టి చెప్పాల్నా? పుట్టిన ఊర్ని, ఆయినోళ్ళనూ వొదిలిపెట్టి వీడి టౌనుకెందుకొచ్చినాడో గవనంలో పెట్టుకున్నాడా అని? ఇనేదానికి రంజుగా ఉండేట్టుగా కావమ్మ కథో, శరబందిరాజు కథో చెప్పాల్నా వీని మొగానికి? పై గుడ్డ భుజానేసుకోని, కడుపు చేత్లో పట్టుకోని ఊరిగాని ఊరికొచ్చినోళ్ళకు ఇవరాలెక్కడనుంచీ తెచ్చిపెట్టేది నేను? వానికి మాదిరిగా నాకు సరిగ్గా రాతరాయలేదు కాబట్టి, మావోళ్ళంతా తలా ఒక దిక్కుకు పల్లాకులు పొలై నారు కాబట్టి ఇల్లా నేను అగోరిస్తా ఉండానని చెప్పాల్నా? నా రాతా, ఈ పిల్ల రాత ఒకటేరా అంటే అర్థంగాదే ఎదవ నాయాలుకు! సాక్షికం చెప్పేదానికి కట్టుకున్నోడ్ని, కన్నవాళ్ళనూ ఎక్కడినుంచి తెచ్చేది నేను?"

నాలుగుకాళ్ళ మండపం దగ్గర మిగిలిన కూలీలు ఇక రోజుకు కూలీపనులు దొరకవని నిర్ణయించేసుకున్నారు. పెన్నిధిలా దాచిపెట్టిన పాత గోతాల్ని భుజాల నేసుకుని కొందరు పాత కాగితాల కోసమూ, పాడై పోయిన ప్లాస్టిక్ వస్తువుల కోసమూ దిబ్బల్ని, మురికికాలవనీ గాలించుతూ ఊరిలోకెళ్ళిపోయారు. ఇద్దరు ముగ్గురు ముసి కూలీలు పాత ఇనుప పెనాలతో మురికి కాలవలలోని ఇసుకను గాలించి లోహాల్ని వెలికి తీయడం కోసం పయనమై పోయారు. ముక్కుముసలాయన జేబులోని చిల్లర డబ్బుల్ని లెక్కపెట్టుకున్న తర్వాత పాత చెప్పుల్ని కొంటాననని ప్రకటించుకుంటూ బయల్దేరేశాడు. నామాలాయన కావడి భుజానికెత్తుకుని హరోంహరమని భిక్షాటనకు పూనుకున్నాడు.

ఇంతలో బేల్దారీ బక్కాయన పెళ్ళాం పనేదో మరిచిపోయి వెళ్ళినదానిమల్లే నాలుగుకాళ్ళ మండపం దగ్గరికి వచ్చింది.

"ఏం వదినా? కుప్పసామి నిన్ను గూడా దొంగల్లోలేసినాడా?" అంది రంగమ్మ.

బక్కాయన పెళ్ళాం రంగమ్మకేమీ సమాధానం చెప్పకుండా రాజీ దగ్గరకెళ్ళి పక్కనే కూర్చుంది. రంగమ్మ కళ్ళు పెద్దవి చేసుకుని సంగతేమో తెలుసుకోవడం కోసం చెవులు రిక్కించింది. బక్కాయన పెళ్ళాం రాజీ చెవుల్లో గుసగుసలాడసాగింది.

ఏదో జరగబోతోందన్న విషయాన్ని రంగమ్మ పసిగట్టేసింది. పైకి లేచి "ఒసే నాసవితీ! అక్కడ గుణగుణలేందే? చెప్పు. ఆ మేస్త్రీగాడు ఏం చెప్పంపినాడు నీతో? ధయిర్నం ఉంటే నాతో చెప్పే ముందు?" అంటూ రొప్పసాగింది.

నీతో నాకు పనేమి లెమ్మన్నట్టుగా బక్కాయన పెళ్ళాం తాపీగా తన హితబోధను పూర్తిగావించి పైకి లేచి నిల్చుంది.

రంగమ్మ కోపంగా బక్కాయన పెళ్ళాం చేతులు గట్టిగా పట్టుకుని "చెప్పే దొంగ ముఖందానా! ఏం వర్తమానం మోసుకొచ్చినావే బేవర్సా?" అంటూ ఊపి పారేసింది.

బక్కాయన పెళ్ళాం విసురుగా రంగమ్మనోసారి వెనక్కు తోసింది. మొదలు నరికిన మానులా రంగమ్మ వెనక్కు విసురుకుపోయింది. "నీకు చెప్పేదానికి నాకు బయమేందే లంఖిణీ! నీ గుంతనక్క బుద్ధి నాకు తెలవదా? ఎట్లయినా ఈ బిడ్డను పనిలో పెట్టి, దాని ప్రాపకంలో ఆడుండే పుల్ల ఈడెయ్యకుండా బతకాలని నీ ఎత్తు. ఇంకో మనిషి కష్టంపైన బతకాలంటే ఎవుడొప్పుకుంటాడే బాడ్‌కోవ్. ఒంటిగా, నిన్ను దొంగల్లోలేసి, పనిలోకి వచ్చేట్టయితే రమ్మనమని మేస్త్రి రాజీకి చెప్పమన్నాడు. ఈ పిల్ల కొంగు పట్టుకోని నువ్వాపక్కకు అడుగు పెట్టినావంటే నీ మక్కెలిరంచేస్తానని నీకు చెప్పమన్నాడు. ఆ సంగతి గవనంలో బెట్టుకో నువ్వు." చెబుతూనే బక్కాయన పెళ్ళాం రైల్వేస్టేషను వైపు పరుగే నడకగా దూసుకెళ్ళిపోయింది.

రంగమ్మ పైకి లేచి చేతులోసారి తిప్పి చూసుకుంది. మోచేతులపైన రక్తపు డాగులు కనిపించాయి. "రాక్షసిముండ. ఎంత పనిచేసిందో చూసి నావా రాజీ! మూడు దినాలుగా కన్నబిడ్డ మాదిరిగా కాపెట్టుకోనుండానే నిన్ను. మనిద్దరి మధ్య కొరివి పెట్టాలని చూసిందే బక్కాయన పెండ్లాం. న్యాయమేనా? కాకిపిల్లకు పెట్టినట్టుగా నా తిండి నీకు పెట్టి కాపాడినానే నిన్ను. నువ్వా సంగతి మరచిపోతావని మేస్త్రి ముండాకొడుకనుకుంటా ఉండాడు. ఆ మాయదారిదాని మాట వినద్దు నువ్వు..." రాజీ ధోరణెలా ఉందో తెలుసుకోవడం కోసం రంగమ్మ ఆగింది. తాను మట్టిలో పడి దొర్లుతున్నా పట్టించుకోకుండా, రాయిలా కూర్చున్న రాజీ పైన చెప్పలేనంత కోపం వచ్చిందామెకు. పళ్ళు పటపట లాడిస్తూ కోపాన్ని అణచుకుని,, "నువ్వేమీ బయపడద్దు తల్లా" అంటూ మళ్ళీ మొదలుపెట్టింది ఆమె. " ఆ పొరంబోకు మేస్త్రిగాడు కాదంటే మనకు పాయిందేమీ లేదు. అందరూ ఈ మాదిరి మిడిమాళం మనుషులే ఉంటారా? నువ్వట్ల కుచ్చోనుండు. మిగిలిన కతంతా నేను చూసుకుంటాను. నన్ను నమ్మి చెడిన మనిషి ఈ ఇలాకాలోలేదు. మేలు చేసినోళ్ళను మరవద్దు. దేవుడు నీకు మేలు చేస్తాడు."

పాపాయిని పాత గుడ్డలతోబాటు ఒళ్ళోకెత్తుకుని, రాజీ పైకి లేచి రెండడుగులు ముందుకు వేసింది. రంగమ్మ కంగారుగా పైకి లేచి రాజీ భుజాన్ని గట్టిగా పట్టుకొంది. "ఆ పాపిష్టిముండ మాటలు నమ్మద్దు రాజీ! వాని సంగతి నీకు తెలియదు. చూసేదానికి అట్లా కనబడతాడుగానీ, వాడు పెద్ద కిలాడీ. వాని దెబ్బకు తాళలేక పెండ్లామే ఎవుడితోనో లేచిపోయింది. వాన్ని నమ్ముకున్నోళ్ళంతా అర్ధాంతరంలోనే గంగలో కలిసిపోయినారు. ఆ పక్కకు పాయినావంటే నిన్ను కాపెట్టుకోనుండే దిక్కుండరు. నేనాపక్కకు రాను ఆ కసాయోడు చెప్పిన మాట ఇనలేదని కన్న తల్లినే సడుగులించేసినాడని అందరూ చెప్పుకుంటా ఉంటే ఇన్నాన్నేను....." కాస్సేపు మెల్లిగా పెనుగులాడిన తరువాత, విసుగ్గా కుడిచేత్తో రంగమ్మను వెనక్కుతోసింది రాజీ. ఆమె కచేరి గోడ పైకి విసురుకుపోయి

పడింది. రాజీ తిరిగయినా చూడకుండా రైల్వేస్టేషనువైపు విసవిసా నడచిపోసాగింది.

"పోపోయే కంతిరీముండా! నా దుడ్డు తిని నాకే టోకరా ఇస్తే నిన్ను పైనుండేవాడు ఊరికే వొదిలిపెట్టడు. నా రుణంలోనే పోతావు. ఆ మేస్త్రీ ముండాకొడుకు సున్నంలోకి ఎమికలేకుండా ఇంచిపారేస్తే అప్పుడు నెత్తీనోరూ కొట్టుకో! నన్ను నట్టేట్లో ముంచేసిపొయినట్టుగాదు. నువ్వెట్ల బతికి బట్టకడతావో అదీ చూస్తాను. ధూమొచ్చి నిన్నూ నీ బిడ్డను ఎత్తుకోనిపోకపోతే అప్పుడడుగు.... నా ఉసురు ఊరికే పోదు."

కడుపులో రగులుతున్న ఆకలి ఒకవైపు, రాజీ వదిలి పెట్టి వెళ్ళడంతో కలిగిన బాధ మరోవైపు. ఆమెకు శరీరమంతా మండుతున్నట్టుగా తోచింది. కళ్ళల్లో నీళ్ళు తిరగసాగాయి. పెదవులు వణకసాగాయి. నాలుగుకాళ్ళ మండపం దగ్గర కూలీలెవరూ లేరు. రంగమ్మ గోడు వినే నాథుడెవడూ కనిపించలేదు.

కూడలిలో ఎర్ర బోర్డు పట్టుకుని నిల్చున్న పోలీసు ఆ క్షణంలో ఆపద్బాంధవుడిలా కనిపించాడామెకు. నాలుగువైపులా దూసుకెళ్తున్న వాహనాల మధ్యలోంచి పడుతూ లేస్తూ పోలీసు దగ్గరికి పరిగెత్తింది ఆమె "చూడు సా! నా దుడ్డు తినేసి చక్కాపోతా ఉంది. నా దుడ్డు ఇచ్చేసి ఎట్లయినా పొమ్మను. నా దుడ్డు నాకిమ్మను సా!" అంటూ అతడి కాళ్ళు రెండూ వాటేసుకుంది.

చేస్తున్న పనిని కాస్సేపు ఆపి, ఆమె చేతుల్లోంచి తన కాళ్ళను దూరంగా లాక్కోవడానికి ప్రయత్నించాడు పోలీసు. అతను సిగ్నల్ చూపెట్టకపోవడంతో బస్సులూ కార్లూ కొంప మునిగిపోయినట్టుగా హారన్లు మోగి ' సాగాయి.

కోపంతో పోలీసు ఎర్రరంగు బోర్డుతో రంగమ్మ నెత్తి పైన రెండు తగిలించి రోడ్డుపైనుంచి ఒక తోపు తోశాడు.

ఆమె మురికికాలువ గట్టుపైన మూటలా పడింది శరీరమంతా బురద గొట్టుకుపోయింది. తల దిమ్మతిరిగి పోయింది. భయంతో వణికిపోతూ బైర్లు కమ్మడానికి సిద్ధంగా ఉన్న కళ్ళతో చుట్టూ తిరిగిచూసింది.

కచేరీ ముందు కాలేజీ అమ్మాయిల గుంపు టౌను బస్సు కోసం ఎదురు చూస్తోంది ట్రాఫిక్ పోలీసు వినయంగా బోర్డు చూపెడుతుండగా ఎర్రరంగు మారుతి కారు ఠీవిగా ముందుకు పరిగెడుతోంది. ఒకదాని వెంట ఒకటిగా టౌను బస్సులు కవాతు చేస్తున్నాయి. ఆఫీసుకెళ్ళే ఉద్యోగులతో రోడ్డు క్రిక్కిరిసిపోయి ఉంది.

మూడు గంటల క్రితం రంగు వెలిసిన నీటిరంగుల చిత్రంలా వెలవెల బోయిన ఆ దృశ్యం ఇప్పుడు ఆయిల్ పెయింటింగులా మెరిసిపోతోంది. ఆ వర్ణచిత్రంలో దిష్టిబొమ్మలాంటి తనకు స్థానంలేదని రంగమ్మకు అర్థమై పోయింది.

కాళ్ళెక్కడికి తీసుకెళ్తున్నాయో తెలియకపోయినా,ఆసురుసురని గుసలుబోసుకుంటూ నాలుగుకాళ్ళ మండపం దగ్గరినుంచి వీలయినంత దూరంగా పారిపోవడం కోసం పడుతూ లేస్తూ పడుతూ లేస్తూ పరుగే నడకగా సాగిపోయింది రంగమ్మ.

ఇండియా టుడే, ఏప్రిల్ 6–20, 1993

# పాలపొదుగు

## నామిని సుబ్రమణ్యం నాయుడు

బంక చేనులో ఎనుము (గేదె)ను విడిచిపెట్టి, సన్నంగా మూరడు యెడం ఉండే కాలిబాట మీద గొంతుకూచ్చునింది కర్రెక్క. మోచిప్పల మీద మోచేతులు వేసుకొని తల పట్టుకొనింది. అది పండగనెల గావడంవల్ల, అంతకు ముందర టపానులపండగప్పుడు బూమిమీద వాన సయించి నట్టు కురిసి వుండడంవల్ల, ఆ బంకచేనులో చీకి చెట్లకింద, అద్దారపాకు పొదలకిందా, బలుసకంపచెట్ల కిందా - పచ్చికసువు మొలిచివుండాది. ఆ చెట్ల సందున ఆ కసువు (గడ్డి)కు ఎప్పుడూ నీడ దాపు ఉండడంతో, అదీగాక అక్కడంతా ఊరి ఆడోళ్ళు దొడ్డికి పోవడంతో, మాలా మాదిగోళ్ళు అప్పుడప్పుడూ అక్కడనే గొడ్లను గూడా కోసుకోవడంతో - నీసునీసుగా వుండాది ఆ చోటంతా. అక్కడ ఎనుముమెడ వంచి కనీసం నేలనుగూడా మూచ్చూడలేదు. ఒక చెట్టుకింద చీకి కాయలు రాలి వుండడంతో నాలుగిట్ని ఏరుకొని పరపరమని నమిలింది ఎనుము. అసలది ఎనుమును మేపడానికి కాని చోటు. ఎనుముకు కాళ్లయినా సాగుతాయి గదా-అని వూరికినే తోలుకొనివచ్చింది కర్రెక్క. అక్కడికి దగ్గిర్లోనే ఉండే మాదిగి పల్లిని దాటుకుంటే బస్సులు తిరుగులాడే రోడ్డు బాట - మట్టిది - వస్తింది. అది పచ్చికకాలం గావడంవల్ల, రోడ్డు బాటకు ఆ పక్కా ఈ పక్కా కల్లల (కంచెల) కింద పచ్చికసువు వుంటింది. రేపో ఎల్లుండో ఈనబడిన గొడ్డును అంత దూరం తోలుకుపోయి ఉడకాడిపించడం ఎందుకులే - అని ఇక్కడికి తోలుకొని వచ్చింది కర్రెక్క.

చెట్లూ, జేముతో, బోదగడ్డితో నిండి పోయిన నల్లటి గుట్ట మాదిర కంటికి నిండుగా వుండాది ఆ ఎనుము. అది రెండు రోజుల నుంచి ప్రియంతో కసువు తినకపోయినా నీళ్లు తాగకపోయినా - దాని నీళ్ల దొక్క, కసువు దొక్క నిండుగా వుండాయి. అది దొక్కలను దిగవేసుకొని, బొడ్డులోకి పాలుదించి వుండాది. గంటకు నాలుగు మాట్లు తోకపైకెత్తి, ఉచ్చ (పేడ) పుర్రూ పోయడంతో దాని యెనక కాళ్లు రోతరోతగా వుండాయి. కర్రెక్క చూస్తాచూస్తా వుండంగానే ఎనుముది వెదురు పొదను జేరి గబుక్కున బొక్కడుతో బొక్కడాకు పెడ్కోని నమిలేసింది. 'యెదురాకు తినే కర్మ నీకెందుకే హీనపు ముండా' అంటూ ఎనుము

దగ్గిరిపోయి, కడగా తోలేసి యెదురుపొద దగ్గిరే కూచ్చునింది కర్రెక్క.

అప్పుడు కర్రెక్కకు ఒక సంగతి గుర్తుకు వచ్చింది. సరిగ్గా రెండేండ్లకు ముందర కర్రెక్క అంటు దప్పింది. అప్పటికే ఆమెకు ఒక కొడుకునాలుగో తరగతిలో, కూతురు ఒకటిలో వుండారు. దున్నేవానికి (ఒక కొంద్ర) బూమి లేకుండా, దూకి సచ్చేదానికి బావుల్లే కుండా కనాగష్టం బతుకు బతకతా వుండాం. ఉండే ఇద్దరు బిడ్డల్ని సాకడానికే పెద్దను మోసి నంత అగచాట్లు పడిపోతా వుండాను. దేముడికి నామీద ఎగతాళి గాకుంటే ఇంకెందుకు నాకు బిడ్డలు? అని ఆమె ఒక రోజు దొడ్డికి వచ్చినట్టుగా వచ్చి దోసెడు యెదురాకును ఇదే పొదలోనుంచి దూసి ఒళ్లో పోసుకుని ఇంటికి పోయింది. యెదురాకు బలె ఉడుకు గదా. ఆ ఆకును అన్ని నీళ్లలో ఉడకబెట్టుకొని ఆమె తాగేసింది. మూడోరోజుకల్లా ముట్టయిపోయింది. మళ్ల నెలగూడా ఆమెకు ఎంతకూ అంటుగాకపొయ్యే సరికి, 'దేముడికి ఈ కర్రెక్క మీద ఎగతాళిగా వుండాది. బిడ్డలు గావాల దేముడా - అని వరపడే వాళ్ళ కడుపున కాయ గాయించకుండా, నా యెనకాల ఎందుకు పడినట్టు ఆ కూలిపోయిన దేముడు?' అని ఆమె దేముడుమీద నిష్టూరం పోయి మళ్లా యెదురు పొద దగ్గిరికి వచ్చింది. 'ఈ రీతిగా లాబంలేదని' జెప్పి, ఆమె ఆపరేషను చేయించుకోవాలనుకొనింది. వాళ్ల మాటా వీళ్ల మాటా విని ఆమె అందుకు బయపడింది. 'ఆపరేషను జేసుకుంటే [illegible] మొయ్యగూడదు. ఒంటికి మించిన కష్టం పడగూడదు. [illegible], పండ్లుగా మంచి ఆగారం తినాల. రెక్కల కష్టం [illegible] మన వంటోళ్ళు [illegible]రేషన్లు గిపరేషన్లు [illegible] మన వేడుక దేముడు జూస్తాడు' అని కర్రెక్క మదన పడింది. ఆమె అందుకు మొగుడు రామచంద్రను నాయుడున్న ఎగదోసింది. ఆయన [illegible] చెప్పినట్టుగా వినుకొని, కర్రెక్క దగ్గిర మూడు రూపాయిలు తీసుకొని తిరపతిపోయి, ఆపరేషను చేయించుకొని, తొంబై రూపాయలు చేతిలో వేసుకొని వచ్చినాడు.

ఎనుము వీపు పైనుంచి పగ్గం జారి, ఎనుము కాళ్ళకు అడ్డం పడింది. కర్రెక్క వెదురు పొద దగ్గర నుంచి పైకి లేచి, పగ్గాన్ని పొందిగ్గా మళ్లీ దాని వీపుమీదనే వేసింది. పొద్దు గూట్లో పడడానికి ఇంక రెండు బారలే ఉండడంజూసి, కుదురుగా ఎనుమును తోలుకొని ఇంటికి ఎలబారింది.

మెడ కంఠంకింద మూరెడు పొడుగు తెల్లని చార వుండే ఆ ఎనుము కర్రెక్కది గాదు. ఈ మాట అంటే కర్రెక్కకు కోపం వస్తుందిగాని, ఆ ఎనుము కర్రెక్క కొట్టంలో పుట్టింది గాదు. కొన్ని నూర్లు దారబోసి కూడా ఆమె ఆ ఎనుమును కొనలేదు. ఎట్టయినా సరే అయిదారు నూర్లు జమజేసి ఒక ఎనుమును పట్టకోవాలని ఆమెకు నాలుగేండ్లనుంచి మనసు వుండిందిగాని, రెక్కల కష్టంజేసి పొట్టబోసుకొనే ఆమె కాపరానికి అది వల్లపడలేదు. ఏ ఊరి గొడ్డో అని ఇప్పటికీ తెలవని ఆ ఎనుము ఒక అపరాత్రిపూట మదాన్ని అణుచుకోలేక, మెడతాడుతో సహా తెంపుకొని, అడ్డం వచ్చిన పైర్లను తొక్కుకుంటా, కొనలను మేసుకుంటా - తెల్లారే సరికంతా కర్రెక్క ఊరు చేరుకొనింది. కడుపు వుబ్బవేసుకొని, మెడతాడుతో సహా బురదకాళ్లతో కళ్లాపి చల్లి ముగ్గులు పెట్టి వున్న వీధుల్లో అది

తిరుగులాడుతూ ఉంటే చూసిన ప్రతి అమ్మా అక్కా, "దొంగ కూలిపోయిన గొడ్డు. ఎవ్వరి పైరునో నోట్లో పెట్టుకొని నీళ్లు పోసుకొనింది" అని అనడమే పనిగా పెట్టుకున్నారు. కన్రెక్క పక్క ఇల్లయిన కమలమ్మ కొట్టంలో దూరి కుడితినీళ్ల తొట్టిని సగానికి సగం తాగే సింది. అది గమనించిన కమలమ్మ, బారడు పొడుగు దుడ్డుకట్టితో - వచ్చే పాపం రానేవస్తుందని ఆ ఎనుము వీపుమీద చావగొట్టేసింది. బిత్తరపోయిన ఎనుముది-కన్రెక్క కొట్టంలో దూరే సింది. అప్పుడు కన్రెక్క-కొట్టంలో ఐక్కెద్దుల కింద పేడా చెత్తతోసి తట్టలో వేస్తావుండింది. కమలమ్మ దెబ్బలకు ఒళ్లుఅలసిపోయిన ఆ ఎనుము-కన్రెక్క కొట్టంలో పడకవేసేసి, నెమరు వేయడం మొదలుపెట్టింది. కన్రెక్క ఆ ఎనుమును దయదలచిన దాని మాదిర కొట్టంలో నుంచి బయటకు తోలేయ్యకుండా గమ్మున వుండింది. పొద్దు నాలుగు బార లెక్కసరికి కూడా పడుకొన్న ఆ ఎనుము లేవకపోవడం జూసిన కన్రెక్క మొగుడుచేతికి ఒక పాత చేంతాడు ముక్క ఇచ్చి దాన్ని ఒక కట్టుగూటానికి కట్టెయ్యమనింది. సందేళదాకా ఆ ఎనుము మాదంటూ ఎవరూ రాకపోవడం జజూసి "ఈ ఎనుము దరిద్రం మనింట్లో ఎందుకు? ఉండే రెండు గిత్తలనే పొస్తులుబెట్టి చంపతావుండాం కసువు లేక. దీని గోష్ఠ (పాపం) కూడా మనం నెత్తిన వేసుకోవాలా? విడిచిపెట్టి తోలేద్దాం" అన్నాడు రామచంద్రమ నాయుడు. మొగుడి మాటలకు కన్రెక్క "పాపం, మనకొట్టాన్ని యెతుక్కుంటూ వచ్చింది. యెందుకు తోలేస్తావు? దాని గల్లోళ్లు వచ్చేదాక అది ఈడనే వుంటుందిలే గాని - " అనింది.

కన్రెక్క వూరికి చుట్టూరా దగ్గిరి దగ్గిర్లోనే పది ఊర్లదాకా ఉండాయి. మరీ మైళ్ల కవతల నుంచి పారిపోయివచ్చి వుండదుగదా అది ఈ చుట్టుపక్కల వూర్లల్లోదే అయివుంటింది. నాల్గైదు నాళ్లల్లోనన్నా దాన్ని యెతుక్కుంటూ ఎవ్వరన్నా రారా? అనుకొని కన్రెక్క నాలు గైదు నాళ్లు ఆ ఎనుముమీద శ్రద్ధ జూపలేదు. రామచంద్రమనాయుడు రాత్రి పూట ఎద్దుల గాడిలో నాలుగు కసువు పోచలను విదిలించేటప్పుడు ఆ ఎనుము ముందర గూడా పిడికిడు విదిలిస్తే కన్రెక్క ఒద్దొద్దు అని గూడా అనేది. అదేమి యిచ్చిత్రమోగాని నెలనాళ్లుదాటినా దాని జాడ యెతుకులాడుకుంటూ ఎవరూ రాలేదు. ఆ ఊరికి మూడుమైళ్ల దూరాన వుండే రెంగటాపురం అయిస్కూల్లో ఆరుచదివి, సందేళ అయిదూ అయిదున్నరకల్లా ఇల్లు చేరుకునే ఆమె కొడుకు జనార్దనాయుడి చేతికి ఒక కట్టె ఇచ్చి "మన ఎనుమును విడిచి పెట్టి, ఊరిబైట దాకా తోలుకొని పోయి తిప్పుకొని రారా నాయినా" అనడం గూడా మొద లుబెట్టింది కన్రెక్క. వాడు అమ్మకల్లా అదొక రకం చూపుజూసి సందేళ సందేళ ఎనుమును విడిచిపెట్టేవాడు. వాళ్లదిగాని ఆ ఎనుము వెంట, మేపడానికని వాడూ పోతూ వుంటే వూళ్లో ఒకరిద్దరు ఆడోళ్లు వాడ్ని ఎగతాళి జేసేవాళ్లు, "ఏమిరా నా బట్టా, సొంత ఎనుమును మేపి నట్లు మేపతావుండావు?" అనే వాళ్లు ఒక నెల పోయినాక ఆ ఎనుము కట్టుకొచ్చి 'ఓ' అని అరి చింది. అది పలమైందని అర్థం చేసుకొన్న కన్రెక్క కొట్టంలోకి ఒక దున్నపోతును తోలుకొని వస్తావుంటే అందరికీ ఎగతాళిగా వుండింది. ఆ ఎనుము మళ్లీ అరవలేదు. అది కట్టిపోయింది. అది సూడిదైన మూడు నెలలకు నలుగురు మగవాళ్లను పిలిచి కన్రెక్క ఆ ఎనుము ముక్కుకు తాడు కుట్టించింది. కన్రెక్క ఆ ఎనుముకు ఇంత జేస్తావంటే ఊరి

ఆడోళ్ల కండ్లన్నీ ఆ ఎనుము మీదనే పడినాయి. ఒకరోజు కర్రెక్క పక్కింటామె అయిన కమలమ్మ కర్రెక్కను పిలిచి, నిజం మొకంతో "ఒసె ఒసె, కర్రా! మా ఎనుము తప్పి పోయిందంటా, పడవలూరునించి ఇద్దరు మొగోళ్లు వూళ్లోకి వచ్చినారు. వాళ్ల ఎనుమేనేమో ఇప్పుడు మీ కొట్టంలో వుండే ఎనుము?" అనింది. నిజంగానే పడవలూరు రెడ్లు ఎనుముకోసరం వచ్చినారేమోననుకొని కర్రెక్క గుండెకాయలు నీళ్లయిపోయినాయి. నల్లంగా అయిపోయిన కర్రెక్క మొకాన్ని జూసి కమలమ్మ పకపకమని నవ్వి, "ఊరికేనే అన్నా, నిన్ను ఎగతాళి జేద్దామని. ఆ ఎనుము మీద నువ్వు పెట్టుకొని వుండే ఆశను జూసి నాకు నవ్వు వచ్చింది. ఈ రోజుమటుకు ఎనుముకోసరం ఎవరూ రాలేదులే. నువ్వేమీ ఉచ్చ బోసుకొని కోకను తడుపుకోవద్దు" అనింది. కర్రెక్కకు కోపంతో ఉచ్చి మీది వెంట్రుక చివక్కన పైకి లేచింది. కర్రెక్క మొకం చిన్న బెట్టుకొని, "ఆ ఎనుము గల్లోళ్లు వస్తే ఉచ్చ బోసుకోవాల్సిన కర్మ నాకేం బట్టిందక్కా? నిజంగానే దాని గల్లోళ్లు ఎవురన్నా వస్తే తోలుకొని పోతారు నేను కాదంటానా? ఎందుకు ఈ రకంగా నన్ను బట్టుకోని అగుమానించేది? నీ ఒప్పందం బూములు బావులు లేవనే గదా– నన్ను యెంటికతో సమా నంజేసి ఈ రీతిగా ఎగతాళి పడతావుండావు? అనేసి ఇంటికి వచ్చింది దాని లావు వుంటే దాని వరకే వుంటింది. పట్టుకొని జాడించేద్దాం అనుకొనింది కర్రెక్క. కానీ, కోపంతో వచ్చే గనుమ పట్ల బలవంతాన అణుచుకొని బయట పడింది. కర్రెక్క యెడం పక్క ఇంటామె ఈ రీతిగా ఎగతాళి పడతావుంటే, కర్రెక్క కుడిపక్క ఇంటామె అయిన తులశమ్మ, అయి స్కూలు చదువులు చదువుకొని ఆ ఊరి మీదుగా గంగిరెడ్డి పల్లికిపోయే పిలకాయలను పిలిచి కర్రెక్కకు వినపడేటట్లుగా! "ఒరే, మావూరికి ఒక దొంగ గొడ్డు వొచ్చి మూడు నెలలవతావుండాది. అది మీ వూరిదేమో కొంచెం మీ పెద్దోళ్లకు జెప్పండి" అనేది. రామ చంద్రమనాయుడు కమ్మకులంలో పుట్టినాడేగాని సెంటు కయ్యలేని వాడు. తెల్లారిలేస్తే కర్రెక్క, రామచంద్రమనాయుడు-కమలమ్మ, తులశమ్మ బూముల్లోకిపోయి ఒంగాల్సిందే గదా? వాళ్లు ఎన్ని అన్నా మనం వాళ్లకు చెడ్డయిపోగూడదని కర్రెక్క మనసుకు కష్టంవేసే అటువంటి మాటలకు కూడా తలవంచింది. ఒకసారి కర్రెక్క (కూలి) పనికిపోయి సందేళ నాలుగు కంపకట్టెలను పొయ్యిలోకి అని చెప్పి, సందిట పెట్టుకొని ఇంటికి వస్తావుంటే, ఊర్లోనుంచి ఒక సీసాలో అర్ధరూపాయికి కిరసనాయిలు పోయించుకుని కాలు రూపాయికి నాలుగు మిరపకాయలు చేత బట్టుకొని మాదిగపల్లె వల్లా పోతావుండిన ఒక మాదిగది నిలబడి, "కర్రెక్కా! శ్రీ రామాపురం నుంచి ఇద్దురాడోళ్లొచ్చి వాళ్ల ఎనుమును వాళ్లు తోలుకుపోయినారు. మధ్యానంపూట జరిగిందామని, ఆ ఎనుమును పసిబిడ్డను జూసుకున్నట్టు జూసుకుంటివి. అంతా రుధా గదా?" అని ఎగతాళి పడింది. వొళ్లంతా అదిరిపోయే కోపంతో, కర్రెక్క కన్నా పదేండ్ల పెద్దదైన మాదిగామెను పట్టుకొని "ఏవడలంజా, వెల్లాల కల పడేసి పచ్చబోసేస్తాన్లంజా నా సరి కమ్మనా సపుతులంటే నన్నంటారే నేను వింటాను. మాదిగ పుట్టిక పుట్టిన నీకు గూడా నా బతుకు నీటికన్నా పలసంగా, దూదికన్నా సులకంగా కనిపిస్తావుండాదంటే--" అని ఇష్టం వచ్చినట్టు తిట్టేసి కర్రెక్క అక్కసునంతా తీర్చుకొనింది. మాదిగామెని అన్ని తిట్లు తిడతా వుండినా కర్రెక్కకు ఒక పక్క జరం కాస్తానే వుండింది.

ఇంటకి వచ్చి కొట్టంలో నెమరు వేస్తావుండిన ఎనుమునుసూసేదాకా నిమ్మళం లేకపోయింది. ఒకసారి మాత్రం కూపు చంద్రపేట నుంచి ఒక ముసిలాయన ఎనుమును వెతుక్కుంటానే వచ్చినాడు. వూళ్లో వాళ్లు ఇరవై మందయినా కర్రెక్క ఇల్లును చూపించి వుంటారాయనకు. ఆయన కర్రెక్క ఇంటి దగ్గిరికి వచ్చి ఆ ఎనుమును జూసి "ఇది గాదు" దీని కొమ్ములు ఒకదాన్ని జూసినట్టు ఒకటి వుండాయే. ఇది గాదు మాది. మాది బోడి కొమ్మల ఎనుము. అదీ గాక మాది వాలుగీతల ఎనుము. ఇది పడ్డ ఎనుమే! (ఇంకా తొలీత కూడా ఈ నని ఎనుము--పడ్డ ఎనుము) అనేసి ఆ ముసిలాయన కర్రెక్క గుండెల మీద బారాన్ని దించేసి పోయినాడు. పోతున్న ఆ ముసిలాయనకు కర్రెక్క కంటికి ఎంతో నాయస్తుడుగా కనిపించినాడు. ఆ వీది మలుపు తిరిగేసిన ముసలాయనతో కర్రెక్క, "ముసిలాయనా! నువ్వన్నా నా కొట్టంలోవుండే ఈ ఎనుమును తోలుకొని పోతావా-అని ఈ ఊరోళ్లు గంపె డాశ పెట్టుకున్నారు. ఈ కొట్టంలో ఈ ఎనుము ఇంక ఒద్దు. నీదిగాకపోయినా నీదేనని అపద్దం జెప్పైనా తోలకపో. ఆ ఎనుము కోసరం ఎవరూ రాలేదే, ఆ ఎనుము కర్రెక్క సొంతమే అయిపోతా వుండాదే-అని ఈ వూళ్లో వుండే కొంతమంది ఆడోళ్లు మొగుళ్ల పక్కన గూడా పడుకోకుండా దిగులు బెట్టుకొని కుంగిపోతుండారు. నువ్వుగాన ఈ ఎనుమును తోలకపోయినావంటే- మా ఊళ్లో ఇద్దరు ముగ్గురన్నా తిరుమల కొండకు పోయి మొక్కు తీర్చుకొని, దైవదరిశనం జేసుకొని గుండు కొట్టించుకుంటారు" అంటూ కర్రెక్క వాళ్లమీదా వీళ్లమీదా వుండే నిష్టూరాన్నంతా ఈ రకమైన ఎగతాళి మాటలతో వెళ్లబోసుకొనింది --బంకచేను దగ్గిర్నుంచి కర్రెక్క ఎనుమును ఇంటికి తోలుకొని వచ్చి కట్టేసింది. వూరికి పడమరగావుండే అడ్డవంక మిట్టదగ్గర మొగుడు చెక్కుకొని వచ్చిన పచ్చి కసువును తీసి కొంచెం ఎనుము ముందర వేసింది. ఈనబడిన ఆ ఎనుము పండ్లతో సగించీ సగించనట్టు పచ్చి కసువును కొరకతా వుండడంజూసి 'దీని కెప్పుడో నేను రుణపడి వుండినాను. నా దగ్గిర సేవలు జేయించుకునే దానికే నన్ను వెతుక్కుంటా వచ్చింది యెర్రి నా కూతురు! అనుకొని కర్రెక్క నిమ్మళంగా, పొడుగ్గా గాలి పీల్చుకొనింది.

## 2

ఇంటి ముందర వుండే మట్టి తిన్నె మీద అమ్మలు బిడ్డలందరూ కూర్చొని వుండారు. అమాశి మబ్బు (చీకటి) వల్ల పైన ఆకాశంలో చుక్కలు తేటగా కనిపిస్తా వుండాయి. టయిము అప్పటికే తొమ్మిది గంటలను మీరి వుండాది. అయిదు ఇళ్లు వుండే ఆ వీధిలో జనమంతా అప్పుడే నిద్దర్లు పోతా వుండారు.

జనార్దినాయుడు తిన్నెమీద నుంచి ఒక్క దూకు దూకి కొట్టంలోకి పోయి రెండు నిమిసాలు నిలబడుకొని "అమ్మా, అమ్మా ఎనుము పడుకోనూ లేవనుగా వుండాది. అది- ఎప్పుడెప్పుడు ఈనబోతామా అని కలవరిస్తా వుండాది" అన్నాడు. వాడికి, కుశాల వల్ల ముక్కుల గుండా, నోటి గుండా సందిట్లావు గస వస్తా వుండాది. కర్రెక్క కొడుకు కులుకును జూసి ముచ్చటపడి, నోట ఏ మాట పెట్టుకోకుండా వుండింది. ఇంతలో ఆమె ఒడిలో - తిన్న మీద నుంచి కింద పడిపొయ్యేటట్టుగా - కూర్చొని వుండిన వాడి చెల్లి

అంజిలి, అమ్మ మూలికల్లా ఎగజూసి "అమా, అమా, వీడే మన ఎనుముకు సగం దిష్టి. దాని టయిమొస్తే అది ఈనదా, అమా? దానికి నువ్వూ నేనూ చెప్పాల్నా ఏమి? వీడెందుకు మాటిమాటికి ఎనుము దగ్గరికి పోయి చూసి వచ్చేది?" అంటూ అమ్మచేత అన్నకు దొబ్బులు పెట్టించాలని చూసింది. కర్రెక్క ముదిగారం నిండిన గొంతుతో "ఒరే, జనార్దిగా! ఇది మొగుడికి కాపరం చేసే ఆడది గాదు. అత్తగారింటికి పోయిన మూడునాళ్లల్లోనే ఇది మొగుడి నెత్తిమీద కుండా చట్టి యేసేసి - అమ్మగారిల్లు వెతుక్కుంటూ వచ్చేసే లంజగా వుండాది ఇది" అంటూ ఆమె కొడుకు పక్క మాట్లాడింది. నల్లదై పోయిన అంజలి మూతి- యింతై పోయింది. ఆ అమ్మి, అమ్మ ఒళ్లో నుంచి మెల్లిగా జారి, బారడకు దూరంగా వీధిలో నిలబడి, "కర్రి నా సవితీ, నా కాపరం నాకు ఎట్ల చేసుకోవాలనో తెలుసులేసేయ్! మొగుడు నెత్తిన కుండా చట్టి వేస్తానంట? ఒసే, వేసినా గూడా నీ ఇంటికి రానులేగాని, నువ్వేమి బయపడుద్దులే! లంజి నా సవితి" అంటూ ఆ అమ్మి నవ్వు మొకంతో గొణిగింది. దాని తెలివికి ఎప్పుడూ యిచిత్రపోయే కర్రక్క చిన్న గొంతుతో, "పెదబ్బా, ఇది బలే తెలివైన ది. దాని గురించి చింత నాకు లేదు. నువ్వే తిక్కలోడివి. ఎట్ల బతకబోతావో..." అనింది.

పదిటికి ఒక మాట మాట్లాడే రామచంద్రమనాయుడు తిన్నె మీద నుంచే వొంగి కొట్టంలోకి తొంగిచూసి, ఆ మబ్బు(చీకటి)లో ఎనుము కనబడకపొయ్యేసరికి, "యిప్పుడా మబ్బులోనా ఎనుము ఈనబొయ్యేది? చేసే కష్టమంతా, బూడిదలో ఉచ్చబోసినట్టు పోతా వుందేగాని ఏమన్నా పలితం వుండాదా? ఇన్ని ఏండ్ల నుంచి కాపరం చేస్తా వుండాం. ఒక లాంతరు కొనుక్కునేది లేదా?" అంటూ ఆయన పెళ్లాం మీద నిష్ఠూరపోయినాడు. ఈ మాటలకు కర్రెక్క గూడా కోపం నిండిన గొంతుతో గాకుండా యదాప్రకారం గొంతుతోనే "నువ్వు సందేళ అయ్యేసరికి బండ్లతో తోలుకొచ్చే సంపదనంతా నేను తెల్లారేసరికల్లా లారీలు మాట్లాడి మా అమ్మ గారింటికి తోలేస్తా వుండాను గదా! అటుమంటప్పుడు నీ పెళ్లాం నీ యింట్లోకి ఒక లాంతరు కొనిపెడదామనే అలోసిన జేసునా" ఎత్తిపొడిచినట్లుగా మాట్లాడింది. రామచంద్రమనాయుడు, "నేనీ అపరాత్రి పూట నీతో తగరారుకు దిగలేదు లేల్లా" అన్నాడు. మళ్ల కర్రెక్క గమ్మున వుండిపోయింది. ఎనుము మాత్రం రాత్రి నడిజాముకన్నా ఈనేస్తిందేగాని ఈనకుండా పోదు. అది తెల్లారి నుంచి తీగలు కూడా వేస్తా వుండింది. అది మెడికి గూడా చేసింది. ఆ కొట్టంలో అది ఈనినా, ఆ మబ్బులో దాని దూడ దానికి కనిపించునా? లాంతరు లేకుండా సూత్రం పని జరగదు. నట్టింట్లో వేప చమురు దీపం తప్పించి, కనీసం బుడ్డీ దీపం కూడా లేకుండా ఇన్నాళ్లూ కాపరం చేసేసింది కర్రెక్క. ఆమె ముక్కుల గుండా పొడుగ్గా గాలి పీల్చి 'మ్' అని మూలిగి ఎదురుగుండా కూతురు ఒకటికి రెండు మాట్లు ఆవిలించడం జూసి "ఇంకబోయ్, పండుకోబోకసేయ్" అనింది. ఆ అమ్మితో మాట్లాడిన అమ్మను జూసి, ఇదే అదనుగా "వాడ్ని గూడా రమ్మను. నాకొక్క దానికే ఇంట్లో బయం గదమా" అని అంజిలి గడప మీద కూర్చొనింది. ఈ ఎనుము ఈనే కుశాలలో పడిపోయిన పెదబ్బ (జనార్దినాయుడు)కు ఇప్పుడల్లా నిద్రరాదనిపించిన కర్రెక్క, "వాడు పొడుకోడులే. నువ్వేబోయి పడుకో. నీ పెదమాదిగోడొచ్చి నిన్ను ఎత్తక పోడుగాని-" అనేసి ఆమె లేచి నిలబడింది. కమలమ్మ ఇంట్లో, తులిశమ్మ ఇంట్లో ఇద్దరిండ్ల

లో గూడా కరంటు వుండాది. వాళ్లిద్దరికీ లాంతర్లు గూడా వుండాయి. ఈ లంజ నా సవు తుల్ని అడిగినా, ఒక మంచి పనికి లాంతరు ఇయ్యబోతారా? అడిగి నోరు కడుక్కోవలసిందే గదా. అయినా, ఒకర్ని ఒక వస్తువ అడక్కుండా మనం అంత మానంగా గూడ బతకతా వుండాం? ఒక మాట అడిగి చూద్దాం. అవీ బిడ్డలు కనిని ముండలైతే యిస్తాయి. కిరాతకపు ముండలైతే యియ్యవు' అనుకొని కర్రెక్క తులిశమ్మ యింటికి నడిచింది. మొగుడు ఎప్పుడో చచ్చిపోయి ముండమోపిగా వుండే తులిశమ్మ ఇంట్లో లైట్లు ఆర్పుకొని బిడ్డల పక్కన పడుకొని వుండాది. ఆమె తలుపులన్నీ బారగా తీసేసే పడుకొని వుండింది. ఎంతో యెచ్చరిక గలిగిన తులిశమ్మ నిద్దర్లోనే కర్రెక్క అలికిడికి వులిక్కిపడి బిత్తరపోయిన దాని మాదిర "ఎవురాడ, ఈ అపరాత్రి పూట ఎవురాడ? ఆ ఎవురాడ, అడిగేది యినపల్లా" అని గొంతు పెంచింది. "తులిశక్కా, నేను గదా, నేను" అని కర్రెక్క ఒకటికి పదిసార్లు అన్నాక తులిశమ్మకు నిమ్మళం గలిగింది. తులిశమ్మ, 'దొంగ దొంగ' అని ఎక్కడ అరిచేస్తాదోనని బయపడి చచ్చింది. కర్రెక్క తులిశమ్మ ఆగడం జూసి 'ధూ మాటిమాటికీ ఒకరి మింద ఆదార పడే ఈ మానం చెడ్డ బతుకు బతకగూడదబ్బా' అనిపిచ్చింది కర్రెక్కకు. తులిశమ్మ నిమ్మళమైన గొంతుతో, "కర్రా, వాసె కర్రా! నువ్వు నిలబడుకొని వుండేకాడ సిచ్చి వుండాది. లైటు యెయ్" అనింది. కర్రెక్క లైటు వేసింది. "అక్కా, ఎనుము ఈనబడింది. ఈ రాత్రికే ఈనేస్తింది. లాంతరు గావాలని" అనింది కర్రెక్క. "కర్రిదానా! నేను నీ కంటికి బమ్మరాచ్చసిగా కనిపిస్తా వుండానా ఏంది? కనాగస్టం లాంతరుకు నిద్రపోతా వుండిన దాన్ని లేపి అడగాల్నా? నా యింట్లో నీకు అడ్డమేంది? పొయ్యి గడ్డ మీద వుండాది లాంతర, ఎత్తకపోయి జరుపుకో బో. కిరసనాయిలు గూడా నిండికి వుండాదిలే" అనింది తులిశమ్మ పడకలో నుంచే. లాంతరును చేతికి తీసుకొని, లైటు ఆర్పి బయటపడింది కర్రెక్క. 'పోకిరి పోకిరిగా ఒక మాట తూలిత్తిందే గాని ఇది మెతక ముండే, కమలమ్మ అట్టా లంజినా సవితి గాదు' అనిపించింది కర్రెక్కకు. లాంతరు కొట్టంలో తగిలించిన కాసేపటికి ఎనుము ఈనబడింది. అది నిలుచున్న చోట నిలుచుకోకుండా చుట్టూరా తిరిగి అపసోపాలు పడతా వుండింది. కొంచేపట్లోనే దాని మెడిమి గుండా దూడ కాళ్లు కనిపించినాయి కర్రెక్కకు "ఇంక కొంచేపు వార్చుకో కూతరా! ఈనేస్తావు. నీ నెత్తి బరువు నేల దిగిపోతింది" అనింది కర్రెక్క ఎనుముది పడుతున్న అవస్త జూసి .అక్కడే నిలబడి చూస్తావుండడం మంచిదిగాదనిపించి, జనార్ది నాయుడుని గూడా తోడుకొని కొట్టంలో నుంచి తిన్నెమీదికి వచ్చింది. ఉత్తరంగా తిరమల కొండ మీద దగద్దమానంగా వెలిగిపోతా వుండిన పాల బల్బుల సోలుపు (వరస)ను జూసి, కర్రెక్క రెండు చేతులు జోడించి, "మహాన్నబావా! బారం అంతా నీవే సామీ, ఎనుమూ దూడా సక్కరంగా వుంటే, ఈనిన వారం రోజు ల్లో నీ వుండిలో సొలిగెడు నెయ్యి పోసి, నిన్ను దరిశనం చేసుకుంటాము సామీ" అని చేతులు జోడిచ్చి స్వామి కొండకు మొక్కు కొనింది. అమ్మ ఆ రీతిగా చేతులు జోడిచ్చడం జూసి జనార్దినాయుడు గుడా తిరుమల కొండకు చేతులు జోడిచ్చినాడు. . అది చూసిన కర్రెక్క వాడ్ని పక్కలోకి జరుపుకొని ముదిగారం పోయింది. గడప మీద కూర్చునిన మాటకారి అంజిలి అక్కడే నిద్రతో తూగడం

జూసి యింతకు ముందరే రామచంద్రమనాయుడు, కూతుర్ని గుడిసిలో చాపమీద పడుకోబెట్టినాడు. కర్రెక్క తిన్నె దిగి మళ్లీ కొట్టంలోకి పోతుంటే వెనకన్నే వచ్చినాడు జనార్ధినాయుడు. మెడిమి లోనుంచి సగం దూడ కంటికి కనిపించిందమ్మా గొడుక్క. ఎనుము వాళ్ల కండ్లముందర్నే ఎంతో చురుగ్గా ఒక్క చుట్టు తిరిగే సరికి-దూడ కింద పడిపోయింది. ఎంతో పిరింతో దూడను చూసుకుంటూ ఎనుము నాలికతో నాకడం మొదలు బెట్టింది. కర్రెక్క దూడ తోకను పైకెత్తి-ఒరే, పేగుదూడ అనింది కుశాలతో. దున్నపోతు పుట్టకుండా పేగుదూడ పుట్టడంతో జనార్ధినాయుడు కిందా మీదా పడిపోతూ, నాయినను జేరి "మూగెద్దు మాదిర తిన్నె మీద కూచోకుంటే కొట్టంలోకి పో ఏమి? ఎనుము పేగుదూడ ఈనింది, చూడుబో" అన్నాడు అందుకు రామచంద్రమనాయుడు, "ఇంకేమీ దిగులు లేదులే, ఎనుము పేగుదూడ ఈనేసింది గదా, యింక మనకే దిగులూ లేదులే" అని ఎగతాళి ఆడినాడు, ఎనుము పేగుదూడ ఈనినంతలోనే మన యెతలు తీరునా? అన్నట్టుగా. కర్రెక్క కొట్టంలోనే చేరుకొని దూడ గిట్టలను కొంచిం గిల్లి, ఎనుము నోటికి అందించగా అది నమిలి మింగేసింది. ఎనుము ఈనిన ఒక గంటకంతా, దూడ నేలమీద నిలదొక్కుకొని లేచింది. ఇప్పుడే దూడ ఎన్ని ముర్రుపాలు తాగినా మంచిదేగదా--అని తెలిసిన కర్రెక్క, రొమ్ములను దూడనోటికి అందించింది.

జనార్ధినాయుడు నిద్రను తట్టుకోలేక చెల్లిపక్కలో జేరి నిద్రపోయినాడు. రామచంద్రమనాయుడికి కూడా కండ్లు మూతలు పడి 'ఓ' అని ఆవులింతలు రావడం మొదలు బెట్టినాయి. ఆయన చుక్కలను జూసి, 'అమ్మో, రొంటి గంట దాటుండదాటయిము?' అనుకొన్నాడు. నిద్రపోతే, పెళ్లాం 'నీ కన్నా పసిబిడ్డ సుమారు గదా!' అని దొబ్బులు పెడుతుందని బయపడి మేలుకుని వుండే అందుకు తంటాలు పడతా వుండినాడు. ఆయన నిద్ర మొకంతో కాళ్లు ఈడ్చుకుంటా వచ్చి "పేగుదూడంటగదా? నువ్వు కోరిన కొండ మీద వాన కురిసింది పో" అన్నాడాయన, గొంతు కూర్చుని వుండిన పెళ్లాంతో. మొగుడి అగచాట్లు చూడలేక, "నన్ను మచ్చిక జేసుకొనే మాటలు ఎందుకు గాని, నువ్వు పోయి పడుకోబో, పిల్లకాయల పక్కన, నీ నిద్దర కండ్లను నేను జూడలేను. నా గుక్కెడూపిరి బోతే ఎట్ట బతక బోతావో గదా" అనింది కర్రెక్క నవ్వుమొకంతో. రామచంద్రమనాయుడు ఆ మాట చాలన్నట్టుగా, కాళ్లీడ్చుకుంటూ గుడిసెవైపు పోతుండగా "కాళ్లను కొంచెం ఎత్తి నడువు, కాళ్లు తగులుకోని పడబొయ్యేవు. వుళ్లో టించరు గూడా లేదుసామీ" అనింది ఎగతాళిగా. పెళ్లాన్ని ఒక్కసారి యెనిక్కి తిరిగి జూసి 'నాతోనా నీ యాసందం( ఎగతాళి?) అనేసి ఆయన పిలకాయల పక్కన జేరినాడు.

కర్రెక్కకు గూడా మూదేవి కమ్మడంతో ఆమె రెండుసార్లు ఆవులించి, నోటి దగ్గిర చిటికలు వేసుకొనింది. గొడ్డుకు ఈనడం వొక కష్టమైతే, మాయ వేయడం యింగొక కష్టం అనుకొనిందామె. కడుపుతో కడుపుడు వుండిన ఎనుము ఒక్క నిమిషంలో డొక్కలను దిగేసుకొని, బోలుబోలుగా అయిపోయింది. కర్రెక్క పైకిలేచి, కొట్టంలో ఒక మూలవుండిన తట్టలో నుంచి చెక్కుడు కసువు పచ్చిది -- వేసింది, ఎనుము ముందర,

బక్కెద్దులు కఱ్ఱెక్క కల్లా నిష్ఠూరంగా, "యింగమాకల్లా చూడవుగదా!' అన్నట్లు చూస్తే సరికి, ఆగిత్తల గాడిలో కూడా కొంచెం కసువును విదిలించింది. ఎనుము ఆ పచ్చికసువును చూడనేలేదు. వరి కసువు-ఎండుది-గాన వేస్తే పరపరమని నమిలి తింటె, గంటలో వేసే స్తుంది మాయ- అనుకొనినది కఱ్ఱెక్క. నాలుగు పోచల గడ్డివామి కూడా ఆమెకు లేదు. యాడ నుంచి వుంటింది- గడ్డివామి? పాపం, కొంద్రబూమి లేకుంటే యాడ నుంచి నస్తుంది గడ్డివామి? ఇప్పుడెట్ట? ఎండు కసువు లేకుంటే అది మాయ వేయడం కష్టమే- అనుకొని కఱ్ఱెక్క మదన పడింది. తులిశమ్మకు పాపం మగదిక్కు లేక పోవడంతో ఆమెకు కలిగిన రెండెకరాల కయ్యనూ వారానికి (కౌలుకు) ఇచ్చేసింది. అందుకని ఆమెకు గొడ్డూ గోదా లేదు. వరిపోచల అవసరమే తులిశమ్మకు వుండదే. ఎక్కడన్నా ఒక కట్ట ఎండు కసువు సంపాయించకుంటే ఎట్టబ్బా-- అని దిగులు పెట్టు కొనింది. కమలమ్మను ఈ వేళప్పుడు నిద్దర లేపి అడిగినా, నోరు కడుక్కోవాలసిందే. ఒక కట్ట ఎండు కసువును దానం చేసే మంచి బుద్ధి దాని దగ్గిర యాడిది? అని పించిందామెకు. కఱ్ఱెక్క ఒక్క క్షణం గూడా ఆలోచించకుండా కమలమ్మ కొట్టంలోకి నడిచింది. కమలమ్మ గాడి ముందర పడుకొని వుండిన ఎద్దులు కఱ్ఱెక్కను చూసి బుసకొట్టి కొమ్ములు విసిరినాయి 'మీరు గమ్మున వుండండే నా బట్టా ఎద్దులారా' అని గొణిగి ఆమె చెయ్యెత్తితే అందేటట్టుగా వుండే అటకలో ఒక కట్టను కిందికి లాగింది. అప్పుడనంగానే కమలమ్మ-దేముడే లేపిన రీతిగా- కొట్టంలోకి వాంటేలు పోసుకుందామని వచ్చి కఱ్ఱెక్కను జూసి "ఏమే కఱ్ఱా! ఎనుము ఈనిందా ఏమి? ఏమి దూడ?" అని ఆత్రంగా అడిగింది. రెప్పపాటు గుండెల్లో రాయి పడిన కఱ్ఱెక్క కమలమ్మ గొంతులోని నిమ్మళాన్ని జూసి "పేగుదూడ ఈనిందక్కా. ఎంతకీ మాయ వేయకుంటే పిడికెడు కసువు తీసక పోదామని వస్తిని. నిద్దర పోయే మనిషిని లేపేదెందుకులే అని నిన్ను లేపలా" అనింది. "కసువే గదా, అదేమన్నా బంగారా? తీసుకపో" అనింది కమ లమ్మ. కఱ్ఱెక్క నమ్మలేనట్టుగా ఆ కట్ట కసువూ తీసుకొని వచ్చేసింది. ఏ వుబ్బు (మూడ్) మీద వుండిందో గాని, దీని బుద్ధి ఇప్పుడు బాగుండింది. లేకుంటే ఈ పాటికి నన్నుయెంటిక్క కట్టుకొనిగిరగిరా అప్పాలు తిప్పేసి వుండదా?'- అనుకొనింది కఱ్ఱెక్క. మొత్తానికి మన టయం బాగుండాది ఈ రోజు-అనిపించిందామెకు. ఎనుము ఎండు గడ్డిని వంచిన మూతి లేపకుండా తినేసింది. అది తెల్లవారు జాము నాలుగు గంటలకంతా మాయ-చాటడు- వేసేసింది. కఱ్ఱెక్క కొట్టం చుట్టూరానే నక్క మాదిర తిరుగాడుతా వుండిన ఒక కుక్కను రాయితో తీసి కొట్టి, యింటిలోకి పోయి పార తీసుకొని వచ్చింది. చాటలోని మాయను, పారను తీసుకొని, ఇంటికి దక్షణం పక్కగా పది బారల్లోనే వుండిన వూరవతల కొంకి పొద దగ్గిరికి వచ్చింది. మొగుడ్ని, లేపుకొని వద్దాం-- అనుకొనింది గాని, తెల్లవారి లేస్తే పాపం ఆయన ఆ బక్కెద్దుల యెనకాన పోయి (బాడుగ కోసం) మడక (నాగలి) దున్నాల గదా- అనిపించి కనికరం కలగడంతో లేపలేదు. కఱ్ఱెక్క కొంకి పొద కింద వుండిన పుట్టను చేతెడు లోతు తవ్వింది. మాయను ఆ గుంతలో పోసేసి, మట్టితో పూడ్చేసి చాటా పారతో ఎనుము దగ్గిరికి వచ్చింది. దూడ అప్పుడే తల్లి చుట్టూరా తిరగలాడడం కూడా నేర్చుకునే

సింది. మళ్ళ కర్రెక్క పడుకుని కాసేపు నడుము వాల్చిందిగాదు. పొయ్యి రగలేసి బానడు నీళ్లను కాగబెట్టింది. తెల్లవారి నాక ఎనుము పాలను పిండింది. ముర్రుపాలు గదా–అది అర్ధ శేరు మాత్రమే యిచ్చింది. ఎనుమును నడివీదిలోకి తోలుకొని వచ్చి, దాని మీద ముంత లతో వుడుకునీళ్లను కుమ్మరించింది. దాని ఒళ్లు ఆరక ముందే బూడిదతో, దాని వీపు మీదా, ముణుకుల మీదా పట్టీలు గీసింది. రామచంద్రనాయుడు రాత్రే పేని పెట్టిన వెంట్రుకల తాడుతో కాల్చిన టెంకాయ చిప్పను దూర్చి దానిమెడలో కట్టింది. అప్పుడు అమ్మ పక్కనే నిలబడుకొని వుండిన అంజిలి, "అమా అమా, రాత్రి నువ్వు పడుకొనేసరికి యాళ ఎంతయిందమా?" అప్పుడే గుర్తుకు వచ్చినట్టుగా అడిగింది. "నీకు నీ అమ్మ వుండాది. నీ నాయనకు పెళ్లాం వుండాది. పడుకుంటారు. పోవాలసినంత నిద్దర పోతారు. నాకెవ్వరు వుండారు కూతరా? నేను పడుకొంటే నాకు జరుగునా?" అనింది. కర్రెక్క నవ్వుమొకంతో.

ఆ తెల్లవారి ముర్రు పాల జున్నును కర్రెక్క కాసింత కూడా పిలకాయలకు పెట్టలేదు. ఆ పూట పిలకాయలకు కడుపునిండా చద్దిపోసి, కర్రెక్క చద్ది తాగకుండా, జున్నునే తినేసింది. రెండు రోజులూ ఎనుముపాలు జున్నే అయింది. రెండో రాజు సాయంకాలం మాత్రం కొడుక్కి, కూతురుకి జున్నులో కొంచెం చక్కెరని కలిపి, తినమని యిచ్చింది. పిలకాయలకు జున్ను మంచిదిగాదు, పైత్యం జాస్తి. నడుములు పట్టుకుపోతాయి– – అని అనుకోవడంతో ఆమె బయపడి జున్నును పిలకాయలు కోరినంతగా పెట్టలేదు. కర్రెక్క ఈ రెండు రోజులు జున్నునూ ఇంటి గడప దాటనీలేదు. ఇక్కనా పక్కనా వాళ్లయిన తులిశమ్మకు, కమలమ్మకు కూడా యింత తుంచి పెట్టలేదు. ఈవూరి కోడాలుగా వొచ్చి పన్నెండు పద్మూడేండ్లవతా వుండాది. ఔట్టి ఎనట్టై గడపవుండే ఈ పాడు వూర్లో నమచ్చరానికి నలపై ఎనుముల లెక్కన ఈనతానే వుండాయి. నాకు జున్నంటే అమ్మా అబ్బను చూసినట్టే గదా. ఏ నాసవి తన్నా 'కర్రెక్కా, పట్టు' అని నా చేతిలో యింత జున్ను పెట్టి వుండునా? ఇందమ్మా తియ్యగూర అంటేవే గదా ఇందమ్మా పుల్లగూర అని అంటాం. నేను మాత్రం ఎందుకు పెట్టాల జున్నును, ఒక నా సవితికి, ఒక నా లంజికి? అనే కసితో ఆమె జున్నును ఇతరులకు వాసన కూడా చూపించలేదు.

## 3

కర్రెక్క ఎనుము కాళ్ల దగ్గిర గొంతు కూర్చొని, చెంబులోని నీళ్ళను చేరడు ఎగర జల్లి, వేళ్ళతో రొమ్ములను సరిదిద్దింది. అందాకా వదులువదులుగా వుండిన ఎనుము రొమ్ములు ఒక్కసారి కుడుములు మాదిరి బిర్రుగా అయిపోయినాయి. 'అమ్మ, చేపు విడిచిందిరా!' అని అనంగానే జనార్దినాయుడు దూడను ఎడమ నుంచి కడగా లాగేసి కట్టేసి వాడు. ఆ లేత దూడకు తాడు మెడకు గాకుండా కాలికి వుండాది. కర్రెక్క రెండు లోటాల నీళ్ళను చెంబులో పెట్టుకొనే పాలు పిండడం మొదలు బెట్టేసింది. పాలచుక్కలు ఆ నీళ్ళలో సరక్ సరక్‌మని శబ్దం జేస్తావుంటే అమ్మకళ్లా యిచ్చిత్రంగా చూసినాడు జనార్ది నాయుడు. అప్పుడనంగానే లింగులింగు మని సైకిలు బెల్లు మోగించుకుంటూ పాలాయన– సహదేవరెడ్డి–వచ్చి కొట్టం ముందర ఆగినాడు. కర్రెక్క పాలు పిండతా వుండడం జూసి,

సహదేవరెడ్డి మొకాన్ని కందగడ్డగా జేసుకొని, "ఇదేం అన్యాయం కర్రెక్కా? ఇది నీకు నాలుగో యావత్తు చెప్పటం. ఇంగనుంచి నువ్వు నా ముందర చెంబుబోలవేసి చూపిం చందేపాలు పిండొద్దు. ఇదే కడుమాటగా చెప్పటం' అన్నాడు. కర్రెక్క సహదేవరెడ్డి నిష్ఠూ రానికి బదులుగా ఏ మాటా అనకుండా పాలు పిండతానే వుండిపోయింది. వారంనుంచి ఈ పాలోడు ఇదేరకంగా తగరారు పెట్టుకుంటూనే ఉండాడు. కర్రెక్క మాత్రం ఆయన వచ్చే సరికే పాలు పిండిపెట్టేస్తావుండాది. పాల చెంబుతో కొట్టంబయటకు వచ్చిన కర్రెక్క 'నామీద నీకు అంత అనుమానంగా వుంటే డిగిరీ తెచ్చి యేసుకో సహదేవన్నా! పాలల్లో ఏదన్నా మిస్టేకు గన వుంటే, నీ ఎడంకాలి చెప్పుతో నా పాపిటదీసి పదారు యేట్లు (దెబ్బలు) కొట్టు, అప్పుడు తలొంచతా" అని బెట్టుగా మాట్లాడింది. ఈ మాటలకు ఒళ్ళంతా రగలకపోయిన పాలాయన, గోరువెచ్చగా వుండిన చెంబులో చూపుడు వేలుబెట్టి, ఒక పాలచుక్కను బులుగురంగులో వుండే సైకిలు సీటుమీద వేసి, "చూడు కర్రామె! పాలు ఉత్తరంగా నీళ్ళు దచ్చినం.... ఒకదానికి ఒకటి సమంగా లేకుండా పోతుండాయి?' అని అక్క సుగా మాట్లాడినాడు. చిన్నతనమై పోయిన కర్రెక్క అనుకోకుండా, "సహదేవన్నా! పాల సుక్కకాడ అబద్దాలు జెప్తానా? నేనేమీ ఒట్టిగాలేను. ఒకరికి ఇద్దరు బిడ్డల్ను పెట్టుకొని వుండాను. నేను--యెంగటేస్సరసామి స్నానమాడే పాలసుక్కకాడ అపద్దం జెప్తానా?" అనేసింది. (జనార్దినాయుడికి అక్కడ వుండను నగించక బజన గుడికాడికి బలీనమైన నడత నడుచుకుంటూ పోయి నాడు). సహదేవరెడ్డి గొంతు ఏ మాత్రం తగ్గించకుండా, ఎక్కించే, "కర్రెక్కా! ఈ నంగిమాటల వల్ల కాసు ఆదాయం లేదు. నీకూ నాకూ దినుమ్మా రచ్చదేనికి ఇక్కపక్కనోళ్ళు ఇట్లాగే పిండతా వుండారా అడిగి కనుక్కో -- నన్ను ఎదురు గుండా పెట్టుకొనే ఎనుము దగ్గిర కుచ్చుంటా వుండారు, ఇది పాల యాపారం, పాలల్లో ఏదన్నా పాల్సుగాన వచ్చిందంటే తిరపతి టీ అంగిడోళ్ళు మా అమ్మను అంతపొద్దుకాడ ఒంగినబెట్టి చేస్తారు తల్లా!' అన్నాడు కరుగ్గా, కర్రెక్క నోటి మాటెత్తకుండా శేరు పాలమా కేనులో పోసేసి, 'నా బట్టా, నువ్వు ఊరిక బయటకు పోయి ఆ కేనులో బిందెడు నీళ్ళు పోసుకొనే సంగతి ఎవుడికి తెల్దు?' అని అనుకుంటూ ఇంట్లోకి పోతావుంటే పాలాయన, "చెప్పింది మర్చిపొయ్యేవు తల్లా!" అని మళ్ళీ యెచ్చరిక జేసేసి సైకిలేసుకొని పోయినాడు. ఇంట్లోకి వచ్చిన కర్రెక్కకుమనసుకు చిటామనిపించి రోత బుట్టింది. 'ఆ మొండి నాబట్ట ఒప్పుకొనే ఘటమా? ఈ రోజుకాకున్నా రేపుట్నించన్నా వాడ్ని దగ్గిర పెట్టుకొనే పాలు పిండాల గదా! ఇంతలో మాత్రానికి ఈ పియ్యిలినే నోటికి అపద్దాలిందుకు? థూ, అనావ శింగా బిడ్డల మీద కూడా సొచ్చిం చేస్తినే! హీనపు ముండను, అని ఆమెలో ఆమే తిట్టుకొ నింది. ఎనుము తెల్లారీ సందేళా శేరులెక్కన పాలు ఇస్తావుండాది. సందేళ పాలను కర్రెక్క అరశేరు-రామచంద్రా పరం టీ అంగిడోళ్ళకు పోసేసి, మిగతా అరశేరును కాగబెట్టి, చేమిరి వేసి మజ్జిగ చేసుకుంటా వుండాది. కర్రెక్క ఎక్కడ నీళ్ళల్లో పాలు పెట్టేస్తిందేమోనని బయపడి రామచంద్రాపురం టీ అంగిడామె ఎంతో కరట్టుగా నెల రోజుల పాలకు ముందే అర్వై రూపాయలు అడమాన్సుకూడా ఇచ్చి దగ్గిరుండి పిండించు కుని పోతాది. 'ఈ కాలం

గుడ్డి లంజికొడుకు వాయిస్తున్నది ఏ పాట?

గద్దరుగాడి పాట!

అమ్మనాకొడక

నక్సలైటు నాకొడక

దోపిడీ చెయ్యటం కాడ్నించి అడుక్కునే పన్లో కూడా మీరే చొచ్చుకు పోయేరన్నమాట.

విశ్వనాథం చరచర నడుస్తూ ముసలాడి దగ్గరకు వెళ్ళాడు.

"ఏం రోయ్.. గుడ్డి నా కొడకా..." అని పిలిచాడు.

గుడ్డిమనిషి అది వినలేదు.

"నీ పాటా పాడుతున్నమూ

నీ ఆట ఆడుతున్నామూ..." అంటోంది మురళి.

వంగి అతని చేతిలోని మురళి లాక్కుందామనుకుని. -- మనకి దేవుడిచ్చిన కాళ్ళుండగా చేతులెందుకు పాడుచేసుకోవాలి-- అనుకొని ఎర్రబూటుతో ఆ మురళిని కదిపేడు.

ఆ బూటు మడమ గుడ్డిమనిషి గడ్డానికి తగిలింది.

గుడ్డి కళ్ళ గుహలనుంచి చీకటి చిమ్ముకొచ్చింది.

అతను భయంగా కంగారుగా లేచి నిల్చున్నాడు.

చేయిముందుకు చాస్తూ--

"ఎవరది... ఎవరది... " అని పిరికిగా, భయంగా అన్నాడు.

"నీ అమ్మా మొగుడ్ని... గుడ్డినా కొడకా... ఏం పాటలు పాడుతున్నావురా? కాళ్లేతులు విరిచీగల్ను..."

గుడ్డి మనిషి నిజానికి పుట్టుగుడ్డి. వాడికి వెలుతురంటే తెలీదు. మనుషుల ఆకారం తెలీదు. జంతువుల ఆకారం తెలీదు. కాని కుక్కొస్తే, పోలీసొస్తే అతనికి ఎలాగోగాని తెలిసిపోతుంది. వచ్చినవాడు పోలీసని అతనికి తెలిసిపోయింది.

"పోలీసా?" అని అతను భయంగా అడిగాడు.

విశ్వనాథానికి అనుమానం గట్టిపడిపోయింది.

"నన్ను చూడగానే పోల్చేసేవు.. అంటే నువ్వు నిజంగా గుడ్డోడివి కాదన్న మాట..." అన్నాడతను.

"చూడగానే కాదు బాబు. నాకు చూపేలేదు. చప్పుడు బట్టి పోల్చేను..." అన్నాడు గుడ్డిమనిషి దండం పెడుతూ.

దండధారులు దండాలకి కొంత తగ్గుతారు. విశ్వనాథం తగ్గి-- "నువ్వు అడుక్కుతినీ నాకొడుకువా కాదా?" అని అడిగాడు.

"అడుక్కోను తండ్రీ. నేను ఈ ముర్లి వాయిస్తాను... దయగల తండ్రులు పావలా బేడా ఇస్తారు."

"వాయించుగానీ.. చక్కా దేవుడి పాటలుంటాయి అయి వాయించుకో... ఇలాంటి నక్సలైటు పాటలుగానీ పాడేవంటే చావదొబ్బుతాను." అన్నాడు విశ్వనాథం గుడ్డి మనిషి కంటిముందు చూపుడువేలు ఆడిస్తూ.

గుడ్డిమనిషి మాట్లాడలేదు.

విశ్వనాథం అక్కడ్నుంచి ఒచ్చీసేడు.

మరో నాలుగురోజులు పోయిన తర్వాత ఆ దోవన వస్తుంటే ఆ గుడ్డిమనిషి మురళి వాయిస్తూండటం కనిపించింది.

"మన శిశువు ఏటి వాయిస్తున్నాడో సూద్దారి.' అనుకుని అతను మోటార్ సైకిల్ ఆపు చేశాడు.

"దండూ దండూకు నేను ఎర్ర జండా నౌదు

భారతీ గిరియాల

కూలినాలన్నాలు

నా కూలీనాలన్నాలు

దండులేరంగో

దండూడు దండూ నేను ఎర్ర జండనౌదా...

క్షతగాత్రంతో మురళి పాడుతోంది.

విశ్వనాథం పడగవిప్పాడు.

సైకిల్‌స్టాండు వేసి, గుడ్డివాడి రెక్క పట్టుకొని అధాట్టున పైకిలేపేడు. వళ్ళంతా తూట్లుపడిన వెదురుముక్క కింద మట్టిలో పడిపోయింది.

"పదరా స్టేషన్కి... నీ గుడ్డికళ్ళు పీకేయకపోతే నేను పోలీసునై పుట్టలేదు..." అన్నాడు విశ్వనాథం.

గుడ్డికళ్ళనో, అందులో నుంచి చుంచెలు కల్లాగ తొంగిచూస్తున్న భయాలనో దాచడానికి అతని రెప్పలు రెక్కలు రాల్చేయి.

బండ పెదాలు భయంగా రోకలిబండల్లాగ ముడుచుకున్నాయి.

"ఎందుకండి బాబు..." అన్నాడు గుడ్డి మనిషి.

"మొన్న నీకేం చెప్పేన్రా?"

గుడ్డివాడు పెదాలతో గాలి మాత్రం వూదగలడు అది మురళి గొంతులో మాత్రం శబ్దమౌతుంది. శక్తిమంతమౌతుంది.

అందువల్ల అతనేమీ అనలేదు.

"దేవుడిపాటలు పాడమన్నానా లేదా?" అని కోపంగా అడిగాడు విశ్వనాథం.

గుడ్డిమనిషి వెర్రినవ్వు నవ్వాడు.

విశ్వనాథం బుస్సుమన్నాడు.

"నేను సీరియస్‌గా అడుగుతుంటేనీకు నవ్వొస్తున్నాదిరా లంజకొడకా" అన్నాడతను.

"పావల్డబ్బులిచ్చి మీరేపాటపాడమంటే ఆపాట పాడతానండి" అన్నాడు గుడ్డిమనిషి

చాలా మృదువుగా విశ్వనాథం చేయి విడిపించుకుంటూ.

"మరైతే నువు వాయిస్తున్న పాటకి డబ్బులు ఎవరిచ్చేరు... మావో సేటుంగ్ ఇచ్చేడా? చారుమజుందారిచ్చేడా... నీ అమ్మా మొగుడిచ్చాడా? చెప్పు లంజాకొడకా? ఏ లంజాకొడుకు నీకు డబ్బులిచ్చి ఈ చెండాలపు పాటలు పాడిస్తున్నాడు...." అని చాలా కక్షగా అడిగాడు.

"ఈ పాటలు మంచియా గాదా తండ్రీ?" అని ఆ గుడ్డి మనిషి నెమ్మదిగా అడిగాడు.

"కాదమ్మా... నువు మంచి పాటలు పాడితే నేనెందుకు తిడతానమ్మా. నువ్వు శ్రీ వెంకటేశ ఈశా, పాట వాయించు. గవర్నమెంటుతో మాట్లాడి నీకు భత్యం ఇప్పిస్తాను. మా పోలీస్‌స్టేషన్ ముందుకూచ్చుని రోజూ నువు దేవుడి పాటలు పాడు నీకు ఎన్ని డబ్బులొస్తాయో చూసుకో ఆ డబ్బులు పెట్టి నువ్వు చక్కా రిక్షా కొనుక్కొని ఊర్లోకి ఎక్కడబడితే అక్కడికి వెళ్ళి అడుక్కోవచ్చు. నీ బతుక్కి ఢోకా వుండదు నీ మంచి కోరే నేనిదంతా చెబుతున్నాను.... నువ్వు భలేగా వాయిస్తావు మురళి అసలు మురళి దేవుడిదిగదా. శ్రీ కృష్ణుడిది. నువు దాన్ని తీసుకెళ్ళి గద్దర్ గాడి చేతికిస్తే ఎలాగ?" అన్నాడు విశ్వనాథం.

"గద్దర్ ఎవరండీ?" అని గుడ్డి మనిషి అడిగాడు.

"వాడొకడున్నాడ్లే... తెలుసుకోవడం నీకు మంచిది కాదు... అసలు నీకిపాటలెలాగొచ్చురా?" అనడిగాడు విశ్వనాథం.

"మామురికి పేటలో ఆలకించేనండి.."

విశ్వనాథంతలూపాడు..." అదీ కథ... అందుకే మురికి పేటలు లేకుండా చేసేయాలి. మురికంటే పెంటకదా? పేడగదా? పేడంటే సత్తువుగదా. అక్కడ ఈ పాటలు నాటేస్తాయి. అసలు అందరూ మేడల్లో వుంటే ఈ డేంజరుండదు..."

నల్లని బండ పెదాలు సాగేయి. వాటి వెనుక తెల్లని పల్వరున మెరిసింది.

"అవునుబాబూ..." అన్నాడు గుడ్డివాడు.

టివ్వి టివ్వి టివ్వి టివ్వి ట్వీట్

టివ్వి టివ్వి టివ్వి ట్వీట్

అని అరుచుకుంటూ ఒక తీతిక ఎగిరి పోయింది.

"విన్నావా?" అన్నాడు విశ్వనాథం.

"అవునండి. తీతిక..." అన్నాడు గుడ్డిమనిషి కూర్చొంటూ.

"అదే... ఆన్సరు. నువు గద్దరుగాడంటే ఎవడని అడిగేవుగదా. గద్దర్ అంటే తీతిక.." అనన్నాడు విశ్వనాథం.

"తీతికూస్తే ఎవరికో కీడు మూడిందంటారండి.." అన్నాడు గుడ్డి మనిషి వేణువు కోసం తడుముతూ.

"అవును మరి అపశకునం..."

"అంటే ఏ లంజకొడుకో సస్తాడన్నమాటే గదండీ" అన్నాడు గుడ్డి మనిషిదొరికిన వేణువును. కుడిచేత్తో అందుకుని ఇసుకతులుపుతూ.

"అవునుగాని నువ్వు రఘురామయ్య గారి రామనీల మేఘశ్యామా' వాయించవా.." అని అడిగాడు విశ్వనాథం.

"నాకు రాదండి"

"నేను నేర్పుతాను"

"నేరిస్తే రాదండి పాట... మనం ఇనీ సరికి పాట మనల్ని తగులుకోవాలండి... అదండి పాటంటే... ఆ తీతిక పాట తగులు కుంటాదండి..." అన్నాడు మొద్దు పెదాలకి పేద వేణువు చేర్చుతూ.

"పోనీ నీకొచ్చిన పాట పాడు. దేవుడిపాట". అన్నాడు విశ్వనాథం.

గుడ్డి మనిషి ఊపిరి పీల్చుకుని వూదటం ప్రారంభించాడు.

"నగ్రెంక సెట్టుకింద నరుడో
భాస్కరుడో
నువు కన్నెర్ర చేస్తివయ్యా నరుడో
భాస్కరుడో
బగ్రెంక సెట్టుక్రింద నరుడో భాస్కరుడా
నువు బందూకు బడ్తివయ నరుడో
భాస్కరుడా."

అని ప్రారంభిచేడతను.

పాట అగరొత్తి పొగలాగ సాగుతోంది.

పాట మందార కొనలాగ ఊగుతోంది.

పాట రాతి గోడలోని మర్రి మొలకలాగ పెరుగుతోంది.

సగం అయ్యేసరికి విశ్వనాథానికి తెలిసి పోయింది.

గభాలున మురళి లాక్కున్నాడు.

"నిజం చెప్పు.. నువు నక్సలైటువుకదూ?"

"నక్సలైటంటే ఏటి బాబూ?"

"నువు కమ్యూనిస్టువు గదూ?"

"కమ్యూనిస్టంటే ఏటిబాబూ?"

"ఏమీ కాకుంటే ఈ పాటలెందుకు పాడుతున్నావు..."

'అవంటే నాకిష్టం కాబట్టి..."

"ఎందుకని?"

"తెలీదు"

"నీ కిష్టమైతే అయిందిగానీ నాకు ఇష్టంలేదు. నువు మరోసారి పాడావో నరికేస్తాను, పెదాలు చీల్చేస్తాను జాగ్రత్త... నా కొడకల్లారా... నరికేస్తాను జాగ్రత్త..." అని కేకలేసి చేతిలోని మురళి నేలమీద పడేసి బూటుకాలితో చెడామడా తొక్కాడు.

బూటుకింద నలిగిన వేణువు చిట్లింది. దాని గాలి రంధ్రాల నుంచి ఇంత నెత్తురు

కారింది.

కళ్ళు ఇంతలు చేసుకుని చూసేడు విశ్వనాథం.

చిట్లిన వేణువు నుంచి రక్తం స్రవిస్తోంది... ఆగకుండా...

అది ఇసుకలో ఇంకకుండా ధారకట్టింది.

ధార ఒక రక్తపాడ పాము లాగ సాగింది.

విశ్వనాధం భయంగా వెనక్కి అడుగులు వేశాడు.

ఆ ధార అతనికేసి సాగింది.

అది అంతకంతకు పెద్దదయింది.

అతనికి దగ్గరయింది.

విశ్వనాథానికి భయమయింది.

గభాలున మోటారు సైకిల్ స్టార్టు చేశాడు.

స్టార్టు చేసిన సైకిల్ గుర్రంలాగ ఒక దూకు దూకింది.

పగపట్టిన పాములాగ ఆ నెత్తుటి ధార అతని వెంటపడింది.

అది సన్నగా మొదలై, బలపడి, వెడల్పయి, పెనువేగంతో పరిగెడుతోంది.

ముందు విశ్వనాథం మోటారు సైకిల్

వెనకాల ఆ నెత్తుటి ప్రవాహం...

పాములాగ అది అతన్ని వెంటాడుతోంది చిట్లిన వేణువు అక్కడే వుండి నెత్తురు స్రవిస్తోంది.

నిరంతరం

అవిశ్రాంతంగా!

(మార్క్వెజ్ మీద ప్రేమతో)

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 17-8-84

# మృత్యుమైదానం

## వీరభద్రరావ్ పమ్మి

ఆ ఊరి పేరు కొండరాయపాలెం.

అది పట్నమూ కాదు. పల్లెటూరుకాదు. నగరం అంతకన్నా కాదు. దానికో చిత్రమైన చరిత్ర ఉంది. అంతకుమించిన వర్తమానం ఉంది. ఇంకా గొప్ప భవిష్యత్తు ఉందని ఆ ఊరి ప్రజలకు నమ్మకం ఉంది.

ఆ ఊరి చరిత్రేమిటంటే,

అది రాజధాని నగరానికి పదిహేను కిలోమీటర్ల దూరంలో ఓ మూలగా ఉంది. పూర్వం ఆ ప్రదేశమంతా చిన్న చిన్న కొండలతో, పెద్ద పెద్ద బండరాళ్ళతో నిండి ఉండేది.

ఆ ప్రాంతంలో జనం నివసించే వాళ్ళు కాదు.

రానురాను నగరం ఇరుకైపోయి ఫ్యాక్టరీల్లో పనిచేసే కూలీలు ఇళ్ళ అద్దెలు భరించలేక, ఇళ్ళు దొరక్క కొత్త ప్రదేశం కోసం అన్వేషణ ప్రారంభించారు. అలా వెతగ్గా వెతగ్గా కొలంబస్‌కి అమెరికా దొరికినట్లు వాళ్ళకి ఆ ప్రదేశం దొరికింది.

ఆ ప్రాంతంమీద ఎవరికీ హక్కు భుక్తాలు లేనందువల్లా, ఏ రాజకీయ నాయకుడూ, కబ్జాదారుడు దాన్ని ఆక్రమించుకోనందువల్లా పది మంది కూలీలు గుడిసెలు వేసుకుని అక్కడ నివాసం ఉండటం ప్రారంభించారు.

ఇది చాలా సంవత్సరాల క్రితం సంగతి....

రానురాను ఆ ఊరి విషయం తెలిసి ఆ ఊళ్ళో ఉన్నవారి బంధువులు, మిత్రులు కుటుంబాలతో అక్కడికి వలసరావడం ప్రారంభించారు.

అలా పెరిగి పెద్దదై ఆ ఊరు విస్తరించింది. అవసరం అన్వేషణకి తల్లిలాంటిదన్న సామెత ఆ ఊరుకే వర్తిస్తుంది. మెల్లమెల్లగా ఆ ఊరిలో ఓ కిరాణా షాపు, ఓ బట్టల కొట్టూ వెలిసాయి.

ఇంకొన్ని సంవత్సరాలు పోయాక అక్కడ పంచాయితీ ఏర్పడింది. రోడ్లు వేశారు. ఎలక్ట్రిసిటీ పెట్టారు. రేషన్ షాపు, మందులషాపు పెట్టారు. చివరికి ఆ ఊరి చివర ప్రభుత్వ

సారాయి దుకాణం కూడా పెట్టారు.

ఆ ఊళ్ళో చాలామంది ప్రజలు నగరంలోని ఫ్యాక్టరీల్లో పనిచేసుకుంటో సైకిళ్ళమీద నగరం వెళ్ళి కూరగాయలు, సరుకులు అమ్ముకుంటో, సాయంత్రానికి ఇళ్ళకి తిరిగి వచ్చేవారు.

ఇలా చాలాకాలం జరిగింది.

గల్ఫ్ దేశాల్లో చమురు దొరుకుతుందని ఎవరో మహానుభావుడు కనిపెట్టి ఉంటాడు. దాంతో గల్ఫ్ దేశాల చరిత్రే కాదు, ప్రపంచ చరిత్రే మారిపోయింది.

అలాగే కొండరాయపాలెం చరిత్ర కూడా మారిపోయింది. దాన్ని మార్చి వేసిన మహానుభావుడిపేరు దేవదాసు. అతనాఊరికి వలస వచ్చి చాలా కాలమైంది. మొదట్లో ఫ్యాక్టరీ కూలీగా జీవితం ప్రారంభించి కూలీల్ని సప్లై చేసే మేస్త్రిగా ఎదిగాడు.

మనిషి మంచివాడు.

పెళ్ళీడుకొచ్చిన కూతుర్ని తెలంగాణాలో ఓ చిన్న పట్నంలో కుర్రాడికిచ్చి పెళ్ళి చేశాడు.

ఆ పెళ్ళితో ముందు దేవదాసు జీవితం, తర్వాత ఆ ఊరి జనం జీవితం మారిపోయింది.

దేవదాసు వియ్యంకుడు మొదటిసారి కొండరాయపాలెం వచ్చినప్పుడు ఆ ఊరు ఓ గల్ఫ్ దేశంలా అనిపించింది. నగరానికి దగ్గరగా ఉంది. అలాగని మెయిన్ రూట్లోకాని, నేషనల్ హైవేలోకాని లేదు. ఓ మూలగా ఎవరి కళ్ళూ పడకుండా ఆకు వెనకాల పక్షిలా ఉంది.

"నువ్వు 'ఊ' అంటే నీ జీవితం మారిపోయే ఆలోచన చెప్తాను. కుడిచేత్తో, ఎడంచేత్తో సంపాదించే మార్గం చెప్తాను" అన్నాడు వియ్యంకుడు.

ఒక్కసారికాదు. నాల్గుసార్లు 'ఊ' అన్నాడు దేవదాసు. లోకంలో డబ్బాశలేనిదెవరికి? అందులోనూ రెండు చేతులా సంపాదించే మార్గం చెప్తానంటున్నాడు.

వియ్యంకుడు మార్గం చెప్పాడు.

దేవదాసు కొన్ని సందేహాలు, భయాలు లేవనెత్తాడు.

మహాజ్ఞాని శిష్యుడి సందేహాలు తీర్చినట్టు వియ్యంకుడు సమాధానాలు చెప్పాడు.

అంతేకాదు. దేవదాసుకి కావల్సిన పెట్టుబడి కూడా ఇచ్చాడు. దేవదాసు ఓ శుభముహూర్తాన పొయ్యి వెలిగించి తన వ్యాపారం ప్రారంభించాడు.

అది...

దొంగసారా తయారు చెయ్యడం...

తయారు చేసిన సారా నగరానికి సరఫరా చెయ్యడం.... దేవదాసు తయారుచేసిన సారా ప్రభుత్వం వారి సారాకన్నా ఎక్కువ మత్తునిస్తుంది. ధర తక్కువ. అందువల్ల గిరాకీ పెరిగింది.

సారా తయారు చెయ్యడానికి డబ్బులు వసూలు చేసుకునేందుకు దేవదాసుకి రెండు చేతులు చాల్లేదు. పదమందికి ఉద్యోగాలిచ్చి ఉపాధి కల్పించాడు.

దేవదాసు మంచివాడు. మంచి మనసున్నవాడు. ప్రపంచంలోని సంపదంతా తానే పోగేసుకోవాలన్న ఆలోచన అతనికి లేదు. ఆ ఊళ్ళో మరో ముగ్గురు ఉత్సాహం చూపిస్తే వాళ్ళ చేత బట్టీలు పెట్టించాడు. పెట్టుబడి కూడా పెట్టాడు. వాళ్ళు తయారుచేసిన సరుకు తానే తీసుకుని నగరానికి సరఫరా చేసే బాధ్యత తీసుకున్నాడు. అలా చేసినందుకు అతనికి కమీషన్ కిడుతుంది.

కాలం గడిచే కొద్దీ.. ఒకటి రెండై, రెండు మూడై, మూడు ఆరై, ఆరు ఇరవై నాల్గై ఆ ఊళ్ళో దాదాపు అన్ని ఇళ్ళల్లోసారా బట్టీలు వెలిసాయి.

పూర్వం తాటాకు పాకల్లో ఉండేవాళ్ళు తాటాకు ఇళ్ళలోకి తాటాకు ఇళ్ళవాళ్ళు పెంకుటిళ్ళలోకి మారారు. కొందరు మోపెడ్లు, స్కూటర్లు, మోటార్ సైకిళ్ళు కొనుక్కున్నారు. మట్టిగాజులు, పసుపు తాళ్ళు పేనుకునే ఆడాళ్ళు బంగారు గాజులు, బంగారు గొలుసులు వేసుకుంటున్నారు.

ఆ ఊరికి, సారా బట్టీలకి నాయకుడు దేవదాసు. అతనా ఊళ్ళో తయారయ్యే సరుకు కమీషన్ పద్ధతిమీద నగరానికి సరఫరా చెయ్యడమే కాదు, పోలీసుల్ని, ఎక్సైజ్ వాళ్ళని డబ్బుతో కొనేసి, కట్టేసి వాళ్ళ నుంచి ఆ ఊరుకి బెడద రాకుండా చూసుకుంటాడు...

అతను తెల్లని మారుతీ కారులో వెడుతుంటే ఆ ఊరి ప్రజలు రాజుని గౌరవించినట్టు గౌరవిస్తారు. తమనీ, తమ ఊరుని బాగు చెయ్యడానికి అవతరించిన దేవుడిలా చూస్తారు.

ఆ ఊళ్ళో ఉన్న సారా బట్టీలన్నిటినీ ఆడవాళ్ళే నడుపుతారు. మగవాళ్ళు ముడిసరుకులు తేవడం, తయారైన సరుకుని బట్వాడా చెయ్యడంలాంటి పనులు చేస్తుంటారు.

సాధారణంగా ఆ ఊరికి పోలీసుల్నించిగాని, ఎక్సైజ్ డిపార్టుమెంటు నుంచి గాని ఏ బెడదా రాదు...

ఒకవేళ ఏ కారణంగానైనా తప్పనిసరి పరిస్థితుల్లో వాళ్ళు రైడింగ్ చెయ్యాల్సి వస్తే ఆ విషయం ముందుగా దేవదాసుకి తెలుస్తుంది. అతను గోవర్ధన పర్వతం ఎత్తి తన ప్రజల్ని రక్షించిన శ్రీకృష్ణుడిలా ఆ ఊరి ప్రజల్ని రక్షిస్తాడు. అతి తక్కువ నష్టంతో, ఎక్కువ ఖర్చుతో రైడింగ్ పూర్తవుతుంది.

చాలా సంవత్సరాలు ఆ ఊళ్ళో సారా తయారీ మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగింది. ఆ ఊరి ప్రజలు బాగుపడ్డారు. పూటగడవడం కష్టంగా ఉండే వాళ్ళ జీవితాలు పూర్తిగా మారిపోయాయి.

కాని–మొన్న మొన్ననే ఆ ఊరికి ఓ సమస్య వచ్చి పడింది. కొన్ని నెలలపాటు ఆసమస్య ఆ ఊరుని, ఆ ఊరి ప్రజల్ని ఊపేసింది.

ఆ సమస్య గాంధీ అనే రూపంలో వచ్చింది. గాంధీ తండ్రి వెంకటస్వామి అయిదేళ్ళ క్రితం కొండరాయపాలెం వలస వచ్చాడు. అక్కడ సారా బట్టీ పెట్టి రెండు చేతులా సంపాదించవచ్చన్న ఆశతో తన వూళ్ళో ఉన్న పొలం అమ్మేసి ఆ ఊరుకి వచ్చాడు. ఆ ఊరి జనం అతన్ని ఆదరించారు. అక్కున చేర్చుకున్నారు. దేవదాసు అతనికి స్వాగతం పలికాడు. సారాబట్టీ పెట్టడంలో ఉన్న సూక్ష్మాలు వివరించాడు తన సహాయ

దేవదాసు మంచివాడు. మంచి మనసున్నవాడు. ప్రపంచంలోని సంపదంతా తానే పోగేసుకోవాలన్న ఆలోచన అతనికి లేదు. ఆ ఊళ్ళో మరో ముగ్గురు ఉత్సాహం చూపిస్తే వాళ్ళ చేత బట్టీలు పెట్టించాడు. పెట్టుబడి కూడా పెట్టాడు. వాళ్ళు తయారుచేసిన సరుకు తానే తీసుకుని నగరానికి సరఫరా చేసే బాధ్యత తీసుకున్నాడు. అలా చేసినందుకు అతనికి కమీషన్ కిడుతుంది.

కాలం గడిచే కొద్దీ.. ఒకటి రెండై, రెండు మూడై, మూడు ఆరై, ఆరు ఇరవై నాల్గై ఆ ఊళ్ళో దాదాపు అన్ని ఇళ్ళల్లోసారా బట్టీలు వెలిసాయి.

పూర్వం తాటాకు పాకల్లో ఉండేవాళ్ళు తాటాకు ఇళ్ళలోకి తాటాకు ఇళ్ళవాళ్ళు పెంకుటిళ్ళలోకి మారారు. కొందరు మోపెడ్లు, స్కూటర్లు,మోటార్ సైకిళ్ళు కొనుక్కున్నారు. మట్టిగాజులు, పసుపు తాళ్ళు పేనుకునే ఆడాళ్ళు బంగారు గాజులు, బంగారు గొలుసులు వేసుకుంటున్నారు.

ఆ ఊరికీ, సారా బట్టీలకి నాయకుడు దేవదాసు. అతనా ఊళ్ళో తయారయ్యే సరుకు కమీషన్ పద్ధతిమీద నగరానికి సరఫరా చెయ్యడమే కాదు, పోలీసుల్నీ, ఎక్సైజ్ వాళ్ళని డబ్బుతో కొనేసి, కట్టేసి వాళ్ళ నుంచి ఆ ఊరుకి బెడద రాకుండా చూసుకుంటాడు...

అతను తెల్లని మారుతీ కారులో వెడుతుంటే ఆ ఊరి ప్రజలు రాజుని గౌరవించినట్టు గౌరవిస్తారు. తమనీ, తమ ఊరుని బాగు చెయ్యడానికి అవతరించిన దేవుడిలా చూస్తారు.

ఆ ఊళ్ళో ఉన్న సారా బట్టీలన్నిటినీ ఆడవాళ్ళే నడుపుతారు. మగవాళ్ళు ముడిసరుకులు తేవడం, తయారైన సరుకుని బట్వాడా చెయ్యడంలాంటి పనులు చేస్తుంటారు.

సాధారణంగా ఆ ఊరికి పోలీసుల్నించిగాని, ఎక్సైజ్ డిపార్టుమెంటు నుంచి గాని ఏ బెడదా రాదు...

ఒకవేళ ఏ కారణంగానైనా తప్పనిసరి పరిస్థితుల్లో వాళ్ళు రైడింగ్ చెయ్యాల్సి వస్తే ఆ విషయం ముందుగా దేవదాసుకి తెలుస్తుంది. అతను గోవర్ధన పర్వతం ఎత్తి తన ప్రజల్ని రక్షించిన శ్రీకృష్ణుడిలా ఆ ఊరి ప్రజల్ని రక్షిస్తాడు. అతి తక్కువ నష్టంతో, ఎక్కువ ఖర్చుతో రైడింగ్ పూర్తవుతుంది.

చాలా సంవత్సరాలు ఆ ఊళ్ళో సారా తయారీ మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగింది. ఆ ఊరి ప్రజలు బాగుపడ్డారు. పూటగడవడం కష్టంగా ఉండే వాళ్ళ జీవితాలు పూర్తిగా మారిపోయాయి.

కాని–మొన్న మొన్ననే ఆ ఊరికి ఓ సమస్య వచ్చి పడింది. కొన్ని నెలలపాటు ఆసమస్య ఆ ఊరుని, ఆ ఊరి ప్రజల్ని ఊపేసింది.

ఆ సమస్య గాంధీ అనే రూపంలో వచ్చింది. గాంధీ తండ్రి వెంకటస్వామి అయిదేళ్ళ క్రితం కొండరాయపాలెం వలస వచ్చాడు. అక్కడ సారా బట్టీ పెట్టి రెండు చేతులా సంపాదించవచ్చన్న ఆశతో తన వూళ్ళో ఉన్న పొలం అమ్మేసి ఆ ఊరుకి వచ్చాడు. ఆ ఊరి జనం అతన్ని ఆదరించారు. అక్కున చేర్చుకున్నారు. దేవదాసు అతనికి స్వాగతం పలికాడు. సారాబట్టీ పెట్టడంలో ఉన్న సూక్ష్మాలు వివరించాడు తన సహాయ

ఇల్లంతా కలియ తిరిగి వెనుక వైపున్న షెడ్‌లోకి వెళ్ళాడు. కూలీలు చకచకా పని చేస్తున్నారు. అక్కడ ఏం జరుగుతోందో అర్థం చేసుకోవడానికి అతనికి కొంత సమయం పట్టింది.

సారా బట్టి!

తండ్రికేసి చూశాడు.

తండ్రి అతన్ని ఇంట్లోకి తీసికెళ్ళి తను చేస్తున్న వ్యాపారం. అందులో వచ్చే లాభాలు, ఆ ఊరి ప్రధాన వృత్తి, దేవదాసు చేసే సహాయం అన్నీ చెప్పాడు.

గాంధీకి ఆశ్చర్యం వేసింది. ఒక ఊరు ఊరంతా సారా తయారు చెయ్యడం అనే వృత్తిలో బతుకుతున్నారు. అదీ ప్రభుత్వం కళ్ళు గప్పి...

అతనికేదో అర్థం కానట్టుగా అనిపించింది.

మరికొంత సేపు పోయాక "ఇంతకీ అన్నయ్యేడీ?" అనడిగాడు.

తండ్రి తల్లి మొహం కేసి చూశాడు. తల్లి పెద్దకోడలి మొహంలోకి చూసింది. ఆమె నేల కేసి చూసింది.

గాంధీ మార్చి మార్చి అందరి కళ్ళల్లోకి చూశాడు.

"వాడికీ మధ్య ఒంట్లో బాగుండటంలేదు. ఆ గదిలో పడుకున్నాడు."

గాంధీ ఆ గదిలోకి వెళ్ళాడు.

అన్నగార్ని చూసేసరికి అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గుండెల్లో బాధ మెలి దిరిగింది....

అన్నగారు చిక్కిశల్యమై పోయి జీవచ్ఛవంలాపడి ఉన్నాడు. ప్రాణం ఉందా లేదా అన్నట్టుగా ఉన్నాడు.

"ఇదేమిటి -- ఇంత దారుణంగా ఉంటే హాస్పిటల్లో ఎందుకు చేర్చలేదు?"

ప్రక్కనే ఉన్న తండ్రి నడిగాడు.

తండ్రి ఏమీ సమాధానం చెప్పలేదు.

"తాగుడికి అలవాటు పడ్డాడా?"

"అవున్రా మొదట్లో బాగానే ఉన్నాడు. రాను రాను తాగుడికి అలవాటు పడ్డాడు ఎంత చెప్పినా వినిపించుకోడు స్పృహ లేకుండా పడుండటం".

గాంధీకి అర్థమైంది.

ఆ రాత్రి తండ్రితో అన్నాడు.

"మీరు డబ్బు సంపాదిస్తున్నాననుకుంటున్నారే తప్ప విలువైన పాణాలు పోతున్న విషయం గ్రహిచడం లేదు. ఇప్పటికి సంపాదించింది చాలు. ఇక్కడున్న ఆస్తిపాస్తులు అమ్మేసి మళ్ళీ మన ఊరు వెళ్ళిపోండి."

గాంధీ మాటలకి తండ్రి నవ్వాడు.

"ఊళ్ళో అందరూ ఇలా లేరు. మన దౌర్భాగ్యుడే ఇలా అయ్యాడు. దీపం ఉందనుకోదాన్ని మంచికి ఉపయోగించుకోవచ్చు - చెడుకి ఉపయోగించుకోవచ్చు. ఆ తప్పు దీపానిదికాదు. దాన్ని ఉపయోగించేవాడిది."

"నువ్వు దేన్నైతే దీపం అంటున్నావో! అది దీపంకాదు నాన్నా కొరివి. అది మనుష్యుల్ని తగలెయ్యడానికి మాత్రమే ఉపయోగపడుతుంది." తండ్రీ కొడుకులకి ఆ విషయమై చాలాసేపు వాదోపవాదాలు జరిగాయి . కొడుకు వాదనతో తండ్రి ఏకీభవించలేదు.

మరో వారం రోజులుండేసరికి గాంధీకి ఆ ఊరి విషయాలు చాలా తెలిశాయి.

ఆ ఊళ్ళో ఏ ఇంట్లోను డబ్బుకి కొదువలేదు. సుఖాలకి, డాబు దర్పాలకి కొదువలేదు.

కాని చాలా ఇళ్ళలో తన అన్నలాంటి జీవచ్ఛవాలు ఉన్నాయి. ఆ వారం రోజుల్లో తాగుడు వల్ల ఇద్దరు చనిపోవడం అతను కళ్ళారా చూశాడు. చనిపోయిన వాళ్ళ కుటుంబసభ్యుల రోదనలు చెవులారా విన్నాడు.

అతను ఈ విషయమై తీవ్రంగా ఆలోచించాడు.

ఆ ఊళ్ళో ఎవరికీ ఉద్యోగాలు చెయ్యాల్సిన అవసరంలేదు. ఆడవాళ్ళు బట్టీల్లో సారా తయారు చేస్తారు. దేవదాసు మనుష్యులు వచ్చి సరుకు తీసికెడతారు. ప్రతిఆదివారం దేవదాసు ఇంటింటికీ డబ్బు పంపిస్తాడు.

మగాళ్ళకి వేరే పనీపాటా లేదు.

ఎదురుగా సారా ఉంది.

మెల్లిగా అలవాటు పడతారు.

ఆ వ్యసనానికి బానిసలౌతారు.

బాగా ఆలోచించి -- ఆలోచించి..

ఓ రోజు గాంధీ వెళ్ళి దేవదాసుని కలిశాడు. తన మనసులో భావాలన్నీఅతనికి తెలియజేసాడు. ఆ ఊళ్ళో వెంటనే సారా పరిశ్రమ మూయించకపోతే ఊళ్ళో ప్రతి ఉంట్లో విధవలే మిగుల్తారని చెప్పాడు.

గాంధీ మాటలు విన్న దేవదాసు నవ్వాడు. పకపకా నవ్వాడు.

ఓ అమాయకుణ్ణి చూసి ఓ మహారుషి నవ్వినట్టు నవ్వాడు. నవ్వి "మరైతే- నేనుం దుకు తాగుడికి అలవాటుపడలేదు. మీ నాన్నెందుకు అలవాటు పడలేదు?" అనడిగాడు.

"మీ ఇద్దరికీ డబ్బు మాత్రమే మత్తు కలిగిస్తుంది. సారా వల్ల మత్తు రాదు." కోపంగా అన్నాడు.

"ఒప్పుకున్నావ్‌కదా- మీ అన్నయ్యకి, అలాంటి వాళ్ళకి కూడా డబ్బు మత్తు అలవాటు చెయ్యడానికే ప్రయత్నించాను కాని వాళ్ళు సారామత్తులో పడిపోయారు. ఇంకో విషయం చెప్తాను. జాగ్రత్తగా విను. ఈ ఊళ్ళో అందరికీ మొదట్నుంచీ ఒకటే విషయం చెప్పాను. సారా తయారు చెయ్యండి. కాని దాన్ని తాగకండి. నేను చెప్పింది విననివాళ్ళు అలా అయిపోయారు."

దేవదాసుతో వాదించి ప్రయోజనం లేదనిపించింది గాంధీకి.

అతను మర్నాడు బైల్దేరి నగరం వెళ్ళాడు.

సెక్రటేరియట్‌కి వెళ్ళి అధికారుల్ని కలిశాడు కొండరాయపాలెంలో ఎంత విచ్చలవిడిగా దొంగ సారా తయారు చేస్తున్నారో, ఎక్సైజ్ అధికారులు వాళ్ళతో కుమ్మక్కై ఎలా కళ్ళు

మూసుకుని ఊరుకుంటున్నారో వివరించి చెప్పాడు.

సెక్రటేరియట్లో ఫోన్ డయల్స్ తిరిగాయి. ఎక్కడో ఫోన్లు మోగాయి.

పది జీప్‌లు ఆ రాత్రి కొండరాయపాలెం వైపు దూసుకెళ్ళాయి.

మర్నాడు పతాక శీర్షికల్తో పత్రికలు వార్తలు రాశాయి.

ఎక్సైజ్ అధికారులు కొండరాయ పాలెం మీద దాడి చేసారని- కొన్ని వేల లీటర్ల సారాను మిగిలిన సామగ్రిని ధ్వంసం చేసారని వార్తలు ప్రచురితమయ్యాయి.

కాని...

ఎక్సైజ్ అధికారులకు, కొండరాయపాలెం వారికి తెలిసినది ఒక విషయం ఉంది.

అధికారులు సారా కుండల్ని పగులగొట్టిన విషయం వాస్తవమే. కానీ సారా నేల పాలు కాలేదు. కాంక్రీటుతో కట్టిన అండర్‌గ్రౌండ్ ట్యాంకుల్లోకి వెళ్ళిపోయింది. దేవదాసు ఊరి తరుపున అధికార్లకి మామూళ్ళు చెల్లించాడు.

నాలుగు రోజులు పోయాక ట్యాంకుల్లోని సారాని మళ్ళీ కొత్త కుండల్లోకి మార్చుకున్నారు.

మళ్ళీ కథమామూలు...

ప్రభుత్వం నిక్షేపంగా ఉంది. అధికారులు నిక్షేపంగా ఉన్నారు. ఆ ఊళ్ళో సారా వంటకం, వ్యాపారం నిక్షేపంగా సాగిపోతున్నాయి.

దేవదాసు గాంధీని పిల్చి ఆ ఊరి తరపున హెచ్చరిక చేశాడు.

"నువ్వెక్కడో బొంబాయిలో ఉండేవాడివి. ఇక్కడి గొడవలు నీకెందుకు? మాలో ఒకడైన వెంకటస్వామి కొడుకువని ఈ తప్పు కాసాం. మరోసారి ఈ ఊరి వాళ్ళందర్కీ సర్ది చెప్పే అవకాశం, అవసరం నాకుండదు." అన్నాడు.

వెంటస్వామి కూడా గాంధీని కేకలేశాడు.

గాంధీకి ఆశ్చర్యమూ, బాధ కలిగాయి.

డబ్బు సంపాదించాలనే యావ తప్ప ఆ ఊరివాళ్ళు ఒక్కొక్కరే చచ్చిపోతున్నారన్న విషయం ఎవరూ గ్రహించడంలేదు.

కొన్ని సంవత్సరాలు ఇలా సాగితే...

ఆ ఊళ్ళో యువకులెవరూ మిగలరు. విధవలు మాత్రమే మిగుల్తారు.

ఆ ఊరి ఆకాశం మీద రాబందులు ఎగురుతున్నట్టుగా అనిపించింది. ఆ ఊరంతా శ్మశానంలా కనిపించింది.

అతను కలతపడ్డాడు.

ఆలోచించేకొద్దీ అతనికి పంతం ఎక్కువైంది. ఓ పదిరోజులపాటు ఏమీ పట్టనట్టుగా ఉన్నాడు. ఓపక్కనుంచి భార్య "బొంబాయి వెళ్ళిపోదాం- ఈ గొడవలన్నీ మనకెందుకు?" అని పోరు పెడుతోంది.

ఓ రోజున ఆ ఊళ్ళో మరో శవం లేచింది. మరో యువతి విధవరాలైంది.

గాంధీ వెళ్ళి దేవదాసుని కలిసి మళ్ళీ తన వాదన వినిపించాడు.

దేవదాసు ఆలోచనలో కాని- మాటలో కాని మార్పులేదు.

"అసలీ గొడవంతా ఎందుకు? నువ్వే ఓ బట్టీ పెట్టుకో కావల్సిన డబ్బు ఇస్తాం. రెండు జేతులా సంపాదించవచ్చు". అన్నాడు దేవదాసు.

గాంధీ మొహం జేవురించింది.

ఏమీ మాట్లాడకుండా బైటకు వచ్చేసాడు.

మరో పదిరోజులకి గాంధీ అన్నగారు బోస్ కన్ను మూసాడు.

అన్నగారి శవం శ్మశానంలో కాల్తుంటే- అతనికీ ఆ ఊరంతటికీ నిప్పు పెట్టాలన్న ఆలోచన కలిగింది. మరో నాలుగు రోజులు గడిచాయి.

గాంధీ మళ్ళీ నగరానికి బైల్దేరి వెళ్ళాడు.

ఓ పత్రికాఫీసుకి వెళ్ళి ఎడిటర్ని కలసి తన గోడు వినిపించాడు. అంతే!

తర్వాత మూడు రోజులపాటు ఆ పత్రికలో కొండరాయపాలెంలో జరుగుతున్న దొంగ సారా తయారీ గురించి విపులంగా వార్తలు వెలువడ్డాయి. సరిగ్గా అదే సమయానికి అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్న కారణంగా నిప్పంటుకుంది.

ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని ఉతికి ఆరేసాయి.

అసలే హైకమాండ్ దగ్గర వీక్‌గా ఉన్న తన పొజిషన్ కాపాడుకోవాలని ముఖ్య మంత్రికి తాపత్రయం పెరిగింది. ఆయన ఎక్సైజ్ మంత్రిని పిల్చి నిలదీసారు. ఆయన అధికారుల్ని నిలదీసారు. వారు కింద వార్ని, కిందవారు ఆ కిందవార్ని....

కొండరాయపాలెం సమస్య ఎంత విలువని సంతరించుకుంది. ఎవరి పదవులు వారు కాపాడుకోవాలనే ప్రయత్నంలో ఇన్నాళ్ళు కొండరాయ పాలెం అందించిన నిధుల్ని మర్చిపోయారు. వారివారి విధులు జ్ఞాపకం వచ్చాయి.

వారం రోజులపాటు ఎక్సైజ్ వారు, పోలీసువారు కలిపి కొండరాయ పాలెం మీద దాడి చేసారు. ఈ సారి జరిపింది ఉత్తుత్తి దాడి కాదు. నిజం దాడి!

సారా బట్టీలన్నిటినీ ధ్వంసం చేసారు. అండర్‌గ్రౌండ్లో ఉన్న ట్యాంకులన్నీ పగులగొట్టారు. అనేకమందిని అరెస్టుచేసి కేసులు పెట్టారు. ఇన్నాళ్ళు కొండరాయపాలెం గురించి తమకి తెలియనట్టుగా అమాయకత్వం నటిస్తూ పత్రికా ప్రకటనలు చేసారు. సారా బట్టీలు ధ్వంసం చేస్తున్న ఫోటోలు పత్రికల్లో ప్రచురించారు....

దేవదాసు ఎత్తులన్నీ చిత్తయిపోయాయి. అతను అసహాయశూరుడిలా బేడీలతో పోలీసు జీపు ఎక్కాడు

నాలుగు రోజులు తర్వాత దేవదాసుతోసహా అందరూ బెయిల్ మీద విడుదలై బైటికి వచ్చారు.

జరిగిన విధ్వంసానికి కారకులెవరో అందరికి తెలుసు. ఆ విషయమ్మై సమావేశాలు జరిగాయి. వాదోపవాదాలు జరిగాయి ఆవేషావేషాలు ఎగజిమ్మాయి.

చివరికి సమస్యను దేవదాసుకి వదిలెయ్యాలని సమావేశంలోని అందరూ ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నారు.

ఆ రోజు గాంధీ చాలా తృప్తిగా నగరం నుంచి కొండరాయపాలెం బయల్దేరాడు.

ఇక ఆ ఊళ్ళో సారా బట్టీలు ఉండవు. తన అన్నలాంటి వాళ్ళు ఇక ముందు

చనిపోరు. తన వదినలాంటి వాళ్ళు పసుపు కుంకుమలు పోగొట్టుకోరు. ఇహముందు ఆ ఊరి ప్రతి ఇంట్లోను విధవలుంటారనే భయం లేదు.

అతనికి చాలా గర్వంగా ఉంది.

రెండురోజుల్లో భార్యను తీసుకుని బొంబాయి వెళ్ళిపోవాలనుకున్నాడు. ఈలోగా తండ్రిని ఒప్పించి తన సొంత ఊరుకి మకాం మార్చించాలనుకున్నాడు.

అతను ఎక్కిన బస్ కొండరాయపాలెం ఊరి శివార్లకి వచ్చింది రాత్రికి అదే ఆఖరి బస్. బస్‌లో పెద్దగా జనంలేరు.

సడెన్‌గా బస్ ఆగింది.

ఆలోచనల్లోంచి తేరుకోడానికి గాంధీకి కొంత సమయం పట్టింది. ఏం జరుగుతుందో గ్రహించేసరికి నలుగురు మనుషులు బలవంతంగా అతన్ని బస్ దింపారు. అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కారు. నలుగురూ కల్సి అతన్ని మూటలా మోసుకుంటూ చేలల్లోకి తీసికెళ్ళారు. ఎంత పెనుగులాడినా లాభం లేకపోయింది. వాళ్ళ పశుబలం ముందు అతను ఓడిపోయాడు. అతన్ని కిందపడేసి నలుగురూ కత్తులతో పాశవికంగా పొడిచారు. అతను వేద్దామనుకున్న కేకలు గొంతులోనే పూడిపోయాయి.

ఆకాశం మీద పడుతున్నట్టుగా అనిపించింది.

అతనికి మైకం కమ్మింది.

అంతే! ఈ లోకంతో అతనికి సంబంధం తెగిపోయింది.

ఆ ఊళ్ళో మరో యువతి విధవరాలైంది.

ఈనాడు ఆదివారం, 25 జూలై 1993

# గుండెల మీద కుంపటి

## డి. ప్రభాకర్

పందిట్లో పెళ్ళవుతోంది.

చూసేవాళ్ళకి కనువిందవుతోంది.

చేసేవాళ్ళకే -- కంట్లో నలుసు పడ్డట్టూ, కాల్లో ముల్లు గుచ్చుకున్నట్టూ కంగారు కంగారుగా వుంది.

అయితే చూసేవాళ్ళకి అంతగా కనువిందు చేస్తోంది, సుజాతా సుబ్రహ్మణ్యంల పెళ్ళా? లేక ఆ పెళ్ళి చేస్తున్న వాళ్ళ కంగారా??

చూసేవాళ్ళలో ఆడ పెళ్ళివారున్నారు, మగ పెళ్ళివారూ వున్నారు.

ఆడ పెళ్ళి వారికి పెళ్ళిపందిరి ఆకాశమంత లేకపోయినా అందంగా కన్పిస్తోంది.

మగపెళ్ళివారి కది - "పెళ్ళనగానే ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగూ వుండాలి. కాని యిదేమిటి.... ఆకాశమంత వున్నదన్నమాటేగాని మరో ఆకాశమంత తెల్లగుడ్డకి ఇంత వెడల్పు నల్లగుడ్డ మాసికేసినట్టులేదూ!"

ఆడ పెళ్ళివారికి సుజాత అప్పుడే కడిగిన ముత్యంలా వుంది. పెళ్ళి కొడుకు సుబ్రహ్మణ్యం మిషన్ దారంలా నాజూగ్గా కాకుండా పొట్లాల దారంలా మోటుగా వున్నాడు.

మగ పెళ్ళివారికి పెళ్ళి కొడుకు తలపాగా, బాసికంతో 'రాజ్యమే లేదుగాని వుంటే ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలనూ, అని ఠీవిగా అంటున్న మహారాజులా వున్నాడు. పెళ్ళికూతురు సుజాత స్వయంవరం ప్రకటించిన పెద్ద దేశపు యువరాణిలా కాకుండా సామంతరాజు కూతుర్లా వుంది!

ఆడపెళ్ళి వారికీ మగపెళ్ళివారికీ సుజాత తండ్రి కుటుంబరావూ, తల్లి సౌభాగ్యమ్మా కంగారు కంగారుగా తిరగటం కన్పిస్తూనేవుంది.

వాళ్ళనుచూసిన ఆడపెళ్ళివారు 'పాపం' అనుకుంటున్నారు.

మగపెళ్ళివారు తూనీగతోకకి దారం కట్టి ఆడుకునే పసిపిల్లల్లా సంబరబడ్తున్నారు.

పురోహితుడు తనకష్టాన్ని గమనించి సంభావన కాస్తెక్కువగా ముట్టచెప్తారన్న నమ్మకంతో గొంతు చించుకుమంత్రాలు చదువుతున్నాడు - వాటికి రాల్తున్న చింతకాయల్లా

అతని చేతిలోని అక్షంతలు తడవ తడవకి వధూవరుల మీద పడ్తున్నై.

భజంత్రీలు పెళ్ళి మేళమయినా ఒకటే, చావుమేళమయినా ఒకటే నన్నట్టు నిర్వికారంగా కూచునున్నారు.

పెళ్లికొచ్చిన ఆడవాళ్ళు పట్టుచీరెల్తోటి, ఎరువు నగల్తోటి బరువుగా తిరుగుతున్నారు.

వాళ్లనీ, వాళ్ళ అందాల్నీ చూస్తున్న మగవాళ్ళు బరువుగా శ్వాసతీస్తున్నారు.

అంతమంది జనం మధ్యనవున్న కుటుంబరావుమాత్రం ఏదో అడవిలో చిక్కడి పోయినట్టు, బెరుకు బెరుగ్గా వున్నాడు. బయటపందిట్లో నిలబడితే ఎవరుఏక్షణాన ఏంకావాలని అడుగుతారో... అవి తేగలమో లేమో నన్న బెంగతో ఇంట్లోకి పరుగెడ్తున్నాడు. తీరా లోపలికెళ్ళేక బయట పందిట్లో ఏం జరుగుతుందో ఏమోనన్న బెంగతో బయటికి పరుగెత్తుకొస్తున్నాడు. అతని భార్య సౌభాగ్యమ్మ పురోహితుడు అడిగినవి అందించలేక సతమతమవుతోంది.

(ఇక్కడొక్క నిమిషం ఆగు పాఠక మహాశయా! ఏదన్నా కొత్తవూరు వెళ్ళాలంటే ముందు మనవూరి పొలిమేరలు దాటాలి. అలాగే కథలో ఏదన్నా కొత్త మలుపు చూడాలంటే ముందు కథని కొంతదూరం మామూలు పద్ధతిలో నడవ నివ్వాలి. అంచేత యీకథ ఇక్కణ్ణించి కొన్ని పేజీలు మీకుతెల్సిన మార్గంలోనే నడుస్తుంది. ఆ తర్వాత అన్నికథల్లా కంచి కెళ్ళదు... మీరు కోరుకునే మంచి మలుపు తిరుగుతుంది.)

పురోహితుడు "వాయించండ్రా భజంత్రీలు" అన్నాడు .రాగయుక్తంగా భజంత్రీలు 'ఆనందమానందమాయెనే' అనసాగేరు సన్నాయిల్తో.

పెళ్లికూతురి చెల్లెలు సుశీల, పెళ్ళి కూతురు సుజాత వాలుజడ యెత్తి పట్టుకుంది.

పెళ్ళికొడుకు సుబ్రహ్మణ్యం ప్రసిద్ధులైనవారికి బంగారు పతకం అలంకరించే రాష్ట్రపతిలా హుందాగా లేచాడు మాంగల్యం పట్టుకుని.

పురోహితుడు పెళ్ళికొడుకుతో మూడు ముళ్ళు యెలా వెయ్యాలో మూడు ముక్కల్లో చెప్పి 'మాంగల్యం తంతునా...' అందుకున్నాడు.

పెళ్ళి కొడుకు పసుపు తాడుతో బొంగారంలాంటి పిల్లను స్వంతం చేసుకుంటున్న సంబరంలో (మరే! వాళ్ళనాన్న అతన్ని చీటికి మాటికి 'తాడూ బొంగరం లేని వెధవా' అంటుంటాడు. ఇహనమను!) ముందుకు వంగేడు.

"ఆగండి!" పెళ్ళిపందిరి దద్దరిల్లింది.

"సుశీల చేతిలోని పెళ్ళికూతురి వాలు జడ జారిపడింది.

తల వంచిన పెళ్లికూతురు తలెత్తి చూస్తుండిపోయింది.

పెళ్లికొడుకు చేతిలోని పసుపుతాడు పామై తన చేతులకే చుట్టుకున్నట్ట కొయ్యలా నిలబడిపోయేడు.

అందరూ "ఆగండి" వినవచ్చిన వైపు తిరిగేరు.

అక్కడ రామనాథం వున్నాడు!

అతడికి గుమ్మడికాయలంత నిమ్మకాయల్ని నిలబెట్టే గుబురు మీసాలున్నై.

వాటిపైన "వేరే నిమ్మకాయలెందుకు మేముండగా" అవి తీవిగా కదిలే కళ్ళున్నై. అవి

కావల్సినప్పుడల్లా నిప్పులు చెరుగుతుంటై.

అవి అలా నిప్పులు చెరిగినప్పుడు దానికి తగ్గట్టు బ్యాగ్గ్రౌండ్ మ్యూజిక్ అందించేందుకు పటపటలాడే పళ్ళున్నై.

అతడు గళ్ళలుంగీ కట్టి, బిగుతు లాల్చీ వేసుకుని, మెళ్ళో మఫ్లరు చుట్టు కుంటే కోసిన పీక కోయకుండా వంద పీకలు కోసేరౌడీరంగడులా వుంటాడు.

అలాకాకుండా నల్లసూటువేసుకుని, నల్లకళ్లజోడు పెట్టుకుంటే అమెరికానే స్మగుల్ చేసి ఇండియాలో అమ్మే "కింగ్ స్మగ్లర్"లా వుంటాడు.

కాని అతడు ఆ రెండూ వేసుకోడు. ఎప్పుడూ ఖద్దరు పంచె, ఖద్దరు లాల్చీ కట్టుకుని జరీఅంచు వుత్తరీయం వేసుకుంటాడు - చూడగానే వాళ్లూరి పంచాయితీకి పర్మనెంటు పెద్ద అని పిస్తాడు.

అతడు వాళ్ల నాన్న పోగుచేసిన పది ఎకరాల మాగాణికి వారసుడు.

తన పెద్దకొడుకు - ఇప్పటి పెళ్ళికొడుకు - సుబ్రహ్మణ్యంకు తన యాభై అయిదో ఏట ఓ తమ్ముణ్ణి కని కానుకగా ఇచ్చిన సరసుడు!

అతను ఇంట్లోవాళ్ళతో మాట్లాడడు, పోట్లాడతాడు.

బయట వాళ్ళతో అదీచేయడు -- అన్నీ కోర్టులోనే తేల్చుకుంటాడు.

అయితే అతనేం చేసినా ముందు ఓ సారి గర్జిస్తాడు.

ఇందాకట్ట 'ఆగండి' అంటూ చేసిన గర్జన ఆయన్దే!

ఆ గర్జనకి కుటుంబరావు పెళ్ళి పందిరి ఆకులా గజగజవణికిపోయేడు.

యజ్ఞయాగాదులకు రాక్షసు అడ్డం పడ్డప్పుడు వణికిపోయే అర్భకమునిలా వణికిపోయేడు కుటుంబరావు.

శ్రీరాముడి సాయంకోసం ప్రార్థించే మునిలా కాబోయే అల్లుడికేసి దేవురింపుగా చూసేడు.

అల్లుడు నిటారుగా నిలబడ్డాడు - కాని శ్రీరాముడిలా బాణం సంధించలేదు - చేతులు కట్టుకుని తల వంచుకు నించున్నాడు.

(పెళ్ళి) కూతురు శివధనుర్భంగం అయీ కాగానే రావణాసురు డెత్తుకెళ్లిన సీతమ్మవారిలా కూచుని కుమిలి పోతోంది.

దాంతో శ్రీరాముణ్ణి ప్రసన్నం చేసుకోవటంకంటే రాక్షసుడి మనసు కరిగించటం తేలిక అని తెల్సుకున్నవాళ్లా కుటుంబరావు వణికే చేతుల్తో, వాటితో పోటీపడ్తున్న గుండెల్తో రామనాథం దగ్గరికెళ్ళేడు. "బావగారూ" అన్నాడు రాళ్ళు కరిగించే స్వరంతో.

రామనాథం రాయి కాదుగనుక కరగలేదు.

మనిషి గనుక మరింత బిర్రబిగుసుకున్నాడు. అంతలోనే వేళాకోళంగా "ఏం బావగారూ! చేసిందంతా చేసి ఇప్పుడివి చేతులుకావు కాళ్ళనుకోండి అంటారు అంతేగా మీరు చెప్పేది?" అన్నాడు.

"అదికాదు బావగారు! సమయానికి అనుకున్న డబ్బు చేతికి రాలేదు. దాంతో ఓ వెయ్యి తక్కువ యివ్వకతప్పలేదు. కానీ... బాకీ బాకీయే బావగారూ. ముందీ శుభకార్యం

జరగనీండి. రెండ్రోజుల్లో మీ డబ్బు పువ్వుల్లో పెట్టి మీకిస్తాను"-- కుటుంబరావు ప్రాధేయపడ్డాడు.

"అనుకున్నదానికి వెయ్యితక్కువిచ్చేనని ఇప్పుడు చెబుతున్నావ్. ఇందాక ఎందుకు చెప్పలేదూ? యీ వెధవాయ్ డబ్బు లెక్కెట్టుకోడులే... యీలోగా ఆ మూడు ముళ్ళూ పడితే యిహ యీ ముసలిపీనుగ ఆరచిగీపెట్టినా చేయగలిగేదేముండదు అనుకున్నావ్. అవునా? ఏమయ్యోయ్.... మూడుముళ్లూ వేయించటానికి యీ బాజాభజంత్రీలూ, మంత్రాలూ, తంత్రాలూకావాలి... కాని విప్పించటానికి అక్కర్లేదు. నేను డబ్బు విషయంలో నిక్కచ్చిమనిషిని. కూడి కల్లో తేడా వస్తే అయిన పెళ్ళికూడా రద్దు చేయించగలను... ఏమనుకున్నావో!"

"అయ్యా! తవరు అంతకి సమర్దులే నని తెలుసు. అసలు డబ్బు విషయంలో మీరు అంత నిక్కచ్చిమనిషి అని తెల్సు గనుకనే వెయ్యి తగ్గిందని ముందుగా చెప్పలేదు. చెప్తే... మొట్ట మొదటిసారిగా యీ యింట్లో జరుగు తున్న శుభకార్యం ఆగిపోతుందని చెప్పలేదు బావగారూ! అది నా పొరపాటే. నా పొరపాటుకి నా కూతుర్ని శిక్షించకండి. నన్ను మన్నించి కాస్త తతంగం పూర్తి కానీండి. ఈ రోజు డబ్బు సర్దుతానన్న మిత్రుడు వూళ్ళో లేడు. అతడు ఎల్లుండి రాగానే... మీ డబ్బు..."

రామనాధం అసహనంగా కదిలేడు. "చూడు కుటుంబరావ్! నేను నీకు ముందే చెప్పేను డబ్బంతా సమకూర్చేకనే ముహూర్తం పెట్టుకోమని. విన్నందుకు అనుభవించు! డబ్బు ఎల్లుండి అందుతుం దన్నావుగా...ఎల్లుండి మంచి ముహూర్తం మేమన్నా వుందేమో కనుక్కో. అందాకా మేం యీవూళ్లో వుండాలంటే ఖర్చులన్నీ నువ్వే భరించాలి" అన్నాడు కుటుంబరావుతో. తర్వాత తన కొడుక్కేసి తిరిగి "ఇంకా అలాగే నిలబడి వున్నావేంరా తాడు బొంగరంలేని వెధవలాగ... జేబులో కాణీవుంటే పదికాణీలు ఎదురిచ్చి నిమిషానికి ఇద్దరు పెళ్ళాలొస్తార్రా ఈ రోజుల్లో. ఇంకా ఆ పిల్ల కొంగు పట్టుకు వేళ్లాడ్తావేం... రా ఇవతలికి" అని గర్జించేడు.

"సుబ్రహ్మణ్యానికి వాళ్ళ నాన్నంటే భక్తిలేదు - భయం వుంది.!

అంచేత అతను చేతిలోని మంగళ సూత్రాన్ని ఏం చేయాలో తోచక కాస్సేపు ఆలోచించి చివరికి దాన్ని షర్టు జేబులో వేసుకుని పెళ్ళిపీట దిగబోయేడు.

అంతలో పెళ్ళికూతురు వెనకవున్న సుశీల "తాడు బొంగరం లేని బావగారూ ఒక్కమాట" అంది.

సుశీల సిగుపట్లకైనా సై కుస్తీకైనా సై అనే ఆడవస్తాదులా వుండదు

సన్నగా రెవటగా సన్నజాజి పువ్వులాగా వుంటుంది.

మొహంలో గులాబీ అందముంది గాని అది కోపంతో మరింత ఎర్రగాబడింది. ముక్కు గులాబీని మించి ఎదిగిన ముల్లులా సాగింది.

రామనాధం 'ఆగండి'తో పెళ్ళి ఆగిపోయిందని ఎవరి సామాన్లు వాళ్ళు సర్దుకో చూసినవాళ్ళంతా సుశీల మాటతో ఆగిపోయేరు - యుద్ధంలో చనిపోయేడనుకున్న రాజు తిరిగి లేచి కత్తి పట్టినట్టు ఆశ్చర్యపోయేరు.

పెళ్ళిపీటమీంచి దిగబోయిన సుబ్రహ్మణ్యం దిగలేదు.

తన మాట విని తాళికట్టకుండా పీట దిగబోతున్న కొడుకున్చూసి మీసం మీద చెయ్యివెయ్యబోయిన రామనాథం వేయలేదు.

రామనాథం కాళ్ళు పట్టుకునే ప్రయత్నంలో వున్న కుటుంబరావు ఏంజరుగుతుందో తెలీక, తెల్సుకోలేక అవాక్కయి పోయేడు.

మొత్తానికి పెళ్ళిపందిరి ఆపరేషన్ థియేటర్లా నిశ్శబ్దంగా వుంది.

సుశీల పెళ్ళికూతురు వెనకనుంచి ముందుకొచ్చింది.

"క్షమించండి బావగారూ! మీరు తాడూ బొంగరం లేనివారని నే నన్లేదు. మీనాన్నగారే అన్నారు. ఆయనామాట యిప్పుడేగాదు, పెళ్ళిచూపుల్లోకూడా యధాలాపంగా అన్నట్టు గుర్తు. అంత పెద్దమనిషి మీ కా సర్టిఫికెట్టిచ్చేక మా నాన్న మా అక్కని మీకు కట్టబెట్టాలనుకోవటం పొరపాటే. అందుకు సుంకంగా పదివేలు కట్నంగా యిస్తానన్నాడు... కాని ఒక వెయ్యి తక్కువిచ్చేడు. ఆ మాత్రానికే ఇంత తొందర పడాలా? సంతలో పశువుని కొనుక్కోవాలనుకున్నప్పుడు ముందు బయానా ఇస్తారు మాష్టారూ...ఆతర్వాత పశువు సొంతమయ్యేక పూర్తిపైకం యిస్తారు. మీరు మా అక్క సొంతం కావటానికి చాలా తంతు జరగాలి - పదహారోజుల పండుగ కావాలి.. అందాకా యీ తొమ్మిదివేలూ బయానా అనుకోండి... ముందు తాళికట్టండి!"

సుశీల మాట్లాడుతుంటే సుబ్రహ్మణ్యానికి ఫెళఫెళ వురుముతున్నట్లనిపించింది. దాంతో అతడు "అర్జునా అనవే నాన్న" అన్నట్లు రామనాథం కేసి భయం భయంగా చూసేడు.

రామనాథం ఆకారానికి కొందరు భయపడితే అతన్దగ్గరున్న నోట్లకి చాలా మంది భయపడ్తారు. అతని నోటికి అందరూ భయపడతారు. అలాటిది ఓ ఆడపిల్ల ఏభయమూ లేకుండా తన కొడుకుని పట్టుకు దులిపేస్తుంటే రామనాథంనోరు మెదపలేకపోయాడు. నొసలు చిట్లించి కుటుంబరావుని కొరకొర చూసేడు!

ప్రసన్నుడవుతాడనుకున్న రాక్షసుడు మళ్ళీ ప్రళయరుద్రుడవుతున్నాడు. కుటుంబరావుకి మళ్లీ చలి వచ్చింది. చలిజ్వరంతో అపస్మారంలో వున్నవాడిలా "అమ్మా సుశీలా" అన్నాడు బొంగురుగా.

సుశీల "నువ్వుండు నాన్నా" అంది తాపీగా. సుబ్రహ్మణ్యంకేసి తిరిగి "బావగారూ! మీరూ వినండి రామనాథం మావగారూ! ఆడపిల్లల బలహీనతల్నీ, ఆడపిల్లల్ని గన్న తండ్రుల దౌర్భాగ్యస్థితిని ఆసరాగా తీసుకొని కట్నాలు గుంజటం నేరం ! దానికి సిద్ధపడి వున్నదాంట్లో అంతో యింతోయిస్తుంటే ఇలా పేచీలు పెట్టి పెళ్ళి ఆపటం దారుణం! మీరు మర్యాదగా యీ పెళ్ళి జరుగనిస్తారా సరేసరి లేక పోతే యీపెళ్ళి పురోహితుడు కాదు పోలీసువారు చేయిస్తారు జాగ్రత్త!" అంది ఆవేశంగా.

పోలీసులనేసరికి రామనాథం వులిక్కిపడ్డాడు. వెంటనే వెన్నుతట్టుకుని "చూడమ్మాయ్! ఇందాకట్నుంచిచూస్తున్నాను. చిన్నపిల్లవని వదిలేస్తుంటే తెగ మాటలు మీరుతున్నావ్. పదివేలిస్తానన్న పెద్ద మనిషి తొమ్మిదివేలు చేతిలో పెడ్తే తప్పులేదా... నేను

పెళ్ళి ఆపమంటే తప్పొచ్చిందా? పైగా పోలీసుల్ని పిలిస్తావా...పిలువ్...ఏ పోలీసొచ్చి యీ పెళ్లి చేయిస్తాడో చూస్తా" నన్నాడు బింకంగా.

"ఏ పోలీసూ అఖర్లేదండి! బావగారు ఎంతో మంచివారు. నాలుగురోజుల్లో కృష్ణా రామా అనుకుంటూ నరకాన్ని వెతుక్కుంటూపోయే మీకోసం భూమ్మీదే స్వర్గాన్ని సృష్టించే భార్యను వదులుకునే అవివేకికారు బావగారు! కాకపోతే మీకడుపున పుట్టినందుకు మీమాట జవదాటకుండా శ్రీరామచంద్రు డనిపించుకోవాలనుకుంటున్నారు. కదూ బావగారూ," నర్సరీ క్లాసులో పిల్లల్ని లాలిస్తూ బావగారు 'అవునవున'న్నంటూ తలూపేరు అమాయకంగా పాఠాలు చెప్పే టీచర్లా అంది సుశీల

"కాని శ్రీరాముడు ఏక పత్నీవ్రతుడు బావగారూ! మీలాగా ఓ పిల్ల నెత్తిన జీలకర్ర బెల్లం పెట్టి మరోపిల్ల మెళ్లో తాళికట్టలేదు. ఇప్పుడు మీరు కట్నం కోసం మా అక్కను కాదనివేరే అమ్మాయిని చేసుకుంటే శ్రీరామచంద్రులు కారు సరికదా రావణాసురుడు కూడాకాలేరు! ఏమంటారు?"

శ్రీరామచంద్రుడికేం చెప్పాలో తోలేదు.

"మగవాడు ఎక్కిన పెళ్లిపీట అతనికి ఆడతోడు - అది పనికిరాదనుకుంటే మరో దిక్కుమాలిన ఆడతోడు దొరుకుతుంది బావగారూ! కాని ఆడది ఒక పెళ్లిపీట ఎక్కితే మగవాడి చిటికిన వేలు పట్టుకుదిగాలి. దానికా చిటికెన వేలు అసరా దొరక్కపోతే అది అత్తింటికీ, ఇటు పుట్టింటికీ కాకుండా పోతుంది. దాన్ని కనీసం మగశవమైనా పెళ్ళాడేందుకు ముందుకురాదని చెప్పండి. మా అక్క జీవితాంతం పెళ్ళి కాక, చేసుకోలేక మీ జీవానపడి కుళ్ళి చావాలనుకుంటున్నారా మాట్లాడరేమండి!"

సుబ్రహ్మణ్యం మారుమాట్లాడలేక చటుక్కున మంగళసూత్రం జేబులోంచి తీసి సుజాత మెళ్ళో మూడుముళ్ళు వేసేసేడు!

అప్పటిదాకా కొయ్యబారి వున్న పెద్దలు ఒక్కసారిగా చిన్నపిల్లలై చప్పట్లు కొట్టేసేరు.

రామనాథానికి తన కొడుకు తన తలతీసి అందర్లోనూ ఫుట్‌బాల్ ఆడుకున్నంత అవమానమైంది. కోపంతో "నా కడుపున చెడబుట్టావ్‌రా" అన్నాడు. అసహ్యంతో. "ఈ క్షణం నుంచి నువ్ నా కొడుకువీ గావు నేను నీ తండ్రినీ కాను" అని బయటకు నడిచేడు.

"మరే! ఈక్షణం నుంచి ఆయన మీకొడుకుకాడు- మా అక్కభర్త" అంది సుశీల అల్లరిగా నవ్వుతూ.

కుటుంబరావుకి కళ్ళముందు జరుగుతున్నది కలో నిజమో అర్థం కాలేదు ఓ క్షణం. అంతలోనే పెళ్ళిబట్టల్లో వున్న సుబ్రహ్మణ్యం, సుజాత వచ్చి అతని పాదాలకి నమస్కరించేసరికి జరుగుతున్నది నిజమేనని నిర్ధారణ చేసుకున్నాడు. ఆనందంతో కూతుర్ని అల్లుణ్ణి చేరదీసి "ఈ పెళ్ళి చేసింది నేను కాదమ్మా... సుశీల... ఈరోజున అదే లేకపోతే నా తల్లీ.. నీ బ్రతుకేమయివుండేదమ్మా" అన్నాడు సుజాత తల నిమురుతూ.

వాళ్ళపక్కనే నరకాసురుణ్ణిచంపిన సత్యభామలా ఠీవిగా నిలుచున్న సుశీల ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకొని "నాబంగారు తల్లివి..నాకులేని ధైర్యసాహసాలు నీకున్నాయమ్మా..

నిజానికి నువ్వు సుశీలవికావు.. నా యింట వెలసిన కనకదుర్గవి" అన్నాడు ఆప్యాయంగా, ఆనందంగా, ఆవేశంగా!

జరగదనుకున్న సుజాత పెళ్ళి జరిగి నందుకు సౌభాగ్యమ్మకు ఆనందంగానే వుంది. కాని నిండుపందిట్లో అంతమంది మగవాళ్ళని తలదన్నేలా మాట్లాడిన సుశీలని పెళ్ళాడేందుకు ఏ మగవాడన్నా ముందుకొస్తాడా అన్న బెంగ ఆమెని వేధించసాగింది. దాంతో భర్త దగ్గరికివెళ్ళి "ఏమండీ! దాని సాహసం ఆనోటా ఆనోటా అందరికి తెలిస్తే దానికి సంబంధాలేమన్నా వస్తాయా" అంది అనుమానం అనుమానంగా.

కుటుంబరావు "పిచ్చి అనుమానాలు పెట్టుకోక" అని భార్యని కసిరేడేగాని ఆమె అన్నదాంట్లో ఎక్కడో నిజముందనిపించింది. ఆ నిజం గుండెల్లో గుండుసూదిలా గుచ్చుకోగా "నా తల్లికి అలా జరగ్గూడదు. నేను జోలికట్టుకు రోడ్డుమీద నిలబడ్డాసరే దానికి ఫస్ట్‌క్లాస్ సంబంధం చూసి చేయాలి.. చేస్తాను" అనుకున్నాడు దృఢంగా.

★ ★ ★

పెద్దకూతురు పెళ్ళికిముందు కుటుంబరావు వర్థికుటుంబరావే!

పెళ్ళి చేసేక అతను అప్పారావయ్యేడు!

అప్పులు చేసేటప్పుడు అతనికున్నది మొండిధైర్యం!

ఇప్పుడు వాటిని తల్చుకుంటుంటే, వాటిని ఎలా తీర్చటమా అని ఆలోచిస్తుంటే గుండెల్నిండా భయం!

దానికితోడు చిన్నకూతురు సుశీల పెళ్ళిబెంగ.

ఆ పిల్ల ఆరోజు పందిట్లో ధైర్యంగా మాట్లాడటంవల్లే సుజాత పెళ్ళి జరిగింది.

అచూసిన వాళ్ళందరికీ ఆ క్షణంలో ఎంతో సంతోషమైంది.

కాని అందు గురించి విన్నవారే "హవ్వ! ఆడదానికి అంత సాహసమా" అని బుగ్గలు నొక్కుకున్నారు - ఆ తర్వాత చెవులు కొరుక్కున్నారు.

దాంతో సుశీలకి నాలుగైదు సంబంధాలు వచ్చి వచ్చిందారినే పోయినై.

ఆడపిల్ల పుట్టిందంటే విష్ణుమూర్తి బొడ్లోని పద్మంలా నట్టింట లక్ష్మీదేవి వెలిసిందనుకున్నాడు కుటుంబరావు.

అతడలాంటి ఆనందంలో వుండగనే ఒకటి రెండు పద్మాలైనై.

అవి పెరుగుతూ పెరుగుతూ గుండెల పైకి ఎగబాకి కుంపట్లైనై

పెళ్ళి వయసొచ్చేసరికి నిప్పురానుకుని గుండెల్ని మండించసాగినై

అప్పో సప్పో చేసి ఓ కుంపటి దించుకోగలిగేడు

మరి రెండోది?

అతన్ని దిగులు ఎప్పుడూ వెంటాడుతుంటుంది. ఓ రోజతను వెంటాడుతున్న దిగుల్నీ కనపడితే నిలదీసే అప్పులాళ్ళనీ అప్రమత్తంగా తప్పించుకుంటూ ఇల్లు చేరుకునేసరికి సౌభాగ్యం రెండు కవర్లు తెచ్చిచ్చింది.

కుటుంబరావు ఓ కవరు చింపేడు "మహారాజశ్రీ నాన్నగారికి మీ కుమార్తె సుజాత నమస్కరించి....' కుటుంబరావు అసహనంగా ఆ వుత్తరం పక్కనే పెట్టేసేడు.

"ఎక్కణ్ణుంచండీ ఆ వుత్తరం" సౌభాగ్యమ్మ అడిగింది.

"నీ పెద్దకూతురు దగ్గర్నుంచి" "మరి చదవకుండా అవతలపడేసేరెందుకు"

"ఏముంటుందే చదివేందుకు మా పెళ్ళై ఇన్నాళ్ళైంది. మా కివ్వాలిసిన వెయ్యి రూపాయలూ ఇంకా ఇవ్వలేదు మా కెంత వడ్డీ నష్టమో మీకు తెలుసుగదా.. నేను మళ్ళీ నీళ్ళు పోసుకున్నాని యిప్పటికి నాలుగు ఉత్తరాలు రాసేను. జవాబులేదు. సూడిద లెప్పుడిస్తారో తెలియపర్చవలెను. ఇంతే సంగతులు... ఏటా నీళ్ళు పోసుకునే దానికి సూడిదలు గాడిదలూను!"

"అదేంమాటండీ! దానికి దేవుడిస్తున్నాడు పురుళ్ళు పోసుకుంటోంది. గొడ్రాల్ని కనమంటే కంటుందా ఏడాదికో బిడ్డనీ!"

"అది కనటం తప్పనటంలేదే కాని మనకష్టం గమనించదేమని నాబాధ...పోయిన్సారి అది పురుడు కొచ్చినప్పుడు దానికనీ దీనికనీ ఏడెనిమి దొందలు ఖర్చైనై. ఆ సంగతి దానికి తెలుసు. కాని మీరు మాకు ఇవ్వాలసిన బాపతు వెయ్యిరూపాయలు యివ్వాలి అన్నపాట వదల్దేం? రెక్కలుమీద బ్రతికేవాడు ఇంత డబ్బు ఎక్కణ్ణుంచి తేగలడన్న ఆలోచన లేదేం దానికి? జాలి లేని మనిషికంటే పశువులేనయం! దానికి ముందు ఇంత గడ్డిపెట్టి తర్వాత పాలు పితుక్కుంటారు. ఈ ఆడపిల్లలు అలా కాదే- ఏ పెట్టుబడి లేకుండానే తండ్రి రక్తమాంసాలు పీల్చుకు తినాలని చూస్తారు!"

సౌభాగ్యమ్మ బిక్కమొహం వేసింది. "ఏమిటలా చూస్తావ్! ఫో.. పోయి నీ పెద్దకూతురుకి ఏం రాస్తావో రాసుకో! చూడు ఆ వుత్తరంలో కన్నతండ్రిని కనికరించటం నేర్చుకోమని రాయి... అలా కనికరించటం చేతకాకపోతే కనీసం సుశీలని చూసైనా నేర్చుకోమని చెప్పుదానికి."

కుటుంబరావు అలా కసురుకునేసరికి సౌభాగ్యమ్మ మారుపలక్కుండా లోపలికి వెళ్ళిపోయింది.

కుటుంబరావుకి కక్కగా మిగిలిన కోపాన్ని ఏం చేయాలో తోచలేదు. ఎదురుగా మరో కవరు. కసిగా చించేడు." శ్రీ కుటుంబరావుగార్కి నమస్సులు, ఇంకా మీ రెండో అమ్మాయి సుశీల పెళ్ళికాలేదనే వుద్దేశ్యంతో యీ వుత్తరం రాస్తున్నాను. నాపేరు రాజశేఖరం. మీ పెద్దబావగారి తోడల్లుడు వెంకట్రామయ్యగారు మీకు తెలిసే వుంటారు. నేను ఆయన పెద్దకొడుకుని. మా నాన్నగారికి ఆరోగ్యం సరిగా వుండక మీ పెద్దమ్మాయి సుజాత పెళ్ళికి నేనే వచ్చాను. ఆ పెళ్ళిలోనే సుశీలని చూసేను. కట్నంకోసం పట్టుపట్టు కూచున్న రామనాథంగార్ని, సుబ్రహ్మణ్యంగార్ని సుశీల దారికి తీసికొచ్చినవైనం నాకు బాగా నచ్చింది. కానీ కట్నం పుచ్చుకోకుండా వ్యక్తిత్వంగల మీ సుశీలని పెళ్ళాడాలని ఆనాడే నిశ్చయించుకున్నాను: కాని అప్పటికి నేనింకా నిరుద్యోగిని. కాగా మా పెళ్ళి మా పెద్దలకు నచ్చొచ్చు, నచ్చకపోవచ్చు. అందుకని నాకాళ్ళమీద నేను నిలబడేవరకూ పెళ్ళిమాట తలపెట్టకూడదనుకున్నాను. నెలక్రితమే నాకు వుద్యోగం వచ్చింది. నెలకి అయిదొందలు పైన జీతం. ఇందులో నాఫొటో పంపుతున్నాను. మీకూ, మీ అమ్మాయికీ యిష్టమైతే వెంటనే లెటర్రాయండి. పెళ్ళిఖర్చులకి బెంగపడొద్దు. ఇట్లు రాజశేఖరం.

కుటుంబరావు ఆ వుత్తరం చదివి వులిక్కిపడ్డాడు.

తర్వాత తన చేతిని గిల్లుకుని మళ్లీ చదివేడు. మళ్లీ చదివేడు. మళ్ళీ చదివేడు!

ప్రపంచంలో ఇలాంటి ధర్మాత్ములుంటారా?

"వున్నారనేగా నిరూపిస్తోందావుత్తరం! తర్వాత సంగతి ఆలోచించు" అని తొందర పెట్టింది మనసు.

ఇంక ఆలోచించేందుకేముంది. ఈ సంబంధం ఖాయమే అనుకున్నాడతను భార్యనిసుశీలని పిలిచి, ఆనందంతో మనసు కరగగా, అలా కరగాగావచ్చిన నీళ్ళని కళ్ళలోనింపుకుని ఆసంబంధం గురించి చెప్పేడు.

ఫోటో సుశీల చేతికిచ్చి "నీ అభిప్రాయ మేమిటమ్మా" అనడిగేడు. "ఔనను తల్లీ" అన్నట్టు వేడుకోలుగా చూసేడు.

సుశీల "ఔ"నన లేదు. ఉబికి వస్తున్న సంతోషాన్ని పెల్లుబుకుతున్న సిగ్గుతో కప్పుకుంటూ "నీ ఇష్టం నాన్నా" అంది.

అంతే.. రెణ్నెల్లు తిరిగే సరికల్లా సుశీల, రాజశేఖరంల పెళ్ళి సుజాత పెళ్ళికంటే ఘనంగా జరిపించాడు కుటుంబరావు . ఆ పెళ్ళికి అతను చేసిన కొత్త అప్పులు పాత అప్పుల్ని కొట్టుకుపోయినై, అలా పోతూ పోతూ వున్నపెంకుటింటిని పట్టుకుపోయినై.

అయినా కుటుంబరావుకి బాధేయలేదు. అప్పుచేసైనా అనుకున్న యాగం పూర్తిచేసిన వాడిలా తృప్తిగా వున్నాడు. సుశీలకి తగిన వరుడొచ్చాడన్న సంతోషంలో పెళ్లైన నాలుగోరోజున పందిట్లో కూచుని చుట్ట కాల్చుకుంటూ తన మ్రయానందం చెందుతున్నాడు. అప్పుడే సౌభాగ్యమ్మ అక్కడికి వొచ్చింది "ఏమండీ" అంటూ.

"వూ!" అన్నాడు కుటుంబరావు 'అమ్మాయి అల్లుడు యీ రాత్రికే వెళ్తూంట" అనడిగాడు.

"అవునుగానీ మీ ముద్దుల కూతురు ఏమంటూందో విన్నారా?"

"ఎవరితో?"

"ఇంకెవరితో!! అల్లుడిగారితో!"

"అల్లుడూ అమ్మాయి లక్షా తొంభై మాట్లాడుకుంటారు. మధ్యన నువ్వేమిటి, వినటమేమిటి బుద్ధిలేకుండా!" కుటుంబరావు నోట్లోంచి చుట్టతీసి కోప్పడ్డాడు.

"వాళ్ళు వాళ్ళగురించి మాట్లాడుకుంటున్నప్పుడు వినటం తప్పేకాని వాళ్ళు మాట్లాడుతోంది మనగురించే నండీ!

"ఏమంటున్నారు?"

'అతనేమనటం లేదు మన అమ్మాయే

"ఏమంటుందే ఇంతకీ?!!

"మీరేవచ్చి వినండి!" – సౌభాగ్యమ్మ కుటుంబరావుని దాదాపు రెక్కపుచ్చుకు లాక్కుపోయి అల్లుడూ కూతురూ వున్న గది కిటికీ దగ్గర నిలబెట్టింది.

గదిలోంచి సుశీల గొంతు విన్పిస్తోంది

"వింటున్నారా లేదా?"

"ఆ....అహ!....ఆ...వింటున్నా చెప్పు!" – రాజశేఖరం నిజానికి సుశీల మాటలు వింటున్నట్టులేదు – తడబడ్డాడు.

"సుజాతక్క, బావల పెళ్ళి జరిగినదగ్గర్నుంచీ మా నాన్న వాళ్ళకి ఎంత దోచిపెట్టాడో తెల్సా! పండగలకి పబ్బాలకి, పురుళ్ళకీ పుణ్యాల నోములకి ఇద్దరూ ఇక్కడికి రావటం, బెదిరించి వాళ్ళక్కావాల్సింది పట్టుకుపోవటం. ఇంతచేసి కట్నంతాలుకూ బాకీ ఇంకా తీరలేదనే అంటున్నారు వాళ్లు!"

"దుర్మార్గులు!"

"కాదు తెలివైనవారు! పుట్టింటి వాళ్ళకి ఆడపిల్లల్ని చూడగనే అప్పులు గుర్తొచ్చి దాంతో ప్రతిదానికీ పెడమొహం పెడతారు. దానికి కరిగిపోకుండా అల్లుళ్ళు పట్టుబట్టినప్పుడే ఏదన్నా గిట్టుబాటయ్యేది. అంతేగాని మీలాగా ప్రతిదానికి మొహమాటపడి "ఎందుకండీ" అంటే కాదు!"

"చూడు సుశీ! నేను కట్నాలూ కానుకలూ ఆశించి నిన్ను పెళ్ళిచేసుకోలేదు."

"ఆ సంగతి నాకూ తెలుసు, మానాన్నకి తెలుసు! కాని అంతా తెల్సిన మానాన్న చేసిందేవిటి? పదిహేను వేలు ఖరీదుచేసే అల్లుడు కానీ ఖరీదు లేకుండా వస్తున్నప్పుడు మిగతా లాంఛనాలన్నీ ఘనంగా జరిపించాలన్న ఇంగితం ఆయనకుందా? పెళ్ళికూతుర్ని నాకో ఖరీదైన పట్టుచీరన్నా పెట్టాడా? అసలు మీ అలుసు చూసుకునేకదూ ఆయన పెళ్ళికూడా తూతూమంత్రంలా జరిపించిందీ!" సుశీలగొంతు జీరవోయింది.

"అబ్బసుశీ ఇప్పుడీ సోదంతాదేనికి"

"సోది విన్నాకన్నా మీకు కర్తవ్యం బోధపడుతుందని! నామాటవిని మీరు కాస్తబెట్టుగా వుండండి. మానాన్న దగ్గర్నుంచి స్కూటర్ కొట్టేసే వుపాయం నేను చెబ్తాను. వింటున్నారా?"

సుశీల మాటలు విన్న కుటుంబరావు ముఖంలో రంగులు మారినై. గబుక్కున సౌభాగ్యమ్మ చేయి పుచ్చుకుని పందిట్లోకి లాక్కెళ్ళి పెళ్ళున నవ్వేసేడు!

బిత్తరపోయింది సౌభాగ్యమ్మ.

'ఎందుకే అలా కంగారు పడతావ్! నాకు పిచ్చెత్తలేదు. జ్ఞానోదయమైంది! ఆడపిల్ల గుండెల మీద కుంపటిలాంటి దంటారుకదా. ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళుచేసి నా గుండెలమీదున్న రెండు కుంపట్లు దించుకున్నానన్న ఆనందంలో వున్నాను ఇప్పటిదాక. కాని నా గుండెలమీదున్న కుంపటినిదించి మరొకాడి గుండెలమీద పెట్టేనని ఇప్పుడే .. సుశీల మాటలు విన్నాకే తెల్సింది.!"

కుటుంబరావు నవ్వుతూ అన్నాడు. నవ్వుతూనే వున్నాడు!

స్వాతి మాసపత్రిక

# సుశీల

## పాపినేని శివశంకర్

తప్పదు. ఒక్కోసారి మన కెంతో ఆత్మీయులైన వాళ్ళని బాధించాల్సి వస్తుంది.

నరేంద్ర నాకు బావమరిది అనటం కంటే ఆత్మీయుడంటే బావుంటుంది.

నాకు పెళ్లయిన కొద్ది రోజుల్లోనే వాడు మా మధ్య కొత్తగా ఏర్పడ్డ చుట్టరికాన్ని చెరిపేసి స్నేహితుడయ్యాడు. నా శ్రీమతి నళిని తత్వానికి వాడి తత్వానికి ఎంతో తేడా వుంది. నళిని ఎప్పుడు నాతో మాట్లాడినా ఆ మాటల వెనుక నేను తన భర్తననే గౌరవ భావం వుంటుంది. నరేంద్ర మాటల్లో గౌరవం కాక స్నేహం మాత్రమే కన్పిస్తుంది. తనతో ఏ విషయం చర్చించినా క్షణంలో ఆ విషయాన్ని నా నుంచి వేరు చేసి స్వేచ్ఛగా పరిశీలిస్తాడు. సూటిగా నిస్సంకోచంగా తన అభిప్రాయం చెబుతాడు. వాడి తత్వం నాకు నచ్చినా నేను మాత్రం అలా ప్రవర్తించలేను. ఎదటి వాళ్ళని బట్టి అభిప్రాయాలు 'రిజర్వ్' చేసుకోవటం నాకలవాటు.

ఇంతకీ ఈ కఠోర వార్త వాడి చెవినెలా వెయ్యాలో తోచకుండా వుంది. ప్రయాణ మంతా నాకిదే ఆలోచన. అసలు నేను గాజులూరు వెళ్ళకుండా వుంటేనే బావుండేదేమో నన్పించింది. కాని వెళ్ళకుండా ఎలా? బావమరిది పెళ్ళి సంబంధమాయె. పైగా వాడే స్వయంగా బతిమాలాడాయే.

⋆ ⋆ ⋆

"బావా! నువ్వే వెళ్ళి సంగతులన్నీ కనుక్కురావాలి" అన్నాడు వాడు.

"సంగతులంటే? కట్నం ఎంతిస్తారు. ఆడపడుచు లాంఛనాలు - ఇవేనా?" అడిగాను నేను, వాణ్ణి కాస్త రెచ్చగొడుతూ.

నరేంద్ర నవ్వాడు.

"మొదటిది నాకవసరం లేదు. ఇక రెండోది అవసరమేమో అక్కనే అడగాలి" అన్నాడు.

"ముందు సంబంధం కుదరనివ్వండి" అంది నళిని లౌక్యంగా విషయాన్ని దాటేస్తూ.

కాని వాడి సంగతి నాకు బాగా తెలుసు. కట్నం కాదన్నవాడు లాంఛనాలకి ఒప్పుకుంటాడా?

"నాకు సెలవుల్లేవు. పోనీ నీ పెళ్లి విషయం నువ్వే వెళ్ళి తేల్చుకుంటే పోదూ?" అన్నాను నేను.

"అదేమిటండీ? వాడు వెళ్ళి నేరుగా 'మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి' అని అడుగుతాడా ఏమిటి? పెద్ద వాళ్ళు ఉన్న దెందుకో?" అంది శ్రీమతి.

వెంటనే నా పెద్దరికం గుర్తుకొచ్చి సరేనన్నాను. ఆఫీసులో మేనేజర్ని బతిమాలుకుని రెండు రోజులు లీవు సంపాదించాను. ఆరోజే బయల్దేరి గాజులూరు వెళ్ళాను. అక్కడ మా ఫ్యామిలీ ఫ్రెండ్ సుధాకరరావు ఉంటున్నాడు. ఇద్దరు కొడుకులు వాడికి. ఇద్దరికీ పెళ్ళిళ్లు చేసి, పొలాలు కౌలుకిచ్చి నిశ్చింతగా కాలం గడుపుతున్నాడు. ఆయన చిన్న కొడుక్కి మా నరేంద్రకి మంచి స్నేహం.

హఠాత్తుగా నన్ను చూసి సుధాకరరావు ఆశ్చర్యపోయాడు. మాటా మంతీ అయింతర్వాత అసలు విషయం ప్రస్తావించాను.

"ఈ మధ్య మా నరేంద్ర మీ వాడి కోసం ఇక్కడికి వచ్చాడుగా? అప్పుడు ఇక్కడో అమ్మాయిని చూశాడట. చాలాసార్లు మాట్లాడుకున్నారట. ఆ అమ్మాయి తనకి నచ్చిందనీ, వివరాలు తెలుసుకు రమ్మనీ నన్ను తోలాడిక్కడికి" అన్నాను.

"ఆహ! మొత్తానికి మీవాడు ఘటికుడే. ఏదో మా వాడూ, మీవాడూ కలిసి తిరుగుతున్నా రనుకున్నాను గాని ఇంత వ్యవహారం ఉందనుకోలా. అలాగే కనుక్కుందాం. సమయానికి మా వాడు ఊళ్లో లేడు. ఇంతకీ ఎవరా అమ్మాయి?" అడిగాడు సుధాకరరావు

"ఈ పక్క ఇల్లేనట. దశరథరామయ్య గారి పెద్ద కూతురన్నాడు" చెప్పాను నేను.

సుధాకరరావు ఉలిక్కిపడ్డాడు "ఆ అమ్మాయా?" అన్నాడు తెల్లబోతూ.

"ఏం? అమ్మాయి బావుండదా?" అడిగాను నేను సందేహిస్తూ.

"అబ్బే అమ్మాయికేం బంగారపు బొమ్మ. సుశీల. డిగ్రీ పాసయ్యింది. తెలివైన పిల్ల కానీ..."

నాకేం బోధపడక ప్రశ్నార్థకంగా చూశాను.

"ఎలా చెప్పాలో అర్థం కావటం లేదు. మీ వాడి ఎన్నిక ఒక రకంగా సరైందే కానీ... మూడేళ్ళ కిందట ఆ అమ్మాయి మీద అత్యాచారం జరిగింది."

నేను దిమ్మెర పోయాను సుధాకరరావు కొనసాగించాడు.

"మూడేళ్ళ కిందట ఇంట్లో ఎవరూ లేని సమయంలో పాపం, ఆ పిల్లని వాళ్ల బంధువుల కుర్రాడే బలాత్కరించాడు. వాణ్ణి దేహ శుద్ధిచేసి పంపించేశారు. ఊరంతా గుప్పుమంది. తర్వాత వాడికే ఇచ్చి పెళ్ళి చేద్దామని పెద్ద వాళ్ళు ప్రయత్నించారు. కాని ఆ పిల్లే ఒప్పుకోలేదు. 'వాడి మొహం చూడను పొమ్మంది.' అప్పట్నుంచీ ఆ పిల్లకి పెళ్లి కావటం కష్టంగా ఉంది. రెండో పిల్లకూడా పెళ్ళికి ఎదిగి కూర్చుంది. కాని ఏం లాభం? ఎన్ని

సంబంధాలు వచ్చినా విషయం తెలియగానే వెనక్కి పోతున్నాయి. పోనీ, విషయం దాచి పెట్టి ఎవడికైనా కట్టబెడదామా అంటే సుశీల ససేమిరా ఒప్పుకోవటం లేదు. అదీ సంగతి."

నేను మాట్లాడలేక పోయాను. మనస్సు పరి పరి విధాల పోయింది. పాపం, ఆ అమ్మాయి మనసు బాగా గాయపడి వుంటుంది. ఆడపిల్ల శీలం కోల్పోయిందని తెలిస్తే ఇక పెళ్ళెలా జరుగుతుంది?.... ఈ సానుభూతి సరే. నరేంద్ర సంగతేమితి? వాడికి విషయం ఎట్లా చెప్పాలి? ఎంతో ఉత్సాహంగా తనంతట తనే పిల్లని ఎన్నుకున్నాడు. ఈ విషయం తెలిస్తే చాలా బాధపడతాడు. కాని చూస్తూ చూస్తూ ఆ అమ్మాయి నెలా పెళ్ళాడతాడు? నేను మాత్రం ఎలా ఒప్పుకోగలను?

నా ఆలోచనలు తెగేలోగా ఎవరో అమ్మాయి గబగబా లోపలికి వచ్చింది, 'అంకుల్' అంటూ. ఎంతో అందంగా చలాకీగా వుంది. కొత్తవాణ్ణి నన్ను చూసి మొహమాటంగా ఆగిపోయింది.

"ఫర్వాలేదు రామ్మా! నరేంద్ర తెలుసుగా? వాళ్ల బావ" అంటూ సుధాకరరావు నన్ను పరిచయం చేశాడు. "మన పక్కింటి అమ్మాయి. సుశీల" అంటూ తనని పరిచయం చేశాడు.

తలవని తలపుగా ఆ అమ్మాయే కన్పించేసరికి ఆశ్చర్యంతో అలాగే చూస్తుండి పోయాను.

"నమస్తే అంకుల్ నరేంద్ర బావున్నాడా?" అని అడిగింది సుశీల.

నేను మానంగా తలూపాను. తనకి నరేంద్రకీ బాగానే పరిచయమై ఉండాలి.

"ఏంటమ్మా పని మీద వచ్చావు?" అడిగాడు సుధాకరరావు.

"ఏం లేదంకుల్! ఈ లాండ్‌స్కేప్ చూపిద్దామని" అంటూ సుశీల చేతిలోని పటం సుధాకరరావు కిచ్చింది.

నేను కుతూహలంగా చూశాను. ప్రకృతి చిత్రం అది, అయిల్ పెయింటింగ్ విశాలమైన మైదానం. కొండల వెనుక అస్తమిస్తున్న సూర్యుడు. పచ్చిక బయల్లో గొర్రెల మంద. అంత వరకు అది మామూలు బొమ్మే. కానీ ఆ వెనగ్గా ఒక గొర్రెపిల్ల నెత్తుకొని నడుస్తున్న గొర్రెల కాపరి మూర్తి ఆ మామూలు బొమ్మని అసాధారణ చిత్రం చేసింది. గొర్రెపిల్ల కన్నుల్లోని అమాయక మృదుత్వం, కాపరి కన్నుల్లోని కారుణ్యం - నిజంగా గొప్ప చిత్రం.

ఎలా వుందన్నట్టు సుశీల సుధాకరరావు వైపు చూస్తోంది. రావు నావైపు చూశాడు.

"చాలా బావుంది. మనిషికీ ప్రకృతికీ మధ్య సంబంధం చక్కగా చిత్రించావు. నా ఉద్దేశం కరెక్టే అయితే నువ్విప్పటికి చాలా బొమ్మలు గీసి వుండాలి అవునా?" అన్నాను నేను సుశీల వంకే చూస్తూ.

సుశీల తల ఊపింది.

"అన్నీ లాండ్ స్కేప్ లేనా?"

సుధాకరరావు అందుకున్నాడు.

"కాదు, కాదు, సర్రియలిస్టిక్ బొమ్మల దాకా చాలా వేసింది. నాకంతగా తెలీదనుకో కొన్ని ఎగ్జిబిషన్‌లకి కూడా వెళ్ళాయి... నిలబడే వున్నావు. ఫర్వాలేదు కూర్చోమ్మా!"

సుశీల నాపక్కనే వున్న కుర్చీలో కూర్చుంది. ఆమె మొహంలో అసాధరణ ప్రజ్ఞ ఏదో దాగి వున్నట్టనిపించింది. ఆమె చిత్రకారిణిగా నాకు పరిచయం కాకపోయినా ఆ మాట చెప్పగలిగే వాణ్ణే. సుశీలతో కాసేపు మాట్లాడదా మనిపించింది.

"ఏం చదువుతున్నావు?"

"ఎం.ఏ., ప్రైవేటుగా రాస్తున్నానండీ. ఇంగ్లీషు తీసుకున్నాను. అప్పుడప్పుడూ కాలక్షేపం కోసం పెయింటిగ్స్ వేస్తుంటాను."

"మీ సిలబస్‌లో ఏమేం ఉంటాయి?" కొన్ని పుస్తకాలు చెప్పి "షేక్స్‌పిరియన్ డ్రామా కూడా వుందండీ. మాక్బెత్" అంది సుశీల.

"అలాగా, షేక్స్‌పియర్ అంటే నాకు చాలా ఇష్టం. నేనో ప్రశ్న అడుగుతాను, జవాబు చెబుతావూ? మాక్బెత్ నాటక ప్రారంభంలో ముగ్గురు మంత్రగత్తెలు ప్రవేశిస్తారు గదా? శుభమా అంటూ మంత్ర గత్తెల్ని ఎందుకు ప్రవేశపెట్టాడంటావు రచయిత?" కుతూహలంగా అడిగాను.

నా కుతూహలం తెచ్చిపెట్టుకున్నది. నిజానికి నాకు షేక్స్పియర్ కన్నా ఇబ్సన్, షా నాటకాలే నచ్చుతాయి. అయితే ఏదో ఒక వంకతో ఆ అమ్మాయిని మాట్లాడించటమే నా వుద్దేశం. నా వుద్దేశాన్ని అంతో యింతో పసికట్టి సుశీల చిరునవ్వు నవ్వింది.

"ట్రాజెడీ కదండీ? ఆ ట్రాజిక్ టోన్‌కి అనుగుణంగా, ఒక్కసారిగా ప్రేక్షకుల మనస్సును మలచదల్చుకున్నాడు షేక్స్పియర్. మొత్తం నాటకం కీ-నోట్ మంత్రగత్తెల ప్రవేశం లోనే వుంది. నాటకమంతటా నేరం, దుర్మార్గాలకు సంబంధించిన ఏ వాతావరణం కన్పిస్తుందో అది మంత్రగత్తెల ప్రవేశంతోనే మొదలవుతుంది" అని చెప్పింది సుశీల, నా వంకే చూస్తూ.

"బావుంది" అన్నాను నేను గంభీరంగా, సుశీల సూక్ష్మబుద్ధిగా తోచింది. కేవలం డిగ్రీ కోసం గాక ఒక తపనతోనే చదువుతూ వుండాలి. యధాలాపంగా మాట్లాడినట్టు పాలిటిక్స్ గురించి, సోషల్ కల్చర్ గురించి కొన్ని విషయాలు ప్రస్తావించాను. సుశీలకి కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. అయితే వాటిని శాశ్వత సత్యాలుగా భావించకుండా సాపేక్షంగానే ప్రతిపాదిస్తుంది. అది నాకెంతో నచ్చిన అంశం. అభిప్రాయ కాఠిన్యం వల్ల మనిషి చాలా కోల్పోతాడు. తన అభిప్రాయాల చట్రంలోనే కాస్త అటూ ఇటూ కదలగల వెసులు బాటు వున్ననాడు సంతోషంగా జీవించగలడు. పక్కవాళ్ళనీ సంతోష పెట్టగలడు. ఇక్కడ వెసులు బాటు అంటే మాటి మాటికి ఒపీనియన్స్ ఛేంజ్ చెయ్యగలగటమని కాదు. మార్పుకుఅవకాశం ఉంచుకోవటం.

అలా ఓ అరగంటసేపు సుశీలతో మాట్లాడి వుంటాను. కాదు, మాట్లాడించి వుంటాను. అంతసేపూ సుధాకరరావు – నా ఆంతర్యం గ్రహించి – నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

సుశీల వెళ్ళడానికి లేచింది. "వెళ్ళొస్తానంకుల్! నరేంద్రనడిగినట్టు చెప్పండి. అన్నట్టు ఈస్టటిక్స్ మీద కొన్ని పుస్తకాలు పంపిస్తానన్నాడు. వెంటనే పంపించమనండి" అందిసుశీల.

"అలాగే" అన్నాను నేను. సుశీల వెళ్ళిపోయింది, పెయింటింగ్ తీసుకొని. ఒక చల్లని పరిమళం గది దాటి వెళ్ళిపోయి నట్టనిపించింది.

"చాలా తెలివైంది కదూ?" అడిగాడు సుధాకరరావు నా వంక చూస్తూ.

"అవును అంతే కాదు. ఆడపిల్లల్లో కన్పించే అనవసరమైన సిగ్గు కూడా లేదు" అన్నాన్నేను.

"అయితే నీకూ నచ్చిందన్నమాట అమ్మాయి?"

"ఈ నచ్చటం వేరు. నరేంద్ర పెళ్ళి విషయం వేరు." అన్నాను ఖచ్చితంగా.

నాకు తెలుసు, సుశీల మరింత అందగత్తె అయినా, మరింత తెలివి గల పిల్ల అయినా నరేంద్రతో పెళ్లి జరిపించలేనని. ఆ అమ్మాయితో అంత సేపు మాట్లాడడానికి కారణం, నరేంద్ర కిష్టమైన పిల్ల తెలివి తేటలేమిటో పరీక్షించదలచు కోవటమే. అందమూ, తెలితేటల్తో పాటు శీలమూ ముఖ్యమేనని నా అభిప్రాయం. అయితే అందం, తెలివీ నిరూపణకు నిలచినట్టు శీలం నిలుస్తుందా అంటే జవాబు చెప్పలేను.

ఆ సాయంత్రమే బయల్దేరి పట్నానికి తిరిగొచ్చాను. విషయమంతా నరేంద్రకి స్పష్టంగా చెప్పాను. ఆ విధంగా బాధించాననే అనుకున్నాను.

⋆ ⋆ ⋆

కానీ నరేంద్ర బాధపడలేదు. ఆలోచనలో పడ్డాడు. వాడి ఆలోచన చూసి నేను గాభరా పడ్డాను. వాడింకా ఆలోచించటానికేముంది? లోకంలో ఎవరైనా చెడిపోయిన పిల్లని పెళ్లి చేసుకుంటారా తెలిసి తెలిసి? 'చెడిపోయిన పిల్లా?' అంటే కాకపోవచ్చు. కానీ 'చెడగొట్టబడిన పిల్లే గదా? రెండింటికీ ఏమంత తేడా వుంది?

తన ఆలోచన తెగిం తర్వాత నరేంద్ర నన్నడిగాడు, "బావా! నీ అభిప్రాయం ఏమిటి?"

ఇందులో అభిప్రాయానికేవుంది? ఆ పిల్లనింకా ఇష్టపడుతున్నావా ఏమిటి?" అడిగాను నేను ఆశ్చర్యపోతూ, నళిని కూడా తెల్లబోతూ నరేంద్ర వంక చూసింది.

"ఆ విషయం నిర్ధారించుకోవటానికే నీ అభిప్రాయం అడుగుతున్నాను. సుశీలని ఇష్టపడకపోవటానికి బలీయమైన కారణం వుందా అని నా ఆలోచన" అన్నాడు నిదానంగా నరేంద్ర ఆ మాటలతో ఇక నళిని ఆగలేకపోయింది.

"అదేమిట్రా అలా అంటావు? చూస్తూ చూస్తూ చెడిపోయిన పిల్లని చేసుకుంటావా ఏమిటి?" అంది కాస్త ఉద్రేకంగా.

నరేంద్రలో ఆ ఉద్రేకం లేదు. వాడి తత్వం నాకు బాగా తెలుసు. వట్టి మొండి ఘటం. ఒక సంగతి పట్టుకున్నాడంటే దాని అంతు చూసే దాకా వదలడు. వాదమైనా అంతే, వ్యవహారమైనా అంతే, ఆ మధ్య నెవడో "ఫిలాసఫీ గురించి నీకేం తెలుసోయ్?"

అన్నాడట. ఆ వంతున వాడు ఆరు నెలల పాటు హెరాక్లిటస్ నుంచి జిడ్డు కృష్ణమూర్తి దాకా పుస్తకాలన్నీ నూరేసాడు.

"ఇక్కడ రెండు సంగతులున్నాయి." అంటూ నరేంద్ర చర్చకు దిగాడు. "ఒకటి సుశీల చెడిపోయిందా? అనేది. రెండు, చెడిపోయిన అమ్మాయినైతే మాత్రం చేసుకోగూడదా అనేది. బావా! చెడిపోవటం అంటే ఏమిటి?"

"అంటే శీలం లేకపోవటం" అన్నాను నేను వెంటనే.

"శీలం అంటే ఏమిటి?" అడిగాడు వాడు, అసలుకే ఎసరు పెడుతూ.

"శీలం అంటేనా? అంటే.. పోనీ నువ్వు చెప్పు నళినీ!" అన్నాను నాకేమీ తోచక.

"నాబొంద " అంది నళిని తీవ్రంగా.

తనకీ సరైన సమాధానం దొరకలేదని అర్థం. వాదనలో ప్రాథమిక ప్రమాణం దగ్గరే మేం బోల్తా కొట్టాం. ఇక ప్రత్యర్థి ఊరు కుంటాడా?

"భర్తని తప్ప పరపురుషుణ్ణి మనసా, కర్మణా కోరుకోకుండా పవిత్రంగా ఉండటమే శీలమను నుకుంటాను" అన్నాడు నరేంద్ర తనే నిర్వచనం అందిస్తూ.

"అంతే, అంతే" అన్నాను నేను, నాకు తోచని నిర్వచనం వాడికి తోచినందుకు ఆశ్చర్యపోతూ.

"ఎన్నడూ పరపురుషుణ్ణి గురించి మనసా–కాసేపు కర్మణా తీసేద్దాం – ఇష్టంగా ఆలోచించని స్త్రీ లెంత మందుంటారు? పెళ్ళి కాకముందు వేరే ఎవర్నీ ఇష్టపడకుండా 'కాబోయే భర్తని మాత్రమే ఇష్టపడదాం' అని ఏ స్త్రీ అయినా మనస్సు బిగదీసుకొని ఉండగలదా? అలాగే మగడావైనా. అంటే ఈ స్త్రీ పురుషులందరికీ శీలం ఉన్నట్టా లేనట్టా?" ప్రశ్నించాడు నరేంద్ర.

నళిని నరేంద్ర వంకే గుర్రుగా చూస్తుండిపోయింది. వాడి వరస తనకే మాత్రం నచ్చలేదని ఆమొహమే చెబుతుంది. నరేంద్ర మళ్ళీ అందుకున్నాడు.

"కాబట్టి మానసిక పవిత్రత మీద నాకంత నమ్మకం లేదు. శారీరక పవిత్రత అయినా అంతే. స్త్రీ అయినా పురుషుడైనా తన కిష్టమైన వ్యక్తిని కాంక్షించటంలో తప్పులేదు. ఆ కాంక్షతో మనశ్శరీరాల సమతౌల్యాన్ని బట్టి దాని మంచి చెడ్డలుంటాయి. అంటే ఒక వ్యక్తి ఎదటి వాళ్ళ మనస్సుతో పని లేకుండా శరీరాన్నే కోరుకోవటం తప్పనుకుంటాను. అంతేగాని వేరుగా శీలం అనే పవిత్ర పదార్థం ఎక్కడుంది? పవిత్రత, అపవిత్రత అనేవి చాలా పెద్దమాటలు. ఈ పవిత్రతని నిర్ణయించటానికి పెళ్ళి పెటాకులు ప్రమాణాలే కావు."

నరేంద్ర మాటల్లో ఎక్కడో సబబున్నట్టే తోస్తుంది. అది కేవలం వాది బలం కాదు. వాద బలమే. వాడి మాటల్లో దేన్ని ఎలా ఖండించాలో నాకు తోచలేదు. వాడే మళ్ళీ అందుకున్నాడు.

"ఒక స్త్రీకి మానభంగం జరిగితే...నో, మానభంగం అనే మాట సరైంది కాదు. మనిషికి అభిమానమే గాని మానం ఎక్కడుంది? ఒక వేళ ఉంటే అది స్త్రీకి మాత్రమే మానం లేదా శీలం అనే దాన్ని కల్పించి, ఆమె దాన్ని తన పురుషుడి కోసం కాపాడుకోవాల్సిన

అంశంలాగా పవిత్రత రంగు పూశాం. మరి మగాడి సంగతేమిటి? నిజానికి స్త్రీ మీద అత్యాచారం చేసినపుడు 'పవిత్రత' కోల్పోతున్నది స్త్రీయా పురుషుడా?"

నరేంద్ర మంచి పాయింటే పట్టుకున్నాడనిపించింది నాకు, నళిని మాత్రం నోరు తెరుచుకొని వింటూ వుంది. తమ్ముడి వాదనకు దిమ్మెరపోయి వుండాలి.

"నా వుద్దేశంలో ఇక్కడ పురుషుడే పవిత్రత కోల్పోతున్నాడు – అసలు 'పవిత్రత' అనేది వుంటే. అత్యాచారాల విషయంలో ఏ విధంగానూ స్త్రీని తప్పు పట్టనవసరం లేదు. తన ప్రమేయం లేకుండా తన మీద జరిగిన దాడికి ఆమె నెందుకు తప్పు పట్టాలి? అందు వల్ల సుశీల చెడిపోయిందన్నా, చెడగొట్టబడిందన్నా నేనొప్పుకోను." అన్నాడు నరేంద్ర ఖచ్చితంగా.

"అంతా వితండవాదం, నీతో వాదించలేనుగానీ నేను పోతున్నాను. అవతల వంట చేయాలి" అంటూ నళిని చర చరా లోపలికి వెళ్ళింది.

నరేంద్ర వాదన బాగానే వున్నా లోకం దృష్టిలో శీలం కోల్పోయిన పిల్లని చూస్తూ చూస్తూ ఎలా ఇంటికి తెచ్చుకోవటం? అయితే కళ్ళ ముందు సుశీలే నిలబడి వుంటే ఆ అమ్మాయిని 'చెడిపోయిన పిల్ల' అనగలనా? పోనీ అనుకోగలనా? చెప్పలేను. ఒక విషయం మాత్రం నాకు స్పష్టమైంది, నరేంద్ర వాదన ద్వారా. అదేవిటంటే అత్యాచారానికి గురైన స్త్రీ విషయంలో మన కేర్పడే భావాల్లో ఏదో లోపం ఉందని. పురుష జాతి స్త్రీ జాతికేదో అన్యాయం చేసింది.

మొత్తానికి సుశీలని పెళ్ళాడే విషయంలో నరేంద్ర మనస్సేమీ మారలేదు. పైగా ఆ విషయం గురించి నాతో వాదించే క్రమంలో వాడి అభిప్రాయాలు వాడికే మరింత స్పష్టమై బలపడ్డాయేమో కూడా. నళిని మాత్రం తమ్ముడి ప్రయత్నాన్ని విఫలం చెయ్యటానికి పోరుకులాడింది గానీ ఫలితం కలగలేదు.

"మీరైనా వాడితో ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోవద్దని చెప్పరాదూ? ముందూ వెనకా ఇంకెవరున్నారు చెప్పేటందుకు?" అంటూ నన్ను ఉద్రేకించింది.

కానీ నరేంద్ర దగ్గర నా పప్పులు ఉడకవని తేలిపోయింది. వాడు జగమొండి. తను నమ్మిన దాన్ని ఎవరి కోసమూ వదులుకొనే రకమూ కాదు. కనీసం, అలా నటించే రకమూ కాదు. ఉండీ ఉండీ ఒక రోజువాడు 'నా పెళ్ళి విషయం నేనే తేల్చుకుని వస్తాను బావా!' అంటూ ప్రయాణమయ్యాడు.

"ఏం తేల్చుకొస్తావోయ్?" అడిగాను నేను.

"నువ్వో క్రొత్త విషయం తీసుకొచ్చి చెప్పావుగదా? ఆ విషయంలో సుశీల భావాలెలా వున్నాయో, పెళ్ళి గురించి ఆమె అభిప్రాయం ఎలాంటిదో ముఖాముఖీ మాట్లాడితే గాని తేలదు" అన్నాడు నరేంద్ర.

నేను వద్దని చెప్పలేదు. చెదితే విననప్పుడు ఎవరి మంచి చెడ్డలకి వాళ్ళనే బాధ్యత వహించనిస్తే బావుంటుంది. నళిని మాత్రం,తమ్ముడు చెయ్యి దాటి పోతున్నందుకు దిగులు పెట్టుకుంది. నరేంద్ర గాజులూరు వెళ్ళిపోయాడు.

నరేంద్ర తిరిగి వచ్చేదాకా మా యిద్దరి లోనూ టెన్షన్ పెరిగిపోయింది. వెళ్ళిన నాల్గోరోజు వాడు తిరిగి వచ్చాడు. మొహం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఒక్కొక్కటి సంగతులన్నీ చెప్పుకొచ్చాడు. నరేంద్ర నేరుగా సుశీల ఇంటికే వెళ్ళాడట. పెద్దవాళ్ళను కలుసుకొని సుశీలతో మాట్లాడాలన్నాడట. అంతకు ముందు కొంత తెలిసిన మనిషే కాబట్టి వాళ్ళూ అడ్డు పెట్టలేదు. తనకి సుశీలకి మధ్య సంభాషణ ఇలా జరిగిందని చెప్పాడు.

★ ★ ★

"నిన్ను గురించి నేనో సంగతి విన్నాను. సుశీలా! స్టన్నయి పోయాననుకో" అన్నాడు నరేంద్ర.

" ఏ సంగతి?" అడిగింది సుశీల.

"అదే...ఎవరో నీ మీద అత్యాచారం చేశారటగదా? అయామ్ వెరి సారీ"

"నన్ను చూసి జాలిపడుతున్నావా?" సూటిగా నరేంద్ర మొహంలోకి చూస్తూ అడిగింది సుశీల.

"ఆలోచిస్తే... అలాంటి భావమే ననుకో" అన్నాడు నరేంద్ర.

"పోన్లే, ఎగతాళి చెయ్యలేదుగా. అంత వరకు నయమే" అంది సుశీల పెడ మొహం పెడుతూ.

"అదేమిటి సుశీలా అలా అంటావు? అలాంటి సంఘటన ఎవరికైనా బాధాకరమే కదా?"

"బాధని సహించగలనుగానీ జాలినే సహించలేను. ఆ సంఘటనవల్ల సమస్తం కోల్పోయాననుకోవటం లేదు."

"అయితే జరిగిన దానికి నీకేమీ విచారం లేదా ఏమిటి?" ఆశ్చర్యపోతూ అడిగాడు నరేంద్ర.

"ఒకందుకు విచారం. అపుడు నేను పిరికి తనంతో ఎందుకు అబలనై పోయానా అని. ఇప్పుడైతే ఏ పరిస్థితి నెదుర్కొనేందుకైనా చాలినంత ధైర్యం ఉంది."

"అది సరే, శీలం కోల్పోయిన ఆడదానికి సంఘంలో ఏ మాత్రం విలువ లేదు గదా?"

"మీరనే శీలం మన జీవితంలో కలిగించగల మార్పులేదు. ఇక సంఘం దృష్టిలో విలువ అంటారా? తాళి బొట్టు చాటున వ్యభిచరించే పతివ్రత లెంత మంది లేరు?"

'కానీ ఈ విషయం తెలిస్తే నిన్నెవరు పెళ్ళి చేసుకుంటారు?"

"తెలియకుండా నన్నెవరైనా పెళ్ళి చేసుకోవటానికి నేనంగీకరించను. తెలిసి, చేసుకోనంత మాత్రాన ముంచుకు పోయిందేమీ లేదు. ముక్కు మొహం తెలీయకుండా, భావాలు కలవకుండా ఎవరినైనా ఎందుకు పెళ్ళాడాలి?" ఎదురు ప్రశ్న వేసింది సుశీల.

ఆపైన నరేంద్ర వ్యతిరేక వాదన చెయ్యలేదు.

"మరి నా ముక్కూ మొహం నీకు తెలుసు గదా? చాలా సార్లు మనం మాట్లాడుకునీ

వున్నామాయె. నీ భావాలతో నావి కలిసి నట్టేనా?" అని నవ్వుతూ అడిగాడు.

సుశీల ఆశ్చర్యంతో అతని వంకే చూస్తుండి పోయింది. నరేంద్ర ఆమె వైపుతన చెయ్యి చాపాడు. సుశీల మెల్లిగా అతని చేతిలో చెయ్యి వేసింది.

★ ★ ★

ఏ విషయమంతా నరేంద్ర చెప్పిన తర్వాత నేను మెత్తబడ్డాను. సుశీల పట్ల నాకు ప్రత్యేకించి వ్యతిరేకత లేదు. కానీ ఏది నేను స్త్రీ జీవితంలో ముఖ్యం అనుకుంటూ వచ్చానో దానికి రవ్వంత విలువ లేదని నరేంద్ర ఒకరకంగానూ, సుశీల మరో రకంగానూ తేల్చిపారేశారు. నా అభిప్రాయాల్ని వెంటనే మార్చుకోవటానికి నేను సిద్ధంగా లేకపోయినా నరేంద్రని వారించ లేకపోయాను. సుశీల వ్యక్తిత్వం గొప్పదని నాకూ నమ్మకం కలిగింది.

నళిని మాత్రం శత విధాల తమ్ముడి మనస్సు మార్చటానికి ప్రయత్నించింది. అయితే నరేంద్ర సహస్ర విధాల అక్కభావాల నెదుర్కోగలిగాడు. చివరికి నళిని తమ్ముడి ప్రతిపాదనకి 'ఊ' అనక తప్పింది కాదు. నెల తిరక్కుండానే సుశీలా నరేంద్రలు భార్యా భర్తలయ్యారు. నళిని మొదట్లో ముభావంగా ఉన్నా సుశీల చాలా తొందరగానే తన మనస్సు నాకర్షించగలిగింది. ఆ పిల్ల తెలివి తేటలట్లాంటివి.

మనిషి సుఖంగా బతకటానికి ధైర్యమూ సాహసమూ అవసరమనుకుంటాను. అవి సుశీలా నరేంద్రల్లో ఉన్నాయి. పరస్పర విశ్వాసమూ ఉంది. వాళ్ళు సుఖపడగలరనే నా అనుమానం!.

రచన మాసపత్రిక

# జీవన వైరుధ్యాలు

## పాలకోడేటి సత్యనారాయణరావు

జీవనయాత్రసాగించటానికి ఎన్ని మార్గాలు లేవు చెప్పండి - కొందరు రోజంతా శ్రమిస్తారు. కొందరు రోజులో కొంతసేపు కష్టపడతారు. మరికొందరు తమ కోసం ఇతరులను నష్టపెడతారు. బతకటానికి ఎన్నెన్నో మార్గాలు మరి!

గోపాలరావు ఎంచుకున్న మార్గం మాత్రం నాకు చిత్రంగా తోచేది - టూరిస్టు బస్సులను నడపటం అతని జీవిక. 'పుష్కరాలొస్తున్నాయి, పదండి రాజమండ్రికి అని ఒకసారి, శివరాత్రికి శ్రీశైలం చూడకపోతే ఎలా? అని ఇంకోసారి ఏవేవో చెప్పేవాడు. ఓ అరవై డెబ్బయిమందిని పోగేసేవాడు. ఏ అర్ధరాత్రి వేళో టూరిస్టు బస్సును బయలుదేరదీసేవాడు. పది రోజులు పదిహేను రోజులు సాగేవి ఆ యాత్రలు. మళ్ళీ అందర్నీ క్షేమంగా తిరిగి వాళ్ళ గూళ్ళకు చేర్చి నిట్టూర్చుకొనేవాడు.

"ఎందుకురా ఇంత శ్రమపడతావ్!" అనడిగానోరోజు.

నవ్వేశాడు గోపాలరావు - "ఎందుకంటే, నా టూరిస్టు బస్సులో వచ్చిన వాళ్ళకు పుణ్యం, నాకు మిగిలేది పురుషార్థం!" అని జవాబిచ్చాడు.

గోపాలరావు బరువు బాధ్యతల గురించి నాకు తెలీందిగాదు - రోగిష్టి భార్య, భర్త వదిలేసిన పెద్దమ్మాయి, పెళ్ళికి ఎదిగి కూర్చున్న మరో ఇద్దరమ్మాయిలు, తండ్రికి తనవంతు ఊతమివమవటానికి మరో పదేళ్ళయినా వేచిచూడాల్సిన కుమార రత్నం....మరి జీవికకోసం ఏదో ఒకటి చెయ్యక తప్పదుగదా!

"ఈ సారి మేం కాశ్మీర్ వెడుతున్నాం, నువ్వూ రావాలిరా!" అన్నాడు గోపాలరావు నాతో. నేను నవ్వేశాను - "కాశ్మీర్కా? ఏంనాయనా! నా మీద నీకంత కక్ష - చంపటానికి అక్కడి వరకు తీసుకెళ్లాలా చెప్పు!" అన్నాను.

"పోనీ కలకత్తా వైపొస్తావా చెప్పు?" అనడిగాడు.

"ఉహూ, లాంలేదు! అక్కడా చాలా గొడవలున్నట్లు మన పేపర్లు చెప్తున్నాయి. ఎందుకో గానీ, ఉన్న ఇల్లుదాటి బయటకు రావటం క్షేమంకాదనిపిస్తున్న రోజులివి!" అన్నాను

నేను.

గోపాలరావు క్షణం ఆగి అన్నాడు - "నిజమే! పరిస్థితులలాగే ఉన్నాయ్, కాదనను! కానీ మన సొంతదేశంలో కూడా మనం తిరగలేకపోవటం ఏమిటి, చెప్పు! పుస్తకాల్లో చదువుకోవటమే తప్ప మన దేశం గురించి మనకేం తెలుసో చెప్పు ! నాకూ ప్రాణభయం లేకపోలేదు, అయినా నాకు మనదేశమంటే ఇష్టం. చచ్చేంత ఇష్టం! చావు తప్పనప్పుడు ఇక్కడే చావాల్సిన ఖర్మేమిటి! హాయిగా ఏ పౌర్ణమిరోజునో ఆగ్రాలో తాజ్‌మహల్ ముంగిట ముగించవచ్చుగదా ఈ జీవనం! అలా కాకుంటే, గంగానదికి ఆ ఒడ్డున ఇసక తిన్నెల మీద అలాగు బకెట్ తన్నేయొచ్చుగదా!! అలాటి చావు రాకపోతే పోనీ, సంతోషమేగదా!" అంటూ నాకు సంజాయిషీ ఇచ్చాడు.

'పిరికివాడికి రోజూ చావే' నన్నది సూక్తి. నా మనసులోని పిరికితనాన్ని స్నేహితుడి ముందు బయటపెట్టాను నేను. ఆ పిరికితనాన్ని పారదోలే ప్రయత్నం చేస్తున్నాడు గోపాలరావు. ఆ ప్రయత్నంతోబాటుగానే, నాకూ గోపాలరావంటే ఏమిటో కొద్దికొద్దిగా అర్థం కాసాగింది - 'అర్థం' కోసమే టూరిస్టు బస్సుల్ని నడుపుతున్న గోపాలరావుకు ఈ దేశమంటే చాలా ఇష్టం. ఇక్కడి అందాలంటే ప్రాణం! దేశమంతా తిరుగుతూ, ఆ అందాలన్నీ ఒకటికి వందసార్లు చూస్తూ, ఆ అందాలను అందరికి చూపిస్తూ...గోపాలరావు నిజంగా అదృష్టవంతుడు!

తనకు నచ్చిన జీవన విధానాన్ని తనే ఎంచుకున్నాడు. ఎక్కడా రాజీలేని జీవితం అతనిది అనిపించింది. అలా అనిపించాక అన్నాను. "సర్లేరా, కాశ్మీరూ కలకత్తా కాదుగానీ, ఇటు దక్షిణాదివైపు వెడుతోంటే చెప్పు, వస్తాం మేంకూడా!"

గోపాలరావు ఎగిరిగంతేసి నన్ను కావలించుకొన్నాడు - ఇన్నాళ్లికో మంచి పనిచేస్తానంటున్నావ్‌రా! ఈ సారి నీకుమాత్రం టోటల్ ఛార్జీలో టెన్‌పర్సంట్ డిస్కౌంట్ !" అన్నాడు

నాకు టెన్ పర్సంట్ డిస్కౌంట్ ఇస్తున్నాడంటే, వాడికి ఎంత లాభం ఉంటుందో నమకొన్నాను. కానీ ఆ ఆలోచనకు వెంటనే సిగ్గుపడ్డాను. స్నేహంతో వాడేదో నాకు చేస్తానంటే, నేను వాడి సహృదయత వెనుక స్వార్థాన్ని పరిశీలించే ప్రయత్నం చేస్తున్నాను!!

ఇది సహజమేనేమో - ఒక మనిషి ఎదుగుతోంటే, ఎదుటనున్న వాళ్ళు తెలిసో, తెలీకో కుంచించుకుపోతారేమో!

వారం తిరగకుండానే వచ్చాడు గోపాలరావు చేతిలో ఓ పాంప్లెట్‌తో -"ఇదిగో, ఇదీ మనటూర్ ప్రోగ్రాం! మామూలుగా అయితే కులూ, మనాలీ వేద్దామనుకొన్నా! కానీ, నువ్వొస్తానన్నావుగదా, నీ మూడ్ మారే లోపు నిన్ను బయలుదేరదీయటం మేలని సౌత్‌వైపు వేశానుటూర్! రామేశ్వరం వరకు వెడదాం. తిరుపతి, మద్రాసు, కంచి, కన్యాకుమారి, రామేశ్వరం...పూర్తి సౌతంతా ఒక్క దెబ్బతో చూసి వచ్చేద్దాం! నీ ఆఫీసులో యల్‌టిసీ గొడవలన్నీ నువ్వుపడు... రేపటినుంచే! సరేనా!" అన్నాడు.

ఇక తప్పదు, రథం కదలాల్సిందే!

కానీ కుటుంబ రథం కదలటమంటే మాటలతో పనికాదు. పిల్లాజెల్లాకు కావల్సిన బట్టలు సిద్ధం చేసుకోవాలి. వాళ్ళు అనారోగ్యాలపాలు కాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. ఎక్కడ ఎలాటి విపత్కర పరిస్థితి ఎదురయినా ప్రయాణం ఆగిపోకుండా డబ్బు ఏర్పాట్లు చూసుకోవాలి...

గోపాలరావు పెట్టిన ముహూర్తబలం ఏమిటో మరి, అన్నీ అనుకున్నట్లు సమకూరాయి. అతను చెప్పిన రోజునే భగవన్నామస్మరణతో మా బస్సు కదిలింది.

ఒక్కో ఊరికో ప్రత్యేకత. మజిలీకో మహత్యం. గుడి వెనుకో గాథ. మా ప్రయాణం అందంగా, అద్భుతంగా ఆనందంగా సాగుతోంది.

తిరుపతిలో గోవిందరాజుల్ని సందర్శించుకొన్నాం. కొండమీద శ్రీవారిని సేవించుకొన్నాం. తర్వాతి మజిలీ మద్రాసే మరి!

చెన్నపట్నం చేరినప్పటినుంచీ క్షణం తీరికలేకుండా తిరుగుతూనే ఉన్నాం. సెయింట్‌జార్జ్‌ఫోర్ట్ దగ్గర్నుంచి మద్రాసు పోర్టు వరకూ అన్నీ చూశాం. అటు మొసళ్ళ పార్కు, ఇటు పాముల పార్కు చూశాం. మనుషుల మధ్య మృగాల్ని మృగాలమధ్య మనుషుల్నీ కూడా చూశాం. మెరీ నాబీచ్‌లో పిల్లలు గుర్రాలెక్కారు. మేం అలల ఊయలమీద ఊరేగాం. మా వెనుక సముద్రం హోరు వినిపిస్తోంటే, ఆ ఇసుక తిన్నెల మీద కూర్చుని జీవితంలోని కష్టసుఖాల్ని వేరుశనగ పప్పుల మధ్య చప్పరించుకొన్నాం. చర్చించుకొన్నాం. గుండెల్లో కొండంత భారాన్ని మోస్తూ కూడా, తీర ప్రాంతంలో క్షణం విశ్రాంతికి వచ్చిన వారిని చూసి ధైర్యం తెచ్చుకొన్నాం. సజీవంగా ఉండగానే శనగ పిండిలో స్నానమాడి వేడి నూనెలో బజ్జీగా మారి పోయే బుల్లిబుల్లి చేపల్ని చూసి జాలిపడ్డాం. ఎన్ని కష్టాలున్నా బతికుండగానే అలా వేడి నూనెలో కష్టాల కొలిమిలో కాలిపోనందుకు సంబరపడ్డాం.

జీవితంలో వైరుధ్యాలన్నీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నపుడు, గోపాలరావు వచ్చి మమ్మల్ని మళ్ళీ మామూలు ప్రపంచంలోకి లాక్కెళ్ళాడు.

లాడ్జిలో అందరం సహపంక్తిన భోజనం చేస్తోంటే అందరికీ వినిపించేలా ప్రకటించాడు – "రేపు ఉదయం విజిపి గార్డెన్స్, మహాబలిపురం అందరూ ఉదయం ఎనిమిదికల్లా సిద్ధంగా ఉండండి!" అంటూ.

మా పిల్లలు ఎగిరి గంతేశారు – ఏ సినిమా చూసినా సరే. ఈ మధ్యకాలంలో విజీపీ గార్డెన్స్ ప్రత్యక్షమవుతూనే ఉన్నాయి. అలాంటి అందమైన దృశ్యాన్ని కళ్లారా కూడా చూడొచ్చుననే సంబరం వాళ్ళది!

"రేపక్కడ షూటింగ్ కూడా జరుగుతూఉంటే ఎంత బాగుంటుందోగదా! అటు షూటింగూ చూడొచ్చు, ఇటు గార్డెన్స్ కూడా చూడొచ్చు!" అంది మా పెద్దమ్మాయి.

"వెంకటేష్ ఉంటే నేను ఆటోగ్రాఫ్ తీసుకొంటా!" అంటున్నాడు మా బాబు. బహుశా వాడికళ్ళకు అక్కడ ' షూటింగ్' కూడా జరుగుతూ కనిపిస్తూ ఉంటుందేమో!!

మర్నాడు ఉదయమే అందరమూ గోపాలరావు చెప్పినట్లుగా సిద్ధమయ్యాం.

మాకన్నా ముందేలేచాడు గోపాలరావు. అక్కడ తినటానికి అందరికీ టిఫెన్లు సిద్ధం చేయించాడు - "లోపల కూడా టిఫెన్లు ఉంటాయనుకో! కానీ అవి మనకు సరిపోవు!" అంటూ సంజాయిషీ ఇచ్చాడు.

నాకు గోపాలరావును చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతోంది - రాత్రి మా అందరికన్నా ఆలస్యంగా పడుకొంటాడు. బాగా తెల్లవారిన తర్వాత లేచే మాకు, అందరికన్నా ముందు సాక్షాత్కరిస్తాడు. ఎంత ధనదాహం ఉన్నా ఎన్ని బాధ్యతలున్నా - అంత యంత్రంలా పనిచేయగలగటం...అసాధ్యం అనిపిస్తోంది నాకు!

బస్సు బయలుదేరింది - విజీపి గార్డెన్స్ ముందు బస్సు ఆగిన వెంటనే గోపాలరావు దిగి టిక్కెట్లు కొనుక్కొచ్చాడు - "లోపలికి వెళ్ళగానే మీకోవిచిత్రం కనిపిస్తుంది - రాజుగారి కోటలాంటి ఆకారం ఉండే బురుజులు కనిపిస్తాయి. ఆ బురుజుల మధ్య ఒక సైనికుడు ఉంటాడు. మనలాటి మనిషే అతను - వేషం వేసుకున్న సైనికుడిని నవ్వించినా, మాట్లాడించగలిగినా మీకు - మీలో ఎవ్వరికైనా సరే - వెయ్యి రూపాయల బహుమతి ఉంటుంది. ఇక మీ అదృష్టాన్నీ, మీ శక్తినీ, పరీక్షించుకోండి." అన్నాడు.

బస్సులో అందిరిలోనూ ఆశ్చర్యం!

మరీ చిత్రంగా ఉంది గోపాలరావు చెప్తున్నది.

మనలాటి మనిషేనట - నవ్వించినా, మాటలాడించినా చాలు, వెయ్యి రూపాయల బహుమతిట!!

ముందుకు కదిలాను.

దూరంగా ఎక్కడినుంచో సముద్రపు హోరు వినిపిస్తోంది. కాళ్ళకింద ఇసుక కరకరమంటోంది. గోపాలరావు చెప్పిన బురుజు రానేవచ్చింది - నిజమే, సైనికుడి వేషంలో ఓ వ్యక్తి నిలబడివున్నాడు. ఆ వస్త్రధారణ చూస్తే పల్లవుల నాటిదో కాకుంటే చోళకాలంనాటిదో అయిఉంటుంది. ఆ యూనిఫారం అనిపిస్తోంది - ఇటుక గోడల మధ్య ఎర్రరంగు ఇటుక బొమ్మలా నిలబడి ఉన్నాడు. కళ్ళారుస్తున్నాడు కానీ మాట్లాడటంలేదు. నోరు అపుడపుడు కదులుతోంది గానీ నవ్వటంలేదు.

అతని ముందు, అతన్ని ఎలాగైనా నవ్వించాలనే కాంక్షతో మాబాబు నాలుగైదు డొక్కు జోకులు పేల్చాడు. పల్టీలు కొట్టాడు - ఫలితం లేకపోయింది.

"మనిషికాదేమోరా - బొమ్మను పెట్టి మనల్ని మోసం చేస్తుండొచ్చు!" అంది మా పెద్దమ్మాయి.

పక్కనే ఉన్న గోపాలరావు నవ్వేశాడు. పిల్లలిద్దర్నీ ఆ ఇటుక గోడ వెనక్కు తీసుకెళ్లాడు. ఉత్సుకత పట్టలేక నేనూ, మా ఆవిడ కూడా అటుకదిలాం.

అక్కడ - సైనికుడి వేషం వేసుకొంటున్న మరోవ్యక్తి కనిపించాడు - "వీళ్ళకిక్కడ షిఫ్టుడ్యూటీలు ! అతను డ్యూటీ దిగితే, ఇతను డ్యూటీలో ప్రవేశిస్తాడు. వీళ్లూ మనుషులే కానీ మరబొమ్మలు కావు!" అన్నాడు గోపాలరావు నవ్వుతూ

అందరమూ వెనక్కువచ్చాం.

ఆ బురుజులాటి కోటగోడలకు ఎదురుగా ఉన్న కొబ్బరి చెట్ల నీడన కూలబడ్డాం.

"చాలా తమాషాగా ఉంది - మనిషై ఉండి కూడా అంత నిశ్చలంగా ఉండగలగటం గొప్ప కదా!" అంది మా పెద్దమ్మాయి.

"నాకూ అదే ఆశ్చర్యంగా అనిపిస్తోంది" - ఆ సమయంలో, అప్పటివరకు నోరువిప్పని మా ఆవిడ నెమ్మదిగా అంది - "ఇందులో ఆశ్చర్యం ఏముందీ! అతను జీవితంలో అన్నివిధాలా ఓడిపోయిన మనిషి అయిఉంటాడు. కాకపోతే భార్యాబిడ్డలకు పట్టెడు అన్నంపెట్టి బతికించుకోవటానికి తాను శవంలా నిలబడి ఉంటానికి సిద్ధమయిఉంటాడు - అలాటి వ్యక్తికి నవ్వేలా వస్తుందో, చెప్పండి!"

నేను నివ్వెరపోయాను. మంజుల అదే మా ఆవిడ అన్నమాటలు నాలో ప్రతిధ్వ నిస్తున్నాయి ఎంతచక్కగా విశ్లేషించి చెప్పిందోగదా ననిపించింది.

మరోసారి, ఆ నిశ్చలంగా ఉన్న వ్యక్తికేసి చూశాను. అతను రెప్పలార్చక గోపాలరావు కేసి చూస్తున్నాడు. గోపాలరావు ఎక్కడా క్షణం ఆగక, యంత్రంలా కదులుతూ తనపని తాను చేసుకుపోతున్నాడు. గోపాలరావు - కదలికకు, చలనానికి, చైతన్యానికి ప్రతీక అయితే, ఆ సైనిక వేషంలోని వ్యక్తి - మనిషిలోని దృఢ నిర్ణయానికి ప్రతీక అని పించింది.

తాను కదులుతూ అందర్నీ కదిలిస్తూ అందులో తన జీవికను చూసుకొన్నాడు గోపాలరావు.

తాను కదలక, ఎదుటి మనిషి కదిలించే యత్నంచేస్తూ...ఎదురుగా ఆ సైనికుడు.

విరుద్ధ దృశ్యాల మధ్య జీవన వైరుధ్యాలు నాకు ఒకేసారి కనిపించసాగాయి. ఆర్థికపరమైన అవసరాలు మనిషిని ఎలా కట్టిపడేస్తాయో ఎలా కదిలిస్తాయో నాకిపుడే అర్థం అవుతోంది.

**ఈనాడు ఆదివారం, 9 జూన్ '91**

# శంకరం అనే ఆర్.ఎస్.కథ

## జి. ఆర్. మహర్షి

"నాథా' సృష్టిలోకెల్లా అత్యంత సహనం కలిగిన జాతి మనదేనంటారు నిజమేనా?" పేపర్లు పరపర నములుతూ ప్రశ్నించింది ఆడగాడిద, తన పతిదేవుడిని.

"ఛీ ఛీ" నాన్సెన్స్! ఏమిటా గ్రాంథికం? ఆ తెలుగు డిపార్ట్‌మెంట్ వద్ద పడ్డ పేపర్లు తినొద్దని ఎన్నిసార్లు చెప్పాలినీకు? నాలా ఇంగ్లీష్ పేపర్లు తిను, నాలుగు ముక్కలు ఇంగ్లీషైనా వంటపడుతుంది." కసురుకుంది మగగాడిద.

"ముందు నా ప్రశ్నకు సమాధానం చెపుతారా? రెండు వడ్డించమంటారా?" అంటూ వెనుక కాళ్ళను అటెన్షన్‌లోకి తెచ్చింది ఆడ గాడిద.

దాంతో మగ గాడిద జడుసుకొని, భార్యవద్దకు వచ్చి ఆప్యాయంగా చెవి కొరికి "పిచ్చిదానా, ఇన్నాళ్ళుగా యూనివర్శిటీ క్యాంపస్‌లో కాపురముంటున్నావ్! ఇంకా నీ మైండ్‌లో ఇలాంటి ప్రశ్నలు పుట్టడమేంటి? పిటీ కాకపోతేనూ!" అంది.

"విషయం చెప్పండి"

మనకంటే ఎక్కువ ఓపిక, సహనం వున్న నిలువు గాడిదల జాతి వేరే వుంది. వారినే రిసెర్చ్‌స్కాలర్లు అంటారు."

"ఎవరా రిసెర్చ్ స్కాలర్లు? ఏమా కథ?"

"కొశ్చెన్లు వేయకుండా విను, నీకు శంకరం ఈనే ఒక ఆర్.ఎస్.కథ చెపుతా"

"చెప్పండి నాథా" అంటూ చెవులు టపటప లాడించి ఆనందంగా ఓండ్రపెట్టింది ఆడ గాడిద.

★ ★ ★

అనగా అనగా అని మనం ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెడితే శంకరం అనే యువకుడు కనిపిస్తాడు, అతన్ని మంచి వాడని, బుద్ధిమంతుడని, భయస్తుడని ఇలా రకరకాల దుష్టనామాలతో స్నేహితులు పిలిచేవారు!

శంకరం నోట్లో వేలు పెట్టినా కొరకలేడని ప్రతీతి, ఈ విషయాన్ని కొందరు

ప్రాక్టికల్‌గా రుజావు చేస్తూ సురక్షితమైన తను వేళ్ళను పదిమంది ఎదుట ప్రదర్శించారు కూడాను.

అతను అస్తమానం పుస్తకాలను చక్కిలాల్లాకరకరా నమిలేవాడు. ఎప్పుడూ కుతకుత వుడుకుతూ, అతలా కుతలమయ్యే యూనివర్శిటీ రాజకీయాల గురించి అక్షరమ్ముక్క తెలుసుకోకుండా అతను రెండేళ్ళ ఎం.ఏ. కోర్సు (ఇంగ్లీష్) పాసయ్యాడు. సబ్జెక్టుని సంతృప్తిగా తిన్ననేరానికి అతనికి ఫస్ట్‌క్లాస్ వచ్చింది.

ఎం.ఎ.గట్టెక్కిన తర్వాత ఒకానొక దుర్ముహూర్తంలో రిసెర్చి చేయాలని కోర్కె పుట్టింది శంకరానికి.

సరాసరి తన సీనియర్ వద్దకెళ్ళి సలహా అడిగాడు.

సీనియర్ పకపకా నవ్వి, బుస్‌మని నిట్టూర్చి, శూన్యంలోకి నిర్లిప్తంగా చూస్తూ! 'స్లేవరీ' అంటూ గొణుక్కుని "ఎంతకాలం బానిసగా వుండాలను కుంటున్నావ్? ఏడాదా? లేక మూడేళ్ళా?" అని ప్రశ్నించాడు.

శంకరం వైట్ మొహంతో "అంటే?" అని ప్రశ్నాకొక్కాన్ని వదిలాడు.

"ఆహా! మరేంలేదు. ఎం.ఫిల్. చేయాలంటే ఒక సంవత్సరం పాటు గైడ్‌కి అరవచాకిరి చేయాలి. అదే పి.హెచ్.డి అయితే మూడేళ్ళకు పైగా వెట్టిచాకిరి! దేన్ని ఎంచుకుంటావో నీ ఇష్టం" అయినా ఈ ప్రాధమిక సూత్రాల పరిజ్ఞానం లేకుండా నువ్వు ఎం.ఎ. ఎలా చదివావు తిక్కశంకరయ్యా" అన్నాడు సీనియర్ జాలీగా.

తిక్కశంకరయ్య వెర్రిమొహమేసి "అంతే నంటారా?" అని బేలగా అడిగాడు.

"ఉన్న విషయమంతే, అందరు గైడులు ఆర్.ఎస్.ల పాలిట యముళ్ళలాగా, వుండి చెండుకు తింటారు. కాకపోతే గంజాయివనంలో తులసిమొక్కల్లాగా కొందరు మహను భావులు కొండొకచో వుండవచ్చు. గైడ్లబాధలు పడలేక ఆత్మహత్యలు చేసుకున్న ఆర్.ఎస్.ల కథలు వినలేదా?" అంటూ రిసెర్చ్ పనిషత్ గురించి బోధించాడు సీనియర్.

శంకరం డీలాపడిపోయాడు.

కానీ రిసెర్చ్ మీదున్న తమకాన్ని చంపుకోలేక ఎం.ఫిల్.కి అప్లికేషన్ పడేశాడు.

సీటొచ్చింది. ఫీజు కట్టి చేరిపోయాడు.

ప్రొఫెసర్ విశ్వామిత్రను శంకరానికి గైడ్‌గా వేశారు.

విశ్వామిత్ర గురించి శంకరానికి కాస్త తెలుసు.

తాను పట్టిన కుందేలుకి కాళ్ళేలేవనేరకం విశ్వామిత్ర.

'రోమియో అండ్ జూలియట్'ని ఆర్.కె.నారాయణ్ రాశాడని వాదించగలదిట్ట ఆయన. సాధారణంగా వాదనల్లో విశ్వామిత్రే గెలుస్తుంటాడు.

ఎందుకంటే వాగ్వివాదంలో ఆయన అరిచే అరుపులకు, చూపే హావభావాలకు, అవతలి వ్యక్తి చచ్చినట్టు తోకముడిచి ఉడాయించాల్సిందే.

శంకరం విశ్వామిత్రవద్దకెళ్ళాడు.

గొంగళిపురుగుమీసాలు దువ్వుకుంటూ "ఎవరున్నువ్వు?" అని గద్దించాడు విశ్వామిత్ర.

"నేను శం...శంకరాన్నిసార్, మీ స్టూడెంట్‌ని" అన్నాడు శంకరం వణికిపోతూ.

"అయితే ఏంటి?"

"ప్రస్తుతం నేను రిసెర్చ్ స్కాలర్ని, మీరు నాకు గైడ్"

"రిసెర్చ్ స్కాలర్వా, అయితే వెళ్ళి ఓ గ్లాసు మంచినీళ్ళు తీసుకురా" శంకరం మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు.

"ఇప్పుడు నమ్ముతున్నా, నువ్వు రిసెర్చ్ స్కాలర్వేనని- సరే నీకు టైప్ చేయడం వస్తుందా?"

"వస్తుంది సార్, హయ్యర్ పాసయ్యాను. టైప్ మిషన్ రిపేరీకూడా..."

"ఇక ఆపు, ఈ కాలంలోవి అసలు టైప్‌మిషన్లేనా? మాకాలంలోవే అసలైన టైప్ మిషన్లు. వాటిని మొయ్యాలంటే ఇద్దరు మనుషులు అవసరమయ్యేవారు. ఆ పద్ధతే వేరు, ఆ పొందే వేరు" అంటూ గతంలోకి జారుకొని తన్మయంత్వంతో కళ్ళుమూసుకున్నాడు.

ఓ మూడు నిముషాల తరువాత విశ్వామిత్ర గురక పెట్టసాగాడు.

శంకరం పిచ్చిమొహంతో నిలబడ్డాడు.

ఓ అరగంట తర్వాత విశ్వామిత్ర కళ్ళుతెరిచి "అదృష్టవంతుడివి, తొందరగా మెలకువ వచ్చింది. రోజూ మూడు గంటలపాటు రూంలో నిద్రపోవటం నా హాబీ, ఇంతకూ నీకు గోలీలాడ్డం వచ్చంటావు" అన్నాడు.

"గోలీలు కాదుసార్, టైప్ వచ్చంటాను"

వెంటనే విశ్వామిత్ర బీరువాలోంచి ఓ బండెడు కాయితాలు తీసి శంకరం ముందు కుప్పపోసి "ఇవన్నీ తప్పులు లేకుండా టైప్ చేసుకురా" అని ఆజ్ఞాపించాడు.

"మరి టైప్‌మిషన్...'గొణిగాడు శంకరం.

"మన డిపార్ట్‌మెంట్‌లో వుందిగా"

వారం రోజులు చచ్చిచెడి టైప్ కార్యక్రమం ముగించాడు శంకరం. ఆ కాయితాలను మోసుకొని విశ్వామిత్రవద్ద కెళ్ళాడు. ·

"తప్పులేం లేవుగా?" అడిగాడు విశ్వామిత్ర.

"లేవుసార్" చెప్పాడు శంకరం.

"సరే, ఇక వెళ్ళు"

"సార్...మరి నారిసెర్చ్ టాపిక్..."

"తొందరేముందోయ్, కాస్త ఓపికపట్టు. రిసెర్చ్ స్కాలర్‌కి బుర్రున్నా లేకపోయినా ప్రధానంగా ఓపికుండాలి. మేమంతా రిసెర్చ్‌కోసం ఎంత కష్టపడ్డామని . రేపోసారి ఇంటికిరా. టాపిక్ గురించి డిస్కస్ చేద్దాం"

⋆ ⋆ ⋆

మరుసటిరోజు విశ్వామిత్ర ఇంటికెళ్ళాడు శంకరం.

ఇంటిబయట ఒక యువకుడు స్కూటర్ తుడుస్తూ కనిపించాడు.

"మీ అయ్యగారున్నారా?" ప్రశ్నించాడతన్ని శంకరం.

"మీరు నన్ను పనివాడిగా భావిస్తున్నారా?" ఆనందంతో తబ్బిబ్బవుతూ అడిగాడా యువకుడు.

"అవును"

"కానీ కాదు. అదే నా బ్యాడ్‌లక్, పనివాడు ఎప్పుడుపడితే అప్పుడు పనివదిలేసి వెళ్ళిపోతాడు. నాకు ఆ ఛాన్స్ లేదు, నేను రిసెర్చ్ స్కాలర్ని"

"నేను కూడా రిసెర్చ్ స్కాలర్నే"

"అయితే ఈ టెక్కు ఎన్నాళ్ళులే, మూడు రోజులు కూరగాయలు సంచులు మోసేసరికి దిగిపోతుంది. వెళతాను వెళ్ళి నీళ్ళు తోడాలి"

శంకరం ఇంట్లోకి అడుగు పెట్టాడు.

విశ్వామిత్ర భార్య ఎదురొచ్చి "ఎవర్నాయనా?" అని అడిగింది.

"ఆర్.ఎస్.నండి" భయంభయంగా అన్నాడు శంకరం.

"ఆహా! ఇప్పటికి తీరిందా నాయనా! మిమ్మల్నని ఏం లాభం? కట్టుకున్నోడికి వుండాలి బుద్ధి, ఆ కామర్స్ ప్రొఫెసర్ భార్య చూడండి. చేతికింద నలుగురు ఆర్.ఎస్.లను పెట్టుకొని ఎలా ఆడిస్తూవుందో అని లక్షసార్లు చెప్పాను. చెవికెక్కితేనా, క్యాంపస్‌లో తల కొట్టేసినట్టుందయ్యా"

విశ్వామిత్ర కుర్చీలో కూచొని ఇదేం పట్టనట్టు పేపర్ చదువుకుంటున్నాడు.

"సార్, నా టాపిక్" మెల్లిగా అడిగాడు శంకరం

"పోచికోలు కబుర్లకిది సమయం కాదు నాయనా, వెళ్ళి కూరగాయలు తీసుకురా, వంటకి వేళయ్యింది. ఇంతకు కూరగాయలు బేరమాడ్డం వచ్చా" అడిగింది లేడీ విశ్వామిత్ర.

"రాదండి" తప్పుచేసినోడిలా చెప్పాడు శంకరం. "తెలుసుకో నాయనా, ఆర్.ఎస్.కి ముందు తెలియాల్సిన ముఖ్యమైన విషయమది" అంటూ హనుమంతుడి తోకంత లిస్ట్, ఒక నాలుగు సంచులు శంకరం మొహంపై పడేసింది.

శంకరం బజారు కెళ్ళి కొట్టువాడు చెప్పిన ధరకే కూరగాయలు కొన్నాడు. కాని విశ్వామిత్ర భార్య వద్ద ధరలు తగ్గించి చెప్పాడు. తన జేబుకి చిల్లుపెట్టి మిగిలిన మొత్తాన్ని జమచేశాడు.

ఆపసోపాలు పడుతూ వచ్చి శంకరం కూరగాయల సంచులు పడేసిన వెంటనే, విశ్వామిత్ర కూతురు వచ్చి తన చంటోడిని శంకరానికి తగిలించి వెళ్లి పోయింది.!

"వీడిని ఏం చేయాలండి?" అడిగాడు శంకరం కంగారుగా.

"ఏం చేయడమేంటి? కొంపదీసి అమ్ముకొస్తావా ఏమిటి? అలా షికారు తీసుకెళ్లు, చంటోడి సరదా తీరుతుంది" ఆర్డర్ వేసింది విశ్వామిత్ర భార్య.

"నేను రిసెర్చ్ స్కాలర్ని" అని తన ఉనికిని చాట బోయాడు శంకరం

ఇంతలో చంటోడు ఆరున్నొక రాగం లగెత్తుకొని, తన ముక్కులోని ద్రవపదార్థాన్ని సమూలంగా శంకరం చొక్కాకి రుద్ది ముచ్చటపడ్డాడు.

కాసేపటికి తన కాలకృత్యాలను కూడా శంకరం మీదే కానిచ్చి వాడు నిష్క్రమించాడు.

★ ★ ★

రెండు నెలల కాలం చూయింగ్‌గంలా సాగింది శంకరానికి. హాస్టల్లో భోజనం చేయడం, వెళ్ళి ప్రొఫెసర్ ఇంటి వద్ద డ్యూటీలో చేరడం ఇలా గడిచిపోయింది.

శంకరం డ్యూటీ ఇలా వుండేది. రోజూ కూరగాయలు తేవడం, గైడ్ ఇంటికి వచ్చిన బంధువులను రిసీవ్ చేసుకోవడం, టికెట్లు రిజర్వు చేయడం, వారిని స్టేషన్ వద్ద వదిలిరావడం, గైడ్ ఇంట్లోని పిల్లలను ఎత్తుకొని మోయడం.

అప్పుడప్పుడు వారికి గుర్రంగాను, ఏనుగుగాను వ్యవహరించడం

అప్పుడప్పుడు "నా రిసెర్చి" అంటూ గొణిగేవాడు

విశ్వామిత్ర ఉగ్రంగా చూసి గుడ్లురిమి, శంకరాన్ని దారిలోకి తెచ్చేవాడు

ఓరోజు విశ్వామిత్ర, శంకరాన్ని పిలిచి

"నీ కిష్టమైన రచయిత పేరు చెప్పవోయ్" అన్నాడు

"తెలుగా, ఇంగ్లీషా" సంబరంగా అడిగాడు శంకరం

"మన సబ్జెక్ట్ ఏంటి?"

"ఇంగ్లీష్"

"మరి, తెలుగువూసు ఎత్తావంటే తోలువలుస్తా"

"హెమింగ్వే"

"సరే! వెళ్ళి హెమింగ్వే రచనలపై ఒక ఆర్టికల్ రాసుకురా, నీ రిసెర్చికి ఇదే నాంది"

శంకరం హుషారుగా వెళ్ళి లైబ్రరీని ఓ వారం రోజులు తొలిచి ఆర్టికల్ తయారుచేసి విశ్వామిత్ర వద్దకు వచ్చాడు.

విశ్వామిత్ర ఆ వ్యాసాన్ని వూరికే ఎగాదిగా చూసి "అమ్మాయ్ మన బుజ్జిగాడున్నాడా?" అని కూతుర్ని కేకేసాడు.

బుజ్జిగాడికి, హెమింగ్వేకి ఏం బాదరాయణ సంబంధమో శంకరానికి అర్థం కాలేదు.

"లేదు నాన్నా! స్కూలు కెళ్ళాడు"

"మరేం లేదు. వేరుశనగకాయలు చుట్టుకోడానికి పేపర్లు కావాలన్నాడు. ఇది ఇద్దామని" అని శంకరం రాసుకొచ్చిన పేపర్లు చూపించాడు.

శంకరం ఖంగుతిని "సార్, మీరు చదవకుండానే జడ్జ్...."

"చదవకుండానే చెప్పగలను నువ్వు రాసింది చెత్తని, ఆ మాటకొస్తే నేను హెమింగ్వేని కూడా చదవలేదు. కాని అనుభవమా, మజాకానా?"

శంకరం కళ్లనీళ్ల పర్యంతమై వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఆ వ్యాసం 'ఇండియన్ లిటరేచర్' పత్రికలో అచ్చయ్యింది విశ్వామిత్ర పేరుతో, అది వేరే సంగతి.

★ ★ ★

ఒక నెల రోజులు మామూలుగానే గడిచాయి.

ఓ రోజు విశ్వామిత్ర మంచి మూడ్‌లో వుండగా చూసి "సార్ నా రిసెర్చ్," అంటూ కదిపాడు శంకరం

"ఆ! అదే చెప్పాలనుకుంటున్నా, నీకో మంచి టాపిక్ సెలక్ట్ చేశానోయ్ శంకరం" అన్నాడు విశ్వామిత్ర

శంకరం ఆనంద బాష్పాలు జలజలరాల్చాడు

"ఇండియన్ రూరల్ ఫిక్షన్ అంటే నీ కిష్టమేనా?"

"ఇష్టమేసార్" ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఏదో ఓ టాపిక్‌పై బండిలాగిస్తే సరి అనే నిర్ణయానికి ఇదివరకే వచ్చేసాడు శంకరం

"రూరల్ ఫిక్షన్‌లో పుల్లారావు రాసిన నవలలపై రిసెర్చ్ చెయ్"

శంకరానికి మిడిగుడ్లుపడ్డాయి. పుల్లారావు అనే రచయిత పేర అతను ఇదివరలో వినలేదు.

"పుల్లారావు ఎవరు సార్!" అడిగాడు ఆశ్చర్యంగా

దాంతో విశ్వామిత్ర ఒంటెత్తుమీద లేచి "ఇలా తగలడ్డాయి మన చదువులు. పుల్లారావు ఎవరు అని అడగడానికి సిగ్గెయ్యడం లేదూ. పుల్లారావు మహానుభావుడు, నా బాల్య స్నేహితుడు. కల్చర్ ఈజ్ నథింగ్ బట్ అగ్రికల్చర్ అనే నవల్లో ఆవులు ఎలా పేడవేస్తాయనే విషయాన్ని వాడెంత అద్భుతంగా వర్ణించాడని!

చిన్నప్పుడు ఓ రోజు మా ఇద్దరి మధ్య గోలీల తగాదా వచ్చింది. వాడు తొడచరిచాడు. నేను జబ్బకొట్టాను. ఇద్దరం గీత గీసుకున్నాము. గీత దాటితే నిన్ను పెద్దల్లో కలిపేస్తా అన్నాడు వాడు. గీత దాటకుండానే అన్నాను నేను. అప్పుడేమయిందంటే"

విశ్వామిత్రని బాల్య ప్రవాహంలోనే వదిలిపెట్టి శంకరం లైబ్రరీకి పరిగెత్తాడు. క్యాటలాగులన్నీ వెతికాడు. ఎక్కడా పుల్లారావు పేరే కనిపించలేదు.

బుక్‌స్టాల్స్ అన్నింటిలోనూ విచారించాడు.

పాత పుస్తకాలమ్మే ఫుట్‌పాత్‌లను భూతద్దమేసి మరీ గాలించాడు. ఇంగ్లీషు పుస్తకాలు చదివే అలవాటున్న వారందరిని ప్రాధేయపడి అడిగాడు.

తమ జీవిత కాలంలో సదరు పుల్లారావనే రచయిత పేరు ఎన్నడూ వినలేదని వారు ఘంటాపథంగా తేల్చి చెప్పారు.

దిక్కుతోచక విశ్వామిత్ర వద్దకొచ్చి విషయం చెప్పాడు శంకరం

విశ్వామిత్ర కాసేపు ఆలోచించి, పెళ్ళాన్ని పిలిచి "ఏమే అటకమీద మన పుల్లారావు గాడి నవలలేమైనా వున్నాయా?" అని అడిగాడు.

"వాటిని మీ థీసిస్‌తో కలిసి, ఎన్నడో చిత్తుకాగితాల కింద అమ్మేశాను" అందావిడ.

"మరి ఇప్పుడు నేనేం చేయాలి?" అడిగాడు శంకరం ఏడుపు మోహంతో

"తిరుపతి కెళ్లాలి"

"ఎందుకు, గుండు కొట్టించుకోడానికా"

"కాదు, అక్కడ యూనివర్సిటీలో గరళకంఠుడు వున్నాడు. వాడిని కలుసుకుంటే నవలిస్తాడు." శంకరం వెళ్లి గరళకంఠున్ని కలుసుకున్నాడు

ఆయన శంకరాన్ని ఎగాదిగా చేసి "జీవితం మీద విరక్తి పుట్టిందా?" అని అడిగాడు.

"ఇప్పటి వరకూ లేదు. ఇక మీదట చెప్పలేం"

"అసలు పుల్లారావు కథాకమామీషు తెలుసా నీకు"

"కథా కమామీషు లక్కరలేదు నవలలు చాలు"

"పుల్లారావు, విశ్వామిత్ర, నేను బాల్య స్నేహితులం. పుల్లారావుకి ఓనమాలు రావు,

ఓ రోజు వాడిని కుక్క కరచింది. దొరలకుక్క. దాంతో వాడికి ఇంగ్లీష్ నేర్చుకోవాలనే పిచ్చి పట్టింది. "లెర్న్ ఇంగ్లీషు ఇన్ థర్టీ మినిట్స్" పుస్తకం చదివి. తమ దొడ్లోని ఆవులు, కుక్కలు, ఎద్దుల మీద వాడు మూడు నవలలు రాసి పడేశాడు. అయితే వాడి నవలలు ఎలా పబ్లిష్ అయ్యాయంటావ్? అంతా ఉక్కు పిండం మహిమ...."

"ఉక్కు పిండమెవరు?"

"ఆయనో దుక్కలాంటి పబ్లిషర్. మానవ మాత్రుడి కెవడికీ అర్థంకాని బ్రహ్మపదార్థం లాంటి నవలలను మటుకే ఆయన అచ్చేసేవాడు. పుల్లారావుకి విషయం తెలిసి ఆయన్ని కలిసి నవలలిచ్చాడు. వాటిని చదివి ఉక్కుపిండం మూడురోజులు మంచం పట్టాడు. నాలుగోరోజు ఆనందంతో లేచి కూర్చొని వాటిని దభీదభీమని అచ్చేసాడు. ఆ తర్వాత నెల తిరగకుండానే దివాళా తీసి, ప్రస్తుతం గోవిందరాజులస్వామి గుడివద్ద 'ఫుల్‌టైం బెగ్గర్'గా పనిచేస్తున్నాడు. ఓసారి నాకు, విశ్వామిత్రుడు, పుల్లారావులకు మధ్య గోలీల తగాదా వచ్చింది..."

కెవ్వుమని కేకేసి అక్కడ నుంచి బయటపడ్డాడు శంకరం.

బయటకొచ్చిన శంకరానికి గట్టిగా నవ్వాలనిపించింది. నవ్వాడు. విజిల్ వేయాలనిపించింది వేశాడు. తలకిందులుగా చేతులపై నడవాలని పించింది. వెంటనే అమలుపరిచాడు.

యూనివర్శిటీల్లో తలకిందులు వ్యవహారాలు మామూలే కాబట్టి ఎవరూ అతన్ని అభ్యంతరపెట్టలేదు.

ఓ పెద్దమనిషి మటుకు జాలి తలిచి శంకరాన్ని 'స్ట్రెయిట్'గా నిలబెట్టి, వూరు పేరు కనుక్కొని శంకరం జేబులోని డబ్బుతో టికెట్టుకొని రైలెక్కించాడు.

★ ★ ★

"ఆ తర్వాత" ప్రశ్నించింది గాడిద

"తర్వాత ................"

"తప్పుకో తప్పుకో ఎవరో సాధువులు వస్తున్నారు" మొగుణ్ణి హెచ్చరించింది.

సాధువుగారు వచ్చారు. గడ్డాన్ని సవరించుకున్నారు. మీసాన్ని తాడులాగా పేనడానికి ప్రయత్నించారు.

ఉన్నట్టుండి "జై గై డు గురునాథా" అని గావు కేకవేశారు.

ఆకాశం వైపుకి చూసి "ఆర్.ఎస్.ల ఆత్మలకి శాంతి" అని ఉచ్చాటన చేశారు.

నాలుగు దిక్కులకు తిరిగి యూనివర్సిటీని బండబూతులతో అభినందించి వెళ్ళిపోయారు.

"శంకరం ఏమయ్యాడో చెప్పనే లేదే" ప్రశ్నించింది ఆడ గాడిద.

"వేరే చెప్పడమెందుకు, చూశావుగా కళ్లతో" అంటూ సాధువు వైపు చూపించింది మగ గాడిద

ఆడ గాడిద నిర్ఘాంతపోయి, స్టీం ఇంజన్‌లా నిట్టూర్చి యూనివర్సిటీ దద్దరిల్లేలా ఓండ్రపెడుతూ నిరసన వ్యక్తంచేసింది.

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 31–3–89**

# బేసిన్ బ్రిడ్జి దగ్గర

## మహేంద్ర

మునస్వామినాయుడు మూలసత్రం బస్టాండులో బస్సు దిగేటప్పటికి మద్రాసులో ఎండ నిప్పులు చెరుగుతూ ఉంది.

బస్టాండు దగ్గరున్న నాలుగు రోడ్ల కూడలిని దాటి టంకశాల వైపు నడవసాగాడు మునస్వామినాయుడు. సిటీ బస్సు స్టాపుల దగ్గరున్న షెల్టర్ల క్రింద ఓపినంత మంది జనం ముసురుకుంటున్నారు. రోడ్డు కిరువైపుల ఉన్న టింబర్ డిపోలలో టోకు వ్యాపారం హుందాగా జరుగుతోంది.

టంకశాల గడియార స్తంభం దగ్గరికి వచ్చేటప్పటికి మునస్వామినాయుడుకు ఆయాసం ముంచుకు వచ్చేసింది. ఒకవైపు సేద్యం, మరోవైపు వడ్డీ వ్యాపారం, చాలని దానికి ఊర్లో పంచాయతీ గొడవలు. అరవై ఏండ్లు పై బడ్డ వయసు, వయసుతో బాటు పెరుగుతున్న జబ్బులు - ఆయ నిప్పుడు అట్టే శారీరక శ్రమను తట్టుకొనే పరిస్థితిలో లేడు. మింట్ దగ్గరున్న సిటీబస్టాండు ఇంద్రజాలం చేస్తున్నట్టుగా బస్సుల్ని లోనికి మింగుతూ, మళ్ళీ రోడ్డుమీదకు కక్కుతూ ఉంది. మోటారు వాహనాలు, రిక్షాలు, ఎద్దుల బండ్లు వన్నార్ పేట వోవర్ బ్రిడ్జిపైకి క్రిముల్లా ప్రాకి అటు పక్కకి జారి అదృశ్య మవుతున్నాయి. నగర మాయావ్యూహంలో పడి మునస్వామినాయుడు కొంతసేపు చలనరహితంగా నిలబడి పోయాడు.

గడియార స్తంభం ఎండకు తలవొగ్గి రెండు చేతులు జోడించినట్టుగా గంట పన్నెండు అయింది. సేద తీరడానికి దగ్గరలో కాస్త నీడకూడా లేదు. అయినా ఇది నీడపాటును వెదుక్కుంటూ వెళ్ళవలసిన సమయం కాదు. వెదుకవలసినవాడు చంద్రయ్య. చంద్రయ్య తండ్రి రాగప్పనాయుడు, మునస్వామినాయుడు దాయాదులు. భూముల పంపకాల్లో బంధుత్వాలు గంగలో కలిశాయి. కొన్ని సెంట్ల భూముల దగ్గర పట్టింపులవల్ల కొన్ని సంవత్సరాల పాటూ కోర్టుల్లో కేసులు జరిగాయి. దాదాపు రెండు సంవత్సరాల క్రితం మునస్వామినాయుడు చంద్రయ్యకు ఇచ్చిన అప్పు అసలు వడ్డీలతో కలిపి ఇప్పటికి ఏభై

వేలు దాటింది. అసలు, వడ్డీల మాట అటుంచి చంద్రయ్య మునస్వామినాయుడుకు కనిపించి ఇప్పటికి ఆరు నెలలు దాటుతోంది. కొన్నాళ్ళవరకు చంద్రయ్య తల్లి అపరంజమ్మ అయినా ఊర్లోనే ఉండి, అప్పుడప్పుడు కొడుకు పొలకువ జెప్పేది. ఇప్పుడు ఆమె కూడా సొంత ఊర్లో ఇల్లు పాడుబెట్టేసి, చేన్లు బీడుబెట్టేసి కొడుకు దగ్గరికి వచ్చేసింది. మునస్వామినాయుడు మదరాసులో తెలిసిన మనుషు లందరితోను చంద్రయ్య జాడ గురించి వాకబు చేసి చూశాడు. ఒకరు చెప్పిన మాట ఇంకొకరు చెప్పలేదు. చివరికొక చిన్న తీగ దొరికింది. తీగ లాగితే డొంకంతా కదలవచ్చు. కానీ చివరకు కుందేలు దొరుకుతుందన్న భరోసా ఏమీలేదు. మానవ యత్నానికి మునస్వామినాయుడు పూనుకున్నాడు. అంతర్గతమైన ఈ సంక్షోభం నుంచీ, బహిరంగికమైన నగర సంరంభం నుంచీ ఎవరిదో తెలిసిన గొంతుక వినిపించినట్లై ఉలిక్కిపడి సర్దుకుని ఎదుట పడ్డ ఆకారాన్ని తేరిపారి చూశాడు.

వచ్చినవాడు కొత్త కొండయ్య. అతడు టంకశాల నాలుగు రోడ్ల కూడలి దగ్గర తార్వాలు గుడారం వేసుకుని చెప్పులు కుట్టుకుంటున్నాడు.

'ఒరి కొండయ్యా ! ఎక్కడోడు ఎక్కడ తేల్నావురా' మునస్వామినాయుడు నోరు తెరిచాడు.

"సర్కారోళ్ళు కట్టించిన ఇంటిని పరిగిలి బెట్టేసి సబ్సిడీ గొర్రెల్ని అమ్మి తినేసి కడాకు ఈ టంకసాల గుడారం కింద కూసోని సెప్పులు కుట్టుకుంటూ ఉండావు గదరా. సింహాసనం ఎక్కిస్తే మళ్లా తోలు గరస్తావుండావు గదరా" అన్నాడు నాయడు.

కొండయ్య కాకీ నిక్కరు జేబీల్లో వెదుక్కుంటూ, చెవుల్ని నలుపుకుంటూ, జుట్టు బరబరా గోక్కుంటూ నాయుడు మాటలకు నానా ఇబ్బందులు పడిపోయాడు. నాయుడిని తీసుకెళ్ళి తన గుడారంలో పీట వేసి కూచోబెట్టుకుని, ఒకపక్క తన పని జేసుకుంటూనే తన కత చెప్పసాగాడు కొండయ్య.

"ఆ కత ఎందుకులే సామీ. మేమూ ఒక కయ్యాకాలవగ, గొడ్డు గోదగా ఉంటే. మాఊర్లో వాళ్ళకి వోర్సదా. మేము బాగుపడిపోతే మళ్ళీ వాళ్ళకు కూలీ నాలీ చేసే వాళ్ళెవురు. మొన్న జరిగిన ఎలక్సన్లలో తగరార్లయిపోయి వాళ్ళు మమ్మల్ని ఎన్నెన్ని గతులు బట్టించాలనో అన్నన్ని గతులు పట్టించినారు. నీకు తెలవంది ఏముండాది సామీ. మొత్తం మావి ఇరవై ఎనిమిదిండ్లు. నే నొచ్చేనాటికి ఎనిమిదుండె. ఇప్పటికి ఎన్నుండాయో, ఏమో! కుంటెనోళ్ళ శ్రీరాములు కాళాస్త్రిలో రిక్షా తొక్కుకుంటా ఉండాడు. అచ్చెములుగాడు నగిరిలో సినిమా టాకీసులో టికెట్లు చింపతా ఉండాడు. రాజమ్మ, దాని మొగుడు మురగయ్య తిరిప్తిలో బండిమీద సలవగుడ్డలు ఇస్త్రీ చేసుకుంటా ఉండారు. నేను ఈ పట్నం జేరి ఈ మింటుకాడ మణిస్థంభం కింద కూసోని చెప్పులు కుట్టుకుంటా ఉండా. నా భార్య నా కొడుకుని పిల్సుకోని రాజుల కండ్రిగ కాడ దాని పుట్టినిల్లు జేరిపోయ్యింది... ఇదే పట్నాన ఎంతమంది బిచ్చగాళ్ళు బదకడంలే. ఎంత మంది కూలీ నాలీ బదకడంలా. వాళ్ళలో నేనూ ఒకడు..." అని పెద్దగా నిట్టూర్చి, పైకి లేచి నోటిలోని వక్కాకును ఉమ్మేసి వచ్చి మళ్ళీ కూచుంటూ – "అయినా మీరు పట్నంలో యాడికి వచ్చుండారు సామీ"

అన్నాడు కొండయ్య.

"మీకేమిరా. ఆయినకాడికి అప్పులు జేసేసి ఉండూ రొదిలి పర్రారై పోతారు. మేము గదా, మీకు అప్పులిచ్చేసి మిమ్మల్ని వెదుక్కుంటూ ఊరూరు అగోరించుకుంటూ ఉండాము" అని ఆరంభించి మునస్వామినాయుడు చంద్రయ్య అప్పుగురించి, ఆరు నెలలై అతడు తనకు కనిపించకపోవడం గురించి, ఎక్కడో గాలిపోవిడగా ఒక వార్త తెలిసి తాను ఇప్పుడు వెదుక్కుంటూ రావడం గురించి కొండయ్యకు చెప్పాడు. చంద్రయ్య అడ్రసు కనుక్కునే డిటెక్షన్‌లో కొండయ్య మునస్వామినాయుడుకు అసిస్టెంట్ హోదాలో బయలుదేరాడు.

మింట్ బస్సు డిపోను దాటుకుని వారిద్దరూ వన్నియార్‌పేట వోవర్ బ్రిడ్జిని ఎక్క సాగారు. బ్రిడ్జిపైన ఫుట్‌పాత్‌లపై కొంతమంది చిన్న చిన్న టెంట్లలోనూ, మరికొంతమంది మండే ఎండలోను టమోటాలు, ఎర్రగడ్డలు, గెనిసిగడ్డలు మొదలయినవి కుప్పలు బెట్టి అమ్ముతున్నారు. తోపుడు బండ్లపైన అమ్ముతున్న అరటి, సపోటా పండ్లు - అమ్ముతున్న వారు కూడా ఎండ వేడికి వాడిపోయి నీరసంగా ఉన్నారు. చలవద్దాలు నింపుకున్న ఎర్రటి, నల్లటి, బూడిదరంగు కార్లు బ్రిడ్జి నెక్కి నున్నగా కిందికి జారుకుంటున్నాయి. గులకరాళ్ళు, సిమెంటు, ఇసుక తీసుకొస్తున్న లారీలు, డైవర్లు లోడర్లతో సహా మట్టిగొట్టుకొని దారంతా దుమ్ము వెదజల్లుకొంటూ పోతున్నాయి.

మునస్వామినాయుడు బ్రిడ్జి దిగి క్రిందనున్న ప్రతి షాపు దగ్గర ఆగి బోర్డులు చదువుకుంటూ నడవసాగాడు. కొండయ్య అప్పటివరకు పట్నంలో తాను తెలుసుకున్న ప్రాంతాల గురించి, మనుషుల గురించి, మెలకువల గురించి నాయుడితో ఏకరువు పెడుతున్నాడు.

అదృష్టవశాత్తు, 'మురుగప్ప మొదలి టిన్ ట్రేడర్స్' అనే చిన్న బోర్డుతో సన్నటి సందులాంటి అంగడి తొందరగానే కనిపించింది. షాపు యజమాని లేడు. గుమస్తాలాగా ఉన్న అతను చంద్రయ్య కాడు. విచారిస్తే చంద్రయ్య ఆ షాపు నొదిలేసి చాలా రోజులయిందనీ, ఇప్పుడతడు అక్కడికి నాలుగో వీథిలోని ఒక బిల్డింగు కాంట్రాక్టరు దగ్గర పని చేస్తున్నాడనీ జవాబు వచ్చింది. నాలుగయిదు గుడ్డి గుర్తులు చెప్పి ఆ కంట్రాక్టు పని దగ్గరికి వెళితే అతగాడి అడ్రసు దొరకవచ్చునని చెప్పాడు గుమస్తా.

దారి పొడుగునా ఉన్న హోటళ్ళ దగ్గర, సినిమా టాకీసుల దగ్గర, బస్ స్టాపుల దగ్గర రద్దీ ఎప్పటికప్పుడు తగ్గుతూ మళ్ళీ ఉన్నట్టుండి విపరీతంగా పెరుగుతోంది. రోడ్డంతా చెత్తా చెదారం పేరుకుపోయి ఉంది. నిర్ణీత స్థలం చేరేలోపల ఇద్దరూ పూర్తిగా చెమటతో తడిసిపోయారు. దారిలో ఒక షాపు దగ్గర చల్లగా ఉన్న రంగునీళ్ళు కొన్ని కడుపులో పోసుకున్నా దప్పిక తీరలేదు.

సిమెంటు, ఇసుక, గులకరాళ్ళు కలిసి పెద్ద పెద్ద స్తంభాలు లేపుతూ, ఏడెనిమిది అంతస్థులపైకి దడులుగా కట్టిన కొయ్య నిచ్చెనలపై గోతం పట్టలు కట్టుకుని పూత పని చేస్తూ, నీళ్ళు ఇటుకలు, జెల్లి మెట్లపైన పైకి చేరుస్తూ- కాంట్రాక్టు పని సంరంభంగా

జరుగుతోంది. పాత బిల్డింగును కూల్చేసి ఆ స్థానంలో ఏదో పెద్ద భవనం కడుతున్నారు. వాటరు టాంకులనుండి నీళ్ళు తెస్తున్న ఆడవారినీ, వారితో పరాచికాలాడుతున్న మేస్త్రీలను అడిగి చంద్రయ్య గురించి తెలుసుకొనేప్పటికి మునస్వామినాయుడుకు తల ప్రాణం తోకకు వచ్చినంత పనయింది. చంద్రయ్య పని చేస్తున్నది అక్కడే. అయితే ప్రస్తుతానికి అత డక్కడలేడు. నలభై ఏభై కిలోమీటర్ల దూరం నుంచీ అత డిప్పుడు కాంట్రాక్టు పనికోసం లారీల్లో ఇసుక తోలుకొస్తున్నాడు. వెళ్ళిన లారీ రావడానికి నాలుగయిదు గంటలు పట్టవచ్చు. చంద్రయ్య ఇంటి అడ్రసు చెప్పవలసిందిగా నాయుడు మేస్త్రీలతో మళ్ళీ కొంతసేపు సంప్రదింపులు జరిపాడు. తమ కాంట్రాక్టరు లారీ డ్రైవరుకోసం వెదుక్కుంటూ వచ్చి అడ్రసు తెలియక చిక్కుల్లోపడిపోయిన ముసలాయనకు ఒక దారి చూపించడంకోసం నలుగురయిదుగురు మేస్త్రీలు ఇంచుమించు ఒకేసారి సిద్ధపడ్డారు. కొంతసేపటికి వారు ముసలాయన సంగతి మరిచిపోయి మద్రాసులోని ప్రాంతాల, వీధుల, సినిమా టాకీసుల, హోటళ్ళ పేర్లపైన అక్కడి కెళ్ళే దగ్గరి దార్లపైన, సిటీ బస్సుల నంబర్లపైన పేచీ పెట్టుకుని ఒకర్నొకరు బూతులుతిట్టుకోసాగారు. చివరి కొక పని పన్నెండేండ్ల పిల్లవాడు చంద్రయ్య కాపురముంటున్న ఇంటిని చూపించే బాధ్యతను స్వచ్ఛందంగా తానే పుచ్చుకుని బయల్దేరాడు. తన బాధ్యత మరొకరి మీద పడ్డంతో కొండయ్య నాయుడి దగ్గర్నుండి సెలవు దీసుకుని వెళ్ళిపోయాడు.

అంతవరకు అపరిచితుడయిన ఆ పిల్ల వాడి వెంట వన్నియార్‌పేటలోని సందు గొందుల గుండా నడవసాగాడు మునస్వామినాయుడు. కొన్ని సందుల్లో ఇళ్ళకు వెల్లవేసి రెండు మూడు దశాబ్దాలు అయినట్టుగా ఉంది. చెత్తా చెదారం ఊడ్చి రెండు మూడు నెలలు అయినట్టు ఉంది. చెత్త కుండీలలో చెత్త పూర్తిగా నిండి రోడ్డుమీద కొన్ని దిబ్బలు తయారయ్యాయి. నల్లటి, ఎర్రటి రంగుల ఎలక్షన్ బానర్లు, సినిమా పోస్టర్లు చినిగిపోయి సర్వత్రా వేలాడుతున్నాయి. రిక్షాల, అయిస్క్రీం బండ్ల గంటల ధ్వనులు, ఆటోల, మోటార్‌బైకుల హారన్‌లు, మధ్య మధ్య టీ అంగళ్ళలో నుంచీ వినిపిస్తున్న సినిమా పాటలతో చెవులు హోరెత్తి పోతున్నాయి. పైడు కాలువల దగ్గర కొంతమంది చిన్నపిల్లలు సామూహిక మలమూత్ర విసర్జన జేస్తూ సినిమా యాక్టర్ల గురించి చెప్పుకుని నవ్వుకుంటున్నారు. కాలువలు నిండి రోడ్డుమీదకు వచ్చేసిన మురుగునీళ్ళతో రోడ్డంతా చారికలు చారికలుగా దుర్వాసనగా ఉంది. ఒక కొత్త దేశాన్ని కనుగొన్నంత ఆనందం ముఖంలో తాండవిస్తుండగా పిల్లవాడు 'ఇంగేదా' అంటూ ఆగిపోయాడు.

తలుపు తెరుచుకోగానే కనిపించిన ఇండ్లు ఎండల యెడారిలో వేసుకున్న గుడారాల్లా ఉన్నాయి. మనిషి మాత్రమే నడవగలిగినంత సన్నగా ఉన్న దారికి అటూ ఇటూ పది పన్నెండు భాగాలుగా ఉన్నట్టుంది ఇల్లు. నాలుగయిదు ఇండ్లలో వాకబు చేసిన తరువాత అసలు ఇల్లు దొరికింది. తల వంచి ద్వారం గుండా ఇంట్లోకి చూశాడు మునస్వామినాయుడు. సగం రాలి నెరిసిపోయిన వెంట్రుకలతో, బలహీనంగా, నీరసంగా, దైన్యంగా ఉన్న ముఖంతో, వెలిసి మాసి చీలికలపోయిన చీరను ఎముకల గూడులాంటి ఒంటికి చుట్టుకుని ఒక

మూలగా కూర్చొని ఉంది అపరంజమ్మ.

మునిస్వామినాయుడు చిన్నగా దగ్గాడు. ద్వారంకేసి తలెత్తి చూసి దిగ్గున లేచి నిలబడింది అపరంజమ్మ. కరెంటు షాకు కొట్టిన భావం ఆమె ముఖంలో కనిపిస్తోంది. మూలనున్న కుర్చీని గోడపక్కన వేసి "కూచోయ్యా, ఇదేనా ఊర్నించి రావడము, ఎట్ట కనిపెట్టివి ఈ కొంపను, ఊర్లో అందరూ బాగుండారా" అంది.

"ఏం బాగోలే మా బాగు. ఊర్లో వాళ్ళ కందరికీ అప్పు లిచ్చేసి వాళ్ళ నెదుక్కుంటా దేశమంతా దిరుక్కుంటా ఉండాము. అంతా గాచ్చారం. ఎవిరికి తప్పింది. ఇల్లు కనుక్కునే దేముండాది. దుడ్డు మీ కిచ్చేసి దాని వసూలు జేసుకోవాలంటే మీరు చెన్నపట్నంలో ఉండినా రావాల. పరాదేశం పొయ్యినా రావాల. సాటి బంధువులని జెప్పి కనికరంతో సగాయం జేసినందుకు మాకు తగిన శాస్తే జరగతా ఉండాది. దుడ్డు తీసుకొని ఇప్పిటికి రెండేండ్లయింది. దానికి వడ్డీ ఏమయింది, అసలు ఇంకెంత ఉండాది – అనేమన్న గవనముండాదా మీకు? కడాకు మడుసులు కూడా కంటికి కనపడకుండా తిరగతా ఉండారే, మీ నాయం మీకు సరిపోతాదా... !" మునస్వామినాయుడు కోపంతో ఉడికిపోయి వణకసాగాడు.

అపరంజమ్మ ఇత్తడి బిందెనుండి నీళ్ళు ముంచి లోటాను కొంగు చేత్తో పట్టుకుని నాయుడికి ఇచ్చింది. "ఏంజేసేదయ్యా, నువ్వే జూస్తా ఉండావు గదా. వాడి నెత్తిన శని కూచోనుండాది. వాడు బంగారం పట్టినా మట్టై పోతా ఉండాది. కొంచె ఓపిక బట్టు సామీ. అంతా పోగొట్టుకున్నాము. నీకు మాత్రం ఎగ్గొట్టి ఏమి బాముకోబోతాము. కొంచెం ఓపిక బట్టు సామీ. తలకాయి తాకట్టు బెట్టైన నీ రూకలు నీకు కట్టిచ్చేస్తాము." అంగలార్చింది అపరంజమ్మ

"ఎంతని ఓపిక పడ్తాము జెప్పు. రెండేండ్లయింది. వడ్డీ నయాపైసా కట్టేదానికిలే. అసలు సంగతే మర్చిపోతివి. ఇంతెందుకు జరిగేమాట జెప్పు. అయ్యేది లేనిదీ జరిగేమాట జెప్పు. మా సొత్తు మీ కిచ్చేసి మీ దగ్గిర పాణాచారం బడేట్టుండాదే. ఏడ నీ కొడుకు? ఈడి కెత్తుక్కొనివచ్చినా ఇంకా కండ్ల బడటంలేదు. ఇంకోసారి నేను మనిషిగా రాబొయ్యేది లేదు. వస్తే గిస్తే కోరట్టు నోటీసే. లేకపోతే కోరట్టు అమీనే, మీరే తేల్చుకోండి" – మునస్వామినాయుడు పై సవకంతో చెమట తుడుచుకుంటూ వగర్చసాగాడు.

"దాంకోనుండేందుకు వాడేమన్నా దొంగతనం జేసినాడా. ఖూనీ జేసినాడా. అప్పే గదా చేసినాడు. వాడు ఈడేడ దాంకోని లేదు సామీ. వాడి కడుపాత్రం కోసం వాడు పొయ్యుండాడు. ఇన్నిగాదు, ఇంకిన్ని కష్టాలొచ్చినా, కంఠమ్మీద కత్తేటు పడిపోతా ఉన్నా మేము ఒకరి సొత్తు ఎగరేసేవాళ్ళము గాదు సామీ. ఎట్టా ఇంకా ఒక పదైదు గుంటలు మడికయ్యి మిగులుండాది. దాన్ని నువ్వే ఏదో ఒక యెల వేసుకొని రిజిస్ట్రేషను జేసుకొని మిగిలిన ఒకటో రెండో మాకు పారెయ్యి ఈ రుణం దీరిపోతే సాలు. తరువాత తింటిమో, పస్తులుంటిమో మా తలపాడు మాది" అంది అపరంజమ్మ.

సమస్యకు తాను ఆశించిన పరిష్కారమే లభించడంతో మనస్సు కొంత శాంతపడి,

మరుగునపడ్డ చుట్టరికం జ్ఞాపకం వచ్చింది నాయుడికి. "ఇంతకీ ఏందమ్మా మీ చంద్రడు జేస్తా ఉండే యాపారం. ఇంతకీ నీ కోడాలు ఏడుండాది. లారీ అమ్మితే అమ్మినాడు మిగిలిన రూకలు బెట్టుకొని మాలాడ అంగిడిలోనో, రెడ్‌హిల్స్‌లోనో అంగిడి పెట్టుకున్నా దినబత్తెం జరిగిపోతాది గదా. ఇంత బతుకూ బదికి కడాకు ఇప్పుడు ఇసిక లారీలు దోలుకుంటూ ఉండాడే – వీడేడ బాగుపడబొయ్యేది." పెద్దరికంతో నాయుడు హితవు చెప్పాడు.

చాలా దినాల తరువాత తమ క్షేమ సమాచారాలకు సంబంధించి ఒక ప్రశ్న వినిపించడంతోనే అపరంజమ్మ నిలువునా చలించిపోయింది. "సావాస మట్టాంటిది సామీ. వాడు చెప్పుడు మాటలే ఇని చెడిపోయినాడు. ఇంకా వాని బుద్ది వానికి రాలేదు. ఇప్పటికన్నా మనూరు బొయ్యి సొంతమో, వారమో, కూలో జేసుకోని, నాలుగు పొలగొడ్లు పట్టుకొని లచ్చనంగా బదకదాము రారా అంటే చెవుల్లో ఏసుకోవడంలా, వాని కేందో పుట్టిన ఊరిమీదే, రోత బుట్టిపోయుండాది. బదికినా సచ్చినా ఈడనే సస్తాను కానీ ఆ ఊరి పొలిమేర తొక్కనంటూ ఉండాడు. ఊర్లో ఎవిరిమాటా లెక్కకెత్తుకోకుండా బొయ్యి గూడూరు కాడ పెండ్లి జేసుకొని వచ్చినాడు గదా. వాని బావమరిదే ఇంత చెడుపుకు కారణం. వాడి మూలంగానే వీడు దున్నే భూమిని అడమానం పెట్టె. ఇంట్లోని నగా నట్రా అమ్మేసె. లారీ కొని ఆంధ్రనుండి బ్లాక్ లోడ్లుగా వొడ్లు, బియ్యం రెడ్‌హిల్సుకు తోల మరిగినాడు. యాపారం బాగా జరిగినన్నాళ్ళు వాడ్నీ వాడి బామ్మర్దినీ పట్టేదానికి పదిమంది, సాల్లేదు. బూమ్మీద నిలబడకుండా ఆడిరి. కేజీలు కేజీలుగా మాంసం, కోళ్ళు దిని తాగి తందనాలు ఆడేసిరి. ఆ బండికి రెండుసార్లు ఆక్సిడెంట్లయిందని ఆయినకాడికి అమ్మేసి మళ్ళీ ఒక ఇరై ఏలు అప్పుజేసి కొత్త బండి కొనిరి. దాన్ని కూడా తిరత్తణి చెక్‌పోస్టు కాడ ఇజిలెన్సోళ్ళు పట్టి కోర్టు కేసేసిరి. దానిమింద ఇప్పటికి మళ్ళొక యిరై ఏలు అయ్యుండాది. కేసు ముగిసి లారీ వచ్చేసిందో, లేదా అప్పులోళ్ళు దాన్ని కూడా తోలుకోని పూడ్సినారో నాకేమి ఇంతవరకు గోచరానికి రాలేదు. దొరికింది దొరికినట్టు తినేసి రేపు మాపేమని జూడకుండా తాగి తందనాలాడేసి సంపాదించిదంతా నీళ్ళమాదిరి కర్చు జేసేసిరి. మన తాహత్తేమి, మన వొరవేమి, కర్చేమి అని జూడకుండా ముడ్డి మూడుసుట్లు అప్పులు జేసుకోని, ఉన్న బండి అమ్ముకొని బికారోళ్ళమాదిరి ఈ పట్నం జేరిపొయ్యినాము...

అయ్యా! ఊర్లో వాళ్ళు గాక పొయ్యిరి. బయటోళ్ళు మోసం జేసేసిరి. సావాసకాపులు పగోళ్ళయిరి. సొంత బామ్మర్ది తప్పు దోవ పట్టించే. కడాకు కట్టుకున్న దానిక్కాడ వాడి మీద యిస్వాసం లేకపొయ్యింది. దాని మాయలో బడే వాడు బదుకు బుగ్గి చేసుకుండె. వాడి బండి సాగినన్నాళ్ళు పెరక్క దిని – అది నిల్సిపోయినాక అదీ, దాని తోడబుట్టినోడు నా కొడుకును మెట్లతోనూ, శాట్లతోనూ కొట్టి ఈదిలోకి తోసేసిరి. ఇంకా ముప్పై ఏండ్లు కాలా. ఈ వొయిసుకే నా కొడుకు ఇన్ని కష్టాలు పడిపొయ్యినాడు. ఇంతమంది మోసం జేసినారు గదా, ఇప్పటికీ వాడు తనను తాను తిట్టుకుంటాడే గాని ఇంతవరకు ఒక రొన్నొక మాట అనబోతాడు, నేను వినబోతాను. దేవుడే మాతో పరాసికం ఆడతా వుండాడు సామీ, ఒకర్నేంది ఏమిటికి! వాడికి ఎప్పుడు మంచికాలం వస్తాదో ఏమో, అది రాకముందే నా కట్టె

కడతేరిపోతాదో ఏమో...." అపరంజమ్మ గుడ్ల నీరు కుక్కుకుంది.

చంద్రయ్య మధ్యాహ్నం భోజనాని కైనా ఇంటికి వస్తాడేమో ననే ఆశతో మునస్వామి నాయుడు అపరంజమ్మ మాటలు వింటూనే వీధి ద్వారం కేసి చూస్తూ కూచున్నాడు. విపరీతంగా ఎండగాసి ఉమ్మగించడం వల్ల సాయంకాలానికి మబ్బు లెక్కి నాలుగు చినుకులు రాలేట్టుగా ఉంది.

టైము మధ్యహ్నం రెండున్నర గంటలవుతోంది. అపరంజమ్మ స్టవ్వు ముట్టించి ఎసరుబెట్టింది. వైర్లు తెగిపోతున్న ప్లాస్టిక్ మంచం ఒకటి, కొద్దిపాటి పాత సామగ్రి అక్కడక్కడ ఉండలు ఉండలుగా మాసిన గుడ్డలు - ఇల్లంతా దరిద్ర కళ కనిపిస్తోంది. నుసి రాలుతున్న గోడకు చంద్రయ్య తండ్రి రాగప్ప నాయుడు ఫోటో వ్రేలాడుతోంది. రాగప్పనాయుడు బదికినన్నాళ్ళు తన ఊరు, తన ఇళ్ళు, తన మడికయ్యలు తప్పించి నాలు గూర్లు తిరిగిన వాడు కాడు. చలికాలంలో సయితం అతడు దుప్పటి కప్పి ఎరగడు. ఎండాకాల మెప్పుడూ పెరట్లోని కొబ్బరి చెట్ల క్రింద నులక మంచం మీద పడుకొని నిద్రబోయేవాడు. పైరు పచ్చల క్రింద పచ్చపచ్చగా గడిచిపోయింది అతడి జీవితం. మరణాంతరం అతడి ఫోటో మాత్రం ఇప్పుడు ఈ జనారణ్యంలో, ఈ మురికి వాడలో ఈ పాడుబడిన ఇంటిలో కూలిపోతున్న గోడను పట్టుకుని వ్రేలాడుతోంది.

"ఇంటి కెంత బాడిగ?" మునుస్వామి నాయుడు పై కప్పు కేసి చూస్తూ అడిగాడు.

"దాని మాట ఎందుకులే. డెబ్బై రూపాయలు. మళ్ళీ కరెంటు సార్జీ మనదే. వొయిసంతా అంకంత ఇంట్లో సంసారం జేసి కానగ సెట్ల నీడల్లో సల్లంగా దిని - ఈ ఉడిగిబోయిన కాలంలో ఈ దర్బేసి కొంపలో పొద్దల గూకులూ ఉబ్బ బానలో పెట్టినట్టు ఉడికి పోతా ఉండాను. చంద్రుడయితే తల కడిగి నీళ్ళు పోసుకొని రెండు నెల్లయింది. సిగరెట్లు సారాయి తాగీ తాగీ ఎమిక లెమికలుగా దిన దినానికి తీసి పోతా ఉండాడు. చుట్టూ సాయిబులు. ఒకటే చేపల నీసు. ఈ పన్నెండు ఇండ్లకూ ఒకే కొళాయి. బాతురూములు, కక్కసులు మూడు మూడుండాయి. కొళాయి దగ్గర ఒక బిందె నీళ్ళు పట్టుకోవాలంటే ఈ పటంగి బాశాలుల దగ్గర దిన మొక శమగా ఉండాది. ఆ కక్కుసు ఒక బూలోక నరకము. నరమానవుడు దాంట్లోకి పోతే పద్దినాలు అన్నం సగించదు. ఏం బదుకో నాయినా, సస్తి గిస్తే కూడా పీనిగను లాగి పారేసే దానికి ఈడ నలుగురు మడుసులు పలకరు. మొన్న ఆ పక్క ఆరో ఇంట్లో దానం చేసేందుకు దుడ్డు లేక రెండునాళ్ళు పీనిగను ఇంట్లోనే పెట్టుకొని ఉండిరి.." అపరంజమ్మ ఆక్రోశంతో మునుస్వామి నాయుడు గుండెలు అవిసిపోసాగాయి.

తన కష్టం, తన అప్పు తీరే యోచన మరిచి, ఊర్లో వాళ్ళ కష్టాల్లోకి తల దూర్చడంతో మునుస్వామి నాయుడుకు తల దిమ్మ తిరిగి బొప్పిగట్టినంత పనయింది. కనీసం ఎదుటి 'మనిషిని ఓదార్చడానికైనా అతడి మాటలు చాలడం లేదు. లేవడానికి ఉద్యుక్తు డయ్యాడు మునుస్వామి నాయుడు.

అన్నం తినంది గాక పోగూడదని అపరంజమ్మ దోవకు అడ్డం నిల్చుకునింది. మొన్న మొన్నటిదాకా పదిమందికి వొండి వడ్డించిన చెయ్యి - భోజనం సమయానికి ఇంటి

కొచ్చిన చుట్టం పస్తుబోవడం ఆమెకు కడుపులో చెయ్యి పెట్టి దేవినట్టుగా ఉంది. వచ్చేటప్పుడు హోటల్లో భోజనం చేసేసే వచ్చానని మునుస్వామి నాయుడు అపద్ధర్మంగా బొంకాడు.

"తినే దేముండాది తల్లే, మీ ఇంట్లో మేము, మా ఇంట్లో మీరు కాలానికి తినకనే బోతామా. దిగవ్వూరు వొంకలో అయినకాడికి ఇసిక ఎత్తేసి పట్నం తోలేస్తా ఉండారు. బావుల్లో నీళ్ళు ఒకేసారి రెండు మూడు మట్ల క్రిందికి పొయ్యుండాయి. అయిదార్సు పవరు మోటారు ఏమిటికి పనికిరావటంలా. ఏడున్నర ఆర్సు పవరో అంతకు మించిందో ఎయ్యాల. ఊర్లో కూలోళ్ళు మనకాడికి రావటంలేదు. మనమే వాళ్ళ కాళ్ళకాడికి పొయ్యి అంగలార్సేటట్టుండాది. శానా మాట్లాడితే వాళ్ళిండ్లు వాళ్ళే అంటించుకునేసి మన మీద పోలీసు కంప్లయింటు ఇచ్చేటట్టుండారు. శెనిగి చెట్టుకు, వరి పైరుకు దేనికి జూడు తెగులే. ఎరువులకు, పురుగు మందులకు పోంగా ఏ పలితంలోనూ సేతిలో రూక మిగలటంలే. నాకు టయిమవతాది. మోటారు జూడను లింగిసెట్టి వీదికన్నా బొయ్యి రావాల. నేను ఇంటికి పోబొయ్యేది ఏడుగంటల బస్సుకే. చంద్రుడొస్తే ఆ టయింకన్నా వచ్చి బస్టాండులో కలబడమను. బాండుకు టయిమవతా ఉండాది. బాండు తిరగ రాసుకునేదో, నేల సంగతి ముదివి జేసుకునేదో ఏదో వొకటి సెయ్యండి. మసిలోన్ని నేను మళ్ల మళ్లా రాలేను. నన్ను తిప్పి సంపద్దండి."

వీధి మలుపుదాకా నాయుడు వెనకనే వచ్చింది అపరంజమ్మ. కార్నరులోని బంకులో సోడా తీసి నాయుడి కిచ్చి అతడు తాగినాక వెనుదిరిగింది.

ఏడు గంటల బస్సు కోసరం సాయంత్రం అయిదు గంటలకే బస్టాండు చేరుకున్నాడు మునస్వామి నాయుడు. రాత్రయి దీపాలు పెడితే ఆయనకు చూపు సరిగ్గా ఆనదు. మిరిమిట్లు గొలిపే దీపాల మధ్య ఆయన మరింత దూరం నడవలేడు. ఉదయం వన్నియార్ పేట వీధులన్నీ గాలించి గాలించి మూడు గంటలకు హోటల్లో భోజనం ముగించేటప్పటికి ఆయన కాళ్ళు పచ్చి పుండ్లలా తయారయ్యాయి. అందుకే చివరకు లింగిచెట్టి వీధికి వెళ్ళడం కూడా మానుకున్నాడు. పోనీ మూడు గంటల ప్రాంతంలో కేకేనగర్‌లోని మనమరాలు ఇంటికైనా తాను వెళ్ళి ఉండవలసింది.

అక్కడికి కూడా వెళ్ళక పోవడానికి దూరం ఒకటే కారణం కాదు. మనమరాలి ఇల్లు మూడో అంతస్థులో అదొక అపార్టుమెంటు ఇల్లు. పదే పదే వీధిలోకి వచ్చి పోవడానికి సాధ్యం కాదు. ఇంట్లోంచి బయటకు వచ్చేవరకు ఆకాశం కూడా కనిపించదు. కరెంటు పోయి ఫాన్లు తిరక్కపోతే ఉమ్మలో ఉడికిపోవాల్సిందే. మనవరాలికి ఇద్దరు పిల్లలు. వారు ఇంట్లో మాట్లాడే భాష తెలుగు. వీధిలో కెళితే మాట్లాడే భాష అరవం. స్కూల్లో ఇంగ్లీషు మీడియం. పిల్లలింకా అరుదుగా వచ్చే మునుస్వామి నాయుడు లాంటి పల్లెటూరి ముసలి చుట్టంతో ఏ భాషలో మాట్లాడాలో తేల్చుకోలేకపోతున్నారు. ఉదయం లేచిన దగ్గర్నుంచి ఆఫీసులకు, స్కూళ్ళకు, మార్కెట్టుకు, బజారుకు వెళ్ళడానికి నానా హైరానా పడిపోవడము, సినిమా ముందో, చౌక దుకాణాల ముందో, సిటీ బస్టాండ్ల వద్దో ఏదో ఒక క్యూలో గంటలు

గంటలుగా వెళ్ళదీయడము - తప్పించి ఆ ఇంటి సభ్యుల కున్న ఒకే ఒక ముఖ్యమైన వ్యాపకం టీవీ. రారాని బంధువులు వెదుక్కొని ఇంటికి వస్తే వారి బాగోగులను సాకల్యంగా విచారించడానికి కూడా టీవీ వారి ననుమతించదు. ఆ మొదటి తరగతి జైలు శిక్ష కంటే ఈ ఆరుబయలు జైలే మేలనిపించింది మునస్వామి నాయుడికి.

మూలసత్రం బస్టాండు - పదినిమిషాలు కూడా తాపీగానూ, హాయిగానూ నిలబడి బస్సు కోసం ఎదురు చూడతగినంత శుభ్రంగా లేదు. ఒకవైపున గోడల నుంచీ వస్తున్న కంపు, మరోవైపు రోడ్డు మీద నుంచి వస్తున్న ఉప్పుచేపల కంపు, బస్టాండంతా వ్యాపించిన పెట్రోలు, ఇతర ఆయిళ్ళ వెగటు వాసన, వాడి కుళ్ళిన పూల, పండ్ల దుర్వాసన, బస్టాండు దుర్భరంగా ఉంది. మునస్వామినాయుడు గాలి మార్పుకోసం బస్టాండు పక్కనున్న బేసిన్ బ్రిడ్జి పైకి నడిచాడు. బ్రిడ్జి క్రింది నుంచీ రైలు దార్లు పోతున్నాయి. బకింగ్‌హామ్ కెనాలో, లేదా అలాంటి కాలువ మరొకటో నిండుగా మురుగు నీళ్ళతో నల్లగా కదులుతోంది. మునస్వామి నాయుడికి నానాటికి ఇసుక తీసికట్టై ఎండిపోతున్న తమ ఊరి వాగు జ్ఞాపకం వచ్చింది. దిగంతాల వరకు వ్యాపిస్తున్న విశాల నగర వలయంపై అక్కడక్కడ లైట్లు వెలగడం మొదలుపెట్టాయి. మురుగు కాలువపక్కనున్న మురికి వాడల్లో చీకట్లు వ్యాపిస్తున్నాయి. బ్రిడ్జిపై శరవేగంగా దూసుకుపోతున్న కార్లకు, బస్సులకు అడ్డంపడి చింపిరి జుట్టు, చీలికలు పేలికలయిన బట్టలు, మురికి కూపమయిన దేహంతో పిచ్చిదొకతె గోప్యమైన అవయవాల్ని బాహటంగా ప్రదర్శిస్తూ రోడ్డుమీద నిర్లజ్జగా నిదానంగా, ఠీవిగా, నడిచిపోతోంది.

ఆసరికి నాయుడి కోసం కొండయ్య బస్టాండంతా గాలించి వెదుక్కుంటూ బ్రిడ్జిపైకే వచ్చేశాడు. సరైన సమయానికి సరైన స్థలానికే వచ్చినట్టుగా ఆనందపడిపోతూ కొండయ్య మురికివాడ కేసీ చెయ్యి జూపిస్తూ "ఆడే సామీ నా ఇల్లు ఇప్పుడుండేది. ఆడ నల్లగా ఈత చెట్టు మాదిర ఉండాదే, దాని పక్కనుండాదే" అన్నాడు. అక్కడ ఒకేమాదిరిగా వందలాది పాకలు కనిపిస్తున్నాయి. ప్రత్యేకించి దేన్నీ గుర్తించడం సాధ్యం కాదు. చీకట్లు కూడా ముసురుకుంటున్నాయి. నాయుడికి పట్టుమని పది గజాల దూరానికి కూడా చూపు ఆనదు.

"దిగవూర్లో జాత రెప్పుడు సామీ. నాయాల్ది హోటల్లలో తినీ తినీ నోరు సవి సెడి పోయ్యుండాది. సాటు పెట్నారా, ఇంకా లేదా? ఏ ఇసయం ఎవరి దగ్గరో ఒకరి దగ్గర సెప్పంపు సామీ. మింటు మణిస్తంభం కాడి కొచ్చిన ఏ మడిసీ నా కన్ను దప్పి పోలేడు" అన్నాడు కొండయ్య. అతడి నోరు సారా కంపు కొడుతోంది. దూరంగా పైరింజనొకటి గంట కొట్టుకుంటూ పోతోంది. గభాల్న బ్రిడ్జి క్రింద కనిపిస్తున్న తన గుడిసె కేసి చూసుకుని "మన చోటు గాదులే" అంటూ పెడ నవ్వు నవ్వాడు కొండయ్య.

బస్సు రాగానే సీట్ల కోసం చిన్న సైజు దొమ్మీ జరిగింది. కొండయ్య చొరవతో పోరాడి నాయుడు కోసం ఒక కిటికీ చివరి సీటు సంపాదించాడు. బస్సు ఎక్కాక కూడా మునుస్వామినాయుడు చంద్రయ్య కోసం ఎదురు చూడసాగాడు. చంద్రయ్య రాలేదుకాని

ఆ సమయానికి అపరంజమ్మ మళ్ళీ నాయుడ్ని వెదుక్కొని వచ్చింది. తెల్లవా రనంగా వెళ్ళిన కొడుకు ఇంతవరకు భోజనానికి కూడారాలేదని, వస్తూనే వాడికి బుద్ధి చెప్పి ఊరికి పంపిస్తానని, తమ కష్టాలీ్న, చుట్టరికాన్ని మనసులో పెట్టుకొని భూమి రేటు వగదెంచి అప్పు వర తట్టుకుని, రిజిస్ట్రేషను చేసుకొమ్మని బస్సు బయల్దేరే దాకా ఆమె నాయుడితో చెప్పింది. చివరిగా సుందరమ్మ కూతురు తీర్థమాడంగానే జాబు రాయమనీ, తమ ఇంట్లోని పెరట్లో ఉన్న టెంకాయ చెట్టుకు అప్పుడప్పుడు నీళ్ళుపోసి పుణ్యం కట్టుకోమని ఆమె నాయుడిని వేడుకొని వెళ్ళిపోయింది.

క్రిక్కిరిసిన భవనాల మధ్య నుంచీ, అల్లిబిల్లిగా అల్లుకున్న బిజీ రోడ్ల మధ్య నుంచీ, పూనకం వచ్చినట్టు పరిగెత్తుతున్న వాహనాల మధ్యనుంచీ, మిరిమిట్లు గొలిపే రంగురంగుల దీపాల నుంచీ, జన సమూహాల మధ్య నుంచీ, జన సమ్మర్థం మధ్య నుంచీ బస్సు దూసుకుపోతూ ఉంది. నాయుడు నిర్లిప్తంగా వెలుపలికి చూస్తూ కూచున్నాడు.

రోడ్డు కిరువైపులా ఉన్న వంట చెరకు డిపోలు, సామిల్లులు, అడితీలు కొయ్యలతో నిండుగా ఉన్నాయి. చాలని దానికి ప్రతిదినం కొన్ని ఎకరాల చెట్లు నరికి కొయ్యల్ని లారీల్లో పట్నం చేరవేస్తున్నారు. ఇంత చేసినా చలికాలం చలికి కాచుకోవాలంటే టైర్లు కాలవలసిందే.

వీధి కళాయిల వద్ద జనం కొట్టుకుంటున్నారు. వాటరు టాంకులు మైళ్ళ నుంచి నీళ్ళు తెస్తున్నాయి. బోరింగులు నూర్ల అడుగులకు పోతున్నాయి. ఇసుక తవ్వి చుట్టుపట్ట నున్న ఏర్లు ఎండిపోతున్నాయి. చెరువుల్ని పూడ్చి ప్లాట్లు వేసి ఇళ్ళు కట్టుకుంటున్నారు.

బస్సు వ్యాసరప్పాడి దాటింది. మూలకడై దాటింది. గ్రాండ్ ట్రంక్ రోడ్డు మీద నున్నగా సాగిపోతూ ఉంది. మంచి వెన్నెల, వచ్చే పోయే వాహనాల లైట్లలో వెన్నెల తెలియడం లేదు.

'కొట్రలియారో, కొరతలారో బ్రిడ్జి క్రింద పెద్ద కాలువొకటి అగాధంలోకి జారి ఉంది. కూలీలు కొందరు లారీల్లో పెద్దగా రొద జేసుకుంటూ నగరం వైపు వెళ్ళిపోతున్నారు.

భవిష్యత్తు తలచుకుంటూ భయం భయంగా కళ్ళు మూసుకున్నాడు మునుస్వామి నాయుడు. జీవనదులు,. పంటకాలువలు, సెలయేళ్ళు ఇంకిపోతున్నాయి. డ్రయినేజీలు, మురికి కాలువలు పొంగిపార్లుతున్నాయి.

ఆంధ్రప్రభ వారపత్రిక, 13–12–1989

# మౌనరాగం

## కె. కె. మీనన్

"గంట అయిదు కొట్టింది, సాబ్! లేవండి."

బరువుగా ఉన్న కనురెప్పల్ని బలంగా ఎత్తి చూశాడు వెంకట్రావు.

తోటీ, వార్డుబోయ్ ఎవరి అస్త్రాలు వాళ్ళ చేతుల్లో పట్టుకుని నించుని ఉన్నారు. పక్కన ట్రాలీ వుంది.

మళ్ళీ కళ్ళు మూతలు పడుతున్నాయి.

మెత్తటి పరుపు, వెచ్చటి దుప్పటి, మనుష్యుల మధ్య జీవితం - ఇవన్నీ కలిసి మత్తుగా, ఒళ్ళు తెలియని నిద్ర ఇస్తున్నాయి.

"ఆపరేషనుకు తయారు చెయ్యాలి. లేవండి, సాబ్!"

"అవును కదూ? ఈ వేళ ఆపరేషన్" అనుకున్నాడు వెంకట్రావు.

అప్పుడుకాని నిన్న డాక్టర్ చెప్పిన మాటలు గుర్తుకు రాలేదు. నిన్న అడ్మిషన్ కాగానే అన్నాడు డాక్టర్ - "భయపడకండి. రేపే థియేటర్. ఆపరేషన్ చేస్తాను" అని.

అవును. ఈ రోజు జరగబోయే మహాయజ్ఞానికి సమిధలవేట ఇది.

"లేవండి."

"లేవగలనా? ప్రయత్నిద్దాం" అనుకున్నాడు వెంకట్రావు.

సర్వశక్తులూ కూడగట్టుకుని పక్కకు తిరగటానికి చేసే ప్రయత్నమంతా వ్యర్థమై పోయింది.

తనకు తెలుసు - తను లేవలేడు.

తనకు తెలుసు - తను బతకడు.

ఇవన్నీ తెలిసీ బతకటానికి ఎందుకీ వృథా ప్రయత్నం?

అది జీవి లక్షణం. పుట్టిన ప్రతిప్రాణీ బతకటానికి చేసే ప్రయత్నం పెనుగులాట.

'పెరిటోనిటిస్'.

ఆ పేరులోనే ఉంది ప్రమాదం. భయంకరమైన ఈ రోగం నుంచి బయటపడాలంటే ఎంతో పరిణతి చెందిన వైద్య పరిజ్ఞానమంతా సాయపడితే తప్ప వీలుకాదు. అందుకే

వెంటనే ఆపరేషన్ చెయ్యాలన్నాడు డాక్టర్. అవును ఆపరేషన్ అవసరం కాబట్టే తను ప్రాణాలకు తెగించి వచ్చి ఈ హాస్పిటల్‌లో చేరాడు. చేరాడు కాబట్టే ఈ కర్మకాండ అంతాను.

హాస్పటల్‌లో చేరడానికి తను పడ్డ అవస్థ తలుచుకుంటే ఈ దేశాన్ని మార్చగలమా, అసలు మారుతుందా అనిపిస్తుంది.

ఆటోలో వచ్చి కాజువాల్టీ డిపార్టుమెంటు ముందు దిగాడు. అవుట్ పేషెంటుకు వెళ్ళాలి. వెళ్ళే స్థితిలో తను లేడు. ఎవరైనా తన్ను నడిపించుకెళ్ళాలి. లేదా వీల్ చెయిర్‌లో వెళ్ళాలి.

ఎంతోమంది తోటీలూ, ఆయాలూ తన ముందునుంచే వెళ్ళిపోయారు. 'ఒక చక్రాల బండి కావాలి' అని ఎంతమందితో మొరపెట్టుకున్నా తన్నెవ్వరూ పట్టించుకోలేదు. ఏమిటీ దౌర్భాగ్యం? ఎవరి కోసం వీళ్ళంతా? ఎంత వాపోయినా ప్రయోజనంలేదు. ప్రజలు అలవాటు పడ్డ మార్గాన్నే, తను కూడదనుకుంటున్న మార్గాన్నే తనూ నడవ వలసి వచ్చింది.

పక్కనుంచి ఒక ఆయా వెళుతోంది. జేబులో చేయిపెట్టి చూశాడు. కాగితం నాలుగు మడతల రూపంలో తగిలింది. తనకున్న ఆస్తి, ఎవరికైనా తను ఇవ్వగలిగే ఆస్తి ఆ రూపాయి మాత్రమే! దాన్ని పైకి తీసి ప్రదర్శించి, "ఆయా! ఇది పుచ్చుకుని నన్ను ఒ.పి.కి తీసుకెళతావా?" అనడిగాడు

ఆమె తడుముకోకుండా - "ఏక్ మినిట్, సాబ్" అని వెళ్ళిపోయి, వీల్ చెయిర్‌తో తిరిగివచ్చింది.

డాక్టరు పరీక్ష చేశాడు.

వైద్యశాస్త్రం ఎన్ని విధాల పరీక్షించమనీ ఆదేశించిందో అన్ని విధాల పరీక్షించాడు.

"ఇటీజ్ వెరీ సిరియస్. ఆపరేషన్ ఈజ్ ఇనెవిటబుల్" అన్నాడు పక్కనున్న జూనియర్‌తో.

"అడ్మిషన్ ఈజ్ నెససరీ"

"దట్సొకే. బట్ బాస్ ఈజ్ నాట్ ప్రెజంట్." తన అశక్తతను వ్యక్తం చేశాడు.

"మరేం చేస్తారు?"

"మెడికల్ కేసని తోసేద్దాం"

"పాపం !" అన్నాడా జూనియర్.

తన నిర్ణయానికి ఆలంబనం చేకూర్చుకుంటున్నాడు అసిస్టెంటు సర్జన్.

"ఏ వూరయ్యా నీది?" అడిగాడు వెంకట్రావును.

"భద్రాచలం."

"మరిక్కడి కెందు కొచ్చావు?"

"రోగం బాగు చేయించుకోవాలని."

కాస్సేపు ఆలోచించాడు డాక్టర్.

"ఇప్పుడొక సూది ఇస్తారు. అది తీసుకుని మళ్ళీ సోమవారం కనిపించు."

'నాకిక్కడ ఎవరూ లేరండి'

"మరేం చెయ్యం? ఇక్కడ బెడ్స్‌కూడా లేవు"

అతని వేడికోలుకు అంతకంటే సమాధానం లేనట్టు తన ధోరణిలో తను వెళ్ళిపోయాడు. చేతులు కడుక్కుని, తెల్లటి బొచ్చు తువాలుతో ఒయ్యారంగా చేతులు వత్తుకుని కుర్చీలో కూర్చున్నాడు. అతని ఆజ్ఞ అనుసరించి జూనియర్ ఏదో చీటీ వ్రాసి తోటీ చేతికిచ్చాడు. అతను బలవంతంగా కుర్చీలో కూర్చోబెట్టి బయటకు నడిపించాడు వెంకట్రావును. బయట బల్లమీద కూలేసి తన దారిని తను పోయాడు. తనలాంటి వాళ్ళే ఎంతోమంది తన స్థితిలోనే వెళ్ళిపోయారు. తను మాత్రం ఆ బల్ల వదలలేదు.

రోగులు క్రమంగా పలచబడిపోతున్నారు.

తన చావు ఆ బల్లపైనే అనే నిర్ణయానికి వచ్చాడు వెంకట్రావు

పక్కనే ఒక నర్సు పోతూ అడిగింది "ఏమయ్యా, పొద్దుటి నించీ ఇక్కడే వున్నావు. చూపించుకోలే?" అని.

సమాధానంగా చేయెత్తి ఆమెను దగ్గరకు పిలిచాడు. విషయమంతా చెప్పాడు.

"రోగం ప్రమాదకమైందని వాళ్ళు అనుకోగా విన్నాను, సిస్టర్! ఆపరేషన్ చెయ్యకపోతే చచ్చిపోతాననికూడా అన్నారు."

"మరెందుకు అడ్మిట్ చేసుకోలేదు?"

"ఏమో ! అది వాళ్ళకే తెలియాలి!"

ఆమె లోపలి కెళ్ళిపోయింది. పది నిమిషాల తరవాత డాక్టర్‌తో తిరిగి వచ్చింది.

"ఇతనేనా? లాభంలేదు, సిస్టర్! బాస్ లేరు. అడ్మిట్ చేసుకుంటే ఆయన కోప్పడతారు."

"అలాంటప్పుడు మీరు ఒ.పి.లో ఎందుకు కూర్చోవాలి? కూర్చున్నప్పుడు మీకూ కొన్ని హక్కులూ, బాధ్యతలూ ఉంటాయి: చచ్చిపోతున్న పేషెంటును రక్షించలేకపోయాక ఇక మనవృత్తి ప్రయోజనం ఏమిటి?"

ఆమె ముందు తలవంచక తప్పింది కాదు.

హక్కులూ, బాధ్యతల ప్రసక్తి రాగానే తనేదో ఓడిపోతున్న వాడులా, ఓడిపోకూడదనే నిర్ణయం తీసుకున్న వాడులా కనిపించాడు.

"ఆల్‌రైట్! ఐ విల్ టేక్ ది రిస్క్."

అలా అడ్మిట్ అయ్యాడు.

కావలసిన కర్మాకాండంతా కానిచ్చి చేతులు చాపారు వాళ్ళిద్దరూ. ఏముంది తన దగ్గర? సణుక్కుంటూ వెళ్ళిపోయారు.

ఆ వేళ జరగవలసిన మొట్టమొదటి ఆపరేషన్ తనది.

తొమ్మిది గంటలకే శవంలా పడుకోబెట్టి ట్రాలీలో థియేటర్‌కు లాక్కుపోయారు.

ఆపరేషన్ థియేటర్ డెట్టాల్, ఈథర్ వాసనలతో గుబాళిస్తూంది.

పరికరాలు సిద్ధంచేస్తున్న సిస్టర్ల హడావిడి కళ్ళ ముందు కనపడతూంది. స్టెరిలైజ్ చేసిన కావి రంగు తెల్ల బట్టలు వేసుకుని అటూ ఇటూ తిరుగుతున్నారు జూనియర్ డాక్టర్లు.

రోగుల తాలూకు మనుషులంతా బయట భయం భయంగా కూర్చుని, కూర్చోలేకా అటూ ఇటూ తిరుగుతూ కొంత మంది వేచిఉన్నారు.

అకస్మాత్తుగా అసిస్టెంట్ మాటలు వినిపించాయి.

"బాస్ వచ్చే వేళయింది, ఇక సిద్ధం చెయ్యండి."

చక్రాల ట్రే మీద సిలిండర్ దగ్గరి కొచ్చింది. ఎనిస్తీషియా ముక్కు దగ్గర పెట్టి "బాగా పీల్చు" అన్నాడు అనీస్తీటిస్టు.

ఒక బలమైన, బరువైన ఉచ్ఛ్వాస!

అంతే.

అంతా తేలికైన దూదిపింజలా ఎక్కడికో తేలిపోతున్నట్లూ ఏవో అర్థంకాని పలకరింపులూ, గుసగుసలూ, నవ్వులూ, ఏమీ తెలియని కోలాహలం.

ఆ తరవాత ఏమైందో తెలియదు.

స్పృహ వచ్చేటప్పటికి తను వార్డులో పక్కమీద ఉన్నాడు.

పొట్ట తడిమి చూసుకున్నాడు. ఎక్కడా ఆపరేషన్ చేసిన జాడల్లేవు. బాధా లేదు. తలనొప్పి, నాసియా.

తెలివి వచ్చిందని తెలిశాక తోటీలు మళ్ళీ ఓ ట్రాలీ తీసుకొచ్చి ఎక్కించారు.

"ఎక్కడికి?"

"మెడికల్ వార్డుకు."

"ఎందుకు?"

"ఇది మెడికల్ కేసు. ట్రాన్స్‌ఫర్ చేశారు."

మెడికల్ వార్డు అశ్రద్ద చేయబడ్డ మునిసిపల్ మార్కెటులా ఉంది. ఎక్కడా నించోటానికి స్థలం లేదు. మంచానికి, మంచానికీ మధ్య ఖాళీస్థలంలో పరుపులు వేసి రోగుల్ని పడుకోబెట్టారు. ఖాళీగా ఉన్న ఒక నేలపరుపు మీద వెంకట్రావును పారేసి వెళ్ళిపోయారు.

ఒంటిగంట ప్రాంతంలో వచ్చాడు ఫిజీషియన్. అతని వెనుక గొర్రెల మందలా పెద్ద పటాలం. వెంకట్రావును నానా హింసలూ పెట్టి గానీ వాళ్ళు వదల్లేదు.

మూడుగంటల వరకూ ఎవరి జాడా లేదు. వార్డు స్టాఫ్ మారుతూన్న హడావిడి తప్ప అక్కడ ఎలాంటి అలికిడీ లేదు.

మూడున్నరకు సిస్టర్ వచ్చి ఏదో గోళీలు ఇచ్చింది. తీరా చూస్తే అవి మల్టీవిటమిన్‌వి. గ్లాసులో ఎర్రనీళ్ళు పట్టుకుని నిలబడి ఉంది సిస్టర్.

"సిస్టర్! నా కేసు షీట్ ఒకసారి చూడనిస్తారా?"

"ఎందుకు"

"ట్రీట్ మెంట్ ఏం రాశారో చూస్తాను"

"పేషెంట్ అవన్నీ చూడకూడదు" అని కాస్సేపాగి "రాసిన మందులు ఇవ్వటం లేదనా మీ అనుమానం?" అంది.

"అదికాదు. మిమ్మల్ని నేనేం తప్పు పట్టటం లేదు. వెరోప్రేషన్ కేస్‌కు ట్రీట్‌మెంట్

మొదలు పెట్టే తీరు ఇది కాదేమోనని నా అనుమానం."

"మరెలా?"

"వెంటనే గ్లూకోజ్, సెలైన్ ఇవ్వాలి.

"ఇంకా . ......"

'లో బ్లడ్ ప్రెషర్ అని మీరే నోట్ చేసుకున్నారుగా?'

'అవును. అందుకే ఆపరేషన్ చెయ్యలేదని సర్జికల్ వాళ్ళు రాశారు'

'మరి అలాంటప్పుడు బి.పి. పెంచటానికి సెలైన్‌లో ఎడ్రినాలిన్ ఇవ్వాలిగా?'

'ఇవన్నీ మీ కెలా తెలుసు?'

'నాకెలా తెలుసున్నది కాదు సమస్య. మీకెందుకు తెలియలేదని.'

"మీకు నేనేం చెప్పలేను. డ్యూటీ డాక్టర్ వచ్చాక పంపిస్తాను. మాట్లాడండి.'

ఇచ్చిన టాబ్లెట్స్ వెనక్కి తీసుకుని, బండి తోసుకుని అవతలి బెడ్ దగ్గరికి కెళ్ళిపోయింది.

నర్సు తన రౌండ్స్ పూర్తిచెయ్యకముందే డాక్టర్ వచ్చినట్టుంది.

"డాక్టర్! ప్లీజ్ సీ బెడ్ నంబర్ ఫార్టీత్రీ' అని పిలిచింది.

'ఎనిథింగ్ సీరియస్?'

'ఇట్ సీమ్స్ సో'

డాక్టర్ వచ్చింది.

'డాక్టర్! ప్లీజ్ కమ్ విత్ కేస్ షీట్' అన్నాడు వెంకట్రావు.

డాక్టర్ కాసేపు ఆలోచించి, వెనక్కి వెళ్ళి కేస్ షీట్‌తో తిరిగి వచ్చింది.

'మీపేరు వెంకట్రా వనుకుంటాను?'

'అవును'

ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె కూడా అప్పుడే పేషెంట్ ముఖంలోకి చూసినట్టుంది.

'లీల!' అనుకున్నాడు

'రాధా!' అంది డాక్టర్ నెమ్మదిగా,

'ష్! .... నాపేరు వెంకట్రావు.'

రోగులంతా మధ్యాహ్నపు భోజనాలు ముగించుకుని నిద్రలోకి జారుకుంటున్నారు.

నర్సు తన స్థానంలో స్థిరపడిందని తెలుసుకున్నాక దగ్గరగా పక్కమీద కూర్చుంది డాక్టర్ లీల.

"ఏమిటి, రాధా?'

'టైఫాయిడ్ వచ్చింది.'

'ఎప్పట్నుంచి'

'ఆరోజు నీ దగ్గర్నుంచి వెళ్ళిపోయినప్పట్నుంచి'

'వర్షంలో తడిశావు కదూ?'

' ఆ బాగా!'

ఆమె నిట్టూర్చింది.

'లే, బెడ్ మీంచి. ఇక్కడ లేని పోని హంగామా చెయ్యకు.' హెచ్చరించాడు.

'రాధా...' ఆమె కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరగటానికి సిద్ధంగా ఉన్నాయి. లేచి నిలడింది.

ఆరోజు.....

చీఫ్ ఇంజనీర్ రఘుపతినాయుడు రామప్ప చెరువు దగ్గర గెస్ట్‌హౌస్‌లో విడిది చేశారు. ఆయనకి పదిరోజుల క్రితమే గుండెపోటు వచ్చింది. అందుకే ఆయన ఏకైక పుత్రిక డాక్టర్‌లీల కూడా ఆయనతో క్యాంపుకి వెళ్ళింది.

ఇంజనీరు గారు బయట వరండాలో కూర్చున్నారు. వర్షంలో ఆయన ముందు విశాల సాగరం పొగ మంచులో కాశ్మీర్ డాల్ సరస్సులా కనిపిస్తూంది. పలచటి తెరలోంచి కనిపించినట్టు ప్రకృతి అంతా వర్షంలో మసక మసకగా, మనోహరంగా తోస్తూంది. హుషారుగా లేచి పచార్లు చెయ్యటం ప్రారంభించారు. చల్లని తేమగాలి రివ్వున ముఖానికి కొట్టే టప్పటికి పళ్ళు జివ్వున లాగినట్లనిపించి, 'అమ్మా లీలా!' అని పిలిచాడు.

'ఏం నాన్నా?'

'కొంచెం అగ్గిపెట్టె తెచ్చి పెట్టు, తల్లీ!'

అప్పటికే బయటికి వచ్చేసింది లీల.

'సిగరెట్లు కాల్చవద్దని ఎన్నిసార్లు చెప్పాలి నాన్నా?'

'అబ్బే! నేను కాల్చటం లేదే!'

'మరి అగ్గిపెట్టెందుకు?'

'ఊరికేనే, తల్లీ... నీకెందుకు? ఇచ్చేసి లోపలి కెళ్ళిపో, లీలా,

'నా దగ్గరా, నాన్నా, నీ అబద్ధాలు? నేను డాక్టర్ని'

'అదే నేను చేసిన తప్పు'.

ఏమిటి?'

'అదే... నిన్ను డాక్టర్ని చెయ్యటం. శుభ్రంగా పెళ్ళి చేస్తే ఈ పాటికి మనమళ్ళతో హాయిగా కాలక్షేపం చేసే వాణ్ని'.

పెళ్ళి మాట రాగానే ఆమె మనసులో ఒక మెరుపు మెరిసినట్లయింది. ఆ వెంటనే పిడుగులాంటి భయమూ ఆమె గుండెల్ని కుదిపేసింది.

రాధాకృష్ణ ఎక్కడున్నాడో! ఈ వర్షంలో, చలిలో ఏ కొండ గుహలోనో లేక ఈ వర్షంలో తడుస్తూ ఏ అడవిదారులు వెంబడో తిరుగుతూ ఉంటాడు అనుకుంటూ అలవోకగా అలా ఆ కొండ వైపు చూసింది. ఆమె చూపుకి అడుగున పాడుపడిన ఆలయమంటపం, దాని వెనక కాలువ, స్లూయిస్, ఆపైన ఎత్తయిన కొండ, దట్టంగా అలుముకున్న చెట్టూ చేమా...

కొండ చరియలో, చెట్లమధ్య నుంచి లతల్ని, తుప్పల్ని తప్పించుకుంటూ దిగుతున్న ఒక ఆకారం తెర వెనక మెదులుతున్న నీడలా కనిపించింది.

'నాన్నా! ఇదిగో అగ్గిపెట్టె.'

'ఈ ఒక్కసారికే, తల్లీ! చలి వణికించేస్తోంది.'

'ఈ చలిలో కూర్చోవడమెందుకు, వణికిస్తోందని సిగరెట్లు కాల్చడమెందుకు? పదండి, లోపలికి.'

బలవంతంగా లాక్కుపోయి మంచం మీద పడుకోడెట్టి దుప్పటి కప్పింది.

'వర్షం తగ్గేవరకూ మీరు పక్క మీంచి లేవకూడదు.' అని మళ్ళీ బయటికి వచ్చేసింది.

ఆ ఆకారం క్రమంగా ఆసన్నమైంది. పొట్టిచేతుల కాకీ చొక్కా, నిక్కరూ, వానకు తడిసి నల్లగా కనిపిస్తున్నాయి. వెనక బరువైన కిట్‌తో అతను కొంచెం ముందుకు వంగి నడుస్తున్నాడు.

ఆమె గుండెలు ఝల్లుమన్నాయి.

పది నిమిషాల్లో అతను పైకి రానే వచ్చాడు.

'రాధా....'

'ఏం, లీలా, ఆశ్చర్యంగా ఉందా?'

'ఆశ్చర్యం కాదు. కలలోలా ఉంది.ఇప్పుడే గుర్తుకు వచ్చావు. అటు చూస్తే ఒక ఆకారం కనిపించింది. అది నువ్వే కావటం....అవును , నీకెలా తెలుసు?'

'రోగిష్టి తండ్రిని ఏ కూతురైనా - అందులోనూ డాక్టరైన కూతురు వదిలి పెడుతుందా?'

'నాన్నగారి క్యాంపు తెలుసా?'

'సి.ఇ.గారి క్యాంపు రహస్యం కాదుగా?'

'అరే! పూర్తిగా తడిసిపోయావు. టవల్ తెస్తానుండు.'

'వద్దు. ఉండు.' అమె చెయ్యి పట్టుకున్నాడు.

'ఏమటి ఇంత వేడిగా ఉంది? అమ్మో! ఎంత టెంపరేచర్!'

'నాటెంపరేచర్ కేంలే. అవతల చచ్చిపోతున్నారు. ఉదయం కాల్పుల్లో ఇద్దరికి గుండు దెబ్బలు తగిలాయి. ఏంటి బయాటిక్స్ లేవు. ఏమైనా తెచ్చావా?'

'ఇస్తాను. ముందు నువ్వు తల తుడుచుకో, ఒక ఇంజెక్షనిస్తాను.'

'నా గురించి విచారించకు, లీలా... అవతల చాలా ప్రమాదం... ఎక్కువ సేపు ఇక్కడ ఉంటే నేను పట్టబడక తప్పదు.'

ఆమె లోపలి కెళ్ళింది.

'ఎవరితో, లీలా, మాట్లాడుతున్నావు?'

'వాచ్‌మన్ కొడుక్కి జ్వరంగా ఉందట నాన్నా' అని సమాధానం చెప్పి మందుల పెట్టెతో బయటికి వచ్చేసింది.

అతను మరేం మాట్లాడలేదు. ఆమె వైపు ఆప్యాయంగా చూసి మందులు కిట్‌లో వేసుకుని వెళ్ళిపోయాడు.....

★ ★ ★

డాక్టర్ లీల కేస్ షీట్ పరీక్షించింది.

'టైఫాయిడ్ రెండుసార్లు తిరగబెట్టింది. పెర్ఫొరేషన్ అయి పెరిటోనిటిస్ డెవలప్ అయింది. లో బి.పి.ఎనిమిక్. హై లీటాక్సిక్ రాడికల్ మెథడ్ పనికి రాదు. ఆపరేషన్ ఆపివేయబడింది. కన్జర్వేటివ్ పద్ధతిలో ట్రీట్‌మెంట్ రికమెండ్ చేయడమైంది. ట్రాన్స్‌ఫర్ టు మెడికల్ వార్డ్.'

'సిస్టర్!'

'ఎస్, డాక్టర్,'

'వన్ సెలైన్ బాటిల్ విత్ ఎడ్రినాలిన్.'

గ్లూకోజ్ సెలైన్ ఇచ్చి 'క్లోరోమైసిన్ అర్జెంట్' అంది.

'నో, డాక్టర్. నాట్ అవైలబుల్.'

'పోనీ, గారామైసిన్?'

'చూస్తాను....తెలిసి ఉండి ఇంత అశ్రద్ధ ఎందుకు చేశావు?'

'మేం అశ్రద్ధ చెయ్యం. అనివార్యం అయితే తప్ప"

ఆమె కళ్ళు నీళ్ళని బలవంతంగా ఆపుకుంటున్నట్లు బరువుగా ఉన్నాయి. యిద్దరూ ఒకళ్ళ నొకళ్లు చూసుకుంటున్నారు.

'బెంగగా ఉందా!'

' నీకు లేదా?'

'ఉహు--'

'రాతిగుండె!'

సిస్టర్ ఇంజక్షన్ తెస్తూంది. గబుక్కున కళ్ళొత్తుకుని సిరంజ్ అందుకుని ఇంజక్షన్ ఇచ్చింది. ఖాళీ సిరంజ్ తీసుకుని వెళ్ళిపోయింది. సిస్టర్.

'ఎంతకాలం ఇలా చావు బ్రతుకుల మధ్య పోరాటం?'

' ఈ వ్యవస్థ మారేవరకూ--'

'మారకపోతే,'

'మారి తీరుతుంది. మారకపోతే చస్తుంది. చచ్చిన ఈ సమాజం స్థానంలో నవ సమాజానికి పునాదులు లేస్తాయి.'

'అది చావకముందే--'

' నీ అనుమానం నాకు తెలుసు. ఉద్యమం చావదు. ఒకరుపోతే వారి వెనక వేలాదిమంది, నేను పోతే నా వెనక నువ్వు ఉంటావు.'

' ఆమె బరువుగా నిట్టూర్చింది.

ఆ వేళంతా వార్డులోనే ఉంది లీల. రాత్రి పది గంటలకు తండ్రినుంచి ఫోను వస్తే వెళ్ళింది. వెళ్ళేముందు 'ఎర్లీ మార్నింగ్' అని చెవిలో ఊది వెళ్ళిపోయింది.

అతను సన్నగా నవ్వాడు.

రాత్రి నిద్రలేదు లీలకు. రెండుసార్లు ఫోన్ చేసి కనుక్కుంది. రోగి కోలుకుంటున్నట్లు చెప్పారు. ఉదయం ఆలస్యంగా లేచింది. ఎంత తొందరగా తెమిల్చినా తొమ్మిది గంటల

కంటె ముందు రాలేక పోయింది హాస్పిటల్‌కు.

వార్డుకు రాగానే పక్కపైన రాధాకృష్ణ లేకపోవటం చూసి ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. కేస్ షీట్ వెతికి తీసింది.

'పేషెంట్ డైడ్ ఎట్ 2-35 పి.ఎమ్.' అని ఉంది..

'సిస్టర్!'

'ఎస్, డాక్టర్!'

'బెడ్ నంబర్ ఫార్టిత్రీ?'

'డెడ్...'

'తెలుసు. శవం ఎక్కడ?'

'ఫొరెన్సిక్ డిపార్టుమెంట్...'

గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళింది. లిఫ్ట్ దగ్గర పదిమంది తోటీలు గుమిగూడి మాట్లాడుకుంటున్నారు.

'ఫొరెన్సిక్ డిపార్టుమెంటునుంచి ఒక శవం మాయమైందట.'

ఆమెకు ఏదో అర్థమైనట్లు వెనక్కు తిరిగి వార్డులో తన గదికి వెళ్ళిపోయింది. ఎంత ప్రయత్నించినా దుఃఖం ఆగటం లేదు. టాయిలెట్ టేబుల్ మీద పడి తనివితీరా ఏడ్చింది.

'డాక్టర్' సిస్టర్ పిలిచింది.

ఆమె లేవలేదు.

'డాక్టర్

'ఎస్' ఏమైంది డాక్టర్?

'ఏమీ కాలేదు.'

లేచి కూర్చుంది డాక్టర్ లీల. ముఖం అంతా కన్నీటితో తడిసి జేవురించిపోయింది.
'ఏడుస్తున్నారా డాక్టర్?'

'అవును.'

ఆమె ఎందుకనీ అడగలేదు.

'బొట్టు చెరిపేసుకున్నారు.'

'నేను చెరుపుకోలేదు.'

'తెచ్చేదా?'

'వద్దు.'

ఆమె వెళ్ళిపోయింది.

లీల చెవిలో ఎవరో నెమ్మదిగా చెబుతున్నట్లనిస్తోంది.

'నేను పోతే నా వెనక నువ్వు ఉంటావు. నేను పోతే నేను పోతే, నావెనక నువ్వు ఉంటావు....నేను పోతే'

ఆమె లేచి చకచకా అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

# "స్వ గృహమే కదా ......"

రమాదేవి. జాస్తి

"చెప్పడం మరిచేను. ప్రొద్దున వాకింగ్‌కి వెళ్ళినపుడు వెంకట్రావు కన్పించేడు శాంతా"

పెరట్లో మొక్కలకి నీళ్ళు పోస్తున్న మూర్తి అరుగు మీద కూర్చుని కూరలు తరుగుతున్న భార్యతో చేప్పేడు.

"మళ్ళీ ఏదైనా అవసరం పడిందేమిటి మీతో?" శాంత ముఖంలో కోపం చూసి మూర్తికి నవ్వొచ్చింది.

"విజయనగరం ట్రాన్స్‌ఫర్ అయిందట. ఎలాగా అని బెంబేలెత్తి పోతున్నాడు. పిల్లల చదువు ఆఖరి సంవత్సరాల్లో వుందికదా. ఇంకా అయిదారేళ్ళ సర్వీసు వున్నట్లుంది. చూస్తూ చూస్తూ ఉద్యోగం వొదులుకోలేడు కదా?! ఒక్కడే వెళ్ళి రావడానికి చాల దూరమాయె. ఏం చేయాలో అర్థం కావడం లేదని బాధ పడ్డాడు."

"చేసుకున్న వాళ్ళకి చేసుకున్నంత మహదేవా!" అని వూరికే అనలేదు పెద్దలు, ఎవరి ఖర్మ వాళ్ళది"

"తప్పు శాంతా! అలా అనకు. నీకింకా వాళ్ళపై కోపం పోవడం లేదు. మరో వైపు నుండి ఆలోచించు. వాళ్ళ పుణ్యమా అనే కదా ఈ రోజు మనం మన స్వంత యింట్లో "స్వగృహమే కదా స్వర్గసీమ" అని పాడుకొంటూ సంతోషంగా వున్నాం?! అందుకే నాకు వాళ్ళ పట్ల కృతజ్ఞత తప్ప మరో భావం లేదు. నువ్వుకూడ మనసుని కష్టం కలిగించే పాత విషయాలు మర్చిపోవాలోయ్" మూర్తి అనునయంగా అన్నాడు.

శాంత తలెత్తి చూసింది. చుట్టూ రకరకాల పూల మొక్కలు విరగబూసి వున్నాయి కన్నుల పండుగ చేస్తూ. మరో వేపు కూరల పాదులు– ఏదీ కొనవలసిన అవసరం లేదు. మూర్తికీ, తనకి కూడా మొక్కలంటే ప్రాణం. తనకి ఇంట్లో పనితో ఎక్కువ తీరిక దొరకదు కాని, మూర్తి మాత్రం ఏదో ఒక పనిచేస్తూ మొక్కల మధ్యే కాలం గడుపుతుంటాడు. సెలవు రోజుల్లో పిల్లలు కూడ సహాయంచేస్తుంటారు తండ్రికి. తమ చిన్నితోటను చూసుకుంటుంటే

చెప్పలేని ఆనందమే కాదు, కొంచెం గర్వం కూడ శాంతకి.

"ఏమిటోయ్ ఆలోచన? ఇంతకీ చిక్కుడుకాయలు ఈ పూటకేనా?" మూర్తి ప్రశ్నకి ఉలిక్కిపడింది శాంత.

"ఏం లేదండీ. మీరన్నదాని గురించే ఆలోచిస్తున్నా. నిజంగా వాళ్ళు పుణ్యం కట్టుకోబట్టే మనకో ఇల్లు అమరింది. లేకపోతే ఇంకా అక్కడే వుండి ఆ చెట్లకి నీళ్ళు పోస్తూ ఇంటికి కాపలా కాస్తూ పడి వుండేవాళ్ళం," శాంతకి ఎంత వద్దనుకున్నా అవన్నీ జ్ఞాపకం వస్తే మనసులో ముల్లు గుచ్చుకుంటున్నట్లే వుంటుంది.

"సరే, సరే పద. నేను కూడ నీ వంటలో సహాయం చేస్తాను, నువ్వు రాత్రికి నాకు సహాయం చేసే కండిషన్ మీదే సుమా!" మూర్తి బావి దగ్గర చేతులు కడుక్కుంటూ చెప్పేడు.

"రాత్రికి నేను సహాయం చేయాలా?" శాంతకి అర్థం కాలేదు.

"అవునోయ్. రాత్రి నన్ను త్వరగా నిద్రపోనిస్తే చాలు" మూర్తి నవ్వులో కొంటెతనం చూసేక అర్థమైంది శాంతకి.

"ఛీ ఛీ, పాడు మాటలు మీరూను. మీరేమీ సాయం చెయ్యక్కర్లేదు నాకు. వంట నేను చేసుకోగలను" ఎర్రగా కందిపోయిన శాంత ముఖం సిగ్గు, నవ్వు, కోపం వగైరాల్తో ఇంద్రధనుస్సులా కన్పించింది మూర్తికి.

"ఇంత వయసొచ్చినా నువ్వు బానే వుంటావోయ్" చేతిలో నీళ్ళు సున్నితంగా ఆమె చెంపపై చిలకరించేడు.

"నేను మాత్రం మీకామాట చెప్తానని ఆశపడకండి" శాంత నవ్వు దాచుకుని మూర్తి తెల్లజుట్టుకేసి వెక్కిరింపుగా చూస్తూ లోపలికి వెళ్ళింది.

శాంత ఆలోచనలని దారి మళ్ళించకలిగినా మూర్తికి మాత్రం మళ్ళీ వెంకట్రావు విషయం గుర్తుకొచ్చింది. ఆ రోజులు కళ్ళముందు తిరిగేయి.

⋆ ⋆ ⋆

కోనసీమలో పుట్టి పెరిగిన మూర్తికి చదివిన చదువు ఉద్యోగం సంపాదించి పెట్టినందుకు ఆనందించాలో, అదిమహానగరంలో దొరికినందుకు (పైగా ట్రాన్స్‌ఫర్ లేనిది) విచారించాలో అర్థంకాని పరిస్థితి. వచ్చిన ఉద్యోగం వదిలేసుకోవడం తెలివైన పని కాదు కాబట్టి వొచ్చి చేరిపోయేడు. తర్వాత సంవత్సరానికల్లా మేనమామ కూతురు శాంతతో పెళ్ళి ఆ తర్వాత ఇద్దరు పిల్లలు పుట్టటంలో నాలుగైదు సంవత్సరాలు గడిచిపోయేయి.

ఈ అయిదేళ్ళలోనూ మూర్తికి మూడిళ్ళు మారవలసి వచ్చింది. వూర్లో పెద్ద ఇల్లు, పచ్చని పొలాలు, కొబ్బరితోటలు ఆరోగ్యకరమైన వాతావరణం– అన్నీ వొదులుకొని ఈ నగర జీవితంలో ఇరుకు గదుల్లో ఇమడవలసి రావడం చాలా కష్టంగా అన్పించేది మూర్తికి, శాంతకి.

"ఎక్కడేనా కాస్త పెరడదీ వున్న పెద్ద యిల్లు చూడండీ ఇది మరీ జైలులా వుంది కనీసం ఓ తులసి మొక్క వేసుకుందామన్నా జాగా లేదు" అని పోరు పెట్టేది శాంత.

మూర్తికి మాత్రం మాహా బాగున్నదనా? కాని అద్దె కూడ భరించాలి కదా? మూర్తి అనుకూలమైన యింటికోసం వెతుకుతోన్న సమయంలో ఓ మిత్రుడి ద్వారా తెలిసింది వెంకట్రావు ఇంటి గురించి.

అది ఊరికి చివర అప్పుడే కొత్తగా ఏర్పడుతోన్న కాలనీ. కొంచెం దూర దూరంగా ఉన్నాయి ఇళ్ళు. ఆఫీస్‌కి పదికిలోమీటర్ల దూరం. వెంకట్రావుకి అప్పట్లో కాకినాడలో ఉద్యోగం. ట్రాన్స్‌ఫర్ల మీద తిరిగే ఉద్యోగమే అయినా పై ఆదాయం బాగా వొస్తుండటంతో సిటీలో యిల్లుండటం ఎప్పటికైనా మంచిదని భావించి ఇక్కడ కట్టించేడని మిత్రుడు చెప్పేడు.

రెండు బెడ్‌రూములు, హాలు, వంటగది, అటాచ్డ్ టాయ్ లెట్స్, పెరట్లో బావి ముఖ్యంగా ఇంటికి నాలుగు వేపులా విశాలంగా వున్న ఖాళీ స్థలం - చూడగానే మూర్తి మనసు దోచుకుంది. వెంటనే శాంతని కూడ తీసుకు వచ్చి చూపించేడు. "బావుంది కదండీ ఇల్లు? చక్కగా ఎన్ని మొక్కలేనా వేసుకోవచ్చు" అంది శాంత సంబరంగా.

"అది సరే - మరినువ్వు నేనొచ్చే వరకూ ఒక్కదానివీ చిన్న పిల్లల్ని పెట్టుకుని ఉండగలవా?" మూర్తి సందేహపడ్డాడు.

"నాకేం భయమండీ? అయినా అటువేపూయిటువేపూ యిళ్ళు కన్పిస్తూనే వున్నాయి కదా! అన్నీ కావాలంటే ఎలా?" శాంత నిజంగానే ధైర్యవంతురాలు.

"ఇంటివాళ్ళు ఇక్కడుండరు కాబట్టి వాళ్ళకి ఇల్లు జాగ్రత్తగా స్వంత ఇంటిలా చూసుకునే వాళ్ళు కావాలి. అద్దె ప్రధానం కాదు. మీకు నచ్చితే మీకిష్టమైనంత కాలం మీరుండవచ్చు. ఇప్పట్లో వెంకట్రావుకి ఇక్కడికి వచ్చే అవకాశం లేదు" అని చెప్పేడు మిత్రుడు.

నిజానికి సిటీకి దూరంగా వున్న ఆ కాలనీకి - ఎవరేనా అక్కడ స్థలం కొనుక్కుని వుండి యిల్లు కట్టుకోవాలనుకుని వస్తే తప్ప ఇతరత్రా ఆ ప్రాంతాలకి అద్దెకి వచ్చే అవకాశం లేదు. అందుకే అద్దెకూడ తక్కువకే దొరికింది మూర్తికి. హడావిడికి దూరంగా ప్రశాంతంగా కన్పించడంతో ఆకాలనీ చాల నచ్చింది మూర్తికి, శాంతకి. మరో ఆలోచన లేకుండా ఆ ఇంట్లో దిగిపోయేరు.

★ ★ ★

శాంత ఇంటినంతా చక్కగా సర్దేసింది.

ఇద్దరూ కలిసి ఇంటి చుట్టూ ఏమేం మొక్కలు వేయాలో వారంరోజులు ఆలోచించి మరీ నిర్ణయించేరు.

ముందుగా వంటగది గుమ్మానికెదురుగా తులసి చెట్టు, పడమటి వేపు బెడ్‌రూముల్లోకి ఎండ ఎక్కువగా పడుతుంది కాబట్టి అటువేపు కొబ్బరి, మామిడి, జామ, సపోటా వంటి

పెద్ద చెట్లు, తూర్పు వేపు, యింటి ముందు భాగంలోను పూల మొక్కలు - పెరట్లో కరివేపాకు, కూరపాదులు-

ఆర్నెల్లలో ఎంతో అందంగా కళకళ్ళాడుతూ తయారైన ఇంటిని చూసి మూర్తి మిత్రుడు ఆశ్చర్యపోయేడు. వెంకట్రావు హైదరాబాదు వచ్చినపుడు తీసుకొచ్చి చూపించేడు.

వెంకట్రావు కూడ మూర్తి దంపతుల మర్యాదకి ముగ్ధుడయ్యేడు. ఈ రోజుల్లో కూడ ఇంత మంచి వాళ్ళున్నారా అని ఆశ్చర్యపోయేడు. నిజానికి తామున్నా కూడ ఇల్లంత చక్కగా వుంచుకోలేమని నిజాయితీగా ఒప్పుకున్నాడు కూడ.

ప్రతినెల మొదటి వారంలో అతని ఆఫీస్ అడ్రస్‌కి మూర్తి ఇంటద్దెక్రింద 'చెక్ పంపించేవాడు. 'ఇల్లు మంచివాళ్ళ చేతుల్లోనే పడింది ఎక్కడెన్ని సంవత్సరాలు తిరిగినా బాధ లేదింక' అనుకున్నాడు వెంకట్రావు నిశ్చితంగా.

చూస్తూ చూస్తూ పదేళ్ళ గడిచిపోయినయ్. ఈ మధ్య కాలంలో ఎన్నో మార్పులు - కాలనీ బాగా పెరిగిపోయిందిప్పుడు. బస్ సౌకర్యం కూడ పెరిగింది.

మూర్తిది, శాంతది స్నేహ స్వభావం కావడంతో కాలనీలో అందరికీ వాళ్ళంటే అభిమానమే. మూర్తి దంపతులు స్నేహాభిమానాలే కాదు ఇంట్లో పూసిన పువ్వులు, కాసేకాయలు కూడ అందరికీ పంచేవారు.

అసలు మూర్తి వాళ్ళు తామూ యింట్లో అద్దెకుంటున్నామన్న విషయమే మరచిపోయేరు. తమ స్వంత యింటికన్నా ఎక్కువ మమకారం పెంచుకున్నారు.

సాయంకాలాలు ఆ మొక్కల మధ్య భార్యాపిల్లలతో గడపటం మూర్తికెంతో యిష్టం శాంతకి కూడ బయట సినిమాలకి, షికార్లకి తిరగడం కన్నా మూర్తి కెదురుగా కూర్చుని జాజిపువ్వులు మాల కట్టుకుంటూ అతను చెప్పే కబుర్లు వినడమే యిష్టం.

అలా వాళ్ళ జీవితం చాలా సాఫీగా హేపీగా గడిచిపోతున్న సమయంలో వెంకట్రావుకిత్వరలో ఇక్కడకి ట్రాన్స్‌ఫర్ కాబోతున్నదన్న విషయం తెలిసి మూర్తి దంపతుల గుండెల్లో రాయి పడింది.

కాని తర్వాత మూర్తి మిత్రుడు వచ్చి చెప్పేడు వెంకట్రావు ఇంటిపైన మరో పోర్షన్ కట్టించుకుని అందులోకి రావాలన్నఅభిప్రాయంతో వున్నాడని.

మూర్తి దంపతులు తేలిగ్గా నిట్టూర్చేరు.

ఆ తర్వాత వెంకట్రావు అనుకున్నట్లుగానే పైన పోర్షన్ కట్టించేడు. సిమెంటు అదీ పడి, పనివాళ్ళు తొక్కేసి మొక్కలు ఎక్కడ పాడైపోతాయోనని చాలా జాగ్రత్తగా వెయ్యి కళ్ళతో కాపాడుతుండేది శాంత.

వెంకట్రావు వచ్చినపుడు అతనికి అతిథి మర్యాదలన్నీ చేసేవారు. అతను మొదట్లో మొహమాటపడినా తర్వాత తర్వాత తనే చనువుగా 'చెల్లెమ్మా కాఫీ యిస్తావమ్మా?' అనడిగే దశ కొచ్చేడు.

ఇల్లు పూర్తికావడం, అదే టైంకి వెంకట్రావుకి ట్రాన్స్‌ఫర్ కూడా రావడం, శ్రావణ మాసంలో గృహప్రవేశం - చకచక జరిగి పోయినయ్.

"చూసేరా మామిడి చెట్టు కొమ్మలన్నీ ఎలా విరిచి పడేసారో?" శాంత మొదటిసారి నొచ్చుకుంది మూర్తి దగ్గర-

"పోనీలే. గృహప్రవేశం కదా, గుమ్మాలకదీ తోరణాలు కట్టడానికి విరిచేరు కాబోలు" అన్నాడు మూర్తి.

"చిన్న కొమ్మలు తెంపుకోవచ్చు కదండీ? మరీ అంత పెద్దవి విరిచేసి వృధాగా పారేసేరు గోడవతల" అంది శాంత.

మూర్తి ఏమీ చెప్పలేకపోయేడు. ఆ క్షణం అన్పించిదతడికి 'అది తమ యిల్లు కాదు, తామేం చెప్పగలరు?' అని. తర్వాత అతనా విషయాన్ని ప్రతిక్షణం గుర్తు చేసుకుంటూనే వుండవలసి వచ్చింది వెంకట్రావు వాళ్ళ ప్రవర్తన వల్ల.

మూర్తి ఎప్పటినుండో వుండటం వల్ల సంవత్సరానికి యాభై చొప్పున అద్దె పెంచి యిస్తూ వున్నా - మిగతా వాళ్ళతో పోల్చితే అద్దె తక్కువ క్రిందే లెక్క. కాలనీలో ఇప్పుడు ఇళ్ళకు మంచి డిమాండ్ వుంది. వెంకట్రావుకి నెలకి నాలుగైదు వందలు నష్టం. ఒక్కసారిగాఅంత అద్దె పెంచమననడానికి వెంకట్రావుకి నోరు రావడం లేదు.

ఇంతకాలం స్వేచ్ఛగా తమ యిల్లు 'ఎంజాయ్' చేసారని వెంకట్రావు భార్యకి అక్కసుగా వుంది. పై గా గృహ ప్రవేశానికి వచ్చిన బంధువులంతా - ఏపుగా పెరిగి విపరీతంగా కాస్తోన్న కొబ్బరి చెట్లు, మామిడి, జామ వగైరాల్ని చూసి వాటిని మూర్తి వాళ్ళే వేసి అంత చక్కగా పెంచారని తెలుసుకుని - తెగ ఆశ్చర్య పోవటమే కాకుండా మూర్తి దంపతుల్ని చాల మెచ్చుకుని వెళ్ళేరు. అది చూసి వెంకట్రావు భార్య ముఖం మాడ్చుకుంది.

"కాలనీలో అందరికీ పూలు, పళ్ళు అప్పనంగా పంచేసి శాంత, మూర్తి మంచిపేరు సంపాదించుకున్నారు" అని మొగుడి దగ్గర చాల సార్లు వాపోయిందావిడ.

అంతే కాదు, ఇక మీద ఇల్లు తమది కాబట్టి తమ హక్కుల్ని ప్రదర్శించి మూర్తి వాళ్ళని కేవలం తాము అద్దెకుంటున్న వాళ్ళమే నన్న జ్ఞానం కలిగించాలని తీవ్రంగా నిర్ణయించుకుంది కూడ. వెంకట్రావు తను కూడ సహకరిస్తానని భార్యకు వాగ్దానం చేసేడు.

★ ★ ★

ఒక రోజు సాయంత్రం మూర్తి ఇంటి వచ్చేసరికి శాంత చిరునవ్వుతో ఎదురొచ్చి పలకరించలేదు - రోజూ మాదిరి.

ఎర్రటి కళ్ళతో, ముఖమంతా వాచిపోయినట్లున్న శాంతని చూసి మూర్తి ఖంగారు పడిపోయేడు. అతనెప్పుడూ శాంతనలా చూడలేదు.

"ఏమైంది శాంతా?" చాల ఆదుర్దా పడుతూ అడిగేడు.

శాంత చాల ప్రయత్నం మీద దుఃఖాన్ని ఆపుకొంటూ చెప్పింది - "ఎక్కడేనా యిల్లు చూడండి, వెళ్ళిపోదాం."

"ఏం జరిగింది శాంతా?"

"మధ్యాహ్నం అవ్వ వచ్చి కరివేపాకు అడిగిందండీ"

అవ్వ అదే కాలనీలో యిల్లిల్లు తిరిగి ఆకు కూరలవీ అమ్ముకుంటూ వుంటుంది.

ఓసారెప్పుడో మూర్తి కరివేపాకు కోసుకుని అమ్ముకోమని చెప్పేడు. ఆ చెట్టు వృక్షమల్లే, ఎదిగిపోయింది. ఎంత కోసినా తరగదు. అప్పుడప్పుడూ మనుమడిని తీసుకు వచ్చి కోయించు కెళ్తుంది. ఈ మధ్య చాల కాలమైంది ఆమె వచ్చి.

"అయితే ఏమైంది?"

"చెట్టు మీద చెయ్యి వేయగానే పై నుండి ఇంటావిడ గలగలమని అరిచేసిందండీ. ఇక్కడ తినడానికి లేదు కాని చెట్లేసింది దానధర్మాలు చెయ్యడానికా? ఇన్నాళ్ళు పెత్తనం వెలగబెట్టారు, ఇంక చాలు ఎవరూ చెట్లమీద చేతులెయ్యడానికి వీల్లేదు అని ఏమేమో మాట్లాడేసిందండీ, అవ్వ చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయింది"

శాంత కళ్ళు మళ్ళీ చెరువులయ్యాయి.

మూర్తి నిర్ఘాంతపోయేడు. మనుష్యులు అకారణంగా, అంత అమర్యాదకరంగా మాట్లాడుతారా? అసలే స్వాభిమాని అయిన శాంతకి అలా నిష్కారణంగా మాటలు వినవలసి రావడం ఎంత కష్టం కలిగించి వుంటుందో మూర్తి వూహించగలడు.

శాంతని ఒక ఉదుటున దగ్గరకు లాక్కుని 'అయామ్ సారీ,' అని గొణుగుతూ కళ్ళు తుడిచేడు.

శాంత అప్పుడప్పుడూ చెప్తూనే వుంది, ఎక్కడేనా స్థలం కొనుక్కుని చిన్న యిల్లు కట్టించుకుంటే బాగుంటుందని. తనే పట్టించుకోలేదు. తనకే నగర జీవితం ఇప్పటికీ ఇష్టం లేదు. రిటైరైనాక మళ్ళీ తమ వూరెళ్ళిపోయి హాయిగా పొలం చూసుకుంటూ తమ మండువా లోగిట్లో చివరి రోజులు ప్రశాంతంగా గడపాలని తన కోరిక.

ఆ రాత్రే మూర్తి ఓ నిశ్చయానికి వచ్చేడు. వారం రోజుల్లో ఇల్లు ఖాళీ చేసేడు. వాళ్ళ గురించి పూర్తిగా అందరికీ తెలుసు కాబట్టి ఇల్లు దొరకటం సమస్య కాలేదు.

కాని ఇంత కాలం వున్న ఆ యింటిని, ముఖ్యంగా ఆ చెట్లన్నింటినీ వొదిలేసి రావాలంటే మూర్తికి చెప్పలేనంత బాధ కలిగించింది. శాంతే ఓదార్చవలసి వచ్చింది మూర్తిని.

"పిల్లల్ని, పెద్దల్ని వదిలి, సంపాదించుకున్న ఆస్తుల్ని వదిలి పై వాడి పిలుపు రాగానే వెళ్ళిపోమాండీ? వీటి గురించి బాధపడి ఏం చేస్తాం?" అని చెప్తోన్న శాంత గీతా బోధ చేస్తున్న కృష్ణుడిలా కన్పించింది మూర్తికి.

★ ★ ★

మూర్తి వూర్లో తన వాటాకి వచ్చిన పొలం అమ్మేసేడు. ఆఫీస్ లోను తీసుకుని సంవత్సరంలో ఇల్లు కట్టించుకుని గృహ ప్రవేశం చేసేడు. గృహ ప్రవేశానికి వెంకట్రావు కుటుంబాన్ని కూడ పిలిచేరు.

కాలనీలో అందరికీ వెంకట్రావు వాళ్ళు కావాలని మూర్తి వాళ్ళని అవమానించి ఇల్లు ఖాళీ చేయించిన విషయం తెలిసిపోయింది. మూర్తి ఖాళీ చేసిన యింట్లోకి వచ్చిన వాళ్ళెవరూ ఆర్నెల్లకి మించి వుండటం లేదు.

వచ్చిన వాళ్ళు వీళ్ళకి నచ్చక పోవడమో, లేదా వీళ్ళు వచ్చిన వాళ్ళని నచ్చకపోవడమో ఏదో ఒక కారణం మొత్తం మీద ఎవర్నీ ఎక్కువ కాలం నిలవనీరన్న పేరు వచ్చేసింది వెంకట్రావు వాళ్ళకు.

ఇప్పుడు మళ్ళీ 'ట్రాన్స్‌ఫర్' వచ్చింది వెంకట్రావుకి. ఏం చెయ్యాలో తోచక కొట్టు మిట్టాడుతున్నాడు - అదీ విషయం.

"ఇంకా ఆలోచిస్తూనే కూర్చున్నారా? నా వంటెప్పుడో పూర్తిఅయింది. భోజనానికి లేవండి"

శాంత పిలుపుకి ఈ లోకంలోకి వచ్చేడు మూర్తి.

★ ★ ★

పిల్లలిద్దర్నీ హాస్టల్లో చేర్పించి వెంకట్రావు, భార్యతో సహా విజయనగరం వెళ్ళిపోయినట్లు తెలిసింది మూర్తికి.

ఇంటి బాధ్యత తీసుకోవడానికి ఇరుగు పొరుగు ఎవరూ ముందుకు రాకపోవడంతో ఒక బ్రోకర్‌కి ఇల్లు అద్దెకిచ్చే బాధ్యత అప్పగించేట్ట.

మరో రెండు సంవత్సరాలక్కాబోలు - వెంకట్రావు అద్దె యిల్లు వుంటే చూసి పెట్టమని వచ్చేడు మూర్తి దగ్గరకు మూర్తి ఆశ్చర్యపోయేడు.

వెంకట్రావు రిటైరయ్యేడు. తిరిగి వచ్చేద్దామంటే ఆ బ్రోకరు రెండులక్షలిస్తే కాని ఇల్లు తిరిగి స్వాధీనం చెయ్యనంటున్నాడట - ఆ వ్యవహారం తేలేవరకూ అద్దె ఇల్లు కావాలని కన్నీళ్ళ పర్యంతమౌతూ చెప్పేడు.

"హతోస్మి, ఇలా కూడ వుంటారా? జాలిగా అనుకుంటూ మూర్తి వెంకట్రావుతో కలిసి ఇంటికోసం బయల్దేరేడు.

# కిష్కింధ నీతి

## వారాల కృష్ణమూర్తి

గురవయ్య చూపు నింగిలో వున్నా మనసు సముద్రంలా ఎగిసి పడుతుంది. రోజారోజుకు పెరిగి పోతున్న కసి నిస్సహాయత మీద వుమ్మేస్తుంటే ఎక్కడో నరాల అంతరాల్లో మిడిక్...మిడిక్ మండుతున్న ఆత్మాభిమానం అంతై ఇంతై దావానలంలా నిలువెల్లా వ్యాపించి దహించి వేస్తుంది.

"ఏందయ్యా! ఎంత కాలమిట్లా కూసుంటావ్... వులకవు పలకవు... నా ఒక్కడి వల్లా ఏమవుతుంది. నువ్ కూడా సెయ్యేస్తే ముగ్గిరి కడుపులు నిండుతాయి"

కొడుకు మాటలు విన్నా విన్నట్టే వున్నాడు గురవయ్య. గంపలో తెచ్చిన అంకుడు కొయ్య ముక్కల్ని మొగిడి ముందు పోసి "మావ మనసు బాగోలేదు గందా... ఎందుకాయన్ని సాధిస్తావ్?" అంది మాలచ్చిమి.

"సాధింపా.. పేదోల్లకు సాధింపు లుండవే.. కన్న తండ్రైనా పెల్లామైనా.... సివరకు పుట్టిన బిడ్డలైనా బతికినంత కాలం ఏదో ఒకటి చేస్తేనే నోటికింత పోయేది. ఏ ఒక్కరు సెయ్యాడించకున్నా అందరి కడుపులూ ఎల్తే!... ఎలితి బతుకులు ఎంతకాలం.. అయ్యా! నిన్నంటున్నానని కాదు. నీకు తెలియందీ కాదు. నలుగురూ కలిసి నాలుగు బొమ్మలు సేసి అమ్ముకొచ్చిన రోజుల్లోనే బతుకులు అంతంత మాత్రంగా సాగె...ఈ రోజు మే మిద్దరం ఎన్ని బొమ్మలు సేసేమూ.. ఎన్నమ్మేము.. ఏం తినేము. దానికింకా సెక్కడం రాదాయె. నేను సెక్కిన బొమ్మలకు రంగు లేయడం, పాలీసెయ్యడం, బజార్లో కూలబడి అమ్మడం దాని పనాయె. నేసేసే బొమ్మలే జనానికి నచ్చడంలా. నీలా నేను కొత్త కొత్త బొమ్మలు సెక్కలేను. సెయ్యి తిరిగి నోడివి సెయ్యాడించి ఆరు నెల్లాయె.. ఎవరెన్ని సెప్పినా నీ లోకం నీదే... పోయినోల్లు రారు. వున్నోల్లెన్నా బతకాలా!.. నువ్ కాదంటే సరే.. అందరం కట్టకట్టుకుని సముద్రంలో పడి సద్దాం!"

గురవయ్య నులక మంచం నుండి లేచి తుండుగుడ్డ భుజాన వేసుకుని వీధిలో పడ్డాడు. తండ్రి అలా నిర్జీవంగా లేచి పోవడం చూసి 'అయ్యను బాధపెట్టానా!' అని ఒకింత

యాతన పడ్డాడు రావుడు.

"మనసులో బాధ తెలిసే అన్నావ్.. ఏం కొడుకువో.. సివుక్కుమన్న మనసుతో లేసి పోనాడు గందా!" మూతి విరుస్తూ అంది మాలచ్చిమి.

"లోకంలో ఎంత మంది పోవడం లేదు. సచ్చినోల్లందరినీ మరవక ఎంతకాలం సత్తారీ జనం.. అంతా మామూలుగానే మసలు కుంటున్నారు. ఒక్క అయ్య తప్ప" మనసులోనే అనుకున్నాడు రావుడు.

నిజానికి లోకంలో రోజూ ఎందరో తల్లుల్ని, భార్యల్ని, మొగుళ్ళని, వాళ్లు వీళ్లు అని ఏముంది ఎందర్నో పోగొట్టుకున్నా ఆ వెలితి తీర్చేది కాకున్నా...బతుకు చాలిస్తున్నారా...బండగా మొండిగా బతికేస్తున్నారు. కానీ గురవయ్యలా బతక లేక పోతున్నాడు.

వీధిన పడ్డ గురవయ్య జనారణ్యాన్ని చీల్చుకుంటూ భారంగా అడుగు లేస్తూ సముద్రం ఒడ్డుకు చేరుకున్నాడు. సమయం మధ్యాహ్నం కావడం మూలాన సముద్ర ఘోష తప్ప జన ఘోష వినిపించడంలేదు. ఆకాశం నిండా మబ్బులు ముసరడం వల్ల ఎండ తీవ్రత కనిపించడం లేదు. రోడ్డు మీద వచ్చే పోయే సిటీ బస్సులు కార్లు, స్కూటర్ల మోతలు సముద్రపు అలల అరుపుల్లో కలిసి పోతున్నాయి. గురవయ్య రోడ్డు దిగి ఇసుకలో సముద్రం అంచుల వెంట నడుస్తున్నాడు. ఇసుకలో పడిన పద చిత్రాల్ని ఎగిసిపడుతున్న అలలు చెరిపేస్తున్నాయి. అలాగే మనసులో పడిన మరకల్ని చెరిగేస్తే బావుండు. కానీ అలా జరగదు. ఈదురు గాలి సముద్రం మీద నుండి దూసుకు వస్తుంది. ఆ తాకిడికి అటూ ఇటూ ఒరుగుతూ ఒగురుస్తూ నడచి ముత్యాలు బొమ్మ లమ్ముతూకూచునే చోట కూలడ్డాడు గురవయ్య.

సాయంకాలం అక్కడే విశాఖ నగర వాసులందరికీ ఆట విడుపు. పిల్లల కేరింతలు..జంటల విలాసాలు.... వయసు మళ్లిన వాళ్ళ తీపి గురుతులు అన్నింటికి కల్పతరువది. వచ్చిన జనం కోనంమిర్చి బజ్జీలు...మిక్చర్.... ఐస్ క్రీం... గవ్వలు..శంఖాలు..బొమ్మలు అన్నీ ఒడ్డున కిరసనాయిల్ దీపాల వెలుగులో కనిపిస్తుంటాయి.

కూతురు ముత్యాలు బొమ్మలమ్మే చోటు సాగర తీరానికి స్వాగతం పలికే మెట్ల దగ్గర కూర్చుని ఎగిసి పడే అలల్ని ముసురు కొస్తున్న మబ్బుల్ని లెక్క చేయకుండ సాగరం ఆకాశం అంచుల సరిహద్దుల్లో చూపు నిలిపాడు. ఆ సుదూర ప్రాంతంలో ఎన్నెన్నో గుర్తులు చెరిగి పోని జీవిత చిత్రాలు కనిపిస్తున్నాయి.

"గురవయ్యా! నీ సేతిలో ఏటుందో గానినాయార్డి ఏ బొమ్మ వేసినా జీవం పోసుకుంటుందిరా!" పని తనాన్ని గురించి సాటి కులపోళ్ళ మెచ్చుకోలు.

"నీ యవ్వ! ఏందే ఈ కోతి బొమ్మలు సెయ్యమంటావ్!" గురవయ్య తండ్రి మీద విసుగు.

"ఓరయ్యా కోతుల బొమ్మలనకరా... అవినీతుల బొమ్మలు.. సెడు సూడకు.. సెడు సెప్పకు...సెడు వినకు.... ఈ నీతి తాత సెప్పిన నీతి. అదే దారి సూపింది బతకను. ఆ రోజుల్లో తాత సెప్పిన మాటకు బొమ్మలు సెక్కి నాలుగు రోడ్ల చంటర్‌లో పెడితే

సిటికలో అన్నీ అయిపోయేయి. ఆ రోజుల్లో ఆ బొమ్మల కంతా ఎగబడే వారు. ఆ బొమ్మల మీదే మన సంసారం నిలబడింది. అందుకే రోజులు మారినా... జనానికి కావలసిన బొమ్మలు వేరయినా ఇవిసేసి...ఏ అయ్యనీతి మీద మనసు పడి అడిగినా బేర సారాల్లేక ఈ బొమ్మలమ్మాలని నా మతం. రోజుకొక్కడైనా ఆ బొమ్మ అడుగుతాడనే ఆశ... దేశంలో ఇంకా నీతి సావలా...కనపడ కుండా పోతున్న నీతిని మనమూ నిలపాల...అందుకే నీ సేత ఈ బొమ్మలు సేయిస్తున్నా...ఈ బొమ్మలు సెక్కడ మొస్తే అన్నిబొమ్మలూ వస్తాయి. ఎన్ని కొత్త బొమ్మలు సేసినా ఇవి సెయ్యడం మానకు. అమ్మడం మానకు. ఇది మన ఇలువరస బొమ్మ కావాలి." కోతులు బొమ్మతో ఓనమాలు దిద్దిన అయ్య చెప్పిన సుద్దులు.

"మావా నే సస్తే మళ్లి మనువాడకు! వచ్చేది నిన్ను సూస్తింది గాని పిల్లల్ని సూడదు" దీనంగా అర్థిస్తున్న భార్య.

భార్య కిచ్చిన మాట కోసం...పిల్ల కోసం బొమ్మలు చెక్కే చెయ్యి, కుండలు కడగడమూ నేర్చుకుంది. రావుడిని ముత్యాల్ని రెండు కళ్ళలా చూసుకుంటూ... పిల్లలకు చిన్న చిన్న పనులు నేర్పుతూ పదిహేనేళ్లు నెట్టుకొచ్చాడు. ఆ వాడలో ఎవర్నడిగినా "గురవయ్య శానా మంచోడు!" అంటారు.

ఎందుకంటె...

అతనెప్పుడూ ఒకరి గురించి చెడు చెప్పడు. చెడు పనులు చెయ్యడు. ఎవరైనా వాడి మీద వీడి మీద ఏమైనా చెప్పినా నవ్వేసి వెళ్ళిపోతాడు. ఈ గుణాలు తండ్రి చెప్పిననీతులు. తమ బతుకులు నిలిపిన నీతులవే అనే విశ్వాసం. అవి తన్నూ తన పిల్లల్ని తప్పక వుద్దరిస్తాయనే ఆశ. తను చేస్తున్న బొమ్మల్లో కనిపించే నీతి తనలోనూ కనిపించాలనే నీతి గురవయ్యనలా తీర్చింది.

సింవా చలంగాడు ఒకడ్ని కత్తితో పొడిసి చంపింది చూసి కళ్లు మూసుకున్నా... రోజూ అతని కళ్ళల్లో మెదులు తూనే వుంది.

"ఒరేగురవాసూడకూడంది సూసేవు.. సూల్లేదనుకో బతికి పోతావ్....' సింవాచలం హెచ్చరిస్తూ చూసిన చూపులు.

"సింహాచలం మా సెడ్డ ముండావాడు. వాడెవరో గుంటని కిడ్నాపింగ్ సేసి లాడ్జింగ్‌లో అమ్మేసేడంట!" శంఖాలు గవ్వలూ అమ్మే అప్పల కొండ మాటలు వినకూడదనుకున్నా చెవులు చిల్లులు పడేలా వినపడుతూనే వున్నాయి.

సింవాచలంగాడి సంగతలూ గురవయ్య నోట ఏనాడూ రాలేదు.

అందుకే బతికి పోయాడంటాడు సింవాచలం.

ఒకరి జోలికి పోక తన బతుకేదో తను బతుకుతున్న గురవయ్య జీవితంలో తుఫాను రేగింది.

"ఒరే అయ్యా! ముత్తేల్ని ఆ సింవాచలం గాడట్టుకెల్నాడంట" కంగారుగా ఒగురుత్తూ బొమ్మలమ్ముకుంటున్న సూపర్ బజార్ సెంటర్‌కు రావుడు వచ్చి సెప్పినప్పుడు, కింది

భూమి కదిలి పోతున్నట్టనిపించింది.

"సింవాచలంగాడు ఈ పిల్లని ఏడకెత్తికెల్నాడో!"

"ఆ యదవ పడుసు గుంటల్ని అయిదారాబాదు, బొంబాయిల్లో అమ్మేస్తాడంట!"

"లాడ్జింగ్‌లో దాసేసుంటాడు!"

నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకున్నారు. గురవయ్య ఒకరి జోలికి పోనోడు. సింవాచలం దుర్ మార్గ ముండావాడని తెలిసినా ... వాడినందరూ తిడుతున్నా సొంత తమ్ముడల్లే మాట్లాడేవాడు.

"కూనీ కోరు నా కొడుకు.. వాడితో నీకు మాటలేందే!" అని నిందీసిన జనాన్ని చూసి నవ్విన గురవయ్య, ఆ రోజునిలువునా కృంగిపోయాడు.

సింవాచలం జాడగాని ముత్యాలు జాడగాని మూడు రోజుల్దాక తెలియకవూరూవాడా అంతా తిరిగి పోలీసు స్టేషను కెళ్లారు. వారం రోజులు తప్పుకుని చివరకు "సముద్రంలో పడి సచ్చిందినీ కూతురు " అంటూ తేల్చిన పోలీసోళ్లు...వాళ్ళతో లాలూచి పడుతున్న సింవాచలం గాడిని చూసినప్పుడు గురవయ్య గుండె చెదిరిపోయింది.

నెల రోజులు తరువాత.

"ఓడలోకి తీసుకెల్లారంట. ఆడ ఎంతమంది...ఏం...సేసేరో...సింవాచలం గాడా గార్డెన్‌లో ఒటేలు నడుపుతున్నాడంట...మాయదారి నాయాలు సంపాదించడం తెలుసుకున్నాడు" గుస గుసలాడిన వాడ జనం సానుభూతి గురవయ్య చెవిన పడ్డరోజు ఇంట్లో అమ్మడు పోని మూడుకోతుల బొమ్మలు ప్రాణమొచ్చి నవ్వినట్టనిపించి, ఆ బొమ్మ లన్నింటినీ నేలకేసి కొట్టి విరిచేశాడు.

అంతే ......... ఆ రోజు మొదలు బొమ్మలు చెక్కడం మానేశాడు. దిగులు పడ్డ మొహంతో పగలు ఇంట్లోనూ రాత్రి గుడిసె ముందూ నులక మంచం మీద గతాన్ని తలపోసుకుని గుండెను మండించేవాడు.

చినుకులు టప...టప...టప...మని శబ్దం చేస్తూ ఇసుకలో ఇంకి పోతున్నాయి. ఆకాశం వికృతంగా గర్జిస్తూంది. సముద్రం బుసలు కొడుతూంది. వర్షం ధార, ఎదురుగా వున్న సముద్రాన్ని మరుగు పరుస్తూంది. వర్షంలో నానుతున్నా చలనం లేదు గురవయ్యలో. అలా తడుస్తూనే సముద్రాన్ని చూస్తున్నాడు. గాలి హోరు...వాన హోరు...సముద్రం హోరు అన్నీ కలిసినా గురవయ్య గుండెల హోరు ముందు బలాదూర్‌లా వుంది.

తాత చెప్పిన నీతి. తన తండ్రి నమ్మిన నీతి...తను ఇన్నేళ్ళు నమ్మిన నీతి...మూడు కోతుల నీతి. లోకమంతా చెడే...ఇంక ఈ కళ్లెందుకు? ఈ చెవులెందుకు? ఈ నోరెందుకు?

గుడ్డి చెవిటి మూగలాగామాత్రమే బతకాలా ఈ లోకంలో...
చెడుని నిరసించొద్దా!
ఈ వక్ర నీతికి కాలదోషం పట్టింది!
ఆ కోతుల నీతులు చాటితే, ముత్యాల్లాగే..

ఎదురుగా మూడు గండు కోతులు. ఒకటి కళ్లు మూసుకుని....ఒకటి చెవులు మూసుకుని...మరొకటి నోరు మూసుకుని కూర్చున్నాయి. వాటికంత దూరంలో ముత్యాలు నగ్నంగా... జుట్టు విరబోసుకుని ఏడుస్తూ చేతులతో మానాన్ని కప్పుకుని కనిపించింది.

గురవయ్య ఆదృశ్యం చూసి "ముత్తేలూ!" అని అరిచాడు.

ప్రతిగా ఆకాశంలో ఓ మెరుపు మెరిసింది. ఆ వెలుగులో

నాలుగు కోతులు వరసగా నోరు మూసుకుని, చెవులు మూసుకుని, కళ్ళు మూసుకుని...చివరిది ఇలా చేస్తే మానం కూడా మిగలదన్నట్టు మానాన్ని చేతులతో కప్పుకు కనిపించింది.

తన ముత్యాలు చాటిన సత్యం!

ఈ రోజు జనానికి అవసరమైన సరికొత్త నీతి.

గురవయ్య లేచి ఇంటిదారి పట్టాడు.

"యాడికి పోతివి మావా!" అన్న కోడలి మాటకు జవాబు చెప్పకుండా గంపలోని అంకుడు కొయ్య ముక్కల్ని ముందేసుకుని బొమ్మలు చెక్కడం మొదలు పెట్టాడు.

అతని గుండెలలో రగులుతున్న జ్వాలల్ని ఆ చేతుల్లో చెక్క బడుతున్న బొమ్మల్ని చూస్తుండి పోయారు

"అయ్య! నాలుగు కోతులు పెట్టావే....'

"ఔను.... ఆ నీతికి కాలదోషం పట్టింది. అలా నోరు మూసుకుని అవిటాడిలా నాలా బతికితే ఈ లోకంలో పోగొట్టుకునేది మానం...అని చాటే కొత్త నీతి బొమ్మలు" ఆ కంఠంలో గంభీరత...దృక్కుల్లోని తీక్షణత గురవయ్యకు కొత్త రూపునిచ్చాయి.

ఇప్పుడతను నవ సమాజాన్ని మలుస్తున్న శిల్పి!

ఆదివారం ఆంధ్రజ్యోతి

# అస్మదీయుడు

## వెంకటేశ్వర్లు భమిడి

పీడకల రావటంతో నిద్ర చెదిరిపోయింది. కిటికీ అద్దంలోనుంచి వీధిదీపాల వెలుగు కనిపిస్తోంది. మామూలుగా విశ్వపతికి ఎప్పటికోగాని నిద్రపట్టదు. ఈ మధ్య ఏడాది నుంచి నిద్రకు కరువయ్యాడు. ఏదో నిరాశ, నిర్లిప్తత, భయం, ఆందోళన, విచారం తరుముతున్నాయి. అనంతరామయ్య మరణం అతన్ని మరింత ఒంటరిని చేసేసింది. ఆయనది ఊహించనిది, అనుకోని చావు అయిపోయింది. విశ్వపతికి అనంతరామయ్య చావు రోజుకి ఇరవై అయిదుగంటలు గుర్తుకొస్తుంది.

అవును...అనంతరామయ్య తనకు బంధువు చుట్టం, ఆప్తుడు, మిత్రుడు... అన్నింటికి మించి... తనకు వంట్లో బాగుండటంలేదని విశ్వపతికి ఉత్తరం రాశాడు – ఏడాది క్రితం చూసేందుకు వెళ్లాడు. అక్కడి పరిస్థితి చూశాక, ఆ వూళ్లో ఆయనకు సరియైన వైద్యసదుపాయం అందటం మాట అటుంచి, అందించటంలేదని అర్థమయింది విశ్వపతికి. అప్పటికి వారం పదిరోజుల్నుంచి చికాకులో ఉన్న అయిదుగురు కొడుకులు, విశ్వపతి రాగానే సంతోషించి తప్పుకున్నారు. "ఏంచేసినా మీ యిష్టం..... అయితే కాస్త ఖర్చు తక్కువయ్యే మార్గంలో నడపండి" అంటూ.

విశ్వపతి అనంతరామయ్య వైపు జాలిగా చూశాడు, ఆయన బతికున్న శవంగా మంచంమీద పడుకున్నాడు. పక్కనే వారి భార్య అసహాయంగా ఉంది.

"మీకేం అభ్యంతరం లేకపోతే, మావూరు తీసుకెడతాను" అన్నాడు విశ్వపతి, అనంతరామయ్య కొడుకులతో.

"ఇప్పటికే మాకు డాక్టరు బిల్లు బోలెడు అయింది. ఇప్పుడు మీకు టాక్సీ ఖర్చు ప్లస్ మట్టి ఖర్చు అవుతుంది. ఏదోవిధంగా ఇక్కడే కానిచ్చేస్తాం" అన్నారు కొడుకులు.

"ఏం పర్వాలేదు... తీసుకెడతాను" అన్నాడు విశ్వపతి.

"మీ యిష్టం" అన్నారు కొడుకులు.

అనంతరామయ్య విశ్వపతితో వచ్చాడు. నాలుగురోజుల తరువాత ఆయన

చనిపోయాడు. అదిగో,అప్పట్నుంచి, విశ్వపతి ఒంటరి అయిపోయాడు. దాదాపు వారం పదిరోజులు ఏడవటంవల్ల కళ్లు ఎర్రబడ్డాయి. వారి మధ్య ఇరవై ఏళ్ళ ఆత్మీయత, అభిమానం, స్నేహం ఉంది. అది మరిచిపోనిది మరువలేనిది... అన్నింటికి మించి.... విశ్వపతి ఆరోగ్యం అనారోగ్యంగా మారింది. ఫలితంగా ఆసుపత్రులు, డాక్టర్లు, మందులు, ఇంజక్షన్లు, ఫీజులు...తడిసి మోపెడో...మోసింది తడిసిందో... అటువంటి పరిస్థితిలో అతనికి ప్రభుత్వ ఆసుపత్రిలో డాక్టర్ శ్రీదేవితో పరిచయమైంది. చిత్రంగా, విచిత్రంగా ప్రభుత్వ డాక్టర్లలో నిర్లక్ష్యం రక్తంలో జీర్ణించుకుపోయింది. అశ్రద్ధ అలవాటయిపోయింది. అజాగ్రత్త రివాజయిపోయింది. వీటికి భిన్నంగా శ్రీదేవి చికిత్స చేస్తుంది. అందుకే విశ్వపతి ఆమె పేషంటు అయ్యాడు. వారంలో రెండు రోజులు అతను ఆసుపత్రికి వెళతాడు. శ్రీదేవిని చూస్తే కొంత ఆమె మందులు వాడితే మరికొంత ఊరట కలుగుతుంది అతనికి. రోగి చెప్పే లక్షణాలు వినకుండా, ఆసుపత్రిలో ఉండే మందులతో వైద్యం చేసే డాక్టర్లున్న ఈ రోజుల్లో శ్రీదేవి ఓపిగ్గా శ్రద్ధగా పేషంటుని పరీక్షించి, చికిత్స చేయడం అపూర్వం, అబ్బురం... ఆశ్చర్యమే...

ఒకసారి శ్రీదేవి అడిగింది "మీరు సినిమాలు బాగా చూస్తారా...పత్రికలు చదువుతారా...మీది ప్రేమ వివాహమా... శ్రీమతితో మీ అటాచ్ మెంట్ ఎలాగుంటుంది" అంటూ "ఒకప్పుడు వారానికి ఎనిమిది. తొమ్మిది సినిమాలు చూసేవాడిని, ఇప్పుడు ఏడాదికి అయిదారు. కారణం మీరు ఊహించుకోగలరు. అలాగే పత్రికలు, కథలు, నవలలు చదవందే నిద్రరాదు. మాది ప్రేమ వివాహం కాదు. ఇకపోతే నా శ్రీమతితో అటాచ్మెంట్ విషయం. " అంటూ శ్రీదేవి వైపు చూశాడు. ఆమెకు వివాహం కాలేదని అర్థమయింది.

"ఏమిటి చూస్తున్నారు" అని నవ్వుతూ అడిగింది.

"ఏంలేదు. మీ ప్రశ్నకి జవాబు చెప్పాలంటే మీరు వివాహితురాలై ఉండాలికదా" అన్నాడు విశ్వపతి నవ్వుతూ.

"ఆల్రైట్...నేనర్థం చేసుకోగలను" అంది డాక్టర్ శ్రీదేవి. ఆమె ప్రశ్నకు సంసారపక్షంగా జవాబు చెప్తూ "మరి యీ టెన్షనుకు కారణం ఏమంటారు" అని అడిగాడు.

"డబ్బు గురించి ఆలోచిస్తున్నారా" అడిగిందామె.

"ఎంత డబ్బుంటే ఏం లాభం.... బతికేందుకు అదొక్కటే చాలదుకదా. అంతకు మించిన విషయాలున్న సమాజం ఇది. అయినప్పటికి డబ్బుకోసమే మనుషుల పరుగు ఆరాటం, తాపత్రయం, తొందర. ఇక్కడ మనిషిని డబ్బు శాసిస్తోంది. లొంగదీసుకుంటోంది. ప్రపంచంలో జరుగుతున్న గొడవలకు, ఆందోళనలకు దౌర్జన్యాలకు, అన్యాయాలకు డబ్బు మాత్రమే కారణం. మరోవైపు అధికారం, హోదా, పదవులు, పలుకుబడి కోసం డబ్బుని వినియోగిస్తున్నారు" ఆవేశంగా అన్నాడు.

"అనవసర విషయాలు ఆలోచించకండి" అంది శ్రీదేవి ప్రిస్క్రిప్షను రాస్తూ.

'అవును డాక్టర్.. పక్కవాడితో మాట్లాడని యీ మనుషులు, ఎదుటివాడిని విమర్శించే యీ మనుషులు, సమాజసేవ కోసం పుట్టినట్లుగా చలామణీ అయిపోతున్నారు....

వీటన్నిటి ముందరా నాలాంటివాడు పనికిరాని మనిషయిపోతున్నాడు."

"మీరు అభిమానించే మనిషి ఎవరైనా చనిపోయారా" అని అడిగింది శ్రీదేవి.

"అవును డాక్టరుగారూ... అనంతరామయ్యగారని... ఆయన పోయాడు. అప్పట్నుంచి యిలాగుంది పరిస్థితి" అంటూ జేబులోంచి ఫొటో తీసి చూపించాడు విశ్వపతి.

"ఆయన ఉంటే నా జీవితం మరోవిధంగా మారేది. నా సమస్య ఆయన పరిష్కరించుకొనేవాడు. ఆయన గురించి ఎంత చెప్పినా తక్కువే..." గర్వంగా చెప్పాడు అతను తరువాత.

శ్రీదేవి అనంతరామయ్య ఫొటో చూసి యిచ్చేసింది. ఈ విధంగా వారిమధ్య ఆరు నెలల పరిచయం స్నేహంగా కొనసాగింది. శ్రీదేవి డ్యూటీలో లేకపోతే, మరో డాక్టర్ని చూడడు విశ్వపతి.

విశ్వపతి రోడ్డుమీద నడుస్తున్నాడు. అతని భుజంమీద ఎవరిదో చెయ్యి పడటంతో వెనక్కు తిరిగాడు. "ఎవరు మీరు" అడిగాడు తను.

ఆయన నవ్వేశాడు. "నువ్వు నన్ను ఎప్పుడూ చూడలేదు. కాని నువ్వు నాకు తెలుసు" అన్నాడాయన తన పేరు శంకరయ్య అని చెప్తూ.

ఎవరీ అపరిచిత వ్యక్తి - అనుకున్నాడు విశ్వపతి.

"చూడు విశ్వపతి... మనిషిలో ఉండే దుఃఖానికి, విచారానికీ, భయానికి కారణం కేవలం ఆశ, స్వార్థం. ఇది రాజకీయ నాయకులు, పాలకుల్లోనే కాదు మామూలు మనుషుల్లోను ఎక్కువయిపోతోంది" శంకరయ్య చెప్తున్నాడు.

విశ్వపతికి ఆయన ధోరణి నచ్చలేదు.

"ఇప్పుడు సామాన్యుడి బతుకు దుర్భరంగా తయారయింది. ఎదుటివాడి అవసరాన్ని అవకాశంగా మార్చుకునే స్వభావం మనిషిలో జీర్ణించుకుపోతోంది."

"మీరు చెప్పేది నాకు అర్థంకావటంలేదు" అనేశాడతను చటుక్కున.

"అర్థంకాదు. ప్రయత్నించేస్తే దీనంత తేలికైన విషయం మరొకటి లేదు. ఇంతకీ మీ ఆవిడా, పిల్లలు కులాసాగా ఉన్నారా...పిల్లలు ఏం చదువుతున్నారు... సంబంధాలు చూస్తున్నావా వారికి డాక్టర్ శ్రీదేవి ట్రీట్మెంటు ఎలా ఉంది" ప్రశ్నల వర్షం కురిపిస్తోంటే ఆశ్చర్యపోతున్నాడు విశ్వపతి - తనగురించి ఎలా తెలుసా అన్నట్లు.

"ఇంతకీ మీరు ఎవరు" అని అడిగాడు విశ్వపతి.

"మనిషి జీవించేందుకు ఊపిరి అవసరం. అయితే జీవితానికి అదృష్టం చాలా అవసరం. మనిషిని ఊపిరి జీపింపచేసినా, అదృష్టం అతన్ని నడిపించినా మరోశక్తి కూడా ఉండాలి. అప్పుడే జీవితానికి నిండుతనం, సార్థకత, సంతోషం, తృప్తి, ఆ శక్తి డబ్బు. నిద్రలేచింది మొదలు పడుకునేవరకూ డబ్బు వివిధరూపాల్లో అవసరమవుతూంటుంది. ఏమంటావు" అని ఓ క్షణం ఆగాడు శంకరయ్య జవాబు కోసం ఎదురుచూస్తూ.

విశ్వపతి అవునన్నట్లుగా తలూపాడు.

"అయితే యీ మూడే అవసరం కాదు ఇంకొన్ని విషయాలు కూడా చాలా

అవసరమవుతున్నాయి నేటి రోజుల్లో అన్నాడాయన.

"ఏమిటి అడిగాడు విశ్వపతి.

"మనల్ని చూసి ఎదుటివాడు భయపడాలన్నా, మనల్ని గుర్తించాలన్నా, గౌరవించాలన్నా, మనగురించి, ఆలోచించాలన్నా- మనదగ్గర పుష్కలంగా డబ్బుండాలి, నోరుండాలి, అధికారం, హెూదా ఉండాలి. మన వెనుక ఉండే వ్యక్తుల గురించి వారికి తెలిసుండాలి. మనతో వారికి అవసరం ఉండాలి. వారిని ఆకర్షించేవిధంగా బురిడీ కొట్టేలా సమయస్ఫూర్తితో మాట్లాడాలి" అన్నాడు శంకరయ్య జీవితం నేర్పిన అనుభవాన్ని గుర్తుచేసుకుంటూ.

విశ్వపతికి ఆయనపట్ల నమ్మకం ఏర్పడింది. శంకరయ్యను ఇంటికి ఆహ్వానించాడు వెంటనే. ఇద్దరూ ఇంటికి వెళ్లారు. శంకరయ్యకు డెబ్బయ్యేళ్ల వయసుంది. దృఢంగా ఆరోగ్యంగా కనిపిస్తున్నాడు. కాని మాటల్లో ఏదో నిర్లిప్తత వినిపిస్తోంది.

భర్తకోసం గుమ్మంలో ఎదురుచూస్తోంది రమణి. విశ్వపతి శంకరయ్యను లోపలకు ఆహ్వానించాడు. గోడకు వేలాడుతున్న అనంతరామయ్య ఫోటో చూసి అన్నాడాయన "ఎవరైనా ఎన్నాళ్లని బతుకుతారు... ఇప్పటికైనా ఆ వూళ్లో వాళ్లు నిశ్చింతగా బతుకుతారు" అని

విశ్వపతికి అర్థంకాలేదు. ఆ మాటే అడిగాడు తను "ఏమీలేదు... ఒకరు గెలవాలంటే మరొకరు ఓడాలి. పదిమంది సంబంధాలు చెబ్తారు, కాని అందరినీ వివాహం చేసుకోలేముకదా... అందుకు బోలెడంత వ్యవహారం నడపాలి. అది అందరికి సాధ్యం కాదు. దాన్నే వ్యవహార దక్షత, లౌక్యం అంటారు. అది అనంతరామయ్యకు ఉంది. కాబట్టే బతికేశాడు. అది అతని రూటు... అందరూ ఆ రూటులో నడవలేరు..." శంకరయ్య చెప్తున్నాడు.

విశ్వపతి రమణి వైపు చూశాడు.

"అనంతరామయ్య ఎక్కిన రైలు అతని గమ్యస్థానంలో ఆగింది కాబట్టే దిగిపోయాడు. మనందరం కూడా ఏదో సమయంలో రైలు దిగవలసిందే... అంతవరకూ ప్రయాణం తప్పదు" అంటూ రమణిని ఓదార్చాడు ఆయన.

విశ్వపతికి మావగారి రూపం మరోసారి కళ్ళముందు కదిలింది. ఆయనతో పరిచయం, మాటలు గుర్తుకొచ్చాయి.

శంకరయ్య ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. కాని చెప్పలేదు. ఆయనలోనూ ఆందోళన, విచారం, భయం లేకపోలేదు. మనలోని బాధను కంగారుని ఎదుటివారికి చెప్పుకుంటే కొంత ఉపశమనం కలుగుతుంది. కాని అలా చెప్పేందుకు కొంత సమయం, అనుభవం, నమ్మకం అవసరం. విశ్వపతి రమణితో చెప్పాడు "శంకరయ్యగారు మనింట్లోనే భోజనం చేస్తారు. వంటచేయి" అంటూ శంకరయ్య కాదనలేదు.

"మీదేవూరు... పిల్లలేం చేస్తున్నారు....." అంటూ మాటల మధ్యలో అడిగాడు విశ్వపతి.

"నాకు అయిదుగురు ఆడపిల్లలు. మొదటి ఇద్దరికి వివాహాలు కాలేదు. మిగిలిన

పిల్లలు వారే చేసుకున్నారు, యీ చేతకాని తండ్రి పట్ల నమ్మకం లేక...నేనూ నా అనుభవాన్ని గుర్తుచేసుకుంటూ వారికి అడ్డుతగలలేదు" అన్నాడాయన."ఇలా ఎందుకు జరిగింది" అని అడిగింది రమణి భర్తవైపు చూస్తూ.

"ప్రపంచంలో బతుకుతున్నవాళ్ళంతా హాయిగా, సుఖంగా ఉన్నట్లు కాదు. కొన్ని పరిస్థితులు, సంఘటనలు మన ప్రమేయం లేకుండా జరిగిపోతుంటాయి, మనుషులు ఒకలావున్నట్టు కనిపించినా మనస్తత్వాలు మాత్రం భిన్నంగా, వక్రంగా ఉంటాయి. మాటల్లో మంచితనం, న్యాయం, నీతి, ధర్మం కనబరచేవారు చేతల్లో భిన్నంగా ప్రవర్తిస్తారు. ఇది నాగరికత, ఆధునికత, స్వార్థం, స్వప్రయోజనం ముసుగులో కొందరు ఆడుతున్న వైకుంఠపాళీ."

విశ్వపతి ఆయన ధోరణికి అడ్డువడ్డాడు. 'ఏమిటో చెప్తున్నారు నాకేం అర్థంకావటంలేదు. ఇదంతా నాకెందుకు చెప్పండి" అంటూ.

"నిన్ను చూశాక చెప్పాలనిపించింది. నువ్వేమైనా అనుకో... ఇది నీకు జీవితంలో ఉపయోగపడుతుంది. ఇప్పటిరోజుల్లో చాలా అవసరమైన విషయం."

విశపతి మౌనంగావింటున్నాడు.

"నా పెద్దకూతురి వివాహ విషయంలో పెద్ద అనుభవాన్ని రుచిచూశాను. అది పెద్దదెబ్బ. నేను ఆడపిల్లల తండ్రినని, నా కూతిరిని పెళ్లాడితే ఆడపిల్లలే పుడతారని, పండుగలకు పిలిచి సంతోషపెట్టలేనని, ఓ మహానుభావుడు ప్రచారం చేశాడు. అంతే కథ ముగిసింది" అంటూ కళ్లు అద్దుకున్నాడు శంకరయ్య.

అర్థంకానట్టుగా చూశాడు విశ్వపతి.

"అవును.. వెనుకటిరోజుల్లో ఓ సంబంధం చెప్తే దానికి కట్టుబడి ఉండేవారు. కాని ఇప్పుడు ఎందరిని చూస్తే అంత గొప్ప, క్రెడిట్. కాబట్టి యిప్పటికీ నా పెద్దకూతురు అవివాహితగా ఉండిపోయింది. ఆమె మనసులోనుంచి 'తాలి' రూపం తొలగిపోలేదు" శంకరయ్య విచారంగా చెప్పాడు.

విశ్వపతి షాక్ తిన్నాడు. "మరొక సంబంధం చూడవలసింది. .... చూశారా. ఆమె జీవితం అలా చీకట్లోనే ఉండాల్సిందేనా... తన భవిష్యత్తు ఎలా...' అని అడిగాడు. "పెద్దమనుషులకు కొన్ని స్పెషల్ క్వాలిటీసు, సూపర్ ఆలోచనలుంటాయి. బాబూ..." అన్నాడాయన.

"ఇంతకీ ఎవరండీ ఆ పెద్దమనిషి".

"ఎవరైతేనేం... సంస్కారం, విజ్ఞత ఉన్నవారు. నడిచే రాజమార్గం అదే కదమ్మా" అంటూ రమణి వైపు చూశాడు శంకరయ్య.

ఆయన బయలుదేరేందుకు సిద్ధమయ్యాడు.

"మన పరిచయం అపూర్వం....చాలా సంతోషం" అంటూచేతులు జోడించారు విశ్వపతి.

"అప్పుడప్పుడు వస్తూండండి" అంది రమణి.

శంకరయ్య వెళ్లిపోయాడు.

దాదాపు ఇరవై రోజుల తరువాత విశ్వపతికి శంకరయ్య ఉత్తరం రాశాడు.

చిరంజీవి విశ్వపతికి...ఉభయకుశలోపరి... ఎదుటివాడికి ఉప్పు అందించలేనివాడు ఇంట్లో పంచభక్ష్యపరమాన్నంతో భోజనం చేస్తాడా, పెడతాడా- అనే విషయం నీకు తెలుసో లేదో..

నేను మొదట్లో నా పెద్దకూతుర్ని నీకు ఆఫరు చేశాను. ఈ విషయం మీ ఫాదరుకి, తాతగారికి తెలుసు. మధ్యలో అనంతరామయ్య అడ్డుపడి, తన సహజ మాటకారితనంతో, లౌక్యంతో వ్యవహారం నడిపి నిన్ను అల్లుడిగా చేసుకున్నాడు. తనకు కొడుకులకంటే అల్లుళ్లే గొప్ప, మంచివాళ్లు అని చెప్పడం, చెప్పుకోడం ఆయన స్పెషల్ అట్రాక్షను. అలా చెప్పుకోకపోతే కూతుర్ని సరిగా చూడడేమోనని భయం కదా... కొడుకు అల్లుడులా ఎలా ఉంటాడు! ఎవరి పొజిషను వారిదే! నువ్వు నాకు అల్లుడు కాలేకపోయినా, నాకూతురి భర్త కాకపోయినా మా భావాలు మారిపోలేదు. మాలో నీ మంచితనం, వ్యక్తిత్వం ఎప్పటికీ ఉంటుంది. ఇక రెండో అమ్మాయి డాక్టర్ శ్రీదేవి అక్క అడుగుజాడల్నే ఎంచుకుంది. ఈ పరిస్థితులకు తట్టుకోలేక నా భార్య ఏడేళ్ల క్రితం మమ్మల్ని ఒంటరిచేసి వెళ్లిపోయింది. రెండుమూడుసార్లు నిన్ను నేను ఆసుపత్రిలో చూశాక, నా కూతురినే సంప్రతించడం గమనించాక ఆమెకు అసలు విషయం చెప్పాను. అనంతరామయ్య జీవించివుంటే నీ పిల్లల విషయం నీకు సమస్య కాదేమోనని భావించి ఉంటావు. ప్రస్తుతం ఉన్న వివాహ వ్యవస్థకు మీ మావగారు సరిగ్గా పథకం వేసేవాడని నీ ఆలోచనలు కాబోలు! ఏది ఏమైనా గతాన్ని మరోసారి తవ్వుకోడం ఎందుకు!

నా బావమరిదికి ఓ కొడుకు, కూతురు ఉన్నారు. నా పెద్దకూతురి సంతానాన్ని వారికివ్వాలని ఎప్పుడో అనుకున్నాం. ఆ యోగం, అదృష్టం మాకు కలుగలేదు. నీకు అంగీకారం అయితే నేను జరిపిస్తాను. ఆలోచించుకుని, అమ్మాయి రమణితో రాగలవు.

సెలవు....శంకరయ్య.

ఉత్తరం చదువుతుంటే విశ్వపతి కళ్లు అప్రయత్నంగా చెమర్చాయి. అక్షరాల నడుమ శంకరయ్య విశ్వరూపం కనిపించింది. సమస్యల గురించి ఆలోచిస్తూ బెంగపెట్టుకోకుండా, అందిన పరిష్కారాన్ని అమలుపరచడం మంచి లక్షణం అని ఎవరో అన్న మాటలు విశ్వపతికి గుర్తుకొచ్చాయి.

**ఈనాడు ఆదివారం, 17 ఏప్రిల్ 1994**

# నీటిలో నాన్న నీడ

వెంకటరమణ చొక్కాపు

వీధి గుమ్మంలో నిలబడి శివరామ్ కోసం ఎదురు చూస్తున్న జానకి వెన్నెముకలేని మనిషిలా వంగి ఉంది. రెప్ప వెయ్యని ఆమె కళ్ళల్లో చూపు కంటే నిస్పృహ ఎక్కువగా ఉంది. ఆమె భర్తకోసం కాకుండా అతడు తెచ్చే డబ్బుకోసమే ఆతృతగా ఎదురు చూస్తోంది.

ఆమె కట్టుకున్న చీర మొన్నటిది. ఆమె కడుపులో ఆకలి వారం క్రితంది. వాళ్ళింట్లోని దరిద్రం ఏడాదినాటిది. ఆమె వయసు ఇద్దరు పిల్లల తల్లిది.

"మద్దేనానికి బియ్యం తేకపోతే ఆకలికి పిల్లలు నన్ను విరుచుకు తినేస్తారు." బైటికి బైలుదేరిన శివరామ్‌ని – వెళ్ళిపోతున్న హనుమంతుణ్ని సీత చూసినట్టు దీనంగా చూసి చెప్పింది జానకి.

శివరామ్‌లో హనుమంతుడి కున్నంత శక్తి ఉంది. ఆ విషయం అతనికి తెలుసు.

అతని చేతిలో బ్రష్ ఉంటే ఎలాంటి బొమ్మయినా బతికి బట్టకట్టేది. కదిలొచ్చి కన్నుకొట్టేది. శివరామ్ వేసిన సినిమా బ్యానర్ల దగ్గర అభిమానులు బారులు తీరి నిలబడి సినిమాలో సీను చూస్తున్నట్టు పరవశించేవారు.

చిరంజీవి నుంచి చిడతల అప్పారావు వరకు శ్రీదేవి నుంచి సిల్కుస్మిత వరకు అందరూ శివరామ్ చేతుల్లో రంగు రంగుల అందాలు సంతరించుకొని, పబ్లిక్ ప్లేసుల్లోనూ. రద్దీ సెంటర్లలోనూ కటౌట్‌లుగా, హోర్డింగ్‌లుగా నిలబడి నేత్రానందం కలిగించేవారు. సినిమా బ్యానర్ల సీనియర్ ఆర్టిస్టుగా శివరామ్ పేరు ఆంధ్రదేశం ఎల్లలు దాటింది.

శివరామ్ రంగునీళ్ళు పారబోస్తే సప్త వర్ణాల సెలయేరులా ఉందనేవారు. బ్రష్ విదిలిస్తే ఇంద్ర ధనుస్సు సృష్టించాడనేవారు. శివరామ్ పనిచేయని సినిమా బ్యానర్లమీద టాప్ హీరోలు కూడా ముఖం చిటికిపోయిన వింత మనుషుల్లా ఉండేవారు. సినిమా విజయానికి శివరామ్ వేసినే బ్యానర్లే ప్రధాన కారణమనే నమ్మకం సినీ పరిశ్రమలో శిలాక్షరాలుగా నిలిచిపోయింది.

బ్రహ్మకి నాలుగు చేతులుంటే వీపు గోక్కోడానికి ఒక్క చెయ్యే ఉపయోగించి ఉంటాడు. శివరామ్ మాత్రం రాత్రింబవళ్ళు కష్టపడ్డాడు. రెండు చేతులా సంపాదించాడు.

కాలం వక్రించింది. శివరామ్‌ని క్షయవ్యాధి కావులించుకుంది. ఏడాదిన్నర ఏపనీ చేయలేకపోయాడు. క్షయ శివరామ్ ఆరోగ్యాన్ని తినేసింది. అతను సంపాదించిన డబ్బంతా డాక్టర్లు తినేశారు. అతని మనశ్శాంతిని చుట్టుపక్కల వాళ్ళు తినేశారు. మనిషిని మాత్రం ఎవరూ తినకుండా వదిలేశారు.

కాలం వేగంగా పరుగెత్తింది పరిస్థితుల్లో చాలా మార్పులు వచ్చాయి.

సినిమా హీరోలు విలన్లయ్యారు. హీరోయిన్లు వేంపులయ్యారు. మంచివాడు, మంచి బాబాయ్, మంచి రోజులు లాంటి మంచి సినిమాల కాలం చెల్లిపోయింది. ఖైదీ, గూండా, హంతకుడు, రాక్షసుడు, కర్కోటకుడు లాంటి యాంటి హీరో సెంటిమెంట్ సినిమాలు వస్తున్నాయి.

శివరామ్ ఆరోగ్యం కొంచెం కుదుట పడింది కాస్త ఓపిక చేసుకొని పనిచేయడానికి సిద్ధపడే సరికి, అతనికి పని ఇవ్వడానికి ఎవరూ సిద్ధపడలేదు.

శివరామ్ దగ్గర బ్రష్‌లు అందిస్తూ పని నేర్చుకున్న కుర్రాళ్ళంతా గొప్ప ఆర్టిస్టులుగా చలామణి అవుతున్నారు. శివరామ్‌ని పలకరిస్తే అతని బాధ్యత తమకెక్కడ తగులుకుంటుందో అని అతన్ని తెలీనట్టు నటించారు. చూసీ చూడకుండా ముఖాలు చాటేసుకున్నారు.

ఎక్కే కంపెనీ, దిగే కంపెనీ, శివరామ్‌కి ఎక్కడా పని దొరకలేదు. అర్నెల్లుగా కటిక దరిద్రాన్ని అనుభవిస్తోంది శివరామ్ కుటుంబం.

'చీకటి తరువాత వెలుగొస్తుందంటారు తమ బతక్కి ఎప్పుడూ చీకటేనేమో!' అని నిరాశ పడ్డాడు శివరామ్.

"జానకీ! మనకి తిండానికి గింజలెలాగూ లేవు. మన బిడ్డలకైనా ఇన్ని గంజినీళ్ళుంటే బాగుండు. ఏం పాపం చేసుకున్నామో గానీ, తెల్సీ ఏ పాపమూ చెయ్యొద్దు. పసివాళ్ళ కడుపులు మాడ్చి హింసించవద్దు. మన కావడికి రెండు వేపులా కష్టాలే ఉంటాయని ఇన్నాళ్ళూ తెలుసుకోలేక పోయాను. పిల్లలు ఆఖరిసారి కడుపు నిండా తిని ఎన్నాళ్ళయిందో నాకు గుర్తులేదు. నాకింకెక్కడా పని దొరికేలా లేదు. ఎవరికి నాకు పని ఇచ్చే విశాల హృదయమూ లేదు. అందుకే మనం ఇంత విషం తిని ఒక్కసారే చచ్చిపోదాం! ఈ కష్టాలుండవు!"

జానకి భర్తనోరు నొక్కేసింది.

"మీరిలా అనకండి ఇల్లు లేకపోయినా బతకొచ్చు తిండి లేకపోయినా బతకొచ్చు. కానీ ధైర్యం లేకపోతే బతకలేం. మీలో చిత్ర కారుడింకా చావలేదు. మీకు తప్పకుండా పని దొరుకుతుందనే ఆశ నాలోనూ చావలేదు. నాలుగు రోజులు ఆలస్యమైనా మీకు పని దొరక్కపోదు. మీరు అధైర్యపడకండి!" అని పరీక్షల్లో తప్పి నీరు గారిపోయిన కొడుక్కి ధైర్యం చెప్పిన తల్లిలాగ నచ్చచెప్పింది జానకి.

ఆలోచిస్తూ పొట్టిగా ఉన్న నులకమంచం మీద కాలు చాపుకొని పడుకున్నాడు

శివరామ్. మనిషి పొడవు కావటాన మంచం చివర కాళ్ళు సగం గాల్లోనే ఉన్నాయి. చాలీ చాలని పాడె మీద పడుకోబెట్టిన దిక్కుమాలిన శవంలా ఉన్నాడు శివరాం.

"మీరిలా దిగులుపడుతూ, బతుకుని తిట్టుకుంటూ పడుకుంటే లాభం లేదు. తిట్లకి తిండి దొరకదు. పడుకుంటే పని దొరకదు. లేచి వెళ్ళండి!" అంటూ పురిగొల్పింది జానకి.

శివరామ్ లేచి కూర్చున్నాడు.

పని ఇచ్చినవాడి పాదాలు పూజించేందుకు ఇవ్వనివాడి పళ్ళు రాలగొట్టేందుకు సిద్ధపడిన వాడిలా బైటికి బైలుదేరాడు శివరామ్.

ఏ వ్యాపకమూ లేకపోతే ఆకలి గుర్తొస్తుంది. అందుకే వీధిలో కెళ్ళి ఆడుకోమని పిల్లల్ని పంపేసింది జానకి.

మధ్యాహ్నం వరకూ మట్టిలో ఆడుకున్న పిల్లలికి ఆకలి గుర్తొచ్చి ఇంట్లోకి పరుగెత్తుకొచ్చారు. బట్టలన్నీ మట్టి కొట్టుకుపోయిన పిల్లలు ఒకసారి పాతి తీసేసిన పిల్ల శవాల్లా ఉన్నారు.

బతికొచ్చిన కన్నబిడ్డల్ని చూసి ఆశ్చర్యపోయిన తల్లిలా కాకుండా - తనను పీక్కు తినడానికి వచ్చిన పిల్ల భూతాల్ని చూసినట్టు భయపడింది జానకి.

"అమ్మా! అన్నం" అని వాళ్ళు అడక్కముందే ఎక్కడో పెట్టె అడుగున పెట్టేసి మర్చిపోయిన సత్తుపావలా బిళ్ళతీసి ఇచ్చింది. బిస్కెట్లు కొనుక్కు తిని ఆడుకోమని మభ్యపెట్టి పిల్లల్ని మళ్ళీ వీధిలోకి పంపేసింది జానకి.

సాయంత్రమైనా శివరామ్ రాలేదు.

జానక్కి జీరో మీదకి ముల్లు వస్తోన్న టైంబాంబుని చూస్తున్నట్టు ఆందోళనగా ఉంది

'ఆడుకోడానికి వీధిలోకి వెళ్ళిన పిల్లలు ఇంటికి చేరకముందే - ఉద్యోగం ఆడుక్కోడానికి ఊళ్ళోకి వెళ్ళిన భర్త ఉద్యోగం దొరికిందనే వార్తతో తిరిగొస్తే ఎంత బాగుండు' అనుకుంది జానకి.

జానకి ఆలోచన్లలోంచి బైటపడింది. పడమటి దిక్కున ఎర్రగా కాలిననిప్పుపళ్ళెంలా ఉన్న సూర్యుడు క్రమక్రమంగా కిందికి దిగిపోతున్నాడు. దాన్ని దాటుకొని విజయగర్వంతో తిరిగి వచ్చిన రాజకుమారుడిలా శివరామ్ వస్తూ కనిపించాడు. అతని ముఖంలో ఆనందం తొణికిసలాడుతోంది. జానకి మనసు కుదుటపడింది.

"జానకీ! నువ్విచ్చిన ధైర్యం నాకు పని దొరికేలా చేసింది. ఒక సైన్‌బోర్డు షెడ్డులో ఆర్టిస్టుగా చేరాను. ఈ వేళ చేసిన పనికి నాకొచ్చిన డబ్బిదిగో! వెంటనే బియ్యం తెచ్చి పిల్లలకి అన్నం వండిపెట్టు!" అంటూ తను తెచ్చిన డబ్బు జానికి చేతిలో పోశాడు. శివరామ్.

జానికి ఆనందానికి హద్దుల్లేవు.

ఆరోజు నుంచీ పిల్లలకి లేదనుకుండా తిండి పెడుతున్నారు. ఒంటి మీద బట్టలుండేలా

చూస్తున్నారు. శివరామ్ జానక్కి చీరలు కూడా కొన్నాడు.

ఆరోజు లలితకి తలారా స్నానం చేయించి, ఉతికిన బట్టలు వేసింది జానకి. రెండు చాక్లెట్లు కొని పిల్లలకి చెరోటి ఇచ్చింది. అప్పటికే శివరామ్ పన్లోకి వెళ్ళిపోయాడు.

పిల్లలిద్దరూ జానక్కి చెప్పి ఆంజనేయస్వామి గుడికి వెళ్ళారు.

గర్భగుడిలోని ఆంజనేయుడి కంటే ఆరోగ్యంగా ఉన్న పూజారి భక్తుల తలమీద శఠగోపం పెట్టి దక్షిణ వేయమన్నట్టు తన చేతిలోని పళ్ళెం ముందుకి చూపుతున్నాడు.

పూజారిని సంతృప్తిపరచకపోతే ఆంజనేయుడికి కోపం వస్తుందేమోననే భీతిలో భక్తులంతా తోచినంత దక్షిణలు పళ్ళెంలో వేస్తున్నారు.

ఎనిమిదేళ్ళ రఘు అప్రయత్నంగా తన నిక్కరు జేబులో చెయ్యి పెట్టాడు.

పదిరోజుల్నించీ జేబులోనే ఉండిపోయిన అమ్మ యిచ్చిన సత్తుపావలా చేతికి తగిలింది. బైటికి తీశాడు.

బాగా చితగ్గొట్టి ఉందది.

కంటి చూపు సరిగా లేని ముసలి దుకాణదారులు తప్పవేరెవరూ ఆ పావలా చెల్లుతుందని సర్టిఫికెట్ ఇవ్వరు.

ఆ పావలాని, పూజారి ముందుకు చాపిన పళ్ళెంలో వేద్దామనుకున్నాడు రఘు.

"అమ్మో! పూజారి తిడతాడు" అనుకుని మళ్ళీ దాన్ని జేబులో పడేసుకున్నాడు రఘు.

రఘు, లలిత గుడి బైటికి వచ్చారు. రోడ్డు దాటి నడుస్తున్నారు.

రోడ్డుకి ఓ పక్క మనుషులు దొంతరలా జనం గుమిగూడి ఉన్నారు. ఇద్దరూ గుంపులో దూరి కుమ్మరి పురుగుల్లా దొలుచుకొని ముందుకి వెళ్ళారు.

గుంపు మధ్య తల వంచుకొని ఓ చింపిరి జుట్టు బిచ్చగాడు రంగు సుద్దలతో రోడ్డుమీద ఆంజనేయుడి బొమ్మ దీక్షగా వేస్తున్నాడు.

ఆ పాదమస్తకం మట్టికొట్టుకు పోయిన ఆ బిచ్చగాడు కదులుతున్న మట్టి బొమ్మలా ఉన్నాడు.

'ప్రాణం వచ్చిన మట్టి బొమ్మ బొమ్మలు వేయటమే కాక ఇంకేం అద్భుతాలు చేస్తుందో చూద్దాం' అని అబ్బురంగా చూస్తున్నట్టు చుట్టూ మూగారు జనం.

ఎప్పటికీ పూర్తవని బొమ్మకి ఇంకా రంగులు దిద్దుతున్నాడు బిచ్చగాడు.

బొమ్మ పూర్తవగానే ఆ ఆంజనేయుడికి ప్రాణం వచ్చి, ఆ బిచ్చగాడికి ప్రణామం చేసేందుకు సిద్ధపడేతంత అద్భుతంగా ఉందా బొమ్మ.

అందరూ ఆ బొమ్మని మెచ్చుకొంటూ తమకు తోచిన డబ్బులు బొమ్మ మీదికి విసురుతున్నారు. డబ్బంటే ఏమిటో తెలియని వాడిలా ఆ బిచ్చగాడు అక్కడ పడిన నాణేలను పట్టించుకోకుండా బొమ్మ వేయడంలో నిమగ్నమై ఉన్నాడు.

రఘుకి, లతకి ఆ బొమ్మ బాగా నచ్చింది.

'ఎంత బాగా వేశాడో!' అనుకున్నారు. అందరూ బొమ్మ మీదకి నాణేలు విసురుతుంటే

తనకు కూడ వేయాలనిపించింది.

రఘు జేబులో చెయ్యి పెట్టాడు. మళ్ళీ ఆ సత్తుపావలా తగిలింది.

వెనకా ముందు ఆలోచించకుండా దాన్ని బొమ్మ మీదకి విసిరాడు. బిచ్చగాడు పట్టించుకోలేదు మళ్ళీ ఎవరైనా గమనిస్తే తిడతారేమో! "లలితా! రా...వెళ్దాం!" అంటూ అక్కణ్ణుంచి గబగబా వచ్చేశాడు రఘు.

ఇంటికెళ్ళాక అమ్మతో చెప్పాడు రఘు "అమ్మా! ఆ రోజు బిస్కెట్లు కొనుక్కోమని నువ్విచ్చిన సత్తుపావలా బొమ్మలేసే బిచ్చగాడికి వేసేశా!"

"భలే వాడివిరా! నీకు ఆ బొమ్మ నచ్చితే మాత్రం సత్తు పావలా వేస్తావా? నీకు చెల్లని ఆ పావలా ఆ బిచ్చగాడికి మాత్రం చెల్లుతుందా!" అని మందలించింది తల్లి.

"ఆ పావలా మాకెలా చెల్లుతుందని ఇచ్చావ్?" అని రఘు అమ్మనడగలేదు.

"గొప్పవాడైనా బిచ్చగాడైనా కళాకారుడు కళాకారుడే! వాళ్ళని అవమానించకూడదు. మీ నాన్నకి తెలిస్తే తిడతారు. ఆయనతో చెప్పకు! " అంది జానకి.

ఆ రోజు రాత్రి పొద్దుపోయాక వచ్చాడు శివరామ్ ఆ రోజు ఎగ్స్ట్రా వర్క్ చేసినందుకు ఓవర్‌టైమ్ డబ్బుకూడా వచ్చింది.

పిల్లలికి స్వీట్స్ తెచ్చాడు.

అలా ఓవర్ టైమ్ చేసిన రోజు శివరామ్ పిల్లలకి తలో పావలా, అర్ధా ఇస్తాడు. పిల్లల్ని దగ్గరికి పిలిచాడు.

లలితకో పావలా రఘుకో పావలా ఇచ్చాడు శివరాం.

తండ్రి తన చేతిలో పెట్టిన పావలాని చూసి రఘు షాక్ తిన్నాడు.

అది....అది...ఆపావలాయే!

తను రోడ్డుమీద ఆంజనేయుడి బొమ్మ వేసిన బిచ్చగాడికి వేసిన సత్తుపావలా!

ఏనాడూ తండ్రి చేతిని గమనించలేదు రఘు. పావలాని తనకి ఇస్తున్నప్పుడే గమనించాడు – శివరామ్ కుడిచేతి మధ్య వేలికి వెడల్పాటి రాగి ఉంగరం.

రోడ్డుమీద తల వంచుకొని బొమ్మ వేస్తున్న చింపిరి జుట్టు బిచ్చగాడి కుడి చేతి మధ్య వేలికి కూడా అదే రాగి ఉంగరాన్నిచూశాడు!!

**మా ఫ్యామిలీ డాక్టర్, జూలై '94.**

# ఎంతెంత దూరం

## వేదగిరి రాంబాబు

బస్ వేగంగా పోతోంది. అటు ఇటు ఏపుగా పెరిగిన సర్వీతోటలు చూడ్డానికెంతో సరదాగా వున్నాయ్. మధ్య మధ్యలో మామిడితోటలు, ప్రతిమైలు, మైలున్నరకీ వూరు - అందులో ప్రభుత్వం కట్టించి ఇచ్చిన ఇళ్ళు ముచ్చటగా కనబడుతున్నాయ్. ఉప్పెన బాధితులకోసం కట్టిన ఇళ్ళవి.

రాన్రాను తోటలు తగ్గిపోయినై. అన్నీ ఖాళీ ప్రదేశాలే!

ఓ చిన్న వూళ్ళో ఆగింది బస్.

వెంటనే సోడాల వాళ్ళు చుట్టుముట్టేశారా బస్‌ని.

సోడా త్రాగమని భవానిని బ్రతిమలాడసాగాడో కుర్రాడు. ఆమె వద్దని ఎంత చెప్పినా వినడంలేదు!

వాణ్ణి చూస్తుంటే జాలేసింది భవానికి. నిండా ఎనిమిదేళ్ళుకూడా వుండవేమో... అప్పుడే వాడి జీవితం రోడ్డున పడిపోయింది. వాడి బ్రతుకు వాడు బ్రతకాల్సివచ్చింది.

"ఇదిగో ఈ పావలా తీసుకో. నాకు సోడా వద్దులే." వాడికి పావలా అందిస్తూ అంది భవాని.

వాడు తీసుకోడానికి సంశయించాడు. తనని అవమానపరుస్తున్నట్టు అనిపించింది కాబోలు - "వద్దండీ" అన్నాడు వెనక్కి తగ్గుతూ.

"పరవాలేదు తీసుకో...."

"ఊహూ మీరు సోడా తీసుకోండి..."

ఇక లాభంలేదనుకుని ఓ సోడా అందుకొని, తాగి, పావలా వాడి చేతిలో పెట్టిందామె వాడు తిరిగి చిల్లరివ్వబోతే "వద్దులే! వుంచేసుకో అంది. సంతోషంగా వెళ్ళిపోయాడక్కణ్ణించి.

బస్ మళ్ళీ బయల్దేరింది

టైమ్ చూసుకొంది భవాని. మధ్యాహ్నం పన్నెండవుతోంది.

ఇంకా అరగంట ప్రయాణం. అంతే! ఆ తర్వాత బస్ దిగి కొంచెం నడక. బహుశా తాతయ్య బండి పంపుతాడేమో బస్ దిగేచోటికి. అసలు తనిచ్చిన టెలిగ్రామ్ అందిందో

లేదో! చాలా కాలం తర్వాత వస్తోందీవూరికి తను. ఉప్పెన కి ప్రాంతమంతా అల్లకల్లోలమై పోయిందని తెలిసినరోజునుంచీ ఆవూరు ఎలా వుందో చూడాలనే కోరిక తనని తినేస్తోంది. ఆ రోజునుంచీ శలవు కోసం ప్రయత్నిస్తూనే వుంది. కానీ ఇన్నాళ్ళకుగానీ శలవు దొరకలేదు. అయితే భర్తతో కలిసి ప్రయాణం చేయాలన్న తన కోరిక నెరవేరనే లేదు. శలవు దొరకటం తనకన్నా ఆయనకి మరింత కష్టం. అందుకే వంటరిగానే బయల్దేరాల్సి వచ్చింది తను.

ఎక్కడ ఢిల్లీ ఎక్కడ దివిసీమ? గత ముప్పై గంటలుగా ప్రయాణం చేస్తున్నా తాతయ్య వాళ్ళవూరికి చేరుకోలేకపోతోంది తను.

బస్ ఆగింది. ఆలోచనల్లోంచి బయట పడి తనుదిగాల్సిన చోటదేనని గ్రహించి త్వరత్వరగా తన సూట్ కేస్ తీసుకుని బస్ దిగింది భవాని.

ఆమె వూహించిన విధంగా బండేమీ లేదక్కడ. ఆమూలకిళ్ళీ కొట్టువుండాలి, ఏమైంది? చుట్టూ చూసింది భవాని.

ఎటుచూసినా మైదానమే కనబడుతోంది. అప్పటికీ, ఇప్పటికీ ఎంత తేడా! ఎటుచూసినా పచ్చటి పైరులతో కళకళలాడే ఆనాటి దృశ్యాలకూ మైదానంలా కనబడే ఈ నాటి దృశ్యాలకూ – ఎంతో దారుణమైన తేడా!

"ఎక్కడికెళ్ళాలమ్మా?" తనతోపాటే బస్ దిగిన ముసలమ్మ మాట్లాడేసరికి ఆలోచనల్లోంచి బయటపడింది భవాని.

అప్పటికే బస్ దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయింది. ఆ చుట్టు పక్కల ఎక్కడా జన సంచారం లేదు. అది వరకు ఇలా వుండేదా? ఈ బస్ స్టాప్ దగ్గర ఎంత కళకళ లాడుతుండేది? కిళ్ళీ బడ్డీ, దానిముందు నాలుగు పొడుగాటి బెంచీలు, పైన తడికలతో పందిరీ, అక్కడ విశ్రాంతి తీసుకుంటూ బస్ కోసం ఎదురుచూసేజనం, రోడ్ల వెంబడి ఎప్పుడూ వచ్చేపోయే సైకిళ్ళు, రిక్షాలు, బళ్ళూ–అవన్నీ ఏమైపోయినై? ఆ జనమంతా ఏమై పోయినట్లు? తను వెళ్ళాల్సిన చోటు చెప్పింది. భవానీ.

"మాదీ ఆ వూరేనమ్మ. ఎవరింటికి వెళ్ళాలి?" తిరిగి అడిగిందా ముసలమ్మ.

"పూర్ణచంద్రరావు గారింటికి...'

అలాగామ్మా. మారాజు చేతులెత్తి దణ్ణంపెట్టాలి.... ఉప్పెనలో వూళ్ళో సగం మందిని ఆయనే రక్షించాడు. దేవుడమ్మా, మనిషికాదాయన... పదమ్మా. ఆపెట్టె ఇటివ్వు నేను మోస్తాను." ఆప్యాయత పొంగిపోతుండగా అందా ముసలమ్మ.

"వద్దులే అవ్వా... నువ్వు మోయలేవు, మా తాతయ్య బండి పంపుతాడే మోనని ఎదురు చూస్తున్నాను...." ఆ రోడ్డువేపే చూస్తూ అంది భవాని.

"బండెక్కడిదమ్మా ఆయనకు – అన్నీ వుప్పెనలో కొట్టుకుపోయాయిగా! ఆయన బండి, ఎద్దులు, గేదె – ఒక్కటేవిటి? సర్వనాశనం అయిపోయింది గదమ్మా! అసలది వూరుకాదమ్మ స్మశానం! మమకారం చంపుకోలేక ఇక్కడే పడివున్నాం. అంతే...."దిగులుగా అందామె.

"బండి లేకపోయినా తాతయ్య ఎవర్నైనా పంపించేవాడేనే! ఒకవేళ టెలిగ్రామ్

అందలేదేమో!' ఆ ఆలోచన రాగానే గుండెలు జల్లుమన్నాయి ఆమెకి. ఒక్కర్తే ఇల్లా దిక్కూ దివాణం లేని ప్రదేశంలో ఎదురుచూడడంకంటే ఈ ముసలామెతోపాటు వెళ్ళడమే మంచిది.

"పదవ్వా వెళ్దాం..." ముందుకు బయల్దేరుతూ అంది భవాని.

భవాని, పక్కనే ముసలవ్వ.... నడుస్తున్నారు.

ఉప్పెన గురించి కళ్ళకి కట్టినట్లు భవానికి చెప్పసాగింది ముసలవ్వ.

"హోరుగాలి, వర్షం...పొద్దుగూకే సరికి మా అందరికీ అనుమానం వచ్చేసిందమ్మా, సముద్రపు హోరు అంత పెద్దగా అంతకు ముందెప్పుడూ విన్లేదు. మేం అనుకొంటుండగానే నీళ్లు ఎక్కువై పోతున్నాయ్. వర్షంనీళ్ళు అంత ఎక్కువగా ఎలా వస్తాయి అన్న అనుమానంతో ఆ నీళ్ళని నోట్లో పోసుకుని చూశాం. ఉప్పగా వున్నాయ్. గుండెలు బాదుకుంటూ అందరం కల్సి వూళ్ళో వున్న రెండేరెండు డాబాల్లోకి చేరుకున్నాం. మేమంతా పూర్ణచంద్రరావు గారింటికి వెళ్ళాం. అందరండాబామెట్ల గదిలో తలదాచుకున్నాం. ఆ రాత్రి కాళరాత్రే అయింది మాకు. ఆ ఉప్పెన కెరటాల్లో కొట్టుకు పోతున్న ఇళ్లు, పశువులు, మనుషులు- మా ప్రాణాలమీద భయం ఓ వేపు, ఎదురుగా పోతున్న ప్రాణాలమీద జాలి, దుఃఖం మరోవేపు! రెండురోజుల తర్వాతగాని ఆ గదిలోంచి బయటికి రాలేకపోయాం. ఆ రెండురోజులూ మమ్మల్ని ఆ పూర్ణచంద్రరావు బాబే ఆదుకున్నాడు. తిండి పెట్టాడు. కట్టుకోడానికి బట్టలిచ్చాడు ఆ తర్వాత చూస్తే ఏముందీ? ఊళ్ళో సగానికి సగం కూడా మిగల్లేదు. ఒక్కొక్కర్ని తలచుకొని ఏడ్వడంకన్నా చేయగలిగిందేముంది....? " ఇంక ఆమెమాట్లాడలేకపోయింది. మధ్య మధ్యలో సూట్ కేస్ చేతులు మార్చుకుంటూ నడుస్తోంది భవాని.

"అదుగో వచ్చేశాం. పాపం! ఆ పెట్టెను మొయ్యలేక మోస్తున్నావ్..." జాలిపడుతూ అంది ముసలమ్మ.

దూరంగా తాతయ్యవాళ్ళ డాబా కనబడుతూనే వుంది. దాని ముందు వరుసగా వున్న తాడిచెట్లు, మరోపక్క మామిడిచెట్లు, వెనకవేపు కొబ్బరి చెట్లు-- అన్నీ పడిపోయాయ్. ఊరంతా అదివరకులా కళకళలాడుతూ లేదు. దూరంగా ఓ వరుసలో కొత్తగా కట్టిన ఇళ్ళు ఒకే నమూనాలో కనబడుతున్నాయ్.

ఇద్దరూ డాబాదగ్గరకు చేరుకున్నారు.

తాతయ్య అరుగుమీద కూర్చుని తాడు అల్లుతున్నాడు.

"బాబుగారూ...మీ మనమరాలు వచ్చారు..." సంబరంగా చెప్పింది ముసలమ్మ.

ఆయన ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు. భవానిని చూడగానే ఆయన మొహం ఆనందంతో వెలిగిపోయింది.

"ఒక్కదానివే వచ్చావా? ఆమె చేతిలోవున్న సూట్‌కేస్‌వంక చూస్తూ అడిగాడు.

"అవును! ఆయనకు శలవు దొరకలేదు. ఇద్దరికీ ఒకేసారి శలవు దొరికిరావాలంటే ఇంకెన్ని రోజులు పడుతుందోనని ముందునేనే వచ్చేశాను..."

"పదమ్మా లోపలి కెళ్దాం...." భవాని ఆయనవెంట లోపలికి నడిచింది. పెరట్లో

నూతి దగ్గర బట్టలు వుతుకుతూ అమ్మమ్మ కనిపించింది.

"అమ్మమ్మా...."గడప దగ్గరే నిలబడి గట్టిగా అరిచింది భవాని.

"ఎప్పుడొచ్చావ్ తల్లీ..." చేతిలో పనిని వదిలి పెట్టి, ఆదరంగా భవాని దగ్గరకొచ్చి చేతులు పట్టుకొందామె.

"ఇప్పుడే, సరాసరి ఢిల్లీనుంచి వస్తున్నాను. ముందు నిన్నూ తాతయ్యను చూసిగాని అమ్మా వాళ్ళ దగ్గరకు వెళ్ళకూడదనుకున్నాను." నవ్వుతూ అంది భవాని.

ఆ తర్వాత ముగ్గురూ కల్సి కబుర్లలో మునిగి పోయారు. ఉప్పెన గురించి వాళ్ళు కళ్ళకు కట్టినట్లు చెబుతున్న మాటలు వింటుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది భవానికి. మాటల మధ్యలో మామిడితోట కూడా పూర్తిగా, నాశనమై పోయినట్లు చెప్పాడు తాతయ్య.

ఆ మాటలు విన్న భవాని వులిక్కిపడింది!

వెంటనే మురళి గుర్తుకొచ్చాడు.

"అతనింకా ఈ వూళ్ళోనేవున్నాడా? ఏంచేస్తున్నాడిప్పుడు? అతనికి పెళ్ళయిందా?" రకరకాల ఆలోచన్లు ఆమెలో సుళ్ళు తిరగసాగాయ్.

"మరి, మాకు మనవరాల్ని ఎప్పుడిస్తావే?" హఠాత్తుగా అమ్మమ్మ అడిగిన ప్రశ్నకు తుళ్ళిపడింది భవానీ.

అదే ప్రశ్నని, మళ్ళీ అడిగింది అమ్మమ్మ.

భవాని సిగ్గుపడిపోయింది. కొంచెం బాధకూడా కలిగిందామెకి. తనకి పిల్లలు పుట్టరని అమ్మమ్మతో ఎలా చెప్పేది? జవాబు చెప్పకుండా నవ్వి వూరుకుందామె.

మధ్యాహ్నం భోజనాలయ్యాక "నేనలా వూళ్ళో ఓ రౌండ్ వేసొస్తాను..." అని చెప్పి బయల్దేరింది భవాని.

అప్పటికింకా ఎండ తీక్షణత తగ్గనే లేదు. త్వరత్వరగా మురళీ వాళ్ళింటివేపు అడుగులు వేయసాగిందామె.

అక్కడ వాళ్ళ పాక కనిపించలేదు, కొత్తగా కట్టిన ఏ ఇంట్లోనైనా వుండి వుంటారు. ఎవర్నడగాలా విషయం? ఆమె కేమీ పాలుపోవడంలేదు. ఆ ఇళ్ళ ముందునించీ నడూస్తూంటే అందరూ ఆమె వంక విచిత్రంగా చూస్తున్నారు.

అవును! తననెవరు గుర్తించగల్రు? పదేళ్ళు దాటిపోయింది. ఈవూరు వచ్చి. అంతకు ముందు ప్రతీ సంవత్సరం వేసవి సెలవుల్లో అక్కడకు రావలసిందే. రెండు నెలలూ అక్కడ ఆనందంగా గడిపి తిరిగి తమవూరికి చేరుకోవలసిందే.

మొట్టమొదటిసారిగా ఆ వూరు వచ్చినప్పుడే తనకి మురళితో పరిచయమైంది. తమ పక్కింటి పిల్ల వనజ తను మామిడితోటలో వున్న ఇసుకలో ఆడుకుంటున్నారారోజు తన దోసిట నిండా ఇసుకపోసి వనజ తన కళ్లు మూసి, ఎక్కడెక్కడికో తిప్పి, ఇసుక ఓ చోట పోయించి మళ్ళీ వెనక్కి తీసుకొచ్చి వదిలేసేది. తను ఆ ఇసుక ఎక్కడ పోసింది వెదికి అందులోవుంచిన పిన్నీసుని తీసుకురావాలి.

"నేను ఆడద్దా?" కాసేపు నించొని చూశాక అడిగాడు మురళి. అతని వంటిమీద

చొక్కాలేదు. చిన్న నిక్కరు. దాని మీద మొలత్రాడు...

"ఆడనిద్దామా?" వనజనడిగింది తను.

"పోనీలే ఆడనిద్దాం..." వనజ అంగీకరించింది.

రెండురోజుల్లోనే ముగ్గురికీ మంచి స్నేహమై పోయింది. శలవులు ముగియగానే తను వెళ్ళిపోతూంటే తనతో పాటు బస్టాప్‌వరకు వచ్చాడతను తను బస్సు ఎక్కి కూర్చుంటే, అతను దిగులుగా చూసిన చూపులు ఇప్పటికీ తనకి గుర్తుంది!

ఆ తర్వాత శలవుల్లో తనా వూరు చేరుకునేసరికి అతనెంత సంతోషించాడో! ఆ రోజంతా తనని వదలకుండా కబుర్లు చెబుతూనే గడిపాడు.

నాలుగైదేళ్లు గడిచిపోయినై. రెండు సంవత్సరాలుగా అతను కనిపించడం మానేశాడు. చల్లపల్లి షుగర్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న తన బావ దగ్గరుండి, ఏదో కూలిపని చేసుకుంటున్నాడని వనజ చెప్పింది.

ఆ ఏడు తనువెళ్ళేసరికి వనజ కూడా కనిపించలేదు. విజయవాడలో వుంటున్న వాళ్ళ మావయ్య వాళ్ళింట్లో వుండి చదువుకుంటోందని తెలిసింది. చాలా నిరుత్సాహం కలిగింది. వనజ మురళి కూడా లేకుంటే ఇంక తనకా వూరుమీద ఏం ఆసక్తి వుంటుంది?

ఆ రోజు మధ్యాహ్నం వంటరిగానే మామిడి తోటకు వెళ్ళింది తను. ఆతోట చివరే మురళి ఇల్లు.

తన నెప్పుడు చూశాడో పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతన్ని చూడగానే తనూ ఆనందంతో పొంగిపోయింది.

"నువ్వెప్పుడొచ్చావ్?" అడిగింది తను

"ఇందాక. నువ్విప్పుడీవూరు వస్తావని తెలుసు... నువ్వెన్నాళ్ళయిందీ వచ్చి?" ఆనందంగా అడిగాడు.

వారం రోజులైంది.

ఇద్దరూ ఒకర్నొకరు చూసుకుంటూ కొన్ని క్షణాలు మౌనంగా వుండిపోయారు. అతన్లో చాలా మార్పు కనిపించింది తనకి. కొంచెం పొడుగయ్యాడు. అదివరకటిలా సన్నగా లేడు. ఇప్పుడు చొక్కా తొడుగుతున్నాడు. అక్కడక్కడా అతుకులున్నా బాగానే వుందా చొక్క.

"ఆడుకుందామా?" అడిగాడతను.

మొదటిసారిగా ఎందుకో సంకోచం కలిగింది తనకి.

"వనజకూడా వుంటే బాగుండేది కదూ?" అన్నాడతను,

"ఊ...."

"పద ఆడదాం...." ఆమె చేయి పట్టుకొని లాగాడతను. అతన్తోపాటు నడిచింది తను తన దోసిట్లో ఇసుకపోశాడు.

"కళ్ళు మూసుకో..."

తను కళ్ళుమూసుకుంది.

అతను చేతులు దులుపుకొని వెనక నించీ తన కళ్ళు మూసాడు. అతను

నడిపించినట్లే నడవసాగింది తను. శరీరమంతా చక్కిలిగిలి పెట్టినట్లనిపిస్తోంది. అతని స్పర్శ తనకి ఓ విధమైన గగుర్పాటుని కలిగిస్తోంది. అది కేవలం తనలో వచ్చిన మార్పే! తనిప్పుడు పెద్దదైంది. అదివరకు తెలీని కొన్ని విషయాలు తనకిప్పుడు తెల్సు. మగ ఆడ తేడాని తనిప్పుడు గమనించగలుగుతోంది. అందుకే అతని స్పర్శకే గగుర్పాటు.

"చేతులు తీసేయ్..." ఇసుక కింద పడేసి బలవంతంగా అతని చేతుల్ని తొలగించేసింది తను.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగాడతను.

అతనికి దూరంగా జరిగి నిలబడింది తను జవాబివ్వకుండానే.

" ఆట వద్దా?" నిరుత్సాహంగా అడిగాడతను.

"ఊహూ...."

"ఏం?"

అతని వంక చూసి చూపులు మరల్చుకొంది. ఏం చెబుతుందతనికి? అతన్ని చూస్తుంటేనే అదోలా వుంది తనకి– తా మిద్దరూ కౌగలించుకోవాలనీ, ఏమేమో చేయాలనీ...

"పోనీ గట్టిగా కళ్ళుమూయన్లే. వదులుగా మూస్తాను" దీనంగా అన్నాడతను. అతన్ని కాదనాలనిపించలేదు తనకి. అతని స్పర్శ మరోసారనుభవించాలనిపిస్తోంది.

"సరే...."

అతను దోసిట్లో ఇసుకపోసి మళ్ళీ కళ్ళుమూశాడు. మళ్ళీ అదే స్పర్శ మెడమీద అతని వేడి వూపిరి....

ఇక భరించలేకపోయింది తను ఇసుకను వదిలేసి చటుక్కున అతనికి అభిముఖంగా తిరిగింది. అతని మెడను చుట్టేసినై తన చేతులు. గాఢంగా అతన్ని గుండెలకు హత్తుకుంది అతను వుక్కిరిబిక్కిరై పోయాడు. అతన్లో కూడా చలనం వచ్చింది. తనని మరింత గట్టిగా అదుముకున్నాడు. ఆ తర్వాత ఇద్దరకూ ఏంచేయాలో తెలీలేదు. హఠాత్తుగా తనకి భయి వేసింది. ఏదో చెయ్యరాని పని చేస్తున్నట్టు భావన

"ఇంక వెళ్తాను..." అతన్ని దూరంగా తోసేసి ఇంటివైపు పరుగెత్తింది తను ఆ రోజంతా మళ్ళీ తోటవేపు వెళ్ళకుండానే గడిపింది.

మర్నాడుకూడా అతనికి కనబడాలంటే సిగ్గువేసింది. అయినా కోరికను చంపుకోలేక మళ్ళీ మామిడి తోటను చేరుకుంది. మళ్ళీ అతని స్పర్శకోసం తన శరీరం రగిలిపోతోంది. ఎంతసేపు చూసినా అతని జాడేలేదు.

ఉండబట్టలేక అతనింటివేపు నడిచింది తను. అతని తల్లి పాకబయట కూర్చుని బియ్యం ఏరుతోంది.

"మురళీ లేడా?" అడిగిది తను.

ఆమె తలెత్తి చూసింది "లేడుకదమ్మా చెప్పకుండా వచ్చాడని చెప్పి నిన్న సాయంత్రమే వాళ్ళ బావ వచ్చి, తీసుకెళ్ళాడు..."

కళ్ళవెంట నీళ్లుతిరిగాయ్ తనకి.

"మళ్ళీ ఎప్పుడొస్తాడు?"

"ఇప్పుడిప్పుడే రాడు..."

వెనక్కి తిరిగి భారంగా నడవసాగింది తను అంతకు ముందురోజు తాము ఆడుకున్నచోట చెట్టుమీద తామిద్దరి పేర్లు చెక్కివున్నాయ్.

భవాని

మురళి

చాలాసేపు అక్కడే నిలబడిపోయింది తను మనసంతా అదోలా అయిపోయింది. ఇంటికి చేరుకొంది. ఆ తర్వాత కొద్దిరోజులు అతి భారంగా గడిచినయ్. రోజూ మధ్యాహ్నం పూట మామిడి తోటకు వెళ్ళడం, కాసేపు తమ పేర్ల వంక చూసుకోడం, తిరిగి రావడం...శలవులు పూర్తికాకుండానే ఆవూరు వదిలేసింది తను. ఆ తర్వాత మళ్ళీ ఆవూరు వెళ్ళడమే కుదరలేదు. తాము వైజాగ్ వెళ్ళడం, కాలేజీలో చేరడం, అక్కడ్నించి తండ్రికి ఢిల్లీ బదిలీ అవడం, అక్కడే తనకు ఉద్యోగం, వివాహం ఇన్ని సంవత్సరాలు గడిచినా తను మరిచిపోలేదు. అతని స్పర్శ తననింకా అంటిపెట్టుకునే వుంది. అతని ఊపిరి తనకి అప్పుడప్పుడూ చక్కిలిగిలి కలిగిస్తూనే వుంటుంది.

మామిడి తోటలోకొచ్చింది భవాని

అందులో చెట్లు చాలాభాగం పడిపోయినై తోట బోసిగా కనబడుతోందిత్వరత్వరగా తమ పేర్లువున్న చెట్లదగ్గరకు నడిచింది అస్పష్టంగా కనబడుతున్నాయ్ అక్షరాలు 'భవాని' మాత్రమే వుంది 'మురళి' పూర్తిగా చెరిగి పోయింది.

ఆ పక్కనే కూర్చుని ఆడుకుంటున్న నాలుగేళ్ళ పిల్ల దగ్గరకు నడిచింది భవాని. ఆ పిల్ల ఇసుకులో పిన్నీసుని పెట్టి ఆ ఇసుకను అటుఇటు కలిపేస్తోంది. ఎన్నో ఏళ్ళక్రితం తను, మురళి, వనజ ఇక్కడే - ఇలానే ఆడుకున్నారు.

"ఏయ్ పాపా ! నీ పేరేంటి?" అడిగింది భవాని.

"చాం....త..."

"శాంతా! అబ్బా భలేవుందే నీ పేరు మీ ఇల్లేది?"

"అదుగో..."కాలనీ చివరలోవున్న ఇంటివేపు చూపుతూ అందా అమ్మాయి. ఆపాప కళ్ళని చూసేసరికి వళ్ళు ఝల్లుమంది భవానికి.

"మీ నాన్న పేరేంటి?" అడిగింది ఆత్రుతగా.

"నాన్నా...."

భవానికి అంత ఆత్రంలోనే నవ్వొచ్చింది.

సందేహంలేదు. మురళీ కూతురే!

"నాతో వచ్చేస్తావా మా ఇంటికి వెళ్దాం " అడిగింది పాపని.

"లాను..."

"ఎందుకని?"

"నేనిక్కలే ఆడుకుంటాను."

"పోనీ నేను కూడా ఆడనా?"

"ఊ..."

ఆపాప దోసిటనిండా ఇసుకపోసింది భవాని కళ్ళుమూసింది. ఇద్దరూ ముందుకు నడుస్తుంటే ఎదురొచ్చిన వృద్ధురాలు ఆశ్చర్యపోయింది. ఆమెను చూసి పాపను వదిలేసింది భవాని.

"దీనికెప్పుడూ ఆటలేనమ్మా, నన్ను చంపేస్తుంది. ఆ కళ్ళుమూసే ఆట ఆడదామని. దీంతోపాటు నేనెక్కడ ఆడను చెప్పు..."నవుతూ అందామె.

ఆమెను అతి కష్టం మీద గుర్తు పట్టింది భవాని. మొహం మీదున్న ఆ మచ్చేగుర్తు. ఆమె మురళీ తల్లి.

"ఈ పాప ఎవరు?" అడిగింది భవానీ.

"నా మనమరాలమ్మా. దానికి నేను, నాకది మిగిలాం చివరికి...." దీనంగా అంది ముసలామె.

"మురళీ కూతురుకదా ఈ పిల్ల?"

"అవునమ్మా... దీన్ని నా కొదిలి వాడు కోడలు పైకెళ్లిపోయారు" కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అందామె,

భవాని గుండెలు వేగగా కొట్టుకోసాగాయ్.

"ఏం జరిగింది మామ్మా! ఏమైంది వాళ్ళకి?"

"అందరికీ ఏం జరిగిందో వాళ్ళకీ అదే జరిగిందమ్మా! ఉప్పెన పొట్టనబెట్టుకుంది" భవాని నిశ్చేష్టురాలై నిలబడిపోయింది.

అంటే మురళిని తను శాశ్వతంగా చూడలేదన్నమాట! తనకి శాశ్వతంగా అతను దూరమై పోయాడు!

కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయ్ ఆమెకి. మరొకసారి అతన్ని చూడాలన్న తన కోరిక సమాధి అయిపోయినట్లేనా?

"ఆలుకుందాం..." భవానిని చీర పట్టుకుని లాగిందాపిల్ల.

హఠాత్తుగా వచ్చిన ఆ ఆలోచన భవానిని కదిలించి వేసింది. అవును తను. ఈ పిల్లను తీసుకుంటే...

"మామ్మా ఈ పిల్లను నాకిచ్చేస్తావా?" ఆశగా అడిగింది.

వృద్ధురాలు ఆశ్చర్యపోయింది.

"నువ్వెరమ్మా?" అడిగింది.

"పూర్ణచంద్రరావుగారి మనుమరాల్ని. నాకు పిల్లలు లేరు. నీకు ఇష్టమైతే ఈ పాపను పెంచుకుంటాను నీకూ నెల నెలా కొంత డబ్బు పంపుతాను..."

ఆ మాట వినేసరికి ముసలామె మొహం ఆనందంతో వెలిగిపోయింది. "మాతల్లి. తీసుకెళ్ళమ్మా. నీ దగ్గరై నా ఇది కూటికీ, గుడ్డకీ లోటు లేకుండా పెరిగితే నా కదే చాలు..."

భవాని సంతోషంపట్టలేక ఆ పాపను అమాంతం ఎత్తుకుని ముద్దులు కురిపించేయ సాగింది.

అవును! ఈ మురళిని శాశ్వతంగా తనింట్లోనే వుంచేసుకుంటుంది...!

**స్వాతి మాసపత్రిక, జూన్ 1980**

# అనంతం

## శంకరమంచి పార్థసారధి

మధ్యాహ్నం ఒంటిగంట అయింది. ఆఫీసులో విరామ సమయం. సెక్షన్లో వాళ్ళంతా జట్లు జట్లుగా కాఫీలకంటూ వెళ్ళిపోగా, అనంతంగారు ఒక్కరూ మిగిలిపోయేరు. ఆయన పూర్తిపేరు అనంత పద్మనాభస్వామి. కాని ఇంటా బయటా అంతా అనంతంగారంటారు. భార్య అన్నపూర్ణ ప్రతిరోజూ బలవంతాన ఇచ్చి పంపించే టిఫిన్ డబ్బా ఎదురుగా టేబిల్ పైనే ఉంది. 'ప్రతి విషయానికీ బాధపడి ఆరోగ్యం పాడుచేసుకోకండి .. ఆరోగ్యం ఉంటే అన్నీ ఉన్నట్టే.. మీ కిష్టమని ఇవ్వాళ బొబ్బట్లు చేసి పెట్టాను. తప్పకుండా తినండి..'

అనంతంగారు స్టీలు డబ్బావంక చూసి  భార్యని తల్చుకుని జాలిగా నవ్వేరు.

అన్నపూర్ణ! వొట్టి పిచ్చిది... సుఖం తెలీని బతుకు. ఉదయం నించి రాత్రిదాకా యంత్రం లాగ తిరుగుతూ అందరికీ అన్నీ వేళ ప్రకారం అమర్చి పెట్టి అలిసి సొలసిపోయి తినీ, తినక కటిక నేలపైన పడుకుని నిద్రపోతుంది. తెల్లవారితే మళ్ళీమొదలు. గత ముప్పయి ఏళ్ళుగా జరుగుతున్న కార్యక్రమం. ఎప్పుడన్నా తాను "పూర్ణా ఆడవాళ్ళకి ఎన్నో కోర్కెలుంటాయంటారు. వాటిని తీర్చుకోటానికి మొగుళ్ళని అనేక విధాల రాపాడుతుంటారని విన్నాను. కాని నువు ఏనాడూ నాకిది కావాలని అడిగినట్లు నాకు గుర్తులేదు. కారణం!" అనడిగితే, ఆమె తన వంక కోపంగా చూసి, ఆప్యాయంగా నవ్వుతూ "దానికి పెద్ద కారణం అంటూ ఏం వుంటుందండీ? మీరు పగలంతా ఆఫీసులో కష్టపడి పన్జేసి ఇంటికి తిరిగొచ్చేసరికి మీకు ఏంకావాలో, మీ శరీరానికి మనసుకి విశ్రాంతి ఏ విధంగా కలగజేయాలో ఆలోచనే తప్ప...నాకు అదేమిటో వేరే ఆలోచన రాదు. నెల తిరిగేసరికి జీతం మొత్తం తెచ్చి ఇంట్లోనే ఇస్తారు. మీకు చెడు అలవాట్లు ఏంలేవు. మనకి ఆధారం కేవలం మీ జీతమే అయినపుడు అర్థంలేని కోర్కెలు మనస్సులో కలిగించుకుని మిమ్మల్ని కష్టపెట్టడం నాకిష్టం ఉండదు. ఎంచేతనోగాని మీరు బాధపడుతుంటే నే చూడలేనండీ" అంటుంది భుజానికి తల ఆనిస్తూ..

అనంతానికి దేవుడంటే పీకలదాకా కోపం ఉంది. కారణం తనని దురదృష్టవంతుడిగా పుట్టించాడని అభియోగం. కాని, భార్యని చూసినప్పుడల్లా విధాతపై తన కోపం కాస్త

పటాపంచలయిపోతుంది. తనకి అన్నపూర్ణలాంటి భార్యనిచ్చేడు. తనకింకేంకావాలి? భగవంతుడు మనిషికి అన్నీ ఇచ్చినట్లే ఇచ్చి, ఏదో ఒకటి మాత్రం లోటు చేస్తాడట. ఎక్కడో చదివినట్లు గుర్తు. బహుశా తనంటే ప్రాణం పెట్టే భార్యని ఇచ్చినందువల్లనే సిరిసంపదలు తనకి దూరం చేశాడు. అంటే సిరి సంపదలు, హోదాలు ఇచ్చిన వాళ్ళకి...? ప్చ్...పాపం వాళ్ళెంత దురదృష్టవంతులోగదా!

పాతకాలం చెక్క కుర్చీలో స్థిరనివాసం ఏర్పరచుకున్న ముసలి నల్లి నిద్రలేచి అనంతంగారి శరీరాన్ని చప్పరించి ఎంగిలి పడింది. ఆలోచనల్లో ఉన్న ఆయన తెప్పరిల్లి, తన రక్తం పీల్చి జీవిస్తున్న ఆ నల్లిని కనులారా చూద్దామని కుర్చీలోంచి లేచి పరీక్షగా చూసి, ఫలితం లేక తిరిగి కుర్చీలో ఆసీనుడవుతుండగా, కాఫీ కెళ్ళిన ఒక జట్టు తిరిగొచ్చింది. ఆ జట్టుకి ప్రకాశరావు నాయకుడు.

ప్రకాశరావుకి నలభై ఏళ్ళుంటాయి. ఆఫీసులో జరిగే సంగతులన్నీ తెల్సుకుని వచ్చి కథలు కథలుగా చెప్తుంటాడు. "పక్క సెక్షన్లో పారిజాతం, క్యాష్ సెక్షన్లో ఉన్న ప్రసాద రావుని పెళ్ళి చేసుకుంటోందిట" ఇలాంటి వ్యక్తిగతమైన సంగతులు దగ్గర్నించి రేపు ముగ్గురికి ఆఫీసర్ ప్రమోషన్లొస్తున్నాయి. పై లు జీయమ్మ్గారి సంతకానికెళ్ళింది" లాంటి అతి రహస్యపు సమాచారాన్ని గూడా పట్టుకురాగల సమర్థుడు.. ఆరోజా వస్తూనే.. అనంతంగారూ.. ఇది విన్నారా? మొన్న వొళ్ళు కాల్చుకు చచ్చిపోయిన ప్రసూనాంబ... అదేనండి...నాగేశ్వర్రావు సెక్షన్లో స్టెనోగా ఉండేది.. మొగుడు రోజూ తాగొస్తాడని, అతణ్ణి బెదిరించటానికి వొళ్ళంతా కిర్సనాయిలు పోసుకుని, అంటించుకు హరీ మన్నది... ఆవిడ కొడుక్కి ఇక్కడ ఉద్యోగం ఇచ్చారట. ఇవాళ ఉదయమే జాయినయినాట్ట అంటూ వచ్చి అనంతం పక్క సీటులో కూలబడ్డాడు.

"సంక్షేమ పథకాల్లో ఇదో భాగం కాబోలు. ఉద్యోగి చస్తే వారి కుటుంబంలో ఒకళ్ళకి ఉద్యోగం ఇవ్వటం".. అన్నాడు పీటరు టైపుమిషన్ ముందుకు లాక్కుంటూ.

ప్రకాశరావు కిళ్ళీ నములుతూ గుప్పు గుప్పు సిగరెట్ పొగ వొదుల్తూ..."ఎన్నెన్నో చెప్పండి... ఈ పథకాల్లో నాకయితే అర్థంలేదనిపిస్తుంది. నలభై ఏళ్ళు, ముప్ఫయి ఏళ్ళు గొడ్డు చాకిరీ చేసి రిటైరయిపోతే, ప్రభుత్వం ఇస్తున్నది ముష్టి పెన్షన్. పాతిక ముప్ఫయి వేలు గ్రాట్యుటి. అదే వాడు చచ్చేడనుకోండి. ఇన్సూరెన్స్, ఫ్యామిలీ పెన్షన్, గ్రాట్యూటీ, అప్పులన్నీ మాఫీ, ఇంట్లో ఒకళ్ళకి ఉద్యోగం గదండీ. ఈ సదుపాయాలన్నీ ప్రభుత్వానికి నిజాయితీగా సేవ చేసి రిటైరయిన వాళ్ళగ్గూడా ఇవ్వచ్చుగాని ఉహు...చాలీచాలని పెన్షన్‌తో అష్ట దరిద్రం అనుభవిస్తూ బతకమని వాళ్ళ ఉద్దేశమేమో? నువుపోతే నీ కుటుంబానికి అది చేస్తాం ఇది చేస్తాం అంటూ ఎంత పీక్కున్నా ఎవడిక్కావాలి? మనం పోయేక ఏం జరుగుతుందో మనం చూస్తావా! చస్తావా!, అందుకే రిటైరవటం కన్నా బాల్చి తన్నెయటం లాభం. అసలు జనాభాని తగ్గించటానికి 'ఇదో ప్లానా?" అన్నాడు పీటరు మిషన్ వెనక నించి.

"నా మొహం ప్లాను. మన అనంతంగారి సంగతే తీసుకుందాం, సర్వీసులో చేరిన దగ్గర్నించి, ఇవాల్టి వరకు ఎంత నిజాయితీగా, భక్తిగా ప్రభుత్వానికి సేవ చేశారు? ఇంకో నెలరోజుల్లో ఆయన రిటైరె పోతున్నారు గదా? వాళ్ళబ్బాయి డిగ్రీ పాసయ్యి ఉద్యోగం

లేక తిరుగుతున్నాడు. అతడికి అప్పాయింట్‌మెంట్ ఇవ్వచ్చుగదా. అనంతంగారు సంతోషిస్తారుగదా. కావాలంటే పెన్షన్ అక్కర్లేదని రాసిస్తారు. ఊహూ...రూల్స్ ఒప్పుకోవంటారు. అదే. సపోజ్ రేపు ఆయన...చనిపోతే....సారీసర్ ఓన్లీ ఫర్ ఆర్గ్యుమెంట్ సర్.. జరగరానిది జరిగితే ఆ కుర్రాడ్ని పిల్చి మరీ ఉద్యోగం ఇస్తారా ఇవ్వరా..."

ఆ మాటలతో అనంతంగారి ఆలోచనలు కొత్త దారిని కనుక్కున్నాయ్.

☆ ☆ ☆

అనంతంగారికి నలుగురు పిల్లలు. పెద్దవాడు సోమసుందరం. డిగ్రీ పాసయ్యి ఉద్యోగాల వేటలో ఉన్నాడు. బుద్ధిమంతుడు. ఈ కాలం కుర్రాళ్ళలాగ వెర్రి వెర్రి వేషాలు వేసే రకం కాదు. పగలంతా లైబ్రరీ చుట్టూ, ఎంప్లాయిమెంటు ఆఫీసు చుట్టూ తిరుగుతాడు. సాయంత్రం దేవాలయానికి వెళ్ళి ప్రదక్షిణలు, ప్రార్థనలు చేస్తుంటాడు. తల్లంటే ప్రాణం. తండ్రంటే భయం. కుటుంబానికి ఏదో చేయాలని ఆవేశపడుతుంటాడు.

రెండో వాడు నారాయణబాబు. చదువుకన్నా, ఆటలన్నా, సినిమాలన్నా ఆసక్తి ఎక్కువ. ఒక్క క్షణం ఇంటిపట్టున ఉండడు. ఆకలేసినపుడు మాత్రమే ఇల్లు గుర్తుకొస్తుంది. ఇహ మూడూనాలుగూ ఆడపిల్లలు. పెద్దపిల్ల ఇంటర్ చదువుతోంది. పెద్దమనిషి అయ్యి రెండేళ్ళు కావస్తోంది. మూడోది ఎనిమిదో తరగతి వెలగబెడుతోంది. అనంతం గారికి పెళ్ళి చేసుకునే సరికి ముప్పయి రెండేళ్ళు నిండినాయి. తమ్ముడి చదువూ, చెల్లెలు పెళ్ళి అయ్యేదాకా పెళ్ళి చేసుకోనని భీష్మించుకు కూర్చోటం వల్ల ఆలస్యమయింది. ఫలితంగా తాను రిటైరై పోతున్నా ఇంకా బాధ్యతలు అలాగే ఉండిపోయినాయి.

ఆరోజు ఆఫీసులో ప్రకాశరావు అన్నమాటలు ఆయనకి మళ్ళీ మళ్ళీ చెవుల్లో వినిపిస్తున్నాయ్. అతడు చెప్పినవి కొత్త విషయాలు, తనకి తెలీని విషయాలు కాకపోయినా, అదేమిటో తన ఆలోచనల్లో కొత్త బోధన మొదలయింది.

ఆ రాత్రి అంతా నిద్రపోయాక ఆయక కాగితం కలం తీసుకుని లెక్కలు వేయ నారంభించాడు. రిటైరయితే వచ్చి వారిగేదెంత? వెయ్యిలోపు పెన్షన్, ముప్పయి రెండు వేలు క్యాష్... అదే... ప్రకాశరావు అన్నట్లు తను గతిస్తేనో... అన్నపూర్ణకి నెల నెలా పెన్షన్, నలభై వేలు ఇన్సూరెన్స్, ముప్పయి రెండువేలు గ్రాట్యుటీ అన్నిటికన్నా ముఖ్యం సోమసుందరానికి ఉద్యోగం!

పెద్దవాడి నీతినియమాల పట్ల, ఆప్యాయతలపట్ల నైతిక విలువలపట్లా తనకెంతో గౌరవం, నమ్మకం ఉన్నాయి. వాడికి ఉద్యోగం వస్తే తల్లికి ఏ లోటూ రానీకుండా చూస్తూ, కుటుంబాన్ని పైకి తీసుకొస్తాడు. ఆ నమ్మకం తనకుంది. తనకొచ్చే పెన్షన్ అన్నపూర్ణ జాగ్రత్తచేస్తుంది. తనకి పిల్లలికి కావాల్సినవి అమర్చుకుంటుంది. తానుపోతే, రెండో వాడిలో మార్పువచ్చి బుద్ధిగా చదువుకుని అన్నగారికి సహకరిస్తాడు. తండ్రిలేని పిల్లలని జాలిపడి ఆడపిల్లలకి కట్నాలు కూడా ఎక్కువగా అడుగరు. సమస్యలన్నీ ఇట్టేపరిష్కారం అయిపోతాయి.

అదే...తను మూర్ఖంగా జీవిస్తే వచ్చే పెన్షన్లో కుటుంబాన్ని పోషించలేక, పిల్ల పెళ్ళి చేయలేక, తాను అవస్థపడి, తన వాళ్ళందర్ని అవస్థపెట్టి, రోగంతో మంచం పట్టి నలుగుతూ విసుక్కుని హీనంగా, దీనంగా బ్రతికి చివరికి చావాల్సిందే? ఆ చావు ఇప్పుడే చస్తే ఏం?

ఆలోచించిన కొద్దీ తను బ్రతకటంలోని ఆవశ్యకతకన్నా చావులోనే ఎక్కువగా ఉన్నట్లు ఆయనకి అనిపించసాగింది. భార్య, పిల్లలూ అంతా ముందు వరసగా నిల్చుని 'దయచేసి చచ్చిపోయి మాకు సహాయంచేయి నాన్న' అని అడుగుతున్నట్లుగా అనిపించింది.

ఆ నిశ్శబ్దపు చీకటి రాత్రిలో అనంతంగారు గడియారం మూడు గంటలు కొట్టేదాకా తీవ్రంగా, భౌతికంగా, ఆధ్యాత్మికంగా, నైతికంగా, తండ్రిలాగా, భర్తలాగా, మనిషిలాగా, ఆలోచించి... ఆలోచించి, ఇక స్థిర నిర్ణయానికొచ్చి మంచంపై వాలేరు. తన నిర్ణయాన్ని ఎలా అమలు పర్చాలని ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయేరు.

★ ★ ★

ఆ మర్నాటి నించి ఆయన మాటల్లో, చేతల్లో, చూపుల్లో ఎంతో మార్పొచ్చేసింది. పెద్దవాడు సోమసుందరాన్ని పిలిచి తన ఆఫీసులో ఎవర్ని నమ్మొచ్చో, ఎవర్ని నమ్మకూడదో చెప్పసాగేరు. ఆయన ధోరణి అతడికి అర్థంకాక నోరు వెళ్ళబెట్టివిని తర్వాత తల్లికి చెప్పాడు. రెండో కొడుకుని పిల్చి బుద్ధిగా చదూకోమని, అన్నకి సాయంగా ఉండమని జెప్పారు. ఆడపిల్లలకి జెప్పాల్సినవి వాళ్ళకి చెప్పారు. ఎన్నడూ లేనిది ఆ సాయంత్రం ఆఫీసు నుంచి రాగానే భార్యతో "అలా బజారెళ్ళి తిరిగొద్దాం వస్తావా" అనడిగారు.

అన్నపూర్ణకి భర్తని చూస్తుంటే, పిల్లలు చెప్పిన సంగతులు వింటుంటే భయం కలగసాగింది. ఎందువల్ల ఆయనలో ఈ మార్పువచ్చిందో ఆవిడకి అర్థంకాలేదు.

భార్యని తీసుకుని బజార్లోకి రాగానే 'రిక్షా ఎక్కుదామా' అనడిగి సమాధానం కోసం ఆగకుండానే, రిక్షాని పిల్చి ఎక్కమన్నారు. రిక్షావాడిని టాపువేయమన్నారు. దారిలో హఠాత్తుగా పెళ్ళయిన కుర్రాడిలాగా ఆదుర్దా, ఆత్రం, ఆవేశం.

"ఏవండీ..మీలో ఏదో మార్పొచ్చింది. స్పష్టంగా నాకు, పిల్లలికి కనిపిస్తోంది...కారణం ఏమిటి చెప్పరా? ఇన్నేళ్ళల్లో నేనెప్పుడయినా మిమ్మల్ని ఇలా అడిగేనా? కాని మిమ్మల్ని చూస్తుంటే నాకేమిటో భయంగా ఉందండి...చెప్పండి...చెప్పండి..."

"ఏం లేదు అన్నపూర్ణా..అస్సలేం లేదు..అన్నట్లు బజార్లో మామిడి కాయలొస్తున్నాయి. వూరగాయలు పడేయరాదూ. చుట్టాలు వాళ్లువస్తే పనికొస్తుంది. ఇన్సూరెన్స్‌పాలసీ బీరువాలో ఉంది. బ్యాంకులో డబ్బు డ్రాచేసి నీపట్టు చీర మడతలో ఉంచా..చూసుకో.. రిక్షా ఆపవోయ్..హొటల్లో టిఫిన్ తిని కాఫీ తాగుదాం. ఇవాళ నీకు పూలు గాజులు కొనివ్వాలని ఉందోయ్..."

ఆయన వాలకం, తీరు చూస్తుంటే అన్నపూర్ణకి దిగులు బాధ, ఆలోచన్లు అధికం కాసాగాయ్. రహస్యంగా కొడుకుతో మొరపెట్టుకుంది. తండ్రిని ఏ డాక్టరుదగ్గరకయినా తీసుకెళ్ళమని ప్రాధేయపడింది. కాని సోమసుందరం వేరే విధంగా ఆలోచించి కంగారుపడకమ్మా. ఇంకో పదిరోజుల్లో రిటైరవుతున్నానన్న నిజంతో నాన్నగారు రాజీపడలేక సైకలాజికల్‌గా బాధపడుతున్నారు. అంతే! క్రమక్రమంగా సమాధానపడి దోవకొస్తారు. అనవసరంగా కంగారుపడకు" అంటూ ధైర్యం చెప్పాడు. కాని ఆవిడలో ఆత్రం, ఆవేదన, దిగులూ పెరుగుతున్నాయే గాని తగ్గటంలేదు.

చిత్రంగా రోజులు గడుస్తున్నాయి యథావిధిన అనంతంగారు పెట్టుకున్న ముహూర్తపు

రోజు రానేవచ్చింది. గడచిన కొద్దిరోజుల్లో అనంతంగారి రూపులో ఎంతో మార్పొచ్చేసింది. మొహం పీక్కుపోయింది. కళ్ళక్రింద నల్లటి చారలు. గడ్డం బాగా మాసింది. నూనె రాయకపోవటంతో జుట్టు పీచు పీచులుగా ఎగిరెగిరి పడుతోంది. పరధ్యానం, ప్రతివాళ్ళనీ చూసి కళ్ళనీళ్ళు తెచ్చుకోవటం, వస్తువుల వంక, పరిసరాల వంక ఆప్యాయంగా అదేపనిగా తీక్షణంగా చూడటం..

భర్త పరిస్థితి చూస్తుంటే అన్నపూర్ణకి అన్నం సహించటంలేదు. ఏ పనీ చేయ బుద్ధి కావటం లేదు. అలాగేదిగులుగా కూర్చుండిపోతోంది. పిల్లలే తలో పనీ చేస్తున్నారు. ఆరోజు తెల్లవారు జామున వులిక్కి పడి లేచి తన పక్కలో ఉన్న భర్తని చూసి ఆశ్చర్యపోయి, ఆయనను తట్టి లేపుతూ, ఇదేమిటండీ పిల్లలు చూస్తే...అసహ్యంగా..వెళ్ళి, మీ పక్క మీద పడుకోండి.. మిమ్మల్నే..భార్య మాటలతో ఇహ తప్పదన్నట్లు "పీడకల వస్తే భయం వేసి' సన్నగా గొణుక్కుంటూ లేచి వెళ్ళారు.

స్నానానికి వెళ్లే ముందు ఆవిడే స్వయంగా రేజరూ, బ్రష్, క్రీము తెచ్చి అక్కడ పెట్టి 'ముందు షేవ్ చేసుకోండి.. అలా చూడాలంటే నాకేమిటో దిగులుగా వుంది' అన్నది.

'ఎందుకు పూర్ణా' దండగ అన్నారేగాని భార్య పట్టుదల ముందు తలవంచక తప్ప లేదు. తర్వాత తనే స్వయంగా ఆయన్ని కూర్చోపెట్టి తలకి నూనె రాసింది. ఉతికి ఇస్త్రీ చేసిన ప్యాంటూ షర్టు సిద్ధంగా ఉంచింది. భార్య మాటల్ని ఏదీ ఆరోజు కాదనలేక పోతున్నారు. గట్టిగా పలకరిస్తే లోపల దాచుకున్న దుఃఖం బయటపడుతుందేమోనన్న భయం కూడా లేకపోలేదు.

అనంతంగారు అన్ని పన్లూ పూర్తిచేసుకుని ఆఫీసుకి బయల్దేరారు. ఇహ తిరిగిరానని ఆయనకితెల్సు. మొత్తం కార్యక్రమాన్ని రూపొందించుకుని సిద్ధంగా ఉన్నారు.

భవిష్యత్తుని తెల్సుకోవాలని మనిషితాపత్రయ పడతాడే కాని, అదిగాని తెల్సుకోగలిగితే రాబోయే కష్టాల్ని, సంభవించబోయే విషాదాల్ని తల్చుకుని భయంతో, దిగులుతో వర్తమానాన్ని నిర్వీర్యంగా నిస్తేజంగా గడిపివేసి జీవితాన్ని ఓ విషాద గీతంగా మార్చుకుంటాడు. అందుకే మానవ జీవితంలో అడ్డు తెరలాంటి మాయ ఎంతో అవసరం.

ఇంకా కొద్ది నిమిషాల్లో తాను చనిపోతున్నానన్న ఆలోచన అనంతంగారిని మానసికంగా అప్పుడే చంపేసింది. ఆయనిప్పుడు కదుల్తున్న కట్టె. ఆఫీసుకు బయల్దేరి తీరా గుమ్మందాటబోతూ ఒక్క క్షణం ఆగి వెనక్కి తిరిగి భార్య వంక ఆఖరుసారిగా ఆప్యాయంగా చూసుకున్నారు. తనకి వయసులో ఉన్నపుడు పురుష సుఖాన్ని, కష్టంలో ధైర్యాన్ని, సుఖంలో ఉత్సాహాన్ని, ఇన్నేళ్ళు తాను బతకటానికి కారణాన్ని, ఉత్తేజాన్ని ప్రసాదించిన ఈ దేవతని నేచూడలేను. కానీ పూర్ణా! నీ సుఖం కోసం, పిల్లల అభివృద్ధి కోసమే నేనీర్ణయం తీసుకున్నది...నన్ను క్షమించు..క్షమించు.

అనంతంగారు ఆలోచనల్లోంచి తెప్పరిల్లేసరికి, తన కళ్ళ ఎదుట ధారాపాతంగా నీళ్ళు కారుతున్నా యి. తన చేతిని పట్టుకుని తన భార్యా ఏడ్వడం చూసి ఆయన కంగారు పడ్డారు. కళ్ళు తుడుచుకున్నారు. 'ఛ..తను ధైర్యంగా, బింకంగా ఉండాలి. ఆఖరిక్షణంలో తన పథకాన్ని పాడుచేసుకుని భార్య సుఖాన్ని, పిల్లల భవిష్యత్తుని నాశనం చేయకూడదు'.

ఆయన కళ్ళు తుడుచుకుని వెళ్ళబోతూ 'వెడుతున్నా పూర్ణా' వెడుతున్నా. ఆరోగ్యం

జాగ్రత్త. పిల్లలు జాగ్రత్త. ఎవర్నీ నమ్మకు. నీకు ఏది మంచనిపిస్తే అది చెయ్యి...వెడుతున్నా...' ఆయన మాటల్ని మధ్యలోనే ఆపేస్తూ 'మీరివ్వాళ్ళ ఎక్కడికీ వెళ్ళొద్దండీ. ఆఫీసుకి సెలవు పడేసి నాతో ఉండిపోండి. నామాట వినండి...బతిమాలసాగింది.

'వెళ్ళాలి పూర్ణా! వెళ్ళిపోవాలి. వెళ్ళక తప్పదు. టైంకూడా అయిపోయింది..' ఆమె చేతిని విదిలించుకుని మళ్ళీ వెనక్కి చూడకుండా వీధిలోకి వచ్చేరు.

వీధి బాగా రద్దీగా ఉంది. కార్లు, రిక్షాలూ, స్కూటర్లు, ఆవులు, గేదెలు, పిల్లలు.. అందరికన్నా ముందుగా వెళ్లాలన్న తొందర, కంగారు ఆత్రం ప్రతివారిలో స్పష్టంగా కన్పిస్తోంది.

కాని నిజానికి అనంతంగారు అందరికన్నా తొందరగా, వేగంగా వెళ్ళాలి. కారణం- ఆయన తలపెట్టి, చచ్చిపోవాలనుకున్న రైలు రావటానికి ఇంకా పది నిముషాలే వ్యవధి ఉంది. వీధిలో వెళుతున్న మిగతావారందరికన్నా ఆయనది అతి ముఖ్యమైన వాయిదా వేసుకోలేని పని. అంచేతనే కాబోలు, ఆయన దాదాపు పరిగెడుతున్నట్లుగా నడుస్తున్నారు. జనాన్ని తోసుకుంటూ తొక్కుకుంటూ తప్పుకుంటూ రైలు పట్టాలు ఇంకా పదిగజాల్లో కనిపిస్తున్నాయ్. ఆ పట్టాల వెంబడి ఇంకో పదిగజాలు నడిస్తే పెద్ద ఖాళీ స్థలం.. చెట్లు. చేమలు..రైలు అక్కడ అకస్మాత్తుగా మలుపు తిరుగుతుంది. ఇప్పటికే అక్కడ చాలా మంది ప్రమాదవశాత్తు చనిపోయేరు. పగలూ రాత్రి అక్కడ కాపలాకి గార్డుని వేయమని అర్జీలు పెట్టుకోవడం ప్రభువులు పట్టించుకోకపోవడం జరుగుతూనే ఉంది.

అంతలో ఎవరో వెనకనించి చప్పట్లు కొట్టి పిలుస్తున్నారు. అనంతంగారు విన్నారు. కాని ఆగకుండా నే, వెనక్కి తిరిగి చూసేరు. చూపుమందగించిన కళ్ళకి ఆకారం స్పష్టంగా కనిపించలేదు. కాని ఎవరో తనవైపుగానే పరిగెత్తుకొస్తున్నారు. అనంతంగారు తప్పక ఆగేరు. దూరంగా రైలు కూత వినిపిస్తోంది.

పరిగెత్తుకొస్తున్న ఆకారాన్ని పోల్చుకోగలిగినంత దగ్గరగా వచ్చేక, అతడ్ని తన కుమారుడు సోమసుందరంగా గుర్తించి నివ్వెరపోయారు. తన ఉద్దేశం కనిపెట్టేసాడా? తన పథకం పాడయిపోయినట్టేనా. కాని సోమసుందరం వీటన్నిటికీ అతీతమైన స్థితిలో, ఆందోళన, కంగారు, బాధ, దుఃఖం పూర్తిగా నింపుకున్నట్లు, రొప్పుకుంటూ వచ్చి "నాన్నగారూ! అమ్మ...అమ్మకి గుండెపోటు..త్వరగా..." ఇంకేం మాట్లాడకుండా తండ్రి చేతిని పుచ్చుకుని ఎలా వచ్చేడో అలా, ఉద్వేగంతో వెనక్కి పరుగు ప్రారంభించేడు...

★ ★ ★

మనిషిని బతికించేది బతకాలనిపించేలా చేసేది ప్రేమ. అతడ్ని దృఢనిశ్చయంతో ముందుకు నడిపించేది ధైర్యం. అనంతంగారికి ధైర్యం లేకపోవటం చేత ఇన్నేళ్ళ జీవితంలో చాలాసార్లు కాలం చేసి తిరిగి ప్రేమవల్ల సజీవులయ్యారు. కాని ఇపుడా అవకాశం ఆయనకి లేకుండా పోయింది. ఆయన జీవితంలోని ఏకైక చిరుదీపం ఆరిపోయింది.

ఆయన ఇంటికి చేరేసరికే పూర్ణచనిపోయింది.

తను ఎవరికోసం బతకాలో, కనీసం ఎవరికోసం చావాలో తెలీని స్థితి, ఆయన క్షోభ...అనంతం.

**ఉదయం వారపత్రిక, 6-4-1990.**

# గుండెతడిసిపోయింది!

## శారదా అశోకవర్ధన్

""టెలిగ్రాం" అన్న కేకవిని ఇంటిల్లిపాది పరుగెత్తారు కంగారుగా!

"ఎక్కణ్ణుంచి బాబూ టెలిగ్రాం?" మెల్లిగా మనవడి సాయంతో లేచి నుంచుంటూ అడిగింది సుభద్రమ్మ మనవడు పవన్ ని!

టెలిగ్రాం పుచ్చుకోవడానికెళ్లిన రాజాకేసి చూసి,

టెలిగ్రాం మీకు కాదుసార్ సుభద్రమ్మ గారికి "ఆమెని పిలవండి" అన్నాడు పోస్టతను.

"అమ్మకా?" ఏది ఆశ్చర్యంగా అడిగాడు రాజా.

"ఆ మాటలు వినగానే చెమటలు పట్టిపోయాయ్ సుభద్రమ్మకి, బాబూ పవన్ టెలిగ్రాం ఎవరు పంపించారురా? మీ పెద్దనాన్నా? తాతగారు కులాసాగా వున్నారా? ఆయనకేమీ ప్రమాదం జరుగలేదుకదా"? గుండెచేతుల్తో పట్టుకొని, పవన్ సహాయంతో లేవబోతూ అడిగింది. కన్నీళ్ళు చెంపలమీదుగా వాగులా ప్రవహిస్తూ వుంటే.

"అమ్మా! అమ్మా! నీకు కలకత్తా భాషా కుటీరం వారి దగ్గర నుంచి ఇరవై వేలు బహుమతొచ్చింది. నువ్వేదో పుస్తకం రాశావటగా? వెరిగుడ్! ముందు ఇక్కడ సంతకం చేసి ఈ టెటిగ్రాం తీసుకో" అన్నాడు రాజా సంబరపడిపోతూ.

సుభద్రమ నమ్మలేకపోతోంది. చేతులు వొణికి పోతున్నాయ్. కన్నీరు గుడ్లనిండా నిండి ఏమి కనబడకుండా చేస్తున్నాయ్! పవిట కొంగులో కళ్లుతుడుచుకుని, సంతకం చేసింది సుభద్రమ్మ.

"ఒకటా, రెండా? ఇరవై వేలు బహుమతొస్తే ఎవరైనా సంతోషిస్తారుగానీ ఏడుస్తారా? అయినా ఏడుపెందుకు!" ఎంతో ప్రేమని వొలకబోస్తూ అంది సౌమ్య. ఆమెకళ్లముందుక్రితం రోజు మహిళా మండలి ఫంక్షన్‌లో రచన వేసుకున్న కెంపుల నెక్లెసు తళ తళా మెరిసింది. "అత్తయ్యా మిమ్మల్ని చూసి గర్వపడుతున్నాను" అంది ఆమెకి దగ్గరగా జరిగి టెలిగ్రాం మరోసారి చదువుతూ.

"అమ్మా! నానమ్మ ఏడవడంలేదే! అవి ఆనందబాష్పాలు. ఎక్కువ బాధ కలిగినప్పుడు కన్నీళ్లెలా వొస్తాయో, ఎక్కువ సంతోషం కలిగినప్పుడు కూడా కన్నీళ్లు, అలాగే వొస్తయిట. నాన్నమ్మ చెప్పింది." అన్నాడు పవన్.

సుభద్రమ్మ పవన్ బుగ్గలమీద గట్టిగా ముద్దుపెట్టుకుంది.

రాజుకళ్లలో ఇటీవలే తనకొలీగ్ కొనుక్కున్న హీరోహోండా కళ్ళముందు కనిపించింది. ఇరవై వేలు "కాస్తో, కూస్తో, తక్కువపడితే వేసుకోవచ్చులే" అనుకున్నాడు. డెబ్బయ్యో వడిలోపడి, ఎందుకు పనికి రాదనుకున్న తల్లిపై గా మందులూ మాకులతో తనకు భారంగా తయారైన తల్లి ఈ రోజున ఉన్నట్టుండి లాటరీ కొట్టేసినట్టు యిరవై వేలు సంపాదించేసింది. అమ్మ ఇంక ఇలాగే రాస్తూ పోతే, ఇరవై +ఇరవై +మరో ఇరవై త్వరలో ఇల్లు కూడా కట్టెయ్యొచ్చు" రాజు కలలలో తేలిపోతున్నాడు.

"అమ్మా ఏం రాశావమ్మా నీకింత పెద్దబహుమతి వొచ్చింది? నాతో ఇలా అని ఒక్కమాట చెబితే తెల్లకాగితాల కట్ట తెచ్చి నీ ముందు పడేసే వాణ్ణిగా!" తల్లి పక్కన కూర్చుంటూ అన్నాడు రాజు. సుభద్రమ్మ గుండె కరిగిపోతోంది! కన్నీరు ఉప్పెనలా పొంగిపోతోంది.! "ఎన్నాళ్ళకి రాజు అలా తనపక్కన కూర్చుని మాట్లాడుతున్నాడు! పసివాడి దగ్గర నుంచి పెళ్ళి కానంతవరకు ఇలాగే కూర్చునేవాడు. కాలేజీలో చదువుతున్నా అన్నం ముద్దలు కలిపి పెట్టమనేవాడు. పెద్దాడు పనిపిల్లాడిలా వొచ్చి పక్కన పడుకునేవాడు, ఏదో కబుర్లు చెబుతూ గోముగా! ఆ పెద్దాడంటే జ్ఞాపకమొచ్చింది. ఆయనెలా వున్నారో ఏమో! పెద్దాడు ఆయనకి సరిగ్గామందు కొంటున్నాడో లేడో! ఆయనకి ఏది అడగాలన్నా మొహమాటమే. ఏం తింటున్నారో ఏమో? ఆయనకి చేగోడీలంటే చాలా ఇష్టం. కోడలుకి అంత ఓపికుందా? ఇవన్నీ ఎవరు చేసుకుంటారు? డబ్బుపడేస్తే అవే బజార్లో దొరుకుతాయ్ అంటుంది నీలిమ. బజార్లో చేసినవి బాగుండవే సుభద్రా చక్కగా ఇంగువవేసి నువ్వులువేసి నువ్వు చేస్తావే అని ఎంత బాగుంటాయో. అనేవారు ఆయన" మనసు మరి ఆలోచించలేక పోతోంది. తనకే రెక్కలుంటే గబుక్కున ఎగిరి అతని గుండెలమీద వాలిపోయేది. బోలెడన్ని చేగాడీలు చేసి పెట్టేది! తన అశక్తతకి దుఃఖం పొర్లుకొచ్చింది. సుభద్రమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఎంత ఆనంద బాష్పాలయితే మాత్రం ఇంత ఇదా? ఊరుకోండత్తయ్యా" ఊరడించింది ఎన్నడూ లేనిది సౌమ్య.

"అయినా అమ్మా నువ్వు కథలూ నవలలూరాస్తావని మాకు తెలీదే! ఇంత మంచినవల ఎప్పుడు రాశావమ్మా?" రాజు ఆమెకి మరింత దగ్గరగా జరుగుతూ అన్నాడు.

వారిద్దరూ తన దగ్గర అలా కూర్చోడం మాట్లాడడం ఆమె మనసు ఉప్పొంగి పోతోంది. నోట మాట రావడం లేదు.

"నేను చెబుతానునాన్నా !నీతో రామకోటి రాసుకుంటాను. కాగితాలు తెచ్చిపెట్టమని నానమ్మ అడిగితే నువు తేనే లేదు. నేనే నా నోటు బుక్స్ యిచ్చేవాణ్ణి. దాన్లో నానమ్మ రామకోటి రాయలేదు. "బండబారిన గుండె డైరీ" అని, నవల రాసింది. నాయనమ్మకి

కాయితాలన్నీ నేనే ఫెయిర్ చేసి పెట్టేవాణ్ణి! రామకృష్ణ తాతయ్యలేడు. అతను ప్రింటుచేసి పెడతానన్నాడు. అతనే నానమ్మకి కూడా తెలీకుండా ఆ పుస్తకాన్ని పోటీకి పంపాట్ట! " పవన్ మాటలు రాజూ, సౌమ్యలు ఆశ్చర్యంగా విన్నారు.

★ ★ ★

సుభద్ర రాసిన ఉత్తరం, పేపర్లలో వార్తాచదివి పొంగిపోయారు సుబ్బారావుగారు.వెంటనే ఉత్తరం రాశారు తను బయల్దేరి వొస్తున్నాననీ, ఇద్దరం కలిసి కలకత్తా వెళ్ళి బహుమతిని తీసుకుందామనీ. కలకత్తా వెళ్లాలంటె డబ్బు కావాలి. తన చెవి దిద్దులూ, ముక్కుపుడకా అమ్మేద్దామనుకుంది సుభద్రమ్మ. అక్కడ సుబ్బారావుగారు తన పెళ్లిలో అత్తవారు పెట్టిన తులం బంగారం ఉంగరాన్ని ఏనాడూ అతను ఎటువంటి కష్టాల్లోనూ తాకట్టు పెట్టడానికయినా తియ్యలేదు. ఈ రోజున దాన్ని అమ్మేసి కలకత్తా ప్రయాణానికి సిద్ధపడ్డారు.

"మీరెందుకు ఉంగరాన్ని అమ్మేశారు మామగారూ. మేము లేమూ టిక్కెట్లు కొనడానికి? " అంది కుసుమ! "మమ్మల్ని అడగడం నామోషియా? మేము పరాయివాళ్లమా నాన్నగారూ?" అన్నాడు వాసు. వాళ్లిద్దరూ తననలా పలకరించి ఎన్నాళ్లయింది? కాదు... ఎన్నేళ్లయింది? నాన్నగారూ... అని నోరారా పిలిచి ఎంత కాలమయింది. మందు లయిపోయాయని చెప్పినా, ఒంట్లోబాగులేదని చెప్పినా, బట్టలు చిరిగిపోయాయని చెప్పినా చిరుబురులాడే ఆ ఇద్దరూ ఈ రోజు ఇలా పలకరించడం, అతడికి మతిపోయింది. అతడికళ్లు ఆనందంతో మెరిశాయి! వాసు కుసుమల కళ్లల్లో మొన్నెవరో ఊరిచివర వున్న అమ్ముతామన్న ద్రాక్షతోట మెరిసింది!

దగ్గరుండి వాసు కుసుమలు సుబ్బారావుగారిని తీసుకొచ్చారు. కానీ ఖర్చు పెట్ట నీయకుండా! రాజు సౌమ్యలు పువుల్లో పెట్టి సుభద్రమ్మని కలకత్తా తీసుకెళ్లారు!

"సుభద్రా! ఏమోననుకున్నాం గానీ మనపిల్లలెంత మంచివాళ్లే! వాళ్లిద్దరూ నిన్నూ వీళ్లిద్దరూ నన్నూ ఎంత జాగ్రత్తగా తీసుకొచ్చారే ఇక్కడికి! నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వు ప్రైజు తీసుకుంటూవుంటే స్వయంగా దగ్గరుండి చూడాలనిపించి రాగలనో లేదోనని భయపడిపోయాను. పిల్లల్ని డబ్బడగడమెందుకని నా ఉంగరాన్ని అమ్మేశాను. అయిదువేలొచ్చాయి. ఇదుగో ఇవి నీదగ్గరుంచు. ఏనాడు ఇంత మొత్తాన్ని నీకివ్వలేకపోయాను. కొద్దోగొప్పో యిచ్చినా అది పిల్లలకోసమే ఖర్చుపెట్టేదానివి కానీ నీకొసమంటూ ఏమీ చేసుకోలేదు. అన్నట్టు నీ చెవుల దుద్దులూ ముక్కుపుడకా ఏవీ?" బోసినొటితో సుభద్రమ్మను ముద్దుపెట్టుకుంటూ అన్నారు సుబ్బారావు గారు. సుభద్రమ్మ సిగ్గుపడిపోతూ అతని కౌగిట్లో కుంచించుకుపోయింది.

"రాజునీ సౌమ్యనీ ఇబ్బంది పెట్టడమెందుకని మన రామకృష్ణ ద్వారా అవి అమ్మేశానండీ రెండూ కలిపి పదివేలొచ్చాయి. ఇప్పుడు మనిద్దరి దగ్గరా మొత్తం పది హేను వేలున్నాయి. బహుమతి డబ్బు యిరవై వేలు. ముప్పై అయిదు వేలూ బ్యాంకులో వేస్తే... ఏదొ చెప్పబొయేలోపల కొడుకులూ, కోడళ్ళూ, రావడంతో చెప్పడం ఆపేసి వారం

దరికేసి ఆప్యాయంగా చూసింది.

"ఎన్నాళ్లకి కుటుంబం అంతా ఒక్క చోట ఉండడం! ఈ సంతోషం నేను పట్టలేక పోతున్నాను". అంది సుభద్రమ్మ భర్తవంక చూస్తూ.

"అవును సుభద్రా! నాకూ అలాగేవుంది. ఈ కాలం ఇలాగే నిలిచిపోతే! అందరూ ఇలాగే కలిసి వుండిపోమూ, ఒరేయ్ పెద్దాడా! నువ్వేలాగూ డాక్టరివి కదరా! ఈ ప్రాక్టీసేదో రాజమండ్రిలోనే పెట్టుకోకూడదూ? నువ్వూ చిన్నాడూ అందరం కలిసి పెద్ద ఇల్లు తీసుకుని వుందాం. చిన్న వాడికి ఇప్పుడు రాజమండ్రి నుంచి ట్రాన్స్‌ఫర్ అయ్యే అవకాశం లేదుకదా!" అన్నారు సుబ్బారావుగారు.

ఆ మాటలు కొడుకులకి కోడళ్లకి ఎవ్వరికీ నచ్చలేదు. కాబోలు మొహామొహాలు చూసుకున్నారు. సుభద్రమ్మ సుబ్బారావుగారికేసి చూసి చిరునవ్వు నవ్వింది! ఆ నవ్వులో ఎన్ని అర్థాలో, ఎంత బాధో ఒక్క ఆమెకే తెలుసు!

"ఇక ముందు మీరు మాదగ్గర అత్తగారు మరిది గారి దగ్గరావుండడం ఎందుకు? ఇద్దరూ మా దగ్గరే వుండండి. మా పిల్లలిద్దరూ సుజిత్, స్మితలని ఊటీ స్కూల్లో, వెయ్యాలనుకుంటున్నాము. నాకూ ఇంక వేరే పన్లేమి వుండవుకాబట్టి, ఊరిచివరి ఒక ద్రాక్షతోటకొని దాన్ని నేను చూసుకోవాలనుకుంటున్నాను. మీ రిద్దరూ వుంటే మాకు ఇల్లు తాళం పెట్టవలసిన అవసరమూ వుండదు, మీరు ఒకరి కొకరు తోడుగా వుంటారు" అంది కుసుమ.

"అవును నాన్నగారూ కుసుమ చెప్పింది నిజం" అన్నాడు వాసు.

"బాగుంది మీ వరస మా పవనికి అత్తగారంటే పంచప్రాణాలూనూ! ఆవిడలేనిదే వాడుండలేడు ఆవిడతో పాటే మామగారూనూ! ఇద్దరూ మా దగ్గరే వుంటారు. నేనీమధ్య మహిళాభివృద్ధి కార్యక్రమాల్లో తలమునకలై తిరుగుతున్నాను. నేను ఇంట్లో వుండని లోటు పవన్‌వల్ల వాళ్ళకి తీరుతుంది. పైగా వాళ్లకి బోరు కొట్టదు. మీ దగ్గరుంటే వాళ్లకి కాలక్షేపం ఏమిటి? పిల్లలు ఊటికి వెళ్లిపోతారుగా!" అంది సౌమ్య వారి వాదనలని ముద్దాయిల్లా విన్నారు సుభద్రమ్మగారూ సుబ్బారావుగారూ!

అమ్మానాన్నా ఎవరిదగ్గర వుంటామని చెబుతారని ఆదుర్దాగా ఎదురు చూస్తున్నవాళ్లకి, ఆరోజు ఆర్గనైజర్లు లాంచనంగా పలకరించి పిలవడానికి రావడంతో ఆలోచనలకి కళ్లెం వెయ్యడం జరిగింది.

★ ★ ★

ముదురు నీలం రంగు పట్టుచీరకి మెరూన్ కలర్‌తో కుంకుం రంగు అంచుచీర! అది పెళ్లినాటి చీరే అయినా ఎప్పుడో అప్పుడప్పుడు కట్టుకోవడం వల్ల బాగానే వుంది. ఆచీరలో ఆరోజు ఆమె "పార్వతీ" అన్నారు ప్రేమగా సుబ్బారావుగారు. ఆశ్చర్యంగా అతనికేసి చూసి "నా పేరు మర్చిపోయారా? ఈ పేరేమిటి?" అంది సుభద్రమ్మ.

"నువ్వు సాక్షాత్తూ పార్వతీ దేవిలా అందంగా, ఆదిశక్తిలా శక్తిమంతంగా కనిపిస్తున్నావు

సుభద్రా! పదో తరగతి తరువాత, ఆడపిల్లికి పై చదువులెందుకూ అని మీ పుట్టింటివాళ్ళు చదివించలేదు. బడిపంతులు ఉద్యోగం చేస్తూ ఎందరికో విద్యాదానం చేసిన నేనుకూడా, కేవలం నిన్నొక భార్యగానే చూశాను కాని, నీకోరిక తెలిసికూడా చదివించడానికి ప్రయత్నం చెయ్యలేదు. కానీ ఇలా ఇంత గొప్పబహుమతి పొందిన గ్రంథాన్ని నువ్వు రచించావంటే నాకు చాలా ఆనందంగానూ ఆశ్చర్యంగానూ వుంది. అంత భాషా, భావం ఎక్కడ సంపాదించావు సుభద్రా"!

"ఏబడీ, ఏగురువూ చెప్పలేని పాఠాలు నాకు జీవితం నేర్పించిందండి! నేనది కథకింద రాయలేదు. నా ఆవేదనని అక్షరరూపంలో డైరీలో రాసుకున్నాను. ఒక్కొక్కపుటా, ఒక్కొక్క రోజు సంఘటన! అవన్నీ ఒక రోజు మన రామకృష్ణ చూసినాకు తెలీకుండానే అచ్చువేయించి తీసుకొచ్చాడు. అతనే ఈ పుస్తకాన్ని బహుమతి పోటీకి కూడా పంపించాడు. అందులోని పాత్రలు, మీరూ, నేను మనసంసారం, మనపిల్లలూ అవేనండీ" అంది కళ్ళుతుడుచుకుంటూ!

"వాస్తవాన్ని కళ్ళకి కట్టినట్టు రచించిన ఈ రచయిత్రి మహానుభావురాలు. వీరికలంనుండి వెలువడ్డ ఈ రచన మణిపూస! వీరు ఇదే తన తొలిరచన అని చెప్పుకున్నారు చాలా ఆశ్చర్యం! తొలిరచనలోనే ఇంత సిద్ధహస్తులయిన వీరు, మునుముందు ఇంకా ఎన్నో మంచి రచనలు చేస్తారని ఆశిస్తూ. ఈ బహుమతిని అందుకోవలసిందిగా కోరుతున్నాం. వారి శ్రీవారు కూడా ఇక్కడే వున్నట్టు తెలిసింది. వారిని కూడా వేదిక మీదికి రావలసిందిగా కోరుతున్నాం" అన్నారు.

వాసు తండ్రిని చెయ్యిపట్టినడిపించి వేదిక పైకి తీసుకెళ్ళాడు. రాజు తల్లి చెయ్యి పట్టుకుని వేదికమీద కూర్చోబెట్టారు.

ఇద్దరికీ శాలువాలు కప్పి, గౌరవించారు ఆర్గనైజర్లు. సభ ఎంతో వేడుకగా పూర్తయింది. ఆ రాత్రి భోజనాలయ్యాక "అమ్మా ఆ చెక్కేది? రేపే మన ప్రయాణం నువ్వు మాతోనే వచ్చేస్తున్నావ్! అన్నాడు వాసు.

"చెక్కు ఎక్కడపెట్టేవమ్మా! జాగ్రత్త! నాన్నగారిని కూడా మనతోనే తీసుకు పోతున్నాం" అన్నాడు రాజు

"అరే! చెక్కు కనబడడంలేదే! కంగారుగా వెతికింది సుభద్రమ్మ! అందరూ మరింత కంగారుగా ఆగదినీ, సభ జరిగిన ప్రాంగణాన్ని అంతా వెతికారు ఎక్కడా కనిపించ లేదు. ఆర్గనైజర్లకు చెప్పారు. వాళ్ళు ఏం చెప్పాలో తెలీక మీరొక ఉత్తరం రాసివ్వండి చెక్కు పోయినట్టు. మేము ఎంక్వయిరీ చేసి మీకు సమాధానం రాస్తాము. డూప్లికేట్ చెక్ ఇస్తాం" అన్నారు. సుభద్రమ్మగారు, వారు చెప్పిన విధంగానే రాసిచ్చింది. కుసుమ విసుక్కుంది.!

సౌమ్య గొణుక్కుంది.!

వాసు చిటపటలాడుతున్నాడు!

రాజు చిరాకు పడుతున్నాడు!

"బాబూ మమ్మల్ని ఎవరు తీసుకెళ్తున్నారు?"

అడిగింది సుభద్రమ్మ వాసునీ, రాజునీ చూస్తూ

"మీ చెక్కు రాగానే ద్రాక్షతోట కొనాలనుకున్నాను. ఇప్పుడెలా? మీరు మరిదిగారింటికే వెళ్లండి" అంది కుసుమ

"ఎంతో మోజుపడ్డాను. మహిళామండలి శ్యామల మెళ్లో లాంటి కెంపుల నెక్లెస్ కొనొచ్చని ఇరవై వేలతో! ఊ... అంతా నిరాశే అయింది. మీరు బావగారింటికే వెళ్లండి" అంది సౌమ్య.

వాసూ రాజు మాట్లాడకుండా మౌనంగా ఊరుకున్నారు.

సుబ్బారావుగారు అయోమయంగా చూశారు అందరి వైపు. కర్తవ్యం అర్థం కానట్టుగా! కలలన్నీ పేకమేడల్లాకూలిపోయినట్టయింది.

"సుభద్రా! ఏం చేద్దాం" అన్నారు తడబడుతూ

సుభద్ర పకపకానవ్వింది! పార్వతి దేవిలా నవ్వింది గంభీరంగా!

గలగలా నవ్వింది ప్రవహించే గంగానదిలా! భద్రంగా జాకెట్టు మడతలో దాచిన చెక్కును పైకితీసింది. సుబ్బారావుగారి చేతిలో పెట్టింది.

"పదండి! ఇది నా స్వంత సంపాదన! ఇరవై వేలు మనదగ్గర బంగారం అమ్మగా వొచ్చినవి పదిహేను వేలు. బ్యాంకులో వేస్తే ముప్పై అయిదువేలు. ఆ వడ్డీ, మీద, మనం హాయిగా ఒక్కగది అద్దెకు తీసుకుని బతకొచ్చు! డబ్బు మనుషులు మనకొద్దు! నాకు మీరూ మీకు నేనూ తోడు మనకి భగవంతుడే – పదండి! " అంది ఆవేశంగా!

అందరూ తెల్లబోయి ఆమెకేసి చూశారు.

ఆమెలో ఆనందం! కళ్లు చెమ్మగిల్లాయి!

ఆమెలో ఆత్మస్థయిర్యం! కళ్లు మెరిశాయి!

ఆమెలో ధైర్యం! చూపులు సూదుల్లా వున్నాయి!

ఆమె సాక్షాత్తూ ఆది శక్తిలా కనిపించింది అందరికీ!

ఆలోచనల్లోంచి షాకుల్లోంచి అందరూ తేరుకునే లోగా, ఆమె సుబ్బారావుగారి చెయ్యి పట్టుకుని ఒక చేతిలో సూటుకేసుపట్టుకుని, అడుగు బయటకు వేసింది.!

ఆమెలో భార్యమాత్రమే కాదు, ఒక చెల్లి ఒకతల్లి, కనిపించారు సుబ్బారావుగారికి! ఆడది అబల కాదు శక్తి! ఆదిశక్తి! తనలోతనే గొణుక్కున్నట్టుగా అన్నారు.

రచన, మార్చి '94

# చినుకుల్లో చిరుమంటలు

## శ్రీధర

చిక్కబడి పోతున్న చీకట్లో సాయంత్రం మెత్తగా కరిగి పోతున్నది.

అభిసారికలా గుమ్మంలో నిలబడ్డ అలివేలు రోడ్డుమీదకు చూస్తున్నది. లింగం రావటం లేదు.

వాన వచ్చేటట్లుగా ఉంది.

పాత బడ్డ గుడిసెలో, పాత బడ్డ కుర్చీలో కూర్చున్న వరహాలుకూడా రోడ్డుమీదకే చూస్తున్నాడు. లాస్టు బస్సు రావటం లేదు.

వాన వచ్చేటట్లుగా ఉంది. నల్లగా మత్తగజాల్లాంటి మబ్బులు నాలుగు పక్కల నుంచి కమ్ముకుంటూ, కుమ్ముకుంటూ వస్తున్నాయి.

లింగం వస్తే కాసేపు కాలక్షేపం అవుతుంది అలివేలుకు.

లాస్టు బస్సు వస్తే ఆ నాటి వ్యాపారం పూర్తవుతుంది వరహాలుకు.

చుట్టూ ఆవరించిన ఈ నిశ్శబ్దం ముంచుకొస్తున్న చావులా భయపెడుతున్నది అలివేలును. ఈ ఒంటరితనం నయంకాని కాన్సర్ రోగంలా బాధపెడుతున్నది.

ఏనాడూ పట్టుమని పది రూపాయలు గిట్టుబాటుగాని వ్యాపారం, వరహాలు ఓపిగ్గా కట్టుకున్న ఆశల ఓడకి అడుగున చిల్లి దొలుస్తున్నది. ఈ టీస్టాల్ వ్యాపారం మీద రెండు వేలు మిగిల్చే దెప్పుడో, పట్నంలో హొటలు పెట్టేదెప్పుడో అని పొద్దున్న లేచి పదహారో సారి దిగులుపడ్డాడు.

నీళ్లు దొరకని ఊళ్లో లంకంత ఇల్లున్న ఇల్లాలు విసుక్కుంటూ చిలకరించిన కలాపినీళ్లలా అక్కడో చినుకూ, అక్కడూ చినుకూ పడుతున్నది. చిత్తుగా తాగి ఒళ్లు విరుచుకు పడుకున్న నల్లని విలాసవతిలా ఉంది, ఎత్తు పల్లాలుగా ఉన్న తారు రోడ్డు. ఎవరో తరుముకొస్తుంటే, ఇటు పారిపోతున్న విటుడిలా, విసురుగా ఆ రోడ్డు మీద పరుగెత్తిందొక లారీ.

అలి వేలు రోడ్డు చివరకూ చూస్తూ ఆలోచిస్తున్నది. ' ఈడు తనని ఊరికంపితే బావుణ్ను. పోనీ ఆడేనా ఎల్లి రెణ్ణాళ్లు రాకుండా ఉంటే బావుణ్ను. లింగాన్ని తోడుంచుకొనే

పని...ఇప్పట్లో ఈడు పొయ్యేట్టు లేదు. మొన్ననే ఇంట్లో గ్గావలిసిన సరుకులన్నీ తెప్పించేసి నాడు పాలెం శెట్టిచేత..."

చాలాకాలానికి ప్రియురాల్ని ఒంటరిగా కలుసుకున్న ప్రియుడిలాగా, చల్లగాలి అలివేలును కావలించుకుని ప్రేమగా ఒళ్లంతా నిమిరింది.

దొంగతనం చేస్తూ దొరికిపోయి, చివాట్లు తింటున్న సేవకునిలా, వంచిన తల ఎత్తటం లేదు రోడ్డు కిరుపక్కలా ఉన్న వరిచేను.

కాలం తాను ప్రసవించిన వెలుగును తానే మింగేసి, చుట్టూ, పాపం లాంటి చీకటిని పెంచుకుంటున్నది.

చెయ్యి విరిగిపోయిన చెక్క కుర్చీలో కూర్చున్న వరహాలు, డ్రాయరు సొరుగు ముందుకు లాగి డబ్బు లెక్క జూసుకున్నాడు. ఎనిమిదింబావలా. ఎంతకీ కలసిరాని వ్యాపారాన్ని, ఎన్నాళ్లకీ తనతో కలిసిపోలేని పెళ్లాన్ని కలేసి తిట్టుకున్నాడు, జనతా టీస్టాల్ క్లీనర్--కం--సర్వర్--కం--ప్రొప్రయిటర్ వరహాలు.

జనతా టీస్టాల్ నేషనల్ హైవే మీద ఉన్నది. దీనికి కుడివైపు పదిహేనుమైళ్ల దూరంలో ఒక టౌనుంది. ఎడమ వైపుముప్పయిఅయిదు మైళ్లదూరంలో ఒక పట్టణం ఉంది. ఈ రెండింటికీ మధ్య రోజుకు నాలుగుసార్లు తిరిగే రెండు బస్సులున్నాయి. లెక్కలేనన్ని సార్లు తిరిగే లారీ లున్నాయి.

జనతా టీస్టాల్ పక్కనే ఊడలు దిగిన మర్రిచెట్టు ఉంది. దానిచుట్టూ పొలా లున్నాయి. ఆ పొలాల మధ్యనుంచి నాలుగువైపులా దారులు చేసుకుని పోతే, నాలుగు ఊళ్లు తగులుతాయి. పొద్దున్న లేస్తే ఆ నాలుగూళ్ల వాళ్లూ బస్సు ఎక్కటానికి మర్రిచెట్టు దగ్గరికి రావాలి. వచ్చినా ప్రతివాడూ ఎంక్వయరీ ఆఫీసులాంటి వరహాలును అడగాలి బస్సు వచ్చిందీ, రానిదీ. బస్సు అందినా అందకపోయినా వాళ్లందరికీ వరహాలు దగ్గర వేడివేడి ఇడ్లీ, కాఫీ అందుతాయి.

ఆర్నెల్ల క్రిందట వరహాలు తమ్ముడుండేవాడు. చాకులా, ఎంతమంది వచ్చినా నిమషంలో అడిగింది అందించేసి, చేతులు దులుపుకుని కూర్చునేవాడు. ఏంపుట్టిందో ఏమో, ఒక రోజు నాకు విసుగు పుడుతున్నదన్నాడు. అనవసరంగా అన్నమీద పోట్లాడి, పట్నం వెళ్లిపోయాడు. వాడు పోవటంతోనే, వరహాలుకు కుడిచెయ్యి విరిగిపోయినట్లు అయిపోయింది. వాడు వెళ్లిన మర్నాడు కుర్చీ కుడిచెయ్యి నిజంగానే విరిగిపోయింది.

తమ్ముడు వెళ్లిపోయాక రెండు రోజులు దీర్ఘంగా ఆలోచించాడు. టౌనుకు వెళ్లి అర్జెంటుగా పిల్లను వెతుక్కుని, పెళ్లి చేసుకుని వచ్చి కాపురం పెట్టాడు. 'పెళ్లాం వస్తే యాపారం కల్సొస్తుందనుకున్నాను. కానీ, ఇదొచ్చి నప్పటినుంచీ అంతా నీరసమే.

ఏటో, మడిసిలో సురుకే నేదు. ఎప్పుడు జూసినా లంకణాలు జేసినదానిలా ఉసూరుమంటా ఉంటది. ఆడదాన్ని బట్టే అయిస్సెర్యం...దాని నాగే యాపారం గూడా ఉసూరుమంటా ఉంది ఇదొచ్చినప్పటాలినుంచి...' అని గొణుక్కున్నాడు వరహాలు, ఎనిమిదింబావలా మళ్లీ లెక్కబెట్టుకుని.

'లింగం రావటం లేదు...' అనుకున్నది అలివేలు.

'నాస్టు బస్సు రాటం లేదు' అనుకున్నాడు వరహాలు.

పెళ్లిగాక ముందు అలివేలు పట్నంలో ఉండేది. మేనమామ పెంపకంలో ఉండేది. అప్పట్లో అది ఇరుకు గదుల్లో ఉండేది. ఇరుకు సందుల్లో తిరిగేది. ఆడదాన్ని జూసి వెకిలిగా నవ్వుతుండే మకిలె మనుష్యుల మధ్య ఇరుగ్గా మసిలేది. అంత ఇరుగ్గా పెరగటం వల్ల, దాని మనసంటే సరిగ్గా ఎదగలేదు గాని, మనిషిమాత్రం కోత కొచ్చిన చెరుకుగడలా ఏపుగా ఎదిగింది.

మేనమామ దగ్గరున్నప్పుడు కొత్త సినిమా వచ్చిన రోజా మొదటాట కెళ్లిపోయేది. తెల్లారేటప్పటికి అందులోని నాయికకు నకిలీగా తయారయి పోయేది. ఈ నకలీ నాయిక పక్కన నాయకులై పోవాలని నకిలీ మనుష్యులు చాలామంది అలివేలుకు ఎరవేసి, వలవేసి చూశారు. నిజనిజాలు ఎవరికీ తెలియవుగాని, సీతమ్మవారిలా అదీ కొన్నాళ్లు నిందలు మోసింది. ఇంతలో అగ్నిప్రవేశం చేసే అవసరం లేకుండానే వరహాలు దాన్ని అగ్నిసాక్షిగా పెళ్లాడి, ఈ అరణ్యావాసానికి తీసుకొచ్చేశాడు.

అలివేలుకు చిన్నప్పటినుంచీ ఒక వ్యసనం ఉంది. కలలు కనటం. ఈ అడవిలోకి కాపరాని కొచ్చాక, దాని కింకోపనిలేదు. పగలూ రాత్రీ కలలే కలలు. కలల్లో, ఆశలు ఒకదాన్ని తరుముతూ మరొకటి ఉవ్వెతున పైకి లేస్తాయి. ఈ అలల అంచున నిలబడి, అందాల తీరాన్ని అందుకోవాలని ఆశగా ముందుకు వంగుతుంది. ఇంతలో వరహాలు కంఠం ఖంగున మోగుతుంది. అల విరిగిపోతుంది. కల చెదిరిపోతుంది. కళ్లు తెరిచి చూస్తే ఏముంది?

ఈ పరిస్థితుల గుడిసెలో తనని ఖైదీలా బంధించి వాస్తవం గస్తీ తిరుగుతుంటుంది. అలివేలు బాధగా నిట్టూరుస్తుంది. ఆ నిట్టూర్పు రోహిణి కార్తెలో ఎండగాడ్పులా ఉంటుంది.

వచ్చిన కొత్తలో పచ్చి కట్టెలు కావటాన ఎంతకీ మండని పొయ్యితోను, ఊరికే మండిపోతున్న గుండెలతోను నానా అవస్థా పడిపోయేది అలివేలు. చుట్టూ అలుముకున్న పొగతోను, పొగలా కమ్ముకున్న ఆలోచనలతోను ఉక్కిరి బిక్కిరి అయిపోయేది. అంతలోనే తన చేతకాని తనం గుర్తొచ్చి, కొండంత దుఃఖం ముంచుకొచ్చేది.

గట్టిగా ఎవరినన్నా కావలించుకుని వేదననంతా కన్నీరుగా మార్చి, కార్చి హృదయభారం తగ్గించుకోవాలని చూస్తే ఆ చుట్టుపక్కల మనుష్యులే ఉండరు. ఉన్న ఒక్క మనిషికీ హృదయమే లేదు. అది ఉండాల్సిన చోట, నాపరాతి బండ లాంటి నల్లని గుండెలు! గుండెల నిండా బండెడు నెత్తురు: ఆ నెత్తురు నిండా దాహం, ధనదాహం!

కట్టెలు ఎండలో పడెయ్యమని చెప్పేది మొగుడితో. పట్నం పోయి మేనమామను చూసొస్తాననిగూడా చెప్పేది. వాడు దేనికి ఒప్పుకునేవాడు కాదు. అదేపనిగా అడిగితే చేతులు చాచి పీక్కుతినటానికి మీదకొచ్చే ఎలుగుబంటిలా, పైనపడి కొట్టటానికొచ్చేవాడు. ఆ ఎలుగుబంటిని చూస్తే అలివేలుకు చచ్చేంత భయం. అయినా అప్పుడప్పుడు అలివేలు మొండికేసేది. సర్కసులో డ్రిల్లు చేయించే వాడిమీదకు తిరగబడి గాండ్రించే చిరుతపులిలా అలివేలు వరహాలుకు ఎదురు తిరిగేది. వెంటనే కొరడా ఝుళిపినట్టు వాడి మొరటు చెయ్యి దాని చెంపమీద చెళ్లుమని మోగేది. అప్పుడది గాలి తీసిన టైరులా అయిపోయేది. గుడ్లనీరు

కుక్కుకుంటూ వంటపని చూసుకునేది.

అలివేలు గుమ్మంలో నిలబడి చూస్తున్నది.

వరహాలు సొరుగులోని చిల్లర లెక్కబెట్టుకుంటున్నాడు.

వాన పెద్ద దయింది. రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. పెళ్లి పందిట్లో హడావుడిగా పోతూ ఇటువైపు చిలకరించిన పన్నీటి బొట్లులా రెండు చినుకులు అలివేలు ఒంటిమీద పడ్డాయి ఆ చినుకులు పడ్డచోట కన్నతల్లి చెయ్యి వేసి నిమిరినట్లు చల్లగా, హాయిగా ఉంది.

"లోనకి రారాదూ?"

ఆకాశాన్ని ఎవరో అప్పడంలా విరిచేసి నట్లు ఫెళఫెళమని శబ్దం. అలివేలు ఉలిక్కిపడింది. వెనక్కి తిరిగింది.

"ఏటా వానలో తడుస్తూ ఆడ నిలబడి జూసేది? లోనికి రారాదూ?" అన్నాడు వరహాలు.

అలివేలు లోపలి కొచ్చింది. గుడిసెలో రెండు గదులు. రెండింటినీ వేరు చేస్తూ మధ్య ఒక తడిక. ముందుగదిలో నాలుగు పక్కలా నాలుగు బల్లలు. ఒక టేబులు, ఒక కుర్చీ. ఇదీ హోటలు. తడిక వెనక వంటిల్లు.

అలివేలు వంటింట్లోకి వెళ్లి లాంతరు వెలిగించి తెచ్చి టేబులుమీద పెట్టింది. పొగబారుతున్న ఆ దీపం వంకా, దాన్ని వెలిగించిన పెళ్లాం వంకా కోపంగా చూశాడు. దీపం తగ్గించాడు. అలివేలు కా ధ్యాసే లేదు. దాని దృష్టంతా ఎక్కడో ఉంది.

మాంచి కబురు పట్టుకొచ్చిన పాత చుట్టంలా, చల్లగాలి హుషారుగా లోపలికి దూసుకొచ్చింది. ఆ చుట్టం తాలుకు స్నేహితుడిలా వానజల్లు గుమ్మందాకా వచ్చి ఆగిపోయింది.

ఆ జల్లుతోపాటే లోపలి కొచ్చాడు లింగం. మెడకు ఉచ్చు వేసి పట్టుకొచ్చిన పాలగిన్నె బెంచీమీద పెట్టాడు.

"ఎదవ్వాన...దార్లో మయాన అట్టుకుంది. ఎన బొయ్యేదానికి నేదు. ముందు కొచ్చీదానికి లేదు. తానమే. వొరసంలో తానం జేసుకుంటా వచ్చేసినాను" అన్నాడు లింగం.

వాడు నోరు తెరిస్తే మాటకన్నా ముందు నాటుసారా వాసన గుప్పుమని బయటి కొస్తున్నది. ఆ సంగతి అలివేలు వెంటనే పసిగట్టింది. పాలగిన్నె తీసుకుని తడికచాటు కెళ్లిపోయింది.

"నాను నీ గురించే ఆలోసనలో బడిపోనాను. వొరసం మొదలయ్యే తయానికి ఇంటికాడ బయలెల్లకపోతే ఇంక వచ్చేది నేదని కరారు చేసేసుకుంతన్నాను" అన్నాడు వరహాలు, దీపం కొద్దిగా పెద్దది చేస్తూ.

"బయలెల్లే తయానికి మబ్బులుతునక నేదయ్యా నెత్తి మీన. సగంలో కొచ్చి తలికి నాలుగేపుల్నించీ, ఊళ్లకు ఊళ్లు తగలడి పోతంటే గుప్పున పొగ నెగిసినట్టు నెగి సొచ్చేసినయి మబ్బులు. ఇంకెంతలే అని గబగబ అంగలేస్తనే ఉంటిని, ఇంతింత లావు సినుకులు మీన బడతనే ఉండే..."

లింగం వర్షాన్ని వర్ణిస్తూ, నెత్తిమీద గుడ్డ తీసి పిండుకున్నాడు. ఆ పిండుకున్న గుడ్డతోనే మొహం తుడుచుకున్నాడు. ఒంటిమీద గుడ్డలన్నీ నీళ్ళోడుతున్నా వాటిని విప్పేందుకుగాని, నీళ్లు పిండేందుకుగాని ప్రయంత్నం చెయ్యలేదు. బొడ్లో ఉన్న కత్తి వాణ్ణి ఆ పని చెయ్యనివ్వలేదు.

"నాస్ట్ బస్ ఎల్పోనాదా?" అని అడిగాడు లింగం.

"నేదు. దాని కోసమే జూస్తున్నా మీ ఊరోళ్లు ఎవరేనా ఎల్నారేటి టౌనుకి?"

"పొద్దుటేల పోస్టు బస్సులో ఆనందరావుగారెల్లినార్లే. ఈ బస్సులో వొచ్చీయాలి మరి" అన్నాడు లింగం.

చొక్కా లోప లెక్కడో భద్రంగా పెట్టుకున్న చుట్టల్ని బయటికి తీశాడు. అగ్గిపెట్టె కొంచెం చెమ్మగిల్లి, రెండు పుల్లలు గీసినా వెలగలేదు.

"తూ, దీనెమ్మ...ఇదుగో యావమ్మోవ్, అగ్గిపెట్టి కాత్త ఇటుబడెయ్" అని అరిచాడు లింగం, అలివేలు నుద్దేశించి.

అలివేలు వచ్చి అగ్గిపెట్టె ఇచ్చింది. లింగం చుట్ట వెలిగించుకుని, గుప్పుమని పొగ వదిలాడు.

"ఇయ్యాల కుంబవృష్టే...ఆనందరావుబాబు వొత్తాడో, నేదో" అన్నాడు లింగం, బయటికి చూస్తూ.

'ఎల్లినోరు రారేటి? వొత్తార్లే" అన్నాడు వరహాలు.

"రావాలీ...నా సామిరంగా ఇయ్యాలతో నా జాతకం మారిపోవాల....' అనుకున్నాడు లింగం.

'ఆనందరావును ఎలాగేనా తనతో తీసుకుపోవాలి. దారి మద్దెలో సఫాచేసెయ్యాలి. ఈ బాబు నేకపోతే మునసబుగారింక అడ్డు నేకుండా పెసిడెంటయిపోతాడు. కరణం కూతురు, కామేస్సరమ్మకి కులం తక్కువోణ్ణి కట్టుకునే యోగం తప్పిపోద్ది. తనకి ఇంటింటా ఊడిగం చేసే కర్మ తప్పిపోద్ది.

ఆనందరావు పని పూర్తి చేస్తే మునసబు ఎకరం పొలం ఇస్తానన్నాడు. కరణం శెట్టి కొట్టు పక్కన తలం, అందులో ఇల్లేసుకోటానికి రెండు వేల రూపాయలూ ఇస్తానన్నాడు.'

తెల్లారేలోపున ఆనందరావుని అంతం చేసేస్తానని, లింగం వాళ్లిద్దరికీ మాటిచ్చేశాడు. లింగాన్ని పీకలదాకా తాగించేసి పంపించేశారు.

వరహాలు ఏదో అడిగాడు. లింగం టౌనులోకి వెళ్లిపోయే ఎద్దులబండిలా, గడగడ వాగేస్తున్నాడు. పాల అమ్మకం గురించీ, పాలెంలోని పాలిటిక్సు గురించీ, కట్టటం పూర్తయినా ఏకాలువలు తవ్వటం పూర్తిగాని ప్రపంచంలోని ఓ పెద్ద ప్రాజెక్టు గురించీ, అపోజిషన్ మెంబరులా, బయటకురుస్తున్న వర్షంలా దంచి పారేస్తున్నాడు లింగం. అర్ధరాత్రి ఒంటరిగావస్తూ కొరివిదయ్యాన్ని చూసి జడుసుకున్నా మనిషిలా ఆగకుండా పరుగెత్తింది లాస్ట్‌బస్. అది ఆగలేదు గనక అందులోంచి ఆనందరావు దిగలేదు. ఎండలో పెట్టిన మంచుగడ్డలా నిలువునా నీరుకారి పోయాడు లింగం.

అలా పరుగెత్తిన బస్సు ఫర్లాంగు దూరం పోయాక, పనికిరాని వస్తువును కిటికీలోనుంచి

గిరాటేసినట్లు, ఆనందరావును రోడ్డుమీదకు తోసేసి, పాము పిల్లలా పారిపోయింది. ఆనందరావుకి తనెక్కడున్నాడో తెలియలేదు ముందు. భగవంతుడు సృష్టినంతా తనే చేత్తో చెరిపేసినట్టు చుట్టూ చిమ్మ చీకటి. రోగంతో ఒళ్లంతా కుళ్లిపోయిన వాడి కడుపున కదిలే పురుగుల్లా, ఆ చీకట్లో రాలుతున్న చినుకులు.

అలవాటున్న రోడ్డు కావటం వల్ల ఆనవాళ్లు గుర్తు పట్టి వెనక్కి నడవటం మొదలు పెట్టాడు ఆనందరావు.

సమాజంలోని సంప్రదాయాలు పరిచిన బాటలా నున్నగా, నల్లగా ఉన్నది తారురోడ్డు. ఆచరించలేని అభ్యుదయ వాదుల మాటల్లా ఉన్నాయి, ఆ రోడ్డు మీద పడి చిట్లి పోతున్న చినుకులు. మెత్తని ముళ్లలా అతని కాళ్లక్రింద నలిగిపోతున్నాయి. వర్షపు నీటిబొట్లు. ముందుకు రావద్దని లాఠీచార్జి చేస్తున్నది ఎదురుగాలి. బలాన్ని, బలగాన్ని పోగుచేసుకుని విప్లవాన్ని నడిపించే నాయకుడిలా శక్తినంతా కూడదీసుకుని ముందుకు నడుస్తున్నాడు ఆనందరావు, చేతిలోని బ్రీఫ్ కేసుతో.

టీస్టాల్ దగ్గరి కొచ్చేటప్పటికి పూర్తిగా తడిసిపోయినాడు. ఉప్పెనలా లోపలి కొచ్చేసి గది మధ్యలో నిలబడ్డాడు. అతను నిలిచిన చోట నేలంతా తడిసి నీటి మడుగైంది.

శుభ్రంగా తలంటి పోసుకుని తుడుచుకోకుండా అక్కడి కొచ్చిన వాడిలా ఉన్న ఆనందరావును చూసి లింగం నవ్వాడు, పులి ఆకలిగా ఉన్నప్పుడు ఎదురుపడ్డ మేక పిల్లను చూసి గాండ్రించినట్లు.

వరహాలు నవ్వాడు, దేవుడు ప్రత్యక్షమైతే, భక్తుడు పారవశ్యంతో నవ్వినట్లు.

అలివేలు నవ్వింది, పెళ్లయిన కొత్తలో అత్తారింటి కొచ్చిన మొగుణ్ణి ఓరకంట చూసి సిగ్గుపడిన చిన్నదానిలా.

వీళ్లందర్నీ చూసి ఆనందరావు ఇబ్బందిగా నవ్వాడు—ఇద్దరూ కూర్చోవలసిన బస్సుసీటులో ఇరుక్కుని కూర్చున్న మూడో వాడిలా.

"తడిసి ముద్దయిపోనారు, బాబూ" అన్నాడు వరహాలు.

"శాన నేటయి పోనాది, బాబూ" అన్నాడు లింగం.

"తుడుసుకోండి, బాబూ" అని తుండుగుడ్డ అందించింది అలివేలు.

ఆనందరావు ముందు తల తుడుచుకోలేదు. ఒళ్లు తుడుచుకోలేదు. చేతిలోని బ్రీఫ్ కేసును శుభ్రంగా తుడిచాడు. దాన్ని టేబులు మీద పెట్టి, తృప్తిగా చూసుకున్నాడు. తరవాత చకచకా ఒంటి మీద తడిని అద్దేసు కున్నాడు తుండుగుడ్డకి.

"ఏటీ యదవ్వాన, ఇలా గట్టుకుంది? ఎలిసేటట్టు నేదే? మనం పాలేనికి బయలెల్లి పోదామా, బాబూ..." అన్నాడు లింగం.

"సాల్లేవయ్యా, నువ్వొకడివి. ఆ మయిన ఏనుగు తొండాలతో జిమ్మినట్లు జోరున వాన గురుస్తా ఉంటే ఏ టెల్తారు?" అని సాగదీసుకుంది అలివేలు.

ఆరునెలల నుంచి నోరు పడిపోయిందేమో అనుకున్న అలివేలుకు ఈ పూట చెప్పరానంత సంతోషంగా ఉంది. దట్టంగా లేచిన మబ్బును చూసి నెమలి నాట్యం చేసి నట్లు, మరో మగాణ్ణి చూడగానే అలివేలులో అణగారిన ఉత్సాహం పురి విప్పి నాట్యమాడింది.

"ఇయ్యాల్టికి ఈడే ఉండిపొండి, బాబూ, ఈ సీకట్లో, వారసంలో ఎలా గెల్తారు?" అని సలహా చెప్పాడు వరహాలు. "ఈ డెలాగుంటారయ్యా? ఆ బాబు కీడ నిద్దర పట్టుద్దా? ఆకలి తీరుద్దా? ఆయనెలా గుంటారీడ? ఆరింటికి ఎల్‌పోవాల్సిందే. నానున్నాను గదూ, బాబూ, మీ కేటి బయ్యం? గట్టిగా నాలుగు అడుగు లేస్తే, గంటలో ఎల్లిపోతాం" అని నచ్చచెప్పబోయినాడు లింగం. ఆనందరావును బయటికి తీసుకుపోకపోతే తన ప్లానంతా తల్లక్రిందులై పోతుందని వాడి భయం.

"నీ కంటే సీకట్లో ఎల్లటం అలవాటు. ఆ బాబుకేటి అలవాటు?" అని రెట్టించాడు వరహాలు.

"ఈ పూటకి ఉండి పొండి బాబూ. మాతో పాటే తిందురుగాని.. ఉందురుగాని" అని బ్రతిమలాడింది అలివేలు.

ఆనందరావు ఎటూ చెప్పలేక కొంచెం సేపు ఆలోచించాడు. గుమ్మం దాకా వచ్చి చెయ్యి బయటికి పెట్టి చూశాడు.

చూరు అంచున కారుతున్న నీటి ధారలు గుమ్మానికి అందంగా కట్టిన తెల్లని ఆ పూసల పేరుల్లా మెరుస్తున్నాయి. ఆ పూసల పేరుల కవతల వర్షం నిలబడి కురుస్తున్న శబ్దం. అరిగిపోయిన పాత గొంతుకతో భోమని అరుస్తున్నది.

బస్సు దిగిన తరవాత ఈ కాస్త దూరం రావటానికే ఎంత కష్టమైందో, ఆనందరావుకి గుర్తొచ్చింది.

"వర్షం తగ్గేట్లు లేదు, లింగం" అన్నాడు ఆనందరావు చివరికి.

"ఉండిపొండి, బాబూ, ఏదో వారసం మూలకంగా ఇలా గొచ్చేసినారు గాని నేపోతే మీలాటోరు తపసు జేసినా మా ఇంటి కొస్తారేటి? అన్నది అలివేలు.

"అవును బాబూ, తెల్లారి ఎల్‌పోవచ్చు. రేత్రికి రేత్రి ఎల్లాల్సిన అర్జెంటేటి?" అనిముక్తాయింపు ఇచ్చాడు వరహాలు.

"వర్షం వెళ్లనిచ్చేటట్లు లేదులే" అన్నాడు ఆనందరావు, చవితి నాటి చంద్రుడిలా బలహీనంగా నవ్వుతూ.

అతనికి బాగా ఆకలిగా ఉంది. నాలుగు మైళ్లు నడిచే ఓపిక లేదు ముందు.

అలివేలు గబగబా లోపలికి పోయి వరహాలు పెళ్లినాడు కట్టుకున్న పట్టుపంచె తెచ్చి ఆనందరావు ముందు పెట్టింది.

"కట్టుకోండి, బాబూ, తడి బట్టలతో నాంతన్నారు" అంది.

వరహాలు దాని కోర్కెను బలపరిచాడు. ఆనందరావు చొక్కా విప్పి వంటింటి తడికమీద వేశాడు. పట్టు పంచెను లుంగీలా చుట్టుకుని, తుండు గుడ్డని ఒంటినిండా కప్పుకున్నాడు.

పచ్చని ఒళ్లూ, నున్నని జబ్బలూ, ఉంగరాల జుట్టూ - వెరసి యౌవనంతో మెరిసిపోతున్న ఆనందరావును చూసి, రంగు కాగితాల్లో మెరిసిపోతున్న చాక లెట్టును చేతికి స్తే చూసుకుంటూ మురిసిపోయిన చిన్న పిల్లలాగా, మురిసిపోయి, కాసేపు తనని తాను మరిచి పోయింది అలివేలు.

ఇంతలో వంట మాట గుర్తుకొచ్చి, ఆ ప్రయత్నంలో మునిగిపోయింది. ఆనందరావు బ్రీఫ్‌కేసును దగ్గరికి లాక్కుని కూర్చున్నాడు బెంచిమీద.

ఆ మగవాళ్లు ముగ్గురూ ఇందిరా గాంధీ గురించి, ఇండియాలోని దరిద్రం గురించి, పాలేనికి కంకరరోడ్డు పడక పోవటానికి గల కారణాల గురించి, తెల్లవారూ వర్షం కురిస్తే పంటకు జరిగే నష్టం గురించి మాట్లాడుకున్నారు.

రాత్రికి ఇంకో గంట వయసు పెరిగాక అలివేలు వంట పూర్తిచేసి, ఆనందరావుకి వడ్డించింది. అతని పక్కన కూర్చుని భోజనం చెయ్యగల ధైర్యం లేదు వరహాలుకు. అందువల్ల లింగంతో బాతాఖానీ వేసుక్కూర్చున్నాడు.

"లేనోళ్లకి పొలాలు పంచిపెడతారంటగా" అన్నాడు.

"ఏటోలే. ఆళ్లు ఇస్తే మాత్తరం, దున్ని పండించుకునే శక్తి అందరికీ ఉండొద్దేటి? శాతగానోడికి ఇంత పొలం ఇస్తే, ఏటి సుకం? అలివిగాని పెళ్లాన్ని అంటగట్టినట్టే గదేటి?" అన్నాడు లింగం.త్రికాల జ్ఞానిలా పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు బెంచీమీద. భవిష్యత్తులో రాగల ప్రమాదాలన్నిటినీ, బ్రహ్మంగారిలా ముందే ఊహించి చెప్పేస్తున్నాడు అనర్గళంగా.

వంటకాలు చూసిన ఆనందరావుకి ఆకలి చచ్చిపోయింది. నీరసం హెచ్చి పోయింది. నీళ్లుకారిపోతున్న చింతపండు పచ్చడితో దావాగ్నిలాంటి ఈ ఆకలిని ఎలా తృప్తి పరచాలో అతని కేం అర్థం కాలేదు.

అలివేలు మాత్రం ఈ అవకాశాన్ని వృథా పోనిచ్చుకోలేదు. విస్తట్లో అన్నం పెట్టి, తన గుట్టంతా బయట పెట్టింది.

మొగుడు వట్టి మొరటు ముండా కొడుకంది. చావగొడుతున్నాడన్నా డంది. నమ్మకం కుదరటం కోసం బుజాపులు చూపించింది. రవిక పైకి లాగి జబ్బ మీద, చీర పక్కకు లాగి పొత్తి కడుపు మీద మానిపోయిన గాయాల తాలూకు మచ్చల్ని చూపించింది.

ముందు గదిలో మాటలు ఆగిపోయినప్పుడు అలివేలు మాట మార్చేస్తున్నది. పచ్చడి ఎలా ఉందని అడుగుతున్నది. మీ లాటోరికి నచ్చవులెండని అంటున్నది.

ఆనందరావు విస్తరిముందు నుంచి లేచేలోగా తను చెప్పదలుచుకున్నదంతా చెప్పేసింది. తనని ఎలాగైనా సరే, ఈ గుడిసెలోనుంచి, వరహాలు గుప్పిటలో నుంచి బయటికి లాగమని కోరింది. లేవబోతుంటే, చెక్కపెట్టె మీదున్న హార్లిక్స్ సీసాలోంచి మైసూరు పాక్‌ముక్క ఒకటి తీసి వేసింది. ఆ పూట అతను తినగలిగిన పదార్థం అదొక్కటే అయింది.

లేచి ముందు గదిలో కొచ్చేటప్పటికి వరహాలు ఆనందరావు పెట్టెను శల్య పరీక్ష చేస్తున్నాడు.

"ఇంత సిన్న పెట్టి తీసుకున్నారేటి, బాబూ. రెండు జతల గుడ్డలయినా పడతాయా ఇందులో?" అని అడిగాడు పెట్టను యథాస్థానంలో పెట్టి.

"గుడ్డలు పెట్టుకోవటానికి కాదది" అని నవ్వాడు ఆనందరావు.

కాదని వరహాలుకీ తెలుసు. అయినా అమాయకంగా కనపడటానికి కొంతా, అసలు

విషయం కూపీ లాగటానికి కొంతా అలా అడిగాడు. రెండు మూడు సినిమాల్లో వాడు చూశాడు. ఇలాంటి పెట్టెల్లోనే వాళ్లు డబ్బు, నోట్ల కట్టలు పట్టుకెళతారు. ఈ బాబుకి మాత్తరం ఏటి తక్కువ? కాబోయే పెసిడెంటు...

"అసలు మీరు నాలుగ్గంటలు బస్సులో వొచ్చీవల్సింది. ఈ తయానికల్లా ఇంట్లో అయినా బోనం చేసేసి, ఎచ్చంగ దుప్పటి కప్పుకుని పొడుకునీవోరు..." అని మళ్లీ గుర్తు చేశాడు లింగం.

"నాలుగ్గంటల బస్సుకే వద్దామనుకున్నా. బాంకులోనే రెండు గంటలు దాటిపోయింది. అక్కడినుంచి కలెక్టరాఫీసులో కాస్త పనుంటే అది చూసుకుని వచ్చేటప్పటికి బస్సుకాస్తా వెళ్లిపోయింది" అన్నాడు ఆనందరావు.

ఇప్పుడు వరహాలు అనుమానం పూర్తిగా నివృత్తి అయింది. ఈ బాబు బాంకు కెళ్లి ఈ పెట్టెనిండా డబ్బు తెచ్చుకుంటున్నాడు. ఎలచ్చన్లుగద! మునసబుమీన నిలబట్టమంటే మాటలేటి? ఆ పెట్టిలో ఎన్నొందలు పట్టుద్దో?...వందలేటి, ఏలల్లోనే ఉంటుంది.

వరహాలు భోజనం చెయ్యటానికి లోపలి కెళ్లాడు. లింగం చివరిసారి ప్రయత్నించాడు.

"వాన ఎల్సిపోయింది, బాబూ. ఎల్‌పోదామేటి?"

ఆనందరావు మాట్లాడలేదు.

"బోనం ఎలాగూ సరిగ్గా నేదు. ఇంటి కెల్తే కాత్త కంటినిండా కునుకేనా పట్టుద్ది."

"ఇప్పుడా బురదలో పొలం గట్ల మీద పడుతూ లేస్తూ నేను రాలేనులే, లింగం. ఈ రాత్రి కెలాగో ఇక్కడే కాలక్షేపం చేస్తాను" అన్నాడు ఆనందరావు. ఆ మాటలు లింగం ఆశల్ని కూకటి వేళ్లతో పెకలించి వేసినాయి.

లింగం వెళ్లటానికి లేచి నిలబడ్డాడు.చీకట్లోకి చూస్తూ. ఆలోచించాడు. 'రేప్పొద్దున్నగాని ఈన రాడు. పగటి పూట తన పని జరగదు. తనిప్పుడు పాలెం ఎల్‌పోతున్నాని జెప్పేసి బయట యాడన్నా దాంకుని, ఏ రేత్తిరియాలో ఈన బయటి కొచ్చినప్పుడు పని పూర్తి సేసుకుంటే సిక్కు నేదు. అదంతా. వరాలుగాడి మీద పడుద్ది...'

"పొలగిన్నె రేపు అట్టుకెల్తాలే" అని అలివేలుతో చెప్పేసి బయటి కొచ్చాడు లింగం. మర్రిచెట్టు క్రింది కొచ్చి గుడిసెకు చేరువగాను, చాటుగాను ఉండే చోటు కోసం చూశాడు. చివరిగా గుడిసె చూరుక్రింద జేరాడు.

గుడిసెలో జల్లు కురిసి సగం నేల తడిసిపోయింది. ఈ చూరుక్రింద మాత్రం ఇంకా పొడిగానే ఉంది నేల. మర్రిచెట్టు కొమ్మ ఒకటిపైన పందిరేసి నట్లు ఉండటం వల్ల అక్కడొక్క చినుకుకూడా రాలటం లేదు.

'ఈ మాత్తరం ఉంటే చాలు. తెల్లారేలోపుగా ఒక్క పాలన్నా ఆ బాబు బయటికి రాకపోడు. తన పని పూర్తిగాక పోదు. అంతగా ఆయన రాకపోతే, తెల్లారు జామున తనే లోనకెల్లి, ఈ కత్తి ఆ బాబు గుండెల్లో దించేసి ఎల్‌పోటమే...'

భోజనం చేసి ఇవతలికొచ్చిన వరహాలు ఆనందరావు కన్నా ముందు అతని పక్కనున్న బ్రీఫ్ కేసును చూశాడు. 'అనుమానం నేదు. అందులో డబ్బులేకపోతే ఆ పెట్టినంత బద్రంగా సూసుకోడు. పైకం దగ్గరుంటంసేతే సీకట్లో ఆ రవుడీ ఎదవ ఎనకాతల

ఎల్లటానికి ఎనకాడే రీబాబు' అని ఊహించాడు వరహాలు.

వంటిల్లు శుభ్రం చేస్తూ ఆనందరావును చూడకుండా ఉండలేకపోయింది. ఈరోనాగున్నాడు. సోబనబాబు తీరునున్నాడు.' అని తనలో తనే గొణుక్కుంది.

ఆనందరావు కాపూట భోజనం చేసి నట్లే లేదు. రెండు మెతుకులు కొరికి నాలుగు గ్లాసులు నీళ్లు తాగాడు. ఆ మైసూరుపాక్ ముక్క మరోటి వేసినా బాగుండేది. అడగటానికి అభిమానం అడ్డొచ్చింది.

తెల్లారేలోపున ఈ బాబును కైలాసానికంపిగాని, పొలెం బోగూడదు. మునసబు గోరికీ, కరణంగోరికీ మాటిచ్చి వొచ్చాడు. నేకపోతే ఈనకి ఆల్లతో తగూవేంటి? మునసబుతో పోటీ జేత్తాడా? కరణం కూతుర్ని, బాపనోళ్ల పిల్లని పెళ్లి జేసుకోవాలని జూత్తాడా? అర్దాయుష్షోడు గాకపోతే, ఏంటీ పనులు?' అనుకున్నాడు. లింగం చుట్ట మళ్లీ ముట్టించుకుంటూ.

"తెల్లారేలోపున ఈ పెట్టిచ్చుకుని పారిపోవాల. ఎంత నేదన్నా పాతిక, ముప్పయి వేలకి తక్కువుండదు అందులో. ఈ దెబ్బతో దరిద్దరం దీరి పోవాల' అనుకున్నాడు వరహాలు, సొరుగులోని డబ్బు డబ్బాలో వేసుకుంటూ.

'తెల్లారేలోపున ఈ బాబుకి వలెయ్యాలి. ఒళ్ళోకి లాగాలి. ఒక పాలి పరిచయం అయ్యాక యాడికి పోతాడు? తిక్కరేగినోడిలాగా ఈ గుడిసె చుట్టూ తిరగడూ? ఆ మాత్తరం మనిసితోడుంటే మర్నాటికల్లా తనీ గుడిసెమీన దెబ్బ గొట్టి ఎల్లిపోదూ!..' అనుకున్నది అలివేలు పక్కలు పరుస్తూ.

"తెల్లారేలోపల ఆ సీసాలోని రెండు మైసూరు ముక్కలు లాగిస్తేగాని తను తట్టుకోలేడు' అనుకున్నాడు ఆనందరావు.

"తమరు లోన పడుకోండి బాబూ. ఈ ముందు గదిలోనేలంతా తడ్సిపోనాది" అన్నాడు వరహాలు

ఈ ప్రతిపాదన ముగ్గురికీ, నచ్చింది. వాళ్లిద్దరూ వెనక గదిలో పడుకుంటే, ఈ పెట్టి పుచ్చుకుని ఇటునుంచిటు జారుకోవచ్చని తలపోశాడు వాడు.

'మొగుడు బయట పడుకుని, ఈ బాబు తనతో లోన పాడుకుంటే అంత కన్నా కావల్సిందేముంది?' అనుకుంది అలివేలు.

'వంట గదిలో పడుకుంటే, ఏ అర్ధరాత్రి పూటో మరో రెండు మైసూరు పాక్ ముక్కలు నోట్లో వేసుకునే అవకాశం దొరకచ్చు' అనుకున్నాడు ఆనందరావు.

'కునుకు రానీగూడదు. ఆ బాబు బయటికొస్తే ఈ బాకు గుండెల్లో దిగబడిపోవాల' లింగం.

'ఈ డబ్బు అట్టుకుపోయి దగ్గర్లో యాడా ఉండకూడదు. దూరంగా మదరాసో, అయిదరాబాదో ఎల్లిపోవాల' వరహాలు.

'ఇసుమంటి చాన్సు మళ్లీ రాదు. ఎంత బావున్నాడీ బాబు!' అలివేలు.

'చిన్నప్పటినుంచీ తను ఆకలి అంటే ఏమిటో ఎరగకుండా పెరిగాడు టౌనులో టిఫిన్ తీసుకోకుండా రావటం పొరపాటయింది' ఆనందరావు.

ఎవరి పక్కలమీదకు వాళ్లు చేరారు. ఆనందరావు చొక్కా, లాగూ ఆ తడికి మీదే వదిలేశాడు గాని బ్రీఫ్ కేసు మాత్రం తీసుకెళ్లి తల దగ్గర తడికకు ఆనించి పెట్టాడు.

వరహాలు దీపం ఆర్పేశాడు. అలివేలు చిమ్నీ చిన్నది చేసింది. అంతా పడుకున్నారు. ఈ రాత్రి కెవ్వరూ నిద్ర పోగూడదని అనుకున్నారు.

ఈ బాబు సఫా అయిపోతే తనకి ఎకరం పొలం, శెట్టి కొట్టు పక్కన తలం, డబ్బు...ఒకడి బతుకు బాగుపడాలంటే, మరోడి బతుకు నాశనమవ్వాలిరా అంటాడు మునసబు బాబు. ఎంత గొప్పగా సెప్పేడు!'

'ఎన్ని ఇడ్లీలు, కాఫీలు అమ్ముకుంటే మాత్తరం అంత డబ్బు మిగల్చగలడు! రేపు ఏటవుద్దో ఎవురి కెరుక?... అవకాశాలు అందరికీ రావురా, వచ్చినా అవకాశాన్ని వదులుకోగూడదు అంటారు రోజూ తన దగ్గిర కొచ్చే పారుపల్లె పంతులు. ఏదంలాంటి మాట అది!'

"ఆ జబ్బలు ఎంత నున్నగా ఉండయి! ఆ సేతులు ఎంత బలంగా ఉండయి! ఒక్కపాలి ఆ బాబు కౌగిట్లో...నీతీ నేదు, నాయం నేదు. అంతా మనం అనుకోటంలోనే ఉంది అనేవోడు మేన మామ దగ్గరున్నప్పుడు తన కోసం వచ్చే రాంబాబు. ఆలోసిస్తే అంతే గదేటి, మరి!'

'ఆకలి....ఇది మనిషి చేత దాస్యం చేయిస్తుంది. అదే మనిషిని రెచ్చగొట్టి, విప్లవాన్ని సృష్టిస్తుంది. ఈ ఆకలి అణుశక్తి కన్నా అపాయకరమైనది... ఈ వేళ తన దగ్గర డబ్బున్నది. ఎంత డబ్బున్నా ఈ క్షణంలో దానికి తన ఆకలి తీర్చగల శక్తి లేదు...'

భవిష్యత్తులా ముందు ఏముందో కనపడని చీకటి. చీకటిలా చిక్కగా చుట్టూ కమ్ముకున్న నిశ్శబ్దం. నిశ్శబ్దంగా అందర్నీ చిచ్చుకొడుతున్న ఆలోచనలు. కునుకు రానివ్వగూడ దనుకున్నా అందర్నీ ఒకసారి పలకరించి పోయింది నిద్ర. ఆ నిద్దురలో చిన్న కల.

లింగం ఊరి చివరి గుడిసెలోనుంచి, ఊరి మధ్యకు అడ్రసు మార్చాడు. రాజకీయాల్లో పేచీలొచ్చిన పెద్ద మనుష్యులకు రాజీలు చేసే స్థితిలో ఉన్నాడు. మునసబుకీ, కరణానికీ లింగం గారంటే చచ్చే భయం. వచ్చే ఎలక్షన్లో ప్రెసిడెంటుగా ఆయన నిలబడతారంట

వరహాలు రాజధాని నగరంలో బిజినెస్ మాగ్నెట్ అయిపోయాడు. సొంతంగా ఒక పెద్ద హొటలు కట్టించాడు. రెండు కార్లు కొన్నాడు. మళ్లీ పెళ్లి చేసుకున్నాడు.

అలివేలుకు సినిమాలో వేషం దొరికింది. మిస్ అలీనా అంటే జనం పడి చస్తున్నారు. తెలుగు వచ్చీ రానట్లు మాట్లాడుతుంది. ఆవిడ మాతృదేశం మహారాష్ట్ర అనీ, మైసూరు అని వాదులాడుకుంటున్నారు అభిమానులు. పెద్ద పెద్ద వాళ్ళంతా పగలూ, రాత్రీ అనకుండా ఆవిడ దర్శనం కోసం పోటీలు పడుతున్నారు.

దేశంలో ఎక్కడ చూసినా ఆకలి, నిరుద్యోగం, కొట్లాటలు, దౌర్జన్యాలు, దేశమాత పిలుపు నిచ్చింది. కామేశ్వరీ తనూ తెల్ల బట్టలు కట్టుకుని దేశసేవకై ఊరూరా తిరుగుతున్నారు. బిచ్చం ఎత్తుతున్నారు! చిత్రం, దేశంలో అంతా బిచ్చం ఎత్తుతున్నారు!

వరహాలుకు మెలుకువ వచ్చింది. చప్పుడు గాకుండా బయటి కొచ్చాడు. వర్షం

పడుతున్నదో, లేదో చూశాడు.

రాత్రికి సగం వయసు దాటిపోయింది. వర్షం వెలిసిపోయింది.

లింగం చాటునుంచి ఊపిరి బిగబట్టి చూశాడు బొడ్లో కత్తి బయటికి లాగి ఎత్తి పట్టుకున్నాడు. వరహాలు వెనక్కి తిరిగాడు. లింగం వాణ్ణి గుర్తు పట్టి గు డిసె వెనక్కి జరిగాడు.

వరహాలు లోపలి కొచ్చి గదిలోకి తొంగి చూశాడు. చిమ్మీ పలుచని ఉల్లిపొరలాంటి వెలుతురు పరిచింది. ఇద్దరూ నిద్దరలో ఉన్నారు. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి బ్రీఫ్ కేస్‌ను రెండు చేతుల మధ్యకు ఎత్తుకున్నట్లు జాగ్రత్తగా పట్టుకుని, ఒక సారి భార్యవంక చూసి ఒక్క ఉదుటన బయట పడ్డాడు. పట్నానికి దోవపట్టాడు.

పది నిమిషాల తరవాత ఆనందరావుకి మెలుకువ వచ్చింది. ఆకలి సంగతి గుర్తు కొచ్చింది. కడుపులో మంట రేగింది. లేచి మెల్లిగా చెక్కపెట్టె దగ్గరకు పోబోయి నిద్రమత్తులో అలివేలు చెయ్యి తొక్కేశాడు.

అలివేలుకు మెలుకువ వచ్చింది. దాని ఆకలి సంగతి దానికీ గుర్తు కొచ్చింది. గుండెల్లో మంటల్లాంటి దేదో రేగింది. నరాల్లో నెత్తురు ఉరక లెత్తింది. ఆ మత్తులో, నిద్రమత్తులో చేతి కందిన ఆనందరావు పంచెను పట్టుకుని లాగేసింది.

పట్టుపంచె కావటాన పట్టు నిలవక జారిపోయింది. జారిపోయిన పంచెను పైకి లాక్కునే నిమిత్తం ముందుకు వంగాడు. ముందుకు వంగినవాణ్ణి మీదకు లాక్కుంది అలివేలు.

వాళ్లిద్దరిమధ్యా జరగగూడని పెనుగులాట జరిగింది. గింజుకుంటున్న నాగరికతను అనాగరికత కాటేసింది.

ఉద్రేకానికి అమ్ముడుపోయిన ఆనందరావు అలివేలుమీద అపచారం చెయ్య బోయినాడు. చిత్రంగా, ఆ సమయంలో అతని ముందు కామేశ్వరి నవ్వుతూ నిలబడింది. ఆనందరావు బిక్కచచ్చిపోయినాడు.

తనమీద పగ బట్టిన కరణంగారి కూతురు కామేశ్వరి. తన క్లాస్‌మేట్. కాబోయే ఇల్లాలు. ఆ అమ్మాయి అతని గుండెల్లోనే ఉంది గాబట్టి, అతను తనకు చేయబోయిన ద్రోహాన్ని అంత తొందరగా తెలుసుకోగలిగింది.

ఆనందరావు అవమానంతో తల వంచుకున్నాడు. ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు మోకాళ్లదాకా ఎత్తిన అలివేలు చీరను క్రిందకు దించేశాడు. వెళ్లి అటు తిరిగి పడుకున్నాడు.

అలివేలు ఒళ్లు తుఫానులో పిచ్చిగా ఎడిసిపడే కెరటంలా ఉవ్వెత్తున లేచి పడుతున్నది. ఆ కెరటం అడుగున కసి, కోపం, మేనమామ మీద. మొగుడి మీద...దేవుడిమీద...

మోకాలి దగ్గర దాని ఒంటిమీద తెల్లని మచ్చ ఉంది. అది ఆనందరావు చూసి ఉంటాడని ఊహించింది. తన బ్రతుకిలా తెల్లారిపోవలిసిందేమోనని ఏడ్చింది. తూర్పున తెల్లారేదాకా.

సూర్యుడికి మెలుకువ వచ్చింది. ప్రకృతికి మెలుకువ వచ్చింది. పక్షులకు

మెలుకువ వచ్చింది. మళ్ళీ సందడి మొదలైంది. మరొక రోజు మొదలైంది. అలివేలు దినచర్య మొదలైంది. ఆలోచన...

వరహాలు కేక వినపడలేదు. మనిషి కనపడలేదు. వాడి కోసం బయటి కొచ్చింది. ఇంటి చుట్టూ చూసింది. ఒక్క ఉదుటున పరుగెత్తు కొచ్చి ఆనందరావును కుదిపి లేపింది.

"ఏమిటి? ఏమైంది?" అన్నాడు ఆనందరావు బిత్తరపోయి.

అలివేలు బావురుమంది. భయంతో వణికిపోయింది. అతణ్ణి గట్టిగా చుట్టుకు పోయింది. అతను కావలిసినంత ఖంగారు తిని, అఖ్ఖర్లేనన్ని గుటకలు ఏమైందని అడిగాడు మళ్ళీ, దానికి నోట మాట మాట రాలేదు. గుడిసె వెనక వైపు చెయ్యి చూపించింది. ఇద్దరూ వెనక్కి వెళ్లి చూశారు.

చూరుక్రింద లింగం చచ్చిపడి ఉన్నాడు.!

వాడి ఒళ్లంతా నల్లగా కాలిపోయిన కట్టెలా ఉంది. జీవం లేని కళ్లు దిగంతాల వైపు చూస్తున్నట్లే ఉన్నాయి.

లింగం ఇంక లేడు! వరహాలు ఇక్కడ లేడు!

అలివేలు ఆనందరావును అంటి పెట్టుకుని ఉన్నది!

"ఎలా? ఏమైంది." అన్నాడు ఆనందరావు.

"ఏమో" అంది అలివేలు.

"నీ మొగుడేడి?"

"ఏమో?"

"ఇద్దరూ లోపలి కొచ్చారు. ఆనందరావు బట్టలు తొడుక్కున్నాడు. వర్షించి వెలిసిన మేఘల్లా ఉన్నాయి అలివేలు నేత్రాలు.

"నా పెట్టె ఏది?" అని అడిగాడు.

"ఏమో? ఏముంది అందులో?"

"ఏవో ఎన్నికల తాలూకువి కొన్ని కాగితాలున్నాయి...సరే నువ్వేం చేస్తావు? మీ వాళ్లెవరూ లేరా?"

"లేరు. మీతో వస్తాను" అంది అతనికి దగ్గరగా జరిగి, ఆలిచిప్పల్లాంటి కళ్లతో ఆశగా అతని వంక చూస్తూ.

ఆనందరావు ఎక్కువసేపు ఆలోచించకుండానే అన్నాడు. "నువ్వు నాతో రావటానికి వీల్లేదు. ఇవన్నీ పెరగని ఊళ్లు. వీళ్లంతా ఎదగని మనుష్యులు. అదీగాక నన్ను నమ్ముకున్న కామేశ్వరి ఉంది. నేను నమ్ముకున్న ఎలక్షన్లు ఉన్నాయి. ఇప్పుడు నిన్ను నాతో తీసుకెడితే పెద్ద గాలిదుమారం లేస్తుంది. మన మంచితనానికి మసి బూసి చూపించి, మనల్నే భయపెట్టే మనుష్యులు మన చుట్టూ కోకొల్లలుగా ఉన్నారు. అందు వల్ల ఇప్పుడు నేనుగాని, నా మంచితనం గాని నీ కేమీ సాయం చెయ్యలేవు. కావాలంటే ఇప్పుడు నా దగ్గర రెండు వందలున్నాయి. తీసుకుని నీ ఇష్టం వచ్చిన చోటుకి వెళ్లు..." అని పేంటు జేబులోనుంచి పర్సుతీసి వంద రూపాయల నోట్లు రెండు అలివేలు చేతిలో పెట్టాడు.

చేష్టలుడిగి, శిలావిగ్రహంలా నిలబడ్డ అలివేలు నెమ్మదిగా తేరుకుంది. కావలసిన

వన్నీ సర్దుకుని చిన్న మూట కట్టుకుంది. బస్సు వచ్చింది. అందులో ఎక్కి కూర్చుంది. అలివేలు మేనమామ ఉన్న ఊరికి పోవటం లేదా బస్సు. అక్కడికి వెళ్లాలని గూడా అది అనుకోవటం లేదు.

ఆ బస్సులోనే రోజూ ఒక డాక్టరు టౌను నుంచి దగ్గర్లో ఉన్న పల్లెలకు వచ్చి పోతుంటాడు. అతను లింగాన్ని పరీక్ష చేసి, పాముకాటు వల్ల చనిపోయినాడని వెళ్లి బస్సులో కూర్చున్నాడు.

కదులుతున్న బస్సులో నుంచి ఆనందావు వంక చూసింది అలివేలు, క్షమించమన్నట్లు. క్షమించటానికి తనెవరు అని ప్రశ్నించుకున్నాడు.

ఇందులో అంతా తప్పు చేసినవాళ్లే. కామేశ్వరి గుర్తు చేస్తే తన తప్పు ఆలస్యంగా గ్రహించాడు ఆనందరావు. ఆలస్యంగా ఇప్పుడు గ్రహించింది అలివేలు. ఇంకా గ్రహించలేదు వరహాలు. ఇంక ఎప్పటికీ గ్రహించలేడు లింగం.

బస్సు కనుమరుగయ్యేదాకా చూస్తూ అక్కడే నిలబడ్డాడు ఆనందరావు. తరువాత వెనక్కి తిరిగి చూశాడు. మృత్యువు తెరిచిన నోరులా ఉంది, ఇప్పుడా తలుపులులేని గుడిసె

మనిషిని మింగేసి మత్తుగా పడుకున్న కొండచిలువలా ఉంది తారురోడ్డు. ఆ కొండచిలువ వీపుమీద పాకుతున్న పురుగులా ముందుకు నడుస్తున్నాడు ఆనందరావు.

వీళ్లు ముగ్గురూ ఎందుకిలా ప్రవర్తించారా అని ఆలోచించుకుంటూ ముందుకు నడుస్తున్నాడు.

రాత్రి కురిసిన చినుకులు వాళ్లందర్నీ ఒక చోట చేర్చినాయి. ఒక చోట చేరిన నలుగురూ వాళ్లకు దొరికిన అవకాశాల చితుకుల్ని పోగుచేసుకుని, ఆశల చిరుమంటల్ని రగిలించుకున్నారు.

చినుకుల్లో చిరుమంటల్ని వెలిగించినా ఎంతసేపు ఉంటాయి?

ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 6–11–72

# సర్కారోళ్ళబండి

## పి.వి.బి. శ్రీరామమూర్తి

"ఉసే అయ్యా! ఓపాలి బత్తిలి ఎల్లిరారా! మన కొంపెట్టాగుందో ఏటో?" అని అమ్మ ఎన్నిసార్లో చెవికి ఇల్లు కట్టుకుని చెప్పినా నేను విన్లేదు. వినక పోవటంలో బత్తిలి వెళ్ళటానికి అయిష్టతగానీ, వ్యతిరేకతగానీ ఎంతమాత్రం కాదు. ఎటొచ్చి కొన్ని వేలమైళ్ల దూరంలో ఉండటం చేత, సెలవు కుదరకపోవటం, ఆర్థిక మాంద్యం, అంతకంటే 'ఆలి అయిష్టత 'ముఖ్యకారణాలని మాత్రం చెప్పగలను!

బత్తిలి నేను పుట్టిపెరిగిన ఊరు!

ఇంచుమించు నాబాల్యం అంతా అక్కడే గడిచింది. చిన్ననాటి స్నేహితుల్ని చూడాలనీ, అప్పుడు మేం ఆడుకునే ప్రదేశాలు చూడాలనీ, ఏట్లో తనివితీరా స్నానాలు చేయాలని మనసులో కోరిక ఎన్నాళ్ళనుండో ఉరకలేస్తూనే ఉంది.

కానీ సుమారు రెండు దశాబ్దాల తరువాత పుట్టిన ఊరు చూస్తున్న సంతోషం, ఉబలాటం మాత్రం ఇప్పుడు నాలో రవంతయినాలేదు.

అందుక్కారణం.

'మదర్ సీరియస్! స్టార్ట్ ఇమీడియట్లీ.' అని అందుకున్న టెలిగ్రామే! అప్పటికి నాచేతి చెమటకి ఆ టెలిగ్రాం ఎన్నిసార్లు నలిగిందో నామనసు అంతకన్నా నలిగి తడిసి ముద్ద అయిపోయింది.

అందరి సంగతీ ఏమోగానీ అమ్మ అనే రెండక్షరాల కమ్మని పదం నా మనసులో నుంచి తొలగిపోనిది చెరిగిపోనిది కరిగిపోనిది.

నాకు బాగా గుర్తే.

అమ్మ నాకోసం ఎన్ని కష్టాలు పడిందని?

అమ్మ నాకోసమే ఎన్ని త్యాగాలే చేసిందని?

ఆ రోజు తనెప్పుడూ మరచి పోలేదు.

పొయ్యిమీద దాక పెట్టింది. పొయ్యిలో కంది కంపలు పెట్టి మంట పెట్టింది.

కంపలు తడిసి ఉండటం చేత ఎండిన ఆకులు మంట కాగితం కాలినట్లు కాలిపోయి, పొగ మాత్రం మిగిలింది. రెండు చేతులూ నేలకిఆన్చి పొయ్యిముందు తల నేలకాన్చి నోట్నిండా గాలితీసి 'ఉఫ్' అని ఊదింది, మంట రాజుకున్నట్టే రాజుకొని మళ్ళీ ఆరిపోతోంది.

"అవునే, లచ్చిమీ! అంటే నీకు సిర్రాగ్గానీ ఆ పచ్చికంది కంపలేటి మండుతాయే; పెందిలెల్లిన దానివి, తాటి సెకంలో కట్టె పుల్లలో కస్ని తెచ్చుకుంటే నీ సొమ్మేం పోయినాదే. ఆడోస్తే ఏలకి కూడవనేదని సిరాకు పడ్డామరి?" అంది తాతమ్మ.

తాతమ్మ నిజానికో దెయ్యం లాంటిది. చింపిరి జుట్టు, మైలు రాళ్లలా నోట్లో అక్కడక్కడా పళ్ళూ వేలాడుతున్న శరీరం, దాన్ని తల్చుకుంటే నాకిప్పటికీ భయమే. నాన్నొచ్చే వేళకి ప్రతిరోజూ అమ్మనేదో ఒకటి అంటుంది. అమ్మలో ఓర్పునశించి నోరు చేసినంతవరకూ ఏదో సణుగుతునే ఉంటుంది. ఈలోగా నాన్న రావటం అక్కడేది అందుబాటులో ఉంటే దాంతో అమ్మని గొడ్డుని బాదినట్లు నిర్దాక్షిణ్యంగా చావబాదటం అలవాటు.

ఆరోజు అదే జరిగింది.

నాన్న కడుపునిండా తాగొచ్చాడు. 'ఒసే లచ్చిమీ కూడెట్టే" అన్నాడు.

"ఇప్పుడే పొయ్యి మీద్దాకెట్టినాను. ఓ సిటం ఆగు కూరుడకాల." అంది. "ఇంతవరకెవుడి పక్కల్తొంగున్నావే". అని పొయ్యిలో రాజుకుంటున్న కంప తీసి సెడామడా కొట్టాడు అమ్మని.

"నాంజెప్పనేదా? ఆడొచ్చేసరికి కూడునేపోతే ఆడొల్ల కోడే అని నామాటకి పీసరంతయినా ఇలు విచ్చినావా? అయినా ఆడదానికంత పొగరుండకూడదే" అనిమరికొంచెం నెయ్యిపోసిమంట పెంచింది. నాన్న తాగిన మైకంలో మరింత రెచ్చిపోయి ఎక్కడ తగుల్తుందో చూసుకోకుండా కొట్టాడు. "ఓలమ్మ సచ్చిపోనానే!" అంటూ నేలకొరిగింది. ఆ తరువాత అమ్మ కుడికన్ను వాచిపోయింది. మళ్ళీ ఆ కంటితో ఈ ప్రపంచాన్ని చూడ్డానికి అమ్మకి కుదర్లేదు. వంట చేస్తున్న పొయ్యిదగ్గర మట్టిగోడకి బొమ్మలా అంటుకుపోయి అమ్మని జాలితో చూస్తూ ఉండిపోయిన దృశ్యం తనెప్పుడూ మరిచిపోలేదు!

ఆ సన్నివేశం హృదయంలో మెదలగానే గుండెతడిసి బరువెక్కింది. బొకారో స్టేషన్‌లో ఆగింది. నేను దిగవలసిన స్టేషన్‌వచ్చింది. గబగబా దిగాను. చుట్టూ కలయచూసాను. ఇరవై సంవత్సరాల క్రితంకీ, ఇప్పటికీ పార్వతీపురం స్టేషన్‌లో ఏం మార్పులేదు. స్టేషన్ బయటికొచ్చాను. రిక్షావాళ్ళు పిలుస్తున్నారు. వాళ్ళపిలుపులు వినిపించుకోకుండా ముందుకు నడిచాను లగేజీ వీపునకు తగిలించుకుంటూ. చిన్న చిన్న చినుకులు పడుతున్నాయి. గడియో, క్షణాన్నో కురవబోయే మేఘాలకు మెరుపులు తోడయి బెదిరిస్తున్నాయి. అంతకు రెండుమూడు రోజుల క్రితం నుండీ వర్షాలు పడుతున్నట్లుంది నేలంతా బురద బురదగా ఉంది. బూట్లు బురదలో కూరుకుపోతున్నాయి. చుట్టుప్రక్కల నుండి వెళ్తోన్న రిక్షాలూ, మోటారు వాహనాలు బురదను పిచికారీ చేసుకుంటూ పోయాయి. బుషర్టు పూర్తిగా బురదయింది. నవరత్నా టాకీసు దాటిన దగ్గర్నుంచీ నడవటం మరీ కష్టమైంది. చుట్టూ పెరిగిపోయిన పెంటకుప్పలు, చెరువులాగా నిలిచిపోయిన కుళ్ళునీరు అందులోనే

టీకొట్టు, అక్కడే నిలబడి టీ త్రాగేస్తోన్న జనాన్ని చూస్తే కడుపులో దేవేసినట్లయింది. బస్సుస్టాండు దగ్గరకొచ్చేసింది. 'మరెందుకు రిక్షా ఎక్కడం?' అనుకొని ముందుకునడిచాను. అతికష్టంమీద బస్సుస్టాండును చేరుకున్నాను. కలకత్తా నుండి రావటంచేతనో ఏమోగానీ, ఈ బస్సుస్టాండుని చూసేసరికి అసహ్యం ఏడుపూ వచ్చేసాయి. ఎక్కడ నిలబడడానికి చోటులేదు. పాదాలు పూర్తిగా బురదలో కూరుకుపోయి బూట్లు మట్టిరంగు కోటింగ్ వేసినట్లు న్నాయి. ఎన్ని ప్రభుత్వాలు మారినా, ఎన్ని సంవత్సరాలు గడిచినా ఈ రోడ్ల పరిస్థితి మారకపోవటం నాకాశ్చర్యం కలిగించింది. స్టాండులో బత్తిలి వెళ్లే బస్సులు రెండున్నాయి. ఒకటి ప్రయివేటుది. రెండోది ఆర్టీసిది. ప్రయివేటు బస్సులో జనం రావిచెట్టుకు గబ్బిలాలు వేలాడుతున్నట్లు వేలాడుతున్నారు. ఆర్టీసి బస్సు ఖాళీగా ఉంది. బస్సులో ఒకే వ్యక్తి కూర్చున్నాడు. పొగాకు రెమ్మకు ఈనెలు తీసి సాపు చేస్తున్నాడు వెళ్ళి అడిగాను బస్సు ఎంత సేపట్లో బయలు దేరుతుందని.

"తెల్దు, ఇది గవిన్మెంటు బస్సు కద. దీనికో టైముండదు" అన్నాడు! అతడో గావంచా కట్టుకున్నాడు. జుట్టు పీచులాగా ఉంది. వెనుక ముడి చుట్టుకున్నాడు. చెవికి రాగి పోగులున్నాయి. మనిషి నల్లరాతి శిల్పంలాగా ఉన్నాడు. పలికే ప్రతిమాట మొదటి అక్షరం, ద్విత్వం చివరి అక్షరం దీర్ఘం పలుకుతున్న అతడి తీరునుబట్టి గిరిజనుడై ఉంటాడని ఇట్టే పోల్చుకోవచ్చు.

"సరే ఈ సామాన్లు చూస్తుండు, హొటలు కెళ్లివస్తా" అన్నాను.

"ఒద్దన్నా! ఇది గవిన్మెంటు బండి ఈల్లు మనుసులమాటలు ఇన్రు. ఆల్లు బండెప్పుడు దీస్తరో, ఎప్పుడాపుతరో, ఆల్లకే తెలీదు. సెప్పినా బండి ఆపరు" అన్నాడు.

దిగువన ఎంక్వయిరీ చేస్తే ఆ బస్సు డ్రైవరూ, కండక్టరూ కనిపించారు. వెళ్ళి అడిగాను ఇప్పుడప్పుడే వెళ్ళరన్నారు. బస్సులో సామాన్లు పెట్టి అతణ్ణి చూస్తుండమన్నాను. ఆకలేస్తోంది. టిఫిన్ చేసి వస్తానన్నాను. అతడు విన్లేదు "వద్దన్నా నామాట ఇనవా? సరుకులు పోతయ్" అన్నాడు. నేనతడి మాట వినలేదు. "కండక్టరుకు చెప్పాను అరగంట వరకూ బస్సుపోదు" అని సామానుపెట్టి గబగబ హొటలు కెళ్ళాను, కడుపునిండా టిఫిన్ చేసాను. హొటల్లో కోవా ఉంది అద్దాల బీరువాలో. 'కోవా' అంటే అమ్మకిష్టమని అరకేజి కట్టించాను పొట్లాం పట్టుకొని బయటకొచ్చాను.

"అన్నా! ఎంతపని చేస్తివి. నామాట ఇనుకుంటివిగాదు. ఆడు బండి ఆపకుంట తోలుకెళ్ళినాడు. ఇదిగో నీ సామాను. ఇప్పుడు బత్తిలికి నీకు బండినేదు" అన్నాడు నా సామాను నాకందిస్తూ.

అతని నిజాయితీ నన్నెంతగానో కరిగించింది. ఆ కండక్టరు, డ్రైవరు మీదా చెప్పరాని కోపం వచ్చింది. కాల్చిపారేయాలనిపించింది. "ఇప్పుడెలా? అని సందేహిస్తుంటే ప్రక్కనే ఉన్న టీకొట్టు అసామీ "ఎక్కడికెళ్ళాలి మాస్టారు?" అడిగాడు. జవాబిచ్చాను అతను పెదవి విరిచి "మీరు రిక్షాలో గేటుకెళ్ళిపోండి. ఏదో కూతవినిపిస్తోంది. గేటేసి నట్టున్నారు. దొరికితే లక్కీగా బస్సు దొరకొచ్చు." అన్నాడు వెంటనే రిక్షాను పిలిచి "అన్నా! రిక్షా ఎక్కు"

అన్నాను "నువ్వేళ్ళు నాకెందుకులే" అన్నాడు. "ఫర్వాలేదు. ఎక్కు" అని అతణ్ణి రిక్షా ఎక్కించేసి నిమిషాల మీద రైలు గేటుకు చేరుకున్నాం. అక్కడ గేటువేసి ఉండటం చేత బస్సులన్నీ ఆగిపోయి ఉన్నాయి. వెతుక్కుంటూ బస్సు ఎక్కాం. ఎక్కగానే కండక్టరుని కొట్టినంత పనిచేసాను. నా కేకలు వృథా అయ్యాయి. అతడేం పట్టించుకోలేదు. ఎస్సార్ చూసుకుంటూ "ఇప్పటికే బండి లేటులో ఉందండి. మీకు పొరపాటున అలా చెప్పి ఉంటాను" అన్నాడు. బస్సులో జనం లేరసలు. ఈలోగా గేటుతీసారు. బస్సులు ఒక్కొకటి ముందు కెళ్తున్నాయి. నాకింకా కోపం పోలేదు. "ఎక్కడికి సార్?" కండక్టరడిగాడు. చెప్పాను. డబ్బులిచ్చాను "అన్నా నువ్వెక్కడికి?" అన్నాను. "గుమ్మనచ్చింపురం అన్నాడు టిక్కెట్టు తియ్యబోతే ఒప్పుకోలేదు.

బస్సు ముందుకు జోరుగా పోతోంది.రెప్పలు వాల్తున్నాయి. కళ్ళముందు అమ్మ! "అమ్మ రోజుకు ఎన్నిసార్లు దెబ్బలు తినేదో లెక్కలేదు. తాగొచ్చినాన్న కొట్టేవాడు. ఏదో సాకుతో తెడ్డుతోనో ముంతతోనో తాతమ్మ కొట్టేది. అన్నిటిని సహించేది అమ్మ. మా పెద్దమ్మ నన్ను శ్రీ కాకుళం తీసుకెళ్ళి "ఎస్సెల్సీ" వరకూ చదివించింది. మా మేనమామ కలకత్తా తనతో తీసికెళ్ళి జూట్ ఫేక్టరీలో చిన్న ఉద్యోగం వేయించాడు. అమ్మను నాతో వచ్చేమంటే రాలేదు. నెలకి కొంత డబ్బు పంపేవాణ్ణి ఆడబ్బా నాన్నే అమ్మనుకొట్టి తీసుకునే వాడని తరువాత తెలిసింది. ఒకరోజు టెలిగ్రాం వచ్చింది. నాన్న తాగి బస్సు క్రిందపడి చనిపోయాడని. మొదట గతుక్కుమన్నా తరవాత "పీడ విరగడయిందని" అనిపించింది. అమ్మకు దెబ్బలు తప్పాయి కదా మంచిది అనుకున్నాను. అప్పుడెళ్ళాను బత్తిలి అమ్మను నాతో తీసుకొచ్చాదమనుకున్నాను. నేనెళ్ళేసరికి అమ్మ నన్ను పట్టుకుని బావురుమంది. నాక్కోపం వచ్చింది. "ఎందుకే ఏడుస్తావ్ ఏం మడి మాన్యాలు సంపాదించి నిన్ను సుఖపెట్టాడు. ఎప్పుడైనా ఓ ముద్దూ ముచ్చటా తీర్చాడా? సరదాగా కబుర్లు చెప్పాడా?" అన్నాను వయసు వేడివల్ల.

"తప్పురా, అయ్యా ఎంతయిన పెనివిటి పెనివిటేరా! అలాగనకూడదురా!" అని వారించింది. అమ్మ తాతమ్మకి వండి పెట్టేవాళ్లు లేరని రానంది. ఆ తరువాత తాతమ్మ చచ్చిపోయింది. అందరూ అమ్మని వయసులో ఉన్నావు. మారు మనువాడమన్నారు. నాకు నిజమేననిపించింది. అమ్మతో అదే మాటన్నాను అమ్మ వినలేదు. ఏమనుకుందోమరి? నాతో కలకత్తా బయలుదేరింది. అమ్మ నాకు వండి వడ్డిస్తూ నన్ను సుఖపెట్టింది. అమ్మను చూస్తే మాత్రం భగవంతుడు 'దయామయుడు' కాదని పించింది. అమ్మే మా ప్రక్కింటి పిల్ల మా ఇంటికి రోజూ వస్తుంటే " ఆ పిల్లకి నేనంటే ఇష్టమేనని తెలుసుకొని నా పెళ్ళి జరిపించింది. ఓ నెల రోజులు తరువాత "ఒరే అయ్యా! ఇప్పుడు నీకో తోడుంది. నాను బత్తిలెలిపోతాను. అక్కడాట మనకో ఇల్లుంది" అంది. నా గుండెల్లో గునపాలు గుచ్చినట్లయింది. అమ్మ ఎంతచెప్పినా వినలేదు. కొన్నాళ్ళు బత్తిలి వెళ్ళింది.

ఇంతలో నా ఆలోచనలకు సడన్ బ్రేకు పడినట్లు బస్సాగింది. "ఎందుకాగిందీ" అడిగాను అన్నని.

"నీకు తెల్దా? ఇదో ఎద్వారం, ఇక్కడ బిర్జి దెబ్బతింది. దీన్ని నాగావలి అంతరు. ఇది తోటపిల్లి బిర్జిమీద నుండి బస్సులెల్లకూడదు జనంతో. ఆ కొసవరకూ నడిసిపోవాలి. అక్కడ మల్లా ఎక్కాలి" అన్నాడు కొన్ని సంవత్సరాలుగా ఇలాగే జరుగుతోందని చెప్పాడు: అయినా ప్రభుత్వం ఏ చర్యా తీసుకోకపోవటం ఆశ్చర్యం వేసింది. "అరే ఆ బస్సు వెళ్ళిపోతున్నదే!" అన్నా నిండుగా వెళ్తోన్న ప్రయివేటు బండి (బస్సు)ని చూపి.

"అదీ పెయివేటు బండి బిర్జోల్లకాల్లు మామూల్లు ఇత్తారు అందుకే ఆల్లకొగ్గుతారు. ఇది గవిన్మెంటు బండి ఈల్లు ఇవ్వరు అందుకే మనం అవతలికి నడిచిపోవాల" అన్నాడు.

"ఈ బస్తాలు ఏంటి"

"ఎర్రబల్లోలు లగేజీలు ఎయ్యరు. ఆర్నరీ బల్లోల్లుఏత్తారు. ఈడ దింపాల. కలాసీలు ఆడికి తీసుకబోయి బస్సుమీదేత్తరు. అన్నాడు. బ్రిడ్జి అవతల కెళ్ళి బస్సెక్కాను.

కళ్ళమీద కునుకు మళ్ళీ అమ్మ ఆ తరువాత గౌరి నెల తప్పిందని రాస్తే వచ్చింది ముగ్గురు పిల్లలు పుట్టారు. ఒకరోజు నేనింటికి చేరేసరికి గౌరీ మా అత్తా ఏదో మాట్లాడుకుంటున్నారు. "ఈ ముసిల్దింకా చావలేదు. దీని మందులకి బోల్డు డబ్బు తగలెట్టేస్తున్నాడు. నీ యజమాని" అంటొంది అత్త. నాకు గొప్పకోపం వచ్చి బాణంలా దూసుకెళ్ళాను.నన్నుచూసి అవాక్కయ్యారు. పిల్లిలా మెల్లగా జారుకుంది అత్త. "మీ అమ్మేమంటోంది" అనడిగాను. జవాబు చెప్పలేదు గౌరి. ఆ తరువాత కొన్నాళ్ళు గడిచింది. "ఒరే అయ్యా! ఓపాలి బత్తిలెల్లి వత్తారా! ఆ ఇల్లు ఎట్టాగుందో ఏటో?" అంది ఎంత చెప్పినా వినకుండా బత్తిలి వెళ్ళింది. అప్పుడెళ్ళినది ఎన్ని ఉత్తరాలు రాసినా రాలేదు కూడా. అది నేవెళ్ళి తీసుకురావాలంటే నాక్కుదర్లేదు. భగవంతుడా! అమ్మ క్షేమంగా ఉండాలి!" అనుకున్నంతలో మళ్ళీ బస్సాగింది. "ఎందుకాగింది? అడిగాను

"ఇది సెక్‌పోస్టు అన్నా! కొండ పేంతం నుండి కొండదినుసులు తీసుకపోతుంటే సెక్ సేత్తరు. ఈల్లకి మామూల్లు ముట్టసెప్పేనోల్లకి ఒగ్గెత్తరు." అన్నాడు. అనేసి" అన్నా నాకు తెలక అడుగుతాను ఈల్లుజ్జోకాలు సేత్తన్నరు. సొమ్ముమలొత్తయి. ఈ కక్కుర్తి పన్లెందుకన్న గొప్ప ఇచ్చింత్రం గుంటది. నాకు నిజం నీకబద్దంగుంటవి. గవిన్మెంటోల్లెందులో సెయ్యేట్టినా బుగ్గే మిగుల్తాది. నీకు సెపితే అబద్దం ఇదిగీ కండక్టెరు పెయివేటు బండిలో ఉన్నప్పుడు అరమైలు దూరంలో మడిసిని సూసిబండాపేవోడు. ఉప్పుడు మనుషుల్ని సూత్తే ఎర్రెత్తిపోతాడు గవిన్మెంటుజ్జోగం వచ్చినప్పట్నించి" అన్నాడు.

"నీపేరేంటన్న"

"కవరం దొర"

"మీదే ఊరు?" అడిగాను చెప్పాడు. "మీ ఊరుకి బస్సెళ్తుందా? అడిగాను. బస్సింకా ఎయ్యిలేదు మా ఊళ్ళో పాతిక పాకలుంటాయి అక్కడేటుండదు. ఓ బడుంది."

"అన్నా! నీకు చదువొచ్చా"

ఏదో ఎసయికాలం సదూలు"

"మరి ఎదిరించొచ్చుగద"

"గట్టిగా అడిగితే నక్సలైట్లని మూసెత్తారుగద మా గురువుండివోడు. మా కొండంత దైర్యంగుండేది" అన్నాడు. మీ గురువెవరని అడిగేను. "సెత్తెం మేట్టోరు" అని అతడనేసరికి నాగుండె ఝల్లుమంది ఇతడికిన్ని విషయాలు తెలీటానికి కారణం ఇదన్నమాట అనుకున్నాను. అతడేవో చెప్తున్నాడు వింటున్నాను. నల్లటి దట్టమైన చీకట్లో బస్సు పరిగెడుతోంది. చుట్టూ చింతచెట్లు. బురఖా కప్పుకున్న ముస్లిం వనితలా ఉన్నాయి. అతడు గుమ్మలక్ష్మీపురంలో దిగిపోయాడు. వెళ్ళేముందు రెండు చేతులూ జోడించాడు మరి కొంచెం దూరం నడిచి బస్సు పెద్ద శబ్దంతో ఆగిపోయింది. డ్రైవరూ కండక్టరూ దిగారు. అటూ ఇటూ తిరిగారు చావు కబురు చల్లగా చప్పారు బస్సు వెనకటైరులో గాలిపోయిందనీ. స్టెపినీ ఉన్న మార్చడానికి పరికరాల్లేవట. ఇంకా బత్తిలి కొన్ని మైళ్ళు నడవాలి. తోవసరిగ్గా తెలీదు. అమ్మ కెలా ఉందో ఆందోళనతో, "ఆర్టీసి"ని తిట్టుకుంటూ నడవడానికి సాహసించి ముందుకు అడుగుతీసాను. ఏ ఎలుగు వస్తుందో, పులేవస్తుందో, తెలీని భయం. చేతిలో టార్చికూడా లేదు. మెల్లిగా పదవుతుండగా ఊరి పొలిమేరలు చేరుకున్నాను. లైట్లు కనిపిస్తుంటే పరుగులంకించాను. గబగబా ఇంటికెళ్ళాను. గుడ్డిదీపం వెలుగు వాకిట్లో నలుగురు మనుషులు, చీకట్లో వాకతుప్పల్లా తలొంచుకుని కూర్చున్నారు. నన్ను చూసి "ఒచ్చినా వురయ్యా! అరగంటకితం వొస్తే ముసిల్ది నిన్ను సూసి సంతోషంగా సచ్చి ఉండేది" అనే సరికి నాలో ఏమైందో ఒళ్ళంతా తేలిపోయింది. చిన్న పిల్లాడిలా బావురుమని అమ్మ శవంపై పడి ఏడిచాను.

వారం రోజులుగా కన్ను తెరవని జ్వరమట! ఆస్పిటల్లో డ్వాక్టరు సెలవు మీదున్నాడు. కంపొండరు ఏవో మాత్రలు ఇచ్చినాడు. ఏసుకుంది .తగ్గనేదు. మీమే ఏదో జావకాసెట్టినాం. అయ్యోచ్చిందాకా పేనం ఉంతాదో ఉండదో అనుకుంటానే కన్నుమూసేసినాది అని వాళ్ళు చెప్పారు.

నాకు గొప్ప కష్టమనిపించింది. ఆ బస్సు సరిగ్గా వచ్చి ఉంటే 'నా తల్లి ప్రాణం నాచేతుల మీద పోయుండేది' అని పించింది. కొమరయ్య అన్న మాటలు గుర్తొచ్చాయి. ఈ గవన్మెంటు బళ్ళు ఎప్పుడొత్తాయో, ఎప్పుడు పోతాయో తెలీదు. నిజమే! అసలీ ప్రభుత్వం బండికే పంచరయింది. దీని చక్రాలు పూర్తిగా తొలగిస్తేకాని ఈ వ్యవస్థ బాగుపడదు! అనిపించింది. అలా అనుకొని చేసేదిలేక అమ్మ అంత్యక్రియలకేం కావాలో వాటిని సేకరించటానికి బయల్దేరాను నీళ్ళునిండిన కళ్ళతో, గాయపడిన మనస్సుతో.

**ఈనాడు ఆదివారం, 14 ఫిబ్రవరి 1993**

# చికిత్స

## శ్రీనివాసరావు రమణముని

"మీ ఇల్లెక్కడ...?" అంటూ ఎవరైనా అడిగినప్పుడు....

"పాతబస్తీలో..." అని సమాధానం చెబితే.....

"అమ్మో... అదెక్కడ....?" అంటూ ఆశ్చర్యంగా తిరిగి ప్రశ్నించినప్పుడు.....

"చార్మినార్, శాలీబండ, లాల్‌దర్వాజ, చత్రీనాక, ఉప్పుగూడ, కందికల్‌గేట్‌లు దాటితే "ఫూల్‌బాగ్"... అదిగో.... అక్కడ మా ఇల్లు. మా ఇంటికి కొంచెం దూరంలో చాంద్రాయణగుట్ట, బార్కాస్‌లు, ఇటుపక్కన పిసల్‌బం, అటుపక్కన ఫలక్‌నూమా ప్యాలేస్‌లు ఉంటాయి" అంటూ మ్యాప్‌గీసి చెప్పినట్టుగా పూసగుచ్చి చెప్తాడు మహేశ్వర్.

"పాతబస్తీలో ఎప్పుడు చూసినా కొట్లాటలు... కర్ఫ్యూలు ఉంటాయి కదా... అయితే మీరెట్లా ఉండగలుగుతున్నారక్కడ?" అంటూ చాలామంది జాలిపడుతూ అడిగినప్పుడు మాత్రం మహేశ్వర్‌కు ఎక్కడలేని కోపం వస్తుంది. అంతే... ఎదుటివాళ్ళు ఓపికగా వినిపించుకుంటున్నారో లేదో నన్న ధ్యాస కూడా మరిచి...

"పాతబస్తీ అంటే మీరిప్పుడు ఊహిస్తున్నంత భయంకరంగా ఉండదు. హైదరాబాద్ సికింద్రాబాద్ జంటనగరాలు అని మీరిప్పుడు ముద్దుగా చెప్పుకుంటున్న వాటికన్నా ముందు అంటే 'చార్‌సౌసాల్' కన్నా ముందు నుంచే 'పాతబస్తీ'ని చుట్టూ గ్రామాలవాళ్ళు 'పట్నం' అని అనేవారు. ఇంతెందుకు గొల్లకొండ (గోల్కొండ) రాజులు, కులీకుతుబ్షాలు, నిజాంలు పరిపాలించిన కాలంలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన 'హైదరాబాద్ దక్కన్' అంటే ఏదనుకుంటున్నారు? పాతబస్తీనే. పాతపట్నం కోటరాళ్ళతో కట్టిన గోడలు అక్కడక్కడా ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉన్నాయి. పాతబస్తీ అంటే ఇప్పటివాళ్ళకు 'మతపరమైన పోట్లాటలు – కర్ఫ్యూలకు నిలయం'లాగా కనిపిస్తుంది. అక్కడ మనుషులకు విద్య అంతంత మాత్రమే. పెద్ద చదువులు లేకపోయినా ప్రజలు, ప్రతిబస్తీలో 'అమ్మా–నాయనా–చిన్నాయినా–చిన్ని–పెద్దనాయినా–పెద్దమ్మా–అక్కా–చెల్లె–మోల్‌సాబ్–భాయీసాబ్' అంటూ ఆత్మీయతతో కులమేదైనా, మతమేదైనా, ప్రాంతమేదైనా ఒకర్నొకరు వరుసలు పెట్టుకుని

కలిసిమెలిసి జీవిస్తారు. నిజాం నిరంకుశ ప్రభుత్వాన్ని, ఖాసీంరజ్వీ గుండాయిజాన్ని వ్యతిరేకిస్తూ హైదరాబాద్ సంస్థానంలో ప్రజలు ఉద్యమాలు నడిపినప్పుడు కూడా హైదరాబాద్ పాతబస్తీలో మత విభేదాలు లేవు. 1948లో పోలీస్ య్యాక్షన్, భారతదేశంలో హైదరాబాద్ సంస్థానం విలీనం, 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ అనంతరం 1978 వరకు పాతబస్తీ ప్రజలలో మతపై షమ్యాలు లేవు. కుళ్ళు రాజకీయవేత్తలు, భూ బకాసురులు, అవినీతిపరులైన అధికారులు, లంచగొండులు, రౌడీలు, గూండాలు కలిసి సంఘ విద్రోహ చర్యలకు పాల్పడి పాతబస్తీని నరకకూపంగా మార్చారు తెలుసా....?" అంటూ తన విలువైన సమయాన్ని కూడా లెక్క చేయకుండా చెప్పటం మహేశ్వర్‌కు అలవాటై పోయింది.

తనను పాతబస్తీవాడని ఎవరైనా తక్కువ అంచనా వేస్తే మహేశ్వర్‌కు, ఇక వాళ్ళను బలవంతంగానైనా ఆపి, దగ్గర్లో ఉన్న హోటల్‌కి తీసుకెళ్ళి ఛాయ్ తాగించి మరీ ఈ కథంతా చెప్పి తన గుండె అంతరాంతరాల్లో ఉన్న బరువును తేలిక చేసుకోవటం మహేశ్వర్‌కు వెన్నతో పెట్టిన విద్య అయింది.

పాపం! వసుదేవునికి కష్టాలు తప్పలేదని మనకు తెలుసు.

పాతబస్తీలో.... అందరితోనూ మర్యాదగా, ప్రేమగా మెలుగుతూ ఏదో చిన్నపాటి ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం చేసుకుంటూ తనకున్న తల్లి, భార్య, ఇద్దరు పిల్లలతో హాయిగా జీవితాన్ని ఈదుస్తోన్న మహేశ్వర్‌కూ కష్టాలు తప్పలేదు. తన రెక్కల కష్టం మీదే సంసారం గడవటం కష్టమని, అప్పుచేసి తన ఇంటి ఖాళీస్థలంలో రేకులు వేసి మరోగదిని నిర్మించి అద్దెకిచ్చాడు. అందులో దిగినవాడు కర్రీ వ్యాపారి బలరాం. రెండు నెలలు అద్దె సరిగా ఇచ్చాడు. మూడవ నెల నుంచి ఎగనామం పెట్టాడు. అడిగితే దిక్కున్న చోట చెప్పుకోమన్నాడు. ఎక్కువ మాట్లాడితే నూకలు చెల్లుతాయి అని బెదిరించాడు. నాలుగేళ్ళయింది. బస్తీలో ఎవరూ సహాయం చేయకపోతే పోలీస్‌స్టేషన్‌లో కంప్లెయింటిచ్చాడు మహేశ్వర్.

★ ★ ★

"అరె ఓ సెంట్రీ! యాడ సచ్చినవ్‌బే...?" పోలీస్‌స్టేషనంతా వినిపించేలా అరిచాడు స్టేషన్ మాస్టర్ శ్రీహరి.

"జీ సాబ్... ఈడనే ఉన్న.... సెంట్రీ డ్యూటీ జేస్తున్న" అంటూ మూసి ఉన్న సి.ఐ. రూం తలుపును నెమ్మదిగా తోసుకుంటూ పులి ముందుకు పిల్లిలా నడిచినట్టు రెండడుగులు వేసి అటెన్షన్‌లో నిలబడి శాల్యూట్ చేశాడు సెంట్రీ కానిస్టేబుల్ రాజా.

ఆ పోలీస్‌స్టేషన్‌లో.... "సర్కిల్‌సాబ్ నిద్ర లేశిండు... మాటలు జర సాలిచ్చుండ్రీ... ష్....." గుసగుసలు.... మిగతా సిబ్బంది ఎక్కడివాళ్ళక్కడ అలర్టయ్యారు. నిశ్శబ్దం ఆవరించింది.

"ఇవ్వేంటివిరా?" తన ముందు టేబుల్‌పై ఉన్న గ్లాసును ఎత్తి చూపుతూ అడిగాడు సర్కిల్.

"తాగేనీళ్ళు సాబ్" వెంటనే సమాధానమిచ్చాడు సెంట్రీ రాజు.

"తాగేనీళ్ళల్ల ఉచ్చ కంపు ఎక్కడిది బే"

ఆ గ్లాసును తీసుకుని ముక్కు వద్ద పెట్టుకున్నాడు సెంట్రీ. నీళ్ళు వాసన చూశాడు. బాగానే ఉన్నాయి. సి.ఐ. గదిని పరిశీలనగా చూశాడు. క్షణాల్లో సెంట్రీ దృష్టి సి.ఐ. ధరించిన ఖాకీ ప్యాంటుపై పడింది. ప్యాంటు తడి పూర్తిగా ఆరలేదు. సి.ఐ. అన్నట్లుగా ఉచ్చకంపు ఆ రూం నిండా వ్యాపించిన మాట నిజమే. అసలైన విషయం సెంట్రీకి బోధపడింది. మత్తు పానీయాలకు బానిసలైన వాళ్ళు మానసిక దుర్బలత్వానికి లోనై తమ శరీర అవయవాల మీద సైతం కంట్రోలును కోల్పోతారని గ్రహించాడు రాజు.

"ఏందిరా ఆ చూపులు" గద్దిస్తూ కళ్ళెర్ర జేశాడు సర్కిల్.

వాస్తవాన్ని బయటపెడితే సి.ఐ. ఇగో మరింత దెబ్బతిని తనపై విరుచుకు పడ్తాడనీ, "మాఫ్ కర్నాసాబ్.... గ్లాసు కడుక్కొని మంచినీళ్ళు మల్లా తెస్త సాబ్" అంటూ బయటికి నడిచాడు రాజు.

"ఏమయ్యింది?" అడిగారు తోటి కానిస్టేబుళ్ళు.

"ఏమైతది. నా జిందగీల సూడలేదు గిట్లాంటి సర్కిల్‌సాబ్‌ని. అరె.... ఈ పోలీస్ స్టేషన్ల పంద్రాసాల్ నుంచి కానిస్టేబుల్‌గ పనిజేస్తున్న. మొదలు సర్కల్ సాబంటే ఎంతో ఇజ్జత్ ఉంచుకునేటోళ్ళు. ఎటుగూడ పుకట్ల తాగుడు దొరుకుతుందని పతాకం పొద్దున్లేసిన్నుంచి పొద్దుమీకిందాక తాగుతాబోతే యాడ ఉచ్చబోవాల్నో, యాడ ఏర్గాల్నో తెల్వకుంటైతది. ఎందిర్రాబై ... ఈ బస్తీ లీడర్ సాలేగాండ్లు మన సర్కిల్‌సాబ్‌ను ఇజ్జత్ లేకుంట తయారుజేస్తున్నరు. ఏ.సి.పి., డి.సి.పి., కమీషనర్ సాప్‌లు దొరకొస్తే ఏమైతది. పోయేటైన ఆయన కొల్వుపోతది. మన కొల్వులకు గూడ ఎసరొస్తది. అవ్వ ఇంత అన్యాలమా.... ఎంత తాగిన నిషాల ఉంటే ఏందీ.... కూసున్న సోట డిరెస్ మీద ఎవరన్న ఉచ్చ పోసుకుంటారు. చెప్పుకుంటే సిగ్గుపోతది" అంటూ మెల్లిగా గొణుక్కుంటూ గ్లాసును కడిగి మంచినీళ్ళు నిండా తీసుకొని సర్కిల్ రూం వైపుకి నడిచాడు సెంట్రీ.

అక్కడ ఉన్న ఎస్.ఐ.లు రామారావు, జహంగీర్ అలీ, పురుషోత్తమరావులతో పాటు పదిమంది కానిస్టేబుళ్ళు సెంట్రీ మాటలు విని నవ్వుకున్నారు.

ఎస్.ఐ. రామారావుకు ఎదురుగా కూర్చుని ఉన్న ఆ బస్తీ నివాసి మహేశ్వర్ కూడా సర్కిల్, సెంట్రీ మాటలు విన్నాడు. పోలీస్ స్టేషన్లలో, వ్యాన్లపై "మే ఐ హెల్ప్ యూ" అనే రాతలు ఎందుకు కనిపిస్తాయో మహేశ్వర్‌కు అర్థం కాలేదు. తనది వెరీ సింపుల్ కబ్జా కేసు. పోలీసుస్టేషన్‌లో కంప్లైంట్ ఇచ్చి ఆర్నెల్లు గడిచినా, పరిష్కారం కాలేదు. అటుపక్క ఎస్.ఐ. జహంగీర్ వద్ద తమ వీధిలో ఉండే పాపం పేదవాడు దిక్కూ మొక్కూలేనివాడు సాదయ్య ఇంట్లో దొంగలు దోచుకున్నదీ; బస్తీ రౌడీలు సాదయ్య కూతురు లచ్చిమిని రేప్ చేసిన కేసులు ఇంకా ఎన్నో.... ఎన్నెన్నో బస్తీలో లోకల్ లీడర్లు, దాదాలు, రౌడీలు, గూండాలు సామాన్య ప్రజలను పీల్చి పిప్పి చేస్తున్న కేసులు నెలలూ.... సంవత్సరాల తరబడీ... పెండింగ్ కేసులు... పరిష్కరించవలసిన స్టేషన్ మాస్టర్ తాగి తందనాలాడుతుంటే 'ఈ

బస్తీని రక్షించే దిక్కెవరు భగవాన్ చింతాక్రాంతుడై దిగులుతో ఆలోచించసాగాడు మహేశ్వర్.

"బజహాంగీర్ భాయ్! అని కేసేమైందో చూసి చెప్పరాదు" అన్నాడు ఎస్.ఐ. రామారావు తన పక్కన్నే ఉన్న ఎస్.ఐ. జహాంగీర్ అలీతో సాడయ్య వైపు చూస్తూ.

మాసిపోయిన ధోవతీ, కమీజు, తలపాగా... చూడగానే అమాయకంగా దయనీయమైన స్థితిలో చేతులు కట్టుకొని లాకప్ రూం గోడను ఆనుకొని ఎస్.ఐ. జహాంగీర్ ఆలీవైపే ఆశగా చూస్తూ నిల్చున్నాడు సాడయ్య.

"మళ్ళేమైందిరా... నీ కేసులు జర మెల్లగైతయిరా... తొందరెందుకు బడ్తవ్" అన్నాడు జహాంగీర్ అలీ.

"నీ బాంచను దొరా! మా ఇంట్ల దొంగలు బడి దోస్కపోయిరి. మా బిడ్డ లచ్చిమిని మన ఊర్లోల్లే పాడుజేశిరి. మా ఏడుపేందో మేమే ఏడుస్తున్నంగానీ ఎవర్నేమన్నమని దొరా.... నీ బాంచను. కాల్మొక్త. మమ్ముల బత్కనిచ్చేటట్టు లేరు దొర. పోలీసోళ్ళ తానికెందుకు బోయిండ్రని నన్ను, మా ఇంటిదాన్ని, మా బిడ్డను కాల్చుక తింటుండ్రు. ఏంజేసేది. ఇంత ఇసం తాగి సచ్చిపోవాలనుకుంటున్నం..." బోరుమని ఏడుస్తూ చెప్పాడు సాడయ్య.

"ఎవ్వర్రా ఆళ్ళు....?" అడిగాడు ఎస్.ఐ.

"అదే దొరా! గా శివుని గుడిల సారాబట్టీలు పెట్టడు సూడు దొర నారాయణ పెద్ద కొడుకు గంగాధర్. ఇంక ఆ పిల్లగానెంబడి ఉండేటోళ్ళు పకాతం కాళికాదేవి గుడిల పత్తాలాడాలె.. తాగాలె.. కనిపిచ్చిన ఆడోళ్ళనల్ల చెడుపాలె. గిదే పనీ ఆళ్ళకు. ఆళ్లు అందరూ... నేను మీతానికి వచ్చింది తప్పంటున్నరు. నా బిడ్డను పాడుజేసిన సంగతి మా అల్లుడయ్యకు ఎట్ల దెల్సిందో ఏమో... ఇగ ఒక్కనాటికి దాన్ని మనుముకు దీస్కపోనంటున్నడు. ఏం జెయ్యాలె దొర. మీ కాల్మొక్త ఎట్లనన్న జేసి గరీబోళ్ళను కాపాడుండ్రి దొరా.... మీకు పుణ్యమైతది" ప్రాధేయపూర్వకంగా వంగి దండం పెడ్తూ జహాంగీర్ కాళ్ళ మీద పడటానికి వచ్చాడు సాడయ్య.

"అరేయ్.. నువ్వు జర పోరాబై... మా సర్కిల్ సాబ్ ఇయ్యాల ఎప్పుడులేని కోపంల ఉన్నడు. ఆయన బయటికొస్తే నిన్ను లాకప్‌లో పెట్టిస్తడు. ఆ గుడంబా నారాయణంటే ఎవరనుకున్నవ్‌రా. మన మంత్రులూ, ఎమ్మెల్యేలకూ, మన సర్కిల్ సాబ్‌కు గూడ దోస్తు. ఆళ్ళ దోస్తీ ఇట్లాంటట్లాంటిది కాదురా. ఆళ్ళ పోరగాడు గంగాధర్... అదే గ్యాంబ్లింగ్ అడ్డా నడిపేటోడు... మాకు తెల్వందేముందే ముందిరా... ఆడు మీ బస్తీ యువజన నాయకుడు గదరా... రేపో మాపో ఎలక్షన్ల నిలబడ్తడు... గెలుస్తడు... మనకు హోంశాఖ మంత్రయితాడన్నా పరేషాన్ గావాల్సిన పనిలేదు. ఆళ్ళతాన డబ్బుంది. అన్నీ అయితరు. నీతాన అది లేదు. ఏమీ కావు. జర్గిందేదో జర్గిపోయింది. మా కానిస్టేబుల్‌ను పంపి గంగాధర్ని పిల్సి చెప్త. మీ జోలికి రావద్దని... ఎవ్వని జోలికి పోకు పో...." అన్నాడు జహాంగీర్ అలీ.

"వారెవ్వా.... పోలీస్‌స్టేషన్... 'రక్షించండి.. మహాప్రభో' అంటూ పోలీసులకు ఫిర్యాదు చేసుకుంటే ఇక్కడ ఇదా జరుగుతున్నది?" అనుకున్నాడు మనసులో మహేశ్వర్.

సాడయ్య కళ్ళనీళ్ళు తలపాగాతో తుడుచుకుంటూ "మీ బాంచను... ఎట్లన్న జేసి ఈ గండం గట్టెక్కించండ్రి సామీ" అంటూ రెండు చేతులెత్తి దండం పెడ్తూ బయటికి నడిచాడు.

"నా కేసేమయింది సార్" ధైర్యం కూడగట్టుకొని అడిగాడు మహేశ్వర్ ఎస్.ఐ. రామారావుతో. ఆయన సౌమ్యుడని గుర్తించాడు మహేశ్వర్.

"ఏముందీ... షరా మామూలే... మీ బస్తీ మొత్తాన్నీ స్థానిక నాయకులు, దాదాలు, రౌడీలు, గుడంబా, కల్తీ వ్యాపారులు ఏలుతున్నారనీ మీకు తెలుసు గదా..."

"అవును సార్... అది నిజమే. కాని పోలీస్‌స్టేషన్‌లో నేను ఆర్నెల్ల క్రితం చేసిన ఫిర్యాదు సంగతి ఏమయ్యింది. దయచేసి మీవంటి వాళ్ళయినా నాకు సాయం చేస్తారని ఆశపడుతున్నాను"

"మీ కేసు పరిష్కారమవుతుంది. కొన్ని చిక్కుముళ్ళు వచ్చి పడ్డాయి. అదీ మా సర్కిల్ సార్ చేతిలో మీ ఇంటిని కబ్జా చేసుకున్న బాలరాంగాడు పదివేల రూపాయలు పోశాక కేసు తలకిందులయ్యింది. మీరేం ఫికరు చేయకండి. దేనికైనా సమయం రావాలంటారు పెద్దలు. ఈ ఆర్నెల్లుగా చూస్తున్నాను. మీరు చదువుకున్నవాళ్ళు. కొంత లోకజ్ఞానం, సంస్కారం తెలిసినవాళ్ళు. ఈ బస్తీలో ఉన్నందుకు బాధలు అనుభవిస్తున్నారు అంతే..." అన్నాడు రామారావు.

రామారావు నిజాయితీగల పోలీసు అధికారి అని మహేశ్వర్‌కు తెలుసు. తన ఇంట్లోకి కిరాయి కోసం దిగి, కిరాయి ఇవ్వకుండా ఇల్లు ఖాళీ చేయకుండా పైగా తనను చంపిస్తానని బెదిరిస్తున్న కల్తీ వ్యాపారి బాలరాం ఇంకా ఎంతోమంది ఇళ్ళను కబ్జా చేసుకొని తన స్వంతం చేసుకున్నాడు. అయిదారు మర్డర్ కేసుల్లో కూడా ఇరుక్కొని, కోర్టులు, రాష్ట్రమంత్రుల అండదండలతో చివరకు నిర్దోషిగా తన పక్షాన తీర్పు ఇప్పించుకోగలిగాడు. భారత రాజ్యాంగం, పోలీసు, కోర్టు యంత్రాంగంలపై అమోఘమైన భక్తిభావమున్న మహేశ్వర్ తనను నాలుగేళ్ళుగా సతాయిస్తున్న బాలరాంపై పోలీసులకు ఫిర్యాదు చేశాడు. కథ ఇలా మలుపు తిరుగుతుందని కలలో కూడా ఊహించలేదు మహేశ్వర్. ఆరు నెలల నుండి భార్యాపిల్లలు, ఇంటి గొడవలేవీ పట్టించుకోకుండా, తాను చేస్తున్న ప్రైవేట్ ఉద్యోగాన్ని సైతం వదులుకొని పోలీస్‌స్టేషన్ చుట్టూ తిరుగుతున్నాడు. ఎవరెలాంటి వాళ్ళో అర్థమైపోయింది.

"బస్తీ ఖాళీ చేసి, ఉన్న ఇంటిని కల్తీవ్యాపారి బాలరాం పేర రాసిచ్చి ముఖం నల్లజేసి వెళ్ళిపొమ్మంటారా సార్" అడిగాడు మహేశ్వర్.

"నేనెలా అంటాను ఆ మాట. సమస్యలకు సరియైన పరిష్కారం మనం కోరిన వెంటనే దొరకదు. మనిషికన్నా సమయం బలమైనది. పరిస్థితులకి ఎంతటివాళ్ళైనా తలవంచక తప్పదు. మీ కేసునే కాదు, ఈ బస్తీలోని బడా దాదాలు సృష్టిస్తున్న ఎన్నో

కేసులను పరిష్కరించే పూర్తి అధికారమే నాకు ఉంటే ఎన్నో రోజులు పట్టదు. రెండు మూడు రోజుల్లో పరిష్కరించగలను. నాకు ఆ అధికారం లేదే. నేను పోలీసు అధికారినంటే. నాపై అధికారులు చెప్పినట్లు నడుచుకుంటే నా ఉద్యోగం ఉంటుంది. లేకపోతే ఇంట్లో కూర్చోవాల్సిందే" చెప్పాడు రామారావు.

"మీ మాటా... తీరూ... సంస్కారం చూస్తుంటే... మీరు మాత్రం ఇంత అపవిత్రమైన శాఖలో ఎలా పని చేయగలుగుతున్నారు సార్!" అడిగాడు మహేశ్వర్.

"పోలీసు శాఖ అపవిత్రమైంది కాదు. ఈ మాట కొస్తే ప్రభుత్వ కార్యాలయాలన్నీ మంచివే. ప్రజలకు మేలు చేయటం కోసం, పరిపాలనా సౌలభ్యం కోసం ఏర్పాటు చేసిన వివిధ శాఖలలో పనిచేస్తున్న అధికారులు, సిబ్బంది అపవిత్రంగా ప్రవర్తిస్తే శాఖల పేరు ప్రతిష్టలు భ్రష్టు పట్టిపోతున్నాయి. మా శాఖలోనే కాదు ప్రస్తుతం ఏ శాఖలోనూ చూసినా ఏమున్నది గర్వకారణమన్నట్లు నిజాయితీ పరులైన ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్., ఐ.ఆర్.ఎస్., ఐ.ఎఫ్.ఎస్. తదితర సివిల్ సర్వీస్ ఉన్నతాధికారులకే దిక్కూ టికానా లేదు. ఇక నాబోటి చిన్న ఉద్యోగి పరిస్థితి ఏమిటో నాకు బాగా తెలుసు. భార్యాపిల్లలు, ముసలి తల్లీదండ్రులున్నారు. కుటుంబ పోషణకోసం ఏదో ఉద్యోగం చేయాలి తప్పదు. యాభైవేలు లంచమిచ్చి జాయినవుతున్నారు"

"మీరు ఎంత లంచమిచ్చి ఈ ఉద్యోగంలో చేరారు సార్"

"అప్పట్లో... ఇంతటి దివాలాకోరు మంత్రులూ లేరు. అధికారులు అంతకంటే ఉండేవారు కాదు. నేను స్పోర్ట్సుమెన్ని. బాక్సింగ్‌లో నేషనల్ ఛాంపియన్ని. ఎం.ఎ. ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. ఎస్.ఐ.గా సెలక్ట్ అయ్యాను. చాలా సంతోషంగా ఈ పోస్ట్‌లో చేరాను. రానురాను పరిస్థితులు తారుమారైనాయి. ఓనమాలు రాని స్ట్రీట్ రౌడీలంతా రాజకీయవేత్తలయ్యారు. ఇప్పుడు మన దేశంలో ఉన్న కేంద్ర, రాష్ట్ర మంత్రులు, కుళ్ళు రాజకీయవేత్తలు, మతోన్మాద చర్యలకు పాల్పడే నేతలు ఇంకా గల్లీ నుండి ఢిల్లీ దాకా ఎదిగిన ప్రబుద్ధులు ఎంతో శాతం మంది స్థానికులను చంపుకుతిన్నవాళ్ళే. మా పోలీస్‌స్టేషన్ లాకప్స్‌లో గడిపినవాళ్ళే కదా... రౌడీ రాజయితే రౌడీలకు రాజ్యాన్నప్పగిస్తాడు. ఇదంతా రాజకీయ ప్రసంగం కాదు. జరుగుతున్న నిజం. అందుకే నా జూనియర్స్ ఎంతోమంది సర్కిల్ ఇన్స్‌పెక్టర్స్ అయ్యారు. ఇంతెందుకు ఇప్పుడున్న మన సర్కిల్ శ్రీహరి కూడా నా జూనియర్ తెలుసా... లంచాలు ఇచ్చుకునే లుచ్చా సంస్కృతి మా ఇంటా వంటా లేదు. పోనీ ఇప్పుడదంతా ఎందుకుగానీ..." ఆవేశంగా చెప్పుకొచ్చాడు ఎస్.ఐ. రామారావు.

"సి.ఐ. గారిని కలవమంటారా?" అడిగాడు మహేశ్వర్.

"ఇంకెక్కడి సి.ఐ. ఎప్పుడో గాఢమైన నిద్రలోనికి జారుకొని ఉంటాడు. ఆయనిప్పుడు మత్తుగా కలలు కంటూ ఉండి ఉంటాడు. లేచాడంటే అరుపులు వినిపిస్తాయి. ఇప్పుడు సమయం మూడవుతుంది కదా... నాలుగయ్యిందంటే మన చుట్టూ ఉన్న లీడర్లు, దాదాలు, గుడుంబా, కల్తీ వ్యాపారులు ఒకరి తర్వాత ఒకరు వస్తారు. అప్పుడు నిద్రలేచి వేడినీళ్ళతో స్నానం చేసి అందగాడిలా తయారై జీప్‌లో బస్తీలన్నీ నామ్‌కే వాస్తే రౌండ్

కొట్టి వస్తాడు. తనకోసం వచ్చేవాళ్ళు ఎవడో ఒకడు రాత్రి విందూ, పొందూ కల్పిస్తారు. అంతే... ఈరోజు డ్యూటీ బర్కాస్" కసిగా చెప్పాడు రామారావు.

ఎస్.ఐ. పురుషోత్తమ రావు తలకిందులేనుకొని తెలుగు దినపత్రికను చదువుతున్నవాడల్లా అప్పుడప్పుడు రామారావు, మహేశ్వర్‌తో చెప్పే విషయాలన్నీ వింటూ ప్రతిస్పందిస్తున్నట్లు మహేశ్వర్ గమనించాడు.

రామారావు మళ్ళీ చెప్పుకొచ్చాడు. "నేను మీతో చెప్పిన విషయాలు మళ్ళీ మా సర్కిల్‌కి తెలుస్తాయి. అదెందుకో తెలుసా.... ఇక్కడే మా సిబ్బందిలోనే కొందరు చంచాలను మా సర్కిల్ తయారు చేసుకున్నాడు. చెప్పనీయండి. వస్తే ట్రాన్స్‌ఫర్ వస్తుంది. పనిష్మెంట్ డ్యూటీగా ట్రాఫిక్ పోలీస్‌స్టేషన్‌కి మారుస్తారు. లంచగొండులకు నిలయం లా అండ్ ఆర్డర్ డ్యూటీ అన్న అపకీర్తి ఇప్పటికొచ్చింది చాలు. తాటిచెట్టు కింద పాలు తాగినా కల్లు తాగాననే అంటారు."

"అరె ఓ సెంట్రీ!" సర్కిల్ అరుపులు.

మళ్ళీ... షరా మామూలే...

నిశ్శబ్దం....

తూలుతూ పడిపోతాడేమో నన్న మత్తులో కళ్ళు నలుపుకుంటూ ఇవతలి రూంలోనికి వచ్చాడు సర్కిల్.

అందరూ లేచి నిల్చొని శెల్యూట్ చేశారు.

మహేశ్వర్ కూడా లేచి "నమస్కారం సార్" అన్నాడు.

"ఆఁ... ఏమోయ్... ఇంగ్లీషులో ఫిర్యాదులు జబర్దస్తీగా రాస్తున్నావేందీ సంగతీ!"

"నాకేమొచ్చు సార్ ఇంగ్లీషు... ఏదో తెలిసిన రెండు ముక్కలు...."

మధ్యలో అందుకున్నాడు సర్కిల్. "ఇగో జర హుషార్ సూపియ్యకు. మా కమీషనర్ తానికి పోయినావా నువ్వు"

"అవును వెళ్ళాను సార్"

"ఏమైె తది. నీ కేసును కమీషనరొచ్చి సాల్వ్ చేస్తాడా! లేక మేం చేస్తమా... చెప్పు!" నిలదీశాడు సర్కిల్.

"మీరే చెయ్యాలి సార్!"

"ఇగబో.... మేం చెయ్యం పో. నీకు దిక్కున్నతాన చెప్పుకో పో.... ఇట్లనే ఇంగ్లీషులో కంప్లెయింట్స్ రాస్తూ ఉండు. నిన్ను ఎక్స్ట్రీమిస్ట్‌గా బుక్‌చేసి లాకప్‌లో పెట్టకపోతే నా పేరు శ్రీహరి కాదు"

"నేనేం తప్పు చేశాను సార్"

"ఇంకేం తప్పు చెయ్యాలె బే... కమీషనర్ తానికి, మా ఎ.సి.పి. తానికి పోయినావా లేదా"

"నువ్వు ఎంతదాక సదువుకున్నావురా"

"ఎం.ఏ. ఇంగ్లీష్ లిటరేచర్"

"ఓ అదా సంగతి... అందుకే రాతల్లో ఇంగ్లీషులో లా పాయింట్స్ నరుకుతున్నావన్న మాట"

"లా కూడా చేస్తున్నాను సార్. ఇప్పుడు ఫైనల్ ఇయర్‌లో ఉన్నాను. ఈ సంవత్సరంతో పూర్తవుతుంది" అన్నాడు... కానీ లా పూర్తయ్యాక నీలాంటి అసమర్థులు, అవినీతిపరులు, వ్యసనపరులైన అధికారుల అంతం చూస్తానన్న భావాన్ని ధ్వనింపజేస్తూ సర్కిల్ కేసి చూశాడు మహేశ్వర్.

"నువ్వేం చేయగలవురా నన్ను... మీ ఇంట్లో కిరాయికి ఉంటున్న బాలరాం నెలనెలా కిరాయి ఇస్తున్నా నువ్వూ, నీ అమ్మా సతాయిస్తున్నారని నాకు ఫిర్యాదు అందింది. ఇప్పుడేమంటావ్. కోర్టులో కేసు వేస్తానంటున్నాడు. బాలరాం గురించీ, మన కోర్టుల గురించీ నీకు తెలుస్తది. యాభై ఏళ్ళ దాకా మీ కేసు సాల్వ్ కాదు. ఆడు మీ ఇల్లు ఖాళీ చేయడు పో... కమీషనర్ తానికి కాదు... ఇప్పుడు ఇంకెవ్వనితోనైనా చెప్పుకో.... పో..." అంటూ బాత్‌రూం వైపు వెళ్ళాడు సర్కిల్.

ఇది పోలీస్ స్టేషనేనా.... తనతో మాట్లాడుతున్నది ఒక బాధ్యతాయుతమైన, విధులు నిర్వర్తినంచవలసిన పోలీస్ అధికారేనా అన్న అనుమానం వచ్చింది మహేశ్వర్‌కు. ఆవేశం కట్టులు తెంచుకుంది. అయినా చేసేదేముంది. తలవంచుకుని... కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తడైన సంగతి తనకు తెలియనే లేదు.

లాకప్ రూంలో నుంచి "ఎస్.ఐ. సాబ్.... గోల్డ్‌ఫ్లాక్ పెద్ద డబ్బా తెప్పిచ్చియ్యండ్రి" అన్న పిలుపు.

"ఏయ్ ఫోర్‌నాట్ ఫోర్! బాయ్‌ను పంపి లాకప్‌లో ఉన్న పాండుకు ఏం కావాల్నో తెప్పిచ్చియ్యి" ఆజ్ఞాపించాడు ఎస్.ఐ. పురుషోత్తమరావు.

రామారావు "అటు లాకప్‌వైపు చూడండి.. అందులో నలుగురూ నాలుగు కేసుల్లో బుక్ అయినవాళ్ళే... అందరూ క్రిమినల్స్. నాలుగు రోజుల నుంచీ లాకప్‌లో ఉంచి మేపుతున్నాము. లాకప్‌లో ఉన్న నేరస్తులను కోర్టులో ఇరవై నాలుగు గంటల్లో ఎందుకు హాజరు పర్చలేదో... ఇంత కన్నా క్లూ ఏం కావాలి మీకు... మీరు చదువుకున్న చదువును సార్థకం చేసుకోండి. మీ ఇల్లు ఎక్కడికీ పోదు... సంఘంలో లుచ్చాలు, బద్మాషులు ఉన్నంత కాలం మంచివాళ్ళకు కష్టాలు తప్పవు. మంచికి మనుషులు వంగి దండం పెట్టే రోజులు మనమే తేవాలి.

'థ్యాంక్స్' అక్కడి నుండి కదిలాడు మహేశ్వర్.

★ ★ ★

రెండు నెలలు గడిచాయి. ఈ రెండు నెలలు మహేశ్వర్ నిద్రపోలేదంటే అతిశయోక్తి కాదు. రాత్రనకా, పగలనకా పత్రికాఫీసుల చుట్టూ, పోలీసు, సంబంధిత ఉన్నతాధికారుల చుట్టూ తిరిగాడు. తనకు తెలిసిన విలేఖరులను పత్రికల్లో కలుసుకున్నాడు. ఫ్రంట్ పేజీల్లో సీరియల్‌గా వార్తలు వచ్చాయి. సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీహరి అతన్ని అడ్డం

పెట్టుకొని బస్తీలో రాజ్యమేలుతూ సామాన్య ప్రజలకు ఇబ్బందులు కల్పిస్తున్న ఛోటా బడా రాజకీయ వేత్తలు, రౌడీలు, గూండాలు, గుడుంబా, కల్తీ వ్యాపారులు, కబ్జాదారులు, అందరి గురించి తెలుగు, హిందీ, ఆంగ్ల దిన పత్రికల్లో వార్తలు వచ్చాయి. ప్రభుత్వాధినేతలు సి.బి.ఐ.కి కేసును అప్పగించారు.

★ ★ ★

కొన్నాళ్ళకి......

సర్కిల్ ఇన్స్పెక్టర్ శ్రీహరి ఏడు కేసుల్లో ఇరుక్కొని సస్పెండ్ అయ్యాడు. సారాబట్టీ నడిపే నారాయణ, గంగాధర్, కబ్జాదారు కల్తీ వ్యాపారి బాలరాం, రేప్, మర్డర్ కేసుల్లో ఇరుక్కున్న పాండు, లాలా ఇంకా ఎందరో జైళ్ళ పాలయ్యారు.

జరుగుతున్న మోసాలు, దౌర్జన్యాలు, అత్యాచారాలు, హత్యలను చూస్తూ ఊరుకున్నంతసేపూ.... మనుషులను భయం ఆవరిస్తుంది. తెగించి నడుం బిగించిన వారిని ఏ దుష్టశక్తులూ అడ్డుకోలేవనీ మహేశ్వర్ అనుభవం ద్వారా తెలుసుకున్నాడు. మనిషికి కావలసింది పట్టుదల, నిరంతర పరిశ్రమ, తనకు జరిగిన అన్యాయాన్ని ఎక్కడ ఏ విధంగా ఎవరికి చెప్పుకోవాలో, సమస్యలనెలా పరిష్కరించుకోవాలో నన్న నేర్పును మహేశ్వర్ తన శాంతియుత పోరాటంలో తెలుసుకున్నాడు.

ఇప్పటికీ "అమ్మో.... పాతబస్తీలో ఉంటున్నారా" అన్నవాళ్ళకు పాతబస్తీ సోది వినిపించి తీర్తాడు మహేశ్వర్.

పాతబస్తీ ప్రజలంటే మహేశ్వర్‌కి మహా ప్రాణం. సంఘ విద్రోహులంటే కంపరం.....

చికిత్స కోసం మహేశ్వర్ నిరంతరం సాగిస్తున్నాడు అన్వేషణ.

# రంజని - నందివాడ భీమారావు

# అవార్డు పొందిన కథలు

# పేగుకాలిన వాసన

## ఎ.ఎస్. జగన్నాథశర్మ

జల్లు కురిసి వెలిసింది. వాతావరణమంతా తడితడిగా, చలిచలిగా వుంది. ఈ క్షణమో, మరుక్షణమో మళ్ళీ చినుకు పుంజుకునేట్టుంది. పదిన్నరయినా పాసింజరుబండి రాలేదు. ఆకలిగా వుంది. అసహనంగా వుంది. దీపస్తంభాన్ని అంటిపెట్టుకుని వున్న వందలాది రెక్కల పురుగులు, నేల మీదికి దూసుకొచ్చి, ఆత్మత్యాగాలు చేసుకుంటుంటే జాలిగా వుంది.

తురాయి చెట్టు నీడన నిల్చుని వున్నాను. గాలి కెరటం కదిలినప్పుడల్లా కొమ్మలు కలవరపడుతున్నాయి. దాచుకున్న నీటిని ఆకుల వేళ్ళ సందుల నుండీ జార విడుచుకుంటున్నాయి. శిరసున చినుకులు చిల్లుతున్నాయి. శరీరమంతా జలదరిస్తోంది.

పట్టాలకి అటుగా నిలిచిన జట్కా, చీకటి సముద్రంలో చిరునావలా వుంది. గుర్రం తల విదిలిచ్చినప్పుడల్లా, దాని మెడనున్న మువ్వల పేరు కదిలి, శబ్ద తరంగాలు చెవులను స్పృశించి, చెదిరిపోతున్నాయి.

సరదాపడి కొన్న మువ్వలవి. తొలిరోజుల్లో సంగీత స్వరాలను విన్పించేవి. ఇప్పుడు ఉత్త ధ్వనిని మాత్రమే విన్పించగలుగుతున్నాయి. చేతినున్న హరికెన్ లాంతరు మీద చినుకుపడి చిటికిపోయింది. పురుగుల బాధ పడలేక, చిమ్నీ చుట్టూ ఆకు చుట్టానేమో, వేడికి మరణయాతనతో వెల్లకిలా విరుచుకుని, ఉమ్మలు చుట్టుకుపోతోందది.

రైలొస్తున్నట్టుంది. పట్టాలు పలుకుతున్నాయి. చెట్టు నీడను వదిలి వచ్చాను. కనుచూపు మేర కాంతి పుంజం కన్పించింది. వచ్చి నిలిచిన బండిలో నుంచి, ఆ ఆరుగురూ—కిరాణాకొట్టు శెట్టి, మేస్త్రమ్మ, పోలీసు, జబ్బు మనిషి గురుమూర్తి, కాలేజీ కుర్రోడు, టైపు నేర్చుకుంటున్న అమ్మాయీ - దిగారు. గుంపుగా చేరి, నాకోసం వెతుక్కుంటున్నారు.

ఇళ్ళకి చేరాలని వాళ్ళకెంత ఆత్రంగా వుందో, నేనూ అంతగానే ఆత్రపడుతున్నాను. ఆ దేహాలను ఆయా ప్రాంతాల్లో జారవిడిచేసి, చేతులు దులుపుకోవాలని వుంది.

వాళ్ళు జట్కా దగ్గరికి దౌడు తీశారు. వాళ్ళ వెనగ్గా నడిచేన్నేను.

సన్నగా వర్షం మొదలయింది.

అంతా ఒకరి మీద ఒకరుగా జట్కా మధ్యలో ముడుచుక్కూర్చున్నారు. లాంతర్ని వేలాడదీసి, నేనూ జట్కానెక్కాను. గుర్రం నడకలు పోయింది. వర్షం పుంజుకుంది.

ఊరికి దూరంగా నాలుగు మైళ్ళవతల వుందీ రైల్వేస్టేషన్. స్టేషన్ వరకు ఊరు ఎదగలేదు. ఎదిగే అవకాశమూ లేదు. పది, పన్నెండిళ్ళతో చిన్న చిన్న గ్రామాలుగా వుందీ ప్రదేశం. కొండ ప్రాంతం కావడంతో అభివృద్ధికి ఆమడ దూరంలో వుంది. పట్నం నుండి ఒకటి రెండు బస్సులున్నాయి యిక్కడికి. అయితే వర్షాకాలంలో బస్సుల జాడ కనిపించదు. మైదానాలవరకూ పరుగెత్తుకొచ్చిన బస్సులు, కొండను చూసి, గుండెలు చరచుకుని, వెను తిరిగిపోతాయి. ఫలితంగా నా వంటి జట్కావాలాలు బతకగలుగుతున్నారు.

గత పదేళ్ళుగా ఈ రోడ్డుని చూస్తున్నాన్నేను. దీంతో ముచ్చట్లాడుతున్నాను. మురిపాలు పోతున్నాను. నాకు బాగా పరిచయమున్న రోడ్డిది! ఎక్కడ ఎత్తులున్నది, పల్లాలున్నది, గుంటలున్నదీ అన్నీ కంఠోపాఠం. జట్కా నడపడంలో మెలకువలు చూపించనవసరం లేదు. అప్రయత్నంగా, సంకల్పితంగా బండి సజావుగా సాగిపోగలుగుతుంది. వాకంటే, నా గుర్రానికి ఈ రోడ్డంతా మరీ సుపరిచితం. చిన్ననాటి స్నేహితులివి!

వాలిపిరి కొడుతోంది. గాలివాటుకి జల్లు, జట్కాలోనికి తొంగి చూస్తోంది. ముందు కూర్చున్న మేష్టారమ్మ, టైపు నేర్చుకుంటోన్న అమ్మాయీ తడిసినట్టున్నారు.

"వెధవ్వాన" అన్నది మేష్టారమ్మ.

"చలి చలి" అన్నది అమ్మాయి.

"ఇటు రారాదా" అన్నాడు మేష్టారమ్మను ఉద్దేశించి కిరాణాకొట్టు శెట్టి. పోలీసు పగలబడి నవ్వాడు. గురుమూర్తి దగ్గాడు. కుర్రాడెందుకో మవునంగా వున్నాడు.

ఏడు గంటలకు రావాల్సిన పాసింజరు బండి, మూడున్నర గంటలు ఆలస్యంగా వచ్చింది. ఈ ఆలస్యం, ఈ చీకటి, ఈ వర్షం శెట్టిని, పోలీసునీ, సరదాలకు, సరసాలకూ ఉసిగొలుపుతోంటే, పాపం! ఆ మేష్టారమ్మని, అమ్మాయిని, గురుమూర్తినీ బాధిస్తున్నట్టు న్నాయి. కుర్రాడి గుండె గుబులు నేనెరుగను! నా విషాద నేపథ్యం వీళ్ళెరుగరు!

ఉన్న ఊరు నుండి స్టేషన్కి, స్టేషన్నుండి ఉన్న ఊరికి జట్కాలో దిగవిడిచినందుగ్గాను, వీళ్ళంతా - నెలసరి కిరాయిగా యాభయి రూపాయల్ని ఒక్కొక్కరూ చెల్లిస్తారు. పైపై బేరాలు పోను, నెల తిరిగేసరికి చేతిలో రెండువందల రూపాయలు మాత్రమే పడతాయి. శెట్టి, పోలీసూ పైసా ఇవ్వరు. పోలీసు బాబుని కిరాయి అడిగే ధైర్యం లేదు. కిరాయిని, వడ్డీ కింద శెట్టి జమ చేసుకుంటాడు.

రెండేళ్ళక్రితం జట్కా బోల్తాపడింది. చక్రాలు విరిగిపోయాయి. గుర్రం కుంటిదయింది. అప్పుడు శెట్టిని ఆశ్రయిస్తే అయిదువందల రూపాయలు అప్పిచ్చాడు. అప్పిచ్చి ఆనాడాదుకుని నేటికీ అసలు చెల్లించలేని నా జీవితమ్మీద స్వారీ చేస్తున్నాడు.

పట్నం ఠాణాలో పోలీసు బాబు పని చేస్తాడు. పక్కనే శెట్టి కిరాయి దుకాణం. ఫర్లాంగు దూరంలో స్కూల్లో మేష్టారమ్మ, కాలేజీలో కుర్రాడు, ఇన్స్టిట్యూట్లో టైపు నేర్చుకునే అమ్మాయి, ఆస్పత్రిలో రోజూ పరీక్ష చేసుకునే గురుమూర్తీ - వీళ్ళంతా ప్రతిరోజూ పట్నాన్ని పలకరించి, పరామర్శించి రాక తప్పదు. సెలవు దినాల్లో ఒకరిద్దరు

తక్కువయినా, మిగిలిన వాళ్ళకోసం నా వృత్తికి సెలవంటూ దొరకదు.

బురద గుంటలో చక్రం పడింది. జట్కా తూలిపడి నిలిచింది. గుర్రం, శక్తినంతా కూడదీసుకుని లాగుతోన్నా ఫలితం లేదు. తప్పదనిపించింది. కుర్రాణ్ణి, పోలీసుని, శెట్టినీ జట్కాను నెట్టేందుకు కిందికి దిగమన్నాను. నలుగురమూ సాయం పడితేనేగాని జట్కా పైకి లేవదు.

ఇది మామూలే! వర్షాకాలంలో, దారిలో ఇటువంటి అడ్డంకులు తప్పనిసరవుతాయి.

"కావాలంటే అప్పిప్పిస్తాను. బండికి మోటారు పెట్టించ రాదురా" అన్నాడు శెట్టి.

"అవున్నిజం" అన్నాడు పోలీసు. ఆ మాటలకి బతుకు భయం కలిగిందేమో! గుర్రం వణికింది. ఒక్కసారిగా శరీరాన్ని విదిల్చింది. జట్కా ఓ అడుగు ముందుకి నడిచి, నిలిచింది.

చేతినంటిన మట్టిని, జట్కా అద్దాలకు పూసి, వాళ్ళు జట్కా నెక్కితే, మట్టి వాసనను వదల్చుకోదలచక, నేనదే చేతుల్తో కళ్ళాన్ని అందుకున్నాను. లేచింది మొదలు పడుకునే వరకూ ఇదే మట్టిలో పరుగెడతాను. దీన్ని కాదనుకునేవాణ్ణి కాదు. కాదనుకుంటే పుట్టగతులుండవు.

"దెయ్యాల వేళక్కాని ఇళ్ళకి చేరమేమో" అన్నాడు శెట్టి.

"మీరన్నది నిజం! పన్నెండు గ్యారంటీ" అన్నాడు పోలీసు.

"మరయితే రేపు మేష్టమ్మ స్కూలుకి రాదు" అన్నాడు శెట్టి.

"ఆవిడ సంగతేమోగాని, గురుమూర్తి మాత్రం రేపు ఆసుపత్రికి రాడు" అన్నాడు పోలీసు. ఆ మాటకి కితకితలు పెట్టినట్టుగా నవ్వాడు శెట్టి.

గురుమూర్తి చావు మీద సరస సంభాషణ సాగుతోంది. వస్తోన్న దగ్గునణచుకుని ఉక్కిరి బిక్కిరవుతున్నాడు గురుమూర్తి. తన ప్రాణంతో పరాచికాలాడడాన్ని అతను భరించలేకున్నాడు.

గాలివాటు తగ్గింది. వర్షం నిలిచి కురుస్తోంది. కాలవలు కట్టి, నీరు రొదగా ప్రవహిస్తోంది.

ఈసరికి, గుడిసె నిండుగా నీరు నిలిచి వుండి వుంటుంది. గిన్నెలు, బట్టలూ తేలిపోయుంటాయి. అన్నం గిన్నె గిరికీలు కొడుతూ వుంటుంది. పల్లంలో వున్న గుడిసె మీద తల్లి గంగకి ఎల్లల్లేని ప్రేమ మరి!

ఆకలిని అణగార్చుకున్నా, అలుపును మరచిపోయేందుకు, గాఢంగా నిద్రించేందుక్కూడ అవకాశం లేదు. ఏటవాలుగా నిలిచిన జట్కాలోనే, జారుడు బల్ల మీది వాటంలా విశ్రాంతిని ఆశించాలి.

అత్తమ్మ వుంటే గుడిసెలోని నీటిని తోడి పారేసేది. ఏ వేళనయినా మంచుముద్దలా పిడికెడు అన్నాన్ని కంచంలో నుంచేది. మామయ్య చనిపోవడంతో అత్తమ్మ లేచిపోయింది. పట్టెడన్నం కోసం, శరీరాన్ని ఎరజూపుతూ పిచ్చితల్లి లేచిపోవాల్సి వచ్చింది. ఎవర్ని అల్లుకుని, ఎక్కడ ఆకలిని తీర్చుకొంటోందో ఏమో!

రాయి మీంచి చక్రం నడిచినట్టుంది. జట్కా తూలిపడి నిలదొక్కుకుంది. అంతా

ఒక్కసారిగా అరిచి సద్దుమణిగారు.

"కళ్లు మూసుకున్నావేట్రా బాబూ" అడిగాడు శెట్టి.

"లేదు! రోడ్డు మూసుకుపోయింది" అన్నాను జవాబుగా.

"జాగ్రత్తరా బాబు! రేపు మినిష్టరుగారొస్తున్నారు. బందోబస్తుకెళ్ళాలి" అన్నాడు పోలీసు.

అతనికి బదులు పలుకలేదు. అసలా పోలీసుతో మాట్లాడాలంటేనే అసహ్యం! అతను చనిపోతే బాగుణ్ణనుకుంటాను. పట్నంలో ఏదో ఒక దొమ్మీలో ఎవరో ఒకరు పోలీసుని చంపినట్టు వార్త రాకూడదూ? అన్పిస్తుంది. అతని మీద ఎందుకనో అలవిమాలిన కసి!

గురుమూర్తి పెద్దగా ఆయాసపడుతున్నాడు. బుసలు కొడుతున్నాడు. చచ్చి పోతాడేమో! అతగాడి శవాన్ని, ఇంటికి అప్పజెబుతాననిపించింది.

శెట్టిని హత్య చేయాలని వుంది. మేస్త్రమ్మను తిట్టి పోయాలని వుంది. టైపు నేర్చు కుంటోన్న అమ్మాయిని తన్ని ఇంట్లో కూర్చోబెట్టాలని వుంది. కాలేజీ కుర్రాడి మీద కోప గించుకోవాలని వుంది. ఎందుకు? ఎందుకంటే జవాబు లేదు. ఈ ముఖాల్ని చూస్చూసి, వీటితో విసిగిపోయుంటాను. బతుకులో కొత్తదనం లేదనిపించడం కూడా ఈ ఆవేశానికి, అసహనానికీ కారణం కావచ్చును.

మొహం మొత్తేటట్టు జీవించడం ఇష్టం లేకపోతోంది. ఏదో కావాలనిపిస్తోంది.

ఈ అనుభవం నాకు కొత్తది కాదు. ఈ బాధా సరికొత్తది కాదు. బుద్ధెరిగిన నాటి నుంచీ నేనిలాగే ఆలోచనలు పోతున్నాను.

అప్పుడూ అంతే! ఇప్పుడూ ఇంతే!

అమ్మను ఆట పట్టించిన రోజుల్ని, నాన్నతో దోబూచులాడిన వేళల్ని, అక్కను గిల్లి అల్లరి చేసిన సంఘటనల్నీ తలచుకుంటుంటే, ఈనాడవి, అందంగా వుండి అందరాని అనుభూతులనిపించినా ఒకనాడవి రోత పుట్టించాయి. భయాన్ని కలిగించాయి. పరిస్థితుల నుండి, పల్లెపట్టు నుండి పారిపోయేటట్టు చేశాయి.

నా బాల్యం, నన్ను నానా రకాలుగా హింసించింది. నన్ను ముక్క ముక్కలు చేసింది. నన్నెదగనీయలేదది. కళ్ళకి కలలు ముసుగేసి నన్ను నా నుండి కనుమరుగు చేసింది.

నాన్న కర్రల మిల్లులో పనిచేసేవాడు. 'కటర్'గా వృత్తిని నిర్వహించేవాడు. నిక్కరు, బనియనూ ధరించి, తోలు పట్టానొకదాన్ని గుండెల మీద కవచంలా వుంచుకుని పెద్ద పెద్ద దుంగల్ని చీల్చి చెండాడేవాడు.

కర్రను కోసేవేళ రంపపు ధ్వని 'అమ్మకి దండం! నాన్నకి గండం' అని వల్లె వేసేది. మనసులో ఆ మాటల్ని ఉచ్చరిస్తే చాలు! పాటయ్యేదది. ఆ పాటలతో దుంగల మీంచి దూకుతూ ఆటలాడుకునేవాణ్ణి. జారిపోతున్న నిక్కర్ని ఎగదోసుకుంటూ, జుబ్బాను సర్దుకొంటూ జాలాయిగా వుండేవాణ్ణి.

అమ్మ, కర్ర పొట్టును గోనె సంచుల్లో నింపుతుండేది. సంచిలో పొట్టును కుక్కి నింపడంలో నా సహాయాన్ని అర్థించేది.

"ఆ గెంతులేవో, ఈ గోనె సంచి మీద గెంతరాదురా" అనేది. బ్రతిమలాడేది. అందక పరుగెత్తే నన్ను అంది పుచ్చుకుని, పొట్టు గుట్ట మీదకి లాక్కొచ్చేది. జల్లులా కురుస్తోన్న పొట్టులో పొర్లి పొర్లి, మనిషంతా పొట్టుమయమయిన తర్వాత 'పగటివేషగాడిలా వున్నావు' అన్న కితాబు లభిస్తే అమ్మనప్పుడు ఆదుకునేవాణ్ణి. బుగ్గల్ని పొంగించి హనుమంతుణ్ణనుకుని పొట్టుబస్తాపై చిందులేసేవాణ్ణి. అలా నింపిన పొట్టు బస్తాకి అమ్మకి పావలా లభించేది. అందుకోసం ఉదయం నుంచి సాయంత్రం వరకు ఆమె నర్తించడాన్ని చూసేవాణ్ణి. బడి వేళవరకు అమ్మకి అండగా వుండి, ఆ తర్వాత నేను బడికి పయనమయితే, అమ్మొక్కర్తే ఆకాశాన్ని అందుకోవాలన్నట్టుగా ఎగిరి గంతులేసేది. తోడుగా అక్కను మాత్రం రమ్మనమనేది కాదు. అక్క గంతులేయడాన్ని, అక్కడంతా ఆత్రంగా చూడడాన్ని గమనించి నాన్న వద్దన్నాడు.

అక్క, దుంగల మీది బెరళ్ళను తీసి తట్టలో వేసుకునేది. మంచుకి, వర్షానికి తడిసిన దుంగల మీది బెరళ్ళను తీయడంలో అక్క ఎంతగానో శ్రమించేది. గోళ్ళలో పేళ్ళు గుచ్చుకున్నా ఖాతరు చేసేది కాదు. ఒక్కొక్కప్పుడు బెరళ్ళ నడుమ జెర్రులను, తేళ్ళనూ చూసి, బెంబేలు పడి రక్షణగా నన్ను కేకేసేది. చీమల్ని చంపినట్టుగా నేను వాటిని చంపుతోంటే, చేయిజాచి, నన్ను దగ్గరగా తీసుకునేదక్క. మెచ్చుకోలుగా నా జుత్తు నిమిరేది. తోడుంటానని బడికి వెళ్ళనని మొరాయిస్తే "వెళ్ళిరారా" అని ప్రాధేయపడేది.

ఇంట్లో ఎక్కాలు, పద్యాలూ పెద్ద గొంతుతో చదువుతోంటే అమ్మ పొంగిపోయేది. "ఆరు పావలాలు ఎంతరా" అనడిగేది. "రూపాయిన్నర" అని చెబితే, నాటి తన సంపాదనను చూసి చిన్న బుచ్చుకునేది. "దేనికి సరిపోతుందిది" అని దుఃఖించేది. "వళ్ళంతా పచ్చి పుండుగా వుంది! కడుపునిండా గంజి తాగి కునుకు తీద్దామంటే నా సంపాదన నాకే చాలదు" అని నెత్తి కొట్టుకునేది. "ఇందులో పిల్లలకేం పెడతాను! పెనిమిటికేం పెడతాను" అని శోకించేది.

అక్క సంపాదనంతా అణాపైసల్లో వుండేది. నాన్న కష్టం ఆయన కల్లు చుక్కలకి పోయేది.

తాగొచ్చిన నాన్నతో, అమ్మ తగవులాడేది. "ఇలాగయితే ఎలాగయ్యా" అని ఆయన్ని నిలదీసేది. అమ్మ ప్రశ్నకి, నాన్నకి జవాబు తెలియదుగాని, జబర్దస్తీ తెలుసు! ఫలితంగా అమ్మను చితకతన్నేవాడాయన.

"మళ్ళీ నోరెత్తితే నరికి పోగులు పెడతాను" అనేవాడు. నన్ను దగ్గరగా తీసుకుని హరిశ్చంద్ర నాటకంలోని కాటిసీను పద్యాలను చదివించుకుని చల్లబడేవాడు.

రంపానికి దుంగనందించడంలో ఓసారి ప్రమాదవశాత్తూ నాన్న చేతివేలు చితికి పోయింది. కుడిచేతి బొటనవేలు విరిగిపోయింది. చేపలా కిందపడి పొట్టు పాలయిందది. 'గొల్లు' మన్నారంతా. స్రవిస్తోన్న నాన్న రక్తాన్ని చూసి తల్లడిల్లిపోయారు. మిల్లు యజమానిని కేకేసి వివరించారు.

"ఎక్కడ చూస్తున్నావురా" అని నాన్నని కోపగించుకున్నాడాయన. యాభయి రూపాయిల నోటిచ్చాడు.

"ఆస్పత్రిలో చావు" అన్నాడు. పాతిక రూపాయిల మందులు తిని, నాన్న చేయి రక్తాన్ని దిగమింగుకుంటే మిగిలిన డబ్బుతో బాధను దిగమింగుకునేందుకు నాన్న కల్లుపాకని ఆశ్రయించాడు. వారంరోజులపాటు పనిలోనికి పోలేదాయన. కుడిచేతిని కళ్ళ ముందుంచుకుని విలపించాడు. యజమాని మళ్ళీ పనిలోనికి తీసుకోడేమోనని దిగులు చెందాడు. అయితే నాన్నని ఓదారుస్తూ -

"నాకు పని ముఖ్యంరా! నీ వేలు కాదు" అని యజమాని అనడంతో నాన్న ఆనందానికి ఆనాడు పట్టపగ్గాలు లేకపోయాయి. బొటనవేలు మొలకెత్తినంతగా సంతోషించాడు. "మీరు దేవుడు బాబూ" అన్నాడు. యజమానికి పడిపడి నమస్కరించాడు. నాలుగు వేళ్ళూ నోటికి పోనున్నాయన్న ధీమాతో రెట్టించి పనిచేశాడు.

నాటి నుంచే అమ్మ దగ్గడం ప్రారంభించింది. దగ్గి, దగ్గి, గుండెలు తోడేసినట్టు గిలగిలా కొట్టుకునేది. కెళ్ళలు కెళ్ళలుగా కఫాన్ని కక్కుతో కుళ్ళిపోయేది. రోజుకి ఆరేడు బస్తాల్లో పొట్టును కూరగలిగే అమ్మ, రెండు మూడు బస్తాల్లో మాత్రమే కూరి, డీలా చెందేది. చేతిలో రూపాయి కూడా పడని తన శ్రమని చెడ తిట్టుకునేది. బడికిపోనని బస్తాల్లో పొట్టు కూరుతానని మొండికేసే నన్ను తిట్టి, కొట్టి బడికి సాగనంపేది.

బడి వదిలిన తర్వాత మిల్లులో దుంగల మీద కూర్చొని పాఠాల్ని బట్టీ పెట్టేవాణ్ణి. అక్కడక్కడే అక్క తచ్చాడుతూ వుండేది.

అక్కనేదో పురుగు కరిచి దుంగల్లోనికి పారిపోయిందో రోజు! పెద్దగా కేకేసి అక్క నిలువునా కూలి పోయిందానాడు. మాట్లాడదు. మెలికలు తిరిగిపోతోంది. కరిచింది ఏమిటన్నదీ అంతు చిక్కలేదు. పాము కాటేసిందేమోనని అంతా భయపడ్డాం. కాసేపటికి తేరుకుని అక్క కాదన్నది. ఆ పురుగు కందిరీగలా వున్నదన్నది. తనని కరిచి దుంగ పగులులోనికి జారిపోయిందన్నది. కసిరేగి పగులులో కళ్ళుంచి తీక్షణంగా చూశాన్నేను. ఏదీ కన్పించలేదు. పగులులో వేళ్ళు జొనిపి, దుంగంబడి నడిచాను. పురుగు దొరికితే పిసికి పారేద్దామన్నంత కక్ష రేగింది.

నోటు పుస్తకాల్లేక నోట్సు రాసుకునేవాణ్ణి కాదు. ఫలితంగా మేష్టారితో చింత బరికెతో దెబ్బలు తినాల్సి వచ్చేది. రక్తం చిప్పిల్లిన చేతుల్ని ఉమ్మి తడిచేసుకుని వూరుకునేవాణ్ణి తప్ప ఆ ఊసెవరికి తెలియనిచ్చేవాణ్ణి కాదు. అయితే నాన్నకి సంగతి తెలిసింది. తెలిసి యజమాని ఇచ్చే యాభయి రూపాయిల కోసం కుడిచేతి చూపుడు వేలుని పోగొట్టుకున్నాడు. రంపానికి ఆ వేలుని అంకితం చేశాడు.

దుంగల మీది పుల్లగొడుగుల్ని తొలగిస్తో కూర్చొన్న నా దగ్గరగా వచ్చి చేతిలో పదినోటు నుంచాడు. "వెళ్ళి పుస్తకాలు కొనుక్కో" అన్నాడు.

ఆ రాత్రి "ఎంత పని చేశావయ్యా" అని తాగొచ్చిన నాన్నని అమ్మ నిలదీస్తే

"నా కోసం నేనీ పని చేయలేదే! నన్ను నమ్ము" అన్నాడు.

"చదువుకుని వాణ్ణయినా బాగుపడనీ" అన్నాడు. నన్ను కాటిసీను పద్యాల్ని విన్పించమన్నాడు. ఎన్నడూ లేనిది, ఆనాడెందుకో ఆ పద్యాల్ని రాగయుక్తంగా నాన్నకి విన్పించాలనిపించింది.

ఏమరపాటునున్న అక్కను గిల్లి, పురుగని అల్లరి చేసినా, దొరికితే కాటేసేను పద్యాల్ని విన్పించమంటాడని పెరట్లో చెట్ట మీదా, గుబురుల వెనుకా దాగి నాన్నతో దోబూచులాడినా, అదంతా నాకు నాటకీయంగానే వుండేది. సహజమనిపించేది కాదు.

అమ్మ దగ్గు విషాదం! నాన్న త్యాగం విషాదం! అక్క చితుకులేరుకోవడం విషాదం! విషాదాల్లో సరదాలాడడం కృత్రిమంగాక మరేమిటి?

పదో తరగతి పాసయ్యాను. నన్ను చూసి నా వాళ్ళంతా సంబరపడ్డారు. మిల్లు యజమాని దగ్గరకు తీసుకువెళ్ళి నేను పదో తరగతి పాసయ్యానన్నది చెప్పాడు నాన్న.

"పై చదువులు చదివిస్తావా" అని అడిగిన యజమానితో -

"ఈ చదువుకే రెక్కలు ముక్కలయ్యాయి" అనన్నాడు నాన్న.

"చదివిన చదువు చాలు! దయతలచి తమరు చిన్న నౌకరీ కల్పించండి. వాడి పొట్టకి వాడు సంపాదించుకుంటే అదే పదివేలు" అన్నది అమ్మ. కాదనలేదు యజమాని. కర్రల కొలతలు చూసే పని నాకప్పగించాడు. నెలకి యాభయి రూపాయిలు జీతమని చెప్పాడు.

అయితే ఆ మిల్లులో నౌకరీ నాకిష్టం లేకపోయింది. రాకాసి లోయలో నేను జీవించలేననిపించింది.

దగ్గు రూపేణా అమ్మను అణగారుస్తోన్న జబ్బు, అక్కని కాటేసిన విషప్పురుగు, నాన్న వేళ్ళని కొరికేస్తోన్న కోరల కత్తి - అన్నీ ఆ మిల్లు యజమానని నాకు తెలిసీ తెలియడంతో ఒక్కక్షణం కూడా అక్కడ నిలువలేననిపించింది. వాడికి దూరంగా పారిపోవాలను కున్నాను పరుగెత్తాను.

జట్కావాలా వొకతన్ని ఆదరవు చేసుకుని నాన్నతో తెగతెంపులు చేసుకుని వున్న అత్తమ్మ ఊరికి పయనమయ్యాను. కన్నవాళ్ళకి, పుట్టి పెరిగిన ఊరుకి దూరమయ్యాను.

"ఆపాపు" అన్నది, బైపు నేర్చుకుంటోన్న అమ్మాయి. ఆ పిల్ల ఇల్లు దగ్గరపడింది. కళ్ళాన్ని బిగించనవసరం లేకపోయింది. గుర్రం ఆగిపోయింది. వోణీని నిండుగా కప్పుకుని, ఆ అమ్మాయి కిందికి దూకడంతో నేల మీది నీరు పైకి చిమ్మింది. లాంతరు వెలుగులో నీటి చుక్కలు ముత్యాల్లా మెరిసాయి.

జట్కా కదలనుందో లేదో, పరుగులాంటి నడకతో ఓ వ్యక్తి ఎదురొచ్చాడు. అతను నిక్కరు, లాల్చీలో వున్నాడు. పూర్తిగా తడిసి ముద్దయి వున్నాడు. యాభయ్యేళ్ళ వయసుంటుందతనికి. ఫలానా చోటుకని చెప్పి జట్కాను ఎక్కబోయాడు. చేతినందించి, అతన్ని మీదికి లాక్కున్నాను. మేస్త్రమ్మ పక్కన చతికిలబడి స్థిరంగా కూర్చున్నానని నిర్ధారించుకున్న తర్వాతగాని అతను నా చేతి ఆసరాను వీడలేదు. అప్పుడతని చేతివేళ్ళ వైపు చూశాను. చూసి పొంగిపోయాను. అతని కుడిచేతికి బొటనవేలు లేదు. ఈ వయసులో ఈ దుస్తుల్లో నాన్న అచ్చం ఇలానే వుంటాడనిపించింది. నాన్నే నా ప్రక్కన జట్కాలో కొలువు దీరాడనిపించింది. ఆనందం కలిగింది. నాకు మరింత సమీపంగా అతన్ని ముందుకి రమ్మన్నాను. జరిగొచ్చాడతను. కల్లువాసన వేశాడు. సంబరపడ్డాను.

జడివాన జలతారు తీవెలనిపించింది. చలిగాలి నులివెచ్చననిపించింది. అసహనం,

అసహ్యాలూ గుండెల్లోంచి ఎగిరిపోయి, హాయి హాయనిపించింది. జట్కాలోని వారినంతా తిరునాళ్ళకి తీసుకుపోతున్నట్టుగా వుంది. చేరువున నాన్న వున్నాడన్న భావన చెప్పలేని అనుభూతి అన్పించింది. చర్నకోలాను ఝుళిపించాను. గుర్రం పరుగు శరవేగమయింది.

నాన్నలాంటి వ్యక్తిని, ఏ వివరాలూ అడగదలచలేదు. వివరాలు తెలుసుకుని ఆయన నాన్న కాదన్న నిజాన్ని అంగీకరించదలచలేదు. చలికి వణకుతూన్న అతని చుట్టూ చేతులుంచి హుషారయ్యాను.

ఇప్పుడెందుకో మేష్టమ్మకు నమస్కరించాలని వుంది. కాలేజీ కుర్రాణ్ణి అనునయించాలని వుంది. గురుమూర్తి నిండు నూరేళ్ళూ బతకాలని వుంది. పోలీసు మీద పగలేదు. శెట్టిని హత్య చేయాలనీ లేదు. మేష్టమ్మను ఆట పట్టిస్తూ శెట్టి మాట్లాడితే బాగుణ్ణని వుంది. పోలీసు పగలబడి నవ్వితే కలిసి నవ్వాలని వుంది. అణువణువూ అందంగా, ఆనందంగా వుందనిపించింది. ఈలవేసి పాట పాడాలనిపించింది.

గొంతెత్తాను! బతుకంతా పాటగా సాగిపోయింది!

ఎవరిళ్ళ దగ్గర వారు దిగిపోయారు. నాన్నలాంటి వ్యక్తి కూడా నన్ను విడిచి దిగి వెళ్ళిపోయాడు. దిగి వెళ్ళిపోతూ అతను కిరాయిగా రూపాయి నోటును నాకందివ్వనుంటే "వద్దు నాన్నా" అన్నాను. నవ్వి జోగుతూ వెళ్ళిపోయాడతను. నన్ను దీవించినట్టుగా చేతినెత్తి గాలిలో ఊపాడు. ఆలోచింపజేశాడు.

గడిచిన పదేళ్ళలో ఏదో ఒక అవసరానిగ్గాను చేతులకున్న పదివేళ్ళనీ నాన్న పోగొట్టుకుని వుంటాడు. మొండిచేతుల్తో దుంగల్ని నెడుతూ, అమ్మో, అక్కో తినిపించగలిగితేనే అన్నం ముద్దని నోటికి అందుకోగలుగుతూ వుండి వుంటాడు. దగ్గు జబ్బుతో అమ్మ శల్యమయి వుంటుంది. పొట్టుబస్తాలో తనని తానే కుక్కుకోగలిగే స్థితికి చేరుకుని ఉంటుంది. అక్కను ఏ తేళ్ళు కుట్టాయో! ఏ పాములు కరిచాయో! ఏ పేళ్ళలో ప్రాణాల్ని బలి పెడుతుందో ఏమో!

నా వాళ్ళంతా ఎలా వున్నారో! ఏమయి వున్నారో!

ఏ దృశ్యాలకు భయపడి, ఏ జీవితాల్ని అసహ్యించుకుని ఎవరికి దూరంగా పారిపోదలచానో, అది నాకు సాధ్యం కాలేదు. ఎల్లెడలా ఒకటే దృశ్యం! ఒకటే జీవితం! రాకాసి లోయ అంతటా వ్యాపించి వుంది. క్రూర మృగాలు, మారణాయుధాలు, మంత్ర తంత్రాలన్నీ నాలాంటి కుటుంబీకుల కోసమే పొంచి వున్నాయనిపించింది.

నా వాళ్ళను నేను రక్షించుకోవాలి! అందుకు సన్నద్ధం కావాలనుకున్నాను. కొరడాను విసిరి, జట్కాను మా ఊరివైపు పరుగుతీయించాను. ఈ దీర్ఘరాత్రిలో, మైళ్ళ దూరంలో నున్న మా ఇంటికి ఈ జట్కాలో నేను చేరుకోగలనో లేదో! కాని, చేరుకోవాలన్న దృఢ సంకల్పం నాలో వుంది!

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 5–1–1990**

# అవశేషం

## బండి నారాయణస్వామి

కురవోళ్లది పెద్ద పండగ. పండ్రెండేండ్లకు ఒకసారి చేయాల్సిన పండుగ. కాని యాభై ఏండ్ల తరువాత చేస్తున్న పండుగ.

మా ఇంటిదేవుడు కందుకూరి ఉజ్జినప్ప. ఆ గుడికట్ట పూజారి ముసిలోడు అయిపో యాడు కాబట్టి మరో కొత్త పూజారప్పను నియమించే కార్యక్రమం కూడా ఉంది పండగలో.

ముసలి పూజారప్ప మా ఇంటికొచ్చాడు. అడ్డ పంచె కట్టి మోచేతుల వరకూ అంగీ వేసుకొని ఉన్నాడు. గుడ్డలు నలిగిపోయాయి. మనిషి నల్లగా ఉన్నాడు. చేతికి కడియం, మెడలో ఏదో తాయెత్తు. తెల్లగా నెరిసిపోయిన వెంట్రుకలు. గీసుకోని గడ్డం. బాపన పూజారి మాదిరి కాకుండా జిడ్డుగా మురికిగా ఉన్నాడు. ముందే మనిషి కారు నలుపు. దుమ్ము చుట్టుకున్న కాళ్లు మరీ అసహ్యంగా ఉన్నాయి. పూజారప్పలు కాళ్ళకు చెప్పులు తొడుక్కోకూడదని కులాచారం!

పూజారప్పకు ఇంకా ఎన్నో నియమాలు. బీడీలు కాల్చకూడదు. మద్యం ముట్ట రాదు. మాంసం కూడా తినరాదు. ఆవుపాలు తప్ప ఎనుము పాలు తాగకూడదు.. ఇంకా ఎన్నో

ముందు కాలంలో పూజారప్పలు తమ ఇంట్లో వండిన అన్నం కూడా తినేవాళ్ళు కాదంట. స్వంతంగా వండుకుని తినడం తప్ప! ఆ నియమం కొంచెం సడలిపోయింది ఈమధ్య. తల్లిగానీ, భార్యగానీ వండిన అన్నం తినొచ్చు అని కొంచెం మార్చుకున్నారు ఆ నియమాన్ని.

కాలం మారిపోతుంటే ఆధునిక జీవితపు స్థితిగతులు ఎంతో వేగంగా తారుమారు అయిపోతుంటే, ఒక ఆచారాన్ని ఎంత నిష్ఠాగరిష్ఠులయినా ఎంత కాలమని పాటిస్తారు పాపం!

కొంతకాలానికి పూజారప్ప అందరి మాదిరి చెప్పులు వేసుకు తిరిగినా, ఎనుముపాలు తాగినా, హొటళ్ళలో భోంచేసినా ఆశ్చర్యం ఉండదు.

కాలానుగుణంగా మారిపోతుంటాయి ఆచారాలూ, ఆహార నియమాలూ, అన్నీ! ఆ విషయం పూర్వకాలపు మనిషి అయిన మా అవ్వకు బాగా తెలుసు. పక్కింటి బాపనమ్మతో అవ్వ గొప్పగా చెబుతుంటుంది -

'అమ్మయ్యా! మేం శూద్రోల్లమూ, గొర్రెలు కాసేవాళ్ళమే కావచ్చు. కాని మీ మాదిరి మా పూర్వులు కూడా మాంసం ముట్టేవాళ్ళు కాదంట. జీవాలు రోగమొచ్చి సచ్చిపోతాంటే, దాన్లని ఊరకే పారవేసే దానికి మనసు రాక జందేలు తీసి జామిచెట్టుకు తగిలించి మాంసం తినడం మొదలుపెట్టినారంట. ఆ జందెం ఇప్పటికీ ఉంటుంది అమ్మయ్యా మాదేవుని దగ్గర' అంటూ-

ఇలాంటివే ఎన్నో పూర్వపు ఆచారాలు మార్పులకు లోనవడం ఆమెకు తెలుసు. కానీ ఆచారాలూ, నియమాలు తన హయాంలో మారిపోతే మాత్రం ఆమెకు కంపరం కలుగుతుంది. తన అస్తిత్వానికి ఏదో పెద్ద దెబ్బ తగిలినట్లు కలవరపడిపోతుంది.

మా ఇంట్లో అందరితోనూ కాళ్ళకు మొక్కించుకుని, మా నుదుట బండారు దిద్ది, మేం ఇచ్చిన బియ్యమూ బెల్లా, నలభై రూపాయల దుడ్లూ తీసుకుని వెళ్ళిపోయాడు పూజరప్ప. నూటపదహార్ల మీద ఉన్న పూజారప్పను నలభై రూపాయలకు దించేసరికి మా అవ్వకు తల ప్రాణం తోకకు వచ్చింది.

పూర్వం కులం వాళ్ళంతా పూజారప్ప ఇంటికి పాలుతెచ్చేవాళ్ళు. పెరుగూ, నెయ్యి తెచ్చేవాళ్ళు. పండ్లూ కూరగాయలూ, ధాన్యం ఏం పండితే అవి తెచ్చిచ్చేవాళ్ళు. కాని కాలక్రమంలో ఆ సదుపాయాలన్నీ అంతరించి పోయాయి.

తను ఉత్పత్తి చేసిన ప్రతి వస్తువునీ డబ్బులోకి మార్చుకోవడం ప్రారంభించాక మనిషిలో మునుపటి ఉదారత్వం పోయింది. అంతేకాదు సైన్సు అభివృద్ధి చెందడంతో మనిషి అవసరాలు పెరిగాయి. ధరలు ఆకాశానికి అంటాయి. తన ఇంట్లో పాడినీ, పొలంలోని పంటనీ తన కడుపుకు కూడా సరిగా తినకుండా జాగ్రత్తగా అమ్మి సొమ్ము చేసుకుంటే తప్ప బతకలేని దుర్భర పరిస్థితులు కూడా ఏర్పడ్డాయి. ఇట్లాంటి కష్టకాలంలో ఎవరు మాత్రం ఏ సప్తై చెయ్యగలరు పూజారప్ప ఇంటికి.

యాభై ఏండ్ల తరువాత చేస్తున్న పెద్ద పండగను చూడబోతున్నాను కదా అని మా అవ్వ తెగసంబరపడిపోతోంది. నాక్కూడా ఇదే చివరి పండుగ. మరో పన్నెండేళ్ళకు వచ్చే పెద్ద పండుగకు నేను హాజరు కాలేను. కనగానిపల్లిలో పెద్ద పండుగ సంబ్రంభం ఒక ఎత్తైన మైదానంలో.

పన్రెండేడ్లకు ఒకసారి వివిధ ప్రాంతాలకు వెళ్ళిపోయిన వారంతా అక్కడ కలుసుకుని, తమలో బతికిన వాళ్ళెవరో చచ్చిన వాళ్ళెవరో తెలుసుకుంటూ ఉండాలని, పూర్వం సంచార జాతులు ఏర్పాటుచేసుకున్న సంకేతస్థలం.

ఒక ఎత్తైన దిన్నె మీద కులం వాళ్ళంతా విడిది చేశారు. ఎక్కడెక్కడో పల్లెలో వ్యవసాయం చేసుకునే వాళ్ళూ, గొర్రెలు మేపుకుని వృత్తి చేసుకు బతికేవాళ్ళూ, ఎక్కడెక్కడో పట్టణాల్లో, సిటీలలో స్థిరపడిపోయి ఉద్యోగాలూ, వ్యాపారాలూ చేసుకుంటున్న వాళ్ళూ... చాలా మంది వచ్చి చేరారు ఆ దిన్నెపైకి.

పూర్వం దిక్కులకొకరు వెళ్ళిపోయి సంచార జీవనం సాగించేటప్పుడు ఉత్తరం నుంచీ ఒక గుంపూ, దక్షిణం నుంచీ ఒక గుంపూ వస్తుంటే, ఆ ఎత్తైన దిన్నెపైకి ముందుగా

వచ్చి చేరిన వాళ్ళు అల్లంత దూరంలో గొర్రెల మందల్తో వస్తున్న తమవాళ్ళను చూసి 'అడుగో, అడుగోలే! మనోల్లు వస్తాండారు' అని సంతోషంతో కూతలు పెట్టేవాళ్ళంట.

ఇప్పుడు దేశంలో కమ్యూనికేషన్స్ పెరిగాయి చూడాలని అనిపించాలేగాని ఏ బంధువు ఎంత దూరంలో ఉన్నా ఎప్పుడు పడితే అప్పుడు బస్సో రైలో ఎక్కి చూసి రావచ్చు. పూర్వం మాదిరి పండ్రెండేళ్ళ వరకూ కాచుకునే దురవస్థ ఇప్పుడు లేదు.

సంచారజీవనం నాటి పరిస్థితులు ఇప్పుడు లేవు. ఏటేటా గొర్రెలు అమ్మి వాటి బొచ్చు అమ్మి వచ్చిన డబ్బుతో ఇంత నేలచెక్కు కొనుక్కుని వ్యవసాయం చేసు కుంటూ ఏదో ఒక ఊళ్లో స్థిరపడిపోయిన వాళ్ళే అందరూ!

మా వీధిలోని బంధువుల పేర్లే ఇప్పుడు నాకు సరిగ్గా తెలియవు. పిన్నమ్మ అన వలసిన వాళ్ళని అత్త అనీ, అత్త అనవలసిన వాళ్ళని పిన్నమ్మ అనీ పిల్చి మా అవ్వతో చివాట్లు తింటున్నాను.

'ఈ కాలం పిల్లోల్లకి ఏ బంధువు ఏమవుతాడో వరసలు కూడా తెలీవు. ముందుముందుకు ఇంకా ఎట్ల మారిపోతారో ఈ చదువుకున్న పిల్లోల్లు' అని దిగులు పడిపోయింది మా అవ్వ.

ఒకప్పుడు మనుషుల్ని గుంపుగా కూడగట్టడంలో కులం మాత్రమే ఎక్కువ ప్రాధా న్యత వహించేది. ఇప్పుడూ...? విద్యా, ప్రాంతమూ, రాజకీయపార్టీలూ, ఐడియాల జీలూ...ఎన్ని లేవు మనుషుల్ని గుంపులు గుంపులుగా కూడగట్టడానికి, విడగొట్టడానికి!

చాలామంది వచ్చారు జనం.

బస్సుల్లోనూ, సైకిళ్ళమీదా, మోపెడ్లూ, స్కూటర్లూ, మోటర్‌బైక్‌ల మీదా వచ్చారు. ఒకరిద్దరు సంపన్నవంతులు కార్లలో వచ్చారు.

వృత్తి మాత్రమే జీవనాధారం కాదిప్పుడు.

చదువుకునే వాళ్ళు చదువుకుంటున్నారు. ఉద్యోగాలు చేసేవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. వ్యాపారం చేసేవాళ్ళు వ్యాపారం చేస్తున్నారు. సంచార జీవనం నుంచి విడివడి సమాజంలో కలిసిపోయారు. డబ్బు సంపాదించి పెట్టే వివిధ మార్గాల్లోకి చొచ్చుకుపోయి నాగరీకులు అయిపొయ్యారు.

మధ్యతరగతి విలువలు ప్రవేశించాయి మనుషుల్లో.

భర్త వదిలేసిన ఆడదాన్ని హేలనగా చూస్తున్నారిప్పుడు.

చీర కట్టించుకుని మరో మనువు చేసుకునే ఆచారం మూలపడింది.

ఏడుగురు భర్తల్ని మార్చి గౌడసానిగా పేరుపొంది కులంలో గౌరవమన్ననలు పొందగలిగిన స్త్రీలు కాగడా పెట్టి వెతికినా కానరారు ఇప్పుడు ఈ కురవోల్లలో.

కులపెద్ద-గురువులయ్య నిర్వహించాల్సిన పెళ్ళితంతుని ఇప్పుడు బ్రాహ్మణ పురోహితులే నిర్వహిస్తున్నారు. పాపం – మా గురువులయ్యలకు కొంగులు ముడివెయ్యడం తప్ప అర్థం కాని మంత్రాల్ని వల్లించడం రాదు కదా!

వరసలో కలకలం!

'జెల్లిపల్లి మల్లయ్య తన కొడుకును పూజారిగా ఎక్కించేదానికి ఒప్పుకోలేదంట'

'ఎందుకో?'

'ఎందుకో అంటే....? కూలీ నాలీ చేసుకుని పొట్టపోసుకుండే వాళ్ళు పాపం చెప్పులు లేకుండా నడవల్ల అంటే వీలైతుందా? ఇంట్లో ఒకరు ఎంగిలి పడి లేచినంక ఆ అన్నం తినరాదంటే వీలైతుందా? ఎక్కడికన్నా పోయి ఇంత పనీపాట చూసుకోకుండా పొద్దుగూకులూ గుళ్ళో కూరోవల్ల అంటే వీలైతుందా? ఎట్ల బతుకుతారు పాపం?'

'ఎవరుంటారో మల్ల పూజారప్పగా?'

'ఏమో! ఎవరుంటారో మల్ల!'

గుంపులు గుంపులుగా చర్చలు.

చెట్లకింద, ఏటిదగ్గరా, గుడికట్టమిందా ఈగల్లా ముసిరిన జనాలు. కందుకూరి ఉజ్జినప్పకు పూజారిని ఏర్పాటుచేసే సందర్భంగా సాక్ష్యం ఉండటానికి ఇతర ఊర్లనుంచీ తరలి వచ్చిన దేవుళ్ళు!

అంతరగంగప్ప, కురుగుంటప్ప, కామారుపల్లి పెద్దయ్య, గొల్లపల్లయ్య, కనగానిపల్లి పెద్దయ్య, దుర్గమప్ప, బీరప్ప, కాటమయ్యా... మొదలైన దేవుళ్ళంతా అన్నదమ్ములు! డెబ్బై ఏడు గుడికట్లలకు చెందిన వాళ్ళు!! అంతా తరలివచ్చారు. మా దేవుని వన్నె చూడు. మా దేవుని వైభవం చూడు అని పోటీలు పడి మాట్లాడుకుంటున్న జనం.

పొడవుగా కొంచెం విశాలంగా ఉన్న చెక్క మీద కర్రలు అమర్చి, వాటి మీద ఒక ఎర్రని గుడ్డని గూటిలా బిగించి, ఆ గూటిలో గుర్రాలూ, ఏనుగులూ లాంటి జంతువుల బొమ్మలు అమర్చుతారు.

అల్ల అమర్చిన కిరిడందిలో, ఆ మూల ఒకటి ఈ మూల ఒకటి రెండు వీరుల బొమ్మలు ఉంటాయి. గుర్రాన్నెక్కి కత్తి పట్టుకుని రౌద్రంగా ఆ గుర్రాలూ, ఏనుగుల మీద ఎన్నెన్నో వెండి గొడుగులు ఉంటాయి. చిన్నవీ పెద్దవీ. ఒక మూల నెమలి కన్నుల్తో చేసిన వింజామరం మెరుస్తుంటుంది. మరో మూల లింగాయుత జందెమూ, వీరముష్టివల కూడా ఉంటాయి.

పరచిన గొంగళ్ళ మీద దింపారు దేవుళ్ళని.

ఆనల్లని కంబళ్ళ మీద బండారు మరకలు, వెలుగుతున్న అగరొత్తుల కడ్డీలు టెంకాయల నీళ్ళవి. కొంచెం పక్కగా కొబ్బరి తిని పారేసిన టెంకాయచిప్ప ముక్కలు.

భుజంమీంచి కాళ్ళకింద వరకూ జారిపోయేటట్లు ధరించిన గొంగళి వస్త్రంతో, మెడలో తాయెత్తులతో, పూసలదండలతో, నెత్తిమీద ఎలుగ్గొడ్డు చర్మపు ఎత్తైన విశాలమైన టోపీతో, పిల్లనగోవి ఊపుతూ, డమరుకం వాయిస్తూ డబ్బులు యాచిస్తూ తిరుగుతున్న గొరవయ్యలు!

పొద్దు మునిగింది. ఏ కులస్తుడూ ముందుకు రాలేదు తన కొడుకును పూజారిగా చెయ్యడానికి.

డెబ్బై ఏడు గుడికట్లకు పెద్ద – చిన్నసైజు మఠాధిపతిలాంటి గురువులయ్య ఇంటింటికీ తిరుగుతున్నాడు ఏడెనిమిది మంది పెద్ద మనుషుల్ని వెంటబెట్టుకుని. కాని ఫలితం సున్న.

పూజారితనం కట్టుకోవడానికి మనిషి దొరికినా, రెండు దినాలు తరువాతగానీ మంచిరోజు లేదు పెద్ద పండగ జరపడానికి.

'రెండు దినాల వరకూ మేం ఎట్లుంటాము ఈ అడవిలో' అంటూ జారుకున్నారు మోటర్‌బైకుల్లోనూ, కార్లలోనూ వచ్చినవాళ్ళు.

'మనం రెండు దినాలు ఉండలేకపోతే మన పూర్వపోల్లు తమ బతుకంతా ఈ అడవుల్లోనే ఎట్ల గడిపి ఉంటారు?' అంది మా అవ్వ.

ఒక మంచి టీ దొరకక, నా సిగరెట్ బ్రాండు గోల్డుఫ్లేక్ దొరకక చాలా ఇబ్బంది పడిపోయాను ఆ అడవిలో.

బండ్లు కట్టుకొని వచ్చినవాళ్ళు మళ్ళీ వెనక్కి తిరిగిపోలేక జట్లు జట్లుగా చేరి, చెట్ల కింద పెద్ద పెద్ద రాళ్ళు పొందించి, ఆ రాళ్ళ పొయ్యి మీద కాగులూ, పెద్ద పెద్ద తపేలాలూ పెట్టి అన్నం వండుకుని తిన్నారు, ఇంకా వెలుతురు ఉండగానే!

రాత్రి కాగానే పెద్ద టార్పాలు కిందపరచి కంబళ్ళు కప్పుకుని పడుకున్నారు గుడికట్ట మీందా బయల్లోనూ! ఏవోవో టీరకాయపీచు బంధుత్వాల గురించిన మాటలు జోరుగా సాగుతున్నాయి.

మా అవ్వ వక్కాకు నములుతూ తన తండ్రి గురించిన జ్ఞాపకాలు తవ్వుకుంటోంది మా చిన్నాయన దగ్గర.

నూరేండ్ల కిందటి మాటరా అంటూ మొదలు పెట్టింది.

'అనంతపురానికి పది ఆమడల దూరంలో ఉంది కదురా నాగిరెడ్డిపల్లి! ఆ నాగిరెడ్డి పల్లిలో పుట్టినాడు మా నాయన. సంవత్సరం పిల్లోనిగా ఉన్నప్పుడు మా నాయనకు ఏదో రోగం వచ్చిందంట. ఆ ఊరి నుంచీ బండి కట్టుకొని అనంతపురం పాత ఊరి ఆస్పత్రికి పిల్లోన్ని ఏసుకువచ్చినారు.

ఒక దినం జరిగె. రెండు దినాలు జరిగె. వారం దినాలు జరిగె! తెచ్చుకున్న బత్తెమేమో అయిపాయెగానీ పిల్లోనికి మేలు కాలేదంట. అప్పుడు కొడుకులు లేని ఒక స్వకులస్తుని ఇంటికి పోయి 'తల్లీ! మీరు ఇక్కడే అనంతపురంలో ఉండేవాళ్ళు. పిల్లోన్ని మీ దగ్గరే పెట్టుకుని ఆస్పత్రిలో చూపించి రోగం బాగు చేయండమ్మా! మేము ఇక్కడ ఎంతకాలం ఉంటాము? మా ఊళ్లో జీవాలు ఏమయినాయో? జీవాల వెంట పోయేవాళ్ళకి సంగటి ముద్దలు సరిగా అందుతాండాయో లేదో! గొడ్డూగోదం, ఇల్లూవాకిలీ ఎట్లున్నాయో ఏమో! మేం పోతాముతల్లీ! పిల్లోన్ని బతికించుకుంటారో లేక సంపుకుంటారో అంతా మీదయ' అని పిల్లోన్ని ఇచ్చేసిపోయిన వాళ్ళు మళ్ళీ తిరిగి చూడలేదంట.

ఇప్పుడు జరుగుతూ ఉన్నట్లు పెద్ద పండగ జరిగిందంట ఒకసారి. మా నాయనను కన్నవాళ్ళూ, పెంచినవాళ్ళూ ఇద్దరూ కలుసుకున్నారంట ఆ వరసలో. అప్పటికి మా నాయనకు పండ్రెండు ఏండ్లు! అంత ఎత్తు పెరిగిన తన కొడుకును పట్టుకుని –

'అప్పా! నేను కఠినాత్ముర్రాల్ని అప్పా! నిన్ను కన్నతల్లిని నాయనా? నిన్ను పెంచలేకపోయినాను తండ్రీ! సంవత్సరం పిల్లోనిగా ఉన్నప్పుడు ఇడిసిపెట్టి పోయి తిరిగి మళ్ళీ చూడకపోతిమి. పాపాత్ముర్రాల్ని నాయనా, ఏ జన్మలో ఏ తల్లీబిడ్డల్ని వేరుచేసి

ఉంటినో!' అని గోడుగోడుమని ఏడ్చిందంట మా నాయనమ్మ. అప్పుడు ఆ పంద్రెండేండ్ల పిల్లోన్ని పట్టుకుని తండ్రీ ఏడ్చేదే, అన్నలూ ఏడ్చేదే, అక్కలూ ఏడ్చేదే! అబ్బబ్బ! వాళ్ళ ఏడ్పులు చెప్పనలవిగానివంట పాపము'

'ఇప్పుడు ఊరి ఊరికి బస్సూ, ఊరికి రెండు మూడు అస్పత్రులూ ఉన్నాయి' అంటున్న చిన్నాయన.

'బండారోల్లూ, రాగేవాళ్లూ అందరికంటే మా బండివాల్ల గుంపు పెద్దదివాయ్' అని గర్వంగా మీసం దువ్వుతూ మురిసిపోతున్నాడు ఒక బంధువు.

రాత్రి తొమ్మిది గంటలు. మా ఇంటికి టి.వి. వచ్చిన తరువాత రాత్రి తొందరగా నిద్రపోయే అలవాటుపోయింది నాకు.

నిద్రరాక మెల్లిగా గుడికట్ట మీద చేరాను. కరెంటు దీపాలకు అలవాటు పడిన నా కళ్ళకు ఆ ఆరుబయల్లో నిండిన వెన్నెలకాంతి వింతగా కన్పిస్తోంది.

'మనకులమోల్ల ఓట్లు ఒక్కటికూడా పక్కకుపోకుండా చూడల్ల' అని హెచ్చరిస్తున్నాడు మండలాధ్యక్షునిగా పోటీ చేయబోతున్న ఒక కులస్తుడు. వీళ్ళది డబ్బు కులం! ఓట్ల కులం! పైకి మాత్రం తమ కులాభిమానాన్ని చాటుకుంటూనే ఉంటారు స్వప్రయోజనాలు సాధించుకోవడానికి.

'ఫలానా ఎం.ఎల్.ఎ. మనోడే. ఫలానా మాజీమంత్రి మనకులం వాడే' అని గర్వంగా చెప్పుకొస్తున్నాడు మా మామ. తన ఎదుట సల్లాడాలు తొడుక్కున్న నలుగురు అమాయకుల్ని పోగు చేసుకొని.

'హరిహరరాయలూ, బుక్కరాయలూ మనకులం వాళ్ళే. మహారాష్ట్ర నేలిన రాణీ అహల్యాబాయి ఎవరనుకున్నారు? మన కులమే! అంటూ చరిత్ర చీకట్లో మా పూర్వీకుల ఉనికి కోసం తడుములాడుకుంటూ పోతున్న గురువులయ్య.

రాజ్యాల్ని నిర్మించినవారి కంటే, రాజ్యాల్ని ఏలినవారికంటే - చెట్లూ పుట్లూ పట్టుకుని అడవిలో గొర్రెలు కాస్తూ, పిల్లనగోవి వాయిస్తూ ప్రకృతిలో ఒక భాగమై పోయి అతి సామాన్యమైన సంచారజీవనం గడిపిన నా పూర్వీకుల జ్ఞాపకాలే నన్ను ఎక్కువగా ఆహ్లాదపరుస్తున్నాయి ఎందుకో!

'మీ దగ్గర కురవోల్ల చరిత్రకు సంబంధించిన ఏవో తాళపత్ర గ్రంథాలు ఉన్నాయంట కదా! మీ ఊరికి వస్తాను . చూపిస్తారా ఒకసారి' అన్నాను ఇంటరెస్ట్‌గా.

'అయ్యయ్యో! ఆ గ్రంథాల్ని, మేం-గురువులయ్యలు తప్ప ఇంకెవరూ చూడకూడదు' అన్నాడు. గాయత్రిని శూద్రులకు ఉపదేశం చెయ్యకూడదు అనే బ్రాహ్మణాధిక్యతకు ఏ విధంగా తీసికట్టు అవుతుంది మా గురువులయ్య ఆధిక్యత?

తెల్లారింది.

ఏ తండ్రీ ముందుకు రాలేదు, తన కొడుకును పూజారిగా వప్పగించడానికి.

మధ్యాహ్నం దాటింది.

తన పూజారిని తనే వెదుక్కుంటాడులే దేవుడు అని నిర్ణయం చేశారు పెద్దమనుషులు.

మునలి పూజారప్ప ఏ పిల్లోన్ని ముట్టుకుంటే ఆ పిల్లోన్ని పూజారప్పగా విడిచి

పెట్టక తప్పదు ఆ తల్లిదండ్రులకి. అందుకని తమ తమ పిల్లోల్లని జాగ్రత్తగా ఇళ్ళల్లో దాచి పెట్టుకుంటున్నారు అంతా. మనుషులు మోస్తున్నారు. దేవుళ్ళు ఊరేగుతున్నాయి.

మనుషులు కదిలారు.

కిరిదండి కదిలింది.

మనుషులు ఊగుతున్నారు.

దేవుడు ఊగిపోతున్నాడు.

ఇంకా మిగిలి ఉన్న పాత సమాజపు అవశేషాల్లాగా –

దిక్కు దిక్కుమని మిటుకుంటూ, యాచిస్తూ, గుప్పుమనే సారాయి కంపుతో ఎవరో ఒకర్ని పొగుడుతూ పాడే ఆసాదోల్ల పదాలు!

దేవున్ని వరమడిగే వాళ్ళ పక్కన బుర్రు బుర్రుమని బూర్లు కొట్టే బూరోల్లు. భీకరమైన ముఖాల్తో జంతునృత్యాలు చేస్తూ, గిన్నెలో పోసిన పాలని పోటీలు పడి తాగుతున్న గొరవయ్యలు!

ఆగి ఆగి వీధుల్లోకి పరుగెత్తుతున్నాడు దేవుడు.

పరుగెత్తి పరుగెత్తి ఒక కులస్తుని ఇంటి ముందు ఆగాడు.

ఆ ఇంటి యజమాని పరుగెత్తుకొచ్చాడు బైటికి.

'మమ్మల్ని విడిచిపెట్టు స్వామీ! ఏదో కూలీనాలీ చేసుకుని పొట్టపోసుకునే వాళ్ళం. మా ఇంటికి పూజారితనం అచ్చిరాదు దేవరా' అని తలకాయమీదికి చేతులెత్తి దండం పెట్టేశాడు.

అక్కడి నుంచీ మళ్ళీ ముందుకూ వెనక్కూ పరుగెత్తి మరో ఇంటి ముందు ఆగాడు దేవుడు.

ఆ గుంపులోనే ఉన్నాడు ఇంటి యజమాని. కిరిదండికి ఎదుటపడి –

'మా తాత పూజారిగా ఉండె కదా నీకు అన్ని ఏండ్లు! ఏం చేసినావు నువ్వోమాకు? మా జీవాల్ని అభివృద్ధి చేస్తివా? మా పాడిపంటని అభివృద్ధి చేస్తివా? ఏ ముఖం పెట్టుకుని వచ్చినావు మా ఇంటికి మళ్ళీ!' అంటూ విదిలించి పారేశాడు.

మరో రెండు మూడు ఇండ్ల దగ్గర ఆగాడు దేవుడు. కానీ ఫలితం కన్పించలేదు.

కోపం వచ్చినట్టు కాసేపు చిందులేసి, ఎటుపడితే అటు దిక్కూ దివాణం లేకుండా పరుగెత్తి, తన చుట్టూ తనే గుండ్రంగా తిరిగి తిరిగి చివరకు నిస్సహాయంగా వెళ్ళిపోయాడు మళ్ళీ తన గుడిలోకి.

కలికాలం! కలికాలం! దేవుని మాటకు కూడా విలువ ఇవ్వకపోయిరి కదా ఈ మనుషులు! అని ముక్కు మీద వేలు వేసుకుని ఆశ్చర్యపోయింది మా అవ్వ.

ఆ రాత్రి పెద్దమనుషులందర్నీ కలిపి ఒక సమావేశం ఏర్పాటు చేశాడు గురువులయ్య.

'చూడండప్పా! నేను ఒక మాట చెప్తాను. అందరూ వినండి ఈ గుడికట్ట కింద ఇన్నూటనలభై రెండు జతలు ఉన్నారు, దంపతులు! ఒక్కొక్క జత నుంచీ నూటాపదహార్లు వసూలు చేస్తే దగ్గర దగ్గర ఇరవై అయిదువేల వరకూ అవుతుంది. ఆ దుడ్లు పెట్టి అయిదు ఎకరాల చేనుకొని పూజారప్ప పేరిట పత్రం రాసిస్తాము. అప్పుడు వాళ్ళ పోషణకు ఏ ఢోకా

ఉండదు. ఎవరో ఒకరు ముందుకు వస్తారు. పిల్లోన్ని ఇయ్యడానికి' అని ముగించాడు.

పెద్ద మనుషులంతా తలలూపారు.

నేను వేయినూట్నాట పదహార్లు ఇస్తాను అని అప్పుడే ధారాళంగా ప్రకటించేశాడు మండలాధ్యక్ష పదవికి పోటీ చేయబోతున్న కులస్తుడు.

పూజారప్ప పెరిగి పెద్ద అయినంక అతని పెళ్ళి ఖర్చుకూడా మీరే పెట్టుకుంటే బాగుంటుంది' అని మరో సలహా ఇచ్చాడు గురువులయ్య.

దానిక్కూడా సమ్మతించారు.

అక్కడి నుంచీ మొదలైంది పూజారప్ప పదవి కోసం పోటీ!

మా పిల్లోన్ని ఇస్తామంటే మా పిల్లోన్ని ఇస్తామని పరుగెత్తుకొస్తున్నారు కులస్తులు.

ఇరవై అయిదువేలు చిన్న మొత్తమా?

అయిదు ఎకరాల చేను పిల్లోని పరమైతే ఎట్లో బతుక్కోవచ్చు కదా అని వాళ్ళకు ఆశ!

ఎన్ని ఏండ్లు కష్టం చేస్తే ఆ మాత్రం భూమిని సంపాదించుకోగలరు? తమకు పుట్టిన నలుగురు అయిదుగురు పిల్లల్లో ఒక్కనికైనా జీవనాధారం దొరికినట్లే కదా, ఆ పూజారి పదవి వస్తే.... అని వాళ్ళ ఆలోచన.

రావడానికైతే తొమ్మిది పదిమంది దాకా వచ్చారు పోటీకి. చివరికి రంగంలో ముగ్గురు మిగిలారు.

బతిమాలుతున్నారు.

పైరవీలు సాగిస్తున్నారు.

పూజారి పదవి మీద తమ వంశానికి హక్కు ఉన్నట్టు డిమాండ్ కూడా చేస్తున్నారు.

పది లక్షలకు ఆస్తిపరుడైన పుల్లన్న గౌడు చెప్పిన మాట విని జెల్లిపల్లి మల్లయ్య కొడుకునే కొత్త పూజారిగా ఒప్పుకున్నారు అంతా.

ఆ చిన్నపిల్లోనికి ఆరేండ్లు. అందరూ ఆ పిల్లోనివైపే వింతగా చూసి అడుగో! ఆ పిల్లోడే చూడు కొత్తపూజారి అని గుసగుసగా మాట్లాడుకుంటోంటే, అదేమీ పట్టించుకోకుండా సపోటకాయ తినడంలో నిమగ్నమైపోయి ఉన్నాడు ఆ కొత్త పూజారప్ప.

రాత్రి ఊరేగింపు!

కందుకూరి ఉజ్జినప్పతో సహా అతిథులుగా పిలిపించుకున్న ఇతర దేవుళ్ళు కూడా ఊరేగుతున్నారు.

దేవుళ్ళను ఎత్తుకున్నారు.

వీధి సందుల్లో జనసందోహాలు.

మిద్దెలపైన క్రిక్కిరిసిన ఆడవాళ్ళ నవ్వు ముఖాలు.

ప్రతి దేవుని దగ్గరా ఎర్రగా వెలిగే ఇలాయికట్లు.

గాలికి రెపరెపలాడే ఇలాయికట్ల వెలుగుల్లో ఎర్రగా మెరుస్తున్న జనం ముఖాలు. కిరిడందీలో ఎర్రగా వన్నెపెట్టిన బొమ్మలు ఇలాయికట్ల వెలుగుల్లో మరింత రక్తవర్ణంతో మెరుస్తున్నాయి గంభీరంగా.

కిరిడందీ కదిలినప్పుడల్లా జిగ్గుజిగ్గుమని మెరిసే వెండి గొడుగులు. ఆ వైభవాన్నంతా చూడటానికి ఒళ్లంతా కళ్లు చేసుకున్న నెమలి ఈకల చామరాలు.

కిరిడందీని మోస్తూ ముందు ఇద్దరూ, వెనుకల ఇద్దరూ!

అప్పుడప్పుడు భుజాల మీంచి దేవుని బరువు దించుకుని సేద తీరడానికి వాళ్ల చేతుల్లో హంసపాదులు.

డొల్లులు కొడుతున్నారు.

పిల్లనగోవి వాయిస్తున్నారు.

కిరిడందీ ముందు భాగంలో ముసలి పూజారప్ప.

పూజారప్ప కాళ్ల మింద నీళ్లబిందెలు గుమ్మరించి నుదుటికి బండారు దిద్దించుకుని పోతున్న ఆడవాళ్ళు.

కొందరు ఆడవాళ్ళు నెత్తిమీద నీళ్లబిందెలు గుమ్మరించుకుని వారు పడుతున్నారు. ఏవో కోర్కెలు కోరుకుంటూ.

బిందెల బిందెల నీళ్లతో రొచ్చురొచ్చుగా కలిసిపోయిన నేల.

వాసూనే బందే వనమయ్య చెందూ.... దేవుని వైపు చేతులు ఎగరేసి ఉద్వేగంతో పాడే పాటలు!

దుఃఖమో, సంతోషమో, రెండూ కలిసిన భక్తిభావమో ముప్పిరిగొని బొంగురు పోతున్న గొంతుకలు!

కిరసనాయిలు పోస్తే భగ్గుమంటూ రెచ్చిపోయి మండే ఇలాయికట్ల జోరు వెలుగుల్లో తళుక్కుమంటున్న వాళ్ల ఆర్ద్రనేత్రాలు!

గుంపు తొక్కిసలాటకు కొంచెం ఎడంగా నిలబడిన మా అవ్వ.

మా తాత ఒక్కొక్కపదం పాడతాంటే, బ్యాటరీలైటు ముఖం మీద పడిన కుందేలు మాదిరి దేవుడు అట్లే నిలిసి పోతాందే అని చెబుతూ మురిసిపోతోంది.

మనుషులు కదుల్తున్నారు.

దేవుళ్లు కదుల్తున్నాయి.

మనుషులు పరుగెత్తుతున్నారు.

దేవుళ్లు పరుగెత్తుతున్నాయి.

ఒకరికొకరు ఎదురైై బేటీ తగులుతున్న దేవుళ్ళు!

ఇటికల పల్లయ్య అలిగి పోతున్నాడు, తన కంటే తన అన్నలకే పూలు ఎక్కువ వేశారని.

కురుగుండెప్ప పరుగెత్తుతుంటే ఎవరో ఇంట్లో టెంకాయ దాచి పెట్టినారు. దాన్ని కనుక్కునే వరకూ ఇంక స్వామి నిలవడు అని మాట్లాడుకుంటున్న గుంపు!

అంతర గంగప్ప ఆత్రుత పడుతున్నాడు.

తొక్కులాడుతున్నాడు.

జనం మధ్యలోకి దూరి గుంపుల్ని చెల్లాపల్లా చేస్తున్నాడు.

ఎవర్నో ఎదుర్కొంటున్నాడు.

జరగండి. జరగండి. పక్కకు జరగండి. అంతరంగప్ప ఆత్రపడతాండాడు తమ్ముని చూడల్లని. ఇటికల పల్లయ్యను చూడక నాలుగు దసరాలు గడిచిపోయె కదా! జనం పక్కకు పరుగెత్తి దారినిస్తున్నారు.

తమ్ముడు ఇటికల పల్లయ్య ఎదురు పడగానే మంత్రించినట్లు ఆగిపోయాడు. అంతర గంగప్ప. ఇద్దరు దేవుళ్లూ ఒకర్నొకరు చూసుకుంటున్నారు నిశ్శబ్దంగా. వాళ్ల ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తున్న జనానికి, ఆ దేవుళ్లపై మెరిసే వెండిసొత్తుల్లో హర్షాతిశయపు కాంతిరేఖలు కన్పిస్తున్నాయి.

కొంచెంసేపటికి తమ దేవుళ్ల మధ్య నాలుగు సంవత్సరాల ఎడబాటు గుర్తొచ్చి సంబాళించుకోలేక ఏడుస్తున్న మనుషులు!

మనుషులు ఏడుస్తున్నారు.

దేవుళ్లు ఏడుస్తున్నాయి.

మనుషులు అలిగి పోతున్నారు.

దేవుళ్లు అలిగిపోతున్నాయి.

అలిగిపోయే దేవున్ని వెనకాల నుంచీ చూస్తే సాయంత్రం పూట రెండు కొండల మధ్య సగానికి కూరుకుపోయి అరుణారుణంగా కన్పించే అర్ధభానుబింబం మాదిరి ఎర్రని కిరిడంది.

మనుషులు ఊగుతున్నారు.

దేవుళ్లు ఊగుతున్నాయి.

భాషకు అందని ఒక ఆవేశం మనుషుల్ని పూనకమై ఆవహించి తమ సంకుచిత జీవితం లోగాఢంగా పొందడానికి వీల్లేని వివిధ భావోద్వేగపు రుచుల్ని వాళ్లతో అనుభవింప జేస్తోంది తృప్తి అంచులదాకా!

ఆ రాత్రి జల్దీ జరిపి పిల్లోనికి స్నానాలూ అవీ చేయించి పూజారిగా తయారుచేశారు.

తెల్లారింది.

దిన్నె మింద బయల్లో కంబళి పరచి దింపినారు దేవున్ని.

కిరిదండి ఎదురుగా నిలబడి, గురువులయ్య జరగాల్సిన కార్యక్రమాన్ని పర్య వేక్షిస్తున్నాడు.

బియ్యం ముగ్గు వరుసల్తో ఒక పెద్ద చతురస్ర పటం గీయించాడు.

ఆ చదరానికి నాలుగు మూలల్లోనూ బియ్యం కుప్పలు పోయించాడు. ఆ బియ్యం కుప్పల మీద కొత్త కుండలు పెంపొందించాడు.

కొత్త కుండల్ని కలుపుతూ వాటి కంఠాలకు బిగించిన దారాల మధ్య ఒక చతురస్రం ఏర్పడింది.

ఆ చతురస్రం పటం మధ్య మళ్లీ ఒక బియ్యం కుప్ప పోయించాడు.

ఆ కుప్ప మీద మళ్లీ ఒక కొత్త కుండ పొందించాడు.

ఆ కొత్తకుండ కంఠం మీద టెంకాయ పెట్టించాడు.

అట్లాగీసిన పటానికీ, అంత తతంగానికీ అర్థం ఏమిటో బహుశా మా గురువయ్యకు

వాళ్ల నాయన ఎప్పుడో చచ్చిపోయాడు. వేరే కులం ఆమెను పెళ్లి చేసుకునీ, వీళ్లను కనీ!

ఆనాడు తండ్రి చేసిన మహాపరాధానికి ఈనాడు కొడుకులకు ఈ శిక్షా, ఈ అవమానం!

కొత్తబట్టలు కట్టుకుంటున్న పండుగ ఉత్సాహం వాళ్లలో ఏ కోశానా లేదు పాపం!

వాళ్ల ముఖాల్లో సిగ్గు.

వాళ్ల ముఖాల్లో దీనత్వం.

తమను కులంలో చిన్నచూపు చూసిన ఫరవాలేదు. అంతో ఇంతో చోటిచ్చి మళ్లీ తమను బంధువుల్లో కలుపుకుంటే చాలు అనుకునే బీద అస్తిత్వాలు వీళ్లవి.

మా అవ్వ ఏవగింపుగా చూస్తోంది వాళ్లవైపు.

'అరచట్టం నా కొడుకులు, ధూ! ఎందుకు బతుకుతారో, కులాన్ని ఇట్ల సంకరం చేసేనాయాళ్లు' అంటూ చీదరించుకుంటూ మాట్లాడింది.

మేము సాయంత్రం ఇంటికి బయల్దేరుతుంటే పూర్వకాలంలో ఎనిమిది దినాలు జరిగేదంట ఈ పండగ! ఇప్పుడు చూడు, ఇట్ల పటాలెక్కినారో లేదో, అప్పుడే ఏదో గంటు పోయినట్లు ఎల్లారతాండారు టౌనుకి అని,

సరేసరి, మీరంతా పొండి. నేను రాత్రి దేవుని మెరవన చూసి పొద్దున్నే వస్తాను అంది.

నేను మా అవ్వకు ఆసరాగా అక్కడే ఉండిపోవలసి వచ్చింది ఆరోజు కూడా!

మా చిన్నాయన కొడుకుల్ని అసహ్యంగా చూసి వీలు దొరికినప్పుడల్లా - అరచట్టం నా కొడుకులూ, సంకర జాతి నా కొడుకులూ... అంటూ ఆమె వాళ్లను తిడుతున్న తిట్లే నా చెవుల్లో గింగురుమంటున్నాయి. మా చిన్నాయన కులాంతర వివాహం చేసుకున్నట్లు నేను మతాంతర వివాహం చేసుకుంటే?? ఎంత క్షోభిస్తుందో పాపం మా అవ్వ మనసు! కానీ నేనేం చేయగలను? నాకు నా క్లాసుమేటు మార్గరెట్ మీద ఉన్న ప్రేమ అట్లాంటిది.

ఎండిన ఏట్లోని నీటి జాడలు ఎప్పుడు ఏ కొత్త ప్రవాహ ధృతికి కొట్టుకుపోతాయో ఎవరు చెప్పగలరు?

మార్గరెట్‌ని పెళ్లి చేసుకుని ఇంటికి తీసుకువస్తే నన్ను కూడా సంకరజాతి నా కొడకా అని తిడుతుందా? లేక తన సొంత మనుమడైన నాకు ఏదైనా మినహాయింపు ప్రసాదిస్తుందా?

బొట్లూ దమ్మిడీలూ, అణాలూ, బేడలూ పట్టుకుని ఊగుసాడిన మా అవ్వకు వాటి స్థానంలో కొత్త కరెన్సీ వచ్చినప్పుడు కొంచెం అయోమయంగానే ఉండి ఉంటుంది.

కానీ, కాలానుగుణంగా సంభవించే ప్రతి మార్పుకూ సర్దుకుని జీవించగలిగిన గుణం, మనిషిలో ఒక జీవనదిలా ప్రవహిస్తూ కొత్తకొత్త నాగరికపు వ్యవస్థల్ని సృజిస్తూనే ఉంటుందని నాకు చాలా గాఢమైన నమ్మకం.

జాడలు నడవ్వు. పురోగమించేది మనిషే అని కూడా నా విశ్వాసం.

ఉదయం వారపత్రిక, 25-1-91

# ఎన్నిక

## పి. చంద్రశేఖర్ అజాద్

అతను నా దగ్గరకు చాలా ఆవేశంగా వచ్చాడు.

నాకు ఆ యువకుణ్ణి చూస్తుంటే నాకు తెలియకుండానే నా పెదవుల మీద చిరునవ్వూ, ఏవేవో జ్ఞాపకాలూ కూడా మెరిశాయి.

అతనున్న స్థితిలో మాట్లాడటం వలన పెద్దగా ప్రయోజనం ఉండదు. అందుకే అతన్ని కూర్చోబెట్టి అతని ముందు నాలుగైదు పుస్తకాలు పడేసి 'చూస్తూండండి' అనేసి వచ్చాను.

కొద్ది సంవత్సరాల క్రిందట నాలోనూ ఇలాంటి ఆవేశమే ఉండేది.

ఇప్పుడు నాలో ఏ ఆవేశాలూ లేవని చెప్పటంలేదు నేను. నాలోని ఆవేశాలకు తోడు ఇంకేదో కూడా ఉంది.

కొద్దిసేపటి తర్వాత నేను టీకప్పుతో అతని దగ్గరకు వెళ్ళాను. ముందు కొంచెం మొహమాటపడ్డాడు. ఆ తర్వాత నిశ్శబ్దంగా టీ పూర్తి చేశాం.

"ఇప్పుడు చెప్పండి" అన్నాను.

తిరిగి అతని ముఖంలో రంగులు మారిపోయాయి. ఎలానో గొంతు పెగుల్చుకున్నాక అన్నాడు.

"ఈ దేశం రోజురోజుకీ వినాశనానికి దగ్గరగా వెళ్తోంది"

నేను నవ్వుతూ తలూపాను.

"ఇలాంటి పరిస్థితుల్లో నేనేమైనా చేయాలనుకుంటున్నాను" అన్నాడతను.

"మంచిది. ఏం చేయాలని నిర్ణయించుకున్నారు?" అన్నాను.

అతను ఓసారి తలవంచుకున్నాడు. కొద్దిసేపటి తర్వాత నా కళ్ళలోకి చూస్తూ చెప్పాడు.

"నేను కవిత్వం రాయాలనుకుంటున్నాను"

అతను చాలా దృఢంగా చెప్పాడా మాటల్ని.

"ఇంతకుముందు మీరేమైనా కవిత్వం రాశారా?" అన్నాను.

"లేదు"

"పోనీ మీరు ఎవరైనా రాసిన కవిత్వం చదివారా?"

"శ్రీ శ్రీని చదివాను"

"ఇంకా"

"ఇంక ఎవరి కవిత్వం చదవలేదు"

"అసలు కవిత్వం రాయాలనే ఆలోచన ఎందుకు వచ్చింది?" అని ప్రశ్నించాను.

అతను దీర్ఘంగానే సమాధానం చెప్పాడు.

నాకు అర్థమైందొక్కటే. ఈ యువకుడిలో ఆవేశం ఉంది. ఈనాటి పరిస్థితుల్ని చూసి ఒక్కసారిగా ఉబికిన ఆగ్రహం అది. ఆ ఊపులోనే తను కవిత్వం రాయాలనుకున్నాడు. అంతేగానీ అందుకు తగ్గ పునాది లేదు. పునాది లేనంత మాత్రాన రాయకూడదనేం లేదు. నాకు తెలిసి చాలామంది ఏదోరకమైన ఆవేశంతో కలం పట్టుకున్నవారే. ఆ తర్వాతే వారికంటూ ఓ అవగాహన ఏర్పరచుకోవటం.

నేనతనితో చెప్పాను.

"కవిగా ఈ సమాజానికి సేవ చేయాలనుకున్నప్పుడు ముందు ఈనాటి కవిత్వం గురించి తెలుసుకుంటే బాగుంటుంది. అదలా ఉంచినా ముందు ఈ రంగంలోకి అడుగు పెట్టబోయే ముందు మీ పాఠకుణ్ణి మీరు ఎన్నుకోవాలి. మరో ముక్కలో మీరు ఎవరికోసం రాయాలో నిర్ణయించుకోవాలి. అప్పుడే ఎలా రాయాలో కూడా అర్థమౌతుంది. మీరు కవిత్వం రాస్తానని అంటున్నారు. అయితే అది నిర్ణయించేది మీరు ఎన్నుకునే పాఠకుడు" అన్నాను.

"నా పాఠకుణ్ణి నేను నిర్ణయించుకున్నాక మిమ్మల్ని కలుస్తాను" అంటూ అతను వెళ్ళిపోయాడు.

నేను చిరునవ్వుతో వీడ్కోలు చెప్పాను.

ఒకానొక ఆవేశంతో చాలామంది బయలుదేరతారు. అయితే గాఢాభినివేశం లేకపోతే ఎక్కడ ప్రారంభమవుతారో అక్కడే ఆగిపోతారు. అతను ఎలాంటి కవిత్వం రాయగలడు? అతని కవిత్వాన్ని ఎవరు ఆదరిస్తారు? లాంటి ప్రశ్నలు ముందున్నాయి. అవన్నీ తర్వాత. తను రాయటం ప్రారంభించాక అవన్నీ ఎటూ అనుభవంలోకి వస్తాయి. పత్రికారంగంలోని పరిస్థితులు చూసి, నిరాదరణ చూసి అతను కవిత్వం రాయటమే మానేస్తాడో..... లేదా మరో మార్గంలోకి పయనిస్తాడో ఇప్పుడు చెప్పటం సరయింది కాదు. ముందతను తన నిర్ణయానికే కట్టుబడి ఉంటాడా అనేది ప్రశ్న.

నాలుగైదు రోజులు అతని కోసం ఎదురు చూశాను.

అతను రాలేదు.

ఎందుకు రాలేదా అనిపించింది? ఆ తర్వాత క్రమక్రమంగా అతని గురించి నేను మరిచిపోతున్న దశలో వచ్చాడు. ఇది వరకంతటి ఆవేశం అతని ముఖంలో కనిపించడం

లేదు. అయితే అతనిలో అది సొంతం ఇంకిపోనూ లేదు.

"మీ పాఠకుణ్ణి నిర్ణయించుకున్నారా?" అన్నాను.

"నిర్ణయించుకున్నాను. నాకిప్పుడు కవిత్వం రాయాలనిపించటం లేదు" అన్నాడతను.

"ఏం ఎందుకని?" అన్నాను.

"నేను ఎవరికోసం రాయాలనుకుంటున్నానో వారు కవిత్వం చదవలేరు"

"మరేమిటి చెయ్యటం?"

"వారి దగ్గరకు చేరాలంటే ఒకటే మార్గం. అది పాట"

"పోనీ మీరు వెళ్ళి పాడి చూడండి"

"నాకు పాటలు పాడటం రాదు" అన్నాడతను.

"పోనీ పాటలు రాయండి"

"నాకు పాటలు రాయటం కూడా రాదనుకుంటాను" అన్నాడతను తల దించుకుంటూ.

'అదేమిటి? కవిత్వం రాయదలుచుకున్నప్పుడు పాటలు రాయటం అంత కష్టం కాదేమో ప్రయత్నం చేయండి" అన్నాను.

"అది కాదండి. ఇప్పుడు నేను నా నిర్ణయం మార్చుకున్నాను" అన్నాడతను.

"అంటే....." అన్నాను.

"నేను కవిత్వం రాయాలనుకోవటంలేదు. కవిత్వానికి కొద్దిమంది పాఠకులే ఉన్నారు. అందులో నేనెన్నుకున్న పాఠకులు అసలు లేరు. రెండోది నేను రాసిన కవిత్వం తీసుకువెళ్ళి చదివి వినిపించడం. అది కూడా ఉపయోగం లేదు. వారిని ఆకట్టుకోవాలంటే నాకు కనిపించిన ఏకైక మార్గం పాట. నాకు నా సామర్థ్యం గురించి తెలుసు. నేను ఎంత ప్రయత్నం చేసినా పాట మాత్రం రాయలేను" అన్నాడతను.

"మరైతే ఏం చేయాలని? అసలు ఈ రంగాన్నే వదలుకుంటున్నారా?"

"లేదు. లేదు. ఈ రంగంలో ఉంది కవిత్వం ఒకటే కాదుగా. ఇంకా కథా, నవలా, నాటకంలాంటి ప్రక్రియలున్నాయి కదా. నేను వీటిలో ఏదో ఒకటి ఎన్నుకోవాలను కుంటున్నాను" అన్నాడు.

"మంచిది" అన్నాను చిరునవ్వుతో.

"ఈ విషయంలో మీ సూచన నాకు కావాలి" అన్నాడు.

"అడగండి"

"తిరిగి ఇక్కడ కూడా పాఠకుణ్ణి ఎన్నుకునే సమస్య ఉంటుంది కదా"

"తప్పకుండా ఉంటుంది"

"నన్ను ఇబ్బందికి గురి చేస్తున్నది అదే" అన్నాడు.

"అదేమిటో వివరంగా చెప్పండి" అన్నాడతను.

"నా పాఠకుణ్ణి ఎన్నిక చేసుకోవటమే నాకు చాలా కష్టంగా ఉంది. నేను ఎవరికోసం రాయాలనుకుంటున్నానో వారికి చదువు రాదు. మరి అలాంటప్పుడు నేను రాయటం

ఆపి ఇంకో రంగాన్ని ఎన్నుకోవాలి. నా అభిరుచికి సరిపోయేది ఈ రంగం మాత్రమే. ఈ రోజున కథలూ, నవలలూ చదువుతున్నది మధ్యతరగతి వారు. అందుకే నేను ఎలాంటి నిర్ణయం తీసుకోలేకపోతున్నాను" అన్నాడు.

"పోనీ అలాంటి మధ్యతరగతికి చెందిన పాఠకులకోసమే రాయవచ్చుగా" అన్నాను.

"రాయవచ్చు. కానీ ఈ దేశానికి కావల్సింది విప్లవం" అన్నాడు.

"అయితే...." అన్నాను.

"విప్లవంలో పాల్గొనడానికి మధ్యతరగతివారు ఇష్టపడరు. విప్లవానికి కార్మికులూ, పీడిత వర్గాలూ కావాలి. మరి వారేమీ నేను రాసింది చదివే పరిస్థితిలో లేరు" అన్నాడు నిరుత్సాహంగా.

"చాలా ఇబ్బందికరమైన పరిస్థితే" అని నేనూ అంగీకరించాను.

"అందుకే మీ సలహా అడుగుతున్నాను. నేను నా పాఠకుణ్ణి ఎన్నుకునేందుకు మీరు సహకరించాలి" అన్నాడతను.

"మీ పాఠకుణ్ణి దాదాపు ఎన్నుకున్నారు మీరు. అయితే మీరు నిర్ణయం తీసుకోవటంలో ఇబ్బంది పడటం వెనుక ఇతర అంశాలున్నాయి" అన్నాను.

"అవేమిటా అని నేను అర్థం చేసుకోవాలి" అన్నాడతను.

"మీరు అనేక పరిమితులతో ఈ రంగంలోకి అడుగు పెడుతున్నారు. మీకు రాయాలనే అభిరుచి ఉంది. అయితే అందుకు రంగాన్ని మీరు సిద్ధం చేసుకోలేదు. మీరు ఏ రంగంలో కృషి చేయాలనుకుంటున్నారో ఆ రంగానికి చెందిన ప్రాథమిక సమాచారం కూడా సేకరించినట్లు కనిపించడం లేదు. అంతకంటే ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే మీకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. రచయితలకు ఖచ్చితమైన అభిప్రాయాలుండటం చాలా అవసరం. అవి ఎందుకుండాలంటే రచయితని ముందుకు నడిపించటానికి. మీరు ముందుకు నడవడానికి తగ్గ ఖచ్చితమైన అభిప్రాయలే కలిగున్నారా అనేది నాకు సందేహంగా ఉంది" అన్నాను.

"అంటే" అన్నాడతను అయోమయంగా చూస్తూ.

"ఈ దేశానికి విప్లవం అవసరం అనే విషయంలో నాకెలాంటి అభిప్రాయ భేదం లేదు. అలాగే విప్లవానికి కార్మికులూ, ఈ పీడితులూ అవసరం అనే విషయంలో కూడా వారికి అవసరమైన పద్ధతుల్లో వెళ్ళలేనని మీరు చెబుతున్నారు. ఇంక మిగిలింది మధ్యతరగతి వర్గమే. వారివల్ల ప్రయోజనం లేదు. మరి మీరు ఎవరికోసం రాస్తారు?"

అతను సమాధానం చెప్పలేకపోయాడు.

'నాకు కొంచెం గందరగోళంగానే ఉంది" అన్నాడు.

"ఉంటుంది. తప్పకుండా ఉంటుంది. మీరు ఓ కథో, కవిత్వమో, నవలో రాసుకుని వచ్చి ఉంటే ఆ పరిస్థితి వేరుగా ఉండేది. అదేం లేదు. అయితే మీకు రచనను ఓ మార్గంగా ఎన్నుకోవాలనే కోర్కె మాత్రం ఉంది. అయినా కూడా మీరు పరిశీలన చేయలేదు. ఈరోజు మనదేశంలో ఓ దౌర్భాగ్యం ఉంది.అది ఏమిటో తెలుసా?" అన్నాను.

"చెప్పండి" అన్నాడు.

"ఈ 'ఎన్నికల్లో' పొరబడటం, రాజకీయరంగంలో పనిచేయాల్సినవారు రచనా వ్యాసంగం చేపట్టడం, అలానే రచనా వ్యాసంగం చేపట్టవలసినవారు రాజకీయరంగంలో ఉండటం"

"అందరూ అలానే ఉన్నారంటారా"అన్నాడు.

"అందరూ అలా ఎందుకుంటారు? కొంతమంది ఉంటారు" అన్నాను.

"అయితే ఇప్పుడు నన్నేం చేయమంటారు?" అన్నాడు.

"ముందు మీరు ఏ రంగంలో కృషి చేయాలనుకుంటున్నారో ఆ రంగం గురించి అవగాహన పెంచుకోండి. రచనా రంగంలో చాలామంది ప్రముఖులున్నారు. వారందరూ ఎవరిని తమ పాఠకులుగా ఎన్నుకున్నారో, ఎవరికోసం ఎలా రాశారో ముందు అవగాహన చేసుకోండి" అన్నాను.

"ఈ క్షణం నుండి ఆ కార్యక్రమంలోనే ఉంటాను" అంటూ తిరిగి వెళ్ళిపోయాడు.

మొత్తం మీద ఈ యువకుడు నాకు ప్రత్యేకంగా కనిపించాడు.

రెండు నెలలు గడిచిపోయాయి.

ఈసారి తను నా దగ్గరికి వచ్చేటప్పుడు గడ్డం, మీసాలు బాగా పెరిగిపోయాయి. కళ్ళకింద నల్లటి చారలు సైతం కనిపించాయి. తను ఈ రెండు నెలలుగా ఎంత గాఢంగా అధ్యయనం చేశాడో అతని ముఖం చూస్తేనే అర్థమౌతూంది.

"బాగా చదివినట్లున్నారు" అన్నాను.

అతని పెదవుల మీద చిరునవ్వు.

"బాగానే చదివాను. అయితే ఎంత చదివినా చాలా స్వల్పభాగం మాత్రమే చదవగలిగాను. అది నిరంతరం కొనసాగించాల్సిందని నాకు అర్థమైంది" అన్నాడతను.

ఇంకా అతను ఈ విధంగా అన్నాడు.

"మన మహా రచయితలందరూ వివిధ రకాల వ్యక్తుల జీవితాన్ని సృష్టించారు. అందులో మధ్యతరగతి వర్గమే ప్రధానంగా ఉంది. శ్రామిక వర్గం గురించీ, పీడితుల గురించి రాసినవి స్వల్పమనే నాకు అనిపించాయి. అన్నిటికంటే నాకు ఆశ్చర్యం కలిగించిన అంశం ఏమిటంటే ఈ రచనలన్నింటికీ పాఠకులు మధ్యతరగతివారే"

"ఇప్పుడు మీ సమస్యల్లో ఓదానికి పరిష్కారం లభించింది. రచయితలుగానీ, రాజకీయ పార్టీల నాయకత్వంగానీ ఎక్కువ మధ్యతరగతి నుండే వస్తున్నారు. అందువల్లనే ఎక్కువ రచనలు మధ్యతరగతి ప్రజానీకాన్ని దృష్టిలో ఉంచుకుని వస్తుంటాయి. సామాజిక మార్పుకు ఈ వర్గంవారు ఏమేరకు దోహదం చేస్తారనే విషయం అలా ఉంచితే మధ్యతరగతిని కదిలించని, ఆలోచింపచేయని రచనలు విప్లవానికి కూడా ఎలాంటి మేలూ కలిగించలేవు. ఎందుకంటే భావజాలం ఆ తరగతి నుండే కింది తరగతులకు అందుతుంది కాబట్టి" అన్నాను.

"మీతో నేను ఏకీభవిస్తున్నాను. మధ్యతరగతివారిని సామాజిక మార్పుకు అనుకూలంగా

మలుచుకోలేకపోయినా కనీసం వ్యతిరేకులుగా చేయకూడదు. వారి మద్దతు మార్పుకు చాలా అవసరం. అయితే ఇంక నేను రాయటం ఆరంభించవచ్చునా" అన్నాడతను.

"అది నిర్ణయించుకోవాల్సింది మీరు. మొదట మీకున్న సమస్యలు ఇప్పుడు లేవు. ఇప్పుడు మీకున్న సమస్యలన్నీ కూడా తీరలేదు. మీ పాఠకుణ్ణి మీరు ఎన్నుకోగలిగారు. అయితే ఎందుకోసం రాయాలనే సమస్య ఉంది. అది తీరిపోయిందా?" అన్నాను.

"అది ప్రారంభంలోనే తీరిపోయింది. నేను రాయాలనుకుంటున్నది విప్లవంకోసం" అన్నాడా యువకుడు దృఢంగా!

"మంచిదే కాని అది సుదీర్ఘం కదా"

"అంటే"

"విప్లవం ఒకానొక దేశంలో విజయవంతం కావాలంటే అనేక సంఘటనలు జరగాలి. అనేకమంది కలిసి రావాలి.అన్నీ పరిపక్వమైనప్పుడు బ్రద్దలయ్యే లావా గురించి మీరు ఇప్పుడు మాట్లాడుతున్నారు"

"మీరేమంటున్నారో నాకు అర్థం కావటంలేదు. విప్లవాన్ని ఆహ్వానిస్తూ రాయటం తప్పంటారా?"

"అనను. విప్లవాన్ని ఆహ్వానించాల్సింది మనం మాత్రమే కాదు, ప్రజలు"

"అందుకేగా అలా రాయాలనుకుంటున్నది" అన్నాడతను.

"అందుకే నేను చెప్పేది సరిగ్గా అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యండి. మీరు చెబుతున్న విప్లవం అనేది వెంటనే ఊడిపడేది కాదు. దానికి అడ్డంగా అనేకం ఉన్నాయి. కాబట్టి రచయితగా మీరు అవి ఏమిటనేది పరిశీలించాలి. మీరు తెలుసుకున్న విషయాలు ప్రజలకు చెప్పగలగాలి. అసలు ఈ దేశంలో విప్లవం ఎవరికి అవసరమని మీరు భావిస్తున్నారో, వారి చెంతకు వెళ్ళి వారి అభిప్రాయాలేమిటో కనుక్కోకూడదూ" అన్నాను.

"ఈ సూచన బాగుంది" అంటూ సంతోషంగా ఆమోదించాడతను. అతను వెళ్తూ చెప్పాడు.

"నాకు సంతృప్తి కలిగిన తర్వాతే నేను రచనలు చేయటం ఆరంభిస్తాను"

నేను నవ్వుతూ తలూపాను. ఈసారి వారంరోజులు తిరక్కుండానే మరలా రావటం జరిగింది.

"రండి రండి ఈసారి మీ అనుభవాలు ఎలా ఉన్నాయి?" అంటూ ప్రశ్నించాను.

ఆ యువకుడు చిరునవ్వు నవ్వాడు.

"అనుభవం అయితే చాలా అద్భుతంగా ఉంది. కానీ లోతుకు వెళ్ళినకొద్దీ నాకు చాలా దిగ్భ్రాంతికరమైన వాస్తవాలు తెలుస్తున్నాయి" అన్నాడతను.

నేను జవాబుగా నవ్వాను.

అతను చెప్పటం ఆరంభించాడు.

"నేను ఓ పీడితుడి దగ్గరకు వెళ్ళాను. అతనికి విషయం అంతా వివరించి చెప్పాక మీ పరిస్థితుల్లో మార్పులు రావాలంటే ఈ దేశంలో విప్లవం రావాలి. అందులో మీరందరూ

భాగం పంచుకోవాలని చెప్పాను. నేను మాట్లాడినంతసేపూ బాగానే విన్నాడు. ఆ తర్వాత తను ఈ బతుకే దండుగ. హాయిగా చచ్చిపోతే బాగుందన్నాడతను.

"హాయిగా ఎలా చచ్చిపోతాడు?" నేను నవ్వుతూ అన్నాను.

"నేను మొదట్లో నవ్వుతూ అంటున్నాడేమో అనుకున్నాను. తీరా చూస్తూ నిజంగానే అంటున్నాడు. వరసగా ఆయనకున్న బాధలన్నీ ఏకరువు పెట్టాడు. అవన్నీ ఎప్పటికి తీరేనూ అన్నాడు. నాకు అతని నిరాశ చూస్తుంటే నోటంట మాట రాలేదు. ఇదంతా మారిపోతుంది బాబూ అని చెప్పాలనుకున్నా. నావల్ల కాలా. అతనే ప్రారంభం.... ఆ తర్వాత నేను నిరుద్యోగుల్ని కలిశాను. పెళ్ళికాని ఆడపిల్లలతో మాట్లాడాక మధ్యతరగతి మనుషుల్ని కలిశాను. భాషలో తేడానే కానీ అందరిలోనూ జీవితం మీద తీపి రానురానూ తగ్గిపోతోంది" అంటూ విచారపడ్డాడు.

"మరి దీనికి పరిష్కారం దొరికిందా?" అన్నాను.

"ఏం పరిష్కారమో ఏమిటో.... నేను ఎంత ఆశాజనకంగా, ఎంత ఉద్రేకంగా చెప్పటానికి ప్రయత్నం చేసినా వారు అర్థం చేసుకోలేకపోయారు. మీరన్నది వాస్తవమే. విప్లవం వచ్చేదాకా వీరందరూ వేచి ఉండరు. వీరికి కొన్ని తక్షణ సమస్యలున్నాయి. అవి పరిష్కరించబడాలి" అన్నాడు.

"అది వేరే విషయం అనుకోండి. ఇంతకూ మీరు ఏం చేయాలనుకుంటున్నారో చెప్పండి"

అతను కొంచెంసేపు మాట్లాడలేదు.

"మీరు నాకో విషయం చెప్పాలి" అన్నాడు.

"అడగండి"

"జీవితం మీద ప్రేమలేనివారు ఏమీ చేయరు కదూ"

"అంటే...." అన్నాను.

"ఎలాంటి మార్పు రావాలన్నా ముందు ఈజీవితం మీద ప్రేమ ఉండాలి. ఎలా అయినా చావాలనుకున్న వాడికి జీవితం మీద ఎలాంటి మమకారం ఉండదు. అది లేనప్పుడు సాధించాల్సిందీ ఉండదు. ఒక మనిషికి ఈ జీవితం మీద విరక్తి పుట్టిందంటే అర్థం ఏమిటి.... అంత దారుణంగా పరిస్థితులు మారుతున్నాయనేగా. ఇప్పుడు నాకు ఒకటే అనిపిస్తోంది" అని ఆగాడు.

నేను అతను చెప్పబోయే విషయాన్ని కొంతవరకు అంచనా వేయగలుగుతున్నాను.

"నే కాదు. ఏ రచయిత అయినా మిగతా విషయాలలా ఉంచి ముందు ఈ ప్రపంచానికి చెప్పాల్సింది జీవితం జీవించటానికని. ఈ బతుకులో ఎంతటి విషాదం ఉన్నా, ఎంత భయానకమైన దరిద్రం ఉన్నా, మరింకేం ఉన్నా జీవితం జీవించటానికని చెప్పాలి. జీవితం మీద తీపినీ, మమకారాన్ని పెంచాలి. మరణించటం కోసం కాదు జీవితం అని చెప్పాలి. నేనూ అందుకోసమే రాయాలనుకుంటున్నాను" అన్నాడు.

అతని కంఠంలో ఉద్వేగం ఉంది.

ఎందుకో ఆ కళ్ళల్లో నాకు తడి కూడా కనిపించింది. మొత్తం మీద గమనిస్తే ఈ యువకుడిలో నేను గమనించింది ఆవేశం. అలాంటిది ఈ తరానికి అవసరం కూడా. అయితే అదొక్కటే చాలదు. దాంతోపాటు సంయమనం కూడా అవసరం.

నిజానికి అతడు తన ఆవేశంలో ఏదో ఒకటి రాసుకొచ్చి ఉంటే ఎలా ఉండేదో ఊహించే ప్రయత్నం కూడా చేశాను.

నావరకూ కొన్ని అనుభవాలున్నాయి.

ఇలాంటి యువకులు ఆవేశంలో అద్భుతంగా రాస్తారు. తాము రోజూ చూసే సంఘటనల మీద వారికి తీవ్ర వ్యతిరేకత ఉంటుంది. భౌతిక పరిస్థితులు వారిని వాటికి వ్యతిరేకంగా తిరుగుబాటును ప్రోత్సహిస్తాయి. అలాంటి సమయంలో వారి ఆవేశానికి ఓ సంయమనం కుదర్చని పక్షంలో అంత త్వరగా వారు మారరు.

ముందు ఈ ప్రపంచంలో ప్రతిదీ వారికి తిరస్కరించతగినదిగానే కనబడుతుంది. ముఖ్యంగా నమ్రతకూ, బానిసత్వానికీ తేడా తెలుసుకోలేరు. అంతకు మించి నేర్చుకోవటానికి అతీతంగా కొన్ని మొరటు అభిప్రాయలతో ఉంటారు. ఫలితంగా వారు చేసే మంచికంటే వారుత మకు తెలియకుండా చేసే చెడే అధికం అవుతుంది. నా ఆలోచనల్లో నేనుండగా అతను మాట్లాడాడు.

"ఈ దేశంలో కూడా చాలామంది శాంతి కావాలంటూ ప్రచారాలు చేయటం చూసి నాకు చిరాకు కలిగేది. ఇదంతా వొట్టి చెత్త అనుకునేవాడిని. ప్రపంచంలో ఇన్ని కోట్ల మంది ప్రజానీకం ఉంటే ఇంత స్వల్ప సంఖ్యలో మాత్రమే శాంతి కావాలని ఎందుకు ముందుకు వస్తున్నారు అనేది చూస్తే నాకిప్పుడు అర్థం అవుతోంది. ఈ ప్రపంచంలో అన్నిచోట్లా కూడా మానవజాతికి జీవితం మీద ఓ లక్ష్యం లేదు. ఈజీవితానికంటూ ఓ గమ్యం లేదు. ఎలా ఉంటుంది? వారు కోరుకున్న కనీసమైనవి కూడా వారికి లభించటం లేదు. అందుకే రానురానూ ఇంత నిర్లిప్తత. అందుకే ముందు ఈ ప్రపంచంలోని రచయితలందరూ తిరిగి ఇటుకలు పేర్చుకుంటూ పోవటమే మార్గం" అన్నాడతను.

"మంచిది. మీ ప్రయత్నం మీరు ఆరంభించండి" అన్నాను.

"మీకు నా ధన్యవాదాలు" అని అతను వెళ్ళిపోయాడు....

నాకెందుకో అతను ఈసారి నా దగ్గరకు వచ్చేటప్పుడు ఓ రచనతో రాగలడని నమ్మకం కలిగింది.

అతను వెళ్ళేటప్పుడు నేను గమనించాను. మనిషి చాలా గాయపడినట్లుగా కనిపించాడు.

అతను రాసే రచనకోసం నేను సైతం ఎదురు చూస్తున్నాను.

మానవజీవితం మీద తీపి కలిగించే రచన చేయటం ఏమంత సాధారణ విషయం కాదు.

మన మామూలు రచయితలు తమ రచనల ద్వారా పాఠకులను వెర్రెత్తించ గలరేమోగాని జీవితం మీద ప్రేమను ఏర్పరచలేరు.

అందుకే ఈ యువకుడు ఏ విధంగా చెప్పగలడా అనేది నాకు మరింత కుతూహలాన్ని కలిగించింది.

అతను నా దగ్గరకు దాదాపు నెలరోజుల వరకూ రాలేదు.

ఈలోగా చాలా ఘటనలు జరిగిపోయాయి.

అందులో ఒకటి దాదర్ ఎక్స్‌ప్రెస్ సంఘటన.

రెండోది నడుస్తున్న రైలులో నలభై అయిదుమందిని సజీవదహనం చేయటం!

నేను ఈ సంఘటనలను చూసి సిగ్గుతో చితికిపోయాను.

ఒక్కో మరణంతో నేనూ సజీవంగా కాలి బూడిదయిన భావన కలిగింది.

ఆ యువకుడు నా దగ్గరకు విషాదంగా నడిచి వచ్చాడు.

అతని కళ్ళనిండా విషాదమూ, దిగులూ గూడుకట్టుకున్నట్లు కనిపించాయి.

అతనిలో ఆవేశాలు కనిపించటంలేదు.

అతను మాట్లాడుతుంటే కంఠం వణికింది.

"ఏమిటి సార్ ఈ దారుణాలు? ఈ ప్రపంచం ఎటు పోతోంది? ఏ దిశగా పయనిస్తోంది? మనం మధ్యయుగాల వెనక్కి మరలిపోతున్నామా? మనం ఆధునిక సమాజంలో జీవించటంలేదా? అసలేమైంది?

ఈ బతుకు వాస్తవం. ఈజీవితం జీవించటానికి... ఈ ప్రాణాల్ని తీసుకునే హక్కు ఎవరికీ లేదు అని రాయటానికి కలం చేతిలోకి తీసుకున్నా.

ఇంతలోనే ఈ ఘోరం. ఇది ఎవరు చేశారనేది అలా ఉంచండి. ఇది మనుషులు చేశారు. మనుషుల రూపంలోని రాక్షసులు చేశారు. వారికి పెట్రోలు చల్లుతున్నప్పుడు, అగ్గిపుల్ల గీసి వెలిగిస్తున్నప్పుడు ఎందుకని మానవత్వం మృగ్యం అయిపోయింది. చూస్తూ, చూస్తూ అంత రాక్షసత్వానికి ఎలా పూనుకున్నారు?

ఈ దేశానికి విప్లవం వస్తుందో లేదో నాకు తెలియదు. ఈ ప్రపంచం ఏ మంటల్లోకి విసిరి వేయబడుతుందో నాకు తెలియదు. ఈ రోజు పంజాబ్‌లో ఏం జరుగుతూంది? ఇరాక్‌లో ఏం జరుగుతుంది? కాశ్మీర్‌లో ఏం జరుగుతోంది? ప్రపంచం నలుమూలలా ఏం జరుగుతోంది?

మారణహెూమం!

మనిషి ప్రాణాలు చులనకగా మారిపోయాయి. ఇంకేమాత్రమూ మానవ జీవితాలకు భద్రత లేకుండాపోయింది.

సార్.... ఇప్పుడు మనం ఈ తరానికి నేర్పవలసినవేమిటో నాకు చాలా స్పష్టంగా తెలుస్తున్నాయి.

ముందు మానవత్వం అంటే ఏమిటో..... జీవితం అంటే ఏమిటో... ఒకరినొకరు ప్రేమించుకోవటం అంటే ఏమిటో.... ఒకరికోసం ఒకరు త్యాగం చేసుకోవటంలోని గొప్పతనం ఏమిటో నేర్పాలి.

ఈ ప్రపంచానికంతా వినపడేలా గానం చేయాలి.

ఇదంత సులభం కాదని నాకు తెలుసు....

మానవత్వపు సౌధాలన్నింటినీ నిర్దాక్షిణ్యంగా కూల్చుకుంటూ పోతున్నారు. ఎటుచూస్తే అటు అశాంతి, అరాచకం, దౌర్జన్యం.... వీటన్నింటా నలిగిపోతున్నది ఎవరో కాదు సార్....

ఈ దేశంలో ఎవరికి విప్లవం అవసరమో వాళ్ళు.....

కేవలం వాళ్ళే!...."

అతను ఉద్వేగం భరించలేక భోరున ఏడ్చాడు.

అతనిని ఓదార్చటం నావల్ల కాదు.

నేను సైతం కళ్ళ నుండి అశ్రువులు రాలుతుండగా మౌనంగా ఉండిపోయాను.

నిజమే....

ఏ మానవహస్తాలు ఒక్కో ఇటుకా పేర్చుకుని అత్యంత శ్రమతో రూపొందించుకున్నవో అవన్నీ కూలిపోతున్నాయి.

తిరిగి ఒక్కో ఇటుకా పేర్చుకోవటమే మార్గం.

అది ఎంత బాధాకరమైనా, సుదీర్ఘమైనా తప్పదు.

అతనింకా ఏడుస్తూనే ఉన్నాడు.

నేను మెల్లగా లేచాను.

ఆ యువకుడి చెంతకు వెళ్ళాను.

"నిజమే... ఇదంతా వాస్తవమే...

అయినా కూడా మనం దుఃఖించకూడదు.

అశ్రువుల్తో నిండిపోయిన కళ్ళు తుడవాలి.

మానవత్వపు కావ్యాలు గానం చేయాలి.

ఈ ప్రపంచం మనుషులు నిర్మించుకున్నది.

ఇందులోని ప్రతిదీ వారి స్వంతం కావాలి.

అందుకోసమే మనం ఉన్నది"

అతను మెల్లగా కళ్ళు తుడుచుకున్నాడు.

ఇప్పుడతని కళ్ళు మెరుస్తున్నాయి.

అత్యంత ఆత్మవిశ్వాసం ఆ కళ్ళలో ఉంది.

తను బయలుదేరటానికి లేచాడు.

నేనిప్పుడు మీ అందరికీ ఓ హామీ ఇవ్వగలను.

అతని 'ఎన్నిక' పూర్తయింది.

అతనిప్పుడు...

జీవితాన్ని ప్రేమించేలా చేయగల మానవత్వపు మధురిమలు ప్రభవించే మంచి రచనను సృజించి తీరతాడు. నా ఆలోచనతో రేపు మీరు ఏకీభవిస్తారు.

**ఉదయం వారపత్రిక, 25-1-91**

# గాజు పళ్లెం

## కె. వరలక్ష్మి

'రెండు బుల్లిచేతులు వింటిని ఎక్కు పెట్టడానికి ప్రయత్నిస్తున్నాయి ఎప్పట్నుంచో. హమ్మయ్య! ఆ చేతుల ప్రయత్నం ఫలించింది. బాణాన్ని వింటికి సంధించి.... లాగి... లాగి... వదిలేసాయ్, అబ్బా..."!

మూడంకె వేసి ముణగదీసుకు పడుకున్న గంగ కడుపులోని బిడ్డ కదలికకి ఉలిక్కిపడి కలలోంచి మెలకువలోకొచ్చింది. సూదుల్లా గుచ్చుతున్న కంకరగుట్ట మీద భారంగా వెల్లకిలా తిరిగింది. ఎర్రని అగ్నిపూల గుత్తుల మధ్య నుంచి ఎండ నిప్పుకణికల్లా కళ్లల్లోకి దూకింది. చటుక్కున మోచేతిని కళ్ల మీద కప్పుకుంది. ఏదో అనుమానం వచ్చి మోచెయ్యి సందు నుంచి స్టేషను గేటు వైపు చూసింది. గేటు కవతల ఫెన్సింగు కానుకుని పోర్టరు గన్నిగాడు బీడీ తాగుతూ ఆకలి కళ్లతో గంగని తినేసేలా చూస్తున్నాడు.

'చీ ఎదవా' అని తిట్టుకుని అటు తిరిగిపోయింది గంగ. ఆమెకి వాడి చూపులేం కొత్తకాదు. 'ఎప్పుడూ అదే యావ ఎదవ సచ్చినోడికి' అనుకుంది. ఒకట్రెండుసార్లు ప్రయత్నించి ఆమె చేత తలమొయ్యా చివాట్లు తిని కేవలం చూపుల్తోనే తృప్తి పడుతున్నాడు ప్రస్తుతం గన్నిగాడు.

పొద్దుట్నుంచి టీస్తైనా పడని ఖాళీ పడుపులో బిడ్డ ఆకలికి కాబోలు ఉంగులు తిరుగుతోంది. చీర పొత్తిళ్లలో చేయిదూర్చి పొత్తి కడుపునోసారి తడుముకుంది గంగ. చేతి మీద చాచి తన్నిన బిడ్డ కాలుని అందుకోవాలని విఫల ప్రయత్నం చేసింది. కొంతసేపు ఇటు పట్టుకోబోతే అటు, అటు పట్టుకోబోతే ఇటు కదులుతున్న బిడ్డతో ఆడింది.

కొంతసేపటికి విసుగొచ్చి ఆట మానేసింది.

సన్నని మంటలాగా ఆకలి మొదలయింది కడుపులో. లేవడానిక్కూడా ఓపిక లేనంత నిస్సత్తువగా ఉంది. ఆకల్తోబాటు గంగని పశ్చాత్తాపం కూడా కొంచెం కొంచెంగా తినడానికి సిద్ధమైంది.

అసలా బోడిదాన్తో తగువు పడకుండా ఉండాల్సింది. వాగి వాగీ దాని నోరే నెప్పెట్టి

రెండు చేతులా మూసుకునేది. తగువుపడి మాత్రం తను సాధించిందేం వుంది? చెయ్యి వెనక్కి చాచి తల కిందున్న గుడ్డల మూట మధ్యలో పదిలంగా పాత కోకలు చుట్టిపెట్టిన గాజు పళ్లాన్నోసారి తడిమి చూసుకుంది.

ఆ బోడిది విసిరిన విసురుకి గాజుపళ్లెం భళ్లుమనేదే, సమయానికి సరిగ్గా తను పట్టుకునుండకపోతే. అప్పటికీ అంచు మీద చిన్న పెచ్చూడిపోయింది. తన ప్రాణం గిలగిలా కొట్టుకుంది. అసలా బోడిదానికి తనని ఆళ్ల కూడా తీసుకెళ్లడం ఇష్టం లేకే ఇంత నాటకమాడింది.

నెమ్మదిగా లేచి చెట్టుకు చేరబడి కూర్చుంది గంగ. ఒళ్లంతా పచ్చి ముద్దలాగుంది. చేతులు ముందుకు చాపి చూసుకుంది. అది గోళ్లతో గీరిన చారలు రక్తాలు పేరుకుపోయినై. దుబ్బులాగున్న తన జుట్టుని చేతికి చుట్టుకుని వంగదీసి వీపు మీద గుద్దిన గుద్దులకి తన ప్రాణం కడెక్కిపోయినట్టైంది. రోగిష్టిదాన్లా ఎప్పుడూ మూలుగుతా వుండే బోడిదాని చేతుల్లో అంత బలం ఎక్కణ్ణుంచొచ్చిందో!

పొద్దున్నే జరిగిన గొడవ గుర్తుకొచ్చిన గంగకి ఏడుపొచ్చింది - బోడమ్మ నలుగురు పిల్లల్నీ అటిద్దర్నీ ఇటిద్దర్నీ వేసుకుని గాఢ నిద్దట్లో ఉన్న గంగ చెవులు హోరెత్తిపోయే కేకలు ఏడుపుల మధ్య తుళ్లిపడి లేచి కూర్చుంది. తూర్పింకా తెల్లబడలేదు. గోదావరి స్టేషన్లోకి ఏదో బండొచ్చి ఆగినట్టుంది, స్టేషనంతా సందడిగా వుంది. గుడిసెల్లోని జనం అటూ ఇటూ పరుగులెడుతూ గిన్నెలూ, తపేలాలూ మూటలు కట్టుకుంటున్నారు. గుడ్డి సూరయ్య తాత తడుంకుని తడుంకుని పొయ్యిలో సగం కాలి ఆరిన కట్టెపుల్లల్ని కాలకుండా మిగిలిన రెండు పుల్లల్తోనూ కలిపి కడుతున్నారు. అటుపక్క స్టేషన్లోంచీ, ఇటు పక్క కళాకేంద్రం ఆవరణలోంచీ లైట్లు పట్టపగల్లా వెలుతుర్ని కురిపిస్తున్నాయి. బండి దిగిన జనం బద్ధకంగా స్టేషన్లోంచి బైటికొస్తున్నారు.

ఏం జరుగుతోందో కొంతసేపటివరకూ గంగకి అర్థం కాలేదు.

గుడిసెలపైన ఆచ్ఛాదనగా వేసుకున్న ఆకుల్నీ, గోనె పట్టాల్నీ ఆదరా బాదరా విప్పి పోగులు పెట్టుకుంటున్నారు కొందరు. కుండల్నీ, గిన్నెల్నీ గోనె సంచుల్లో వేసి మూటలు కడుతున్నారు మరికొందరు.

"ఏయే, గుడిసె.... నం...! కళ్లం పడతాలేదేటి? రాజాగోరల్లే తొంగున్నావ్. నెగు నెగు. నెగిసి గుడ్డా గుడుసూ అన్నీ మూటలు గట్టు. తెల్లారిందంటే మున్సపాల్టీ మొగుళ్లొచ్చేత్తారు. ఇయ్ కూడా దక్కకుండా తరివేత్తారు" బోడమ్మ గుడిసెలో పడుకునే అరుస్తోంది.

గంగ చివుక్కున లేచి నిలబడింది. ఆ ఊపుకి ఎడం మక్కె పట్టేసినట్టయింది. అసలే నిద్ర చాలని బద్ధకం. ఒళ్లు మండుకుపోయింది గంగకి.

"గుడిసెలోంచి కాళ్లు సగం బైటికి సాపి గుమ్మానికడ్డంగా తొంగున్నావు. నేనేటి సేసేది? ముందు నువ్వు నెగిసి బైటికి రా."

మున్సిపాల్టీవాళ్లు ముందు రోజు సాయంకాలం వచ్చి అందరి పేర్లూ రాసుకు వెళ్లారు. సారంగధరుడి మెట్ట దగ్గర, క్వారీల పక్క అందరకీ గుడిసె లేసుకోడానికి

స్థలాలిస్తారట. పుష్కరాలకు ఊరిని అందంగా కన్పించేలా చెయ్యాలని మున్సిపాల్టీవారి తాపత్రయం. పట్నం ఒంటి మీది 'గాయాల్లాం'టి మురికి గుంటల్ని ఓపక్క తాత్కాలికంగా పూడ్చుకొస్తున్నారు. ఆ పైన 'కురుపుల్లాంటి' ఆక్రమిత పూరి గుడిసెల్ని (ఈ పైత్యం రచయితది కాదు పత్రికా విలేకరులది) సమూలంగా పెకలించెయ్యదల్చుకున్నారు. అలా పెకలించేసేక ఓ చోటంటూ చూపించకపోతే అణిచేసిన సెగగడ్డల్లాగ మరోచోట అవి తెల్లారేసరికి ప్రత్యక్షమై పోతాయని వారికి అనుభవపూర్వకంగా తెలీడం వలన ప్రత్యామ్నాయంగా ఊరికి దూరంగా గుట్టల మధ్య ఒక్కొక్క కుటుంబానికి నాలుగడుగుల స్థలాన్ని కేటాయించారు. 'మనిషి చస్తేనే ఆరడుగుల నేల కావాలే, నాలుగడుగుల జాగాలో గుంపులు గుంపులుగా పిల్లాజెల్లల్తో ఎలాగ బ్రతకాల్రా నా కొ...రా" అని ఎవరూ అడగలేదు. అడగరు, ఎందుకంటే పేరుకి ఓ గుడిసంటూ వుంటుందేకాని, వాళ్లల్లో ఎవరూ రోజంతా గుడిసెలో వున్న పాపాన పోరు. ఆడామగా అంతా కూలీ నాలీ చేసుకోడానికి పోతూ ముసలాళ్లనీ, అంగవైకల్యం వున్నవాళ్లనీ, అయిదేళ్లు దాటని పసివాళ్లనీ ఖాళీ డబ్బాలిచ్చి ఏ రైల్వే స్టేషన్లోనో, ఏ గుడి ముంగిటో, ఏ మసీదు వాకిట్లోనో కూర్చోబెట్టిపోతారు. రాత్రికంతా గుడిసె దగ్గరికి వస్తూ వస్తూ తమ సంపాదన లోంచి దార్లో దొరికిందేదో కొనుక్కు తినేసి కడుపు నింపుకుంటారు. ఏ చేపల పులుసు తినాలనిపించినప్పుడో తప్ప అక్కడి పొయ్యిలు రాజుకోవు.

వయసులో వున్న పెళ్ళికాని మగ కుర్రాళ్ళు ఏ ప్లాట్‌ఫారం మీదో తెల్లారేదాకా ఓ కునుకు తీసేస్తారు. తోడున్న జంటలు మాత్రం కాళ్ళు లోపలికి తీసుకుంటే తలలూ, తలలు ముడుచుకుంటే కాళ్ళూ బైటికొచ్చే ఆ గుడిసెల్లో ముడుచుకుపోయి కాపురాలు చేసేస్తుంటారు. తలుపూ ద్వారంలేని ఆ గుడిసెల్లోంచి తమ కదలికలు అందరికీ బట్టబయలేనన్న విషయం తెలిసి కూడా ఏ దుప్పటి ముసుగులోనో బహిరంగంగా రహస్యాన్ని కాపాడుకుంటూ వుంటారు.

ప్రస్తుతం అక్కడి వాళ్లంతా కొత్తచోటికి చేరబోయే ఉత్సాహంలో ఉన్నారు. ఇప్పుడెళ్ళబోయే స్థలాన్ని గవుర్మెంటు తమకి నికరంగా పట్టాలు రాసిచ్చేస్తాదని రాత్రే కథలు కథలుగా చెప్పేసుకున్నారు. అంత దూరం నడవలేని ముసలాళ్లు మాత్రం "మీకేం పిచ్చేటల్లా, మనవేం ఆళ్ల సుట్టాలవా బందుగులవా మనకాడ ఒక్క పైసా పుచ్చుకోకుండా ఉత్తినే మనకి తలాలు రాసిచ్చెయ్యటానికి? అదీగాకుండా పుష్కరాల్లో గోదారమ్మకీ, ఊరికీ దూరంగా పోయి మనం చేసేదేటంట? నాలుగు డబ్బులొచ్చీ ఏళకి ఇయ్యేం పొయ్యీకాలం బుద్దులొచ్చేయిరా మీకు? ఆల్లిచ్చే తలాల్ని నెత్తినెట్టుకుపోతారేటి ఎవ్వులైనా? అయినా మనకి ఏ రోజుకారోజు పొట్టలోకి కూడుండాలిగానీ, ఇల్లూ వాకిళ్లూ మనమేం చేసుకుంటాం, ఇయ్యాలిక్కడుంటాం, రేపెక్కడుంటావో ఆ పరమాత్ముడికే ఎరిక. అందుకని ఆళ్లు సూపిచ్చే మోసేతి మీద తేనె సుక్కని నమ్ముకుని అరిచేతిలోది అవతల పారేసుకోకండి. టేసనుకి ఈ పక్క నించి పొమ్మంటే ఆపక్కకెల్లి గుడిసేసుకోవాల. ఆ పక్క నించి పొమ్మంటే మళ్లీ ఈ పక్కకొచ్చెయ్యాల" అని హితవులు చెప్పేరు.

గేటుకి చేరబడి బీడీ కాల్చుకుంటున్న స్వీపరు ఏసోబు మాత్రం ఆరిపోయిన బీడీ

ముక్కని తుపుక్కున ఉమ్మేసి "ఓరి ఎదవల్లారా! రాజమండ్రీకి ఇదేవన్నా ఉత్తుత్తి సోకనుకుం తన్నారేటి, పుస్కరాల సోకు. కళ్లు జిగేల్మనిపోవాలని మునిసిపాలాఫీసులో అయ్యగార్లు 'సప్పుకుంతంటే ఇన్నాను. ఇంకంతే, మీకు గోని సంచులూ గుడ్డముక్కలూ కూడా దక్కవు. నా మాటినుకోని మంచిగా ఎలిపోండి. పుస్కరాలై పోయిన మర్నాటికెలాగా మీరిక్కడికి రాకా తప్పదు, ఆ బాబులందరూ సూసీ సూణ్ణట్టూరుకోకా తప్పదు" అన్నాడు.

ఆ మాటలకి అందరూ కట్టుబడిపోయేరు.

మురిక్కాలవల్ని జల్లెడ పట్టే మాలచ్చి మాత్రం ఏ వెరగనట్టు ఏసోబు పక్కకెళ్లి నుంచుని బొడ్లోనించి మడతలు పడి మాసిపోయిన రూపాయి కాయితం ఒకదాన్ని తీసి వాడి చెయ్యందుకుని రహస్యంగా వాడి గుప్పిట్లో కుక్కింది. 'ఓరేసోబూ, నా కొడకా! పుస్కరాలెళ్లిన మర్నాడు తెల్లారీపాలికల్లా నేనూ, నా కుఱ్ఱోళ్లూ ఇక్కడుంటాం. ఈసోటు మాత్రం ఎవురూ ఆక్కరమించెయ్యకుండా సూసిపెట్టు నాయన్నాయనా! సచ్చి నీ కడుపునుడతాను" అని బతిమాలింది.

ఏసోబు కుదరదని కొంచెంసేపు బెట్టుచేసి, మరో రూపాయి చిల్లర డబ్బులుచ్చుకుని 'సరే'నని అభయమిచ్చేడు.

బోడెమ్మ కాళ్లు ముందుకు జరుపుతూ గుడిసెలోంచి బైటపడింది. ఇంకా నిద్రలో వున్న నలుగురు పిల్లల్నీ నాలుగంటించి లేపి కూర్చోబెట్టింది. బోడమ్మ బైటికొచ్చిన కంతలోంచి గంగ లోపలికి దూరింది. ఒకపాత కోక పరిచి వున్న నాలుగు గిన్నెలూ చట్టిలూ సర్దడం మొదలుపెట్టింది. ఈ లోపల బోడెమ్మ గుడిసె పైన వేసిన గోనె ముక్కలు రెండూ లాగి పక్కన పడేసి, మూడువేపులా నిలబెట్టిన తడిక ముక్కల్ని జాగ్రత్తగా పెకలించమని పిల్లలకి పురమాయించింది. పిల్లలు ఆ తడకల్ని గుంజడం మొదలుపెట్టారు. అదిగో అక్కడే అనుకోకుండా గొడవ మొదలైంది.

తడికకి చేరబెట్టిన గాజుపళ్ళెం తడిక గుంజడంతో ముందుకి పడిపోయింది. పడీ పడ్డమే అంచు మీద అంగుళం మేర పగులిచ్చింది. ఆ గాజుపళ్లెం గంగకి ప్రాణం. తన పుట్టింటి నుంచి తెచ్చుకున్న ఏకైక సామగ్రి అదే. దాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తోంది. ఆ పళ్లానికి అంచు పగిలిపోగానే గంగకి గుండెలో ఎవరో కత్తి దింపినట్టైంది.

ఉక్రోషం పట్టలేక తడక గుంజుతున్న పేరిగాణ్ణి పట్టుకుని వీపు మీద ఛెళ్లుమని ఒక్కటేసింది. అది చూసి బోడెమ్మకి ఉడుకెత్తిపోయింది.

"ఓసి నీ సేతులడిపోనూ, రంకు నా సైతీ! నీకేం పొయ్యికాలవొచ్చిందే, అణ్ణంత దెబ్బ కొట్టేసేవూ" అంది కాళికావతారం ఎత్తేసి.

"కొడతానా సంపేత్తానా ఎదవని. సచ్చినోడు నా గాజుపళ్లేన్ని..."

గంగని మాట పూర్తి చెయ్యనీకుండా బోడెమ్మ అందుకుంది. "ఓలబ్బో గాజు పళ్ళెం. అమ్మగారింటికాణ్ణుంచి అట్టుకొచ్చీసింది అరణం. నాకు మండుకొచ్చిందంటే నేలకేసి కొట్టేసి నాలుగు సెక్కలు సేసీగల్ను జాగర్త" గాజు పళ్లాన్ని గంగ మీదికి విసిరేసింది బోడెమ్మ.

"ఏదీ, సెయ్ నంజా, నాలుక్కాదు రెండు ముక్కలు సెయ్ సూద్దాం. నీ బుర్ర కూడా రొండు సెక్కలై పోద్ది దెబ్బకి" ఆ పక్కనే పడున్న కట్టె పేడునోదాన్ని చేతిలోకి తీసుకుంది గంగ.

గంగ చేతిలో కట్టెపేడు చూడగానే బోడమ్మ వీధెగిరిపోయేటట్లు రాగం లంకించుకుంది. "ఓలమ్మోలమ్మో! ఈ దొంగలం... ఈ దొమ్మరిసాని, నా మొగుణ్ణి వల్లో ఏసుకుని నా కాపరంలో నిప్పులేసింది, నా మొగుణ్ణి పొట్టనెట్టేసుకుంది గాకుండా ఇంక నన్ను సంపెయ్యడానికి తయారైందిరో బాబో" కూర్చుని నెత్తిన రెండు చేతులూ పెట్టుకుని రాగాల్తీసి రాగాల్తీసి మొగుణ్ణి తల్చుకుని ఏడుపు మొదలుపెట్టింది. అది చూసి బిత్తరపోయిన గంగ కట్టెని కింద పడేసింది.

కట్టెనైతే పడేసింది కానీ, పొంగుకొస్తున్న ఉక్రోషాన్ని ఆపుకోలేకపోయింది.

"పోపోయే రోగిష్టి నంజా! నువ్వు పనికిరాని డొక్కునంజవనే కదా ఆడు నన్ను తెచ్చుకున్నాడు" అంది బోడెమ్మని ఎక్కడ కొట్టాలో అక్కడ కొట్టేనని మురిసిపోతూ. ఆమె మురిపెం ఎంతోసేపు నిలవలేదు. బోడెమ్మ దెబ్బతిన్న పులిలాగ క్షణంలో ఎగిరి దూకి గంగ జుట్టు పట్టేసుకుంది. ఆ జుట్టును చేతికి మెలిపెట్టుకుని వంచి, వీపు మీద గుభీగుభీమని గుద్దింది. కాని ఆమె కెంతసేపూ రెండు చేతులూ అడ్డం పెట్టుకుని తన గర్భం మీద దెబ్బ పడకుండా కాపాడుకోడానికే సరిపోయింది. కొట్టి కొట్టి బోడెమ్మా, దెబ్బలు తిని తిని గంగా సొమ్మసిల్లిపోయేరు.

తెల్లారి ఆరుగంటల వేళకంతా అందరూ మూటల్తో సిద్ధమై పోయేరు.

ఎలాగో ఓపిక చేసుకుని గంగ కూడా తన గుడ్డల్లో గాజుపళ్ళెం జాగ్రత్తగా పెట్టి మూట కట్టుకుంది.

ఆనెం కళాకేంద్రం గోడ పొడవునా గుడిసెలు పీకేసిన ఆనవాలు తప్ప మరేం మిగల్లేదు.

కేన్‌తో టీ అమ్ముకునే కుర్రాడొస్తే అందరూ టీ నీళ్లు కడుపులో పోసుకున్నారు. తనూ టీ తాగుదామని గంగ మొల్లో వెతుక్కుంటే బొడ్లో దోపుకున్న అర్ధరూపాయి బిళ్ల కనపళ్లేదు. చెట్టు వెనక్కెళ్లి గబగబా చీర కుచ్చిళ్లన్నీ పీకేసి చూసుకుంది. ఊహు. ఇందాకటి కొట్లాటలో ఎక్కడో పడిపోయినట్టుంది. ఆశ చావక చాలాసేపు వెతుక్కుంది గంగ. దొరకలేదు. పోనీ ఎవరైనా 'ఈ టీ నీల్లు తాగు' అంటారేమోనని చూసింది. ఎవరూ అనలేదు. టీ కుర్రోడు అరువివ్వనన్నాడు. "ఇక్కణ్నుంచి ఎల్లిపోతన్నారు కదా" అన్నాడు. ఆ మాట విని బోడెమ్మ గయ్యిమని లేచింది మళ్లీ.

"అదెక్కడి కొత్తాది నా సవితి? దానికెవుడూ బొట్టెట్టి బూములియ్యలేదు. నా మొగుడికి నేను నీతైన పెళ్లాన్ని కాబట్టి గవుర్మెంటోడు నాకూ, నా బిడ్లకి ఇచ్చేడు. ఇలాంటి అడ్డమైన గుంట ముండలకి ఇచ్చెయ్యటానికి ఆడేం తెలివిలేనోడు కాడు"

"నీ టీ నీల్లు తాగాపోతే నేనేం సచ్చిపోన్లే, ఎల్లెల్లు" అని అనవసరంగా టీ కుర్రాణ్ణి కసురుకుని అటు తిరిగి కూర్చుంది గంగ.

ఏడు గంటలకంతా మున్సిపాల్టీవాళ్ల మనిషొచ్చి అందరూ ఎక్కడికెళ్లాలో చెప్పేసిపోయాడు. వరసగా పేర్లు చదివేటప్పుడు ఆ లిస్టులో బోడెమ్మ పేరుంది గాని, గంగ పేరు లేదు.

నాల్గైదు రోజుల క్రితం అందరూ పేరిస్తా వుంటే బోడెమ్మా, పిల్లలూ ఎక్కడుంటే తనూ అక్కడే కదా అనే ధీమాతో గంగ తన పేరివ్వలేదు.

"ఆ, ఇయ్యన్నీ మామూలే, ఇలాంటి గొడవలు ఎన్నిసార్లు జరగలేదు! ఈ బోడి దానికసలే ఒళ్లొంగదు. నేను లేకపోతే దీనికి తిండి పెట్టేవోళ్లెవరు?" అనుకుంది ధీమాగా.

నెలరోజుల క్రితం అతిసారం వచ్చి రాజయ్య పోయినప్పట్నుంచీ గంగే ఆ కటుంబానికి మొగదిక్కులా నిలబడింది. నలుగురు పిల్లల్నీ వెంటేసుకుని బజార్లోకి పోయి పచారీ దుకాణాలకి మూటలూ, గంపలూ మోసి రోజుకి అయిదార్రూపాయలు సంపాదించుకొస్తోంది. నూకలు కొనుక్కొచ్చి, ఏవేళైనా పొయ్యి రాజేసి గంగ వండిపొయ్యాల్సిందే, బోడెమ్మ మాత్రం ముణగదీసుకు పడుకుని కదలదు. ఇక్కడి పూచికపుల్ల తీసి అక్కడ పెట్టదు. 'ఏవంటే రోగం' అంటుంది. 'వేళకి లేచి గిన్నెడన్నం ముప్పొద్దులా తినేదానికి ఏం మాయరోగవో' అనుకుంటుంది గంగ. బెట్టుచేస్తూ అటు తిరిగి కూర్చున్న గంగ నొదిలేసి వెళ్లిపోయేరంతా. ఆశ చావని గంగ వాళ్లు కనుమరుగయ్యే వరకూ చూస్తూనే వుంది. తను పెంచిన ఆఖరోడైనా వెనక్కొచ్చి "చిన్నమ్మా, నువ్ రాయే' అంటాడేమోనని. అలా జరగలేదు. అప్పుడు పొంగుకొచ్చేయి గంగకి గోదావరన్ని కన్నీళ్లు. ఒక్కసారిగా ఆకాశంలో మబ్బులు కమ్ముకొచ్చేయి. సన్నగా చినుకులు ప్రారంభమయ్యేయి.

భారంగా లేచి, మూట చంకనేసుకుని ఒక్క నిమిషం ఆలోచించింది గంగ అటు స్టేషన్లోకి పోదామా, ఇటు కళాకేంద్రం ఆవరణలోకి పోదామా అని. తను నుంచున్న గోడ వెనుకే వున్న కళాకేంద్రమే దగ్గరగా తోచింది. అదీగాక స్టేషన్లో గన్నిగాడి పోరొకటి.

చుట్టు తిరిగి గేట్లోంచి తిరిగొచ్చి కళాకేంద్రం మెట్లన్నీ ఎక్కేసరికి అలుపొచ్చింది గంగకి. ఆయాసపడుతూ స్తంభానికి చేరబడి కూర్చుండిపోయింది. మొట్టమొదటిసారి రాజమండ్రి రావడం గుర్తుకొచ్చింది.

చిల్లు గిన్నెలకి మాట్లెయ్యడానికి తమ ఊరొచ్చిన నలభై ఏళ్ల రాజయ్య నెల్లాళ్లపాటు తమ గుడిసెలోనే వున్నాడు. చుట్టూ అడవి, కొండలూ. రోజూ కొంత కొండ మేరకి కొండల్ని పగలగొడుతూ రాళ్లు కొట్టే జనం. ఆ గుడిసెల్లో వుండే జనాలకి కాస్త గంజి కాచుకుని తాగడం, మళ్లీ రాళ్లు కొట్టే పన్లో మునిగి పోవడం తప్ప మరో వ్యాపకం వుండేది కాదు.

ఊహ తెలిసినప్పట్నుంచీ అదే ప్రపంచంగా పదహారుఏళ్ళు ఒంటిమీదకి తెచ్చుకున్న గంగకి రాత్రి తన తండ్రితోబాటు కల్లు ముంత ఖాళీ చేసి చిలవలు పలవలుగా రాజయ్య చెప్పే రాజమండ్రి కబుర్లు కడుపు నింపేసేవి.

గోదావరి ఒడ్డునే గుళ్లు గోపురాలూ, గోదావరి మీద బ్రిడ్జీలూ, కడతా కడతా వున్న మూడో బ్రిడ్జి స్తంభాలూ, సినిమా హాళ్ళూ, కాఫీ ఒటేళ్లూ ఒకటేంటి రాజమండ్రి అంటే

స్వర్గం అన్పించేది గంగకి. నెల గడిచేసరికి కల్లు ముంతల స్నేహం ముదిరి, పదహారేళ్ళ గంగని తనకి కట్టబెట్టమని రాజియ్య అడిగిన వెంటనే తల ఊపేసాడు గంగ తండ్రి. గంగ తల్లి గంగని చాటుకి పిల్చి చివాట్లేసింది. "ఆడి వయసెక్కడ, నీ వయసెక్కడ? నీ బాబంత వయసోడాడు. ఆణ్ణి కట్టుకుని నువ్వేం సుకపడతావే పిచ్చిమొకవా, ఆణ్ణి సేసుకోనని సెప్పు"

కాని, గంగకి తల్లి మాటలు చెవికెక్కలేదు. ముందారాళ్ళ ప్రపంచం నించి బైటపడితే చాలనుకుంది. ఈ ఛాన్స్ వదిలేసుకుంటే అక్కడే రాళ్ళుకొట్టే ఏ కుర్రాడికో తనని కట్టబెట్టేస్తారు. మరో ప్రపంచం అనేది చూడకుండానే ఈ రాళ్ళమధ్యనే తన బతుకు వెళ్లమారిపోతాది. రాజియ్య చేత మెళ్లో పసుపుకొమ్ము కట్టించుకుని ఆడి వెంట వచ్చేసింది. కాణీ కట్నం అడగలేదు సరికదా, అత్తగారికో జనతా చీర, మావగారికో జనతా పంచె కొనిపెట్టిన రాజియ్య దేవుళ్లాగా కనిపించేడు వాళ్ళకి. ఆ రాత్రి కల్లు ముంతల పార్టీ చేసాక అక్కడున్నోళ్లందరికీ దేవుళ్లాగే కనిపించేడు. పుట్టింటివాళ్లు గంగకి ఒక కొత్త కోకైనా కొనలేకపోయేరు.

రాళ్లు కొట్టిన డబ్బులు దాచుకుని అటుగా వచ్చిన కావిడి సామాన్ల వాడి దగ్గర చిన్నప్పుడెప్పుడో ముచ్చటపడి కొనుక్కున్న, బాతులూ, లతలూ ముద్రించి వున్న అన్నం కంచమంత గాజుపళ్లాన్ని మాత్రం గంగ పదిలంగా తన వెంట తెచ్చుకుంది. మొదటిసారిగా రైలు బండెక్కించిన రాజియ్య గంగ కళ్లకి ఆడు చెప్పిన సినిమా కథల్లోని హీరోలా కన్పించేడు.

ఇప్పట్లాగే ఆరోజు సన్నటి చినుకులు పడుతున్నాయ్. గోదావరి స్టేషన్లో దిగి ఏదో ప్రపంచంలో తేలిపోతూ గాలిలో నడిచొచ్చిన గంగకి నేల మీద బోర్లా పడిపోడానికి ఎంతోసేపు పట్టలేదు.

గుడిసె గుమ్మం దగ్గరే ఎంగిలి గిన్నెలు కడుక్కుంటున్న బోడెమ్మ రాజియ్యని చూస్తూనే తిట్లకి లంకించుకుంది. "ఇన్నాళ్లూ ఎక్కడికి పోయా? ఎదవ సచ్చినోడా, ఇక్కడ తిండీ నీళ్లూ లేకుండా మేం సచ్చినా నీకేం ఫరవాలేదన్న మాట!" అంటూ.

"ఇదెవత్తి నీ ఎనకాల? మెళ్లో కొత్త పసుపుతాడుంది. అమ్మో అమ్మో, నా గొంతుక్కోసేసేడల్లో. ఈ ఆడంగిరేకులెదవ ఇంకెవత్తో రంగసాన్ని ఎంటబెట్టుకొచ్చి సేడల్లో" అంటూ గుడిసె లెగిరిపోయేటట్టు రాగాలెట్టింది. "ఆడికి సిగ్గు లేకపోతే నీకూ నేదంటే? ఆడి వయసెక్కడ, నీ వయసెక్కడ?" అంటూ గంగని బుగ్గల్లో పొడిచింది. అప్పుడర్థమైంది గంగకి రాజియ్యకిది వరకే పెళ్ళాం పిల్లలూ వున్నారనీ, రాజియ్య హీరో కాదనీ, పెళ్ళాం ముందు పిల్లి అనీ. ఏం చెయ్యాలో తోచని గంగ కొంగు బొడ్లో దోపుకుని బోడెమ్మ చేతిలోని ఎంగిలి గిన్నెలందుకుంది. కాస్సేపట్లోనే గుడిసెంతా అలికి ముగ్గేసి అద్దంలా తయారుచేసింది. సాయంకాలం పెద్ద పిల్లలు ముగ్గురికీ స్టేషను కుళాయి దగ్గర రుద్ది రుద్ది స్నానాలు చేయించింది. చిరుగుల లాగూలకి కుట్లు వేసి తొడిగింది. చంటోడికి తాటాకుల మంట మీద వేణ్ణీళ్ళు మరిగించి నీళ్లు పోసి, శుభ్రమైన పాత గుడ్డల్లో

పడుకోబెట్టింది. వంటంతా కానిచ్చి, అలిగి పడుకున్న బోడెమ్మకి పాదాలు ఒత్తింది.

ఇన్ని చేసినా, వారం రోజులకి గాని బోడెమ్మ కోపం చల్లారలేదు.

ఆ తర్వాత బోడెమ్మ మహారాణి, గంగ దాసీ పిల్లా అయ్యారు.

రాజియ్యకి బోడెమ్మ ఎదుట నోరెత్తే ధైర్యమే కాదు, కన్నెత్తే ధైర్యం కూడా లేదు.

ఎప్పుడైనా బోడెమ్మ ఏ సినిమా కెళ్ళినప్పుడో తప్ప రాజియ్య గంగని తాకేవాడు కూడా కాదు. ఒకట్రెండుసార్లు గోదావరవతల ఊళ్లకి మాట్లెయ్యడానికి వెళ్తూ వండి పెట్టడానికి గంగని తన కూడా పంపమని రాజియ్య బోడెమ్మని అడిగేడు. ఒంటికాలి మీద లేచిన బోడెమ్మ నోటికి ఝడిసి ఆ తర్వాత ఆ ఊసెత్తడం మానేసేడు.

గంగకి మాత్రం ఆ చుట్టు గుడిసె స్వర్గంగానూ, గోదారి నీళ్లు అమృతంగానూ అన్పించేవి. పనంతా చేసేసి, బజార్లో రెండ్రూపాయలు చేతిలో పడగానే మేట్నీ సినిమాకెళ్ళిపోయేది. చిరంజీవి ఆమె కలల రాజకుమారుడు. కళాకేంద్రంలో తరచుగా జరిగే కార్యక్రమాల్లో ఏ నాట్యమో, నాటకమో వుంటే సినారేకుడబ్బా మీదికెక్కి గోడ మీది నుంచి, బోడమ్మ తిట్టేవరకూ చూస్తూనే వుండేది. గంగకి బతుకులో కష్టం అనే పదానికర్థం తెలీదు. ఆమె కళ్లకి లోకం ఎప్పుడూ రంగుల్లోనే కన్పిస్తూ వుండేది.

రాజియ్య వెంట వచ్చిన నాలుగేళ్లకి నెల తప్పిందని తెల్సినపుడు సంతోషించిన వాళ్లెవ్వరూ లేకపోయారు. చిత్రంగా గంగకి ఇన్నాళ్లకి తల్లి గుర్తుకొచ్చింది. ఏమైనా సరే తల్లి కాబోయే వేళకి తన తల్లి దగ్గరుండాలని అనుకుంది. ఆ మాటే రాజియ్యతో అంటే, "నీకేవైనా పిచ్చేటే, అంత దూర వెల్లాలంటే సార్జీలకి ఎంతుండాలో తెల్సా?" అన్నాడు. "ఆ అడవిలో ఏటుంటాది? ఇక్కడే మంచి ఆడ డాకటేరు కాడ పురుడు పోయిత్తాను"

అది జరిగే పని కాదని గంగ కెప్పుడో అర్థమైంది. రాజియ్య సంపాదించిన కొద్దో గొప్పో వాడి తాగుడుకే ఖర్చైపోతోంది. గంగ రెక్కలు ముక్కలు చేసుకుని ఆ కుటుంబాన్ని పోషించాల్సి వస్తోంది. వేణ్ణీళ్లకి చన్నీళ్లుగా వుంటాయని ముక్కుపచ్చలారని కుర్రాళ్ళకి కూడా పావలో అర్థో సంపాదించడం నేర్పింది. గంగకి ఏడో నెల వచ్చేక రాజియ్య అర్థాంతరంగా కన్ను మూసేడు. అప్పుడు కూడా గంగ బెంబేలెత్తిపోలేదు. చుట్టూ మనుషులుంటే చాలు, ఆమె రెక్కలే ఆమెకి ధైర్యం. బోడమ్మకి, పిల్లలకి గంగే ధైర్యం చెప్పింది. ఆ గుడిసెల్లోని నలుగురూ కలిసి శవాన్ని మోసుకుపోయేక పది గుడిసెల్లోంచీ పది గుప్పిళ్ళ బియ్యం అడిగి తెచ్చి, అన్నం వండి ఆ తల్లీ పిల్లల చేత తినిపించింది.

అలాంటి గంగకి రోజా ఈ ఒంటరితనం బెంబేలెత్తిస్తోంది. నాలుగేళ్ల నించి ఇక్కడే బతికినా, ఊరేంటో పరాయిదిగా అన్పిస్తోంది. తెలిసున్న ముఖం ఒక్కటీ లేనట్టు అన్పిస్తోంది.

క్రమంగా చినుకులు పెద్దవై వాన జోరందుకుంది.

కళాకేంద్రం ముందు వెంకటేశ్వరాలయం కడుతున్న కూలీలంతా వరండాలలోకి పరుగెత్తుకొచ్చి పడ్డారు. అలా మొదలైన వాన సాయంకాలం వరకూ ఎడతెరిపి లేకుండా కురుస్తూనే వుంది.

వాళ్లందర్నీ చూస్తే గంగకి ఏదో ఆశ కలిగింది. మేస్త్రీ దగ్గరకెళ్ళి రేపట్నుంచి తనకి కూడా పని ఇప్పించమని అడిగింది.

మేస్త్రీ ఆమెని ఎగాదిగా చూసి "నువ్వు చేసే పని కాదులే ఇది, ఎల్లెల్లు" అన్నాడు. "అయినా పొద్దున్న రేడియోలో సెప్పేరు, ఈ వాన ఇప్పుడప్పుడే తెరిపియ్యదంట"

ఆ వానలో తడుస్తూనే క్రమంగా అందరూ వెళ్ళిపోయేరు. గంగ మళ్ళీ ఒంటరిగా మిగిలిపోయింది.

నిన్న బజార్లోనూ ఇదే వరస. తను బరువులు మొయ్యలేకపోతూందని, త్వరగా నడవలేకపోతూందని షావుకారు కేకలు పెట్టడు. "మా ప్రేణం తియ్యకపోతే ఆ బరువేదో దింపుకున్నాక రారాదూ" అన్నాడు తన కడుపు కేసి చూస్తూ.

"ఆ సచ్చినోడలా వాగితే మాత్రం నాకిది బరువెలా అవుతాది? నా బిడ్డ, నా రగతంలో రగతం, ఇక మీద ఈడే కదా నాకు తోడూ నీడా" అనుకుంది ఆప్యాయంగా కడుపు వేపు చూసుకుంటూ. "ఆడికి అన్నం తినే వయసొచ్చేక గాజుపళ్లెంలోనేఅ న్నం తినిపించాలి" అనుకుంది గర్వంగా. అందర్లాగా ఆడు సత్తుగిన్నెల్లో తినడు.

టైమెంతైందో గాని మబ్బులు దట్టంగా మూసేసి పొద్దుగూకినట్టే వుంది. కడుపులో కదిలికదిలి ఇక ఓపిక లేనట్టు ఆగిపోయింది బిడ్డ. పొత్తికడుపు బిగబట్టుకుపోయి నట్టుంది. ఆకలికి శోషొచ్చినట్టైపోతోంది. గంగని తన కడుపులో ఆకలి కన్నా, బిడ్డ కడుపులో ఆకలి ఎక్కువ బాధిస్తోంది. ఏ వేడి గంజో పోసి బిడ్డని లేపాలి. కడుపులో బిడ్డ కదలకపోతే ప్రమాదం అని బుచ్చిది చెప్పిన మాట గుర్తుకొచ్చి వణికిపోయింది.

ఎవరైనా అడిగితే గుప్పెడన్నం పెడతారేమో అన్పించింది. కాని, దరిదాపుల్లో ఎక్కడా ఇళ్లేలేవు.

పగలంతా పడుకున్న అప్సరాలాట్టి గదులు రాత్రికి లైట్లతో సింగారించుకుంటున్నాయి. ఆ పక్క హొటల్లోంచి వస్తున్న కమ్మని పోపుల పరిమళానికి గంగకి నోట్లో నీళ్లూరి పోతున్నాయి.

ఇంకా పొద్దుగూకితే వాచ్‌మేన్ అక్కడుండనియ్యడని గంగకి తెలుసు. హోరున కురుస్తున్న ఆ వర్షంలో మూటని పదిలంగా గుండెకి హత్తుకుని మెట్లు దిగింది గంగ. కళాకేంద్రం గేటు ముందుండే తోపుడు బళ్ళ దుకాణాల జాడే లేదు. ఎటుపోవాలో దిక్కు తోచక తడుస్తూ గేటు ముందు ఆగిపోయింది. పాత పోలీస్ క్వార్టర్స్ వైపు వెళ్ళి కాస్త గంజి అడుక్కుందామని నిశ్చయించుకుంది. అగ్నిపూల చెట్ల కింది కొచ్చాక కాలు కదలక అలా నిలబడిపోయింది.

వీధుల్లో ఎక్కడా జనసంచారం లేదు. నిన్న ఈ సమయానికి అక్కడ జన నివాసాలుండేవి అంటే ఎవరూ నమ్మలేరు. అప్పుడే పశువుల సంత ముగిసి నట్టుంది. ఆ ప్రాంతమంతా. వదిలేసిన చింకి పాతలూ, పగిలిన కుండపెంకులూ, పెంటపోగుల్తో వానకి తడిసి పరమ రొచ్చుగా వుంది. గుడ్డి తాత ఇటికల పొయ్యి మాత్రం నదిలో సగం మునిగి ధ్యానంలో వున్న యోగిలా వుంది.

గంగ మనసు మార్చుకుని కుడి పక్కకి తిరిగి స్టేషన్లోకి నడిచింది. అడుగు తీసి అడుగేస్తూంటే కుడి డొక్కలో కలుక్కుమంటోంది. అది ఆకలి నొప్పని ఆమెకి తెలుసు. పస్తులుండడం ఆమెకి కొత్తేమీ కాదు. కాని, ఈరోజు ఈ ఆకలి దుర్భరంగా వుంది. బిడ్డ కదలని స్పృహ ఆమె గుండెని నొక్కేస్తోంది. కొత్తగా కట్టిన స్టేషను ఆవరణలోకి అడుగుపెడుతూనే ఒక నిర్ణయానికి వచ్చి, ఆమె కళ్లు గన్నిగాడి కోసం వెతికాయి. ఈ చివరి నుంచి ఆ చివరి దాకా కాళ్ళీడ్చుకుంటూ తిరగింది గంగ. 'ఒకవేళ అవతల ప్లాట్‌ఫాం మీదున్నాడేమో' అనుకుంది. బ్రిడ్జి ఎక్కి దిగే ధైర్యం చెయ్యలేకపోయింది.

ఏదో బండొస్తున్నట్టుంది. స్టేషన్లో అలజడి పెరిగింది.

ఆ జనం మధ్య పిచ్చిదాన్లా తిరుగుతోంది గంగ. మధ్య మధ్య క్రీనీడలో నిలబడి కడుపు తడివి చూసుకుంటోంది. ఉహు, బిడ్డలో చలనం లేదు. ఆమె అమ్మ మనసు తల్లడిల్లిపోతోంది. ఇంకా నేల మీద పడని, రూపం కూడా తెలీని బిడ్డకోసం ఆమె హృదయం ఒకటే కొట్టుకుంటోంది. ఇప్పుడింక వాణ్ణి బతికించుకోడానికి ఏం చెయ్యడానికైనా సిద్ధమే.

టీ తాగే డబ్బులైనా దొరుకుతాయేమోనని ప్రయాణీకులు ఒకళ్లిద్దరు దగ్గిర చెయ్యి చాపబోయింది. అలవాటు లేని పని – ఆమె చెయ్యి వెనక్కి వచ్చేస్తోంది. బండొచ్చే తొందర్లో ఎవరూ గంగని పట్టించుకోవడం లేదు.

ఒకళ్లిద్దరు పోర్టర్లని గన్నిగాడి కోసం అడిగి చూసింది. పొద్దుపోయేక అణ్ణెవరూ చూళ్లేదన్నారు. అన్నోరంగాడైతే "ఏంటి సంగతి" అని కన్నుకొట్టి వెకిలిగా నవ్వేడు. దిక్కుతోచక గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ క్రీనీడలో అలాగే చతికిలబడిపోయింది. వాన కొంత తెరిపిచ్చింది. 'తొమ్మిదో పదో అయ్యుంటాది' అనుకుంది గంగ. పాత బ్రిడ్జి మీంచి రోకలి బండలాగా పొక్కుంటూ వచ్చిన బండి కీచుమని గోలపెడుతూ స్టేషన్లో ఆగింది. ఆగిన బండిలోంచి రెండు సూట్‌కేసులు నెత్తిన పెట్టుకుని దిగేడు గన్నిగాడు. "ఇంటికెళ్లి కూడు తిని వస్తన్నాడన్న మాట" అనుకుంది. సత్తుకంచంలో తెల్లగా మల్లెపూలలాగా విచ్చుకున్న అన్నం కళ్ల ముందు కదిలింది గంగకి. ఆకలి రెట్టింపయింది.

బండెళ్లిపోయేక స్థిమితంగా గంగ కూచున్న చీకటి స్తంభం దగ్గరికొచ్చేడు గన్నిగాడు. "సందేల నించి నన్నడుగుతున్నావంట, ఏంటి సంగతి?" అన్నాడు కళ్లు చికిలించి చూస్తూ. వెలుగులో నిలబడి వున్న వాడి కళ్లు ఎర్రజీరల్తో చిరతపులి కళ్లలా మెరుస్తున్నాయి. వాడు తాగి వున్నాడని అర్థమైంది గంగకి.

"ఏటి, సెప్పేవేటి" అన్నాడు వాడు విసుగ్గా. పొద్దున్న గంగ చూసిన ఛీత్కారపు చూపింకా మర్చిపో లేదు వాడు.

వీలైనంత అణకువని గొంతులోకి తెచ్చుకుని జాలిగా అంది గంగ – "ఏం లేదూ... ఆకలి... ఆకలేత్తా వుంది. ఒక బన్నూ, కాసిన్ని టీ నీళ్ళూ కొనిపెడతావేమోనని.." గంగ పరిస్థితి అర్థమైంది గన్నిగాడికి. ఆకలెలాంటిదో వాడికి బాగా తెలుసు.

"సరే, కొనిపెడతాననుకో, నాకేటి లాబం?" అడిగేడు కసిగా.

గంగ ఒక్క నిమిషం మౌనంగా వుంది. తర్వాత తెగించిన దానిలా అంది "నీకేం

కావాలో తీసుకో..." ఆమె స్వరం కీచుగా జీరబోయింది.

"అయితే నాతోరా" ఎగిరి గంతేసినంత హుషారుగా అన్నాడు గన్నిగాడు.

లేచి వాడి వెనకే నడిచింది గంగ. ఇంకా తవ్వుతూ తవ్వుతూ వున్న అండర్‌గ్రౌండు గుయ్యారంలోకి వాడు దారి తియ్యడం చూసి ఆగిపోయింది.

"ఉప్పుడు కాదు... ముందు నాకు తిండి కావాల"

గన్నిగాడు వెనక్కి తిరిగి నోట్లో బీడీని తుపుక్కున ఉమ్మేసేడు.

"అదేం కుదర్దు. ముందునా అవసరం తీరేకే నీ ఆకలి తీరతాది" నిర్ణయించుకో అన్నట్టు నిర్లక్ష్యంగా చూసేడు. వాడి గొంతులోని పట్టుదల అర్థమైంది గంగకి.

నిస్సహాయంగా కదిలింది. మోకాళ్ల లోతున్న వాన నీళ్లలోంచి చీకట్లోకి నడిచి నాలుగేళ్లుగా పెంచుకున్న కసితో ఒక్కసారిగా పులిలా మీదికి లంఘించిన గన్నిగాడి బరువుకి మొదలు నరికిన చెట్టులా వెల్లకిలా పడిపోయింది గంగ.

వెన్నులో పెటిల్లుమని ఏదో చిట్లినట్టైంది.

పదిలంగా గుండెలకి హత్తుకున్న గాజుపళ్లెం విరిగి వెయ్యి ముక్కలైంది.

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 28–2–92**

# గూడు

## కాట్రగడ్డ దయానంద్

ఈ సంవత్సరం మబ్బులు బాగా అదనులో వచ్చిపడ్డాయి. భూమి తల్లి పదను అయ్యేట్టు మోయినంగా కురిసిపోయింది వాన. వానలు పడినప్పుడు సలిమిడి ముద్దలా అయి నాలుగు ఎండలు కాసేటప్పటికి నేలనేలంతా కొత్త కాగితంలా పెళపెళలాడింది. ఈమూడు నెలలూ తీరిగ్గా కూర్చున్న రైతులందరూ కోలాహలంగా ఎవరి పనుల్లో వాళ్ళు పడ్డారు. మూడునెల్ల విరామం అనంతరం మళ్ళీ నిరంతరం శ్రమలోకి దిగేరు రైతులు. విత్తనపు గింజలు సిద్ధం చేసుకుని ఎరువు కువ్వలు జల్లేరు. అరకలు కట్టేరు.

చ్చోచ్చో..... డుర్ర్.... చ్చొచ్చొ..... డుర్ర్....

వెంకటేశ్వర్లు ఒక్క నిమిషం అరకను ఆపి నిల్చుని చుట్టూ చూసేడు. పొలాల్లో కొందరు చద్దన్నాలు తింటున్నారు. కొందరు అరకలు ఆపి చెట్ల క్రింద సేద తీరుతున్నారు. ఊరి బాటవైపు పరికించేడు దూరాన నెత్తిమీద సద్ది దుత్తల్ని పెట్టుకొని ముగ్గురు నలుగురు ఆడవాళ్ళు కదిలి రావటం లీలగా కనబడుతుంది.

తలగుడ్డ తీసి విదిలించి మళ్ళీ చుట్టుకొన్నాడు. పైన కరకరలాడుతున్న ఎండని చూసేడు. మళ్ళీ ఎద్దుల్ని అదిలించేడు. మువ్వల శబ్దంతో కదిలేయవి. నేల పాయలు పాయలుగా చీలి పుస్తకంలోని పేజీలు తెరుచుకున్నట్లుగా విడిపోతుంది. అరక వెనకే రెండు మూడు కొంగలు మెడల్ని చిత్రంగా కదిలిస్తూ పురుగుల్ని ఏరుకుంటూ కదుల్తున్నాయి. జెముడు కాకి ఒకటి ఆ చివర గట్టు వెంట పురుగుల కోసం వెంపర్లాడుతూ కలియతిరుగుతోంది.

నడుస్తున్న ఆడవాళ్ళు చేరువయ్యారు. వెంకటేశ్వర్లు భార్య సుజాత చేలోకి నడిచి కుంట ఒడ్డున జమ్మి చెట్టు క్రింద నెత్తిమీంచి అన్నం గిన్నెల్ని దింపింది. ఆమె తోడికోడలు రమణమ్మ ఇంకో ఇద్దరూ వీళ్ళను దాటుకుని వెళ్ళిపోయేరు.

"రాయ్యా! పొద్దెక్కింది" అంది సుజాత. వెంకటేశ్వర్లు అరక ఆపి ఆమె వైపు తీక్షణంగా చూసేడు.

"పొద్దెక్కిన సంగతి తెలుస్తానే ఉంది. ఒకళ్ళకు నలుగురాడోళ్లండి సద్దికూడు తేడానికి నడిజామైంది. ఏం ఉద్ధరిస్తున్నారే ఇళ్ళకాడ" గట్టిగా అరిచేడు వెంకటేశ్వర్లు.

సుజాత ఏమి సమాధానం ఇవ్వకుండా గిన్నెలో చింతకాయపచ్చడి అన్నం కలుపుతోంది. వెంకటేశ్వర్లు కుంటలోకి దిగి కాళ్ళు చేతులు ముఖం కడుక్కుని కండువాతో తుడుచుకుంటూ చెట్టు క్రిందకు చేరేడు. వాళ్ళిద్దరికి జమ్మిచెట్టు నీడ చాలీచాలకుండా పంచుతోంది. ఇంతకు ముందు అక్కడో గంగిరేగు చెట్టుండేది. పొలం పన్లకని బండి చేయించడానికని ఉన్న నీడను కొట్టివేశారు. అది మొన్నటి వానలకు చిగురిస్తోంది.

వెంకటేశ్వర్లు రెండుచేతులూ చాపి దోసిలిపట్టి ఒక పెద్ద ముద్దను అందుకున్నాడు. మజ్జిగన్నం కూడా దోసిలితో తాగి చుట్టచుట్టడంలో మునిగిపోయేడు.

ఎద్దులు రెండూ నెమరు వేస్తున్నాయి. దాపటి ఎద్దు మెడమీద కాడితోనే క్రింద కూలబడింది. పొలాలన్నీ చదరంగా నల్లగా నిగనిగలాడుతున్నాయి.

"ఎందుకంత లావు నరుస్తావ్! మీ అమ్మ ఇయ్యాల పొద్దెక్కిందాక మంచందిగల. ఒకామెకు నీళ్ళపని, ఇంకోకామెకు వంటపని, నాకేమో పిల్లల్ని సముదాయించి, బట్టె గొడ్లకాడ బాగుచేసి తెమిలి వచ్చేసరికి ఈ వేళైంది"

సుజాత భర్తను చూస్తూ అంది.

"అవుద్దే! ఏవేళైనా అవుద్ది. తోటోళ్ళు ఎప్పుడు సద్ది తాగేరు, నేనెప్పుడు తాగేను. అంటేనేమో అంతలావున రోషం" కోపంగా అన్నాడు వెంకటేశ్వర్లు.

"నిజమేనయ్యా! సద్దికూటి కాలసమైతే ఆగలేవని నాకూ తెలుసు. అయితే ఏం చెయ్యమంటావ్? తోటోల్లకేం? ఎవరి సంసారాలు వాళ్ళవి. మన్లాగ ఇంకా కలిసి కాపరాలు వెలగబెడుతున్న వాళ్ళను చూపించు ఊళ్ళో?" అంత తీవ్రంగా నిలదీసింది సుజాత.

వెంకటేశ్వర్లు చుట్ట నోట్లో పెట్టుకుని వెలిగించేడు. "వేరు కాపురం పెట్టి చూడు. నీకు మాత్రం వాళ్ళతో పాటు సద్దికూడు ఎట్టారాదో సుద్దువుగాని" తనే పొడిగిస్తూ అంది సుజాత.

"సంవత్సరం నుంచి చూస్తున్నాను. ఊ అంటే నీకిదే పాట. నలుగురు కల్సుంటే ఉండే ఆనందం నీకు తెలవడం లేదే" అన్నాడు వెంకటేశ్వర్లు. నేలమీద గడ్డిపైన కండువా పరచి నడుం వాల్చుతూ.

"అవును. ఇదిగో ఇదే ఆనందం సూస్తున్నాంగా! పొద్దస్తమానం చాకిరీ చేస్తే పచ్చడి ముద్ద గూడా వేళకు గతి లేకుండా ఉంది. నిరుడు నీ అన్న కూతురు సమర్తాడితే అప్పుచేసి అదో అయిదువేలు ఖర్చు. మీ అమ్మ ఈ ఏడు ఇంకో పాతికో ముప్పాతికో పెట్టి ఆ పిల్లకు పెళ్ళిచేసే ఆలోచనలో కూడా ఉంది. ఎట్టయినా పెద్ద మనవరాలు గదా! ఇయ్యన్నీ సూత్తానే ఉండు. మన పిల్లలు ఎక్కొచ్చేసరికి చిప్ప చేతికి వచ్చుద్ది" కోపంగా అంది సుజాత.

"చస్! నోర్మూయ్యి, దరిద్రం! కదిలిస్తే చాలు కమురు గబ్బులేపుతావు" అన్నాడు వెంకటేశ్వర్లు.

"నువ్వెందుకయ్యా నన్ను కదిలించడం గబ్బుకొట్టించుకోవడం. రేపు నీ కొడుకులు పెద్దయితే నీకే తెలుసుద్దిలే. అవతలేమో నీ తమ్ముడూ, మరదలేమో ఇళ్ళు కదలరు. ఇవతల నీ అన్నగారి పిల్లలు ఎక్కి వస్తుంటే వాళ్ళ ముద్దూ ముచ్చటలు బాగానే తీరతాయి. ఇయ్యాల పంచుకున్నా తలా పదివేలకు తగ్గకుండా అప్పు మిగులుద్దా లేదా? పొద్దస్తమానం

రెక్కలు ముక్కలు చేసుకున్నా రైకగుడ్డ కావాలన్నా మీ అమ్మ కొట్టుకుపోయి తేవాల్సిందే. ఇంట్లో పాలే కదా అని పుట్టింట్లో అలవాటు చొప్పున ఎప్పుడన్నా ఒకకప్పుడు కాఫీ పెట్టుకుని తాగితే పిల్లలకియ్యలేదని ముసలమ్మ తగువులాట పెట్టుకునే! ఏం బతుకో ఏమో? ఒక పండగా లేదు. ఒక సినిమా లేదు. అదేం చోద్యమో. ముసలామెకు ఇంకా పెత్తనం మీద మోజు తీరకపోయె? ఇంట్లో మొగుడు పెళ్ళాలు కలుసుకోవాలన్నా ఆమె సలహానే అయితే ఎట్లా? నిన్ను మాత్రేనేమో పెళ్లాం మాట ముచ్చట పట్టకుండా ఉంటివి!" ఏడుపు గొంతుతో తనేం మాట్లాడుతోందో తనకే తెలియకుండా కలగాపులగంగా మాట్లాడుతోంది సుజాత.

"అబ్బబ్బా! కాసేపన్నా యిశ్రాంతిగా కూర్చోనియ్యవుగదే. ఎప్పుడు చూచినా ఏడుపు మొహం నువ్వూ! అయితే ఏంది నువ్వనేది?"

"రామ్మాయణమంతా ఇని సీతేమవుద్ది అన్న సామెతగా ఉంది నీ యవ్వారం. నువ్వట్టనే సూత్తా ఉండు. పెళ్లిళ్లకనీ పురుళ్లకనీ అప్పు పెరిగిపోయిద్ది. నా బిడ్డలు దున్నుకుని బతకడానికి కూడా కాస్తంత మడిచెక్క కూడా మిగలదు. నువ్విట్టనే ఏమీ పట్టకుండా ఉండు. ఈసారి కుప్పలప్పుడైనా వేరుపడక పోతే నేనూ నా బిడ్డలు ఇంత ఎండ్రిన్ తాగి సస్తాం" ఏడుస్తూ బెదిరించింది సుజాత.

"ఇదెక్కడి గోలే నీది! నిద్దర లేచిన కాడ నుంచి వేర్లు పడే రంధి తప్ప ఇంకేం ఉండదుకదా!" అని లేచి క్రిందున్న కండువా తీసి విదిలించి తలగుడ్డ చుట్టేడు.

దూరాన కనకమ్మ బఱ్ఱెగొడ్లను తోలుకు వస్తూ కనపబడింది అతనికి. అరకకాడికి పోయేవాడల్లా చేరువకు వచ్చేదాకా ఆగాడు. సుజాత ఆమెను చూచి కళ్ళనీళ్ళు తుడుచుకుంది. కనకమ్మ బఱ్ఱెగొడ్లను నిలేసి ఒకసారి పొలంవైపు తేరిపార చూచి

"ఎగదాల చేనుకూ అరక రేపటికి అయిద్దేమోరా! అరక ఇప్పినాక సొసైటిలో ఎరువులిస్తామన్నారు. తెచ్చి ఇంటికాడ వెయ్యి" అందామె.

"ఎస్తాగాని బాగా లేకుండా పొలమెందుకే రావడం. ఆ కాలు వాపు తగ్గకుండానే పరుగెత్తుకొచ్చేవెందుకు. నాలుగురోజులు కదలకుండా ఇంట్లో ఉంటే నన్నా తగ్గేదేమో. పంతులు మందులకి తగ్గకపోతే ఒంగోలు పోయి చూయించుకోకూడదూ" అన్నాడు వెంకటేశ్వర్లు.

"సర్లేరా! పనులరోజుల్లో కూర్చుని తింటానికి మనకెట్టా కుదురుద్ది చెప్పు. ఎరువుల సంగతి మర్చిపోబాకు. పాలుమాలితే అయిపోయినాయంటారు" అంటూ కదిలింది కనకమ్మ.

వెంకటేశ్వర్లు పడుకున్న ఎద్దుని లేపి అరకను కదిలించేడు. సుజాత బఱ్ఱెగొడ్లకు గడ్డిదోకటానికి దోకుడు పార తీసుకుని గట్టుమీదకి నడిచింది.

★ ★ ★

కనకమ్మకు ముగ్గురు కొడుకులు, ఒక్క కూతురూను. కూతుర్ని ఊళ్ళోనే ఇచ్చింది. మూడోవాడి పుట్టుకలప్పుడే పెనిమిటి దిక్కుమాలిన రోగమొచ్చి నెలరోజులు మంచంలోనే ఉండిపోయేడు. ఆ నెలరోజులూ పెనిమిటి మంచాన్నే అట్టిపెట్టుకుని

తిరిగిందామె. గొడ్డు, గోదా, పిల్లా, జెల్లా సర్వమూ మర్చిపోయిందామె. వేళకు తిండి కలిపి ముద్దలు నోటికందించింది. ఒంటేలుకు బొచ్చె పట్టింది. ముడ్డి కడిగింది. మనిషి మంచం దిగకపోయినా వేడినీటితో పూటపూటా ఒళ్ళు తుడిచి ఎంతో శుభ్రంగా ఉంచింది.

ఆయన కన్నీళ్ళు కార్చి కార్చి వెళ్ళిపోయేడు. కడుపుతో ఉండే ఇవన్నీ చేసిందామె. ఆయన పోయాక పిల్లల్ని దగ్గరకు తీసుకుంది. కర్తవ్యం గుర్తు చేసుకుంది. ఎంతోమంది అవకాశం ఉందికదా అని దగ్గరకు చేరాలని చేరదీసి చేరువకావాలని చూచేరు. అందర్నీ నవ్వుతూనే తిరస్కరించింది. కోరికల్ని వ్యాపకాలతోనే విరిచేసింది. నిప్పులాంటి కనకమ్మ అనిపించుకుంది లోకంచేత.

నాగలి పట్టింది. పొలం దున్నింది. పైరులేసింది. కుప్పలు తొక్కిచ్చింది. బండితోలింది. మగాడి పనులన్నీ ఆడవాళ్ళు కూడా అవలీలగా చేయగలరని చేసి చూపించింది. నాలుగెకరాలు పొలాన్ని తన పిల్లల కోసం అదనంగా సంపాదించింది. అలాగని ఆమెకు దిగుల్లేదని అనుకుంటే అది పొరబాటే.

కూతురు పెద్దది కాగానే పెళ్ళి చేసి పంపింది. పెద్ద కొడుకులిద్దరకూ పెళ్ళి చేసింది. పెద్దవాడికి ఇద్దరు కూతుర్లు. రెండోవాడికి ఇద్దరు కొడుకులు. మూడోవాడికే పిల్లల్లేరు. ఆమె దిగులంతా వాడిదే.

వాడు పుట్టడమే అర్భకుడిగా పుట్టేడు. తెలివితేటల్లేవు. మాట తడబాటు ఎక్కువ. చిన్న చెవులతో పెద్ద ముఖంతో పుట్టటమే వికారంగా పుట్టేడు. తినటమేందో, తిరగటమేందో వాడు అంతే! పనిపాటలేం తెలియవు. పెళ్లి వయసొచ్చే వరకూ తనకేం పట్టనటూ ఊరంతా చెడ తిరిగేడు. వేళకు పెట్టిందేదో తినేవాడు. కొన్నాళ్ళకు పెళ్లి చేయమని గొడవ మొదలుపెట్టేవాడు. అందరూ వాడి మాటల్ని అంతగా పట్టించుకోలేదు. విని ఊరుకునేవాళ్ళు. వాడు మాటలతోనే ఆగలేదు. ఆడపిల్లలు కనిపిస్తే వెర్రిగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. ఊళ్ళో ఒకటిరెండుసార్లు పట్టుకుని వాడి ఉన్మాదం తగ్గేదాకా కట్టి పడేసేరు. వాడు అర్భకుడైనందుకే ఆమె బాధపడింది. దానికి తోడు వాడి ప్రవర్తనతో ఆమె మరింత కలత చెందింది.

పెళ్ళి చేయమని గొడవ పెట్టుకుని అలిగి ఒకసారి ఇంట్లోంచి వెళ్ళిపోయి ఎక్కడో దూరపు చుట్టాల ఊళ్ళోతేలాడు. పదిరోజుల తర్వాత ఆ ఊరు నుంచి కబురు వస్తే పోయి తీసుకొచ్చేరు. ఆ పదిరోజులు కనకమ్మ చుట్టుపక్కల తిరగని ఊరులేదు. అడగని వస్తీ లేదు. వస్తే అడిగితే పెళ్ళి చేయమని, చేస్తే బాగుపడతాడనీ చెప్పేరు.

వాడు అలా వెళ్ళి వచ్చేక కనకమ్మ పెద్దవాళ్ళిద్దరితో వాడి పెళ్ళి సంగతి ప్రస్తావించింది. వాళ్ళు ఒప్పుకోలేదు. "తానడవలేడు కాని మెడకో బండా" అన్నారు కోడళ్ళు. కనకమ్మకు కూడా అది సబబేననిపించింది. ఆ ఆలోచనను విరమించుకుంది.

రోజురోజుకు వాడి పిచ్చిచేష్టలు ఎక్కువయ్యేయి. కొడుకుని చూస్తుంటే ఆమె గుండె తరుక్కుపోతుంది. ఒకరోజు పెళ్ళి చేయటం లేదని నానా బీభత్సం చేసి ఎండ్రిన్ తాగేడువాడు. బతికి బయటపడేసరికి రెండువేలు వదిలేయి.

కనకమ్మ మళ్ళీ ఆలోచనల్లో పడింది. పెళ్ళి చేయకపోతే వాడు తనకు దక్కడని

తలచింది. నలుగురు కూతుర్లతో గింజాటన పడుతున్న తన అన్న దగ్గరకు వెళ్ళి కాళ్ళావేళ్ళా పడింది. ప్రలోభ పెట్టింది. వాళ్ళని ఒప్పించింది. ఎనిమిదో తరగతి చదువుతున్న మేనకోడలితో పెళ్ళి జరిపించిది. పసివయస్సుదా పిల్ల, పొలం పనులు అంతగా తెలీవు. ఎట్టానో వాడితో సర్దుకుపోతుంది. చిన్నపిల్ల కదా కనకమ్మ కూడా బాగానే చూసుకొనేది.

ఆ పిల్ల కాపరానికి వచ్చిన దగ్గర్నుంచి తోడికోడళ్ళిద్దరూ పనుల్లో వంతులు పెట్టుకోవడం ప్రారంభించేరు. అయిన పిల్లకదా అత్త ఆ పిల్లకు అరటి ఆకుల్లోనే పెడుతుందని చాటుగా అనుకునేవాళ్ళు. అప్పుడప్పుడూ కనకమ్మ చెవుల్లో ఈ మాటలు పడినా ఆమె విననట్లు ఊరుకునేది. కొడుకులు తన మాట జవదాటరని ఆమెకు గొప్ప నమ్మకం. వాళ్ళే నా చేతుల్లో ఉంటే కోడళ్ళదేముందిలే అన్నది ఆమె ధీమా!

పెద్ద కోడళ్ళిద్దరకూ వేర్లు పడాలనుందని మొదట్నుంచీ ఆమెకు తెల్సు. అది తెలియనట్లుగా ఆ ప్రస్తావనే రాకుండా జాగ్రత్త పడుతూ సంసారాన్ని గుట్టుగా నడిపిస్తోందామె. వేర్లు పడితె చిన్నాడి గతి ఏమిటన్నదే ఆమె బాధంతాను. తను బతికి ఉన్నన్నాళ్ళు అందర్ని కలిపి ఉంచగలిగితే తరువాత ఏమవుతారో ఎట్టవుతారో ఆ భారమంతా భగవంతునిదే కదా అనుకుందామె.

⋆ ⋆ ⋆

కుప్ప నూర్పిళ్ళ రోజులొచ్చేయి. అప్పటివరకూ పంటచూరుకింద తలదాచుకున్న భూమి ఎండ బాధ తట్టుకోలేక విలవిలాడుతోంది. ఎక్కడి పంటలక్కడ కోసి కుప్పలు పడ్డాయి. రైతులందరూ కల్సి కట్టుగా కుప్పల్ని తొక్కించుకుంటున్నారు.

ఆ ఏడు పంట కూడా బాగా పండింది. ఈ సంవత్సరమే మనవరాలి పెళ్ళి చేయాలన్నది కనకమ్మ ఆలోచన. వెంకటేశ్వర్లు ఆలోచన అందుకు భిన్నంగా ఉంది.

సుజాత చెప్పింది అతనికిప్పుడు సబబుగా అనిపిస్తోంది. ఆమె వాదనలో అతనికిప్పుడు నిజాలు కనబడుతున్నాయి. తల్లి ప్రవర్తన చాదస్తంగా కూడా అనిపిస్తోంది. నిజమే! తన కొడుకులు ఎదిగి వచ్చేసరికి అప్పులు తప్ప ఆస్తి మిగలదేమోనన్న భయం పట్టుకుంది. వాళ్ళను బాగా చదివించుకోవాలని వాళ్ళు తనలాగ ఎద్దుముడ్డి పొడుచుకునే వాళ్ళు కాకూడదని పట్టుదల పెరిగింది. పంచుకుంటే తలా నాలుగెకరాలు వస్తుంది. ఇంకో నాలుగెకరాలు కౌలుకు తీసుకుని ఇదే చాకిరీ తీసుకుంటే తను తన పిల్లలు మారాజుల్లాగా బతకొచ్చు. ఇప్పుడైతే తలా పదివేలు అప్పు వస్తుందేమో! ఇంకొన్నాళ్ళు పోతే అప్పే పంచుకుంటానో, ఆస్తి పంచుకుంటానో ముందు, ముందు ఎలా ఉంటుందో పరిస్థితి ఇది అతని ఆలోచన.

రేపు కుప్ప తొక్కిస్తారనగా ఆరోజు రాత్రి అందరూ అన్నాలు తిని కూర్చున్నాక తల్లితో అన్నాడు వెంకటేశ్వర్లు.

"అమ్మా! ఈ ఏడన్నా మేము ఎవుల్ల గెంజి వాళ్ళం కాచుకుంటామే" అన్నాడు నాన్చుడుగా!

ఆ మాటకే ఉలిక్కిపడింది కనకమ్మ. చిన్న కొడుకుని తల్చుకుని ఆపాదమస్తకం వణికింది. పెద్ద కొడుకు ఏ భావం లేకుండా మంచమ్మీద కూర్చుని ఉన్నాడు. చిన్నకోడలు చదువుతున్న పుస్తకం ప్రక్కన పెట్టి నిర్ఘాంతపోయి కూర్చుంది.

కనకమ్మ తేరుకుని "ఇది నీ పుర్రెకు పుట్టిన బుద్దేనంట్రా?" అని సుజాతను అనుమానంగా చూచింది.

"ఇప్పుడు నీకూ నీ పిల్లలకు ఏం తక్కువైందని నీ ఆలోచన. వేర్లుపడి ఊరక కూర్చుంటే నీ పెళ్ళాం తెచ్చి పెట్టద్దా ఏం నీకు తిండి?" అని కటువుగా నిలదీసింది కనకమ్మ.

"మధ్యలో నా ప్రస్తావనెందుకంట? కొడుకూ తల్లి క్రిందా మీద పడక" గొణుక్కుంటూ అవతలకు వెళ్ళింది సుజాత.

కనకమ్మ వ్యవహారాన్ని సాగదీయదలచుకోలేదు. నలుగుర్లో నానకుండా అన్ని వ్యవహారాల్లాగే దీన్ని వెళ్ళదీయాలని ఆలోచించింది.

"ఒరే పెద్దోడా ఇన్నావురా?" అందామె.

"వినేదేముందమ్మా? నువ్వెంత చెబితే అంత. ఇయ్యాల నేను వేరు పడతానంటే పెళ్లాం మాటలు విన్నాడని వెధవని నువ్వే అంటావు. వద్దంటే ఉమ్మడిగా ఉండి ఆడపిల్లల అచ్చటా ముచ్చటలు తీర్చి నా పిల్లల్ని అన్యాయం చేసేడని తమ్ముడంటాడు. ఏం చెప్పినా కష్టమే. ఇక మీ ఇష్టం" అన్నాడు పెద్ద కొడుకు.

పెద్దకోడలి వైపు చూచింది కనకమ్మ. ఆమె తలవంచుకుని లోపలకు వెళ్ళిపోయింది.

సరేరా! అట్టయితే ఆస్తిని కాదు. నన్ను మూడు భాగాలుగా వేసుకోండి అందామె కోపంగా.

"అమ్మా! నువ్వెన్నయినా చెప్పు! ఈ సంవత్సరం వేర్లు పడాల్సిందే" వెంకటేశ్వర్లు కూడా అంతే తీవ్రంగా అని బయటకు వెళ్ళిపోయేడు.

అంతటితో వదలకుండా ఆరోజురాత్రి పెద్దమనుషుల్ని నలుగుర్ని తీసుకొచ్చేడు ఇంటికి వెంకటేశ్వర్లు. వాళ్ళు కనకమ్మకు నచ్చచెప్పబోయేరు. వాళ్ళు ముందు తన గుమ్మం తొక్కటానికే వీల్లేదని శాసించింది. నా ఆస్తి నా యిష్టం మధ్యలో పంచటానికి మీరెవరని వాళ్ళని నిలేసింది. బయట నుంచి బయటనే తరిమింది వాళ్ళను.

ఆ రాత్రి పిల్లలు తప్ప ఆ ఇంట్లో పెద్దవాళ్ళెవరూ నిద్రపోలేదు. కనకమ్మ రాత్రంతా ఆలోచనల్లోనే గడిపింది. ఈ గొడవ ఇంతటితో పోదనుకుందామె. ఊర్లో నలుగురి నోళ్ళలో నానటం, చులకన కావటం ఇష్టం లేదామెకు.

మరుసటి రోజు ధనియాల కుప్పను తొక్కించేరు. తూర్పారబట్టేరు. ఏమనుకుందో ఏమో ముగ్గురు కొడుకులకూ మూడు భాగాలు కొలిచింది గింజల్ని. ఇల్లు తప్ప ఆస్తినంతా పంచింది. నాలుగు భాగాలులేసి తనకో భాగం తీసుకుంది. పేచి పెట్టకుండా ఆమె ఏది ఇస్తే అది తీసుకున్నారు కొడుకులు. మంచిరోజుల్లేవని ఇల్లు మాత్రం పంచలేదు.

ఒక గాలికెరటం విసురుగా వీచింది. వేపచెట్టు శిరస్సు జివ్వున వణికింది. ఆకాశాన సగం చంద్రుడు ఆకారం కూడా పోల్చలేని దిష్టిబొమ్మలాగా ఉన్నాడు. కప్పలు కీచురాళ్ళు కల్సి రాత్రి వాతావరణంలో ఒక నిరామయ సంగీత కచేరి నిర్వహిస్తున్నాయి.

వేపచెట్టుకు కట్టేసిన ఎద్దుల మెడలోని మువ్వల గంటల శబ్దం అవి నములుతున్న చొప్పదంటుల పరపర శబ్దంలో కల్సి వింతగా వినబడుతోంది. వేపచెట్టుకు కాస్త అవతలగా

ఉన్న ఆ ఒంటి నిట్రాడు పెంకుటిల్లు వెన్నెల్లో ఒక పురాతన మాంత్రికుడి గుహలా వెలుగుతోంది. ఇంటిముందు పందిరి కింద వేసుకున్న మంచాల్లో అందరూ ఆదమరిచి నిద్రిస్తున్నారు ఒక్క కనకమ్మ తప్ప.

కనకమ్మ మంచం మీంచి లేచి కూర్చుని చుట్టూ మంచాల మీద చూచింది. అందరూ నిద్రలో ఉన్నారు. కొందరు ప్రశాంతంగా, కొందరు గురకతోనూ నిద్రిస్తున్నారు. తెల్లటి జుట్టూ, ఇప్పుడిప్పుడే వంగిపోతున్న నడుమూ, కొద్దికొద్దిగా ముడుతలు పడ్డ దేహమూ.... ఆమె మాంత్రికుడు పట్టి బంధించి తెచ్చిన రాజకుమారులకు కాపలా కాస్తున్న ముసలి శిష్యురాలుగా అనిపిస్తోంది ఆ గుడ్డి వెన్నెల్లో.

కనకమ్మ మంచం కిందికి వంగి తన చేతికర్రను అందుకుని లేచి నిలచింది. పంచలో గోడవార ఉంచిన కర్రను తీసుకుంది. మెల్లిగా నడుస్తూ వేపచెట్టుకు అవతలగా ఉన్న పంచాయితీ మిద్దెలో అప్పటిదాకా ఏం చేసిందో గాని ఒక మచ్చలపిల్లి ఆ మిద్దె కిటికీలోంచి బయటకు దూకింది. ఉలిక్కిపడిందామె.

'నీ మొదులార భయపెట్టేవు కదే' పారిపోయిన పిల్లివైపు కర్రతో ఆడిస్తూ అంది. మెల్లిగా మంచం దగ్గరకు వెళ్ళి కూర్చుని పక్కకింది పుగాకు కాడను బయటకు తీసింది. దాన్ని పాయలు పాయలుగా వలిచి నడిమి కాడను చీల్చి చుట్ట చుట్టింది. నోట్లో పెట్టుకుని చుట్ట చివర కొరికి ఊసింది. మంచం అవతలగా పడుకున్న పెద్ద కొడుకుని కర్రతో తట్టి "ఒరే పెద్దోడా! లే! లెగు గొడ్లకు కాస్త మేతెయ్యి" అంది. వాడు ఆవులిస్తూ పైకి లేచి వామివైపు, నడిచి చొప్పదంట్లు దూసి కత్తెరకింద వేసి తెగ్గొట్టి ఎద్దులకు వేసేడు. ఇంకాస్త బర్రెగొడ్లకు విదిలించేడు.

"ఒరే! ఆ పొయ్యిలో నిప్పుందేమో ఇటుతేరా! అంది కనకమ్మ. వాడు పొయ్యిలోని బూడిదలో వెదికి వెదికి ఒక నిప్పురవ్వను పాత సిల్వరు గంటెలో వేసుకుని బూడిద ఊదుతూ తీసుకొచ్చేడు.

ఆమె "ఒప్పు! బక్!బకో మని చివర నలుపుతూ చుట్ట వెలిగించుకుంది.

"ఒసే రమినీ! లే!" అంటూ పిల్లల పక్కన పడుకున్న పెద్దకోడలు రమణమ్మను లేపిందామె. ఆమె లేచి జారిపోయిన జుట్టు ముడిని వేసుకున్నాక

'ఇదిగో! తాళం చెవి తీసుకుపో' అంది. అది తీసుకుని ఇంటి తలుపు తీసింది కోడలు. వెనకే ముసలమ్మ పెద్దకొడుకూ ఇంట్లోకి చేరి తలుపేసుకున్నారు. మధ్య నిట్రాడు నుంచి నాలుగు వైపులకు విస్తరించి ఉంది ఆ ఇల్లు. ఒక్కటే గది అయినా విశాలంగా ఉంది. ఇంట్లో ఒక పక్కన ఒకదాని మీదుగా ఒకటి ధాన్యం బస్తాలు వేసి ఉన్నాయి. ఇంకో పక్కన భోషాణం పెట్టె, పాత గుడ్డల మైలపెట్టె, వేలాడుతున్న దండెమూ, కింద ఒక మూలగా దొర్లాడుతున్న గిన్నెలూ, చెంబులూ, ఇంకోపక్క ఒకే ఒక్క మంచమూ వేసి ఉన్నాయి. ఇల్లంతా ఇరుకు ఇరుకుగా ఉంది.

బయట ముసలమ్మకు కుడివైపు మంచమ్మీద రెండో కొడుకు వెంకటేశ్వర్లూ వాడి కొడుకూ, ఆ పక్క మంచమ్మీద వాడి పెళ్లాం సుజాతా ఇంకో కొడుకూ పడుకుని ఉన్నారు. ఎడమ పక్క మంచాల మీద ముసలమ్మ చిన్న కొడుకూ, కోడలూ పెద్ద కొడుకు

కూతుర్లూ పడుకుని ఉన్నారు.

ఆ మంచాల కవతలగా పాటి మట్టి తోలి ఉంది. ఆ ఇంటి గోడకానించి కొత్తగా అల్లిన వెదురు తడికెలు నిలబెట్టి ఉన్నాయి.

ముసలమ్మ చుట్ట పొగను బయటకు వదుల్తూ వాటివైపు చూచి నిట్టూర్చింది.

తెల్లారితే ముగ్గురు కొడుకులూ కల్సి ఆ ఇంటిని మూడు ముక్కలు చేసి పంచుకుంటారు. నిన్నటి నుంచి కనకమ్మ కంటి మీద కునుకు లేకుండా ఉంటోంది. తనూ తన పెనిమిటీ కల్సి రాత్రింపగళ్ళూ తేడా తెలీకుండా కూలివాడి అవసరమే రాకుండా మట్టితోలి, పిసికి కష్టం చేసి అపురూపంగా కట్టుకున్న ఇల్లది. కప్పుకు వెయ్యటానికి చెట్టెక్కి వేపాకుని కోసింది. వెదురు బొంగుల్ని పెండేలుగా చీల్చింది. ఇల్లు కప్పుతున్న పెనిమిటికి పెంకులు అందించింది. గోడలక్కావాల్సిన ఇటుకల్ని తనే స్వయంగా బట్టీ పెట్టి కాల్చింది. అటువంటి ఇంటిని తన కళ్ళముందే మూడు ముక్కలు చేయటాన్ని ఊహించలేక పోతోందామె.

ఎక్కడో కుక్క బొంగురు గొంతుతో అరుస్తోంది. రోడ్డు మీద కదిలి వెడ్తున్న బండిగీరల శబ్దం గరగరా వినబడుతోంది. తల్లిపాలు చాలని పిల్లవాడి ఏడుపు ఎక్కడి నుంచో బయల్దేరి ఆ ఊరి రాత్రిని ఒక్క కుదుపు కుదుపుతోంది.

ఎప్పుడొచ్చి పడుకున్నారో పెద్దకొడుకూ, కోడలు. వాళ్ళ వాళ్ళ మంచాలమీదకి చేరేరు. కనకమ్మ తన మంచం మీద తడిమి తాళంచెవి చేతికి తీసుకుని రెండో కోడలిని లేపింది.

"అమ్మాయి సుజాతా! లేచి కాసిని మంచినీళ్ళియ్యమ్మా నాకు" అంది కోడల్ని కర్రతో తట్టి. లేచి రోజులానే అత్తను చురచురా చూచి తాళం చెవి అందుకుంది. చెంబునిండా మంచినీళ్ళు తెచ్చి ముసలమ్మ మంచం కింద పెట్టింది. ఆమె మొగుడు మంచం దగ్గరకు వెళ్ళి మెల్లిగా అతడ్ని తట్టింది. వాడు నిద్రమత్తులో అటు తిరిగి పడుకున్నాడు. మళ్ళీ కుదిపింది. "పడుకో గమ్మునన" అని విసుక్కున్నాడు వాడు. సుజాత తన మంచం మీదకు చేరిన క్షణాల్లోనే నిద్రలోకి జారుకుంది.

కనకమ్మ ఇదంతా ఓరకంట గమనిస్తూనే ఉంది. సుజాత చురచుర చూపుల్లో ఆమె చాలారోజుల్నుంచి చాలా అర్థాల్నే గమనిస్తూంది. "మొగుడూ పెళ్ళాలు కలుసుకునే దగ్గర కూడా నీ పెత్తనమేంది మధ్యలో" అన్న చూపుంది, ఒక స్వేచ్ఛను కోల్పోయిన అసహనమూ, "చూస్తుండు ఎప్పుడో అగ్నిపర్వతమై పేలతాను" అన్న హెచ్చరిక కూడా ధ్వనిస్తూంది ఆమెకు ఆ చూపులో.

అప్పటికే ఒకటి రెండుసార్లు "అత్తా, రాత్రులు హాయిగా నిద్రపోక మెలకువతో ఉంటావెందుకు" అని సుజాత పరోక్షంగా అడిగితే "పిల్లా! నా బాధ నీకు తెలవదులేవే" అని కనకమ్మ కొట్టి పారేసేది. సుజాత ప్రవర్తనను అతి తెలివిగా అంచనా వేసిందామె.

పెద్దకొడుకు పెళ్ళి చేశాక వాళ్ళు రోజూ ఇంట్లోనే పడుకునేవాళ్ళు. రెండో వాడి పెళ్ళి చేశాక కనకమ్మకు దిగులు కమ్ముకొచ్చింది. ఉన్నదా వేరు గదిలేని ఇల్లాయె! అప్పట్నుంచి ఆమెకు పెద్ద ఇల్లు కట్టలేకపోయాననే బాధ మనసులో ప్రవేశించింది. అట్లని

తాహతుకు మించి అప్పులు చేసి ఇల్లు కట్టదలచుకోలేదామె. అప్పటి నుంచి రోజూ రాత్రులు ఇదే దినచర్య అయింది ఆమెకు. వానొచ్చినా వరదొచ్చినా వెన్నెల కురిసినా, చీకటి ముసిరినా కొడుకూ కోడళ్ళకు ఇలానే ఏకాంతం కల్పిస్తుందామె.

ఆమె ఏకాంతం కోసం అల్లాడిపోయే ఎన్నో జంటల్ని తన చిన్నతనాన్నించి చూచింది. ఎక్కడా కలుసుకునే వీలు చిక్కక పంటచేలల్లో గడ్డివాముల్లో ఆఖరుకు గొడ్లకొష్టాల్లోనూ ఏకాంతం వెదుక్కునే జంటల్ని చూచింది. రోజూం తరబడి కలుసుకోటానికి వీలు చిక్కని జంటలున్న కుటుంబాల్ని ఎన్నిటినో చూచింది. ఆ గతి తన పిల్లలకు పట్టకూడదనీ, ఊళ్ళో నలుగుర్లోనూ తన కుటుంబం వెలితి కాకూడదనే ఆమె తాపత్రయమంతా. ఆమె తన పిల్లల పట్ల చాలా బాధ్యతగా వ్యవహరిస్తున్నానని అనుకొంటుందే తప్ప అసహజంగా, యాంత్రికంగా, నిర్బంధంగా భావిస్తున్న సుజాత మనసును గ్రహించలేక పోతుందామె. పెద్దకోడలు, చిన్నకోడలు తన మాట జవదాటరని గర్వపడుతూనే, అప్పుడప్పుడైనా కళ్ళతోనే తన ఉనికినే ప్రశ్నిస్తున్న సుజాతంటే భయముంది ఆమెలో.

గాలి ఉండి ఉండి విసురుగా వీస్తోంది. గాలి వీచినప్పుడల్లా కనకమ్మ తన ఆచ్ఛాదన లేని ఎదను పైట కొంగుతో కప్పుకుంటోంది. దేవాలయం గోడల మధ్య నుంచి వీస్తున్న పున్నాగపూల పరిమళాన్ని గాలి తనతోపాటు దేశమంతా తిప్పుతోంది రాత్రి మత్తుగా ఊగుతుంది.

కనకమ్మ ఆలోచనలో పడింది.

తను కని పెంచి పెద్ద చేసిన కొడుకు కోడలు రాగానే ఆమె మాటే లోకంగా అయేడు. పెళ్ళామే బెల్లమని సామెత నిజం చేసేడు. పిల్లలు పుట్టగానే తమ స్వంత ప్రపంచాల్ని గిరి గీసుకోవాలన్నారు ఇప్పటివాళ్ళు. వాడు పని చేయటం లేదని వీడూ, వీడు కూర్చుని ఖర్చు ఎక్కువ పెడుతున్నాడని వాడూ, వాళ్ళ పిల్లల్ని తమ పిల్లల్ని కొట్టేరని కోడళ్ళు.

ఏ ఇంట్లో చూచినా ఇదే తంతు. తమ కాలంలో ఇవన్నీ ఎరుగుదురా వాళ్ళు. పెద్దవాళ్ళు ఎంత చెబితే అంత. మాట జవదాటేవాళ్ళు కాదు. తను ఎన్ని ఉమ్మడి కుటుంబాల్ని చూడలేదు. అంతెందుకు. తన అత్తమాట తను ఎన్నడైనా జవదాటిందా?

కనకమ్మ గతాన్ని నెమరు వేసుకోవడంలో పడి చుట్ట పీల్చడం మర్చిపోయింది. అది ఎప్పుడో ఆరిపోయింది. "బక్ బక్" మని బలంగా పీల్చింది పొగ రాలేదు. చివర నలిపి చూచింది. ప్రయోజనం లేకపోయింది.

ఆమె కర్ర తీసుకుని మూడో కోడల్ని కూడా తట్టిలేపింది.

'అమ్మాయ్! వసంతా! లేచి నాకు నిప్పెట్టె తెచ్చి ఇయ్యమ్మా' అంది. వసంత లేచి వెళ్ళి ఇంట్లోంచి అగ్గిపెట్టె తెచ్చి ఇచ్చింది.

'వెళ్ళి వాడిని లేపు. ఎప్పుడూ మొద్దు నిద్దరే సన్నాసికి" అగ్గిపుల్ల వెలిగించి చుట్ట కాల్చుకుంటూ అంది కనకమ్మ.

ఆ అమ్మాయి తటపటాయిస్తోంది.

"ఇంకా ఏమి సిగ్గే నీకు పెళ్ళై ఇన్నేళ్ళయినా' అంటూ కర్రను బాగా పొడుగ్గా చాచి టకటకమని మూడో కొడుకు మంచమ్మీద తట్టి

"లేరా ఎదవా! లేచి ఇంట్లోకెళ్ళు" అందామె. వాడు ఒళ్ళు విరుచుకుంటూ లేచి

ఇంట్లోకి నడిచేడు. కనకమ్మ పెద్ద మనవరాలు నిద్రలో అటు తిరిగి పడుకుంది.

కనకమ్మ రాత్రి ఏ జామయిందోనని ఆకాశం చూచింది. చంద్రుడ్ని ఒక్క తెల్ల మేఘం కమ్మి వేసింది. పక్క మంచమ్మీదున్న మనవడు పక్క తడిపినట్టుంది. చిన్న చిన్న బొట్లు టపటప మని కిందకు కారుతున్నాయి.

తెల్లారితే కార్తీక సోమవారం....

ఆ ఇల్లు మూడు ముక్కలవుతుంది చెట్టు అదే, కాయలు వేటికవే కదా! అనుకుందామె. పక్షికూనలు రెక్కలు రాగానే ఎగిరిపోయినట్లు మనుషులూ అంతేనేమో! తనున్నన్నాళ్ళూ కొడుకుల్ని కలిపే ఉంచాలని ఆశ పడింది తను. ఏమైంది? రెండేళ్ళనాడే వేరు కుంపట్లు పెట్టుకున్నారు. ఇప్పుడేమో ఇంటినే పంచేసుకుంటామంటున్నారు. తనకు అపురూపమైన ఇల్లు! తన ముందే చిందర వందరవుతోంది.

చుట్ట ఆఖరు దమ్ములాగి ఊసింది కనకమ్మ. మంచం కింది నీళ్ళ చెంబు అందుకుని పుక్కిలించి ఊసింది. కాసిని నీళ్ళు తాగింది.

కోడలు తాళం చెవి ఇచ్చి వెళ్ళి పడుకుంది.

మంచమ్మీంచి లేచి ఎద్దుల కట్టుమట్లోని తొక్కుడు తీసి బర్రెగొడ్లకేసింది. వామిలోంచి వరిగడ్డి దూసి ఎద్దుల కట్టుమట్లో వేసింది. మళ్ళీ వచ్చి పడుకుంది. నిద్రపట్టటం లేదామెకు. ఆలోచనలు ఎంతకూ తెగటంలేదు.

లేచి కూర్చుంది. మళ్ళీ ఆకాశాన్ని చూచింది.

తొలికోడి కూసింది. ఒకదాని తర్వాత ఒకటి కోళ్ళన్ని కూసేయి. కొద్దికొద్దిగా ఊళ్ళో సంచలనం మొదలైంది.

ఈ రెండు రోజుల ఆలోచనలు ఒక కొలిక్కి వస్తున్నాయి. ఒక నిశ్చయానికొచ్చినట్టు లేచి నిలబడింది.

ఇంటి తలుపు తాళం తీసి బుడ్డి వెలిగించింది. ఇల్లు నాలుగు వైపులా కలియతిరిగింది. గోడల్నీ కిటికీల్నీ తలుపునీ నిట్రాడునీ తడిమి తడిమి చూచింది. బయటికొచ్చి అందరి మంచాల దగ్గరా ఆగుతూ చూస్తూ నడిచింది. గొడ్లను చేరింది. ముసలి ఎద్దు తల నిమిరింది. అది ఘల్లుఘల్లుమని మువ్వల్ని మోగించింది. వేపచెట్టు మొదలు తాకింది. అది గలగలమని ఆకుల్ని రాల్చింది. దేవాలయ ధ్వజ స్తంభానికి దణ్ణం పెట్టుకుంది. చిరుగజ్జెలు మోగేయి.

మళ్ళీ రెండో కొడుకు మంచం దగ్గరకు వెళ్ళింది. "ఒరే అబ్బాయి! ఇంకా ఏం నిద్దరా! లే కోడి కూసింది. అంది వాడు కళ్ళు నులుముకుంటూ లేచేడు. "బేపన పంతులు మళ్ళీ ఎటన్నా వెడతాడేమో! పోయి మంచి మువూర్తం చూచి ఆ వేళకు రమ్మను" అంది వాడు ఆశ్చర్యంగా తల్లిని చూచేడు.

సుజాత దగ్గరకెళ్ళి తట్టిలేపి "ఏందే పన్లన్నీ అట్టనే పెట్టుకుని ఇంకా నిద్దర! పిల్లల్ని స్కూలుకు పంపద్దూ" అంది. 'బడికి సెలవులే' అందామె. "సరె సరె! ఒరే పెద్దోడా! తోపులో కెళ్ళి కాసిని మామిడాకులూ, కొమ్మలూ కొట్టుకురారా!" అప్పుడే లేస్తున్న పెద్దకొడుకుతో అందామె. అందరూ ఆమెను ఆశ్చర్యంగా చూస్తున్నారు ఆ వేకువన.

**ఆహ్వానం, సెప్టెంబరు 1994**

# పిండి బొమ్మలు

## కె. వరలక్ష్మి

సౌగంధిని చూస్తుంటే ఒళ్లు మండిపోతోంది రమణికి. ఎంత మేడమీది పై అంతస్తులో ఉంటే మాత్రం పక్కనున్న పాడుపడిన పెంకుటింటిని అంత నిరసనగా చూడాలా? ఆ చూపు ఇంటినో, తననో అర్థం కాదు. బాగా డబ్బుంది కదాని ఎక్కళ్లేని గీరాను దానికి ఇప్పుడెంత నడమంత్రపు సిరొస్తే మాత్రం చిన్నప్పుడంతా కలిసిమెలిసి తిరగలేదూ, ఆ పకోలేదూ? ఎప్పుడూ తన ముఖం చూసి ఎరగనంత నిర్లిప్తంగా చూస్తోంది

పొద్దున్నే మంచి గంధం దట్టంగా పట్టించిన ఒంటి మీద పల్చటి నైటీ వేసుకుని కారిడార్లో ఉదయపు నీరెండకి పచార్లు చేస్తూ తనని గమనిస్తూ ఉంటుంది తను పళ్లు తోముకోవడం, స్నానానికి బట్టలు దడి మీద వేసుకోవడం, బకెట్టుతో నీళ్లు మోసుకెళ్లడం అన్నీ చిత్రమే కాబోలు దాని చూపుల్లో ఎక్కడో జాలి కదలాడుతున్నట్టు అనుమానం. ఇవాళంటే ఆ షావుకారు వాళ్ళమ్మకింత పెద్ద మేడ కట్టిచ్చాడు గానీ, నాలుగేళ్ల క్రితం వరకూ వాళ్లదీ ఇలాంటి పెంకుటిల్లే కదా!

బొగ్గుతో బరబరా పళ్లు తోమేసి అక్కర్లేనంత గట్టిగా పుక్కిలించి ఉమ్మడం మొదలుపెట్టింది రమణి. ఒట్టలిప్పి పైన వేస్తూ తడక కంతలోంచి సౌగంధిని చూసింది రమణి ఖరీదైన పల్చని గులాబీరంగు నైటీలో నీరెండకి పాలల్లో బంగారాన్ని కరిగించి పోసినట్టు మెరుస్తోంది సౌగంధి ఒళ్లు. కొన్ని క్షణాలపాటు చూపు తిప్పుకోలేకపోయింది రమణి. ఆ చూపుల్ని బలవంతంగా మళ్లించుకుని తన ఒంటివైపు చూసుకుంది ఎముకల మీద అతికించినట్టున్న తన చామనచాయ చర్మం తనకే అసహ్యం పుట్టిస్తోంది చెంపలు లోపలికి పోయిన తన ముఖానికి యాపిల్ పళ్లలాంటి బుగ్గలున్న సౌగంధి ముఖానికి పోలికెక్కడ? ఎక్కడికక్కడ తీర్చిదిద్దినట్టున్న దాని ఆకృతి ఆడదాయి తననే అంత కళ్లు తిప్పుకోనివ్వడం లేదు, ఇంక మొగాళ్లు పడి చస్తున్నారంటే చావరూ! రాత్రికి రాత్రి... ఆ ఎంకట్రావు గాడేవన్నాడూ . తల్చుకుంటే కడుపులో నిప్పెట్టినట్టుంది

ప్లాస్టిక్ మగ్గుతో ముంచి చల్లటి నీళ్లని నెత్తిమీద ధారగా ఒంపుకుంది చల్లారలేదు

సరికదా కళ్లల్లో కాగడా వెలిగించినట్టైంది. "పక్క మేడ మీది సొగంది మెడ్రాసు నించొచ్చిందంట కదా, బలేగున్నాదు బాబూ పంచదార సిలకలాగ. ఆడదంటే అదీ..." పాతిక కేండిలు బల్బు వెలుతురు గోడల మాపుని మింగి మగాడి చేతిలో ఘోరంగా మోసపోయి వెలవెలపోతున్న ఆడదాని ముఖంలా ఉంది. రమణి చివ్వున తలెత్తి చూసింది.

"నువ్వెప్పుడు చూసేవూ?"

"ఉడుక్కోకెహె, అది నిజంగానే నోరూరించే ఆడది. సెర్మం ఒలిచి కంచంలో పెట్టిన బోయిలరు సికెను" అన్నాడు వెంకట్రావు నిర్లక్ష్యంగా సిగరెట్టు వెలిగించుకుంటూ.

రమణి జాకెట్టుకి ఆఖరి హుక్కు పెట్టుకుంటూ భుజం మీంచి వెనక్కి తలతిప్పి "ఆ ఆడది నోరూరించేదే కాదు, ఖరీదైంది కూడా. వారానికి వందా, నూటేభై కన్నా గతిలేనోడికి దాని కాలిగోరుని ముట్టుకునే ఛాన్సు కూడా దొరకదు" అంది కసిగా.

ఇదేం గమనించని వెంకట్రావు గూట్లోంచి పక్కింటి మేడ మీది కిటికీ వైపు తదేకంగా చూస్తూ "మన్లో మనమాట, అసలు దాని రేటెంతుంటాదే..." అన్నాడు.

"అఁ.. అడిగి చెప్తాను" అని రాగం తీసింది రమణి "అయినా కొంచెం ఇంచుమించుగా నీ మెట్టపొలం పదెకరాలూ పదిరోజులకి సరిపోవచ్చేమోలే, ఆ తర్వాత అడుక్కు తింటానికి బొచ్చె ఒకటి అదే కొనిస్తాది"

రమణి మాటల్లోని వ్యంగ్యం అప్పటికెక్కింది వెంకట్రావుకి.

"ఏటే, ఏలాకోలంగా ఉందేటి నోటికొచ్చినట్టు పేల్తున్నావ్" అన్నాడు.

అతని నిస్సహాయతకి కిసుక్కున నవ్వింది రమణి, దగ్గరకెళ్లి జాలిగా అతని రింగుల జుట్టుని చెరిపేస్తూ

"చూడెంకట్రావూ, మీ బాబిచ్చిన పాతికెకరాల మాగాణి పేకాట్లో ఇప్పటికే తగలేసేసేవు. ముందూ వెనకా చూసుకోకుండా పెళ్లాన్ని నలుగురు బిడ్డలకి తల్లిని చేసేవు. ఆవిడ పుట్టింటోరు పసుపు కుంకం కింద ఇచ్చిన నాలుగెకరాల కొబ్బరితోటా లేకపోతే నువ్వా పెళ్లాం బిడ్డలకి అన్నం పెట్టేవోడివేనా? నీ తుమ్మలు మొలిచే పదెకరాల మాటా ఈసారికి మర్చిపో, బిడ్డల పెళ్లిళ్లకైనా అక్కరకొస్తాయి, పిచ్చి పిచ్చి పరుగులెట్టబోకు, పద్దావంటే మూతిపళ్లిరగ్గలవ్" అంది.

పద్దేళ్లై వెంకట్రావుతో పరిచయం ఆమెకి. యవ్వనంలో అడుగు పెడుతున్న మొదటిరోజుల్లోనే ఎవరో మధ్యవర్తి ద్వారా మాట్లాడి తనింట్లో అడుగు పెట్టాడు. కొత్తల్లో సవారీ బండిలో వచ్చేవాడు. నెలకో కొత్త నగకొనేవాడు. రమణి తల్లి బతికే ఉందప్పటికి, కూతురు బతుక్కో స్థిరమైన ఆదరువు దొరికిందని సంబరపడేది. "మా అల్లుడుగారు తెచ్చేరు" అంటూ ఫలహారాలు వీధంతా పంచి వచ్చేది. ఆవాడకట్టులో అది తప్పు కాదు - కొత్తా కాదు.

వ్యసనాల బారిన పడిన వెంకట్రావు క్రమంగా ఆస్తంతా పోగొట్టుకున్నాడు. ఎంతవరకూ నిజమో తెలీదుగానీ అతని పెళ్లాం మాత్రం తన బంగారాన్నీ, పుట్టింటివారిచ్చిన ఆస్థిపాస్తుల్నీ అతనికి అందకుండా జాగ్రత్తపడిందంటారు. రమణి ఒంటిమీది ఒక్కొక్క నగా

ఒల్చుకుపోయాడతను. "ఇదేం తెలివిమాలినతనవే" అంటూ నెత్తీనోరూ బాదుకుంది ముసలమ్మ. ఆ బెంగతోనే ఆవిడ కన్నుమూసింది.

పెళ్లికి నోచుకోకపోయినా బతికినంతకాలం ఒక్కణ్ణే నమ్ముకుని బతుకు వెళ్లమార్చెయ్యాలని రమణి అభిమతం. పదిమంది కాలికింద నలిగిన పువ్వు కావడం ఆమెకిష్టం లేదు.

ఇన్నాళ్ళూ కుక్కిన పేనులా ఉన్న వెంకట్రావులో నీచప్రవృత్తి మళ్లీ ఇలా చిగురులేస్తోంది. దాన్ని మొదట్లోనే తుంచకపోతే లాభంలేదు.

"అవునే రవణా! ఈ మందారత్తకి ఇంతందమైన కూతురెప్పుడు పుట్టుకొచ్చిందే, నువ్వెప్పుడూ ఒకమాటైనా అన్లేదు" అన్నాడు వెంకట్రావు మళ్ళీ.

'ఈడి బుర్రలో పుట్టిందే పురుగు. ఎలాగో చావనీ' అని మనసులోనే దిగాలు పడింది రమణి.

"మందార పిన్నికి ఒక్కత్తే కూతురు, తురకాయనకి పుట్టింది. తురకాయన చచ్చిపోయేక షావుకారుతో ఒప్పందం జరిగినపుడు పిల్లని తనతో ఉంచుకోడానికి ఆయనొప్పుకోలేదంట, అందుకని సొగందాన్ని మెడ్రాసు ఇంగ్లీషు బళ్ళో చేర్పించి వచ్చింది పిన్ని. అయినా నువ్వు చూడకగానీ ఏటేటా సెలవలకి వస్తానే ఉందికదా"

"అహా, మరిప్పుడు సదువై పోయి పూర్తిగా వచ్చేసిందా?"

"చదువెప్పుడో అయిపోయింది. అదేం చిన్న కూచిలాగ కనపడతందేంటి నీ కళ్లకి? దాన్దినాదీ ఒకటే వొయసు తెల్సా, కాకపోతే నీపాలబడి నేనిల్గాగై పోయేను" అంది నిష్టూరంగా రమణి.

"నువ్వెట్టై పోయేవే, నీకేం సక్కని సుక్కలాగున్నావ్" అన్నాడు వెంకట్రావు కిటికీవైపే చూస్తూ. ఏదో వాగాల్సి వాగుతున్నాడు కానీ అతని మనసిక్కడ లేదని గ్రహించింది రమణి. ఆమెనొకలాంటి నిస్పృహ ఆవరించుకుంది హఠాత్తుగా. లోపలెక్కడో ఉంగలు తిరుగుతున్న దుఃఖం బైటికి రావడం లేదు.

ఆమెకి కంటిమీదికి కునుకురాలేదు.

ఒకరాత్రి వేళ ఉలిక్కిపడి లేచి కూచుని "కారొచ్చిందే" అన్నాడు వెంకట్రావు.

ఈడికి పట్టింది మామూలు దెయ్యం కాదు, కామినీ పిశాచం అనుకుని పళ్లు కొరుక్కుంటూ "అది మనింటిక్కాదు, పక్కింటికి" అంది రమణి.

"అదే, ఎవరిదీ అని" అన్నాడు వెంకట్రావు కలలోలాగ.

"ఎవడిదైనా కావచ్చు, నీతీజాతీ లేకుండా డబ్బుని అడ్డంగా సంపాదించేసిన మొగోడెవడిదైనా కావచ్చు. ఆ డబ్బునేం జేసుకోవాలో తెలీక ఊరిమీద పడిన పిచ్చికుక్క గాడెవడిదైనా కావచ్చు. అది స్టారుహొటలు నాయనా, కార్లో వస్తేగాని ప్రవేశం దొరకదు" సందకాడ నుంచి రగులుతున్న నిప్పంతా ఆమె మాటల్లో ఉంది.

వెంకట్రావు ఏమనుకున్నాడో ఏమో అటు తిరిగి పడుకున్నాడు. తెల్లవారుఝామున లేచి వెళ్లేటప్పుడు వెంకట్రావు ముఖంలో ఒకలాంటి తెగింపును చూసింది రమణి "అంతా అయిపోయింది, ఇంక ఈణ్ణి నమ్ముకుంటే లాభంలేదు" అనుకుంది.

"అక్కా.... రవణక్కా... అక్కోయ్" వీధిలోంచే అరుచుకుంటూ వస్తున్నాడు చెక్రంగాడు. 'వీడొకడు, వీడికి ఆడోళ్ల దగ్గిరా సిగ్గులేదు, మొగోళ్ల దగ్గిరా సిగ్గులేదు. అందరికీ అలాగే అనుకుంటాడు సచ్చినోడు" దడిమీది చీరతీసి ఆదరాబాదరా ఒంటికి చుట్టుకుంది రమణి.

"ఎక్కడున్నావ్, తానవాడతన్నావా?" అంటున్నాడు వాడు దడి మీంచి కాళ్లెత్తి చూస్తూ. చెక్రం వయసెంతో ఎవరికీ తెలీదు. యాభైకి అటైనా కావచ్చు, ఇటైనా కావచ్చు. చిన్నోళ్లనైనా పెద్దోళ్లనైనా ఆడోళ్లందర్నీ అక్కా అనీ, మగోళ్లందర్నీ బావా అనీ పిలుస్తాడు. లుంగీని లంగాలా కడతాడు. విటులిచ్చిన పొడుగు చేతుల పాతచొక్కాలు తొడుగుతాడు. కుడి భుజం మీదుగా తిప్పిన ఓణీని ఎడమ నడ్డిమీద ముడిపెడతాడు. ఎప్పుడూ బొంగరంలా ఆ పేటంతా తిరుగుతూనే ఉంటాడు. మందారం ఇంట్లో ఎప్పట్నుంచో నమ్మినబంటువాడు. ఇంట్లో పన్లూ పై పన్లూ అన్నీ చక్కబెడుతూంటాడు.

రమణి చివుక్కున తలతిప్పి మేడమీదికి చూసింది. సౌగంధి అక్కడలేదు. 'బతికేన్రా నాయనా' అనుకుని "ఏంటి చెక్రం, వస్తాపద చీర కట్టుకుని" అంది.

"అయ్యో రాత, నువ్వు చీరే కట్టుకుంటావో రైకే తొడుక్కుంటావో నీ ఇష్టమమ్మా. నాకు మాత్రం టైము లేదు తల్లీ. మందారక్క జన్మాష్టమి పూజ చేస్తంది, అందరికీ బొట్టెట్టి రమ్మని ఇదిగో నన్నిలా అంపింది. బైటికి రా బొట్టెడతాను"

'బొట్టు గడపకి పెట్టెయ్‌రా, నేనొస్తాలే"

"మర్చిపోయేవు గనకమ్మోయ్, రెండు కళ్ళూ చాలవు చూడ్డానికి క్రిష్ణుడికి సావుకారు బావగారు చేయించిన ఎండి తొడుగెలాగ ఉన్నాదా, సౌగందమ్మకేమో సి.ఎ.గారు వడ్డాణం, వరసగొలుసులూ చదివిస్తన్నారు. అయ్యన్నీ ఇవేళ క్రిష్ణుడి అలంకారంలో ఉంటాయి. చూసి తీరాలనుకో" అన్నాడు. వెళ్లడానికి సిద్ధమై వెనక్కి తిరుగుతూ.

"ఛీ, వడ్డాణమేంట్రా పాతఫేషనూ"

"ఛీఛా అనకమ్మోయ్ కళ్లుపోతాయి. బంగారం కాడ పాతేంటి కొత్తేంటి, ఏది బరువుగా అన్తే అదే కొనిపించుకోవాల. ఆడదాని తెలివంతా అక్కడే సూపించుకోవాల, అయినా ఒడ్డాణం పాత ఫేషనేంటి, సినిమాల్లో శ్రీదేవి ఎట్టుకోటంలా"

"ఒరే చెక్రం"

"ఏంటక్కా"

"సి.ఎ. గారంటే ఎవర్రా"

"ఎర్రగా పొడుగ్గా బట్టతలాయన కార్లోవత్తాడు సూళ్లే? ఆయనే సి.ఎ. గారంటే. అదేటో ఆయనగారి పేరే తమాసాగా ఉంటాది నాకు"

"మరి సౌగంధి సినిమాల్లో వేషాలిస్తుందన్నావు కదరా"

"అవును, రెండు సినిమాట్లో సిన్నంగా సిన్నంగా ఇచ్చిందంట, కానీ ఆ లైట్లూ ఆ ఏడీ పడక ఎర్ర....గా కందపిలకలాగై పోయింది. అంతలోకి మందారక్క కల్లోకి క్రిష్ణులవారొచ్చి నీ కూతురు నీతోనే ఉండాల అన్జెప్పేరంట. అంతే, ఇంక మందారక్క ఎనకా ముందూ

సూల్లే. సావుకారు గారి కారేసుకుని మెడ్రాసెళ్లి కూతుర్ని తీసుకొచ్చేదాకా నిద్రపోయిందేంటి" అన్నాడు. హఠాత్తుగా గొంతు తగ్గించి అటూ ఇటూ చూసి "అసలు ఇషయం, సి.ఎ. బావ గారు నిద్రోలేదు సౌగందమ్మొచ్చేదాకా. ఆవిడేషం కట్టిన సినిమా ఈయనగారు చూసేడంట. ఇంకంతే! కుదేలై పోయేడు మొగోడు" కిసుక్కున నవ్వేడు చెక్రం.

"మరి యాపారానికి మంచి ముహూర్తం అదీ చూడకుండా మొదలు పెట్టేసిందేంట్రా మీ సౌగంధి" అంది రమణి చీర కుచ్చిళ్లు సర్దుకుంటూ.

"అయ్యన్నీ మెడ్రాసులోనే అయిపోయినై లేక్కా, అయినా నీతో కబుర్లాడతా కూసుంటే నాక్కుదర్దులే" అని అదే పోక పోయాడు. తడిసిన జుట్టు ఆరబెట్టుకుని, ఉన్నవాటిల్లో కాస్త మంచి చీర కట్టుకుని రమణి పక్కింటికెళ్లేసరికి అక్కడ పూజ ముగియ వచ్చింది. మెట్లెక్కి వరండాలోకెళ్లి వెనక్కి తిరిగి గేటువరకూ చూపు సారించింది రమణి. రంగురంగుల క్రోటన్ మొక్కల మధ్య విరబూసిన ఎర్ర గులాబీలు దృష్టి తిప్పుకోనివ్వడం లేదు. పొద్దున్నే తోటమాలి నీళ్లతో తడిపినట్టున్నాడు. పూలరేకుల్లో చిక్కుకున్న నీటిచుక్కలు రంగు పూసుకున్న అమ్మాయి పెదవుల్లా మెరుస్తున్నాయి. అప్పుడే విచ్చుకుంటున్న పూలు పరువంతో మిసమిసలాడుతూంటే నిన్నటిపూలు సగంసగం రేకులు రాల్చేసి వెలవెలపోతున్నై. నిట్టూరుస్తూ లోపలికి నడిచింది రమణి. అడుగుపెడితే మాసిపోయేటట్టున్న పాలమీగడరంగు నేలమీద నీలిరంగు క్రిష్ణపాదాలు అందంగా తీర్చిదిద్దేరు. ఆ పెద్ద హాల్లోకి అడుగుపెడుతూనే మరో లోకంలో కొచ్చినట్టైంది రమణికి. పైన వేళ్లాడుతున్న షాండ్లియర్సూ, కింద పరిచిన కార్పెట్లూ చాలు ఆ ఇంటి సంపదని అంచనా కట్టడానికి. వాటి విలువెంతో రమణికి ఊహ కందకపోయినా చాలా ఖరీదైనవై ఉంటాయని మాత్రం అనుకుంది.

సీతాకోకచిలకలు ముసిరిన పూలతోటలా ఉందా హాలు. తనో గొంగళిపురుగులా ఉన్నానేమో అనుకుంది రమణి. బెరుకు బెరుకుగా ముందుకు నడిచి కార్పెట్ అంచు మీద కూర్చుంది. పంతులుగారు హారతి వెలిగించేడప్పటికే.

"సౌగీ, రా తల్లీ, దేవుడికి హారతివ్వు" అంటోంది మందారం. మెట్లు దిగి వస్తున్న సౌగంధిని చూసి కన్ను చెదిరిపోయింది రమణికి. పాదాలు కందిపోతాయేమో అన్నంత సుకుమారంగా నడుస్తున్న సౌగంధిని అందరూ అలాగే చూస్తున్నారని గమనించడానికి ఆమె కెంతోసేపు పట్టలేదు.

"ఈ సౌగంధి రోజుకి కేజీ బాదం పప్పువాడుతుందట తెల్సా? అరకేజీ పై పూతకి, అరకేజీ లోపలికి" అంటోంది సంపంగి పక్కనున్న మధురంతో.

"అయ్యబాబోయ్, రోజుకి మూడొందలు దానికే ఖర్చవుతాయీ" అని రాగం తీసింది మధురం.

"ఆ మూల టీవీ పెట్టిన బల్ల ఎంత బావుందో చూడవే" అని మోచేత్తో పొడిచింది సంపంగి. "ఆ పూజా మందిరం, సౌగంధి గదిలో ఉన్న ఓడంత నగిషీల మంచం ఇయ్యన్నీ ఒకడే తయారు చేసేడంట. ఇయ్యన్నీ సౌగంధి పుట్టిన్రోజుకి ఫారెస్టాఫీసరు బహుమతిగా

పంపించేడంట"

"మనకివ్వడేమే ఏ నా... కొడుకూనూ" అది మధురం.

"నీకూ నాకూ సౌగందిలాంటి కూతుళ్లుండొద్దూ!"

"ప్చ్, చేసుకున్నోళ్లకి చేసుకున్నంత" అంది నిస్పృహగా మధురం. మాటల్లో చెవుల్లో దూరుతున్నా రమణి చూపులు మాత్రం సౌగంధిని అతుక్కుపోయేయి. తల్లి అంటుండే మాటలు తలపుకి వచ్చాయి రమణికి. "అందం మన కులానికొక వరం, మనం చేసే పూజలన్నీ అందమైన ఆడపిల్లలు కలగాలనే"

ఏమాటికామాటే చెప్పుకోవాలి. మందారపిన్నికి మొదట్నుంచీ పూజలూ పునస్కారాలూ ఎక్కువే. ఇప్పుడీ క్రిష్ణపూజ ఎలా చేసిందో శ్రావణంలో లక్ష్మి పూజా అలాగే చేస్తుంది. అందుకే దేవుడు ఆవిడ మొర విన్నాడు కాబోలు. ఏ పూజలూ చెయ్యని తన తల్లిని తిట్టుకోబోయి మానేసింది రమణి. 'చచ్చి ఏ లోకానుందో పోనీలే' అనుకుంది.

హారతివ్వడం పూర్తయ్యింది. నిలువెత్తు క్రిష్ణ విగ్రహానికి అలంకరించిన కొత్త వడ్డాణం, వరస గొలుసులూ తీసి కూతురికి అలంకరించి మెటికలు విరుచుకుంది మందారం.

పెద్ద పెద్ద స్టీలుపళ్లాల్లో రవికగుడ్డా, కొబ్బరికాయా, అరటిపళ్లూ, స్వీట్లూ పెట్టి ఘనంగా అందరికీ వాయనాలిచ్చేడు చక్రం. చేతులు జోడించి క్రిష్ణుడికి వయ్యారంగా నమస్కరించింది సౌగంధి. "మొక్కుకోమ్మా మొక్కుకో సి.ఎ.గారు తొరలోనే నీకు మారుతీకారు కొనిపెట్టాలని మొక్కుకో" అంటోంది మందారం.

"సౌ! తొందరగా పైకిరా"

అప్రయత్నంగా పైకి చూసింది రమణి. ఓపెన్‌గా ఉన్న హాల్లోంచి పైకి మెట్లున్నాయి. పైన గదులన్నిటికీ సిల్కు పరదాలు వేళ్లాడుతున్నాయి. మెట్లపైన రెయిలింగు నానుకుని తెల్లని పోత విగ్రహంలాంటి మనిషొకడు నిల్చుని ఉన్నాడు. రబ్బరు బొమ్మకి గాలి నింపినట్లున్నాడు, వాడి పైపులోంచి పొగ ఫేక్టరీ గొట్టంలోంచి లాగ బైటికొస్తోంది. నగ్నంగా ఉన్న వాడి ఛాతీ మీద జెర్రిపోతులాంటి గొలుసొకటి మెరుస్తోంది. వాడు పైపు పట్టుకున్న తీరు అయిదువేళ్ల ఉంగరాలూ కన్పించి తీరాలన్నట్టుంది. వాడు పిలుస్తున్నది సౌగంధినే అయినా వాడి కళ్లు మాత్రం డేగకళ్లలాగా ఆ హాల్లోని ఆడవాళ్లని పరికిస్తున్నాయి.

'పోర్టికోలో ఉన్న పడవలాంటి కారు వీడిదే కాబోలు' అనుకుంది రమణి. 'అంత పెద్దకారున్నవాడికి బొమ్మకారు లాంటి మారుతీ కారొకలెక్క!' అనుకుంది. 'త్వరలోనే ఈ రంగేలీరాణీగారు మారుతీ ఎక్కి ఊరేగుతూ ఉంటుంది కాబోలు' అనుకుంటే అప్రయత్నంగా దుఃఖం తన్నుకొచ్చింది రమణికి. వాయనం అందుకుని పరుగులాంటి నడకతో ఇంట్లోకొచ్చి పడింది. 'పుట్టుకెలాంటిదైతేనేం పూజ మంచిది కావాలగాని' అని తరచుగా చక్రం అంటూండే సామెత గుర్తుకొచ్చింది. మనసులోనే కన్నీళ్ళు తుడుచుకుంది.

'ఛా, అట్టేపోయిన డబ్బుగానీ, దాని కోసం ఆ సీమపందిగాణ్ణి భరించడం ఎంత కష్టం!' అనుకుంది. 'నలుపైనా వెంకట్రావుకేం, రాజాబాబులా ఉంటాడు' అని తనకి తానే చెప్పుకుంది. ఆ రాజాబాబు ఆరోజు పోయిన పోక నెలరోజులైనా కంటబడలేదు. ఇంట్లో

బియ్యం, పప్పులూ అన్నీ నిండుకున్నాయి. ఏమై పోయాడు అంతుపట్టలేదు.

శ్రావణంలో మొదలైన వానలు భాద్రపదం వొచ్చినా తగ్గుముఖం పట్టలేదు. ఎండావానా ఎకసక్కాలాడుకుంటున్న ఓ మధ్యాహ్నం వేళ చెక్రం తీరిగ్గా కబుర్లాడ్డానికొచ్చేడు.

"మీ వెంకట్రావింక నిన్నొదిలేసినట్టే అక్కోయ్" అన్నాడు వస్తూనే.

"నీకేం పొయ్యేకాలంరా చెక్రిగా" అంది రమణి మంచం మీద లేచి కూచుని, విడిపోయిన జుట్టుని ముడిపెట్టుకుంటూ.

"నువ్వట్టా కోప్పడితే నేనేం చెప్పలేనుగానీ, ఈ చెక్రంగాడు ప్రేణం పోయినా అబద్దవాడ్డని నీకు తెల్దా!" అన్నాడు.

"చెప్పేడవరాదూ" అంది ఆవలిస్తూ రమణి.

"నేనూ అక్కడికే వస్తన్నా, ఎంకట్రావు మా సుగందమ్మకి కబురు చేసేడు మారుతీకారు కొనిత్తానని"

గతుక్కుమనిపోయింది రమణి. మాటా పలుకూ లేకుండా నోరెళ్లబెట్టుకుని చూస్తూ ఉండిపోయింది.

"మందారక్క ఊరుకోలేదులే, 'మనిషి జన్మెత్తేక నీతీజాతీ ఉండాల. రమణితో తెగతెంపులు చేసుకోకుండా కుక్కలాగా కక్కుర్తి పడతానంటే కుదర్దు. అయినా మా సి.ఎ. బాబుగారూరుకోడూ' అని తెగేసి చెప్పేసింది"

రమణి ఊపిరి పీల్చుకుంది. "మిగిలున్న తోటా దొడ్డీ అమ్మేసే ఉంటాడు చచ్చినోడు" అనుకుంది.

"టెల్లీపోనేయించుకున్నాక ఇంపోటెంటుగాళ్ల బెడదెక్కువై పోయిందంట" అన్నాడు చెక్రం హఠాత్తుగా సంభాషణని దారి మళ్లిస్తూ.

"ఇంపోటెంటుగాళ్లెవర్రా?"

"ఏవోనక్కా నాకు మాత్రవేం తెల్సు? సుగందక్క నడిగితే "నీకులాటి పోటుగాళ్లే అంది. ఆ ఎదవలకి పనీపాటా ఏదీ ఉండదు. పోను జేసి 'రానా, రానా' అనడగడం, అవతలెవరో ఇంటా ఉంటారుగదా, ఆళ్ల దగ్గిర ఈడో పురుషపుంగవుల్లాగ యాక్షనన్నమాట. ఇదొక పెద్ద తల్నెప్పి పోయిందనుకో" అన్నాడు అక్కడికా తల్నెప్పంతా తనే అనుభవిస్తున్నట్టు.

"పోరా, సొల్లు కబుర్లూ నువ్వూను" అని నవ్వింది రమణి.

"అబద్దవనుకుంటన్నావా, నవ్వుతున్నావూ, ఒట్టమ్మా నీమీదొట్టు" అన్నాడు చెక్రం రమణి నెత్తిన చెయ్యిపెడుతూ. "ఇంతకీ నే చెప్పొచ్చిందేంటంటే నువ్వుగానీ టెల్లీపోనేయించుకున్నావుగనక"

"ఆ, నా బతుక్కింక అదొక్కటే తక్కువైంది"

"నీకేం, నల్లరూపుని సక్కని సుక్కవి. అయినా నువ్వింకా ఎంకట్రావుని నమ్ముకుంటే లాబంలేదు"

రమణి ఒక నిర్ణయానికొచ్చినట్టు దీర్ఘంగా నిట్టూర్చింది. పైటని తీసి స్థిమితంగా మళ్లీ వేసుకుంటూ గోడవైపు తిరిగి వెనకున్న చెక్రంతో అంది "చెక్రం, రిక్షావోళ్ళతో

చెప్పరా, పేసింజర్లొస్తే తీసుకురమ్మని"

★ ★ ★

ఆగని కాలం కాలికి బలపం కట్టుకునే ఉంది.

సౌగంధి శరీరం వేలూ లక్షలూ ఆర్జిస్తున్న వేళ, రమణి ఆకలి కడుపుకి అన్నంకోసం ఒళ్లమ్ముకుంటున్నవేళ - మాఘమాసంలో 'మంచి'రోజొచ్చింది. చక్రం కొత్తబట్టలు కట్టుకుని ఆనందంగా చెప్పడానికొచ్చేడు "మేవందరం మెడ్రాసెల్లిపోతన్నాం, సౌగందక్కని ఈరోయినుగా పెట్టి సి.ఎ. బావగారు సినిమా తీస్తారంట. ఆయనే సాయంగా డైరెట్టరు"

"మరి లైట్లో అవీ పడవని...."

"అదప్పటి మాట" అని కిసుక్కున నవ్వేడు చక్రం.

రెండు నెల్ల తర్వాత సి.ఎ.గారూ, మందారం వచ్చి ఇల్లమ్మి డబ్బు పట్టుకెళ్లేరు. సౌగంధివీ, వాళ్లమ్మవీ నగలన్నీ అమ్మేసేరని చెప్పుకున్నారు.

అక్కడేమైందో ఏంటో రమణికైతే అంతుపట్టలేదుగానీ - కేవలం ఒక సూట్‌కేసుతో రిక్షాలోంచి దిగిన మందారాన్నీ, సౌగంధినీ రమణి ఇంట్లో కూర్చోబెట్టి అద్దె ఇంటిని వెదకడం కోసం బయలుదేరేడు చక్రం.

ఇప్పుడు సౌగంధి గిల్లితే పాలుకారే పసిడిబొమ్మలా లేదు, రక్తం లేక పాలిపోయిన పిండిబొమ్మలా ఉంది.

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 10-6-94

# వాన వెలిసింది

## ఎ.ఎస్. జగన్నాథశర్మ

సన్నగా జల్లు పడుతోంది.

చలిచలిగా ఉంది.

ముసురులా ఉంది.

చీకటి చీకటిగా ఉంది.

గది గుమ్మం దగ్గర ముడుచుక్కూర్చున్నాడు జగన్నాథం. తడిసిన సత్రం వాకిలిని తదేకంగా చూస్తున్నాడు.

కాగితం పడవ కూలిపోయి కన్పించింది. రాత్రి వర్షంలో దానినొదిలి ఉంటారు. వాకిలి అంచులంట ప్రయాణించి, ప్రయాణించి అలసి, అణిగిపోయి ఉంది. ఉబ్బిన గోనెపట్టా, ఎవరిదో జాకెట్టు నేలను కరచుకుని పడున్నాయి. ఏదో దినపత్రిక చివికి చివికి చెదరిపోయి ఉంది.

అన్నిటినీ పరిశీలిస్తున్నాడు జగన్నాథం.

చావిట్లో యాత్రికులు, దైవ దర్శనానికి సిద్ధమై ఉన్నారు. ఎవరో, ఎవర్నో పిలుస్తున్నారు. ఆ ఎవరో వస్తే అంతా తరలిపోయేట్టున్నారు. వేడి వేడి టీ అమ్మకమవుతోంది. కూడా ఇడ్లీ ఉన్నదని కుర్రాడు కేకలేస్తున్నాడు.

రాత్రి వంటలకి, వంటశాల వెచ్చనవుతోంది. వరస తప్పినట్టున్నాయి. పాత్రలు దొర్లిపడి పెద్దగా శబ్దించాయి.

జగన్నాథం చెవులు మూసుకున్నాడు. అప్రయత్నంగా కళ్లు కూడా మూసుకున్నాడు.

కాస్సేపటికి, కళ్లు తెరచి చూశాడు.

దృశ్యాలన్నీ తారుమారయ్యాయి.

చావిట్లో యాత్రికులు లేరు. టీ అమ్మే కుర్రాడు లేడు. వాడి కేకల్లేవు. వాకిటిలో గోనెపట్టాలేదు. జాకెట్టు లేదు. ఉన్నదొక్కటే! చివికిచివికి చెదరిన దినపత్రిక.

దిగ్గున లేచి నిల్చున్నాడు జగన్నాథం. గబగబా గదిలోనికి నడిచాడు. పెట్టె తెరచి

చూశాడు. నాలుగయిదు రోజుల్నాటి దినపత్రిక రెండు మడతల్లో భద్రంగా ఉంది. తీసి, తిరగేశాడు దానిని. అయిదవ పేజీలో, అట్టడుగున, ఫోటోతో బాటు ప్రచురించిన వార్తను చూసి, ఊపిరి పీల్చుకున్నాడు. వచ్చి, మంచమ్మీద వెల్లకిలా వాలాడు.

పేపర్, అతని గుండెల్ని కప్పి ఉందిప్పుడు.

ఆలోచిస్తున్నాడు జగన్నాథం.

ఎక్కడ పుట్టాడు?

ఏదో చిన్ని గ్రామంలో.

ఎలా పెరిగాడు?

అల్లారుముద్దుగా.

చిన్నతనంలోనే తండ్రి పోయాడు. ఆయన పోయిన ఏడాదికి పిల్ల నివ్వజూపాడు మేనమామ. పెళ్ళికోసం టౌన్‌కి తల్లితో తరలివెళ్ళాడు. మళ్ళీ పుట్టిన గడ్డను తొక్కలేదు.

యాభై యేళ్ళు గడిచాయక్కడ. ఆ దీర్ఘకాలంలో తల్లిని పోగొట్టుకున్నాడు. మేనమామతో పోట్లాడి, ఇల్లరికాన్ని కాదన్నాడు. పెళ్లాంతో వేరింటి కాపురం పెట్టాడు. ముగ్గురు పిల్లల్ని కన్నాడు. ముగ్గురూ కొడుకులే!

రైసుమిల్లులో గుమాస్తాగిరి. చాలీచాలని జీతం. అలానే నెట్టుకొచ్చాడు. పెద్దాణ్ణి ఎస్.ఎస్.ఎల్.సి. చదివించాడు. రెండోవాణ్ణి సెవెన్త్‌ఫారం చదివించాడు. మూడోవాడు డిగ్రీ వెలగబెట్టాడు. శక్తి మేరకు ముగ్గుర్నీ చదివించగలిగాడు.

అదృష్టాలు బాగుండి, ఇద్దరూ ప్రభుత్వోద్యోగులయ్యారు.

పెద్దాడు సెక్రటేరియట్‌లో పని చేస్తాడు.

రెండోవాడు ఎల్.ఐ.సి.లో.

ఇద్దరుండేదీ హైదరాబాద్‌లోనే. పిల్లలు, సొంతిళ్లు, చూడచక్కని కాపురాలు వాళ్ళవి.

స్థిరపడంది మూడోవాడే! వాడి గురించే బాధ. వాణ్ని గురించే భయం.

అటు భార్య, ఇటు ఆఖరివాడూ వెళ్ళిపోయి పదేళ్ళయింది. క్యాన్సర్‌తో కట్టుకున్నది కన్నుమూస్తే, నమ్మిన సిద్ధాంతానికి అజ్ఞాతాన్ని కౌగిలించుకుని, కడవాడు కనుమరుగయ్యాడు.

టౌన్‌తో సంబంధం తెగిపోయింది. నగరానికి చేరుకున్నాడు. నగరంలో పక్షానికొకరింట ఉండేట్టుగా, కొడుకులకు వాటాల తండ్రయ్యాడు.

మూణ్నెళ్ళకే మొహం మొత్తేసింది. కోడళ్ళు కోపగించుకున్నారు. సేవలు చేసి పెట్టలేమని చేతులెత్తేశారు.

ఫలితం!?

వృద్ధాప్యానికి కావాల్సింది ఆధ్యాత్మికత అన్నారు. అందుకని, పుణ్యక్షేత్రాన శివసన్నిధిలో, వృద్ధుల వసతి గృహంలో, అన్నసత్రంలో, శేషజీవితాన్ని గడపమన్నారు.

శ్రీశైలం చేరుకున్నాడు.

ఖర్చుల నిమిత్తం, కొడుకులిద్దరూ నెలనెలా చెరోవందా పంపుతామన్నారు. అన్న ప్రకారం రెన్నెళ్ళు పంపారు. తర్వాత!?

చేతులు దులుపుకున్నారు.

తెగతెంపులు చేసుకున్నారు.

ఎవరిష్టం వాళ్ళది. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదన్నారు.

బంధాలు తెగిపోయాయి.

బాధ్యతలు తీరిపోయాయి.

తనెవరికీ అక్కర్లేదు.

తనకి ఎవరూ లేరు.

జగన్నాధం అనాధ.

అరవై య్యేళ్ళు పై బడిన జగన్నాధులందరూ అనాధులే! అన్నానికి, నీడకి నోచనివారు

లేచి కూర్చున్నాడు జగన్నాధం. గుండెంమీది పేపర్ని, వ్రేళ్ళో పెట్టుకుని, దీర్ఘంగా నిశ్వసించాడు.

"లేలే! తొందరగాలే! హాలంతా నిండిపోతోంది. కాస్సేపట్లో బాబాగారి సూక్తిముక్తావళి. రావా" అడిగాడు సుబ్బారావు. గదిలోనికి ప్రవేశించి అడావుడి పడసాగాడు. ఎక్కడికి వెళ్ళాడో, ఎక్కణ్ణుంచి వచ్చాడో! తడిసి ఉన్నాడతను.

ఇద్దరికొక గదిగా సత్రం గదులు కేటాయించడంతో, సుబ్బారావు, జగన్నాధం ఓ గదిలో ఉంటున్నారు.

ప్రభుత్వోద్యోగిగా రిటైరయ్యాడు సుబ్బారావు. పెన్షనొస్తుంది. అది పెట్టుకుని సత్రంలో స్థిరపడ్డాడతను. గత కొన్ని నెలలుగా అవసరానికి అతనే జగన్నాధాన్ని ఆదుకొంటున్నాడు.

"మీ పెద్దాడు అప్పుడు రాకుండా ఇప్పుడొచ్చి ఉంటే బాగుండేది. బాబాగారితో చెప్పుకుంటే అతని కష్టాలు గట్టెక్కేవి" అన్నాడు సుబ్బారావు. బట్టలు మార్చుకుని, వెళ్ళిపోయాడు.

హాలులో భజన ప్రారంభమయింది. భక్తుల గొంతులు బొంగురుగా వినవచ్చాయి.

రెండుపూటలా పాతాళగంగ స్నానాలు, దైవారాధనలు, ప్రముఖుల ప్రవచనాలు, ఆధ్యాత్మిక ప్రసంగాలు రొటీన్ కావడంతో జగన్నాధానికి విసుగ్గా ఉంది. అరవై య్యేళ్ళ తర్వాత జీవితం లేదనుకోవడం, ఉన్నా అది భగవదర్పితం కావాలనుకోవడం అసహజంగా ఉంది.

"శివశివా' అని బతుకుని నెట్టేద్దాం అంటాడు సుబ్బారావు. శివస్మరణలో సకల బాధలూ తొలగుతాయంటాడు. అది నిజం కాదు. ప్రసాదానికి ప్రసాదం, తీర్థానికి తీర్థమల్లే బాధలు బాధలే! భయాలు భయాలే!!

దైవ సాన్నిధ్యంలో మరో ఆలోచన కూడదంటాడు సుబ్బారావు. జ్ఞాపకాలు వద్దంటాడు. అయితే జగన్నాధానికి అన్నీ జ్ఞాపకాలే! అన్నీ గుర్తులే!

గ్రామం గుర్తొస్తుందతనికి. గ్రామంలో బాల్యం గుర్తొస్తుంది. తండ్రి చనిపోవడం గుర్తొస్తుంది. ఇల్లరికం గుర్తొస్తుంది. ఇల్లాలు గుర్తొస్తుంది. వేరింటి కాపురం, వేళ్ళూనుకున్న

జీవనం గుర్తొస్తుంది. వర్షారాత్రి, వాస్తవాలనెరిగి, అయినవాళ్ళని వదలి, ఆశయానికి, అజ్ఞాతంలోనికి వెళ్ళిపోయిన ఆఖరివాడు, ఆ సన్నివేశం గుర్తొస్తుంది.

అప్పుడు కన్నీళ్ళొస్తాయి జగన్నాథానికి. కకావికలమవుతాడతను.

చీకటి చిక్కగా అలుముకుంది. చీకట్లో కూర్చోవడం చికాగ్గా ఉంది జగన్నాథానికి. వెళ్ళి లైట్ వేశాడు. వెలుగులో, అయిదవ పేజీ, అట్టడుగుని చూశాడు మళ్ళీ.

'ఉద్యమనేత సత్యం లొంగుబాటు' శీర్షిక కింద సత్యం పాస్‌పోర్ట్‌సైజు ఫోటో ఉంది.

బుగ్గలు నొక్కుకు పోయాయి. మీసాలు పెంచాడు. జుత్తును ఎగదువ్వాడు. అంతే! పట్టి చూడక్కర్లేదు. పోల్చి పట్టొచ్చు. పెద్దగా మార్పు లేదనుకున్నాడు జగన్నాథం. సత్యం ఫోటోను పదేపదే చూశాడు.

వర్షారాత్రి వీడిపోయిన్నాటికీ, నేటికి కొడుకు సత్యంలో మార్పు లేనట్టే, వ్యవస్థలో కూడా మార్పులేదు.

మరెందుకీ లొంగుబాటు?

ఆరోగ్యం బాగాలేదని అన్నారు. జీర్ణవ్యవస్థ పూర్తిగా క్షీణించిందని చెప్పారు. భరించ లేని కడుపునొప్పితో ఉంగలు చుట్టుకుపోతున్నాడని, సరైన వైద్య సౌకర్యం అందించలేక పోతున్నామని బాధపడ్డారు. టౌన్‌లో ఉంటే తేరుకుంటాడన్నారు. ఆర్నెళ్ళ కిందటి మాటది.

కాదంటే -

సిద్ధాంతాలు చిద్రుపలయ్యాయా? నమ్మకాలు వమ్మయ్యాయా? విలువలు వక్రించాయా? ఏమయింది? ఎందుకీ పలాయనం? ఎవర్ని ఉద్ధరించడానికి?!

జగన్నాథానికి దాహంగా ఉంది.

పేపర్ని మడచి చంకలో ఉంచుకున్నాడు. కూజా దగ్గరిగా నడిచాడు. గ్లాసుతో నీళ్ళు తీసుకుని తాగాడు.

గ్లాసు మీద పెద్దాడి పేరిట ధర్మం అని రాసి ఉంది. చూసి నవ్వుకున్నాడతను. కుడిచేతి బొటనవేలితో ఆ అక్షరాలను రుద్దాడు.

లంచం తీసుకుంటూ పెద్దాడు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడ్డాడు. సస్పెండయ్యాడు. ఆ బాధలో గట్టెక్కాలని, మళ్ళీ ఉద్యోగం రావాలని శ్రీశైల మల్లికార్జుని సందర్శించాడు. అప్పుడే సత్రంలో స్థిరపడిన వారందరికీ స్టీలు గ్లాసులు పంచిపెట్టాడు. తనకీ దానం చేశాడొకటి.

"నీ పిల్లలు ప్రయోజకులోయ్" అంటాడు సుబ్బారావు. గవర్నమెంటు ఉద్యోగుల యిన ఇద్దరి గురించే అతను మాట్లాడేది. మూడోవాడి గురించి అతనికి తెలీదు. చెప్పలేదు కూడా.

నిజానికి ప్రయోజకులెవరు?

సస్పెండయిన పెద్దాడా?

'జీవితబీమా' రెండోవాడా?

మూడోవాడు సత్యమా? ఎవరు?

ఎవరి ప్రయోజనాన్ని తనాశించాలి. ఎవరి ప్రయోజకత్వాన్ని చూసి పొంగిపోవాలి!!

జగన్నాథం పేపర్ని పెట్టెలో ఉంచాడు. మూసేస్తూ కప్పులోపల అంటించి ఉన్న కుటుంబం అంతా కలిసి తీయించుకున్న గ్రూప్ ఫోటోను చూశాడు.

ముగ్గురు పిల్లలూ, భార్య, తను.

చిన్న కుటుంబం చింతల్లేనిదనుకున్నాడు. కాని, చింతలమయమని ఊహించలేక పోయాడు.

అన్నీ చింతలే!

చిన్నవాడి గురించి అన్నీ చింతలే!

వాడి ఆరోగ్యం పాడయిందా? వాడి ఆలోచన పాడయిందా? దేనికైనా చికిత్స అవసరం. చేయూత అత్యవసరం.

ఈ స్థితి దుస్థితి.

ఇది ప్రమాద స్థితి.

ఇందునుంచి వాణ్ని చేదుకోవాలి. అక్కున చేర్చుకుని ఆదుకోవాలి.

బంధాలు తెగిపోలేదు.

బాధ్యతలు తీరిపోలేదు.

అయినవాణ్ని, అవసరమయిన వాణ్ని ఆశ్రయంగానో, ఆయుధంగానో మార్చుకోవాలి.

అనాథను కాదనుకున్నాడు జగన్నాథం. చేతిలోనికి పెట్టె తీసుకున్నాడు.

గదిలోంచి చావిట్లోకి, చావిట్లోంచి వాకిట్లోకి, వాకిల్లోంచి వీధిలోకి, సత్రం నుంచి సమూహంలోకి బయల్దేరాడు.

వాన వెలిసింది.

**ఆంధ్రజ్యోతి వారపత్రిక, 3–6–94**

# చిరునామాలు

**అల్లం రాజయ్య**
క్వార్టర్ నెం. ఇ/43/బి,
ఎం.సి. వర్క్స్ (పి.ఓ.)
మంచిర్యాల్,
అదిలాబాదు – 504 289

**ఎ.ఎం. అయోధ్యారెడ్డి**
ఆంధ్రభూమి దినపత్రిక
ఆటోనగర్
విజయవాడ – 520 008

**పి. అజయ్‌కుమార్**
ఫ్లాట్ నెం. ఎఫ్ 5,
8-4-403/1/2
శ్రీ సాయి అపార్ట్‌మెంట్స్
ప్రేమ్‌నగర్, ఎర్రగడ్డ
సనత్‌నగర్ క్రాస్‌రోడ్స్
హైదరాబాద్

**ఇనుకవల్లి దక్షిణామూర్తి**
అడ్వొకేట్,
10-1-18/25,
శ్యామ్‌నగర్,
మసాబ్‌ట్యాంక్
హైదరాబాదు

**పువ్వాల వరసింహం**
కథావేదిక,
20, ముత్తప్ప బ్లాక్,
5 మైన్, సెకండ్ క్రాస్,
గంగానగర్ ఎక్స్‌టెన్షన్,
బెంగుళూరు – 560 002

**ఉమామహేశ్వరరావు ఆర్.ఎం.**
ఆంధ్రజ్యోతి దినపత్రిక
శెట్టిపల్లి, తిరుపతి – 517 506

**ఎమ్మెస్సార్ మూర్తి**
సి-205, ఎ.జి. కాలనీ,
యూసుఫ్‌గూడా
హైదరాబాద్ – 500 045

**గిడుగు రాజేశ్వరరావు**
6-102, పోచమ్మబాగ్,
సరూర్‌నగర్,
హైదరాబాదు – 500 035

**గంటేడ గౌరునాయుడు**
దళాయిపేట,
కొమరాడ మండలం
విజయనగరం జిల్లా – 532 524

**చాగంటి తులసి**
డిపార్ట్‌మెంట్ ఆఫ్ హిందీ,
ఉమెన్స్ కాలేజీ
బెర్హాంపూర్ – 760 001

**జయ ఎస్.**
మార్గదర్శి మార్కెటింగ్ ప్రై.లి.
ఈనాడు కాంపౌండ్,
సోమాజీగూడ,
హైదరాబాదు – 500 004

**తుమ్మేటి రఘోత్తమ రెడ్డి**
టి 2-572, ఐ.బి. కాలనీ,
గోదావరిఖని – 505 209

**దాదాహయత్**
అడ్వకేటు
20|215 మోడంపల్లివీధి,
ప్రొద్దుటూరు 516 361

**నరేంద్ర మధురాంతకం**
లెక్చరర్, ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్
శ్రీ వెంకటేశ్వరా విశ్వవిద్యాలయం
తిరుపతి - 517 502

**నామిని సుబ్రహ్మణ్యం నాయుడు**
ఆంధ్రజ్యోతి దినపత్రిక
శెట్టిపల్లి, తిరుపతి - 517 506

**పంతుల జోగారావు**
తెలుగు పండిట్,
ప్రభుత్వ జూనియర్ కళాశాల
సాలూరు, విజయనగరం జిల్లా

**పతంజలి కె.ఎన్.వై.**
2-1-563/1,
శంకరమఠం ఎదురువీధి,
నల్లకుంట, హైదరాబాదు - 44

**పమ్మి వీరభద్రరావు**
సి-208, ఏ.జి. కాలనీ,
యూసుఫ్ గూడా,
హైదరాబాదు - 500 045

**ప్రభాకర్ డి.**
10-1-18/6, శ్యామ్‌నగర్,
హైదరాబాదు - 4

**పాలకోడేటి సత్యనారాయణరావు**
సి-270, ఏ.జీ. కాలనీ,
యూసుఫ్‌గూడా
హైదరాబాదు - 500 045

**పాపినేని శివశంకర్**
4-5-29/60,
మూడో వీధి, విద్యానగర్,
గుంటూరు - 522 007

**భమిడి వెంకటేశ్వర్లు**
12-2-828/ఎ/17,
అంబా గార్డెన్స్, మెహిదీ పట్నం
హైదరాబాదు - 500 028

**మహర్షి జి.ఆర్.**
ఆంధ్రజ్యోతి దినపత్రిక
శెట్టిపల్లి, తిరుపతి - 517 506

**మహేంద్ర**
మేనేజర్, ఎస్.వి. గ్రామీణ బ్యాంకు
మొగిలి (వయా), పలమనేరు
చిత్తూరు జిల్లా

**మీనన్ కె.కె.**
'స్మిత', 15, కాకతీయ నగర్,
హైదరాబాదు - 500 008

**రమాదేవి జోష్టి**
ఫండ్స్ : 4,
అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసు,
హైదరాబాదు - 500 004

**వారాల కృష్ణమూర్తి**
సి-169, ఏ.జీ. కాలనీ,
యూసుఫ్‌గూడా,
హైదరాబాదు - 500 045

**వెంకటరమణ చొక్కావు**
6-3-584/4, ఖైరతాబాదు,
జిల్లా పరిషత్ ఆఫీసు దగ్గర,
హైదరాబాదు - 500 004

**వేదగిరి రాంబాబు**
1-8-59/1/7, 5వ ఫ్లోర్,
మహావీర్ మెడికల్ హాలు ఎదురుగా,
పంజాబ్ నేషనల్ బ్యాంకు పక్కన
చిక్కడపల్లి,
హైదరాబాదు - 20

**శంకరమంచి పార్థసారధి**
1-1-336/3,
చిక్కడపల్లి,
హైదరాబాదు - 500 020

**శారదా అశోకవర్ధన్**
ఫ్లాట్ నెం. 702, బ్లాక్ 'ఎ',
అమర్‌చంద్‌శర్మ కాంప్లెక్స్,
సర్దార్ పటేల్ రోడ్,
సికిందరాబాదు - 500 003

**శ్రీధర**
(శ్రీధర వెంకట రాధాకృష్ణమూర్తి)
8-53, గౌతమ్‌నగర్,
పి అండ్ టి కాలనీ,
దిల్‌సుక్‌నగర్
హైదరాబాదు - 500 660

**శ్రీరామమూర్తి పి.వి.బి.**
తెలుగు పండిట్
కంచరి వీధి, పార్వతీపురం
విజయనగరం జిల్లా - 532 502

**శ్రీనివాసరావు రమణముని**
జి.ఎస్.సి. 3,
అకౌంటెంట్ జనరల్ ఆఫీసు
హైదరాబాదు - 500 004

**ఎ.ఎన్. జగన్నాథశర్మ**
ఆంధ్రజ్యోతి దినపత్రిక
రోడ్ నెం. 3, బంజారాహిల్స్,
హైదరాబాదు

**బండి నారాయణస్వామి**
6/651 - ఎ,
మారుతీనగర్,
అనంతపూరం - 515 001

**పి. చంద్రశేఖర ఆజాద్**
ఎ.పి.ఎస్.టి.సి.,
డి.సి.ఎం.ఎస్. బిల్డింగ్స్,
నరసింహారావుపేట,
ఏలూరు - 6

**కె. వరలక్ష్మి**
ప్రిన్సిపాల్,
శ్రీ రవీంద్ర బాలవిహార్,
జగ్గంపేట - 533 435

**కాట్రగడ్డ దయానంద్**
ఎస్.పి.యం.
కలిచేడు,
నెల్లూరు జిల్లా - 524 409

# కృతజ్ఞతలు



★ 'మంచికథ' ప్రాజెక్టు గూర్చి మొదటిసారి ప్రస్తావించినపుడు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన మధురాంతకం రాజారాం గారికి, కాళీపట్నం రామారావుగారికి, శీలా వీర్రాజుగారికి, కె. శివారెడ్డిగారికి సూచనలతో పాటు కొన్ని కథలందించిన వాసిరెడ్డి నవీన్, ఎ.ఎన్. జగన్నాథశర్మ, ఆశారాజుగార్లకూ,

★ కోరినదే తడవుగా కథలు పంపిన కథకులకూ,

★ రంజని – నందివాడ భీమారావు కథల పోటీకి విస్తృత ప్రచారం కలిగించడమేగాక కథలు ప్రచురించిన ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులకు, (ఉదయం వారపత్రిక సంపాదకులకు), పోటీలకు ప్రచారం కలిగించిన ఈనాడు, ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం, దినపత్రిక, ఉదయం, ఆంధ్రప్రభ వారపత్రిక, దినపత్రిక, విశాలాంధ్ర, ప్రజాశక్తి, ఆహ్వానం, రచన తదితర పత్రికా సంపాదకులకూ,

★ ఈ పుస్తక ముద్రణలో కొండంత అండగా నిలిచిన జె.సి. జగన్నాథంగారికి, ఎన్.వి. జగన్నాథదాస్‌గారికి, ఎల్.వి. సుధీర్‌కుమార్‌గారికి, కె. రఘునాథరావు గారికి, ఒ.ఎ.డి. కమర్షియల్, ఎం.ఎ.బి. అధికారులకూ,

★ రంజని కార్యక్రమాలు సాఫీగా సాగడానికి ఆర్థికంగా, హార్దికంగా తోడ్పడిన సంస్థలకూ, మిత్రులకూ

★ ముఖచిత్ర కళాకారుడు శివప్రసాద్‌గారికి

★ లేజర్ గ్రాఫిక్స్ మురళిగారికి

★ **ఇంకా ఎందరో మహానుభావులు.... అందరికీ మా వందనాలు**

చీకోలు సుందరయ్య (అధ్యక్షుడు), వి. రామనాథ్ (ఉపాధ్యక్షుడు), భమిడి వెంకటేశ్వర్లు (కార్యదర్శి), టి.వి. సత్యనారాయణ (సహాయ కార్యదర్శి), ఎ. శ్రీనివాస ఫణీంద్ర (కోశాధికారి).

కార్యవర్గ సభ్యులు : జి. దినేశ్ కుమార్, రమణముని శ్రీనివాసరావు, కె. మీరాబాయి, ఆర్.వి.కె. సాయిగాంధీ, వి. పద్మనాభన్, బి.వి. వరలక్ష్మి, జి. సుబ్రహ్మణ్యం.